ఆది శంకరకృత

# శ్రీకాళికా సహస్రనామావళి

(సవ్యాఖ్య, ఉపాసనావిధి)



రచయిత

ముక్తినూతులపాటి వెంకట సుబ్బారావు

రచనాస్థలము 1206/6, రైల్వే క్వార్టర్స్, అయిగడ్డబావి,
లాలాగూడ పోస్ట్, సికింద్రాబాద్-17

రచనా కాలము 15 8 1998 నుండి 31 10 1998

తిరుమల తిరుపతి దేవస్థానము వారి అముద్రిత గ్రంథముల ఆర్థిక
సహాయము ఎడిట్ 5/823/2000 తేదీ 10.8 2001 ఉత్తర్వులతో
ఆమోదింపబడి ముద్రింపబడుచున్నది కృతజ్ఞతలతో సమర్పణ

కాపీలు 1000 వెల రూ 50/-

ముద్రిత సం 2001

శ్రీకాళికా సహస్రనామస్తోత్రము

# విషయసూచిక



ప్రతులకు
ముక్తినూతులపాటి
వెంకట సుబ్బారావు
1206/6, రైల్వే క్వార్టర్స్,
అలుగడ్డబావి,
లాలాగూడ పోస్టు,
సికింద్రాబాద్-17
మరియు

<u>ఆధార గ్రంథములు.</u>

1 లలితాసహస్రనామవ్యాఖ్య
గా॥ సింగంభొట్ల రామమూర్తి శాస్త్రిగారు
2 లలితాసహస్రనామవ్యాఖ్య
గా॥ రాచకొండ వెంకట కోటేశ్వరరావుగారు
3 లలితా త్రిశతీభాష్యము
సాధన గ్రంథమండలి వారి ప్రచురణ
4 దుర్గా సప్తశతి
దేవీస్తోత్రములు
5 శక్తిలంక వ్యాసములు
కల్యాణ హిందీ మాసపత్రిక
6 శ్రీవిద్యార్ణవ తంత్రము మున్నగునవి



Printed by M V Subba Rao, Author, Motinagar, Hyderabad
Printed at Sri Raghavendra Process, Srinivasanagar East, Hyderabad

# కృతి సమర్పణ పంచకం



సప్తాద్రీ విలసత్ జగన్మనహితా సర్వోన్నతో సంస్థితా
ఆప్తాశ్రిద మనోవిధాన చతురా మాపక్ష సంభూషితా
ప్రాప్తాభూమితలే మనోజ్ఞ కరుణా ప్రాముర్య సంభావితా
సద్యోముక్తి ప్రదా మహాత్మా విభవః సౌందర్య శైలాధిపా

బాలాజీ ఘననామధృత్ తిరుమలా ఫాలస్థ స్వర్గాలయా
లీలా మానుషరూప శ్రీనిలయ పాలా శ్రీనివాసా భిదా
హేలక్రీడక నిత్య భక్తజన సంహ్లాదాప్త సద్బాంధవ
లీలామోక్షపథా చరంత మనసారాంతస్థ విద్యుల్లతా
వందేహం ప్రభు శ్రీనివాసచరణం పాపాపనోద్భాసితం
వందేహం అలివేలుమంగ సహితం వారాసితాతోల్లసం
వందేహం ఘనశేషశైల భసితం వాణీశ దైవం స్తుతం
వందే భూభువనాదిలోక ప్రభవం వ్యాప్తాత్రికాలాంతరం
శ్రీశం వెంకటశైలనాథ మమలం ఇంద్రాది సంస్తుత్యకం
వ్యాసాద్యాది మునీంద్రప్రార్థితపదం త్రాసానలోవారకమ్
వాసం సప్తమాలాచలేంద్ర పరిధిం వాణీరమాభిం సేవితం
శ్రీశాగౌరి మృదూపహాసలసితం విశ్వాలయోద్భాసితమ్
శార్దూలం భవఖండ భూషనలితం శాస్త్ర ప్రభుం పాతనమ్
వార్ధికన్య ఉరోస్థితం సహజా భావా వీచి హర్షోన్నతమ్
ప్రార్థిభక్త జనాభివృంద వలయా ప్రారబ్ధ సంఛేదకమ్
వర్ధంతే సకలాశుభాని సదయా వర్షంత సంశ్రేయసమ్
దాక్షిణ్యం భవ వెంకటేశ మహితం ధన్యా వసిష్ఠాన్వయమ్
దక్షం వెంకట సుబ్బారాయమణుమత్ ధర్మం తదీయం సదా
సంక్షేమం కురు పంచపద్య పఠణేంసాన్నిధ్య సంచాలనం
రక్షో రక్ష జనార్ధనా భవనుతా రాజాధి రాజేశ తం

# పీఠిక

కాళీ మార రమాకాళీ లీనమోక్ష క్షమానళీ
మామోదేత తదేమోమా రక్షతత్వత్వత క్షరః

ఈ మంత్రము నాలుగు పాదములుగా విస్తరించి యున్నది ఒక్కొక్క పాదము వొక్కొక్క లోకము నాల్గవదియైన తురీయపాదము అంతికా లోకమునకు నడిపి ఆమె కరుణాకటాక్షములు, అక్షరమైన రక్షణ, శ్రేయము ప్రసాదముగా పొందగలరు

సహజముగా కాళీ, మహాకాళీ, భద్రకాళీ, శ్మశాన కాళీ యనగనే అంబ యొక్క రౌద్రరూపము అభాసమగును ఆమెను తల్లిగా భావించి తన సర్వస్వము ఆమె నిర్ణయమునకే వదిలి సర్వ సమర్పణ చేయగా, నామె సకలలోకవాసులకు రక్షణ, భద్రత నిడుశక్తిగా గోచరించును తామసి శక్తిగా పేర్కొనినప్పటికినీ, అర్చా విధానమున సావ్యరూపమున గొలుచువారికి మధురమూర్తిగానే, అడిగిన వెంటనే వరముల నొసగుటకు క్షిప్రప్రసాదినిగా యవతరించును అది ఉపాసకుల యొక్క మనోస్థైర్యమును బట్టి ఆధారపడియుండును ఆమెను రౌద్రమూర్తిగా భావించిన రౌద్రమూర్తిగానే గోచరించును భద్రమూర్తిగా భావించిన వారికి కళ్యాణదాయినిగా గోచరించును మహాకాలుని పట్టమహిషిగా మోక్షదాయిని వేరెవరు గలరు? మహాసరస్వతి మారు రూపముగ కొలిచిన వారలకు సకల విద్యలు, కవిత్వశక్తి నొసంగునట్టి దృష్టాంతములు కూడా గలవు క్షుద్రోపాసకుల చేతబడులను త్రిప్పిగొట్టి, తనను నమ్మిన వారికి సకల శ్రేయములనొసగూర్చు భువనపోషి ఆమెయే రణరంగమున భక్తవశంకరియైన కాళి క్రియాశక్తి-క్రీంకారి రాజులకు యుద్ధ విజయము కలిగించుట దేవీభాగవతమందలి మనోరమాసూనుని వృత్తాంతమే తార్కాణము కాశీరాజ పుత్రి శశిరేఖ మున్యాశమవాసియైన మనోరమాసూనుని పెండ్లియాడుట ఆమె లీల

జగత్తుకు చేతనాశక్తియు నామెయే ఆ చేతన లేక పరమశివుడైనను శవాకారము. శక్తితో కూడినప్పుడే జగత్సు సృష్టి, స్థితి, సంహారముల కాస్పదమై అభిన్నాంగముగా వెలగును

> చిన్మాత్రాశ్రయ మాయయా, శక్త్యాకారే ద్విజోత్తమా
> అనుప్రవిష్టాయా సవిన్నిర్వికల్పా, స్వయంప్రభా
> సదాకారా, పరానందా, సంసారచ్ఛేదకారిణీ
> సా శివా పరమాదేవీ శివా భిన్నా శివంకరీ న శివేన వినా శక్తిర్నశక్తి రహిత శివః
> ఉమాశంకరయోరైక్యం య పశ్యతి స పశ్యతి-సూతసంహిత

ఆగమమున-

> పావకస్యోష్ణతే, వేయముష్ణాంశోరినదీధితిః
> చంద్రస్య చంద్రికే వేయం, శివస్య సహజాధ్రువా –శివుని సహజమైన ధ్రువశక్తి

సూత సంహిత-

> "విద్యారూపిణుమమాందేవీం మహాకారుణికోత్తమామ్

"సదాకారా పరానందా-సంసారచ్ఛేద కారిణీ"
"కాలాగ్ని రుద్రః కాలారిః కాళీ కాలాంతకప్రియా" -యని అభిన్నస్వరూపము

శ్వేతాశ్వతరోపనిషత్తు నందు మాయా, మహామాయరూపమును వివరించిరి

యతో వాచానివర్తంతే అప్రాప్య మనసాసహ
భర్గాద్విశ్వస్య భరణాద్విశ్వయోనే రుమాపతేః
తస్యజ్ఞాన మయీశక్తి రవ్యయా గిరిజా శివా॥
తయా సహ మహాదేవః సృజత్యేవ నిహంతిచ
అవక్షతి తయోర్భేదం అజ్ఞానాత్, పరమార్థతః
అభేద శ్శివయోర్బంధో వహ్నిదాహకయోరివ
మాయాసాపరమాశక్తి రవ్యయా గిరిజా శివా
మాయీ విశ్వాధికో రుద్ర స్తం జ్ఞాత్వా సమునిర్భవేత్

విష్ణుపురాణము నందు-

యేత్వా మార్యేతి దుర్గేతి వేదగర్భాంబికే తిచ
భద్రేతి భద్రకాళీతి క్షేమదా భాగ్యదేతిచ
ప్రాతశ్చైవా పరాహ్ణేవ స్తోష్యంతా నమ్రమూర్తయః
తేషాం హిప్రార్థితం సర్వం మత్ప్రసాదాత్ భవిష్యతి
ఇందు వేదగర్భయని పేర్కొనబడినది

పద్మపురాణం

దుర్జేయా శాంభవీ మాయా తదా సమ్మోహ్యతే జగత్
మాయాంతు ప్రకృతింవిద్ధి మాయినంతు మహేశ్వరః

జగదుత్పత్తి స్థితి ప్రళయ క్రమము

"ప్రళయే ప్రాకృతే తస్యాంచరా చరమిదం జగత్
తథా జగత్ప్రతిష్ఠా, దేవస్తే పృథివ్యప్సు ప్రలీయంతే
తేజస్యాపః ప్రలీయంతే తేజో వాయౌ ప్రలీయతే
వాయుః ప్రలీయతే వ్యోమ్ని తద వ్యక్తే ప్రలీయతే
అవ్యక్తం పురుషే బ్రహ్మన్ నిష్కలే సంప్రలీయతే
తచ్ఛక్తి తత్త్వమిథ హిత మవిభాగ ప్రపన్నమస్త్యైవ"

శక్తియందు లీనమౌ క్రమము

అంబయే తన అంశల త్రిమూర్తుల దేవేరులుగా చేయుట

యాచశ్రీ సర్వభూతానాం దదాతి విపులాం శ్రియమ్
పత్నీ నారాయణ స్యేయం వర్తతే మదనుగ్రహాత్
వాచం దదాతి విపులాం యా చ దేవీ సరస్వతీ
సాఽపీశ్వర నియోగేనా పూజితా సంప్రయచ్ఛతి వర్తతః
యాఽశేష పురుషాన్ పాపాన్ నరకాత్తారయిష్యతి
సావిత్రీ సంస్కృతా సాఽపి దేవాజ్ఞాను విధాయినీ
పార్వతీ పరమాదేవీ బ్రహ్మ విద్యా ప్రదాయినీ
యాఽభిధ్యాతా విశేషేణసాఽపి మద్వచనానుగా   ఈశ్వరగీత

## దేవతా వర్గములు

స్కాంధ పురాణమున బ్రహ్మ, వశిష్ఠునికి బోధించిన వివరము
జనయామాస స విశ్వాత్మా హరిరుద్ర పితామహాన్
సుతత్రయం ప్రసూయ్యైవం సాహాయా భగవత్ప్రియా
ఆత్మశక్త్యా ససర్జాథ కన్యాత్రయ మనిందితమ్
కన్యాంతు రుద్రోజగ్రాహ కృష్ణాం సర్వాంగ సుందరీమ్
సాచ విష్ణ్వైక భాగో భగినీ స తతో హరిః
హరిస్తు లోహితాం వవ్రే కన్యాం లక్ష్మీ సమాహ్వయామ్
సాచాహమస్యైక భాగో భగినీ సా తతో మమ
అహమస్యభజం శుక్లాం కన్యాం వీణావినోదినీమ్
సాచరుద్రస్యైక భాగో భాగినీ శంకరస్య సా
మత్తోజజ్ఞే జగత్సర్వం, సాల్యతే హరిణాత్విదమ్
కాలే సంహారకోరుద్రః పశ్చాదైక్యం ధృవం హి నః

పై విషయములే ప్రాధానికం రహస్యం చండీ సప్తశతిలో
(పరబ్రహ్మ) సమిష్టిరూపా (చండికా)







ఉపాసనారూపము

| యుగళ సమిష్టి ఉపాసన | | |
|---|---|---|
| రుద్ర–గౌరి | బ్రహ్మ–సరస్వతి | విష్ణు–లక్ష్మి |
| చతుర్భుజ మహాకాళీ | చతుర్భుజ మహాలక్ష్మి | చతుర్భుజ మహాసరస్వతి |
| దశానన–దశభుజా | అష్టాదశ భుజా | అష్టభుజా |
| కాల సిద్ధమహిష మృత్యు | కాల మృత్యు | కాలరుద్ర–నవశక్తి–మృత్యువినాయక |

# కాళీసహస్రనామ వ్యాఖ్య, వివరణ

కథితోయం మహామంత్రస్సర్వమంత్రోత్తమోత్తమః
యమాసాద్య మయాప్రాప్తమైశ్వర్యపదముత్తమం (1)
సంయుక్తః పరయాభక్త్యా యథోక్తవిధినా భవాం
కురుతామర్చనం దేవ్యా స్త్రైలోక్య విజిగీషయా (2)

పరశురామ ఉవాచ:
ప్రసన్నోయదిమేదేవా పరమేశ పురాతన
రహస్యం పరయాదేవ్యా కృపయా కథయా ప్రభో (3)
యథార్చనం వినాహోమం, వినాన్యాసం వినాబలిం
వినాగంధం వినాపుష్పం, వినానిత్యోదితక్రియా (4)
ప్రాణాయామం వినాధ్యానం, వినాభూత విశోధనం
వినా, జాప్యం వినా, దానం వినా కాళీ ప్రసీదతి (5)
(కాళీకృప -స్మరణ మాత్రమున ప్రసన్నురాలగును.)

శ్రీ శంకర ఉవాచ:
పృష్టం త్వయోత్తమం ప్రాజ్ఞ భృగువంశ వివర్ధన
భక్తానామపి భక్తోఽసి త్వమేవం సాధయిష్యసి (6)
దేవీందానవకోటి ఘ్నీం లీలయా రుధిర ప్రియామ్
సదాస్తోత్ర ప్రియాముగ్రాం కామకౌతుక లాలసామ్ (7)
సర్వదానంద హృదయా వాసవాసక్తమానసాం
మాధ్వీక మత్స్యమాంసాది రాగిణీం రుధిర ప్రియమ్ (8)

ధ్యానం
శ్మశానవాసినిం ప్రేతగణనృత్య మహోత్సవాం
యోగప్రభాం యోగినీం యోగీంద్ర హృదయస్థితామ్ (9)
తాముగ్ర కాళికాం రామ ప్రసాద యితుమర్హసి
తస్యా స్తోత్ర మహాపుణ్యం స్వయంకాళ్యా ప్రకాశితం (10)
తావతత్కథ యిష్యామి శ్రుత్వా వత్సావధారయ
గోపనీయం ప్రయత్నేన పఠనీయం పరాత్పరం (11)
యస్యైక కాలపఠనాత్ సర్వేవిఘ్నా సమాకులా
నశ్యంతి దహనే దీప్తే పతంగా ఇవ సర్వత (12)

వ్యాఖ్య. పరమశివ పదమునందుటకు ముందుగా జీవి శ్మశానవాసులైన భైరవకాళికా దేవి అంతికమునకు చేరవలసియున్నది అచటికి చేరుటకు పాంచభౌతిక ఆవరణకాలాధ్యాదుల తరించవలసి యుండును భక్తిజ్ఞాన యోగాది సాధన మార్గముల యందేదైన గ్రహించి తాదాత్మ్యత చెందవలసి యుండును అచటికి చేరుటకు జీవికి అర్హత యెప్పుడేర్పడును యని విచారించగా శ్మశాన పదము యొక్క వివరణ ఆవశ్యకమై యున్నది ఈ దేహబంధముల వీడి జీవి, దేహ సంవ్యాప్తమై మరణానంతరవమును వాసనాయుతమైన పవమాన వాయువు నుండి సంస్కరింపబడుటకు ఉత్తర క్రియలు నిర్వహింపబడి యున్నవి మానసికముగా దేహి, మోహాదుల జయించి, పరమశివ నివాస స్థానమునందు యేకాగ్రత నందవలసి యుండును వేదపరమైన మార్గమును భూమి, అంతరిక్ష, దివ్యాది పరమ స్థానమున జీవి యుండుటకు నిర్వ్యతపన ఆవశ్యకమైయున్నది ఏ భక్తి,జ్ఞాన, వైరాగ్య రూపమైనను గురుసేవను నియంత్రిత బాటనెన్నుకుని ఈశ్వర జ్ఞానము సంపాదించుటకు నిత్యసత్యవతుడై తపన కొనసాగించగా నట్టి స్థితియే శ్మశాన స్థితి భౌతిక వాసనలు వీడుటయే శ్మశానస్థితి దేవతారూపము శ్రీకాళి భైరవ నివాస స్థానము శ్రీకాళికాదేవి అంతరిక శక్తిగా నుండును

జీవిపుట్టుకకు పూర్వజన్మ సంచిత కర్మఫలముల ప్రభావము, అండోదర స్థితమై గర్భవాసము ఛేదించుకొని తనకు తానుగా వ్యక్తమైనపుడు ప్రపంచ ప్రవేశ సమయమున రోదించుచూ మాయ

ఆవరణ నలుదిక్కులు కమ్ముకొనగా యేకాకిగా నిరావరణ నిమగ్నుడై ప్రవేశించును విధి లిఖిత కాల నిర్ణయము చొప్పున నహంకార పూరితుడై దృష్టప్రపంచము సత్యము, తానే నిత్యమను భ్రాంతిని సముచిత కాలము గడిపి మరియొక రూపమందుటకు దేహమును త్యజించనగును దేహత్యాగ సమయమునను నిరావరణ నగ్నుడై యేకాకిగనే తరలును – ఆది శంకరులు భజగోవిందమను స్తోత్రమున వివరించిరి

పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరేశయనం

ఇహసంసారే బహుదుస్తారే కృపయాపారే పాహి మురారే ॥ భజగోవిందం భజ

అను జనన మరణ విషవలయమున కొట్టుమిట్టాడుచుండునని పెద్దలు వివరించిరి ఊర్ధ్వ క్రియలచే ప్రాణి చంద్రలోక, సూర్యలోక మార్గములు పయనించును చంద్రలోకము పునర్జన్మ వరకు విరామ స్థానము మాత్రమే పై మూడు ఊర్ధ్వ భాగముల (త్రిపాదాత్ ఉర్ధ్వైతి పురుష యను పురుషసూక్తము) ప్రవేశించుటకు సూర్యాభిముఖయానము సూచితమునై యున్నది సూర్యమండలచ్ఛేదన చేయు జీవులు యోగమార్గమున పరమ శివపదము నందు సమర్థులు అటులే క్షాత్ర సాంప్రదాయమున యుద్ధమందు వెనుజూపక వీరమరణ మందిన క్షత్రియులను, వైరాగ్య పదము నంది సర్వము ఈశ్వరార్పణము చేయు మహనీయులు పుడమిపై పునర్జన్మ గలుగకుండ ఊర్ధ్వ లోకములకు నేగ సమర్థులగుదురు మరణానంతరమును దేహముతో నుండు సమాన వాయువును పృథక్కరించుటకే ఊర్ధ్వ క్రియలు నేర్పడినవి అట్టి విజ్ఞానము యెరుక కలిగి యుండి సర్వసంగ పరిత్యాగియై జీవితము గడుపుటయే శ్మశానవాసము

శ్మశానవాసము గల్గినపుడే వీరభద్ర క్షేత్రకాళీ దర్శనము కావున భద్రకాళీ ఉపాసకులకు నిర్మల నిత్య జ్ఞాన ప్రాప్తిగలుగుననుటలో సందేహము లేదు అట్టి నిరావరణ కాళీ రూపము ధ్యానించుటకు మోక్షమందుటకును ఉపచార ఉపాసనా క్రియలలో సహస్రనామ పఠనమొక యంగము అట్టి విశిష్ట పాఠములు కాళీ హృదయము, కాళీ ఉపనిషత్తు కాళీ సూక్తాదులు "దేవీ స్మృతా హరసి భీతిమశేషజంతోః స్వస్థైః స్మృతామతి మతీవ శుభాందదాసి దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా సర్వోపకరణాయ సదార్ద్ర చితా"యని దేవి సప్తశతియందు కేవలము స్మరణ మాత్రమున క్షిప్రప్రసాదిగా తెలిపిరి

ఆది శంకరులు కాళీ సహస్ర నామముల రచించినారని కొందరు వారి జీవిత గ్రంథముల పేర్కొని యుండిరి కొందరు పురాణములందే ఉపాసనా మార్గమున సహస్రనామములు పేర్కొనిరని యందురు అంతయు ఈశ్వరార్పణము అనుకొనుచు ఆమోద యోగ్యమైన ఆదిశంకర కాళీ సహస్ర నామముల వివరణతో పాఠకుల కందజేసిన మరికొంత తద్రూప జ్ఞాన లబ్ధి గలుగునని పరమ శివ ఆజ్ఞా కరుణాను రాగములకు పాత్రులై ముక్తి సోపాన మధిరోహించ గలరను యాశతో మేరయున అల్పబుద్ధిని వ్యాఖ్య చేయసాహసించుచుంటిని ప్రేరణ దర్భాంగ విశ్వవిద్యాలయము వారు ఆంగ్ల వివరణకు ఆచార్య పట్టము నొసంగి యుండిరి దేవి సప్తశతీపల పఠనములకు కారకమైన రాఘవేంద్రస్వామి (నరసరావుపేట బరంపేటలో పరమపదించిరి) వారికి కృతజ్ఞతలతో పాఠక గణములు లోపములున్న యెడల సహృద్భావముతో మన్నించి గుణములు పరాత్పరికి సమర్పణము చేసి మార్గదర్శనము చేయ ప్రార్థించుచుంటిని




శ్రీ మహాకాళి యంత్రము



# కాళీతత్వం

## విషయం

–కళ్యాణ మాసపత్రిక సంక్షిప్త వ్యాసరూపం

దక్షగృహే సముద్భూతా సా సతీ లోక విశ్రుతా
కుపిత్వాదక్షరాజర్షిం సతీ త్యక్త్వా కళేబరమ్ –దక్షయజ్ఞవినాశిని
అనుగృహ్యచ– మేనాయాం జాత తస్యాంతు సాతదా
కాళీ నా మేతి విఖ్యాతా సర్వశాస్త్ర ప్రతిష్టితా –నారద పురాణం

కలన యన గతి, క్షేప, జ్ఞాన, గణన, భోగీకరణ, అలయీకరణ

కావున కాల గతిశక్తి కాళి అధర్వ వేదమున కాల శక్తి జగత్ సృష్టికిని, సూర్యతాపమునకు కారకము దాననే విశ్వధారణ, కాలచక్షువు ద్వారా దూరదర్శన శక్తి గలుగును కాలుడు ప్రజాపతికి అధిష్ఠాత దాని ప్రేరణచే ప్రజాపతి ప్రేరితుడు ఉత్పన్న ప్రతిష్ఠితుడగును కావున కాల, కాళీ, రుద్రులొకటగును కావున శివుడు మహాకాలుడు వాని శక్తి మహాకాళి

2 దుర్గాసప్తశతి యందు "తస్యా వినిర్గతాయాంతు కృష్ణాభూత్ స్యాపి పార్వతీ"

శుంభ నిశుంభులచే పీడితులైన దేవతలు హిమాచల కృతాశ్రయమైన పార్వతిని ప్రార్థించ అంబ ప్రత్యక్షమాయెను ఆమె నుండి "కౌశికి" యను శక్తి వెలువడినది ఆపై పార్వతి కృష్ణవర్ణ శరీరియై కాళియని పిలువబడినది.

3 సప్తశతిలో కాళికాదేవి "చాముండీ దేవియే చండాముండాసురులను యుద్ధరంగమున చూడగానే "కోపేన చాస్యా వదనం మషీవర్ణ మాభూత్" అని కోపమున ముఖము నల్లబడగా కాళీ స్వరూపిణియైనది చండాముండాసురుల సంహరించ "చాముండి" యైనది

4 "భ్రుకుటి కుటిలా తస్యలలాట ఫలకాద్ ధృతం" ఖడ్గ పాశధారిణియైన కాళి ఉద్భవించినది చేతులను కంకాళ పంజరం, గళమున నరముండమాల, వ్యాఘ్ర చర్మపరిధాన శుష్కమాంస శరీరిణి, అతిశయభీషణ, విశాలముఖి, లలజ్జిహ్వ, కోటిరగత రక్త నేత్రములు, దశదిశ వ్యాప్త సింహనాదములు గలిగి అతి భయంకరముగా కనుపట్టురూపము

5 మహాకాల సంహితలో "అచింతనీయ, అమితాకార శక్తిస్వరూప, గుణాతీత నిర్ద్వంద్వా, బోధగమ్య, పరబ్రహ్మ స్వరూపిణిగా" అభివర్ణించబడినది

6 ఆది శంకరులు స్థాపించిన పశ్చిమామ్నాయ పీఠ శక్తి భద్రకాళియే

## మంత్రోద్ధారణ

సగుణ, నిర్గుణ, ఉభయస్వరూప క్ + అ + ల్ + ఈ

వర్ణముల కలయికచే "కాళీ"యైనది

"క"యన బ్రహ్మసృష్టి భాదిమశ్చ క్రోధీశశ్చ స్వరాంతకః

"దక్షిణో" మూలగశ్చక్రీ కామాఖ్యో గణనాయక

"అ" అనంత మధువృత్తం గురుశేషః దీర్ఘోఽనంతో మహత్ తథా

"ల్" విశ్వాత్మా విశ్వాత్మా మంద్రో బలవాన్ మేదుర్గిరిః కలారసః

"ఈ" సూక్ష్మ, సూక్ష్మ సూక్ష్మ శ్యామలీ, విద్యా, చంద్రః పూషా సుగృహ్యకః

అను అర్థములు తంత్రాభిదానమున గలవు కావున కాళి-బ్రహ్మ, అనంత, విశ్వాత్మా సూక్ష్మ

## కాళీ బీజ ఉద్ధారణ.

అ) కాళీ బీజ మంత్రం క్ + ర్ + ఈ + క్

యన కాళీ, రేయన బ్రహ్మ, ఈయన మహామాయానాదః విశ్వమాతా, బిందువు దుఃఖహరము అంతయు కలిసి "క్రీం" అని తంత్రాభిదానము

ఆ) "క్" నుండి విశ్వ ఉత్పత్తి, "ర్" కాలాగ్ని రూప రుద్ర, "ఈ" లోకపాలిని లక్ష్మి రూపమున సృష్టి, స్థితి, సంహార రూపములకు శివశక్తియైన "కాళియే" కారణభూతురాలు,

ఇ) "క" కారము చిత్కళ, "ర" కారయుక్తం సర్వ తేజోమయం, "ఈ" కార యుక్తం అభీష్టదాయిని, బిందు నిష్కళత్వ కైవల్య పదదాయకమని, మోక్షప్రదాయిగా ప్రసిద్ధురాలు

ఈ) తోడల తంత్రమున "క" కారం ధర్మదాయకం, "ర" కారం కామదాయకం, "ఈ" కారం అర్థదాయకం, "మ" కారం అనుస్వారములు మోక్షదాయకము అని చతుర్విధ పురుషార్థ ప్రదాయిని కలియుగమున విశేష ఫలదాయకముగు శక్తి

బ్రహ్మ, విష్ణు, శివ, చంద్ర, సూర్య, వరుణ, కుబేర, అగ్ని, ఇంద్రాది దేవతలును, దూర్వాస, వశిష్ఠ, బృహస్పత్యాది ఋషులును కాళీ ఉపాసకులే (శ్యామారహస్యం) అందు కాళీ మహిమ

"కాళికా జగతాం మాతా శోక దుఃఖ వినాశిని

విశేషతః కలియుగే మహాపాతక హారిణీ

"అల్పాయాః కాళికాయాసై కాలమాతుర్మహాద్యుతే

గుణక్రియానుసారేణ క్రియతే రూపకల్పనా"-అని భావమందు యెంచవలెను

# మూర్తి స్వరూపము

## అష్టవిధ కాళీమూర్తులు



అ) 1 దక్షిణ కాళికా 2) సిద్ధ కాళికా 3) గుహ్య కాళికా
4) శ్రీకాళికా 5) భద్ర కాళీ 6) చాముండా కాళికా
7) శ్మశాన కాళికా 8) మహాకాళీ స్వరూప

మహాకాల సంహితలో దక్షిణ కాళికకు విశేష మహత్యమిడిరి దక్షిణాంగం పురుషస్వరూపా వామాంగం శక్తిస్వరూపా జాగరణమున దక్షిణ పురుషుని వశము చేసుకొని స్వయముగా దక్షిణానంద నిమగ్నయగును ఇరు అంశలు పూర్ణభావమంద కేవలానంద రూపిణి మోక్షపదగా "త్రిలోకజనని"యన దక్షిణ కాళి వెలగును

కాళీ యన కాలుని పత్ని దుర్గా సప్తశతిలో అంబికా లలాట ఫలకము నుండి ఉద్భవించినది అని గలదు ఆద్యా కాళీ ఆమెకు భిన్నము ఆద్యా కాళీ విభూతులు పది వేరువేరు శక్తులుగా దశ మహావిద్యలుగా నుత్పన్నమైనవి వాని వివరములు కాళీ, తార, షోడశీ, భువనేశ్వరీ, భైరవి, ఛిన్నమస్తా, ధూమవతీ, బగళా, మాతంగీ, కమలాత్మికా ఇందు కాళీ ముఖ్యం మరొక సిద్ధాంతం అష్టవిధ కాళికలు

1 చింతామణి కాళీ -క్రీం 2 స్పర్శమయి కాళీ-హుం హుం
3 సంతతి ప్రదాయి కాళీ హౌం క్రీం హ్రీం 4 సిద్ధిదాత్రి కాళి ఓం హ్రీం క్రీం మే స్వాహా
5 దక్షిణ కాళీ 6 కామకలా కాళీ 7 హంసకాళీ
8 గుహ్యకాళీ (కొన్నింట 5వ రూపముగా కాళరాత్రి అని గలదు )

ఇవి కాక 9 భద్రకాళీ, 10 శ్మశానకాళీ 11 మహాకాళీ మూడు ముఖ్యభేదములు
12 నాలుగవదిగా దక్షిణ కాళీ రూపం విశిష్టముగా ఉపాసింపబడుచున్నది

దక్షిణ కాళీ విశేషార్థములు

### నిర్వాయతంత్రం

1 సూర్యపుత్రుడైన యముడు కాళీ నామము విని పారిపోవును కాళీ ఉపాసకులకు నరకముండదు గావున దక్షిణ కాళియైన కాళి దక్షిణకాళీ

2 సర్వధార్మిక కర్మల సమాప్తిని దక్షిణా ఫలము సిద్ధినిడును సర్వకర్మ ఫల సిద్ధిధాత్రిగా, ప్రదాతగా దక్షిణా యని పేరొందెను

3 దేవీ వరము లిడుటలో అత్యంత చతురత, దాక్షిణ్య భావము కలిగినందున దక్షిణా

4 మొదటగా దక్షిణామూర్తి భైరవుడు ఆరాధించి యున్నందున దక్షిణాకాళి యని పేరందెను

5 పురుషుడు దక్షభాగం, శక్తి వామభాగం, వామా దక్షిణ పై విజయము సాధించి మూడు లోకములకు దక్షిణాయైనది

### స్వరూపం

కాళికాద్వివిధా ప్రోక్తా కృష్ణా రక్తా ప్రభేదతః కృష్ణాతు దక్షిణా ప్రోక్తా రక్తాతు సుందరీమతా
ఇయం నారాయణీ కాళీ, తారస్యాత్ శూన్యవాహినీ, సుందరీ రక్తకాళీతత్, భైరవనాదినీ తథా

భగవత్ దక్షిణకాళీ, భద్రకాళీ, గుహ్యకాళీ, శ్మశాన కాళి, మహాకాళీ ఇత్యాదులు

అ) దక్షిణామూర్తి స్వరూప భైరవునికి ఆధారితయైన శక్తి దక్షిణ కాళి విస్తృత వివేచనచే శ్యామా, రక్తాయైన సుందరి శ్యామరూపి కాళికా మంత్రం ఇరువది రెండు అక్షరములు గలది

"క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా"

ఉపాసనా విధానమున-కీలకం యను అధికార నిర్ణయం అభీష్టసిద్ధి ద్వారనిరోధకము ప్రతిబంధకం నిష్ఫల క్రియాశక్తి - "కీల" సప్తశతీమంత్రములు దేవీ మహాత్మ్యముపై మహాదేవ కృత కీలకము గలదు దానిని తొలగించిననే గాని సప్తశతీ పాఠము ఫలప్రదము కాదు సాధనా క్షేత్రమున ప్రగతి, మానసికోన్నతి ప్రాప్తించిన అభీష్టసిద్ధి గలుగును

సమయనిర్ణయం

" కృష్ణాయాంవా చతుర్దశ్యా మష్టమ్యాం వా సమాహితః
దదాతి ప్రతిగృహ్ణాతి నాన్యథైషా ప్రసీదతి"

అయామాస పక్షీయతిథి విశిష్ట పురుషుడు కృష్ణపక్షీయ చతుర్దశి, అష్టమితిథి విశిష్టసాధకుడు· శుక్లపక్షము పురుషోపాసన, కృష్ణపక్షమున తామసియైన స్త్రీ ఉపాసనకు ముఖ్యము పగలు శుక్లపక్షమున, రాత్రి కృష్ణపక్షమున విశేష ఫలదాయకము కృష్ణాష్టమి నుండి చతుర్దశీ వరకు సమాహితావస్థ. సంహార భైరవ మూర్తి కాలుడు "కాలః పచతి భూతాని, కాలః సంహరతి ప్రజాః" కాలశక్తియే కాళి జగదాధారుడైన మహాకాలుని ఆశ్రయశక్తి కాళి కాలముననే సర్వపదార్థోత్పత్తి, సత్తా, వృద్ధి, పరిణామ, అపచయ, నాశములును గలుగుచుండును షడ్భావ భేదములివియే కాలుని రెండవ నామము రుద్రుడు సదాశివుడు సర్వాంతకృ తయము మూర్తి సంహార, కరాళ, విభీషక, శ్మశాన, శవ, శివా, జ్వలంత చితా, నరముండ రుధిరాది భయానక వస్తువిషయములు కాళికా ధ్యానమున గలవు

మహాకాలుడు శవరూపధారణ చేసి, జగద్రక్షకై మహాశక్తి చరణఘట్టన నర్తనము క్రిందపడెను ప్రళయకాలమున పుడమి సంరక్షణకై శవరూపమాయెను

కృష్ణ, కాళీ రూపములను భేదము లేదు శ్రీమహావిష్ణువు నీలమేఘ శ్యాముడు శ్రీమహావిష్ణువు పూర్ణావతారములైన శ్రీరాముడు, శ్రీకృష్ణావతారములును, కలియుగ శ్రీవేంకటేశ్వరులు నీలమేఘచ్ఛాయమేనివారు సహోదరి మహామాయా స్వరూపిణి నీలమేఘ శరీరి అగుచు మహాకాళి మహాభారతమందలి ద్రౌపదిగా తత్తుల్య స్త్రీ రూపములైరి అట్టి మహాకాళి అసురసంహారిణిగా, భక్తపరాధీనగా ననేక నామముల పేర్కొనబడుచున్నది పరమేశ్వరి స్మరణచే భక్తులు తరింతురు గాక

సృష్టికి పూర్వము గాఢాంధకారము గలదు దాని ప్రతీక ఆద్యాకాళీ రాత్రి 12 గంటల సమయం ఘోరతమము మహాకాళి అధిష్ఠించు సమయము క్రమముగా తమము తొలగును అర్ధరాత్రి నుండి సూర్యోదయ పూర్వ సమయము మహాకాళికి సంబంధించినది 12 గంటల నుండి 6 గంటల వరకు సూర్యోదయము. అందు రెండు భాగములు వదిలి నాలుగు గంటల నుండి జనులు నిత్యకృత్యములు, ఉపాసనాదుల నిమగ్నమగుదురు ప్రాతః సంధ్యావందన విధానమున "ఉత్తమాతారకోపేతా మధ్యమాలుప్త తారకా" యని సూర్యోదయ పూర్వకాలముచే విధించిరి దేహశుద్ధియనంతరము ఉపాసన మానసిక శుద్ధి గలిగి నిర్వర్తించవలెను

శ్యామవర్ణ మూర్తులు క్రమముగా కేరళ, కలకత్తా, వింధ్యవాసిని, కామాఖ్య (కామరూప), ఉజ్జయిని, కాశీలలో పై మూర్తుల ఉపాసనాక్రమము గలదు

# ఉపాసనాఖండములో కాళీధ్యానం



## కొన్ని విశేషార్థములు

నివాసం శ్మశానవాసినీ, మృతప్రాయుల శరీరములు దహించుచోటు అనిగాక పంచమహా భూతముల చిత్‌బ్రహ్మయందులయమగు తలము ఆద్యా కాళిచిత్ బ్రహ్మ స్వరూపము అయ స్థానమే శ్మశానం

2 సంసారమునందు కామక్రోధాది రాగాదులు భస్మమగు ముఖ్యస్థానము ఆ హృదయమున కాళి నివసించును రాగద్వేషాది రహిత హృదయరూపి శ్మశానమును, జ్ఞానాగ్ని నిరంతరము ప్రజ్వరిల్లుచుండును

3 ఇవి పన్నియు అపంక్రృత మహాభూతములు, సత్వగుణ బోధకములు, సత్వగుణ రూప ఉపస్థితములు

4 ఆసన–శక్తిపేరు పడినపుడు శివుడు శవరూపమే శివాంగ జీవుడు–శరీరం ప్రాణరూపి శక్తి తొలగ శవము ఉపాసకుడు ప్రాణశక్తిని చిత్ శక్తితో సమాహితము చేయు పాంచభౌతిక శరీరం, ప్రాణరూపి శక్తి తొలగ శవము వలె నిర్జీవమగును ఆద్యా శక్తికి ఆసనమగును (పులితోలు, జింకచర్మముల వాడుటలో అంతరార్థము)

5 శశిశేఖరం–లలాటముపై చంద్రరేఖ చిదానందమయి, అమృతస్వరూపి, పూర్ణచంద్రుని రూపము సాధకునికి అమృతత్వము ప్రసాదించును

6 ముక్తకేశి-కేశవిన్యాసాది వికారరహితయై త్రిగుణాతీతయై వెలుగును

7 త్రినేత్రా మూడు నేత్రములు సూర్య చంద్ర అగ్ని ప్రతీకలు త్రిలోక దర్శకత్వము త్రికాలజ్ఞానతత్వ శక్తులు గలది

8 మహాఘోర ఉచ్చస్వరము గలది విన్నంతనే పాపసమూహములు పలాయనము చిత్తగించును సింహగర్జనచే మృగములు పారిపోవు విధి

9 బాలావతంసా–బాలచంద్రు చంద్రరేఖ ధరించినదని సామాన్య అర్థం చెవులకు, బాలకుల శవములు ధరించినదని కూడా కలదు

10, సృక్కద్వయ గళద్ రక్తధారా రెండు పెదవుల మూలలనుండి కారెడు రక్తధారలు గలది భగవతి శుద్ధ సత్వాత్మిక కాన రాజస తమోగుణముల రక్తధార రూపమున వెలువరించునది ప్రకటిత రదనా వెలికి వచ్చిన దంతములు గలది నాలుకను అణచిపెట్టినది రజస్తమోగుణ యుత రసననుసత్వగుణ దంతములణచినవి

స్మితముఖీ-ముఖముపై చిరునవ్వు వెలయింపజేసిన నిత్యానంద స్వరూపిణి

పీనోన్నత పయోధర భగవతి స్తనములు అత్యున్నతములు పూర్ణములు మూడు లోకములకు స్తన్యపానమిడు సమర్థత గలవి త్రిలోక వాసులైన భక్తులకు అమరత్వ మోక్ష ప్రదానము చేయునట్టివి

# ఆదిశంకరకృత శ్రీకాళికా సహస్రనామస్తోత్రమ్
## పాఠ విశేషములు

అర్చనా విధానమున పంచాంగ పూజ ముఖ్యము ప్రాణప్రతిష్ఠ తర్వాత చేయవలసిన ఉపచారములు స్తుతి, చక్రార్చన, హృదయం, కవచం పఠనం (గీతవాద్యాది నృత్య ప్రదర్శనం) ఉపచార గతులు ఆపై సహస్రనామ పాఠము అంగముగా గలిగియుండును

కాళికా సహస్ర నామములు అన్య శాక్తేయ ఆగమ గ్రంథములు గలవు కాని ఆదిశంకర ప్రోక్త శ్రీకాళికా సహస్రనామము విశేషముగా పరిశీలించతగినది అద్వైత భావ పరిపూర్ణమూర్తియైన ఆదిశంకరులు జంతు, నరబలి హింసాదికృత్యములకు బద్ధ విరోధులు కాళీ ఉపాసన యనగానే హింసారూపము జ్ఞప్తికి వచ్చును అట్లుగాక వీరు శక్త్యుపాసన హేతుబద్ధము చేయుచూ చండీ సప్తశతి ప్రాధాన్యతగా, మహాత్రిపుర సుందరి, శ్రీలలితాది మూర్తులయందు సాత్వికమైన ఉపాసనా విధానము యేవిధముగా ప్రతిపాదించిరో కాననగును

1. రెండు పేరు ప్రతుల చేర్చి పరిశీలనచే కొన్ని నామములు రూపాంతరములుగాను, కొన్ని సంయుక్త సమాస రూపమున గాక వేరు పరచిన నర్థవంతముగుటచే వేరుగా పరిగణించుట వలన మొత్తము 1158 నామరూపములైనవి అందు సుమారు ఏబదియేడు నామములు పునరుక్తి గలవి ఇతర సంఖ్య 1101గా సుమారు వెయ్యిపై నూట ఒకటికి దాదాపుగా లెక్క తేలుచున్నది
2. "స్వయంభూ" పద పూర్వక నామములు యేబది నాలుగు గలవు అష్టోత్తర శతసంఖ్యలో సగము ప్రకృతి సిద్ధమైన అభిన్నాంగ అద్వైత రూపప్రతిపాదకములు (ఏబదినాలుగు స్వయంభువులు + యేబదినాలుగు శక్తి నామములు నూట ఎనిమిది ఏబదినాలుగుగా పూర్ణరూపములైనవి )
3. "రక్త" పద పూర్వకనామములు మొత్తము నలుబది యేడుగా వ్యాప్తములైయున్నవి కాని వొక చోట అందు ముప్పది యారు నామములు, ముప్పదియారు తత్వములకు ప్రతీకగా వెలుగును
4. "శుక్ర" పదారంభము గల నామములు ముప్పది మూడు వరకు గలవు. ముప్పదిమూడు దేవతలకు ప్రతీకగా, జగదుజ్జీవన కర్తలుగా ప్రతిపాదింపబడుట మరియొక విశేషము (మూలప్రకృతి, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, పరమేశ్వరుడు)
5. ఇందు నాడీ పరిజ్ఞానమునకు సంబంధించిన నామములు గలవు సుషుమ్నా, ఇడా, పింగళా, సరస్వతీ, వారుణీ, పూషా, హస్తిజిహ్వా, యశస్విని, అలంబుసా, కుహూ, శంఖినీ, విశ్వోదరా (విశ్వరూపిణి), గాంధారి యను ముఖ్యమైన పదునాలుగు నాడుల సముదాయములు గలవు ఇట్టి నాడీ పరిజ్ఞానము శారీరక శాస్త్రమునకు సంబంధించినవి ప్రజాపతి అధిష్ఠాతయైన "పయస్విని" పరమామృతాపదముగా స్వీకరించిన పదునాలుగు పూర్తియగును దేహమందు మొత్తము డెబ్బదిరెండు వేల నాడీ సముదాయము వ్యాప్తమై యున్నట్లు శాస్త్రము తెలుపుచున్నది
6. అనంగకుసుమాది నామములు-అనంగ, అనంగ కుసుమా, అనంగాంకుశా, అనంగమదనా, అనంగ మాలినీ, అనంగ మేఖలా, అనంగ రూపిణీ, అనంగ రేఖా యని అనంగ స్వరూపిణులైన అష్టదేవి యంశలు అష్టదళ పత్రాసనులై చక్రాధిష్ఠాత్రిగణములుగా శ్రీచక్ర ప్రతిబింబ ఆభాస దర్శనమగును
7. అటులే త్రిఖండా, త్రిగుణాత్మిక, త్రికూటస్థా, త్రిజగదీశ్వరీ, త్రిదివసుందరి, త్రిపురమాలిని, త్రిపుర, త్రిపురేశి, త్రిలోచన, త్రివిక్రమ, త్రైలోక్యజననీ, త్రైలోక్యపావని యను త్రిసంఖ్యా పదములు పండ్రెండు ద్వాదశాదిత్య ప్రతీకలుగా లలితా సహస్రనామములయందును ప్రస్ఫుటమగుచున్నది
8. మహామాయ వైష్ణవీశక్తి ప్రతీక అటులే వైష్ణవ పురాణ ప్రసిద్ధ శక్తినామములు గ్రహింపబడినవి మహామాయగా కృష్ణ, కృష్ణరూపా యనుచు తత్శక్తి ప్రతీకలైన సంబంధులైన యశోద, రాధికా, వైష్ణవి, భువనేశ్వరీ, పాంచాలి, రుక్మిణీ, తులసి, బృందా, సుభద్రా, భద్రా, నారాయణి యను పౌరాణిక నామములు కానవగును
9. మహాచక్రేశ్వరి (28) నామము నుండి శ్రీమహాత్రిపురసుందరీ యను నామము వరకు చక్రసంస్థితగా (875) యైన రూపము నలుబదియేడు నామములందు పరమేశ్వరి వర్ణన విశేషముగా రూపొందియున్నది

10 సాంఖ్యయోగ సంబంధమైన షట్చక్ర వివరణలు, వాని అధిష్ఠాన దేవతలుగా హాకిని, డాకిని, లాకిని, యాకిని, శాకిని, రాకిని, సాకిన్యాదులు ఉదహరించబడినవి ఆపైన సహస్రారాంత పరబ్రహ్మ స్వరూపిణియైన దేవి స్థానము విశేషముగా బిందురూప సంస్థితగా వివరించబడినది

11 అష్టభైరవ రూపములను ప్రతిపాదించబడినవి కాళీ ఉపాసనలో భైరవార్చన ఆవశ్యకము ఆనందభైరవి, బాలభైరవి, వటుభైరవి, శ్మశాన భైరవి, కాలభైరవి, పురభైరవి, మహాభైరవి, పరమానంద భైరవి, సదానంద భైరవి, ఉన్మత్తానందభైరవి, ముక్త్యానంద భైరవి, తరుణభైరవి, జ్ఞానానంద భైరవి, అమృతానందభైరవి యను పదునాలుగు నామములు భైరవశక్తి రూపిణిలు చతుర్దశ దళాకార చక్ర ప్రతీకలుగా సర్వవ్యాప్త భైరవమూర్తులుగా ప్రతిష్ఠితములై విశేష ఫలదాయకములగుచున్నవి

12. సప్తమహాపురి నామములును ఉదహరించబడినవి అయోధ్యా, మధురా,మాయా, కాశీ, కాంచి, అవంతి యను ఆరు, (ద్వారక ఏడవది) మోక్షదాయకమైన పురములు

13 సాధకపదములు గల పదహారు నామములు షోడశ పత్రార్చన ప్రతీకలు (1129-1147)

14 అష్టవిధ దేవీమూర్తులైన బ్రాహ్మీ, కౌమారీ, వారాహీ, వైష్ణవీ, మాహేశ్వరీ, ఇంద్రాణీ, (శివాని), చాముండీ, మహాలక్ష్మి రూపములు దాహృతములైనవి

15 కాళీ ఉపాసనా సంబంధి అక్షరశక్తి రూపములు గూడ ఈ సహస్రనామములయందు గ్రహింపబడినవి కాళీ, కపాలి, కురుకుల్లాది ఏబది శక్తులు, అనుబంధమునందు అక్షరశక్తుల వివరము గలదు

16 సప్తశతీ ఉదాహృత మధుకైటభ నాశిని, చండముండాసుర సంహర్త్రి, రక్తబీజ వినాశిని, శుంభనిశుంభాదిదైత్య దమని, శాకంభరీ, వింధ్యవాసిని, వైష్ణవి, భీమాభ్రామరీ, రక్తదంతికాది నామములు దేవీ భాగవత పురాణ ఉపాఖ్యాన సూచితములు

17 లలితా సహస్రమునందలి 174 (నూట డెబ్బది నాలుగు) సమానార్థకములుగా నిందు చూడనగును. పట్టిక అనుబంధముగా నీయబడినది

18 కుమారీ పూర్వపద అష్టనామములు కుమారీ రూపిణీ ప్రాధాన్యతను తెలుపును కుమారీ ప్రీతిద ప్రియా, పూజకప్రీతా, పూజనరతా, భక్తసుఖిని, రూపధారిణీ, వ్రతచారిణీ, సేవకాలయా, సేవకాసంగా యనునవి బాలాపూజావిధి నుద్ఘాటించుచున్నది చతుర్బాహు మహాలక్ష్మి, దశభుజా, అష్టాదశ భుజామూర్తులుగా పేర్కొనబడిన కాళీరూపము ఆయుధ విన్యాసమును సూచించబడినది ఖడ్గిని, చక్రిణీ, గదిని, పద్మిని, శూలిని, పరిఘాస్త్రా, పాశిని, శార్ఙ్గపాణిని, పినాకధారిణి, వజ్రాణిగా పేర్కొనబడెను

19 సప్తశతీ పంచమాధ్యాయమున పరమేశ్వరీ రూపములైన క్షమా, క్షాంతా, విద్యా, నిద్రా, చేతన, బుద్ధి, ఛాయా, తృష్ణా, జాతి, లజ్జా, శాంతాదులను గ్రహింపబడినవి

20 అటులే దశమహావిద్యాది సాముదాయిక రూపములు మొదలగు ననేక విశేషములు గల శాంకరకృత కాళికా సహస్రనామావళి అనుకంపతో దేవి గ్రహించుగాత

21 శ్మశాన కాళిక, భైరవి, వాసిని, ప్రేతాసన, ప్రేతదేహా, ప్రేతకృత్య పరాయణా, ప్రేతశాయిని, ప్రేతభూమి కృతాలయా, ప్రేతానన యనుకొన్ని పదములు సంహార రూపకాళికా తుల్య విశేష్యములు

22 కాళికా పురాణమున-కామాఖ్య దేవి నరకాసురుని ప్రాగ్జ్యోతిషపురపాలిని ప్రస్తుతం గౌహతి సమీపమున ప్రసిద్ధిగాంచిన దేవీ క్షేత్రము ఈ ప్రాంతమున కామాఖ్య దేవిని అర్చించుటకు వశిష్ఠుడు పంపబడెను ఆ దేవి ఉన్నంతవరకు సుభిక్షపాలన చేసెను ఆపై శక్తి అదృశ్యము గాగా నరకుడు శ్రీకృష్ణునిచే చంపబడెను వశిష్ఠుని శాపముచే కాళికాదేవి వామాచార విధి మాంసరక్తాసవయుత పూజలందుకొనుచున్నది శివగణములు దస్యులను పారద్రోలుచూ వశిష్ఠుని ఆశ్రమమును కూడా ధ్వంసము చేయ వశిష్ఠునిచే శపింపబడిరి ఈ కామాఖ్య పదము సహస్రనామముల ముమ్మారు వచ్చినది

# పూజా విధానమున పంచమకార యోగిక వివరణ

పంచమకారములు పూజా విధానమున ఆవశ్యకము అవి మద్యం, మాంసం, మత్స్యము, ముద్రా, మైథునములుగా పేర్కొనబడినవి శాక్తేయ పూజలోనికి వికృతిరూపము గల్పించి వన్యస్త పూజ సంభోగాదులు ఆచార్యముగా సెంచు ప్రక్రియ గలదు కాని వానికి వేరు నిర్వచనములు ఈ క్రింద చూపిన ప్రమాణికములు గలవు

1 మద్యం: యదుక్తమ్ పరమం బ్రహ్మ నిర్వికారం నిరంజనం
తస్మిన్ ప్రమథన జ్ఞానం తన్మద్యం పరికీర్తితం

శ్లో బ్రహ్మస్థాన సరోజపాత్రలసితా బ్రహ్మాండ తృప్తిప్రదా
యాశుభ్రాంశు కళాసుధ విగళితా, సా పాన యోగ్యాసురా
సాహాలాపిబతా మనర్థఫలదా, శ్రీదివ్యభావాశ్రితా
యాంపీత్వాం మునయః పరార్థ కుశలా నిర్వాణ ముక్తింగతా

1 నిర్వికార నిరంజన పరబ్రహ్మ విషయ యోగమున జనించు ప్రమథనజ్ఞానమే మద్యముగా సెంచవలెను.
2 బ్రహ్మస్థాన సహస్రార పద్మమందు విలసిల్లు సుధ బ్రహ్మాండముక్తిప్రదమైనది స్వచ్ఛమైన శ్వేతామృత పూరిత సుధాపానమయ్యెను. శ్రీదివ్యభావాశ్రితమైన ఆ హాలాహలము ఐహికమున కనర్థకము, నిర్వాణముక్తి పొపానము మునులు దానిని త్రావుదురు

2 మాంసం మ శబ్దాద్రసనా జ్ఞేయా తదంశాన్ రసనాప్రియె
సదాయో భక్షయోద్దేవి స ఏవ మాంససాధకః
మాసనోతిహి యత్కర్మ తన్మాంసం పరికీర్తితమ్
న చ కాయ ప్రతీకంతు యోగిభిర్మాంస ఉచ్యతే

1 మయన జిహ్వాప్రాధాన్యమైన నాలుక, తదంశ వాక్కు, వాక్ సంయమియైన యోగి మాంస సాధకుడు. 2. సమస్త సత్కర్మల పరబ్రహ్మార్పణ చేయుటయే మాంసమందురు కామ్యకర్మలు కూడదు
కామక్రోధ సులోభ మోహ పశుకంచ్ఛిత్వా వివేకాసినా
మాంసం నిర్విషయం పరాత్మ సుఖదం ఖాదంతి తేషాం బుధా
తే విజ్ఞానపరా ధరాతల సురాస్తే పుణ్యవంతో నరా
నాశ్నీయాత్పశుమాంస మాత్మ విమతేర్హింసా పరం సజ్జనః

3 కామక్రోధ లోభ మోహములనెడు పశువులను వివేకమను ఖడ్గమున ఛేదించి నిర్విషయ మనమున పరాత్మ భావమును అనుభవించుచుందురు బుధులైనవారు వారే విజ్ఞానధనులు, భూతలి చరించు సురగణములు, పుణ్యవంతులైన నరులు, పశుమాంసము హింసాయుత కర్మ సంబంధమైనది సజ్జనులైన వారు ఎప్పుడు గ్రహించకూడదు

3 మత్స్యం గంగాయమునయో ర్మధ్యే మత్స్యౌ ద్వౌ చరతః సదా
తౌ మత్స్యౌ భక్షయేత్ యస్తు స భవేత్ మత్స్య సాధకః
మత్స్యమానం సర్వమూలే సుఖదుఃఖ మదఃప్రియె
ఇతి యత్సాత్వికం జ్ఞానం తన్మత్స్యః పరికీర్తితః

1 గంగా యమునలైన ఇడా, పింగళల మధ్య చరించు శ్వాస నిశ్వాసములను మత్స్యముల భక్షించుచు దానయోగి మత్స్యసాధకుడనబడుచుండును 2 సుఖము, దుఃఖముల యందును సమాన విధి చెలంగు సాత్విక జ్ఞానమే మత్స్యభక్షణ యందురు

మీనం: అహంకారో, దంభో మద పిశునతా మత్సరద్విషః
షడేతాన్ మీనాన్ వై విషయ హరజాలేన విధృతాన్
పచనే దా విద్యాగ్నే నియమిత కృతిర్ధీవర కృతిః
సదాఖాదేత్సర్వాన్ జలచరాణాంతు హితమ్

అహంకారం, దంభం, మదము, పిశునత, మత్సరము, ద్వేషము అను ఈ ఆరును మీనములు విషయ కారకములు. వాని జాలమున (వలను) గ్రహించి, విద్యాగ్నిని పచనము చేసి జాలరి కర్మను నియమితవిధి చరించ వలెను అట్టి జ్ఞానార్జన జలచరభక్షణ జీవించియున్న వరకు చేయుచుండవలెను

4 ముద్రా సహస్రారే మహాపద్మే కర్ణికా ముద్రితశ్చరేత్
ఆత్మాత్రైవ దేవేశి కేవలః పారదోపమః
సూర్యకోటి ప్రతీకాశః చంద్రకోటి సుశీతలః
అతీవ కమనీయశ్చ మహాకుండలినీయుతః
సత్సంగేన భవేత్ ముక్తి రసత్సంగేతు బంధనం
అసత్సంగ ముద్రణం యత్తు, తన్ముద్రా పరికీర్తితా

సహస్రారమును మహాపద్మము కర్ణికయందంకిత మనమున చరించవలెను అచట ఆత్మ కేవలము నిర్మలము, పారదోపమం అచట సూర్యకోటి సమతేజము, చంద్రకోటి సుశీతలము, అతి కమనీయమైన మహాకుండలిని శక్తి సమన్వితము అంతర ధ్యానమే ముద్రాసాధన. సత్సంగమున ముక్తి, లేనిచో బంధము, కుత్సిత సంగవర్జనయే ముద్ర. యోనిముద్ర యన మనసు నంతరము చేసి బ్రహ్మైక్యము చేయుట

ఆశాతృష్ణా జుగుప్సా భయ విషాద ఘృణా మాన లజ్జా ప్రకోపా
బ్రహ్మాగ్నా వష్టముద్రా పరసుకృతి జనః పాచ్యమానా సమంతాత్
నిత్యం సంభక్షయేత్తానవహిత మనసా దివ్యభావానురాగీ
యోఽసౌ బ్రహ్మాండ భాండే పశుహతి విముఖో రుద్రతుల్యో మహాత్మా

ఆశ, తృష్ణ, జుగుప్స, భయం, విషాదఘృణా, మానం, లజ్జా, ప్రకోపాదులను యెనిమిది వికారముల బ్రహ్మాగ్నిని పరోపకారులైన యోగిజను పచనము చేయుచు వర్తించుచుందురు. అవహిత మనస్కులై, దివ్యభావానురాగియై వానిని నిత్యము సంభక్షణ చేయువాడు (హరించువాడు) బ్రహ్మాండభాండమున పశుహతి విముఖుడై మహాత్ముడు రుద్రతుల్యుడుగా నెంచబడును పశుపతియు పశుపాలకుడు శివుడు పశురక్షణయే ఫలదాయకం

5 మైథున రేఫస్తు కుంకుమాభాస కుండ మధ్యే వ్యవస్థితః
మకారశ్చ బిందురూపః మహాయోనౌ స్థితః ప్రియే
అకార హంసమారుహ్య, ఏకతాచ యదాభవేత్
తదాజాతో మహానందో బ్రహ్మజ్ఞానం సుదుర్లభః
కులకుండలినీ శక్తిః దేహినీ దేహధారిణీ
తయా శివస్య సంయోగే మైథునం పరికీర్తితమ్

కుండలి మధ్యమున రేఫ కుంకుమాభాసం "మ" కారం బిందురూపం యోని సంస్థితం "అ" కారం అను హంసనెక్కి యేకమగుట (పరబ్రహ్మానుసంధానము) మహానందం కలిగించును అట్టి బ్రహ్మానందం సుదుర్లభం. దేహమందున్న కుండలినీ శక్తిని జాగరితము చేయుట దేహధారణ అట్టి జాగరితమైన కుండలినీ శక్తిని శివ శివాసంయోగమున కూర్చుటయే మైథునము

యా నాడీ సూక్ష్మరూపా, పరమ పద గతా, సేవనీయా సుషుమ్నా
సాకాంతా లింగనార్హా న, మనుజ రమణీ సుందరీ వారయోషిత్
కుర్యాత్ చంద్రార్క యోగే, యుగ పవనగతే, మైథునం నైవయోనౌ
యోగీంద్రో విశ్వవంద్య సుఖమయభవనే తాంపరిష్వజ్య నిత్యమ్

ఇడా, పింగళల మధ్యమున సూక్ష్మరూపి, పరమపదగత, సేవనీయమైన సుషుమ్నా నాడి గలదు దీనినే బ్రహ్మనాడి, రాకా యందురు వీణాదండము నుండి మస్తకము వరకు వ్యాప్తమై యుండు నాడి. అష్టదళ త్రిరూపమైనది అధి దేవత పరమశివుడు ఇడా పింగళలు చంద్రనాడి సూర్యనాడి వీనితోపాటు మొత్తంగా డెబ్బదిరెండువేల నాడులు అందు పదునాలుగు ముఖ్యమైనవిగా పేర్కొందురు పరమేశ్వరీ ప్రాణవాహక రూపములు పరమశివ రూపమైన సుషుమ్నతో నైక్యము చెందుటయే మైథునం కామేశ్వరపర్యంకస్థ కామేశ్వరీ సంయోగ స్థానమైన బిందువు ఆ సుషుమ్నా నాడియందున్న పరమేశ్వరీ రూపము మనసునే ఆలింగనార్హమైనది గాని మనుజ రమణీ పరిష్వంగము కాదు చంద్రార్క సంయోగమునే ఉచ్ఛ్వాస నిశ్వాసయుత యుగపవనగతమై సుషుమ్నయం దైక్యమందుట. అట్టి సుఖమయ భావనమైన బిందు స్థానమున విశ్వవంద్యులైన యోగిజనము ఆ పరమేశ్వరీ పరిష్వంగమున నిత్యానందామృతరసము గ్రోలుచుందురు పంచమకారముల తాత్త్విక చింతన అంతరార్థము గ్రహించి వర్తించవలెను ఇది అద్వైత భావ సాంప్రదాయము

# పారిభాషిక పద వివరణ

## పంచబాణముల వివరణ

### పంచబాణలసత్కరాయవి పంచబాణముల చేత ధరించి యున్నట్లు తెలుపబడినది

స్థూలరూపము, పుష్పమయము, సూక్ష్మరూపము, మంత్రాత్మాను పరాశ్చ వాసనా

| పంచస్థూల పుష్పములు | కమలం | కైరవం | రక్తకల్హారం | ఇందీవరం | సహకారకు |
|---|---|---|---|---|---|
| బాణములు | చంపకా | అశోకా | పున్నాగ | సౌగంధిక | కురువిందములే |
| కాళికాపురాణం బాణములు | హర్షణం | రోచనం | మోహనం | శోషణం | మారణం |
| జ్ఞానార్ణవం బాణములు | క్షోభణం | ద్రావణం | ఆకర్షణం | వశ్యం | ఉన్మాదం |
| తంత్రరాజం బాణములు | మదన | ఉన్మాదన | మోహన | దీపన | శోషణ |
| భూతాత్మకం | శబ్ద | స్పర్శ | రూప | రస | గంధము |
| భూతతన్మాత్ర | ఆకాశ<br>శబ్దతన్మాత్ర | వాయు<br>మృదు ఉష్ణ<br>విశిష్యయం | అగ్ని<br>నీల,పీత,శుక్ల<br>వర్ణాదిజ్ఞానం | జల<br>మధురతా,<br>ఆమ్లతాయుక్త<br>జ్ఞానం | భూమి<br>పరిమళాదుల<br>జ్ఞానం |
| కాదిమతం బాణములు | శబ్ద<br>మదన | స్పర్శ<br>ఉన్మాదన | రూప<br>మోహన | రస<br>దీపన | గంధము<br>శోషణ |
| సంధిస్థానములు | మూలాధార | నాభి | హృదయ | నేత్ర | భ్రూమధ్య |
| ఓంకార రూపము | అ | ఉ | మ | నాద | బిందు |
| పంచబాణపుష్పములు | అరవింద | అశోకం | చూతం | నవమల్లిక | నీలోత్పలం |
| వర్ణములు | శుక్ల | రక్త | పీత | కృష్ణ | హరిత |

## పంచసంఖ్యాత్మక ఉపచారాది వివరణ

| ఉపచారములు | గంధం | పుష్పం | ధూపం | దీపం | నివేదన |
|---|---|---|---|---|---|
| భౌతికతత్త్వం | పృథివి | జలం | తేజస | వాయు | ఆకాశం |
| బీజవినియోగం | లం | వం | రం | యం | హం |
| విష్ణుపురాణోక్తరత్నము | నీలం | ముక్తాఫలం | కౌస్తుభం | వైఢూర్యం | పుష్పరాగం |
| పంచమీ | రుద్ర | మాయాశివః | మాయానశ్య<br>సర్వజ్ఞ | సత్యాదిలక్షణ<br>సాంబ | సదాశివః |
| మంచపంచకం | బ్రహ్మ | విష్ణు | రుద్ర | ఈశ్వర | సదాశివః |
| పంచయజ్ఞములు | అగ్నిహోత్ర | దర్శపూర్ణమాస | చాతుర్మాస్య | పశు | సోమ |
| భూతయజ్ఞములు | దేవయజ్ఞ | బ్రహ్మయజ్ఞ | భూతయజ్ఞ | పితృయజ్ఞ | మనుష్యయజ్ఞము |
| పూజావిధానము | అభిగమనం<br>ఆకాశ<br>హం | ఉపాదానం<br>చంద్ర<br>యం | ఇజ్యా<br>సంవర్త<br>రం | స్వాధ్యాయ<br>మహాకాల<br>లం | యోగము<br>క్షమాంబుధి<br>(వం) |
| యజ్ఞవివరణ | అగ్నిహోత్రం | వేదపఠనం | భూతబలి | పితృతర్పణం | విప్రభోజనాది |

## పంచకాది వివరణ

| పంచకృత్యములు | సృష్టి | స్థితి | లయ | తిరోధాన | అనుగ్రహము |
|---|---|---|---|---|---|

## పంచసింహాసనస్థ దేవతాగణము భైరవమూర్తులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| పూర్వ దిక్ దేవతా | సంపత్ప్రదాభైరవి | చైతన్య భైరవి | సర్వసిద్ధిభైరవి | కామేశ్వరీభైరవి | బాలాభైరవి |
| దక్షిణ దిక్ దేవతా | అఘోరభైరవి | మహాభైరవి | లలితాభైరవి | కామేశీభైరవి | రక్తనేత్రభైరవి |
| పశ్చిమ దిక్ దేవతా | షట్కూటా భైరవి | నిత్యాభైరవి | మృతసంజీవని భైరవి | మృత్యుంజయ భైరవి | వజ్రప్రస్తారిణీ భైరవి |
| ఉత్తరదిక్ దేవతా | భువనేశీ భైరవి | కమలేశీ భైరవి | కాలేశీ భైరవి | డామర భైరవి | కామినీ భైరవి |
| ఊర్ధ్వదిక్ దేవతా | ప్రథమా సుందరీ | ద్వితీయా సుందరీ | తృతీయా సుందరీ | చతుర్థీ సుందరీ | పంచమీ సుందరీ |
| పంచగురుపాదుకా | శివ | చంద్ర | అనల | అర్ధేశ | బిందు రూపము |
| పంచరత్నములు | శ్రీవిద్యా | సిద్ధలక్ష్మి | మాతంగి | భువనేశ్వరి | వారాహి |
| పంచకామదుఘా | శ్రీవిద్యా | అమృతపీఠ | సుధాసు | అమృతేశ్వరి | అన్నపూర్ణ |
| పంచకల్పలతా | శ్రీవిద్యా | త్వరితా | పారిజాతేశ్వరి | త్రికూట | పంచబాణేశి |
| పంచకోశములు | శ్రీవిద్యా | పరంజ్యోతి | పరానిష్కళా | శాంభవి | అజపామాతృక |
| పంచలక్ష్మీయుతం | శ్రీవిద్యా | లక్ష్మి | మహాలక్ష్మి | త్రిశక్తి | సర్వసామ్రాజ్యలక్ష్మి |

(కాళీమంత్రం వేరుగా నుండును)

## నవావరణముల వివరణ (లలితా విధానం)

| సం. పూజ్యదేవతాస్థానం | ఆవరణ | చక్రనామం | చక్రేశ్వరి |
|---|---|---|---|
| 1 బిందు 1 | బిందు | సర్వానందమయచక్రం | శ్రీలలితామహాత్రిపురసుందరీ |
| 2 3 కోణములు | త్రికోణం | సర్వసిద్ధిప్రదచక్రం | త్రిపురాంబ |
| 3 8 | వసు (అష్ట)కోణ | సర్వరోగహర చక్రం | త్రిపురాసిద్ధా |
| 4 10 | అంతర్దశార | సర్వరక్షాకర చక్రం | త్రిపురమాలిని |
| 5. 10 | బహిర్దశార | సర్వార్థసాధక | త్రిపురాశ్రీ |
| 6. 14 | చతుర్దశార | సర్వసౌభాగ్యదాయకచక్రం | త్రిపురవాసినీ |
| 7 8 | అష్టదళ | సర్వసంక్షోభణ చక్రం | త్రిపురసుందరీ |
| 8. 16 | షోడశదళ | సర్వాశాపరిపూరకచక్రం | త్రిపురేశీ |
| 9 28 | భూపురం | త్రైలోక్యమోహన చక్రం | త్రిపుర |

## ఉదాహరణము

బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్రనాగదళ షోడశ పత్రయుక్తమ్
వృత్తత్రయం చ ధరణీ సదన త్రయంచ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః

వృత్తత్రయం అగ్ని, సూర్య చంద్రమండలములకు సంబంధించిన దశ ద్వాదశ, షోడశ కళాయుతము

# కాళీసహస్రనామ, లలితాసహస్రనామముల సాదృశ్య సారూప్య పదములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అచింత్యా | డాకిని | పద్మరాగాంగదద్యోత | భైరవి |
| 2. | అపర్ణా | డామరీ | పరమా | భోగిని |
| 3 | అయోనిజా | తరుణీ | పరమేశాని | మత్తా |
| 4. | అవ్యక్తా | తుష్టి | పంచమీ | మతి |
| 5 | అంబా | తేజస్విని | ప్రకటాకృతి | మధుమతి |
| 6. | ఆత్మవిద్యా | త్రికూటస్థా | ప్రగల్భా | మనస్విని |
| 7 | ఉదారా | త్రికోణస్థా | ప్రచండా | మహతి |
| 8 | ఏకమూర్తి | త్రిఖండా | ప్రజ్ఞా | మహాకాళి |
| 9. | కళా | త్రిగుణాత్మికా | ప్రజాపతీ | మహాత్రిపురసుందరీ |
| 10 | కాత్యాయనీ | త్రిజగదీశ్వరీ | ప్రభా | మహాదేవి |
| 11 | కామదా | త్రిపురమాలినీ | పాపనాశిని | మహాబలీ |
| 12. | కామరూపా | త్రిపురా | పార్వతీ | మహామాయా |
| 13 | కామస్వరూపా | త్రిపురేశీ | పావని | మహారాజ్ఞీ |
| 14. | కాంతా | త్రిలోచనా | పాశిని | మహావిద్యా |
| 15 | కురుకుల్లా | దయా | పురాతని | మ(మా)హేశ్వరి |
| 16 | కులకాంతా | దక్షయజ్ఞవినాశిని | పుష్టి | మహేశీ |
| 17 | కుండలిని | దివ్యా | పూజ్యా | మహేంద్ర |
| 18 | క్రోధరూపా | దుర్గరూపిణీ | పూర్ణా | మాతా |
| 19. | గాయత్రీ | దేవి | ప్రేమా | మాననీయ |
| 20 | గోపిని | దైత్యేంద్రమర్దిని | బలిప్రియా | మాయా |
| 21. | గౌరీ | ధనదా | బహురూపిణీ | మాలిని |
| 22 | చతుర్భుజా | ధరణీ | బాలికా | ముక్తి |
| 23. | చార్వంగీ | ధీరా | బ్రహ్మరూపా | మూలాధారనివాసిని |
| 24 | చితాదేవి | నందిని | బ్రాహ్మణీ | మేధా |
| 25 | జగద్ధాత్రీ | నారాయణీ | బ్రాహ్మీ | యజ్ఞకర్త్రీ |
| 26 | జనని | నిత్యా | భక్తభావితా | యశస్విని |
| 27 | జయా | నిరంజనా | భగవతీ | యోగిని |
| 28 | జాగ్రత్ | నిర్మలా | భద్రా | రక్తవర్ణా |
| 29 | జ్వాలాంశుమాలిని | నిర్గుణా | భయాపహా | రక్తస్థా |

| | | | | |
|---|---|---|---|---|
| 1 | రమా | విప్రచిత్తా | శూలినీ | స్వధా |
| 2 | రసికా | విమలా | శైలతనయా | స్వప్నావతి |
| 3 | రంజితా | విలాసినీ | షట్చక్రభేదనకర్త్రీ | స్వస్థా |
| 4 | రాకినీ | విశ్వరూపిణీ | షడంగయువతి | సావిత్రీ |
| 5 | రాజ్ఞీ | విశాలాక్షి | షడ్గుణా | స్వాహా |
| 6 | రాజరాజేశ్వరీ | వీరా | సత్యా | సిద్ధిదా |
| 7 | రుద్రాణీ | వృద్ధా | సనాతని | సుఖదాయినీ |
| 8. | రుధిరాక్తాంగి | వైష్ణవీ | సరస్వతి | సుషుమ్నా |
| 9. | లాకినీ | శర్వాణీ | సర్వజ్ఞా | స్తుత్యా |
| 10 | వజ్రిణీ | శంకరీ | సర్వతంత్రమయీ | హంసేశ్వరీ |
| 11 | వజ్రేశ్వరీ | శాంతా | సర్వమయి | హాకినీ |
| 12 | వరదా | శివదూతి | సర్వలోకోత్తమా | హృదయా |
| 13. | వసుధా | శ్రీమత్త్రిపురసుందరీ | సర్వవర్ణమయీ | హ్లాదినీ(174) |
| 14. | వాగీశ్వరీ | శుద్ధా | సర్వేశ్వరీ | |
| 15 | విజయా | శుభంకరీ | సహస్రదళపద్మాంతఃస్థా | |

# మాతృకాశక్తిన్యాసము

## కాళీ ఉపాసనావిధిని మాతృకాశక్తుల వివరణ (శ్రీవిద్యార్ణవము)

| సం. | వర్ణం | మాతృక | వర్ణం | మాతృక | వర్ణం | మాతృక | వర్ణం | మాతృక |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అ | కాళీ/కరాళీ | ఔ | ముద్రా | ట | ధూమ్రభైరవి | భ | బ్రహ్మాణీ |
| 2 | ఆ | కపాలినీ | అం | మితా–అష్టమంత్రం | ఠ | భీమభైరవి | మ | వైష్ణవీ |
| 3 | ఇ | కుల్లా | అః | బ్రాహ్మీ | డ | ఉన్మత్తభైరవి | య | వజ్రిణీ(-[illegible]) |
| 4 | ఈ | కురుకుల్లా | క | నారాయణీ | ఢ | వశీకరణభైరవి | ర | శక్తినీ |
| 5 | ఉ | విరోధినీ | ఖ | మహేశీ | ణ | మహావాత్సభైరవి/డాకినీ | ల | దండినీ |
| 6 | ఊ | విప్రచిత్తా | గ | చాముండా | త | ఐంద్రీ | వ | ఖడ్గినీ |
| 7 | ఋ | ఉగ్రా | ఘ | కౌమారీ | థ | ఆగ్నేయీ | శ | పాశినీ |
| 8 | ౠ | ఉగ్రప్రభా | ఙ | అపరాజితా | ద | యామ్యా | ష | అంకుశినీ |
| 9 | | దీప్తా | చ | వారాహీ | ధ | రాక్షసీ | స | గదినీ |
| 10 | | నీలా | ఛ | నారసింహ(అష్ట)భైరవి | న | వారుణీ | హ | శూలినీ |
| 11 | ఏ | ఘనా | జ | మహాభైరవి | ప | వాయవీ | ళ | మాలినీ |
| 12 | ఐ | బలాకా | ఝ | అసితాంగభైరవి | ఫ | కౌబేరీ | క్ష | వజ్రిణీ |
| 13 | ఓ | మాత్రా | ఞ | సింహభైరవి | బ | ఈశానీ | | (50) |

(16 లో తగ్గిన రెండు వర్ణములు)

# స్తోత్రపాఠములనంతరము నామకీర్తన రూపము

అంబస్తుతిలో బహుళనామోచ్చారణ గూఢయుక్త అంగము కొందరు క్లుప్త పూజా నిర్వహణకై ద్వాదశ, షోడశ, నక్షత్ర, ఏకవింశతి, అష్టోత్తరశత నామస్తోత్రము, అక్షరనామ కీర్తనము అకారాది క్షకారాంతము, సహస్ర నామకీర్తనము అను రూపములలో 12, 16, 27, 108, 56, 1000పై సంఖ్యల నామములు పేర్కొనుచూ, పూవులు, అక్షతలతో పూజగావింతురు అందును విశేషముగా కొన్ని సహస్రములు గణపతి గకారయుక్త నామములు కాళికకు క కారయుక్త సహస్రము రూపమున గలవు అన్ని నామములు ఆయా అక్షరములతోడనే ప్రారంభమగును ఇచట అష్టోత్తర కకారాది ఉదాహరణగా ఈయబడినది

శతనామం ప్రవక్ష్యామి కాళికా యా వరాననే
య ప్యపఠనాద్వాగ్మీ, సర్వత్ర విజయీభవేత్

| | | | |
|---|---|---|---|
| కాళీ | కులకాంతా | కృష్ణదేహా(వ) | కులస్త్రీ |
| కపాలినీ | కరాళాస్యా | కాళిందీ | కీర్తికా |
| కాంతా | కామార్తా(వ) | కులపూజితా | కృత్యా |
| కామదా | కళావతీ | కాశ్యపీ | కీర్తి (వ) |
| కామసుందరీ | కృశోదరీ(వ) | కృష్ణమాతా(వ) | కులపాలికా |
| కాళరాత్రి | కామాఖ్యా | కులిశాంగీ | కామదేవకలా |
| కాళికా(వ) | కౌమారీ | కలా (కథా) | కల్పలతా |
| కాలభైరవపూజితా | కులపాలినీ | క్రీంరూపా | కామాంగవర్ధినీ |
| కురుకుల్లా | కులజా | కులగమ్యా(వ) | కుంతా(వ) |
| కామినీ(వ) | కులకన్యా(వ) | కమలా | కుముదప్రీతా |
| కమనీయస్వభావినీ | కలహా | కృష్ణపూజితా | కదంబకుసుమోత్సుకా |
| కులీనా | కులపూజితా | కృశాంగీ | కాదంబినీ |
| కులకర్త్రీ(వ) | కామేశ్వరీ | కిన్నరీ | కమలినీ |
| కులవర్త్మప్రకాశినీ | కామకాంతా | కర్త్రీ | కృష్ణానందప్రదాయినీ |
| కస్తూరీరసనీలా(వ) | కుంజరేశ్వరగామినీ | కలకంఠీ(వ) | కుమారీపూజనరతా |
| కామ్యా | కామదాత్రీ | కార్తికీ | కుమారీగణశోభితా |
| కామస్వరూపిణీ | కామహర్త్రీ | కంబు(క)కంఠీ | కుమారీరంజనరతా |
| కకారవర్ణనిలయా | కృష్ణా(వైవ) | కౌలినీ(వ) | కుమారీ వ్రతధారిణీ |
| కామధేను | కపర్దినీ | కుముదా | కంకాళీ |
| కరాళికా | కుముదా | కామజీవినీ | కమనీయా(వ) |

(పై నామములన్నియు కవర్గ గుణింతాక్షరములతో ప్రారంభమగుట గమనించవలెను)

| | | | |
|---|---|---|---|
| కామశాస్త్ర విశారద | కాత్యాయినీ | క్రీడా | కటాక్షా(వ) |
| కపాలఖట్వాంగధరా | కార్యకరీ | కుత్సితా | కావ్యా |
| కాలభైరవరూపిణీ | కావ్యశాస్త్రప్రమోదినీ | కలహప్రియా | కోకనదప్రియా |
| కోటరీ | కామాకర్షణరూపిణీ(వ) | కుండగోళోద్భవప్రాణా | కాంతారవాసినీ |
| కోటరాక్షీ(వ) | కామపీఠనివాసినీ | కౌశికీ | కాంతిః |
| కాశీ | కంకిణీ | కీర్తివర్ధినీ | కఠినా |
| కైలాసవాసినీ | కాకినీ | కుంభస్తనీ | కృష్ణవల్లభా(108) |

ఇతితే కదితం దేవిగుహ్యాత్ గుహ్యతరం పరం
ప్రపఠేద్య ఇదం నిత్యం కాళీనామ శతాష్టకం
త్రిషులోకేషు దేవేశి తస్యాః సాధ్యన్నవిద్యతే
ప్రాతః కాలేచ మధ్యాహ్నే సాయాహ్నే సదానిశి
యఃపఠేత్ పరయా భక్త్యా కాళీ నామ శతాష్టకం
కాళికాతస్య గేహే చ సంస్థాం కురుతే సదా
శూన్యాగారే శ్మశానే వా ప్రాంతరే జలమధ్యతః (ప్రాంతరే)
వహ్ని మధ్యేవ సంగ్రామే తథా ప్రాణస్య సంశయే
శతాష్టకం జపన్ మంత్రీ లభతే క్షేమముత్తమమ్
పై నామములన్నియు సహస్రనామ మందలి స్పష్టమైన రూపములే

అంబరూపం:

సా శివా కరుణామూర్తిర్ధగన్మాతా త్రయీమయీ
శివా భిన్న పరానందా శంకరస్యాపి శంకరీ
స్వేచ్ఛయా హిమవత్పుత్రీ స్వభక్తజనవత్సలా
విద్యా రూపముమాందేవిం తుష్టావ పరమేశ్వరీం (బ్రహ్మగీత–ఇంద్రస్తోత్రం)

బ్రహ్మాండపురాణములో

ఆద్యాశక్తి ర్మహేశస్య చతుర్థాభిన్న విగ్రహా
భోగే భవానీ రూపా సా దుర్గా రూపాచ సంగరే
కోపేచ కాళికా వేషా పుంరూపే చ మహాత్మికా (వీరభద్రునికి విష్ణువు రూపేయని విష్ణువు చెప్పినది)

మంగళదాయనీ

హైమవత్యా విశాలాక్ష్యా కటాక్షై రమృతోపమైః
శీతలీకృత మీశస్య కంఠభూషామ్ భవద్విషమ్
కాలకూట మిదంపశ్య కంఠభూషణ మీ శితః
సురాంగనానాం సర్వాసాం కంఠ మంగళదాయకరీః

# భక్తిరూపములు

భాగవతమందు నవధాభక్తి రూపములు వివరించబడినవి అవి క్రమముగా

1 శ్రవణభక్తి పురాణ ఇతిహాసముల ప్రవచనములు శ్రద్ధతో వినియానందించుట
2 కీర్తన వీరగాథలను, మహిమను తెలుపు కీర్తనలను పాడుట.
3 స్మరణ నిత్యము అంబను మదిలో స్మరించుచు, నిత్యకార్యముల నిర్వర్తించుట
4 పాదసేవన అంబ స్వరూపమున, తద్భక్తగణపాదముల సమన, గురుపాదముల సేవించుట
5 అర్చన విధియుక్తముగా పంచ, షోడశోపచార చతుష్షష్టి ఉపచారముల అర్చించుట
6 వందన పాపోహం పాప సంభవం ఇదం శరీరం అని అష్టాంగ నమస్కారములు చేయుట.
7 దాస్యము దేవియొక్క దాసుడనను భావమున కర్మఫలముల దేవి కృపకే అర్పించుట
8 సఖ్యము ఇచట దేవి మాత, తాను పుత్రుడనను భావమున కొలుచుట
9 ఆత్మనివేదన ఆత్మను, స్వీయవస్తుగణముల సర్వము అంబసేవకే వినియోగించు విధానమున వెలుగుట

అష్టవిధ ధర్మలక్షణములు గలవి

> మద్భక్తజన వాత్సల్యం, పూజాయాశ్చానుమోదనమ్
> స్వయమభ్యర్చనశ్చైవ మదర్థేవాంగ చేష్టనమ్
> మత్కథా శ్రవణశ్చైవ సర్వనేత్రాంగ విక్రియమ్
> మమానుస్మరణం నిత్యం యశ్చమాంచోపజీవతి

భక్తుల ప్రేమతో జూచుట, పూజలయందు పాల్గొనుట (దేవాలయ దర్శనాది) స్వయముగా దేవిని అర్చించుట, కరచరణముల చాలన సేవయందు ఉపయోగించుట, దేవి సంబంధ గాథలు, పురాణ శ్రవణము చేయుట, గానము, నాట్యాదుల దేవిని కొలుచుట, నిత్య అనుస్మరణ, దేవి సేవకై ప్రాణధారణ చేయుట మున్నగునవి

## నామములు

ఓం త్రిపురదేవ్యై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిపురేశ్వర్యై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిపురసుందర్యై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిరాశ్రియై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిపురమాలిన్యై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిపురవాసిన్యై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిపురసిద్ధాయై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం త్రిపురాంబాయై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం మహాత్రిపురసుందర్యై విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో క్లిన్నా ప్రచోదయాత్
ఓం కామేశ్వర్యై విద్మహే నిత్యక్లిన్నాయై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం భగమాలిన్యై విద్మసే సర్వవశంకర్యై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం నిత్యక్లిన్నాయై విద్మహే నిత్యమదద్రవాయై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం భేరుండాయై విద్మహే విషహరాయై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం వహ్నివాసిన్యై విద్మహే సిద్ధిప్రదాయై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం మహావజ్రేశ్వర్యై విద్మహే వజ్రనిత్యాయై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం శివదూత్యై విద్మహే శివంకర్యై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం త్వరితాయై విద్మహే మహానిత్యాయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్

ఓం వాగీశ్వర్యై (కులసుందర్యై) విద్మహే కామేశ్వర్యై ధీమహి తన్నో శక్తి ప్రచోదయాత్
ఓం నిత్యభైరవ్యై విద్మహే నిత్యనిత్యాయై ధీమహి తన్నో యోగినీ ప్రచోదయాత్
ఓం నీలపతాకాయై విద్మహే మహానిత్యాయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్
ఓం విజయాదేవ్యై విద్మహే మహానిత్యాయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్
ఓం సర్వమంగళాయై విద్మహే చంద్రికాత్మాయై ధీమహి తన్నో నిత్యా ప్రచోదయాత్
ఓం జ్వాలామాలిన్యై విద్మహే మహాజ్వాలాయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్
ఓం విచిత్రాయై విద్మహే మహానిత్యాయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్
ఓం లలితాదేవ్యై విద్మహే షోడశనిత్యాయై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్
ఓం ఆద్యా కాళ్యాయైచ విద్మహే పరమేశ్వర్యైచ ధీమహి తన్నో కాళీ ప్రచోదయాత్

| | | | |
|---|---|---|---|
| | | నైరుతి ఆమ్నాయదేవతా | 4 |
| సంహారాత్మకము | 35) భద్రకాళీదుర్గా (సంహారశక్తి) | అనాహతంపైన | |
| 18 మాత్రలు | 36) మోహినీ/మాతంగీ/ సరస్వతి | విశుద్ధిచక్రం దిగువ | |
| లఘుక్రమాంతర్గతం | 37) విపరీత ప్రత్యంగిరా భద్రకాళీ | వాయువ్యామ్నాయదేవి మణిపూరం పైన | 5 |
| | 38) భద్రకాళీ(సృష్టి) | అనాహతం క్రిందుగా | |
| | 39) మహాసరస్వతీ | | |
| | 40) కాత్యాయనీ | | |
| | 41) సృష్టిచాముండా | | |
| | 42) మహాలక్ష్మీ | ఆగ్నేయామ్నాయదేవి | |
| | 43) తారికాతారిణీ | స్వాధిష్ఠానం పైన | 4 |
| | 44) మహాలక్ష్మీ | మణిపూరకం క్రిందుగా | |
| | 45) ఉగ్రనందా | | |
| | 46) స్థితిచాముండా | ఈశాన్యామ్నాయ దేవి | 5 |
| | 47) పంచవక్త్ర మహాకాళీ | మూలాధారం పైన | |
| | 48) రక్తదంతికా | స్వాధిష్ఠానం క్రింద | |
| | 49) దశవక్త్రమహాకాళి | | |
| | 50) త్రిశక్తి చాముండా (సంహార శక్తిదాయికా) | | 18 |
| 4 అర్ధమాత్ర | 1) సిద్ధలక్ష్మీ 2) సిద్ధకరాళీ | | 4 |
| మహాక్రమము- | (గుహ్యకాళీ) | | |
| స్థితిరూపం | 3) కామకళా (గుహ్యకాళీ) | | |
| 15 మాత్రలు | 4) ఉన్మనీ, 5) పూర్ణేశ్వరీ 6) భువనేశ్వరీ | | 4 |
| మేధాసామ్రాజ్య | 7) సమయకుబ్జికా 8) ఘోరకుబ్జికా | | |
| క్రమాంతర్గతం | 9) కర్మకుబ్జికా 10) ఆద్యాకాళీ | | |
| | 11) మహాద్యాకాళీ 12) దక్షిణకాళీ | | 4 |
| | 13) తారిణీ 14) ఏకజటా 15) మహోగ్రతారా | | |
| | 16) శారదా 17) బాలాత్రిపురా | | 4 (12) |
| | 18) బాలాత్రిపురభైరవి | | |
| | 19) మహాసరస్వతీ 20) మహాలక్ష్మీ | | |
| | 21) దశవక్త్రమహాకాళీ | | 3 (15) |
| మేధాసామ్రాజ్యక్రమాంతర్గతం | 1) దక్షిణకాళీ 2) మహోగ్రతారా | | |
| సంహారరూపం | 3) బాలాత్రిపురసుందరీ 4) గుహ్యకాళీ(సిద్ధకరాళీ) | | |
| 15 మాత్రలు | 5) సిద్ధకపాలినీ 6) కామకలాకాళీ 7) భువనేశ్వరీ | | |
| | 8) వజ్రకుబ్జికా 9) అఘోరకుబ్జికా | | |
| | 10) చాముండీ 11) పంచదశీ | | |
| | 12) లఘుషోడశీ 13) షోడశీ | | |
| | 14) మహాషోడశీ 15) తారాది షోడశీ | | |
| | 16) అలేఖిని(అనుత్తరవాదిని) | | 1=16(61) |
| 5. అర్ధచంద్రా | 1 పంచదశీ-3, 2 లఘుషోడశీ-3 (3) షోడశీ 3 | | |
| లఘుమేధాక్రమాంతర్గతం | 4) మహాషోడశీ, 5) సప్తదశీ-1 6) అష్టాదశీ-1 | | |
| 25 మాత్రలు | 7) చతుః సమయా-4, 8) పంచసుందరీ-5 | | |
| | 9) సప్తకాంథని-7 | | 30 |

6 నాద (లఘుమేధాసామ్రాజ్య క్రమాంతర్గతం 63 మాత్రలు

పంచపంచిక

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచలక్ష్మి | శ్రీవిద్యా | ఏకాక్షరీ | మహాలక్ష్మీ | త్రిశక్తి | సామ్రాజ్యలక్ష్మీ |
| పంచకోశేశ్వరీ | శ్రీవిద్యా | పరంజ్యోతి | పరానిష్కలా | శాంభవీ | అజపామాతృక |
| పంచకల్పలతా | శ్రీవిద్యా | పారిజాతేశ్వరీ | పంచబాణేశ | పంచకామేశ్వరీ | త్రికూటసుందరీ (కుమారీ) |
| పంచరత్న | శ్రీవిద్యా | సిద్ధలక్ష్మీ | మాతంగీ | భువనేశ్వరీ | వారాహీ |
| పంచకామదుఘా | శ్రీవిద్యా | అమృతపీఠే | సుధాసూ | అమృతేశ్వరీ | అన్నపూర్ణ 5x5=25 |

2) పంచసింహాసనీ

| | | | | | |
|---|---|---|---|---|---|
| పూర్వాదిక్ | బాలభైరవి | సంపత్ప్రదభైరవి | చైతన్యభైరవి | ద్వితీయాచైతన్య భైరవి | కామేశ్వరీ భైరవి |
| దక్షిణదిక్ | అఘోరభైరవి | మహాభైరవి | లలితాభైరవి | కామేశీభైరవి | రక్తప్రభా భైరవి |
| పశ్చిమదిక్ | షట్కూటభైరవి | నిత్యభైరవి | మృతసంజీవని | మృత్యుంజయపరా | వజ్రప్రసాదిని |
| ఉత్తరదిక్ | భువనేశీభైరవి | కమలేశీ భైరవి | సిద్ధకౌలేశ భైరవి | డామరభైరవి | కామినీభైరవి |
| ఊర్ధ్వదిక్ | ప్రథమాసుందరీ | ద్వితీయాసుం | తృతీయాసుం | చతుర్థాసుం | పంచమాసుందరీ 5x5=25 |

3) పరాప్రసాదినీ 4) శ్రీప్రసాదినీ

5) దశచక్రేశ్వరీ, త్రిపురా, త్రిపురేశిని, త్రిపురేశీ, త్రిపురసుందరీ, త్రిపురవాసిని, త్రిపురాశ్రీ, త్రిపురమాలిని
త్రిపురసిద్ధా, త్రిపురాంబా, మహాత్రిపురసుందరీ 10

6) మహాత్రిపురసుందరీ 1

63

7 బిందు

1 సర్వమంత్రేశ్వరీ 1

లఘుమేధాసామ్రాజ్య, 2 నిర్వాణవిద్యా

62 మాత్రలు
1 పూర్వామ్నాయ నిర్వాణ భువనేశ్వరీ క్రమాంతర్గతం
2 పశ్చిమామ్నాయ నిర్వాణ కుబ్జికా
3 దక్షిణామ్నాయ నిర్వాణ దక్షిణ కాళీ
4 ఉత్తరామ్నాయ నిర్వాణ గుహ్యకాళీ
5 అధరామ్నాయ నిర్వాణ మహోగ్రతార

2 నిర్వాణవిద్యా
6) ఊర్ధ్వామ్నాయ నిర్వాణ శ్రీమహాత్రిపురసుందరీ
7 అన్యశ్రీమహాత్రిపురసుందరీ 7

3 కుబ్జికా
1 అఘోరకుబ్జికా 2. పఞ్చకుబ్జికా 3 సమయకుబ్జికా 4 ఘోరకుబ్జికా 5 వీరకుబ్జికా
6 జయకుబ్జికా 7 సిద్ధకుబ్జికా 8 భోగకుబ్జికా 9 మోక్షకుబ్జికా 9

4 సమయావిద్య
1 శ్రీవిద్యాదశకూటాత్మక నిర్వాణ సుందరీ, 2 బగలా 3 కాళరాత్రి
4 జయదుర్గా 5 ఛిన్నమస్తా 5

5 రత్నసుందరీ
1 కామసుందరీ 2.తారాసుందరీ 3 రమాసుందరీ 4.మాయాసుందరీ
5 వాక్యసుందరీ 6 దివ్యసుందరీ, 7 పరాసుందరీ 8.నిర్వాణసుందరీ 9 మోక్షసుందరీ 9

6 మహాత్రిపురసుందరీ షోడశవిద్యా
1.కామేశ్వరీ 2 భగమాలినీ 3 నిత్యక్లిన్నా 4 భేరుండా
5.వహ్నివాసినీ 6.మహావజ్రేశ్వరి 7 శివదూతీ 8.త్వరితా
9 వాగీశ్వరీ (కులసుందరీ) 10.నిత్యా 11.నీలపతాకా
12.విజయా, 13 సర్వమంగళా 14 జ్వాలామాలినీ
15 చిత్రా 16.లలితాదేవి/మహాత్రిపురసుందరీ 16

7) గాయత్రీ -సప్తదశగాయత్రీ మంత్రములు (17)

8) దశమహావిద్య 1 కాళి 2 తారా 3.షోడశి 4 భువనేశ్వరి 5.ఛిన్నమస్త
6 త్రిపురభైరవి 7 ధూమవతి 8 బగలాముఖి 9.మాతంగి 10 కమలా 10

9) పాశుపతాస్త్రకం- 1 సృష్టి 2 స్థితి 3 సంహార 4 అనాఖ్యా 5 భాషా 6 నిర్వాణా
7.గురు 8 అన్య (8)

=82 (256)

అనుభవము సాధన గురుకృప వలన మాత్రా పరిజ్ఞానము కలుగును

## కాళీమంత్రోద్ధారణయందు వివిధ కూట మంత్ర సముదాయము

దక్షిణ కాళీ రూపము సామాన్యముగా ఉపాసింతురు ఉపాసనామంత్రములు ఏకాక్షరి నుండి చతుర్దశాక్షరీ రూపములెన్నియో గలవు కాని ముందు సూచించిన 22 అక్షరముల మంత్రన్యాసము దక్షిణ కాళికా 1) ఏకాక్షరి క్రీం దక్షిణమూర్తి ఋషి పంక్తిశ్చందః దక్షిణకాళీదేవతా 2) క్రీం క్రీం క్రీం (త్ర్యక్షరి) 3) క్రీం స్వాహా 4) క్రీం హుం హ్రీం 5) హ్రీం హూం ఫట్ 6) క్రీం క్రోం ఫట్ 7) క్రీం హ్రీం క్రీం

పంచాక్షరీ రూపములు

1) క్రీం క్రీం క్రీం స్వాహా 2) క్రీం హాం హ్రీం స్వాహా 3) క్రీం క్రీం క్రీం హూం ఫట్ 4) ఓం హ్రీం క్రీం స్వాహా 5) క్రీం కాళికే స్వాహా 6) క్రీం కాళ్యై నమః 7) క్రీ

షడక్షరీ రూపములు

1) క్రీం క్రీం క్రీం ఫట్ స్వాహా 2) క్రీం హ్రీం క్రీం మే స్వాహా 3) క్రీం కాళికే స్వాహా 4) క్రీం క్రీం హుం హుం క్రీం క్రీం

అష్టాక్షరీ

1) క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా 2) ఐం హుం హ్రీం హాం హాం ఫట్ స్వాహా 3) క్రీం హాం హ్రీం క్రీం హాం హ్రీం హ్రీం స్వాహా 4) క్రీం హుం హ్రీం క్రీం హుం స్వాహా 5) క్రీం క్రీంకాళికాయై స్వాహా 6) క్రీం క్రీం క్రీం క్రీం క్రీం క్రీం స్వాహా

నవాక్షరీ

1) క్రీం దక్షిణ కాళికే స్వాహా 2) నమః ఓం ఓం క్రోం క్రోం ఫట్ స్వాహా 3) కాళికాళికే హుం హ్రీం హాం ఫట్

దశాక్షరీ

1) శ్రీం ఐం క్రీం క్రీం కాళికాయై స్వాహా 2) క్రీం దక్షిణ కాళికే క్రీం స్వాహా 3) హుం హ్రీం క్రీం దక్షిణే హుం హ్రీం స్వాహా 4) క్రీం హుం హ్రీం దక్షిణ కాళికే ఫట్

ఏకాదశాక్షరీ

1) ఓం క్రీం క్రీం నమో కాళికాయై స్వాహా (విద్యాప్రదం) 2) క్రీం హుం హ్రీం దక్షిణ కాళికే స్వాహా 3) ఐం నమః క్రీం క్రీం కాళికాయై స్వాహా 4) నమః ఐం క్రీం క్రీం కాళికాయై స్వాహా

ద్వాదశాక్షరీ 1) క్రీం క్రీం క్రీం హుం హ్రీం క్రీం క్రీం క్రీం హుం హ్రీం స్వాహా

త్రయోదశాక్షరీ శ్రీం క్రోం క్రోం అం అం ఫట్ స్వాహా కాళికాళికే

చతుర్దశాక్షరీ

1) క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం దక్షిణ కాళికే స్వాహా 2) ఐం నమః క్రీం ఐం నమః క్రీం కాళికాయై స్వాహా 3) క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా 4) క్రీం క్రీం క్రీం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం స్వాహా 5) హాం హ్రీం క్రీం దక్షిణకాళికే స్వాహా హుం హ్రీం

క్రీం (ఏకాక్షరం)

పంచదశాక్షరి 1) క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం దక్షిణ కాళికే స్వాహా

షోడశాక్షరి

క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

హుం హుం హ్రీం హ్రీం దక్షిణ కాళికే హుం హుం హ్రీం హ్రీం స్వాహా

వింశత్యక్షరి హ్రీం హ్రీం హుం హుం క్రీం క్రీం క్రీం దక్షిణ కాళికే హ్రీం హ్రీం హుం హుం క్రీంక్రీం క్రీం

క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం దక్షిణకాళికే క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం క్లీం హ్రాం హ్రాం హ్రీం హ్రీం స్వాహా

ఏకవింశతి ఓం హ్రీం హ్రీం హుం హుం క్రీం క్రీం దక్షిణ కాళికే క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

ద్వావింశతి క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం ఖైం భద్రకాళీ ఖైం క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

త్రయోవింశతి ఓం హ్రీం హ్రీం హుం హుం క్రీం క్రీం క్రీం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

సప్తవింశతి క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా హాం క్రీం హ్రాం క్రీం క్రీం (వశ్యము)

గుహ్యకాళీవిద్య 1) క్లీం హుం హ్రీం గుహ్యకాళికే క్లీం హుం స్వాహా (12) 2) క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం గుహ్యకాళికే స్వాహా(14) 3)క్లీం హుం హ్రీం గుహ్యకాళికే క్లీం క్లీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా(8) 4) క్రీం గుహ్యకాళికే క్రీం స్వాహా (9) 5) క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం గుహ్యకాళికే క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా(21)

హుం నమః ఏహ్యేహి గుహ్యకాళి గృహ్ణ గృహ్ణ మమ శత్రూన్ నాశయ నాశయ ఖాదయ ఖాదయ తురు తురు ఛింది ఛింది, సిద్ధిం దేహి దేహి హుం హుం స్వాహా (బలియంత్రం)

ఓం సదాశివ మహాప్రేతాయ గుహ్యకాళ్యాసనాయః నమః గుహ్యకాళ్యై హుం నమః (ఆసనమంత్రం)

భద్రకాళీ 1) హౌం మహాకాళి కిలికిలి ఫట్ స్వాహా (14)

2) క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం భద్రకాళీ క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా (20)

మహాకాళి 1) క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం మహాకాళ్యై క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం స్వాహా

2) ఓం ఫ్రేం ఫ్రేం క్రీం క్రీం పశూంగృహాణ హుంఫట్ స్వాహా

3) గృధకర్ణి గృధకర్ణి విరూపాక్షి విరూపాక్షి లంబస్తనిలంబస్తని మహోదరి మహోదరి ఉత్పాదయ ఉత్పాదయా హాం ఫట్ స్వాహా

శ్మశానకాళి 1) ఐం హ్రీం శ్రీం క్లీం కాళికే క్లీం శ్రీం హ్రీం ఐం

2) క్రీం క్రీంక్రీం హాం హాం హ్రీం హ్రీం శ్మశాన కాళికే క్రీం క్రీం క్రీం హాం హాం హ్రీం హ్రీం స్వాహా

క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం శ్మశానకాళికే క్రీం క్రీం క్రీం హుం హుం హ్రీం హ్రీం (21)

కాళికాళికే. నమః అం క్రౌం అం క్రౌం ఫట్ స్వాహా కాళికాళికే హుం(18)

సిద్ధకాళి క్రీం హ్రీం సిద్ధకాళి బ్రహ్మరూపా త్రిభువనేశ్వరి క్రీం హ్రీం స్వాహా (20)

# కాళీమతమున రశ్మిక్రమ విధానము

అక్షరన్యాస ఫలము

| సం | వర్ణము | భూమి | ఆప | తేజ | వాయువ్య | నాభస | సాముదాయకు | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అ | 14 | 5 | 10 | 160 | 4 | 193 | |
| 2 | ఆ | 14 | 5 | 10 | 160 | 4 | 193 | |
| 3 | ఇ | 14 | 5 | 165 | 4 | 4 | 193 | |
| 4 | ఈ | 14 | 5 | 165 | 4 | 4 | 193 | |
| 5 | ఉ | 170 | 5 | 10 | 4 | 4 | 193 | |
| 6 | ఊ | 170 | 5 | 10 | 4 | 4 | 193 | |
| 7 | ఋ | 14 | 169 | 10 | 4 | 4 | 201 | |
| 8 | ౠ | 14 | 169 | 10 | 4 | 4 | 201 | |
| 9 | ఌ | 14 | 5 | 10 | 2 | 160 | 191 | |
| 10 | ౡ | 14 | 5 | 10 | 2 | 160 | 191 | |
| 11 | ఏ=అ | 14 | 5 | 10 | 160 | 2 | 193 | |
| 12 | ఐ=ఇ | 14 | 5 | 165 | 4 | 4 | 193 | |
| 13 | ఓ=ఉ | 170 | 5 | 10 | 4 | 4 | 193 | |
| 14 | ఔ=ఋ | 14 | 169 | 10 | 4 | 4 | 201 | |
| 15 | అం=ఌ | 14 | 5 | 10 | 2 | 160 | 191 | |
| 16 | అః | 14 | 5 | 10 | 2 | 160 | 191 | |
| 17 | క | 14 | 15 | 15 | 235 | 4 | 283 | |
| 18 | ఖ | 14 | 5 | 241 | 2 | 4 | 266 | |
| 19 | గ | 245 | 5 | 10 | 4 | 4 | 268 | |
| 20 | ఘ | 14 | 236 | 10 | 4 | 4 | 268 | |
| 21 | ఙ | 14 | 5 | 10 | 4 | 235 | 268 | |
| 22 | చ=క | 14 | 15 | 15 | 235 | 4 | 283 | |
| 23 | ఛ=ఖ | 14 | 5 | 241 | 2 | 4 | 266 | |
| 24 | జ=గ | 245 | 5 | 10 | 4 | 4 | 266 | |
| 25 | ఝ=ఘ | 14 | 236 | 10 | 4 | 4 | 269 | |
| 26 | ఞ=ఙ | 14 | 5 | 10 | 4 | 235 | 268 | |
| 27 | ట=క=చ | 14 | 15 | 15 | 235 | 4 | 283 | |
| 28 | ఠ=ఖ=ఛ | 14 | 5 | 241 | 2 | 4 | 266 | |
| 29 | డ | 295 | 5 | 241 | 2 | 4 | 547 | |
| 30 | ఢ | 14 | 236 | 10 | 4 | 4 | 268 | |
| 31 | ణ | 14 | 5 | 10 | 4 | 4 | 37 | |
| 32 | త=ట | 14 | 15 | 15 | 235 | 4 | 283 | |
| 33 | థ=ఠ | 14 | 5 | 291 | 4 | 4 | 318 | |
| 34 | ద=డ | 295 | 5 | 241 | 2 | 4 | 4 | 547 |
| 35 | ధ=ఢ | 14 | 236 | 10 | 4 | 4 | 268 | |
| 36 | న=ణ | 14 | 5 | 10 | 4 | 4 | 37 | |
| 37 | ప | 1 | 5 | 10 | 291 | 4 | 324 | |
| 38 | ఫ | 14 | 5 | 291 | 4 | 4 | 318 | |
| 39 | బ | 145 | 5 | 10 | 4 | 4 | 168 | |
| 40 | భ | 14 | 536 | 10 | 4 | 4 | 568 | |
| 41 | మ | 14 | 5 | 10 | 4 | 536 | 569 | |
| 42 | య | 14 | 5 | 10 | 535 | 4 | 568 | |
| 43 | ర | 14 | 5 | 541 | 41 | 4 | 605 | |
| 44 | ల | 145 | 5 | 10 | 4 | 4 | 168 | |
| 45 | వ | 14 | 836 | 10 | 4 | 4 | 868 | |
| 46 | శ | 14 | 5 | 10 | 4 | 835 | 868 | |
| 47 | ష | 14 | 5 | 10 | 835 | 4 | 868 | |
| 48 | స=వ | 14 | 836 | 10 | 4 | 4 | 868 | |
| 49 | హ | 14 | 5 | 10 | 4 | 70035 | 70068 | |
| 50 | ళ=ల | 145 | 5 | 10 | 4 | 4 | 168 | |
| 51 | క్ష | 14 | 5 | 70041 | 4 | 4 | 70068 | |

# శ్రీకాళికా సహస్ర నామస్తోత్రం

| | | |
|---|---|---|
| | కథితోయం మహామంత్రస్సర్వమంత్రోత్తమోత్తమః | |
| | యమాసాధ్య మయాప్రాప్తమైశ్వర్యపదముత్తమం | (1) |
| | సంయుక్తః పరయాభక్త్యా యథోక్తవిధినా భవాం | |
| | కురుతామర్చనం దేవ్యా త్రైలోక్య విజిగీషయా | (2) |
| పరశురామ ఉవాచ | ప్రసన్నాయదిమేదేవా పరమేశ పురాతనః | |
| | రహస్యం పరయాదేవ్యా కృపయా కథయా ప్రభో | (3) |
| | యథార్చనం వినాహోమం, వినాన్యాసం వినాబలిం | |
| | వినాగంధం వినాపుష్పం, వినానిత్యోదితక్రియా | (4) |
| | ప్రాణాయామం వినాధ్యానం, వినాభూత విశోధనం | |
| | వినా, జాప్యం వినా, దానం వినా కాళీ ప్రసీదతి | (5) |
| | (కాళీకృప -స్మరణ మాత్రమున ప్రసన్నురాలగును ) | |
| శ్రీ శంకర ఉవాచ | పృష్టం త్వయోత్తమం ప్రాజ్ఞ భృగువంశ వివర్ధన | |
| | భక్తానామపి భక్తోఽపి త్వమేవం పారయిష్యసి | (6) |
| | దేవీందానవకోటి ఘ్నీం లీలయా రుధిర ప్రియామ్ | |
| | సదాస్తోత్ర ప్రియాముగ్రాం కామకౌతుక లాలసామ్ | (7) |
| | సర్వదానంద హృదయా వాసవాసక్తమానసాం | |
| | మాధ్వీక మత్స్యహంసాది రాగిణీం రుధిర ప్రియమ్ | (8) |
| ధ్యానం | శ్మశానవాసినీం ప్రేతగణనృత్య మహోత్సవాం | |
| | యోగప్రభాం యోగినీశాం యోగీంద్ర హృదయేస్థితామ్ | (9) |
| | తాముగ్ర కాళికాం రామ ప్రసాద యితుమర్హసి | |
| | తస్యా స్తోత్ర మహాపుణ్యం స్వయంకాళ్యా ప్రకాశితం | (10) |
| | తావతత్కథ యిష్యామి శృత్వా వత్సావధారయ | |
| | గోపనీయం ప్రయత్నేన పఠనీయం పరాత్పరం | (11) |
| | యస్యైక కాలపఠనాత్ సర్వేవిఘ్నా సమాకులా | |
| | నశ్యంతి దహనే దీప్తే పతంగా ఇవ సర్వత | (12) |
| | గద్యపద్యమయీవాణీ తస్యగంగా ప్రవాహవత్ | |
| | తస్యదర్శన మాత్రేణవాదినో నిష్ప్రభామతా | (13) |
| | రాజానోపిచ దాసత్వం భజంతిచ పరేజనా | |
| | తస్యహస్తే సదైవాస్తి సర్వసిద్ధిర్నసంశయ | (14) |
| | నిశీథముక్తయో శంభుర్నగ్న శక్తిసమన్విత | |
| | మనసాచింతయేత్ కాళీం మహాకాళీ తి లాలితా | (15) |
| | పఠేత్సహస్రనామాఖ్యం స్తోత్రంమోక్షస్య సాధనం | |
| | ప్రసన్నా కాళికాతస్య పుత్రత్వేనాను కంపతే | (16) |
| | యథా బ్రహ్మాస్మృతే బ్రహ్మకుసుమైః పూజితాపరా | |
| | ప్రసీదతితథాకాళీ యథాఽనేన ప్రసీదతి | (17) |



# శ్రీశంకరకృత
# కాళికా సహస్ర నామావళి
# ప్రారంభం

అస్య సహస్రనామ స్తోత్రస్య మహాకాలభైరవ ఋషి అనుష్టుప్ఛందః
శ్మశానకాళికా దేవతా ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః
ఓం ఐం హ్రీం శ్రీం క్లీం బీజాక్షరముల నామములకు ముందు స్థాపించుకొనవచ్చును

ఓం శ్మశాన కాళికా కాళీ భద్రకాళీ కపాలినీ,
గుహ్యకాళీ, మహాకాళీ, కురుకుల్లా అవిరోధిని(19)

**1 ఓం శ్మశాన కాళికాయైనమః**

శ్మశాన వాసియైన కాళికాదేవికి నమస్కారము శ్మశానము యెల్ల జీవులకు నంతిమ ఆశ్రయ స్థానము అచట కొలువై యుండి జ్ఞాన వైరాగ్య బోధనలచే ముక్తి నిడునట్టి కాళికాదేవికి నమస్కరించుచుంటిని శ్మశానమునకు రుద్రభూమి యనియు అందు వీరభద్ర రూపము శక్తి మహాకాళి యుతముగా నెలకొని యుండునందురు కాశి యందు మరణించిన వారికి విశ్వనాథుడే స్వయముగా తారక మంత్రోపదేశము చేయుదురని విశ్వాసము కాశికి ఆనందకాననం, మహాశ్మశానం అను పేర్లు గలవు.

**2 ఓం కాళ్యైనమః**

కాళి అనంత కాల స్వరూపము

1) క్షణ, నిమేష, ఘంటి, మూహూర్త, దిన, పక్ష, మాస, ఋతు, అయన, వత్సర, శతాబ్ధి, యుగ, మన్వంతర, కల్పాది, బ్రహ్మాయు, విష్ణు శివాది కాలావధి యంగముగా గల అనంత కాల రూపము ప్రళయముల పర్వములయను కాగా వానికతీతముగా వెలుగొందు నిత్యరూపిణి

2) కాలమునకును మృత్యురూపిణియైనది కాళి

3) మహాకాలుని గూడియున్న దేవతాశక్తి మహాకాళి

4) త్రిపురాది శక్తుల అంతరంగికమున త్రికోణ నిలయమందు నొక కోణ స్థానమున శ్రీ మహాత్రిపుర సుందరీ దేవి విభూతులందు నొక విభూతిగావెలుగొందుచున్నది

5) అంబిక చండముండాసురుల సైన్యము దాడి చేయగా కోపమున, నామె వదనము మషీవర్ణమైనది కన్బొమలు ముడిబడ, లలాట ఫలకము [illegible] డి వేగముగా కాళీ, కరాళ వదన, అసి, పాశధారి, ఖట్వాంగధారి, నరమాలా విభూషిణి, ద్వీప చర్మధారిగా ఆవిర్భవించి దైత్య నాశనము చేసినది

6) మహాకవి కాళిదాసుకు విద్వత్తు ప్రసాదించినది అటులే వికటకవి తెనాలి రామలింగనికి కవిత్వ ధార ప్రసాదించినది ఆ మహాకాళీ మాతామాతంగి స్వరూపిణి

7) కలి యుగమున క్షిప్ర ప్రసాదినిగా భక్తులకు వరముల నిడు కరుణా రసమూర్తి అర్చన, హోమాది, బలి న్యాసములను క్రియలు, పుష్పగంధాద్యర్చనలు అవసరము లేకయే తలచిన వెంటనే సద్యః ఫలము నొసగు సౌమ్యమూర్తిగ తలపునకు చేరును.

8) జగదంబ పార్వతి శరీరము నుండి దేవతల రక్షణార్థమై వెలువడి, కాళికి నామ ధేయమున

విఖ్యాతి చెందిన దేవి కాళము అనగా నలుపు ఆ రంగు శరీరముతో భయంకరముగా కనుపడి నప్పటికిని మనోరథము పూర్ణము చేయుట యను స్వాభావిక సహజ గుణము గల్గియున్నది ఆమెయే కాళరాత్రిగా వ్యవహరింపబడుచున్నది జగదంబ మరొక మనోహర రూపమున లావణ్యాది శుభగుణ యుక్తమైన రూపము గలదిగా నెంతురు కాళికగా గూడ వ్యవహారమున గలదు

9) 'క'' యన బ్రహ్మాండము వరుసగా నున్న బ్రహ్మాండముల పోషణ శక్తిగా కాళికాదేవి

10) సాంఖ్య మతానుసారము ఆకాశతత్త్వము నుండి ఉత్పన్నమైనది

11) నైయాయి కులమతానుసారము కాలము నిత్య పదార్థము శక్తి కాళి అన్ని పదార్థముల కలన యనగా వినాశము సర్వభూతముల కలన శక్తి ఆమెయే ద్రవ్యము ఉపచయ, అపచయములు జరుగు క్రియను కాలమందురు కాళి శబ్దము కాల సంబంధమైనది ఆమెయే మహాకాలమును అయి వున్నది

12) కాళి సంహారమూర్తి సర్వచ్ఛేదకారి కాలుని శక్తి కాళీకరాళ మూర్తి రుద్రమూర్తి మహాప్రళయ సూచకములు 'కాలః పచతి భూతాని, కాలః సంహరతి ప్రజా'

13) శక్తి సాంప్రదాయానుసారము కైలాసము సమీపమున శ్మశానమను ప్రసిద్ధ స్థలము గలదు అందు విహరించుటచే శ్మశానాలయ వాసినీ యను పేరు గలిగి యున్నది

14) సంహారము చేయు కరాళమూర్తి ఉపాంగములుగా శ్మశానము, శవములు, చితి, నరముండ రుధిర పానాదుల ధ్యానించవలెను ప్రళయ భైరవమూర్తి, ధ్వంస రూపిణి కృష్ణవర్ణ, కరాళవదన, వికట, ఆతంక కారి, వికట రమణమూర్తి, దిగంబరి చూచిన చిత్తమున భయము కలుగును చరణముల క్రింద శవరూపి మహాకాలుడు ఆమె పాద ఘట్టనముల సహించుచు భూమికి రక్షగా వెలుగుచుండును శవాసన, శవరూప మహాదేవ హృదయోపరిసంస్థితా, శ్మశానాలయ వాసినీ, జగదుదయ రక్షా ప్రళయకృ త మూర్తిగా భక్తుల పాలించుచుండును ప్రళయకాలమున చిదేకఘనా, మహామాయా, విశ్వ సమస్త చైతన్యశక్తిని తనలో నిముడ్చుకొని అవ్యక్త తత్త్వమున లీనమైనపుడు జగత్తు శివ లేక శవముగును శివుడు నిష్క్రియ శవాకారం 'తద ధీనస్తు శంకరః' శక్తికి అధీనుడుగా యుండును సౌందర్యలహరిలో 'శివశ్శక్త్యాయుక్తో యది భవతి ప్రభవితుంశక్తుం' అని గలదు

15) కాళి నలుపు వర్ణం. అన్ని వర్ణములు లీనమై పోవును ఆకాశము కూడా ముదురు నీలము, నలుపు వర్ణము అన్ని వర్ణములను లీనమై తమ యునికి కోల్పోవును అదే కృష్ణవర్ణము దిక్కులు, కాలము, అంతర్హితము రూపము వర్ణములు నిశ్శేషము ఆ కృష్ణవర్ణమందునే జగత్తుకు మూలశక్తి కృష్ణవర్ణములోనే సమస్త సౌందర్యరాశిగా కానవచ్చును కృష్ణుడు, కృష్ణ, కాళి, పదార్థము, శక్తి పురుషుడు మాయాద్వంద్వము లగును బీజమంత్రము కృష్ణునికి, (క్లీం) మహామాయకు క్లీం అని వొకటియే కాళీబీజం 'క్రీం' క,ల,యీ,ర భేదం

16) సమస్త వస్తువులు దిక్కు, కాల పరిచ్ఛిన్నములు కాని కాళీ తత్త్వము స్వతంత్రము దిగంబరి దిగంబరాయని సర్వవ్యాపి మహాసత్తగా పేర్కొనియుండిరి

17) దశమహావిద్యలలో భిన్నాభిన్నావస్థల మూర్తి ధ్యానము అందు ఆద్యా మహాకాళి

18) సాధనాక్రమములో చరమ స్థానము శేషావస్థ యుండురు రామకృష్ణ పరమహంస మహరా(బెంగాలు) వాసులైన రామప్రసాదు కములాకాంతులు ప్రత్యక్ష దర్శనమునందిరి

19) అగ్నికి గల సప్త జిహ్వలలో వొకదానికి 'కాళి' మరొకటి కరాళియని క్రూరకర్మల వినియోగింతురు

20) విశ్వాంకలయతీతి కాల విశ్వవ్యాప్తమైనదిగా కాళి

21) మహాశక్తి ఆద్యా-భోగమున భవానీరూపం సంగరమున దుర్గ, కోపమున కాళిక, పుంరూపమున తదాత్మికగా నాల్గు భిన్న విగ్రహములుగా వెలుగుచుండును

*3) ఓం భద్రకాళ్యై నమః*

భద్రము అనగా క్షేమమిడు కాళీస్వరూపము కరుణార్ద్రచిత్తయై సకల జనుల దుఃఖార్తిని బాపునటువంటి చిత్తవృత్తిగలిగి యున్న జగదీశ్వరీ శక్తి ఒకరికి భైరవి ప్రళయ నిషాద నాదిని గాను, మరొకరికి

ఆనందదాయినిగా కనబడును మూర్తిధ్యానము నుండి సాధకుని మనసున కా రూపమున, మంత్రపరిపూత విగ్రహమున నావిర్భవించును. ఆమె స్మరణాతీత కాలరూపము ధ్రువము, సత్యము. కాళికరాళిచ మనోజవాచ సులోహితా యచ సుధూమవర్ణా యని ముండకోప నిషత్తు మహాకాళి, భద్రకాళీ ఉత్పత్తి సప్తశతిలో గలదు విష్ణువు యోగనిద్రలో లీనమైయుండి వాని కర్ణములనుండి మధుకైటభులను నిర్వురు మహోన్మత్త రాక్షసులుద్భవించి బ్రహ్మను చంపుటకు నుద్యమించిరి నాభికమలస్థితుడైన ప్రజాపతి బ్రహ్మ అసురులను చూచి, హరిని మేల్కొలుపుటకు యోగ్యాగరిత్వై యోగనిద్రను స్తుతించెను ప్రథమాధ్యాయమున ఆరంభస్తోత్రము కాళి, మహాకాళిరూపమే స్వాహా స్వధా వషట్కార స్వరాత్మిక సుధా, అక్షరరూపి, నిత్యా, త్రిధామాత్రాత్మికాస్థితా, అర్ధమాత్రాస్థితా నిత్యాసంధ్యాసావిత్రీ జననీ, విశ్వాధారిణీ, విశ్వస్రుజని, విశ్వపాలిని, అంతకాలమున నొక్కతెయే వెలుగును విసృష్టి, సృష్టిరూప, స్థితిరూపము లామెయే సంహృతి రూపాంతం, జగత్తు, జగన్మయి, మహావిద్యా, మహామాయా, మహామేధా, మహాస్మృతి, మహామోహ, మహాదేవి, మహాసురీ, ప్రకృతి, గుణత్రయ విభావిని, కాళరాత్రి, మహారాత్రి, మోహరాత్రి, దారుణరూపి, శ్రీ, ఈశ్వరీ, హ్రీం, బుద్ధి, బోధలక్షణీ, లజ్జా, పుష్టి, తుష్టి, శాంతి, క్షాంతి, ఖడ్గిని, శూలిని, గదిని, చక్రిణీ, శంఖిని, చాపిని, బాణభుశుండీ, పరిఘాయుధా, సౌమ్య సౌమ్యతరా, అశేష సౌమ్య, అతిసుందరీ, పరా, పరాణాం, పరమా, పరమేశ్వరీ రూపముగా బ్రహ్మ సంబోధించి యుండెను. మహాకాళీ ప్రాదుర్భావ రూపం పై నామములన్నియు క్రమముగా వివరించబడి యున్నవి

4) ఓం కపాలిన్యై నమః

కపాలములు మాలగా గలిగియున్నది శ్మశాన వాసినికి ఉపయుక్త అలంకారములుగా పేర్కొన బడియున్నవి సముద్రమందు లభించు గవ్వలు, శంఖములు, ముత్యములు యేవిధముగా అలంకార యుక్తము లగుచున్నవో అటులనే శ్మశానావశేషములగు నరముండములే మాలయుగా యుక్తము ఇందు శిరోస్థానావశేషమైన కపాలమే శ్రేష్ఠముగా గ్రహించి అలంకరించ బడినది బ్రహ్మపంచమ శిరము ఛేదించ, నరపతికి తగులుకొని కపాలిగా ఈశ్వరుడు ఉండును
2) ప్రళయకాలమున మిగులు బ్రహ్మకపాలము మొక్కొక్కటిగా తన సరమునకు గూర్చి అలంకారయుక్తముగా భాసిల్లుననుటచే ఆది, అంతము లేని అనాదిమూర్తి, అనంతకాల వ్యాపకత్వమును సూచించుచున్నది అటులే మరియొకటి
3) సంసారమే లేనపుడు ముండమాల ఎక్కడినుండి వచ్చినది, అది వాస్తవముగా పంచాశత్ వర్ణమాల ఉల్లేఖించబడుట గలవు అవి వర్ణములేగాక, మాతృకావర్ణములు ఒక్కొక్క వర్ణమునకు ఒక్కొక్క అధిదేవత మాతృకాశక్తిసహితములు క్షయరహితమైన అక్షరతత్వములు సాధన దృష్టితో చూచిన వర్ణము, జీవంతము శక్తి విశేష వాచకములును-సాధకునికి బీజాత్మక వర్ణరాశి మహాశక్తి సంపన్నమైనది వాచ్యవాచక భావముతో పాటు దేవతతో ఘనిష్ఠ సంబంధముండును పతంజలి బ్రహ్మర్షియొక్క ప్రత్యక్షజ్వలంత రూపముగా నుదహరించి యుండిరి 3) సర్వవిద్యాధిష్ఠాత్రి మహాశక్తి గళమున శక్త్యాత్మకమైన వర్ణసమూహము ఉజ్జ్వలముక్తాహారమువలె శోభిల్లుచున్నది అది తత్త్వదర్శకులైన సాధకులకు ప్రీతిప్రదము శుభప్రదము వరాభయకరముల ప్రసన్నమూర్తిగను, వైరిజనులకు భయంకరమూర్తిగాను కానుపించును

5) ఓం గుహ్యకాళ్యై నమః

గుహ్యము యన గూఢమైనది గూఢమైన గుహయందున్న కాళీస్వరూపము పంచకోశాంతర్వర్తియగు గుహయందున్నది అతి రహస్యస్వరూపిణి అట్టికాళియని అర్థము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయమను పంచకోశములు. ఈ పంచకోశ మధ్యస్థానమే శృతి యందున్న గుహ్యస్థానము (గుహ) పరమేశ్వరియొక్క సూక్ష్మరూపము హృ

దయాకాశమునందు అతి సూక్ష్మరూపమున వ్యాప్తమై యుండును 2) రహస్యమైన స్వభావము గలది కంటికి అగోచరమునగు నీ మహాకాళీ రూపము, జ్ఞానదృష్టికి మాత్రమే గోచరముగుచుండును
3) గురుమూర్తిధరాం గుహ్యాం గుహ్యవిజ్ఞానరూపిణీ, గుహ్యభక్తజనప్రీతాం, గుహాయాం నిహితా తనూ- గుహ్యోపనిషత్తు జడస్వభావములైన నామరూపములు ప్రతిపదార్థము నందును విచారించగా, నా వస్తువులయందలి సత్తాస్వరూపం, పరాశక్తి స్వరూపము సత్తాలేనియెడల జడములని, ప్రాణవస్తువు బ్రహ్మరూపమని యోవేద నిహితాం గుహాయాం పరమేవ్యోమన్-జీవబ్రహ్మస్వరూపముగ నుండు పరమేశ్వరి, గుహాంబ, గుహ్యరూపిణియై మనో వాచామగోచరముగును
3) గుహుడను సంజ్ఞగల కుమారస్వామి జనని, పరమేశ్వరి స్కందకుమార పోషణకై అగ్ని నుండి స్కంద, అపస్మార, శకున, రేవతి, పూతన, అంధపూతన, శతపూతన, ముఖ కుండికా, నైగమేయయనెడు నవశక్తులను సృజించెను వీరుకూడా కుమారస్వామికి తల్లులుగా, బాలగ్రహములుగా, పరమేశ్వరీయంశ సంభూతులుగా గుహ్యకాళీయంశన శిశువుల పీడించు చుందురు
4) కుబేరుని నవనిధులు కాపాడు జాతులలో గుహ్యకులను వారు గలరు ఆ గుహ్యకులచే నారాధింపబడుదేవి గుహ్యకాళి గుహ్యకారాధ్యయైనది
5) శిరస్సునందలి సహస్రారాంతర్గత చంద్రమండలము పంచకోశాంతర స్థానమును గుహ్యకములనబడును అంతర్యాగ విధానమున శరీరమందే ఆరోపింపబడి ఉపాసింపబడునది కాళీ ఉపాసనయందు బిందు/బ్రహ్మస్థానమునందు వెలుగును సహస్రార కమలము బిందు స్థానము దేవీనిలయము

## 6) ఓం మహాకాళ్యై నమః

మృత్యువునకు మృత్యువైనది మహాకాళీరూపము ఉజ్జయినీ పీఠనిలయుడైన మహా కాలుని పట్టమహిషిగా భాసిల్లునది
2) శ్రీనగర ప్రాకారముల త్రికోణమందలి యుక్తస్థానమున మహాకాలుని కూడియున్న దేవతామూర్తి నవమావరణమైందవ చక్రమందు దక్షభాగమున కాళరాత్రి రూపమున సర్వజన మనోహారిణి, సర్వముఖ స్తంభినీ, సర్వరాజవశంకరి, సర్వదుష్టదమని, సర్వస్త్రీ పురుషాకర్షిణిగా-శృంఖలముల ఛేదింపుటకును, శత్రువుల భంజించుటకును, ద్వేషజనుల నివారించుటకును, సర్వస్తంభన, సర్వమోహన, సర్వఉచ్చాటన, సర్వద్వేషణ శక్తుల నణచగల సమర్థత గలిగి, పత్యక్ష ప్రతిఫలించునది అనంతకాల స్వరూపిణిగా, భక్తపాలిని, వరదాయినిగా వెలుగొందును
3) సప్తశతిలోని త్రిదేవతామూర్తులలో నొకటి మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతియని వివరింతురు అందు ఆద్యమహామాయి స్వరూపిణి మహాకాళియే

## 7) ఓం కురుకుల్లాయై నమః

కురుకుల్లాయనబడు పరమేశ్వరి కురుకుల్లాయనగా మణిద్వీపమునందు గల శ్రీపురమున అహంకార, చిత్తమయ ప్రాకారమధ్యమున గల విమర్శయను వాపికి అధిష్ఠానియైన దేవత ఆ దేవతారూపిగా వెలకొనియున్న దేవి
2) సుషుమ్నయన బడు కులమార్గము ముఖ్యప్రాణనాడికి గలపేరు మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాసహస్రార, చక్రకూటమియు, బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి మరియు రుద్రగ్రంథిత్రయ సమావేశమునకు గల ముఖ్యప్రాణస్వరూపిణియే కురుకుల్లాదేవి
3) శ్రీనగర ఇరువది మూడవ ప్రాకారమున గల బుద్ధిశాల, అహంకారశాలముల మధ్య, సుషుమ్నామృత రూప విమర్శవాపి అధిష్ఠానదేవత కురుకుల్లా దేవతకు నామాంతరముగా 'శ్యామ'యను నామము గలదు

*8) ఓం అవిరోధిన్యై నమః/ఓం విరోధిన్యై నమః*

విరోధులు లేనట్టి ప్రేమమూర్తి ఎవరియెడల విరోధభావము లేనట్టి శక్తియునై యున్నది దేవి సప్తశతి యందు పూజాంగముగా దేవికి పృష్ఠభాగమున ఓం మహిషాసురాయై నమః, ఓం మధుకైటభాభ్యాం నమః, ఓం చండముండాభ్యాం నమః, ఓం ధూమ్రలోచనాయై నమః, ఓం రక్తబీజాయై నమః, ఓం శుంభని శుంభాభ్యాం నమః–అని దేవి చంపిన రాక్షసగణనాధులును గూడా చండిక సామీప్య వర్తులుగా పూజింపబడుచుంటిరి వారు వైరభావముంచి దేవగణములతో యుద్ధము చేసి పరాస్తులైనప్పటికీ దేవి అనుగ్రహముచే అంతరంగికులైరి అనగా దౌష్ట్యపరాకాష్ఠయందు దేవతలచే ప్రార్థింపబడి దైవవిరోధులకు కూడా నాశ్రయమిడుచు అవిరోధినిగా నిలిచియున్నది 2) ఆమెను రణమందు నిలిచి వోడించగలిగిన వేరు శక్తి లేక రాక్షసగణములు లేనందున, ఎదురులేని అమోఘశక్తిగా కొనియాడబడుచున్నది త్రిమూర్తులకు కూడా శక్యముగాని రాక్షససంహారమును అవలీలగా చేసి, అనాది నుండియు వివిధ రూపముల ధరించుచు జగత్తును పరిరక్షించుచుండిన శక్తి ఆమెయే. ఓం విరోధిన్యై నమః అను మారుపదము గలదు విరోధిని అటంకములు లేనట్టి శక్తి దానికి సంతత దేవతాజన ప్రశాంత సుఖజీవనమునకు ఆటంకము గలిగించు దుష్టశక్తుల నెదిరించి సర్వజన శ్రేయము గలిగించునదియని గ్రహించవలయును

'దుర్వృత్తవృత్త శమనం తవ దేవి శీలం రూపంతథై తద విచింత్య మతుల్యమన్యైః
వీర్యంచ హంతృహృత దేవపరాక్రమాణాం వైరిష్వపి ప్రకటితైవ దయాత్వయేత్థమ్ః నమః

(సప్తశతి)

**కాళికా కాలరాత్రిశ్చ మహాకాల నితంబినీ**
**కాలభైరవ భార్యాచ కులవర్త్మప్రకాశినీ (20)**

**9) ఓం కాళికాయై నమః**

కాళికా నామధేయము కలిగిన దేవి కృష్ణవర్ణ శరీరము గలిగి అసురుల నాశమునకై ఉగ్రరూపము ధరించి జగత్తు పోషణ, రక్షణ భారము వహించు పరమాశక్తి వీరభద్రుని సహచరిగా మాయా స్వరూపిణిగా క్రీడించు శక్తి. అటులే నిత్యసత్యమైన విజ్ఞానమును, కవిత్వశక్తియు ప్రసాదించు సారస్వత స్వరూపిణి. కాళీవరప్రసాదులుగా చరిత్రయందు మహనీయులెందరో గలరు. అందు పూర్వాశ్రమము గొల్లయగుపుడైన, నిరక్షరకుక్షి కాళికా వరప్రసాదముచే ధారానగర సామ్రాజ్యము (ఉజ్జయిని) మహాకవి కాళిదాసుగా సంస్కృత సాహితీ వెలుగాయెను అటులే శ్రీకృష్ణదేవరాయలు ఆస్థాన మందు విజయనగర సామ్రాజ్య విజయభువనములయునైన శ్రీతెనాలి రామలింగకవియు కాళీ వరప్రసాదులే అటులే శ్రీరామకృష్ణపరమహంస మొదలగువారు నేటికిని సిద్ధులుగా పరిగణింప బడుచున్నారు 2) హిమవత్పుత్రి కయ్యెన పార్వతికి గల బాల్యనామము 'కాళి'యని పురాణములలో గలదు

**10 ఓంకాళ రాత్ర్యై నమః**

కాళరాత్రి స్వరూపిణియైన దేవి చీకటి లావరించియుండు కలమున నుండు జాగరూకశక్తి. అనాహత చక్రమందలి ద్వాదశ దళములు 'కకారాది 'ఠ'కారాంత ద్వాదశ బీజములు గలవి. అందు కాళరాత్రి, మహారాత్రి, మోహరాత్రి, శ్రీ ఈశ్వరీ, హ్రీంబుద్ధి, లజ్జా, పుష్టి, తుష్టి శాంతి యన బడు పంద్రెండు శక్తుల కూటమునకు అగ్రణియని గలదు

(అ) ద్వాదశాచక్రాధి దేవతలు కూడా కాళరాత్రి, భారతి, గాయత్రి, ఘంటాధారిణి, కామిని, చంద్రా, ఛాయా, జయా, ఝంకారి, జ్ఞానరూపా, టంకహస్తా టంకారిణిగా ద్వాదశ వర్ణ శక్తులను నెలకొని యున్నట్లు వివరింపబడినది

(ఆ) బ్రహ్మ స్తవమున కూడ 'కాళరాత్రిర్మహారాత్రి మోహరాత్రిశ్చదారుణా'యని పేర్కొన్న కాకన

భాగవతమునగూడ 'లోకంబులో కేశులు లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెంజీకటి యందవ్వెండే 'కా' కృతిని వెలుంగు నతనినే సేవింతున్' అని ఉదహరించి మహామాయా స్థానమును వివరించెను. ఆమెయే కాళరాత్రిగా సర్వమును లయము చేసికొని పునఃసృష్టిగావించు శక్తిగా, జగత్పోషిణిగా, దుష్టదళనిగా, దుర్గాదేవిగా ధర్మపాలన చేయుచుండును

11) ఓం మహాకాలి తంటిస్యై నమః

మహాకాలుని యర్ధాంగియైన దేవియని వివరణ మహాకాలుడు యనగా సర్వేశ్వరుడు ఇంద్రాది దిక్పాలకులు, త్రిమూర్తులు అనంతకాలమున పరిణతి నాశనములు పొందుచుండనట్టి ప్రళయ కాలమందు నను ప్రశాంత చిత్తుడై, ఎట్టి భీతియునందక, ఏకాకిగా తాండవ కృత్యము నాచరించుచు, మరల శక్తి సహాయముచే జగత్తును సృష్టిచేయుచు క్రీడించుచుండును అట్టి మహాకాలుని యర్ధాంగి, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తి స్వరూపిణియైన అంబ మహాకాలునితోపాటు అనంతకాల రూపిణిశక్తియై విలసిల్లుచుండును

12) ఓంకాల భైరవ భార్యాయైనమః

కాలభైరవుని భార్యయైన శక్తి కాశియందు నగర పాలకునిగాకొలువున్న కాలభైరవుడు సన్నుతిని 'కాశికాపురాధినాథ కాలభైరవం భజే' యని ఆది శంకరులు పల్కిరి ఉజ్జయిని మహాకాలుడెటులో కాశిలోని కాలభైరవుడు నటులే కాలభైరవుని దర్శించనిచో కాశీయాత్ర ఫలము దక్కదు కాలకాలుడయిన కాలభైరవుడు అనంత కాలదర్శి. 'పద్మ దళమున సూది దిగుకాలము లవము అట్టి లవములు ముప్పది త్రుటి అట్టి త్రుటులు ముప్పది కళ అట్టి కళలు ముప్పది కాష్ఠ. అట్టి కాష్ఠలు ముప్పది నిమిషం లేక చిటిక కాలం అట్టి పదునెనిమిది నిమిషములు ఒక మాత్ర అట్టి ముప్పదియారు మాత్రలు నాడిక. రెండు నాడికలు ముహూర్తం ముప్పది ముహూర్తములు దినము ముప్పది దినములు మాసము (నెల) పండ్రెండు నెలలు మానుష సంవత్సరం. అపై యుగం కల్పము మహాకల్పం పరార్ధము అను పదునైదు ప్రమాణములుగా చెల్లును ఒక మానుష సంవత్సరము దేవతలకు దినము అట్టి దేవమానము బ్రహ్మ మానం బ్రహ్మ జీవితం నూరేండ్ల తర్వాత ప్రళయము. ఈ పదునైదు రూపములైన కాలప్రమాణము జగత్తును నడుపుచున్నది ఆ ప్రళయాంతమునందు కాలభైరవుడొక్కడే మిగిలియుండును మరల పునః సృష్టి కొనసాగుచుండును అట్టి కాలభైరవునకు అర్ధాంగి, సహచరిగా జగదుద్భవ స్థాపన, లయాదుల క్రీడను చెలగుచుండునది

( అ) తంత్ర గ్రంథములయందు స్వచ్ఛంద తంత్రము గలదు అందు అకార, ఉకార, మకార, బిందు, అర్ధచంద్ర, నిరోధిక, నాద, నాదాంత, శక్తి, వ్యాపిని, సమన, ఉన్మనా, నిరామయ, పరమాత్ర, అవ్యయ కూటములుగా శివశక్త్యైక్య స్థానమునందు ముందు శ్మశాన వాటిక కాలభైరవు కాళికాశక్తియుతముగా పేర్కొనబడినది

13) ఓం కుల వర్మప్రకాశిన్యై నమః

కుల సాంప్రదాయముల పరిరక్షించునది కులశబ్దము వస్తు సమూహమునందును, జాతియందును, వంశమునందును, స్వభావము నందును వర్తించును కులము సజాతీయ సమూహము 'కులోచితం అమృతం కులామృతం' అనగా చాతుర్వర్ణములైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల వారికి నిర్దేశించిన విధానమున గౌరవముంచి నడచికొనుట ఆచారము, సాంప్రదాయము,కట్టుబాటు, జీవనసరళి విధానములు, అర్చనా విధానమున బ్రాహ్మణాదులు క్షీరము, ఘృతము, మధువు ఆసవము అర్చనామృతములుగ నిర్ణయింపబడినవి వర్ణభేదము చేతను, కామనా భేదము చేతను ద్రవ్యముల మారుచుండును అటువైన పరమేశ్వరుడు బ్రాహ్మణుల నుద్దేశించి స్వతంత్ర తంత్రములును, త్రైవర్ణికులకు అరువదినాలుగు తంత్రములును నిర్మించెను

త్రైవర్ణికులకు సన్యాసాధికారము, సమయాచారమునందధికారము లేదు పరమేశ్వరుడు బ్రాహ్మణులకు సమయ దక్షిణాచారములను త్రైవర్ణికులకు కౌలవామాచారముల నేర్పరచెను వసిష్ఠాది సంహితల యందుగూడ సమయ దక్షిణాచారములు వివరింపబడియుండగా చతుష్షష్టి తంత్రములు కౌలవామాచారములు ఉద్దేశింపబడియున్నవి ఈ ఉభయులకు అంతర్యాగ బహిర్యాగ మందెంతయో భేదము గలదు సమయాచారము వేద సాంప్రదాయ సిద్ధమైన ముఖ్య ప్రాణోపాసన యందాసక్తిగలది దక్షిణామూర్తి ఋషి, కామేశ్వరీ కామేశ్వరులు అధిదేవతలుగా గల మంత్ర జపానుష్ఠానము శివభక్తులకు పంచ విధ సామ్యములు గలిగియున్నందున 'సమయా' యను పేరు బడినది (అ) అధిష్ఠాన సామ్యము శ్రీ చక్రవాసము (ఆ) అనుష్ఠాన సామ్యము సృష్ట్యాదికృత్యము (ఇ) అవస్థాన సామ్యము క్రియాదికము (ఈ) నామ సామ్యము కామేశ్వరీ కామేశ్వరులు (ఎ) రూపసామ్యము అరుణ్యాదికము

శ్రీ చక్రార్చన వేదసమ్మతముగా చేయుటయే దక్షిణాచారమనియు, సహస్రారమునందు లయాదులు అంతర్యాగమనియు సమయాచార విధానము.

కౌలాచారము బహిర్యాగ క్రమమున పంచమ కారములతో పూజ, మదిరా, మాలిని, మాంసము, మత్స్యము ముద్రాదులు వీని అంతరార్థము సమయాచారమున వివరింపబడినవి (పీఠిక చూడదగును) అంతర్యాగక్రమమున బ్రహ్మనాడీ, సుషుమ్నానాడి, విశుద్ధాది మూలాధారాంత కమలములయందు ప్రదక్షిణ క్రమముగా గమనము గలిగి, మూలాధారమందు ఉనికి గల్గినది సర్పాకారమైన వక్రగతిని గలిగి యున్నందున కుండలినీ నామము గలది కుంభకమున బంధింపబడిన వాయువు, విజృంభించినపుడు కమలషట్క ఛేదనక్రియను, సహస్రార కర్ణికకు వేధ గలుగును చంద్రమండలమునుండి అమృతస్రావమై డెబ్బదిరెండువేల నాడీ సముదాయమునకు పోషణ గల్గించును అది కులామృతము కౌలుల అంతర్యాగము శ్రీచక్ర పూజావిధిని శివశక్తి కోణములు తొమ్మిదింటిని వ్యతిరేక విధిని పూజించుటయను సూచనయు గలదు

(అ) కులము సుషుమ్నా మార్గము విశ్రామ స్థానములు గ్రంథులు 'మూలాధారాదికంచక్రషట్కం కులమితి స్మృతం సహస్రారం నుంచి మూలాధారం వరకు, మూలాధారం నుండి సహస్రారంవరకు పయనించు శక్తి బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథులు విశ్రామ స్థానములుగా వెలుగుచుండును

(ఇ) పితృవంశము, మాతృవంశము, రూపశీల, విద్యా స్వభావములు గలిగిన సత్కుల జాత గురు సాంప్రదాయానుసారము వర్తించునదియనియును, ఉత్తమవంశ సంజాత కులీనుడు, సకల విద్యా పారంగతుడు, గుణశీలుని, శాస్త్రీయముగా వివాహమాడి స్థూలదేహము, బుద్ధ్యా, మనోవాక్కాయ కర్మల భర్తనే అనుసరించుచుండు ధ్యేయము గలది పతియే ప్రత్యక్షదైవముగా వ్యవహరించునది

(ఈ) 'కు' 'పృథ్వీ తత్త్వయత్రలీయతే' తత్కులం మూలాధారాంత స్థితాకులాంగనా అఖిల ముఖ్య ప్రాణ స్వరూపిణి, హంస స్వరూపిణి క్రమము వ్యవహరించునని అర్థము

(ఉ) కులమనగా ఇంద్రియ సమూహము అందు నివసించునది మాతృమేయమను మధ్యమ మానరూపిగానున్నది దేహ స్థితి ఇంద్రియాదులు ప్రమాణముగా గల్గియున్నది.

కామదాకామినీ కామ్యాకమనీయమ(ప్ర)భావిని* సుభావినీ
కస్తూరీ రసనీలాంగీ* కలంబలేశ్వర గామినీ(21) లిప్తాంగీ

14) ఓం కామదాయైనమః

భక్తుల కామము యన కోర్కెలను తీర్చునది భక్తుల వాంఛలను పరిపూర్ణము చేయునది భక్తులకుకామేశ్వర రూప సాక్షాత్కారము కలుగజేయునది లేక ఈశ్వరాభేద జ్ఞానము కల్గజేయునది మాయాసంబంధ రహితుడగు నిర్గుణ నిర్వికార సచ్చిదానంద పరబ్రహ్మము యొక్క సాన్నిహిత్యమును గల్గించునది కామేశ నిలయ దర్శనము గల్గించును (అ) ఇచ్చలు – లౌకిక పారమార్థికములు

ధన, సుఖ, దారాపుత్రాది ఐహికవాంఛలను, పారమార్థికములైన ఈశ్వర దర్శనము బ్రహ్మాత్మసిద్ధియు గల్గించునదియై యున్నది.

15) ఓం కామిన్యై నమః

కమనీయ రూపము గల్గియున్నది 'పరమానంద స్వరూపత్వేన పరమప్రేమాస్పదా' పరమానంద స్వరూపిణియై అమృత ప్రేమను పంచిపెట్టునది హృదయాకాశమునందు ఆ ఆనంద ఘన స్వరూపము లేనియెడల, యేప్రాణి ఉచ్ఛ్వాస నిశ్వాసములు చేయగలడు? ఆమె జీవన ప్రదాయిని మనసునకు సుఖమును గల్గించుమూర్తి. సర్వవ్యాపి విషయభూతి మాయావృతులైన జీవులకు, ధ్యానపూజాదులచే తృప్తినంది నిత్యానంద సుఖముల గల్గించుప్రాణదాయిని

(అ) 'క'కార రూపిణియై ప్రకాశించునది 'క'కార రూపం హిరణ్యగర్భ, జల, ఉత్తమాంగ సుఖాదులకు వర్తించును ప్రపంచ సృష్టి, స్థితి లయాదుల కర్తృత్వము జలముల నిడి పోషించు రూపమని అందరు జలములకు నీరము, గోరసము, పోషక ఓషధీ రసములనవచ్చును మనస్సు శిరస్థితము సచ్చిదానంద స్థితిని గల్గించునదియన, దేహబాహ్య సంపత్తులైన దారాసుత, ధనగృహాదుల సుఖము గల్గించునట్టిదియనియు అర్థము.

16) ఓం కామ్యాయై నమః

అందరిచే కోరబడునది త్రివర్గములు అనగా కామార్థ ధర్మములు కోరువారు అగ్నిహోత్ర కార్య, మంత్ర జప, సత్య వాక్పాలన, వేదాధ్యయనం, అతిథిపూజ, వైశ్వ దేవాది కర్మలచేయు, వారి కర్మలననుసరించ ఉచిత త్రివర్గ ఫలము నందుటకు పూజింపబడును ఐహిక పారలౌకిక నిఖాయిని ప్రశంసింపనగు దేవిరూపము

2) జ్ఞాన రూపిణిగా జ్ఞాన మార్గమున సభిన్నప్రాప్తి నొందువారికి మోక్షము నొసంగునట్టి పరమేశ్వరి

3) సృష్ట్యాదిని పరమేశ్వరుని సృష్టిక్రియ కున్ముఖుని చేసిన ప్రథమ సంకల్ప రూపము ఈమెయే

4) అధమకామ్యం తత్కాల సుఖం, వర్తమానదుఃఖ నివృత్తి, సుఖ సంప్రాప్తికారకమువైనది మధ్యమకామ్యం ఆమరణాంత దుఃఖనివృత్తి, సుఖ సంప్రాప్తి అర్థసంజ్ఞ గలిగినట్టిది ఉత్తమ కామ్యం నిత్య నిరతిశయానందములు మోక్షసంజ్ఞకం నిరపేక్షకామము కావున 'కామదా, కామినీ, కామ్యా, కాంతా, కామాంగదాయినీ, కామాంగనాశినీ' అను వివిధ రూపముల పేర్కొనబడుచున్నది

17) ఓం కమనీయ స్వభావిన్యై నమః (సుభావిన్యై నమః)

కమనీయమగు వర్తన కలిగినట్టిదని కమనీయా సుభావిని అందరియెడల సమాన భావము వ్యక్తము చేయుచు, వైరిజనమైనను క్షమాగుణము చూపి, సకల జీవుల వాంఛల నొసగుచు మృదుస్వభావము గలిగియున్నట్టిదని ఎవరు యే సంకల్పమున నర్చించిన నాయా సంకల్ప వాంఛల నొసగు స్వభావము గలది స్వభావానికి బదులు సుభావిని అనురూపము క్షేమము గోరునది అని భావింపనగును 'కుపుత్రోజాయేత క్వచిదపికుమాతాన భవతి' అని ఆదిశంకరులన్నట్లుగా ఆమె అందరియెడల సమాన క్షమాగుణము, వర్తన స్వభావము గల్గినట్టిది భక్తులకు సామ్యరూపయునగును

18) ఓం కస్తూరీ రస లిప్తాంగ్యై నమః ((లిప్తాంగ్యై) అను మారు పాఠము )

కస్తూరీ గోరోచనాదులు దివ్యగంధములు. పరిమళ సుగంధ ద్రవ్యాదులలో కస్తూరీ రసము ఉపచార విధిని శరీరములకు అలదుట. అట్టి కస్తూరీ రసమలదిన శరీరము గలదియని విశేషము కస్తూరీ తిలకాంచితాయని కస్తూరీ తిలకము లలాటదేశమున బిందు వాకారముగా నలంకరింతురు మృగ మదమని కస్తూరికి పేరు. కస్తూరీ మృగనాభి లభ్యరసము దానిని ఉపచార విధులలో అలంకారముగా లలాటమున చేర్తురు దేహమునకు గూడయలదినచో సుగంధము, మంచివాసన కలుగునన అంగములకు పూయబడగా లిప్తాంగి యనిరి (లేపనముగల అంగి) లిలాంగి యను

మారుపాకము కస్తూరీ రసము అంగముల శోభిల్లుటచే శిలాంగి, కృష్ణాంగి భాసిల్లుచున్నదనియు గ్రహింపదగును

19) ఓం కుంజరేశ్వరగామిన్యై నమః

మత్త గజము వంటి నడక గల్గినట్టిది దేవి కుంజరేశ్వరుడనగా గజరాజు వెనుక గజగామినులు నడువగా ఠీవిగా మందగమనమున తన సింహాసనమునకు నడచు దేవేరిగ భాసిల్లుచున్నది గమనములో వివిధ రకములు మరాళ గమన వయ్యారముగా నడచుట కుంజరేశ్వర గమనాయనగా దర్పమున నెమ్మది యడుగుల సాగుట

కకారవర్ణ సర్వాంగీ కామినీ కామసుందరీ
కామార్తా కామరూపార్చా కామధేనుః కలావతీ (22)

20) ఓం క కార వర్ణ సర్వాంగ్యై నమః

'క' కార వర్ణము సర్వాంగముగా గల్గినది లలితాత్రిశతి ప్రథమ శ్లోకము 'క' కార రూపాకల్యాణీ, కల్యాణ గుణశాలినీ, కల్యాణ శైల నిలయా కమనీయా, కలావతీ యని కకారాది నామముల సంబోధింపబడినది. శంకర భాష్యములో 'క' కార వర్ణరూపం వ్యాపక విశేషము గల్గినది 'కా'ది విద్యా విగ్రహము అని, 'క' కారం అనగా హిరణ్యగర్భ, ఉదకం, ఉత్తమాంగం, సుఖాదులు దహరకాశ సుఖస్వరూపము, పరమ ప్రేమాస్పద భావము, 'క' కార మందత్యంత అభిలాష, ప్రీతి గలిగినది 'క' కారమే సర్వాంగముగా గలది హిరణ్యగర్భరూపం - జగద్ధారక, జగత్ కర్తృత్వాది గుణములు వ్యంజనముల ఆదివర్ణంగాను, ఉదకమ్న జగత్ సంజీవన హేతు, విద్యాబీజవర్ణము, సర్వప్రాణులకు శిరస్థిత సహస్రార ఈశ్వర సాయుజ్యం కుండలినీ మార్గమునవే గనుక శివభావము గల్గించునది 'కంబ్రహ్మ, ఖంబ్రహ్మ' దహరాకాశ యాత్రను ఆదిమవర్ణము

21) ఓం కామిన్యై నమః

మనోహర రూపభావములు గలిగినట్టిది యనుభావము పదునేనవ నామమే పునరుక్తి. కామినియన కమనీయ రూపము, మనసు గల్గినట్టిదని 'కామ్యా కామ్య కలాశేష కామ్యేచ్ఛాత్మ సుందరీ' యని సకల జన మనముల నాకర్షించునది

22 ఓం కామసుందర్యై నమః

కామేశ్వరుని సుందరి యనగా భార్య. శివ సమిష్టి స్వరూపమే పరమేశ్వరుడు కామేశ్వరీ కామేశ్వరులు సృష్టియందలి స్త్రీ పురుష ప్రకృతికి ప్రతీక. కామేశ్వరుని ముఖ్యపాలికయైన సుషుమ్నా నాడి స్వరూపమున నున్నది అష్టమావరణ పూజావిధిని నవయోని చక్రాత్మక తత్త్వసృష్టి కృత్య ఇచ్ఛాశక్తి వాగ్భవాత్మక వాగీశ్వరీ స్వరూప కామేశ్వరీ దేవి బ్రహ్మాత్మ శక్తి, ఆయుధ, పాశ, అంకుశ, అభయ కపాల వరాంకిత చతుర్భుజ, చంద్రకలావతంస త్రినేత్రగా ధ్యానింపుదురు

23) కామార్తాయై నమః

కామేశ్వరుని సంగము తీవ్ర లాలస గలిగినది. స్వామియైన కామేశ్వరుని నిత్యసన్నిధానము వాంఛించునది 'కామేశ్వర పర్యంకోత్సంగ గతాయా' అని ఉపచార విధానమున స్వామితో దేవేరిని చేర్చుచుందురు నిత్యక్రీడ అభిన్నాంగములునై అర్ధశరీరులునై తీవ్రాసక్తి గల్గిన రూపము శివవామాంక నిలయాం శివకామేశ్వరీం అని అంట యుగళ మూర్తినే మనసున తలంచి కొలుచుచుందురు

24) ఓం కామరూపాయై నమః

ఇచ్ఛవచ్చిన రూపు ధరించి యుండునది కాముడు అనగా ఈశ్వరుడు. ఆ కామేశ్వర స్వరూపము గల్గినది 'సోఽకామయత బహుస్యాం ప్రజాయా' ఇతిస్థావర జంగమ, జడ, చేతనాదుల యందు

అంశరూపిణియై ఆయా రూపముల జగత్తు సృష్టి పాలన చేయు మాయాస్వరూపిణి కామేశ్వరుని సంకల్పమున ప్రపంచ నిర్మాణేచ్ఛతో ఆవిర్భవించిన ఇచ్ఛాశక్తి స్వరూపిణి. అనేక రూపముల నావిర్భవించి దనుజపాలన శిష్టపోషణచేయు పరాశక్తియునగును ఐచ్ఛిక (ఇచ్ఛ వచ్చిన) రూపు ధరించుటయే కామరూప శక్తి (అ) కామరూపదేశ పాలనశక్తియును నైనదేవి (శక్తిపీఠం)

25) ఓం కామధేనవే నమః

కామధేను స్వరూపిణియైనదేవి కామధేనువు స్వర్గవాసియై సమస్త వాంఛల నిడుగోరూపము సురభి, కామధేను, కామదుఘం సేవించిన వారికి కోర్కెల నొసంగునది ఆ సంతతియైన నందినీ ధేనువును సేవించ దిలీపుడు సంతతి నంద గలిగెను (రఘువంశం) గోవు మాతగానే నేటికిని పూజ్యారాలు దేవలోక మందుండు ధేనువు విశేషముగా భక్తుల కోర్కెలు తీర్చునదియై యున్నది మానవుని పోషణకై క్షీరము దానినుండి దధినవనీతాదుల నొసంగి పంచామృతముల పునీతుల చేయుచుండునుగదా

26) ఓం కళావత్యై నమః

కళను నిత్యము ధరించి యుండునది ఆ కళ 'సాదాఖ్య' కళ 'కళాశిరః పాంచ్యాద్యవయవా', చతుష్షష్టి కళా విద్యారూపా, చంద్ర కళావా వీనిని ఇచ్ఛమేర భక్తజనులు ధ్యాన సాధనచేసి తరింతురు మాతృకయందలి యేబది యక్షరములు దేవతా స్వరూపములు పూర్ణగాయత్రీ, శ్రీ విద్యా పంచదశీ విద్యా షోడశాక్షరీ విద్యా, వృద్ధి క్షయరహితముగు 'ఏకాక్షరీ' కామకళారూపిణి, షోడశీలను శిరోభూషణముగా ధరించినదని భావము పూజా విధానమున అక్షర న్యాసము అగ్ని, ఇందు, సూర్య, బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివ కళలను న్యాసము చేయుచుందురు శిరోది పాదాంతము, పాదాది శిరోంతము న్యాసము చేతురు అట్లే నివృత్తి, ప్రతిష్ఠ, విద్యా, శాంతి, శాంత్యాతీతాది నిత్యకళలు సాయుజ్యనీను మంత్రాధిష్ఠాన దేవత (అ) సకల కళలకు నిలయము కళలయందు ప్రవీణురాలు నేర్పరియుని, చతుష్షష్టి కళలలో సంగీత సాహిత్య, నృత్య, వీణా వాదనాది కళలు కలిగి వాక్చరుతచే జనమనాకర్షణ చేయగలట్టి ప్రతిభగల పరమేశ్వరి

కాంతా కామస్వరూపాచ కామాఖ్యా కులపాలినీ కామినీ

కులీనా కులవత్యాంబా దుర్గా దుర్గార్తినాశినీ(23)

27) ఓం కాంతాయై నమః

కాంతివంతమైన, ప్రకాశమాన శరీరము గల్గినదేవి మనోహరమైన శరీరము స్వరూపము గలదనిగాని, బ్రహ్మవస్థయే సిద్ధాంతముగాగలదనిగాని భావము 'అభిరూపతమం దేవం వహన్ కాంతః' చక్కనైన పరమ మనోహర స్వరూపముగలది కామేశ్వరుని పత్నిగా సకల స్త్రీజాతి స్వరూపముగా గలది అ) 'కం' అనగా బ్రహ్మ అంతః స్వరితంయన సమాప్తి కాలము ద్వితీయ పదార్థాంతమున బ్రహ్మ అంతఃస్వరితం యన సమాప్తి కాలము ద్వితీయ పదార్థాంతమున బ్రహ్మ కంతము కల్గించు కాలాధిష్ఠాన రూపిణి. (ఇ) కాంతయుతురై యుండు శక్తి 'కాంతా' అనగా నిత్యపరమేశ్వర సంగతిని చంద్రకోటి ప్రకాశ సమమై విభవమందు దేవి

28) ఓం కామస్వరూపాయై నమః

కామేశ్వరుని మోహింపచేయు స్వరూపము గల్గినదేవి జననీ జనకులైన కామేశ్వర కామేశ్వరీ దేవులు అభిన్నాంగములు అర్థనారీశ్వర తత్త్వమున కామేశ్వరుని మోహన స్వరూపమే తనదిగాయైనట్టి కామ స్వరూపిణి దేవి 'పురుషులందరు ఈశ్వరాంశ సంభూతులు స్త్రియస్సమస్తా తవదేవి భేదా', సకల దేవతలు అర్ధాంగులైన వాణి, లక్ష్మిగౌరి, శచి, శక్తి మొదలుగాగల స్త్రీస్వరూపములన్నియు దేవి అంశాలే శుంభనిశుంభాసుర సంగ్రామమున అష్టవిభూతులు సృజించి మరల తనలోనే లీనము చేసికొని తానొక్కతెయేయని చాటిన కామస్వరూపిణి.

29) ఓం కామాఖ్యాయై నమః ( ఓం కామాఖ్యై నమః)

కామాఖ్య పదమున విఖ్యాతి చెందిన అంబయని యర్థము చతుష్షష్టి దేవి పీఠములయందు కామాఖ్యయొకటి అస్సాంలో గౌహతి సమీపమున ప్రసిద్ధిగాంచిన శక్తి క్షేత్రము నరకాసురుడు పాలించిన ప్రాగ్జ్యోతిషపురము రక్షణశక్తిగా వసిష్ఠాది మహాగణములచే సేవలందుకొను శక్తి కామాఖ్యాదేవి ఆ పీఠమున నెలకొనియుండి భక్త జన కామితములనిడు పరబ్రహ్మ స్వరూపిణి, భక్తపోషిణియైయున్నది

30) ఓం కుల పాలిన్యై నమః

కులమును పాలించునదియని అర్థము కుల శబ్దము వస్తు సమూహము నందు, జాతి యందు, వంశమందు, స్వభావమునందు వర్తించుచుండును అవిచ్ఛిన్న జీవ పరంపర, సంకల్పక్రియా శక్తి చొప్పున, కాలానుగుణముగ కొనసాగుచుండును కులము, ఆచారము, సంతతి క్రమాభివృద్ధి నందును జాతి, శీల స్వభావాదుల నియంత్రించుచు పాలించునది కుల సంరక్షణియైన పరమేశ్వరి

31) ఓం కులీనాయై నమః

ఉత్తమ సాంప్రదాయమందుద్భవించినది ఇంద్రియ సమూహమునందు లీనమై యుండునది కులోపచారముల అంతస్థయై యుండునది పరమశివలీనయై యొప్పారునది స్త్రీ జాతికి మానికమై ఆదర్శప్రాయముగు వర్తనగల మాతృరూపిణి

32) ఓం కులవత్యై నమః

కులమును పోషించునది అనుసరించునదియును, నిగూఢమైన దేహమందలి వివిధ చక్ర స్థానముల నాశ్రయమవుచును, అనుసంధానము చేయుచుకాలనియతి పోషించుచుండునది ఏయేశక్తియే బహిర్యాగ అంతర్యాగ క్రియలు, సంభారవము లావశ్యకమగునో వానికి తన వివిధ విభూతులతోడుపడుచు నిత్యపంచ యజ్ఞాదికముల పోషించునది

33) ఓం అంబాయై నమః

అంబ యనగా మాతృమూర్తియై యున్నదేవి పరమేశ్వరి మూలప్రకృతి స్వరూపిణి సత్వరజస్తమాది. త్రిగుణ స్వరూపమైనది 'యోగేశ్వరీ శరీరాణి కరోతి, వికరోతిచ' నానా కృతి క్రియారూపా నానా వృత్తి స్వలీలయా, త్రిధాయద్వర్తతే లోకే తస్మాత్త్రిగుణోచ్యతే–అని సృష్టి, స్థితి లయాదుల ఆచరణ క్రియయందు త్రివిధ విలాస భూతురాలు ఆమెయే పై చెప్పిన త్రిగుణ, త్రివిలాసాదుల కారణభూతురాలుగా పేర్కొననగును సకల జీవజంతు జాలములకు మాతృమూర్తి

34) ఓం దుర్గాయై నమః

దేహమనే దుర్గమందుండునది రక్షణ శ్రేణియుతముగా నెలకొను దేవి
అ) దుర్గుడనే రాక్షసుడు ఇంద్రాది దేవతల బాధించుచుండ వారి ప్రార్థనచే పరాశక్తి ఆదుర్గమాసురిని సంహరించి దుర్గాదేవిగా పేరొందినది ఆమెయే నవశక్తిరూపిణి నవదుర్గగా ప్రసిద్ధిగాంచినది
ఆ) కాశీక్షేత్రమున సుబాహుడను రాజాకు వరములొసగి భక్తప్రార్థనను మన్నించి 'దుర్గా' దేవిగా నెలకొని యున్నది ఇ) నవవర్షప్రాయముగల బాలికను 'దుర్గ'గా పూజోపచారాదుల అమ్మవారి స్వరూపమేనని తలంచి సేవించుచుందురు ఈ) దుర్గ శబ్దమునకు దైత్యుడు, విఘ్నము, సంసార బంధం, కుత్సితం, శోకము, దుఃఖము, నరకం, యమగండం, జన్మభయం, రోగములను అర్థములు గలవు వానిని పోగొట్టుశక్తి దుర్గ. ఉ) దుర్గ, దురాగములను నశింపచేయు అ కార హం త్రివాచకము చివరగా గలిగియున్నది ఊ) దుర్లభ, దుర్గమ, దుఃఖహంత్రి నవరూపములు శైలపుత్రి, బ్రహ్మచారిణి, చంద్రఘంట, కూష్మాండ, స్కందమాత, కాత్యాయని, కాళరాత్రి, మహాగౌరి, సిద్ధిదాయను నవదుర్గలు ఎ) ధీ బలాది, భయే దుర్గే, తారితా రిపు సంకటే, దేవశ్రాదయోయేన,

చేత దుర్గాప్రకీర్తితా రుద్రపుత్రుడగు దుర్గమాసురుని సంహరించి, దేవవర్గమును రక్షించిన దుర్గగా నెలకొని యున్నది
ఏ) దుర్గా, దుర్గతిహారిణీ, దుర్గేస్మృతాహరసిభీతి–భీమరథీ తీరమున సన్నుతి క్షేత్రదేవత ఆ పేరాలెని అంశ ఇంద్రకీలాద్రిపై శ్రీకనకదుర్గగా నెలకొనియున్నది

35) ఓం దుర్గార్తినాశిన్యై నమః

దుర్గము యొక్క బాధలను నాశనము చేయు పరమేశ్వరియై యున్నది దుర్గముయన నవరంధ్రాత్మక దేహమేయగును ఆయా అపాదిత క్రియల ప్రతిదినము నిర్వహించుచు దేహపారణకు తోడ్పడుచుండును. కాని రోగాదులచే నాటంకము కలిగినపుడు నివారణకు ఉపాసనామార్గమే
అ) దుర్గము యనగా కోట కోటను రక్షించుటకు నష్టదిక్కుల దిక్పాలకాది గణములు, శక్తిస్వరూపిణీలు కావలిగా యుందురు రాత్రివేళల కాళి నగరసంచారము చేసి దేవళమునకు తిరిగి రాగా కాళిదాస, రామలింగాదులు ఆమె వరప్రసాదముచే కవులైరి ఇ) ఈతిబాధలు, మహమ్మారి, దుర్గము అనగా గ్రామము, నివాసస్థానముల నావహించినపుడు వాని శాంతికై దుర్గాసప్తశతీ పాఠము, చండీహోమము ఉపాసనమున్నై వినియోగింతురు 'దుర్గేయీ స్మృతాహరసి భీతిమ శేషజంతో' 'రోగానశేషాన్ అపహంసి దుష్టాన్' అను మంత్ర జపమును చేయుదురు ఈ) 'ఇత్థం యదాబాధా దానవోత్థా భవిష్యతి' దానవులనుండి బాధలు దేవ దుర్గములను కలిగినపుడు, ఆమెయే దేవగణముల రక్షించి యథాస్థితి నెలకొల్పుచుండును దారిద్ర్య దుఃఖ భయకారిణీ కామిని ఆమెయే

కౌమారీ కులజా కృష్ణా కృష్ణదేహా కృశోదరీ
కృశాంగీ కులిశాంగీ చ క్రీంకారీ కమలా కలా(24)

36) ఓం కౌమార్యై నమః

కుమారీ రూపమున నున్న శక్తియని యర్థము స్కందునికి కుమారుడు కుమారస్వామి యని, స్కందశక్తికి కౌమారి యని దేవి అష్టవిభూతులలో నొకటిగా పూజింపబడుచున్నది అష్టశక్తులు బ్రాహ్మణీ, మహేశ్వరి, కౌమారీ, వైష్ణవి, వారాహి, మహేంద్రి, చాముండీ, మహాలక్ష్మి శక్తులు దుర్గాదేవియొక్క అష్టవిభూతులు. 'కౌమారీ శక్తిహస్తా చ మయూర వరవాహనా అంబికా గుహరూపిణీ' అని స్వరూప సంస్తుతి

37) ఓం కులజాయై నమః

కులీన వంశమందుద్భవించిన దేవి, కులాంగనయును, ఉన్నత వంశసదాచార యుత సర్వజగత్ కల్యాణకారి భావమున సకల సృష్టియందును సమానభావము ప్రేమగలిగి నియంత్రణ, పోషణ, లయకర్మల కాధారమైనట్టిది

38) ఓం కృష్ణాయై నమః

ముదురునీలవర్ణపు ఛాయగలిగిన మేను గలది నలుపురంగు దేహము గలది కృష్ణరూపి నారాయణుని సహోదరి మహామాయ, కృష్ణాయని స్త్రీ శక్తిగా విఖ్యాతి గాంచినది కృష్ణాయని ద్రౌపదికి కూడా పేరు గలదు మహామాయ కంసునిచేత చంపబడకుండా ఆకాశమున కెగసి అపై ద్రౌపదిగా పాంచాలిగా యజ్ఞకుండోద్భవమైనది కర్షయతి మనః జనమనసములను తన స్వాధీనము చేసికొనునది మోహన శక్తి అన్ని వర్ణములు ఆయా దేవతల సాముదాయక శక్తి

39) ఓం కృష్ణదేహాయై నమః

కృష్ణవర్ణదేహము గలిగియున్నదేవి దేవతలు హిమాచలము చేరి హిమవతిని ప్రార్థించగా నామె ప్రత్యక్షమాయెను. ఆమె నుండి కౌశికీశక్తి కాళిక ఉద్భవించినది తస్యాం వినిర్గతాయాంతు కృష్ణాభూత్సాపి పార్వతీ, కాళికేతి సమాఖ్యాతా హిమాచల కృతాశ్రయా' కృష్ణవర్ణం శ్యామవర్ణమందురు

ఆమెను సరస్వతిగా సాయం సంధ్యోపాసన యందిట్లు పేర్కొందురు 'ధ్యాయేచ్చాత్రి సరస్వతీ భగవతీ పీతాంబరాలంకృతా శ్యామా తామస రూపిణీ పరిణమిత్ గాత్రాన్వితా వైష్ణవీ' ఆమెయే విష్ణుమాయాశక్తి. సకల జనసమ్మోహన కారిణి వశీకరణాలయాది శక్తుల కృష్ణవర్ణ వ్యాప్త విశ్వదేహియైనది

40) ఓం కృశోదర్యై నమః

క్షీణించిన నడుము(ఉదరము గలది), సన్నని నడుము, హరిమధ్య సింహమున కుండునట్టి క్షీణించిన నడుము గలది స్త్రీల లావణ్యమునకదియొక నిదర్శనము సౌందర్యలహరియందు కుచభారనమ్రా, ఊర్ధ్వశరీరము, నితంబభారము నుండి వేరుపడకుండ త్రివళీలతలతో కట్టివైచినట్లున్నదియని వర్ణించబడినది గగనం, శూన్యం అని దృశ్యమానము గానట్టి నడుము గలదని అభివర్ణించిరి

41) ఓం కృశాంగ్యై నమః

కృశించిన అంగములు గలదేవి పృథుల శరీరిగాక లతవోలె సన్ననిమేను అమరిక గలిగి మోహింపజేయు శక్తి గలిగియున్నది పరమశివుని పొందుటకొర్తై చెంది విరహాగ్నియందు వ్రేల్చిన శరీరాంగములచే కృశించిన దేహము కల్గినట్టిది 3) దేహమును తపింపజేయుటచే, కృష్ణాంగినుండి గౌరాంగియగుటకు చేసిన తపఃఫలితముగా కృశాంగియైనది నిత్యపరమ శివపర్యంకస్థగా భాసిల్లు వేదనారూపిణి, యోగిని, సూక్ష్మసూక్ష్మతరా, స్థూలీ, కృశా అన్ని రూపములామెయే

42) ఓం కులిశాంగ్యై నమః

కులిశాయుధము చేత ధరించిన శక్తిరూపిణి. వజ్రము వంటి దృఢమైన శక్తి బలసంపద గలిగిన శరీరము గలది 2) వజ్రమింద్రం స్వముత్పాద్య కులిశాదమరాధిపః-అని దేవి చండి ఉపచారములతో కులిశాయుధ అలంకరణము జరుగును అట్టి ఆయుధము శరీరాంగమైన హస్తమున విరాజిల్లగా కులిశాంగియైనది కులిశము ఇంద్రుని ఆయుధము ఆ ఆయుధము సర్వదేవతల శస్త్రాస్త్రములతో పాటు దేవికిడినట్లు గలదు కులిశము అనగా వజ్రాయుధము ఇంద్రుని శక్తి రూపము దేవి యొక్క విభూతి వజ్రిణి వజ్రహస్తా తథా చైంద్రియనబడు ఇంద్రాణి

43) ఓం క్రీంకార్యై నమః

'క్రీం' అను బీజాక్షరము మాలారూపమైయున్నది సరస్వతీ మంత్రము కాళీ బీజాక్షరము క్రీం-కారము ఇది కుంతీ, రపల్ల, జిహ్వా రసనలకు సూచితము క్రీం-కారం మహాకాళి అధిదేవత, మహా మాయారూపము దారిద్ర్య, దుఃఖ భయనాశనకరమైన బీజము. క-బ్రహ్మ, ర-అగ్ని, ఈశ, ఈ-మహాలక్ష్మి మాయా విష్ణుబీజముల సమగ్ర రూపం పూర్ణయుతం క్రీంకారం త్రిగుణాత్మకం త్రిమూర్త్యాత్మకం త్రివిధఫలప్రదాతయును.

44) ఓం కమలాయై నమః

లక్ష్మీరూపమున నొప్పారు శక్తి, కమలమందు వాసిల్లు పరమేశ్వరీ రూపము కమల ఐహిక, ఆముష్మిక సంపదలను ప్రసాదించు దేవి ఆమె క్రీగంటి చూపుతోనే మహదైశ్వర్యము, ఇహలోక సంపద, బ్రహ్మజ్ఞానము రూపమైన ఆముష్మిక సంపద నందీయును 'కమలే కమలాలయే, కమలాయతాక్షి విశ్వప్రియే విష్ణుమనోనుకూలే' 'పద్మాసనే పద్మ ఊరు పద్మాక్షి పద్మసంభవే' అను పదములును విశేషములు. కమలమునందు నివసించు కమలాక్షి ఆమెయే కమలాక్షుడైన విష్ణువు వల్లభత్వము నందు నామెయే.

45) ఓం కలాయై నమః

కలారూపమున నెలకొనియున్న దేవి

1) కళ/కల యనగా శిరస్సు, చేతులు, పాదాద్యవయవములు, అంగములు, అక్షరన్యాసము చేయుటచే అక్షరాధిష్ఠిత దేవతాశక్తి, ప్రభాప్రతిష్ఠితమగుచుండును
2) అరువది నాలుగు కళలు అనే విద్యారూపములు ఆమెయే యైయున్నది.

3) అధవాయోగులు తమ సమాధిస్థితియందు దర్శించునట్టి చంద్రకళలు
4) శ్రీచక్ర పూజయందునను, వహ్నికళలు 10, సూర్యకళలు 12, సోమకళలు-16=38, బ్రహ్మకళలు 10, విష్ణుకళలు 10, రుద్రకళలు 10, వసుకళలు 8, సదాశివకళలు 16, సాముదాయక పంచభూతాత్మికములు కలిసి 10, మొత్తము అరువదినాలుగు అగును
5) కలాకాష్ఠానిమేషరూపములైన కాలపరిగణనలో అతిసూక్ష్మరూపమైన కల అమేయ
6) కళలు షణ్ణవతియని అనగా 96 కళలు అను మరియొక వివరణ గలదు వహ్ని సూర్యసోమకళలు 38, బ్రహ్మ, విష్ణు, రుద్ర, వసు, సదాశివ కళలు=54, వీనికి బిందు, త్రికోణ, వసుకోణ, షోడశ కళలు నాలుగు చేరగా 96 అగును
7) అరువదినాలుగు విద్యలు కళారూపముగా నెలకొనియున్న పూర్ణరూపము
8) మాతృకయందలి యేబది వర్ణములు దేవతాస్వరూపములు వీనికి తోడు పూర్ణగాయత్రి, శ్రీవిద్యా, పంచదశీ, షోడశాక్షరీ స్వరూప, వృద్ధిక్షయరహిత ఏకాక్షరీ విద్యారూపము. కామకళాస్వరూపిణీ షోడశాక్షరీ మొదలగునవి శిరోభూషణములుగా నున్న దేవి

కరాలాస్యా కరాలీ చ కులకాంతాఽపరాజితా,
ఉగ్రా చోగ్రప్రభా దీప్తా విప్రచిత్తా మహాననా* (26) ఇలా

46) ఓం కరాలాస్యాయై నమః

నల్లని కాటుక వంటి తీక్షణమైన ముఖము గలది కాళీ కరాళ వదనా వినిష్క్రాంతాఽసి పాశినీ విచిత్ర ఖట్వాంగధరా నరమాలా విభూషితా-అని సప్తశతీమంత్రం మధ్యమచరితమున మహిషాసురాది వధార్థమై రౌద్రి రూపమున నుద్భవించిన శక్తి కోపావేశమున మోహముకంది నల్లనైన ముఖమున ప్రత్యక్షమైనది 'కోపేన చాస్యావదనం మషీవర్ణమభూత్తదా' వికృత భయంకరమైన ముఖము గలది రక్తబీజ సంహారమున భూమినపడిన రక్తబిందువుల సంఖ్యలో తత్తుల్య రాక్షసులుద్భవించు చున్నందున ఆ రక్తబిందువుల నిరోధించుటకు అంబ కాళిని సంబోధించి 'విస్తీర్ణం వదనం కురు' అంత లలితాహ్వానుచాపి రక్తబిందువుల నంతరింపజేసిన కాళీ రౌద్ర రూపము మృత్యుగహ్వరమన నొప్పు ముఖము విశదమగును

47) ఓం కరాల్యై నమః

భయంకర రూపము గలిగియున్న దేవి శత్రుసంహార వేళలలో రాక్షసగణ సర్వనాశమునకు ఫూత్కారముల, హుంకారముల, పాదోద్ఘట్టనల, అస్త్రశస్త్ర విన్యాసముల, ననేక విధగతుల మృత్యురూపియై ప్రళయతాండవమే యన యుద్ధభూమి యందునను నటులే శ్మశాన వాటికయందును స్వేచ్ఛగా విహరించు శక్తి, సృష్టి, స్థితిలయాదులలో నంతిమ కాలప్రభావరూపము

48) ఓం కులకాంతాయై నమః

కులసాంప్రదాయముల ప్రకాశింపజేయునది కాంతయన మనోహరరూపము గలది. బ్రహ్మనిష్ఠయే సిద్ధాంతముగా గలది కులమును పాలించుచు తదుద్ధారమునకు దోహదకారియగునది కులమనగా ఉన్నత జన్మ ఆచారము, వస్తు సమూహము, జాతి స్వభావమునకు వర్తించును అట్లే కులమనగా ఇంద్రియ సమూహము. కుండలిన్యాది మూలాధారస్థితమునై జీవ వర్తనము ప్రకాశింపజేయునది. సర్వకులాంతస్థయై భాసిల్లు ప్రాణస్వరూపిణి పరమేశ్వరి

49) ఓం అపరాజితాయై నమః

పరాజయము నెరుగని ఉత్తమశక్తి రూపము అపరా, అజితా సమముగా నెవ్వరులేనట్టి, ఎవ్వరి చేతను పరాజయమునొందని శక్తియని భావము కాళీ మాతృకా శక్తులలో కకారాది పంచకమున నారాయణీ, మాహేశీ, చాముండా, కౌమారీ, పంచమాచ అపరాజితయని పేర్కొనబడినది. దేవి

నవరాత్రులలో విజయదశమినాడు అపరాజితగా గూడ పూజలందుకొనుచున్నది జయా, విజయా, జయంతీ, అజితాయై, అపరాజితయాయై క్రమమున (సంగమాయై, రంభాయై) సప్తశక్తి పూజయందును పేర్కొనబడిది. షోడశ కుమారికలలో పేర్కొనబడినది సర్వదేవ శరీరములనుండి ఏర్పడిన సాముదాయక శక్తి గౌరీ దుర్గమాసురుని జయించి అపరాజితయైనది

60) ఓం ఉగ్రాయై నమః

మహోగ్రరూపము దాల్చినట్టి దేవి ఉగ్ర యన సర్వసంహార సమర్థ అఖండాకార వృత్యారూఢస్య అవిద్యా తత్కార్య నివర్తక ఏషఘోగ్ర ఏషవీరః యని ఉగ్రరూపము అవిద్యా తత్కార్య నివర్తకము నిరోధకమునై యున్నది 'దేవీ శరీరాత్తు వినిష్క్రాంతాఽతి భీషణా చండికా శక్తిరత్యుగ్రా శివా శత నినాదినీ' అని భీషణ ఉగ్రరూపమున చండికా, శివా శత నినాదినీ యను నామములతో పాటు కీర్తింప బడుచున్నది అటులే ఉగ్రద్వారాం చోగ్రమయీం అష్టాసుర నిబర్హిణీం– అనియు ప్రశంసింప బడినది

61) ఓం ఉగ్రప్రభాయై నమః

ఉగ్రస్వరూప ప్రజ్వలిత కాంతి గలది ఉగ్రతారాఖ్యక జటా, తారా నీల సరస్వతీ రూపముల ప్రజ్వరిల్లు కాంతితో మహోగ్రరూపమున శతృసంహారవేళల వెలుగొందు దివ్యమూర్తి సాధుజనుల రక్షణకై, (కవచరూపమున పరిరక్షించు తీవ్రకాంతి పుంజము )

2) అన్నాహుతికి ముందు సూర్యుడు మహోగ్రుడుగా నుండెను అప్పటి శక్తి ఉగ్రతార అన్నా భావమున ఉగ్రతార ప్రపంచ నాశనము చేయును అట్టిదా ఉగ్రభావ, ఉగ్రశక్తి మహాకాళీ, మహాప్రళయ అధిష్ఠాత్రి, ఉగ్రతార, సూర్యప్రళయాని కధిష్ఠాత్రి నాలుగు భుజములు సర్పముల చుట్టుకొనియున్న విశిష్టమైన మూర్తి శక్తి ఉగ్రతార

3) సూర్యుడే ఒక రుద్రుడు శ్వేత వరాహరూపమున ప్రాజాపత్య వాయువుచే కేంద్ర సంఘాతము జరిగి, అగ్ని పరమాణు సంఘము పిండరూపము ఏర్పడి ప్రజ్వలించినది. ఆ రుద్రాగ్నియే అన్నము కోరి యుండినది ఆ ప్రళయశక్తి ఉగ్రజ్వాల ఉగ్రప్రభ నామధేయముల విలసిల్లుచున్నది

62) ఓం దీప్తాయై నమః

దీప్తవంతమైనది తేజోవంతమైనదియును 1) సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్రాదులకు ఆధారభూతమైనట్టి తేజము గలది 2) త్రిగుణాత్మక నాదప్రకృతి 3 x 5=15, అష్టమూర్త్యాత్మక కకారము 8 x1= 8, దశమూర్త్యాత్మక రేఫ 10x 2=20, దశమూర్త్యాత్మక ఏకారము 10x 6=60; చతుర్దశాత్మక ఈకారము 14 x4=56, అష్టమూర్త్యాత్మక హకారము 8x 8= 64, షోడశాత్మక సకారము 16x 7=112, పృథ్వ్యాత్మక లకారము 10x 3 = 30

సంకలిత సంఖ్య మూడువందల అరువదియైదుగా పేర్కొనబడినది దేవీ నవావరణలనుండి తేజో కిరణములు, గ్రహాదుల దీప్తివంతము చేసి, కాలస్వరూపమైన సంవత్సరమునందలి అహోరాత్రము లుగా నేర్పడుచున్నవి దేవీ వర్ణనలలో తప్తకాంచన సంకాశం, హిరణ్యవర్ణాం, ఆదిత్యవర్ణే తపసోధిజాతా, జాతవేదస మొదలగు దీప్తిరూపములు దీప్తమైన కిరణములే కాక 'విద్యాసుశాస్త్రేషు వివేకదీపే షాద్యేషు' జ్ఞానదీప్తి గూడ విస్తృతమైనది శాంతిస్థాపనచే సుప్రభో ఽభూద్దివాకరః జజ్వలుశ్చాగ్నయః – యజ్ఞాది కర్మలను ప్రేరేపించునట్టి దీప్తాగ్ని స్వరూపము. స్త్రీల పాతివ్రత్య ప్రభావముచే దీప్తవంతమైన రూపంగలదిగాను, ప్రభుతాశక్తిగా సర్వలోక పాలన, పోషణ చేయు దీప్తి పట్ట మహిషియు నామెయే

63) ఓం విప్రప్రియాయై నమః

విప్రయన హితైషియగు చిత్తము గలది. విప్రప్రియా, విప్రరూపా అను నామములు లలితకు చెందినవి వేదసంపన్నులైన బ్రాహ్మణులు విప్రులు. మహాదేవికి ఇష్టులు. శ్రీదేవి బ్రాహ్మణరూపమే గలిగినది వారి చిత్తమే అమె చిత్తము 'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః సంస్కారైర్ద్విజ ఉచ్యతే,

విద్యయాయాతి విప్రత్వం, త్రిభిఃశ్రోత్రియ ఉచ్యతే' నిత్యవేదాధ్యయనాది యాగహోమముల లౌకికాగ్నితో బాటుగా, వాగ్రూప అగ్నితేజము మంత్రపఠనమున గలుగునది, స్తుతించి నిత్యస్తుతి గలిగింతురు గాన వారి చిత్తమే ఆమె చిత్తముగా సకల వాంఛల దీర్చి రక్షించునది యని అర్థము
2) వేదము పరమేశ్వరి ముఖోద్గతము అట్టి వేదములు వాగ్రూపమున ఘోషించు వేదవిదులు. పరమేశ్వరీ స్వరూపులే వారిని భూసురులు అనగా భూమిని కులపరంపర రక్షించువారుగా నెంతురు. ఆ బాధ్యత దేవి చిత్తమనియే యెంచవలెను 'అవిద్వాన్వా, సవిద్వాన్వా బ్రాహ్మణో మామకీతనుః' అని బ్రహ్మవైవర్తమున స్పష్టీకరింపబడినది
3) పురుష సూక్తమునందు బ్రాహ్మణోఽస్యముఖ మాసీత్, బాహూరాజన్యకృతః ఊరూతదస్య యద్వైశ్య పద్భ్యాగం శూద్రో అజాయత అనియు, వేదాహమేతం పురుషం మహాంతం, ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తమేవ విద్వానమృత ఇహభవతి, యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత తేనదేవా అయజంత సాధ్యా ఋషయశ్చయే తస్మాద్యజ్ఞాన్ సర్వహుతః, ఋచ సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే తస్మాత్, యజుస్తస్మా దజాయతః అట్టి యాజ్ఞిక గణము దేవి కార్యనియుక్త గణము, దేవి స్వరూపములుగా నెంచవలెను

54) ఓం మహాననాయై నమః

అతి గొప్పదైన ఆస్య వివరము గలది ఈ విశ్వమంతయుతన ఆస్య వివరముననొకపరి లోపలికి గొనుచు, నొకపరి వెలుపలికి గ్రక్కుచు క్రీడించు మహాకాళి స్వరూపిణి గ్రహనక్షత్ర మండలాల నెన్నిటినో స్తుతించి లయింపచేయగల మహాకాళ స్వరూపిణి. దీనినే నల్లని రంధ్ర వివరము (బ్లాక్‌హోల్), శూన్యావరణము, అలోకంబగు పెంజీకటి అని వివిధ రూపముల వర్ణింతురు
2) ఈ మహాననము రక్తబీజ వధ సందర్భమున దేవిచే ప్రేరేపింపబడి యనేకమంది రక్తబీజాలు ఉద్భవింప నన్ని ప్రదేశముల వారి రక్తబిందువులు భూమిని బడకుండ నాలుక జాచి మహోదరములో నిముడ్చుకున్న శక్తి ఆమెయే

55) ఓం మహాబలాయై నమః

మహిత బలముగల దేవి అతి శక్తివంతమైనది దేవతల, దానవుల నిర్జించగల అమోఘశక్తి గలిగియున్నట్టిది యనియు, సర్వదేవశరీరేభ్యోయావిర్భ్యంతా యని సర్వదేవతల తేజము, అవినాశి తేజ, శక్తిపుంజ భూతమైన మూర్తియననగును.
2) అర్థబలము, అంగబలము, బుద్ధిబలము, తపోబలము మున్నగునవి సర్వజీవసమిష్టిరూపిణి యగు పరమేశ్వరి యందేర్పడగ మహాబలాయని పిల్వబడుచున్నది.
3) మహచతుష్షష్టి యోగినీగణములాదిగా గలది దండనాయకి వారాహి దేవి నాయకత్వమున నవావరణ ప్రతి కక్ష యందు, ననేక విశ్వగోళముల ఫూత్కారముచే నశింపజేయ సామర్థ్యము గల యోగినీ గణావృతమై యున్న మూలశక్తి పరమేశ్వరి
4) చతురంగ సేనలు, పరాక్రమసామర్థ్యములు, దేవీభక్తులైన భుశుండాది వాయసములు గలది యని భావము యోగవాసిష్ఠమున వసిష్ఠునితో భుశుండి కాకము తన వృత్తాంతము చెప్పుచూ, శ్రీదేవి వరముచే జీవన్ముక్తియు దీర్ఘతల దర్శన శక్తియుగలిగినదని చెప్పెను భుశుండి దీర్ఘకాల దర్శిగా తులసీరామాయణమునను గలదు

నీలఘనా బలాకాచ మాత్రా ముద్రాపితాఽసితా
బ్రాహ్మీ నారాయణీ భద్రా సుభద్రా భక్తవత్సలా(26)

56) ఓం నీలఘనాయై నమః

నీలమేఘశరీరము గలిగినట్టిది కాళిక శరీరవర్ణము శ్యామల వర్ణము నీలమేఘవర్ణము నందురు గర్భస్థ పిండము అజ్ఞానముచే ఆవృతమై యుండును ఆవరించియున్న చీకటులే దట్టమైన నీల

వర్ణము, కాళీవర్ణము సర్వవర్ణమంత్ర, శక్త్యాదులు నీలవర్ణమునందే తమ ప్రత్యేకత కోల్పోయి లయమగు చుండును

57) ఓం బలాకాయై నమః

కొంగలపంక్తి రూపమున నెలకొన్న దేవి శీఘ్రువాయుగమనశక్తి గలిగిన పక్షి విశేషము భూమ్యాంతరిక్షాదుల సంచార సమర్థత గలిగియున్న దేవి
2) కాముకియైనదేవి భక్తుల మనోభీష్టములు తీర్చుటయను వ్యసనముగల దేవతాస్వరూపిణి

58) ఓం మాత్రాయై నమః

మాత్రారూపిణియగు అంబ, మాత్రా,మితాయను కాళీరూపములు షోడశస్వరన్యాసమున 'ఓం' 'అం' కారమున కగును 2) మాత్రయన రెండు చిటికెల కాలమై అట్టి కాలస్వరూపిణిగా యున్న పరమేశ్వరి 3) మాతృకావర్ణ సముదాయము రూపము. సర్వవర్ణశోభితయైన మాతృరూపమున నున్న పరమేశ్వరి. సర్వవర్ణాత్మికే, సర్వవర్ణస్వరూపిణియైనది. 4) మాత్రాకాలము శ్వాసకాలము ఎనిమిది నిమేషముల మానము ఇదియు కాలరూపమున నున్న దేవి కాలాత్మికయైనది

59) ఓం ముద్రాపితాయై నమః/ఓం ముద్రామితాయై నమః

వరాభయకరాది యుతమైన దేవి దేవి ఆవరణల పూజావిధానమున ప్రతి ఆవరణ పూజాంతమున కరన్యాసపూర్వక స్థిరభావ సూచియైనట్టి తీర్థానమును ముద్రయందురు చివరగా అన్ని ఆవరణల సాముదాయిక ముద్రా విన్యాసము బీజ,యోని భావమందు సమీకరింతురు ఆవాహనాది షోడశోపచారములకును వివిధ ముద్రలు గలవు శ్రీచక్రమందు సర్వసంక్షోభిణ్యాదిగా సర్వ త్రిఖండముద్రాంతము చూపుదురు కల్పముల బట్టి న్యాసవిధానముందును అట్లే ఆయుధము లకు, దేవతాసంబంధి ముద్రలు గలవు అర్చనయందు ముద్రాప్రదర్శన ముఖ్య భాగముగా నెలకొని యున్నది ఆయాముద్రా ప్రదర్శనము చేసి దేవీశక్తి నిరూపణము చేయుట ముద్రాపితము ముద్రల మూలమున అర్చతృప్తి గాంచుట ముద్రామితము ఏదైనను ఆయా అవస్థల అవసరముల ముద్రా ప్రదర్శనలు నిరూపింపబడు దేవి కళ్యాణమొసగును

60) ఓం అసితాయై నమః

నల్లనివర్ణము గలిగినట్టి దేవి, సితముగా నట్టిది, తెలుపుగా నట్టిది అసితము అసితాపాంగ యన కృష్ణవర్ణ అపాంగము ముఖము కలిగినట్టిది గౌరీ దేహమునుండి వెలువడి కాలరూపమున భైరవుని సహచరియైనది. అసితాంగ భైరవుని శక్తి అసితాంగి కాళికాదేవి యొక్క విభూతియు, అసితవర్ణం కాళవర్ణం అన్నివర్ణములు తనలోనిముడ్చుకున్నది కృష్ణవర్ణరూపి ప్రథమ గూఢ న్యాసీకరించి విశ్వాంతరాళమందలి అంధకారమును సూచించునది అబద్ధ-యద్ధమూర్తం తత్‌బద్ధ్యతే-అయంతు విపరీతః అగృహ్యోనహి గృహ్యతే, అశీర్యోనహిశీర్యతే, అసంగోనహి సంగతే, అసితో న వ్యథతే పరిష్యతి-ఇతి బాధల నివారించు శక్తి

61) ఓం బ్రాహ్మ్యై నమః

బ్రాహ్మణీ శక్తియై యున్నది బ్రాహ్మ్మి బ్రహ్మసంబంధమై అవ్యక్తాది రూపియైనది పరమేశ్వరి 'అహం బ్రహ్మస్వరూపిణీ మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్' 2) సత్యం చానృతంచ సత్యమభవత్-సత్యం స్థిరం అసత్యం నశ్వరము అంతయు బ్రహ్మశక్తియే. 3) యతోవా ఇమాని భూతాని జాయంతే యేనజాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసం విశంతి, తద్ విజిజ్ఞాస్వసత బ్రహ్మేతి-సృష్టిస్థితి లయ సంబంధ భూతజాలమంతయు బ్రహ్మమయమే యైయున్నది 4) హంసయుక్తవిమానాగ్రే సాక్ష సూత్ర కమండలం, ఆయాతు బ్రాహ్మణిశక్తి యని బ్రహ్మణి వర్ణన.

**62) ఓం నారాయణ్యై నమః**

నారులను జీవులకు అయనమైనది నారములన జలములు నిలయము నారాయణి 1) పరబ్రహ్మము జీవపరము సకల జీవులకు స్థానము పరమశివుడు, నారాయణుడు, అతని శక్తి నారాయణి 2) పద్మనాభుని సహోదరి నారాయణి నారాయణునితో గూడా ప్రభవించినది నారాయణియగు పరమేశ్వరి, మహామాయాస్వరూపిణి 3) నరుల సముదాయము నారులు అందు నివాసము గల నారాయణి 4) నరుడనగా పరమాత్మ అట్టి ఆత్మ వ్యాప్తమైన పంచభూతములు నారములు జగత్తంతయు వ్యాపించియున్న విరాట్ పురుషుడు, అతని శక్తినారాయణి 5) సర్వమంగళమాంగల్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యయంబకే దేవి నారాయణి, శరణాగతదీనార్త పరిత్రాణ పరాయణీ, సర్వస్యార్తి హరే దేవి అట్టి దేవి మహేశ్వరుని పత్ని జగన్మాతగా సనాతన రూపిణియై యున్నది 6) నారములనగా జలములు అందు నివసించునది నారాయణుడు ఆయన శక్తి నారాయణి 7) నారాయణి యన దుర్గ,లక్ష్మి, గంగయను అర్థములును గలవు 8) తథైవ వైష్ణవీ శక్తిర్గరుడోపరిసంస్థితా। శంఖచక్ర గదా శార్ఙ్గ ఖడ్గహస్తా భ్యుపాయయౌ యని వైష్ణవీశక్తి వర్ణన

**63) ఓం భద్రాయై నమః**

1) భద్రము, క్షేమము, మంగళమిడు మూర్తి క్షేమద మంగళకరమైన మూర్తి, 2) వీరభద్రుని సహచరీశక్తి భద్రకాళీ, భద్రాయనబడును 3) సహస్రారచక్రమున భద్రపీఠముపైన ఆసీనురాలైన దేవి భద్రా 4) భద్రా తిథిశుభకరి యగును (ద్వితీయ, సప్తమి ద్వాదశులు భద్రతిథులు) 5) భద్రం యనగా బ్రహ్మము ఆత్మయని తత్శక్తి భద్రాయగును

**64) ఓం సుభద్రాయై నమః**

మాయాస్వరూపిణి కృష్ణునితోబుట్టువు సుభద్రామూర్తియైన దేవి 1) కృష్ణునితోబుట్టువు సుభద్ర యోగమాయా స్వరూపిణియై యున్నది 2) సంక్షేమము నిడు శక్తి 3) పూర్ణరక్షణ గలిగిన భద్రపీఠస్థిత యైనది 4) జీవకళ్యాణము చేయునట్టి మాంగళ్య మూర్తియై యొప్పారును 5) సృష్టియందలి స్థూలదేహము విరాట్మూర్తి సూక్ష్మదేహ సమూహము హిరణ్యగర్భ, కారణదేహ సమూహము ఈశ్వరసంజ్ఞ గలది ఈ మూడును భద్రమూర్తులే.

**65) ఓం భక్తవత్సలాయై నమః**

భక్తుల యెడ ప్రేమ జూపునది భక్తి అంతరంగమందు ఈశ్వరచిత్త వృత్తిగలిగిన ముఖ్యభావన. బాహ్యమున ఇష్టదేవతా సేవ, భజనయు నామస్మరణాదులు ఆత్మనివేదనాది అష్టవిధ/నవవిధ/దశవిధ భక్తిమార్గములు గౌణములు అట్టి భక్తుల యెడ వాత్సల్యము చూపునది. 2) సామవేద మంత్రములకు భక్తులందురు ఆ సామగానమందు ప్రీతిగలదు 3) వేదపఠన శ్రుతి, స్మృతి విహిత కార్యాచరణ యెడల ప్రేమజూపునది. 4) ఆర్తజిజ్ఞాసు అర్థార్థి జ్ఞానియైన భక్తులపై అభిమత వాత్సల్యము జూపుచూ సౌభాగ్యములు చేకూర్చునట్టి ప్రేమామృతరూపి

**మాహేశ్వరీ చ చాముండా వారాహీ నారసింహికా**
**వజ్రాంగీ వజ్రకంకాళీ నృముండా స్రగ్విణీ శివా(27)**

**66) ఓం మాహేశ్వర్యై నమః**

మహేశ్వరుని శక్తిరూపమైనది ఆగ్నేయ దిశ రురుభైరవ సహచరి 1) మహత్‌యనగా బ్రహ్మము బ్రహ్మాండ నిర్మాణ, నిర్వహణ, నిర్మూలన సమర్థయైన ప్రభ్వి 2) మహేశ్వరుని శక్తి 'మాయాంతు ప్రకృతిం విద్యాత్, మాయినంతు మహేశ్వరం' అమెయే మంగళగౌరి, చండి 3) సర్వజ్ఞత, అనాదిబోధ, స్వతంత్రత, నిత్యత, సంపూర్ణత, అనంతత యను నారును అంగములుగా గలట్టి మహతి స్వరూపిణి 4) త్రిశూల చంద్రాహిధరే, మహావృషభవాహినీ మహేశ్వరి స్వరూపిణి

67) ఓం చాముండాయై నమః

దుర్గావిభూతులలో నొకటి చాముండా, ఉత్తరదిశ భీషణభైరవుని సహచరియైన చాముండాదేవి సకలలోక సంరక్షిణి కాళరాత్రి స్వరూపమే చండ ముండాసుర సంహారశక్తి, చాముండీ, చండీ, రక్తబీజ వధకై 'చాముండీ విస్తీర్ణం వదనం కురు' అని ఆదేశింపబడినది 2) దంష్ట్రా కరాళ వదనే శిరోమాల విభూషణే చాముండే ముండ మథనే నారాయణి నమోస్తుతే-చండికా శక్తి రత్నుగా అతి భీషణా, శివాశతనినాదినీ స్వరూపము గలది

68) ఓం వారాహ్యై నమః/వారాహిన్యై నమః

వారాహి రూపియైనది వైష్ణవీశక్తి, విష్ణు అవతారములలో వారాహరూపమొకటి 1) యజ్ఞ వారాహ మతులం రూపం యాశ్రిత్య హరే శక్తి యను విశేషగుణ శక్తి వారాహరూపిణి/క్రోడరూపిణి 2) ఉన్మత్తభైరవుని సహచరి శక్తిగా పశ్చిమదిశ నెలకొనియున్నది 3) గృహీతోగ్రమహాచక్రే దంష్ట్రో ధృత వసుంధరే వరాహరూపిణీ యని వర్ణన

69) ఓం నారసింహికాయై నమః/నారసింహ్యై నమః

నరసింహరూప పరమాత్మశక్తి. సింహము తల నరశరీరం హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని కాచి నట్టి నరసింహరూపియైన విష్ణు శక్తి. విష్ణుమూర్తి అవతారములలో ఆయారూపముల శక్తియు నుద్భవించి జగద్రక్షణ కార్యమునకు, భక్తపోషణకు నిదర్శనమైనది 2) నృసింహరూపిణోగ్రేణ హంతుందైత్యాన్ కృతోద్యమే, 'త్రైలోక్యత్రాణ సహితే నారాయణి" నారసింహి నృసింహస్యబిభ్రతీ సదృశంవపుః, ప్రాప్తాత్ర సటాక్షేప క్షిప్తనక్షత్రసంహతిః'-అని రూపము

70) ఓం వజ్రాంగ్యై నమః

వజ్రమం/యముగా గలిగినట్టిది వజ్రిణీ 1) వజ్రియన ఇంద్రుడు గాన వజ్రిణి యన ఇంద్రాణి 2) వజ్ర విభూషణములు గలిగినట్టిది యనియు 3) నవచక్రాత్మక పీఠమున త్రికోణపరిధి అధిష్ఠాత్రి దేవతలైన కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని యను పరమేశ్వరి విభూతులుగా నున్న రూపములు 4) వాగ్వై వజ్ర అనగా వాగీశ్వరీయును వజ్రేశ్వరియని 5) శుక్లపక్ష షష్ఠీతిథి వజ్రేశ్వరి అధిష్ఠాత్రిగా వెలుగుచుండును 6) ఇంద్రాణి కిరీటిని మహావజ్రే సహస్రనయనోజ్జ్వలే, వృత్రప్రాణహరే చైంద్రీ-యని వివరింపబడినది వజ్రహస్తా తథైవైంద్రీ గజరాజో పరిస్థితా, ప్రాప్తా సహస్రనయనా యథాశక్రస్తథైవచ-అని వర్ణన

71) ఓం వజ్రకంకాళ్యై నమః

వజ్రశరీరముగా నేర్పడియున్నది వజ్రము అభేద్యము మరొక వజ్రమే దానిని భేదింపగలదు అట్టి అత్యుత్తమ దృఢశరీరియై, అజేయముగా నిలబడియున్న శక్తి. 2) వజ్రాసురునిచంపి వాని శిరసును మాలలో చేర్చుకొనినది (వజ్రాంగుడని గలదు)

72) ఓం నృముండస్రగ్విణ్యై నమః

నరకపాలములు మాల్యగా ధరించినది ముండమాలాధరాం ముండమాలా విభూషితాం, శిరోమాలా విభూషణే అని వివరము మనిషి దేహమందలి శిరసు ప్రధానం అందు స్థిరమైనది. అస్థియుత కపాలము దేవికి అందరూ సమానమే అసురసంహారమైనను ఆమెలో ఆత్మ లీనమై పూతలందుకొనును వారి కపాలములను గూడ దేవి కంఠహారమున చేర్చుచుండును మరియొక విధిని ప్రళయాంతమున బ్రహ్మకపాలము చేర్చుచుండునని ముందు వచ్చినది

73) ఓం శివాయై నమః

శివుని ఇల్లాలు శివా, శివానియై యున్నది పరమేశ్వరుని శక్తి 1) చండికాశక్తి రత్నుగా శివా శతనినాదినీ యని మంగళప్రదమైనదని యందురు 2) కామేశ్వరీ కామేశ్వరులు అభిన్నాంగులైనందున శివ

శివారూపమున నుందురు 3) సర్వసంపదలను ఇచ్చు మాతృరూపిణియై భక్తుల శ్రేయస్సు వాంఛిం
నది యైన దేవి 4) ఉత్తమమైనట్టి బ్రహ్మసాయుజ్యము మోక్షము ప్రసాదించు అంబిక 5) సర్వ
మంగళ మాంగల్యా యని శుభములు కలిగించు శివాశక్తియనియు, 6) శివాయన ముక్తి స్వరూ
త్రిపుటి మధ్యమ పదము జ్ఞానము ఆమెయే ప్రజ్ఞానము 7) సర్వాశయము సర్వారిష్టశమనవ
సర్వ శోభనములను కూర్చునట్టిది 8) పావకస్యస్థితేయం, భాస్కరస్య దీధితిః చంద్రస్య చంద్రి
కేయం, శివస్యసహచారిణీ అని అర్ధనారీశ్వరరూపిణియై శివవామభాగినియైన దేవి 9) శివ కామేశ్వరాంక
గా శ్రీకలాయంత్ర చతుర్వృత్తరూపము బిందువు నాచ్ఛాదించిన సుందరిశక్తిని ఉపాసింతురు
సగుణోపాసనం సర్వం నిర్గుణాంశ్రయమేవచ. సగుణపూజయు నిర్గుణోపాసనయేనని యెరుగవలెను

**మాలినీ నరముండాలీ గలద్రక్త విభూషణా**
**రక్తచందన సిక్తాంగీ సింధూరారుణ మస్తకా(28)**

**74) ఓం మాలిన్యై నమః**

మాలిని, పోషణశక్తియు నైనదేవి 1) అకారాది హకారాంత పంచాశత్ మాతృకావర్ణ పంక్తిమాలాకారము
గా ధరించి యున్నందునను క్షకారము మేరువుగా గలిగినది 2) దివిజగంగ పరమేశ్వర జటాజూ
టనివాసినికి మాలినియను సంజ్ఞ కలదు అదియు పార్వతీదేవికి నామాంతరము వీరిరువు
రూపములు తానే అయియున్నందున మాలిని 3) మాలినీ తంత్రమొకటి ప్రత్యేకము శౌమ్యష్ట
తియందు ఏడు సంవత్సరముల కన్యమాలిని యని పూజలందుకొనును 4) ఛందోశాస్త్రమున మాలి
యను వృత్తముండును 5) నరముండముల మాలగా ధరించి యున్నందున మాలినీ యందురు
6) శుభమాలిని యని పరిపూర్ణత వీర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము అను ఆరు సంపద
కాధారభూతమైనది.

**75) ఓం నరముండాలిన్యై నమః**

నరముండముల సమూహము, మాలగా ధరించిన కపాలముల సమూహము వరుసలు గలిగిన
శక్తి. నరమాలా విభూషణా, కపాలినీ యలంకారము కలిగినది యగును

**76) ఓం గళద్రక్త విభూషణాయై నమః/గళద్రుధిర విభూషణాయై నమః**

1) గళద్రుధిరము రక్తము శరీరస్థ సప్తధాతువులలో నొకటి రుధిర ధాతువున కధిదేవత చాముండా
రుధిరము పుష్టికారిణి అనాహతస్థానాధిష్ఠిత అట్టి రుధిరమే విభూషణముగా గలిగియున్నట్టి
2) రక్తబీజ వధయందును, విస్తారితాననగా రాక్షసగణముల మ్రింగుశక్తిగను, గళభాగమున చిమ్మి
రుధిరము విభూషణములుగా గలిగినట్టి చాముండీ శక్తి 3)రక్తపానేచ్ఛగల శక్తిగా రుధిర విభూషి
తయైనది. అతి విస్తారితాననా, జిహ్వాలలన భీషణా నిమగ్నరక్తనయనా నాదా పూరితాదిఙ్ముఖ
యుద్ధరంగమున నలుదిక్కులా రక్తపుటేరులు ప్రవహించు సమయ వర్ణనము సాముయిక దృశ్యము

**77) ఓం రక్తచందన సిక్తాంగ్యై నమః**

రక్తచందనము లేపనము వంటికి పట్టించిన దేవి రూపము 1) రక్తచందనం ఎర్రచందనం. గంధమ
మేని లేపనముగా నలంకరించిన దేవి కుంకుమ పూరసముతో కూడి పరిమళయుతమగు మంచిగం
ధముచే అంగలేపనమున శోభిల్లుచున్న శరీరము గలది 2) నిత్యయౌవన మదశాలినీ యగుట
బ్రహ్మానందము నిండారి పూయబడిన చందన ద్రవ్యము మనము పులక లెత్తించుచున్నది (
చల్లదనమునకు రక్తచందనము వడలికి పట్టింతురు ఉగ్రావేశతప్త శరీరియైన దేవికి భ
సులభురాలగుటకు రక్తచందన లేపనమవశ్యము

**78) ఓం సింధూరారుణ మస్తకాయై నమః**

సింధూరము చేత నెర్రబడిన నుదురు గలది

1) స్త్రీలకు సింధూరము ముత్తయిదువ లక్షణమునకు నిదర్శనము బ్రహ్మరంధ్రము ఫాలమునకు మధ్య పాపిటను సింధూరముచే నలంకరింప నది మస్తకమున నిండుగా నొప్పారును 2) సింధూరారుణ విగ్రహాం, మృగపతి స్కంధస్థితాం, సింహ వాహినికి సింధూరముచే అరుణకాంతి నిండుగా యొప్పారు పవిత్రమూర్తిగా నెంతురు 3) సీమంత మందు సింధూరమును, లలాటమందు కస్తూరీ తిలకమును గలిగినమూర్తి పాపటయందు పగడ కాంతిని మించు సింధూరవర్ణ తిలకము నొప్పును

ఘోరరూపా ఘోరదంష్ట్రా ఘోరఘోరతరా శుభా
మహాదంష్ట్రా మహామాయా సుదతీ* యుగదంతురా(28) సుదంతీ

79) ఓం ఘోరరూపాయై నమః

ఘోర భయంకర రూపము కలిగినట్టిది 1) అఘోరభ్యోఽథఘోరేభ్యం, ఘోరఘోరతరేభ్య నమస్తేఽస్తు రుద్రరూపేభ్య, రుద్రాణియైన దేవి ఘోర, అఘోర, ఘోరతర రూపము కలిగియుండుట సహజమే గదా 2) అహాసాతిరుషా భీమం భైరవనాదినీ. కాళికరాలవక్త్రాంత దుర్దర్శ దశనోజ్జ్వలా ఘోరరూపే, మహారావే మొదలగు పదముల విక్రమించిన దేవేరి రూపముగా నగును జ్వాలాకరాల మత్యుగ్రం, క్రోధ రక్తేక్షణాహంతుం, తం మహాసురమ్, వీరికి తోడుగా ధనుర్జ్యాసింహ, ఘంట నాదముల భీషణము గొలుపు కాళినోరు విస్తరింపజేసి ఘోరరూపియైనది శూలనిపాతముచే ఘోరతరరూపమునై మహామృత్యువు సంహార రూపమును వెల్లడీకరించుచున్నది.

80) ఓం ఘోరదంష్ట్రాయై నమః

ఘోరమైన దంతములు, నఖములు గలది 1) దంష్ట్రాకరాళ వదనే, స్ఫురద్దర్శన దంష్ట్రాభా, సాభీమరూపా యని వర్ణన 2) వారాహి, నారసింహరూపదేవి విభూతులయందునను గాననగును దంష్ట్రలచే భూమినెత్తుట, గోళ్ళచే వక్షస్థలము చీల్చుట యందు కాననగును 3) చాముండియను దేవత వదనము నందు కోరదంతములచే నొప్పారుచున్నది దంష్ట్రకు విషాణము (కొమ్ము) దంతములు, కాలిచేతిగోళ్ళు, చీల్చుటకు గాయము చేయుటకు అవకాశము గలవి

81) ఓం ఘోరఘోరతరాయై నమః

ఘోరా,ఘోరతర యను పేరురూపములు 1) ఘోరరూపమంత్ర వివరణలో ఘోరఘోర తర పదరూపము విస్తృతమైనది ఘోరతమము అతిక్రూరమని భావము ఘోరముల, అత్యాచారములనణుచుటకు ఘోరతరరూపమావశ్యకము. మహిషాసురుడు గిట్టలతో నేలను తన్నుచు, గెంతుతూ కొమ్ము ఆయుధముతో రోషమున నలుదిక్కులకు నెగయుసమయమందు వానిని సంహరింప ఘోరతర రూపమే అవశ్యకమునై యున్నది అట్టి రూపము గలిగిన దేవి

82) ఓం శుభాయై నమః

శుభమును చేకూర్చు రూపము గలదియను భావము 1)త్రైలోక్యస్యహితార్థాయ, త్రైలోక్యమై చెందు రూపిణ్యై శుభాయై సతతం నమః కళ్యాణిరూపముగా, పరిత్రాయ పరాయణిగా మంగళమూర్తిగా జీవులకు సకలశుభములను గలిగించునది. వాంఛితార్థముల నొసగి కరుణ చూపు దేవి 2) ఆరోగ్యం, విద్య, సంతానం, కళ్యాణము మొదలైనవి శీఘ్రమే జరుగుటకు దేవిని ఉపాసింతురు. మోక్షార్థులకు మోక్షమును ప్రసాదించు మహా విద్యాస్వరూపిణి, సర్వమంగళ దాయిని

83) ఓం మహాదంష్ట్రాయై నమః

పెద్దకోరలు కలిగినట్టి శక్తిరూపిణి మహతి-పెద్దదైన, విశాలమైనటువంటి దృఢమైనటువంటి కోరలు కలిగినది వారాహి రూపము మహాదేవి విభూతులలో నొకటి అసురసూదన, దంష్ట్రాకరాళవదన యైనది. వారాహీ తుండఘాతేన కేచిచ్చూర్ణీకృతాఖిలి, తుండప్రహారవిధ్వస్తా, దంష్ట్రాగ్రక్షతవక్షసః వారాహి మూర్త్యాన్య పతం చక్రేణ చ విదారితా- భూమిని పైకెత్తునపుడు [illegible] దులతో మహాహవమునందున విక్రాంత మహిత దంష్ట్రలు గలది



84) ఓం మహామాయాయై నమః

మహామాయగా చెప్పొందుదేవి మహిత మాయాస్వరూపిణియైన దేవి 1) విష్ణువు తోబుట్టువు బ్రహ్మాదులకు కూడామోహము కలిగించు ఆదిశక్తి స్వరూపిణి 2) విపరీత భావము కలిగించునదియైన శక్తి సత్యమును ఆవరించి, అసద్రూపముగా వెలుగునది రజ్జుసర్పభ్రాంతి కలిగించునది 3) సత్యమునసత్యముగను, అసత్యము సత్యము గను భ్రమగొలుపునట్లు చేయునది మాయ మహామాయ యన దేవాదులను భేదించలేని మహాశక్తి 4) జ్ఞానినామపిచేతాంసి, బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి-జ్ఞానులు కూడా మోహమందునట్లు వ్యవహరింపజేయు శక్తియై యున్నది. 5) జ్ఞానయుక్తుడై మాతృగర్భమునుండి ప్రసూతివాయువుచే వెల్వడిన శిశువును, జ్ఞానరహితుని చేసి రోదింపజేయునది మహామాయా 6) మాయావినామపి మాయకారిత్వాత్ మహామాయా-మాయారూపులైన బ్రహ్మవిష్ణు, రుద్రులను కూడా మోహింపజేయుశక్తిమాయావు లకు మాయావి మహామాయ. ఎంతటి జ్ఞానియైనను యిష్టవస్తుదర్శన మాత్రముననే, చిత్త చాంచల్యము గలిగింపగలది మమమాయాదురత్యయా-అన అనుల్లంఘనీయము 7) స్థూల సూక్ష్మకారణ దేహ సమష్టియందు అవిద్యారూపిణి, కారణదేహ సమష్టియే మాయ సమిష్టికారణ దేహమున జ్ఞానాంశ మిక్కుటము ఇచ్ఛాక్రియలు అధికము మాయా అవిద్యలకు జ్ఞానమందలి హెచ్చుతగ్గులు మాత్రమే భేదము మహత్యన బ్రహ్మమునకన్న అతిశయమైనది సచ్చిదానంద బ్రహ్మరూపము 8) సర్వజగదుపాదాన నిమిత్తభూతాం సర్వాత్మకం సర్వపాలయిత్రు సర్వోపసంహారక మేకమద్వితీయ, నిష్క్రియమ్నిరవయవం శాంతం సర్వదోషరహితం, పరిపూర్ణ శివం, సర్వజ్ఞం సర్వశక్తి మహామాయాఖ్య బ్రహ్మేతి-అని వివరణము 9) యోగమాయా స్వరూపిణి నందగోపగృహమున జన్మించినది కాశ్మీరమున కంఠదేశ అంగము పడిన పీఠశక్తి. మహామాయగా పూజింపబడుచున్నది నేపాలులో జానువులు పడిన పీఠము రెండవది 10) మధుకైటభులను మోహింపజేసి విష్ణువెంత యని వరము కోరుకొమ్మనునట్లు పల్కించినదాయెను శుంభనిశుంభులను, చండముండా సురులను సంహరించినట్టి శక్తి ఆమెయే 'ఈషత్ సహాసముఖం' మహిషాసురాదుల ఖండించినది 11) బ్రహ్మచే మహావిద్యా, మహామాయా, మహామేధా మహాస్మృతిః మహామోహచ భవతీ మహాదేవి మహాసురీ-యని స్తుతింపబడినది 12) ఏషాసా వైష్ణవీమాయా మహాకాళీదురత్యయా। ఆరాధితా వశీకుర్యాత్ పూజకస్యాచరాచరం 'దుర్గయే వైష్ణవి', మాయాస్వరూపిణి 13) మాయాహ్యేషా మయాసృష్టా యన్మాం పశ్యసి నారద, సర్వభూత గుణైర్యుక్తం నైవం మాంజ్ఞాతు మర్హసి

85) ఓం సుదంత్యై నమః

మంచి పలువరుస కలిగిన దేవి చక్కని తెల్లనైన పలువరస కలిగినది సాముద్రిక శుభలక్షణములు గలది. దాడిమీ బీజసందోహ సందేహ దశనావళిం, రదనావళిం-తాంబూల భక్షణచే ఎర్రని కాంతి వెదజల్లు పలువరుస కలిగినట్లుగా కూడా వర్ణించబడినది

86) ఓం యుగదంతరాయై నమః(దంతురాయై)

ద్వంద్వముల కలుపు అంతరశక్తి 1) యుగశబ్దము రథము యొక్క కాడియందును, ద్వంద్వమునకు, కృతాదియుగమందును వర్తించును కావున పంచరూప రథ రక్షారూపమైన చీల (ఇరుసు) రూపమనియు కాడిమానినియు, శివశక్తిరూపద్వంద్వమననియు, అనేకకృతాదియుగముల రూపముగా కాలరూపియై యున్నదనియు, భావము విస్తరించును సహస్రకోటి యుగధారిణీ యను పదము దీనికి వివరణ యగును

సులోచనా విరూపాక్షీ విశాలాక్షీ త్రిలోచనా
శారదేందుప్రసన్నాస్యా స్ఫురత్స్మేరాంబుజేక్షణా(30)

87) ఓం సులోచనాయై నమః

మంచినేత్రములు/విశాలనేత్రములు గలది వికచ పంకజముల వంటి నేత్రములు గలది సుప్రసాదము నెలకొని భక్తుల క్షేమములు సహస్రాక్ష మితముగా గాంచునది సకలలోక కల్యాణకారియగు కరుణారస నేత్రయైనది శతాక్షిగా నన్నపానాదులనిడి, కాటకకాలమందు జీవుల పోషించినట్టి విభూతి ఆమెయే త్రికాలముల దర్శించనగు విశ్వనేత్రములు గలది. సాముద్రిక శాస్త్రసౌందర్య శుభలక్షణము ను యైనది

88) ఓం విరూపాక్ష్యై నమః

విశిష్టమైన నేత్రములు గలది విరూపము యనగా విశిష్టరూపముగల నేత్రములు గలది విరూపాక్షుడు యనగా ఫాలమందు మూడవనేత్రము గలవాడు తచ్ఛక్తి విరూపాక్షి. త్రినయనాం అని మూడు నేత్రములు గలదిగా వర్ణనము 2) విరూపము అనగా బేసిసంఖ్యగల నేత్రములు గలది 3) కాలజ్ఞానియై మూడులోకముల సమీక్షించు ముక్కంటి శక్తియామెయేయై యున్నది

89) ఓం విశాలాక్ష్యై నమః

విశాలమైన నేత్రములు గలది 1) అంబకు సూర్యచంద్రులే రెండు నేత్రములు మూడవది రుద్రాగ్ని సంచితమైనది ప్రళయకాలముల లయకారిణియై యున్నది పై నేత్రములు విశాలమై త్రిజగత్ వ్యాప్తములై యున్నందున నీపేరు కలిగినది 2) ఆమె జగత్తంతయు నొకమారు చూచుటకు విశాలమైన, విస్తరించబడిన నేత్రములతో విలసిల్లుచున్నది 3) ఉత్ఫుల్లపంకజనేత్రిగా సాముద్రికలక్షణము 4) ఆమెను శతాక్షి సహస్రాక్షిగా వర్ణించ నన్ని కనులను దృశ్యమునే పరిసంధించునని యర్థము 5) విశ్వనేత్రియన విశ్వాంతరాళ వ్యాప్త నేత్రం కలిగినదనియు వర్తించును

90) ఓం త్రిలోచనాయై నమః

త్రీణి-సోమసూర్యాఽగ్ని రూపాణి లోచనాని యస్య స త్రిలోచన మూడు నేత్రములు కలిగి యున్నదని యర్థము 1) తేజవంతములైన మూడు నేత్రములు గలది 2) కుడికన్ను సూర్యునిగను, ఎడమకన్ను చంద్రునిగాను, ఫాలనేత్రము సంధికాలముగను వివరింపబడినది 3) జ్ఞానాత్మనే నేత్రత్రయాయ వౌషట్-మూడవ కన్ను జ్ఞాననేత్రమని అందురు 4) భూతభవిష్యత్ వర్తమానములు మూడును వ్యావర్త నేత్రములుగా శోభిల్లుచున్నది విరాడ్రూప వర్ణనలో ప్రజ్ఞానఘనస్వరూపమునే త్రినయనములు తెలుపునని గలదు

91) ఓం శారదేందు ప్రసన్నాస్యాయై నమః

శరత్కాలచంద్రునివంటి ప్రసన్నమైన ముఖము గలిగినది

1) శరత్కాల పూర్ణిమచంద్రుని సమమైన సువృత్తముఖబింబముగా గలిగినట్టిది శరత్కాలమున చిత్తమునకు శారదేందుప్రసన్నత గల మనసుగా సూచితము 2) చంద్రుడు మనసున కధిదేవత ముఖము మనసునకు దర్పణము వంటిది ప్రసన్నచిత్త ముఖమండలమే పరమశివుని, పరమేశ్వరి నివాసస్థానము ఆహ్లాదజనకము నగును సచ్చిదానంద ప్రదాయకము 3) స్వరముల పదునారు అచ్చులు ముఖమండలమున న్యస్తములు గాన షోడశకళా పరిపూర్ణగా బహిర్న్యాసము చేయగా చిత్తప్రశాంతతతో ప్రసన్నత గలుగుచుండునని వివరము

92) ఓం స్ఫురత్ స్మేరాంబుజేక్షణాయై నమః

విప్పారిన పంకజముల వంటి నేత్రములు గలది విస్పష్టమైన దరహాసము లొలుకు, పంకజములవంటి నేత్రములు గలది భక్తులను ఆదరభావమున చిరునగవుల పలకరించు విప్పారిన కమలములవంటి నేత్రములు గలిగి ప్రసన్న మూర్తిగా నున్నది రక్షాభమున వికసించిన పంకజ నేత్రముల భక్తులయెడ అంబ యొక్క ప్రీతిభావమును సూచించును స్మేరాననా, చంద్రముఖీ, రాజీవలోచనా నేత్రముల

యందు విశేషభావద్యము, రక్తధాతు మిశ్రమముగా నుండును సాముద్రిక శుభలక్షణము ఇతఃపర్ణముల న్యాపస్థానము సూర్యచంద్ర నేత్రములని, మత్స్యములవంటి నేత్రములు గలదియని మరొక వ్యాఖ్య జలములే వాసముగా గలవి మచ్చెకంటియని మరొక లక్షణము మీనాక్షి, కామాక్షి, కమలాక్షి మొదలగునవి లక్షణ విశేషములు

93) ఓం అట్టహాసాయై నమః

అట్టహాసముతో కూడినది దేవి కొలువునందుండునప్పుడు అంతరంగిక సఖియలు, అష్టదిక్పాల శక్తుల నుండి బహిర్ద్వారమువరకు, గీతవాద్యత్రాది నృత్యసందోహ, వంధిమాగధ గీర్వాణ సమేత వేదస్తుతి యుతము వెలువొందు మణిద్వీపము బిందుకేంద్రమందు అర్ధభాగమైన సదాశివుని సన్నిధానమున వెన్నొందు శక్తి 2) మహిషాసురాది యసుర పోరాటమందు సర్వదేవతల శక్తులు ధరించి, తన యష్టవిభూతులను వెలువరించి అభేద్య, అజేయశక్తిగా నాయత్తమగు శక్తి

94) ఓం ప్రసన్నాస్యాయై నమః

ప్రసన్నముఖము కలిగినట్టి దేవి సృష్టియందున్న ప్రతిజీవి యెడల అంబ ప్రసన్నభావమున నాదరించుచుండును ఆమెకు జగత్తుల సృష్టిపాలనలయాదులు క్రీడ గనుక విలయకాల మందేకాకిగాయైనను చిత్తస్థైర్యము గలిగి ప్రసన్నదృక్కుల పునఃసృష్టి చేయుచుండును ఆర్తియై చేరిన వారిని ఆదరించి అడుగకుమునే వాంఛితమిడు ప్రసన్నమూర్తి ఆమె ప్రసన్నాస్యము గాంచి మధుకైటభులు, మహిషాసుర, చండముండాదులు తనువు త్యజించి యైనను ఆమె దివ్యరూపమున నైక్యమయి భక్తావతంసులైరి 'ఈషత్ సహాసమమలం పరిపూర్ణచంద్రబింబానుకారి కనకోత్తమ కాంతికాంతమ్ అత్యద్భుతం ప్రహృతమాత్తరుషా తథాపి వక్త్రం విలోక్య సహసా మహిషా సురేణ'

95) ఓం స్మేరవక్త్రాయై నమః

దరహాసముతో కూడుకొనియున్న ముఖము గలది చిరునగవుతో కూడియున్న ముఖము గలిగినది సుందరమందహాసమున ప్రకాశవంతమైన ముఖము గలిగినది ఆనందమే స్వరూపంగా గలిగి నట్టిది 'మందస్మిత ప్రభాపూరమజ్జత్కామేశ మానసా' అని ఆత్మానంద బోధకమగు వక్త్రం గలిగినది

96) ఓం సుభాషిణ్యై నమః

చక్కగా మాటలాడు దేవి చక్కనిమాటలు పలుకు దేవి రూపమునై యున్నది ఠీవిక కలిగి శబ్దాది దోషరహితమైన భాష, కమ్మని కంఠ స్వరమున ప్రియము లొలకగా, ప్రసన్నహావభావముల నాయాయర్థవంతమగు వివిధభాషానైపుణ్యములను నేర్పరియై సర్వాహ్లాదకరముగా మాటలాడునది

97) ఓం ప్రసన్నపద్మవదనాయై నమః

శోభాయుత కమలముఖము కలిగినది బాగుగా అప్పుడే వికసించుచు శోభసువాసనల వెదజల్లు పంకజము వంటి ముఖము గలది ఆనందయుతము పంకజముల వంటి విప్పారిన నేత్రముల ప్రీతిగొలుపు ముఖము గలది కమల ఉపమానము ముఖమునకు, నేత్రములకు కూడా వర్తించును

98) ఓం స్మితాస్యాయై నమః

చిరునగవు ముఖము గలది స్మితమన శబ్దము వెలువడని అంగీభావము దరహాసమునకు సమము అట్టి చిరునగవులొలుకు మోముతో సర్వపరివారముల కనికరించు మాత

99) ఓం ప్రియంభాషిణ్యై నమః

ప్రియమైన హితమైన పలుకులు గలది ఆపదలయందున్న వారికి సేదతీర్పు పలుకులు, భక్తుల కభయమిడు భాషణ, ప్రియ సదాశివుని మానసము నలరించు లలిత మధుర వాణి గలిగియున్నది సరసవతి శుభవాణి, సర్వభూతహితైషిణి, సర్వమంగళమాంగల్య, శివా సర్వార్థసాధకమైన హృదయాంతస్థ మధురభావయుత వాణి గలది

కోటరాక్షీ కులశ్రేష్ఠా మహతీ బహుభాషిణీ
సుమతిః కుమతి శ్చండముండాతి వేగిని(32)

100) ఓం కోటరాక్ష్యై నమః

కోటరము యనగా దుర్గము క్షేమమును గలిగించునది చెట్టుతొర్ర యను అర్థమున విస్తృత సూక్ష్మనయనములు గలది ఉన్నత స్థానము నుండి భూజీవ సముదాయము నంతటిని క్షేమదృక్కుల పరుమచు సమతాదృష్టిని పాలన చేయుచుండు దేవియని భావము

ఇతి ఆదిశంకర కృత లలితా సహస్రనామ త్రిశతి నామవ్యాఖ్యా సంపూర్ణ

101) ఓం కులశ్రేష్ఠాయై నమః

కులమునందు వరిష్ఠమైన ఆదిశక్తి. కులము అనగా వస్తుసమూహము, జాతి, వంశము, సదాచార స్వభావమని వివరింపబడినది ఆయా విషయ పరిధులలో అత్యంత శ్రేష్ఠము వరిష్ఠమైనది ఆమె కరుణాకర దృష్టియేయని వివరణ కులపోషిణి, పాలిని, పావని, మోక్షదాయిని, కన్యాదానమున పుట్టి నింటివారు మెట్టినింటివారు అటు ఏడు తరములు, ఇటు ఏడుతరములు మోక్షమంది తరింతురని యందురు శుభదృష్టిపాతము రాజసమేయగును

102) ఓం మహత్యై నమః

మహిత గలిగిన పరాశక్తి 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అను విధివిరాట్ స్వరూపిణియై యున్న దేవి శబ్దాది గుణరహితమై, ఊహింపలేని సూక్ష్మనిత్య, శుద్ధ సర్వాతీతపరమేశ్వరియే, సకలలోక వాసులు, సర్వదేవతలచే కొలువబడు శక్తి, వ్యాహృతులలో నాలుగవది 'ఓం మహః' 2) హిరణ్యగర్భతత్వము, మహత్తు విస్తార ప్రపంచమునకు కారకురాలు మహతీ 3) మహతి ఇత్యాత్మబ్రహ్మ స ఆత్మా' ఆత్మస్వరూపిణియై అనుభవైక వేద్యముగునది 4)నారదుని వీణకు మహతియని పేరు నాదానుసంధానుసంమోహ శక్తికి ఆశ్రయమదియే

103) ఓం బహుభాషిణ్యై నమః

అనేక విధముల సంభాషించు పరమేశ్వరి ఈ జీవులు స్థావర జంగమాదులుగా అరువది నాలుగు కోట్ల శాఖలుగా విస్తరించి యున్నవి ఆయా జీవుల సృష్టిపోషణ కర్త్రి, మాతృశక్తి యామెయేయై యున్నది సంతాప విలాసముల కాయాజీవ సంబంధి బహుభాషాజ్ఞానము గలిగి వర్తించునది 2) అనేక జీవులతో నొకమారు సంభాషించగల మోహనకరమైన వాణి గలిగినది. 3) సఖుల సల్లాపములు, భర్తృప్రీతి భాషణము, శిశువులాలింపు, శత్రుసంహారిణియైన సింహగర్జన, వరాభయదాతగా సకల జీవుల విన్నపముల నాలకించి వ్యవహరించెడు శక్తి 4) సకల వర్ణములు, ఆమె రూపులై యున్నవి సర్వదేవతలు ఆమె యొక్క మహోద్విభూతులేగాన సర్వరూపముల, నాదముల బ్రహ్మాండమావరించి యున్న బహుళనాదమోద శక్తియైన పరమేశ్వరి 5) పశు, పక్షి, జంతు మానవ, శిశుపల్లాప నర్మగర్భ వాక్యభావములన్నింటి సమిష్టి కల్పనా స్వరూపశక్తియు పరమేశ్వరియై యున్నది

104) ఓం సుమత్యై నమః

మంచి మనసు గలిగినట్టి మాతృమూర్తి దీవన, దయ, శుద్ధత్వం, దైవత్వం, శుభత్వము సుమతి సూచకములను స్వస్తినిడునది అవినాశి, సకల ప్రపంచములకు క్షేమము కూర్చునది భక్త, కుల, వంశ, సదాచారముల ఆదరము గలిగి మనసా,వాచా, కర్మల నొకేవిధి శుభచిత్తము గలిగి, సర్వ జన మనములనదే విధి సుకర్మల యెడనాసక్తి గలిగించునది

105) ఓం కుమత్యై నమః

కుమతి గలిగిన శక్తి సుమతికి వికృతరూపము కుమతి అదియేల వహించవలసి వచ్చినదన్న, కాలసంచాలమునందు, కుమతులుద్భవించి, సాధుజనుల కాపదల గలిగించుచుండ నా దానవశక్తి

నణచుటకు అవశ్యకమై యున్నది 'సుపుత్రోజాయేతక్వచిదపి కుమాతానభవతి' కాని తత్కాల పరిస్థితులలో కుమతుల నణచుటకు అవశ్యకము అదిపరాశక్తిని తమ రాత్రిగా నూహించి కరము చేపట్టమనిన మహిషాసుర, చండముండాసురుల హననమున కామ,క్రోధ కుటిలేక్షణ యైనది. కామక్రోధాది అరిషడ్వర్గములు చేరిన 'కుమతి' అవాసస్థానముగుచుండును

106) ఓం చండాయై నమః

చండరూపము గలిగినది లోకపాలనమున తనకెదిరిలేక ఇచ్ఛావర్తనము గలిగినట్టి ఆ పరాశక్తి. పరాశక్తి విభూతులలో నొకటైన దుర్గావిభూతి చండికయే 2) చండికాశక్తి రత్యుగ్రా-ప్రచండ పరాక్రమము తీక్షణ శాసనము, శత్రు భయంకరమైన తీవ్రకోపము గలిగినట్టిదేవి సకల దేవతలు నామె శాసనమునకు వెరిచియే తమ నియమిత కార్యముల వ్యవహరింతురు 3) చండికాశక్తిగా ఏడు సంవత్సరముల బాలిక పూజింపబడును 4) చండముండాసురుల సంహర్త్రిగా చండికయైనది ఆమె స్వభావము కూడా చండత తీవ్రత కలిగినట్టిది

107) ఓం చండముండాయై నమః

చండముండాసురుల సాయుజ్యశక్తి గలిగినది 'యస్మాచ్చండంచ ముండంచ గృహీత్వా త్వ ముపాగతా। చాముండేతి తతోలోకే ఖ్యాతా' యను చండముండాసురులని షూదన శక్తి వైరి భావమున నామెను తలచినను తన సాయుజ్యమిడి పూతార్థులుగా చేసినది ఆపై చండముండాయై యను నామమున యలరించు శక్తియై యున్నది 2) రురుడను దైత్యుని సంహరించి వాని శిరమును శూలమునకు గుచ్చిన శక్తి చాముండా

108) ఓం అతివేగిన్యై నమః

అతివేగవంతమైన చలనము గలిగినది అనంగ వేగిని తృతీయావరణ శక్తి విభూతి యనగా మనో వేగమున కార్యము నిర్వహించగల శక్తియామె రక్తపుండ్రేక్షు చాపబాణధరులుగా చైతన్య రూపులు అటులే తన మనోవేగ భావోద్వేగ క్రమముల, నతిశీఘ్రముగా యార్తుల దీనాలాపముల వినుము శ్రోతశక్తి గలది హిమాలయకృతాశ్రయమై వెలుగొందు మూర్తి

ప్రచండా చండికా చండీ చర్చికా చండ* వేగినీ చండ
సుకేశీ ముక్తకేశీ చ దీర్ఘకేశీ మహత్కచా(33)

109) ఓం ప్రచండాయై నమః

ప్రచండ రూపము గలది. ప్రచండా,చండ విక్రమా, సదా అకుంఠిత శాసనముల జగత్తును నియంత్రణ చేయునట్టి శక్తి ఎట్టి ప్రమాదమునకు తావులేక, తమ విధుల నిర్వర్తించునట్లుగా శాసించెడు ప్రచండ శక్తి స్వరూపిణి అతి తీవ్రవర్తనము గలిగినది

110) ఓం ప్రచండ చండికాయై నమః/ఓం ప్రచండాయై నమః

మహత్ చండవర్తన గలది పరమేశ్వరియొక్క విభూతి, పరాక్రమము గలది తీక్షణమైన శాసనము చేయునది శత్రుభయకరి ఉగ్రరూపిణియైనట్టి అంబరూపము సప్తశతిలో 'తతోదేవి శరీరాత్తు వినిష్క్రాంతాఽతిభీషణా చండికాశక్తిరత్యుగ్రా శివా, శతనినాదినీ' శత్రువుల సంహార వేళలో ప్రచండ క్రోధ మూర్తియై శత్రువుల చెండాడు శక్తిరూపము గలది క్రోధరక్తేక్షణా, జ్వాలాకరాళముఖ్యుగ్రం, నినాదైర్భీషణై పదములు రూపరించును

111) ఓం చండ్యై నమః

రణ చండీరూపము గలది చండీనామము ప్రసిద్ధిగాంచినది బ్రహ్మవరమదోన్మత్తులైన అసురుల సంహారమునకు, త్రయతపోబల గర్వితులైన చండముండాసురులను సంహరించి చండిగా ఖ్యాతి గాంచినది

112) ఓం చండికాయై నమః

చండికారూపము గలది ఈశాన్య దిశ నర్చింపబడు ప్రచండ శక్తి. మాతృకా శక్తి దేవీ శరీరమునుండి వెలువడిన అత్యుగ్రశక్తి 'హుం' కారాదుల మంత్రజాలప్రోక్షణమున, వజ్ర, శక్తి, శంఖ, చక్ర, గదా, ఖడ్గాదులు, నఖముల ననేక విభూతుల శత్రుసంహార రూపిణియైన విభీషణాననము గలది ఉగ్రరూపి పరమేశ్వరి

113) ఓం చర్చికాయై నమః

పూజింపబడునది ధ్యానింపబడునది చందనాది సుగంధిత పదార్థముల షోడశోపచారముల నర్చింపబడెడు మాతృశక్తియై యున్నదివి సకలలోక దేవతాదిగణములచే సంస్తుతి నందుకొను రూపమై యున్నదివి ఆమెయే శరణాగత దీనార్తయుల యందరికి యభయమిడును దానవుల నుండి యెపుడెపుడు సద్భక్తులు బాధింపబడి సంస్మరింతురో, అయా వేళల ననేక విభూతుల భూమి నవతరించి యాశ్వాసన కలిగించు అభయమూర్తి

114) ఓం చండవేగిన్యై నమః

తీవ్రతుగ్రమైన వేగము గలది క్షిప్రప్రసాదిగా అతివేగమున స్మరించిన తోడనే ఆదుకొను శక్తి వైరిజనులను అతి శీఘ్రముగా ఖండింపగల మాతృమూర్తి ఘనవేగిని, అతివేగిని, చండవేగిని పదములన్నియును ఆమె భక్తులను శీఘ్రముగా నాదుకొనునని తెలుపును

115) ఓం సుకేశిన్యై నమః

మంచి కేశముల సంపద గలిగినది కేశములు, కురులు తుమ్మెదల వోలె నల్లనివై పొడవు, దట్టముగా నుండి, సువాసనలు వెదజల్లుతూ చక్కని పాపిటతో తీర్చిదిద్దిన రూపమున శిరసున వెంట్రుకలు గలది సాముద్రిక శుభలక్షణములలో నొకటి

116) ఓం ముక్తకేశిన్యై నమః/ముక్తకేశ్యై

ముక్తకేశములు గలిగియున్న దేవి విరియబోసిన వెంట్రుకలు కలిగియున్న రూపము తలయంటి స్నానానంతరము ఆరవేయబడిన సుగంధ పరిమళ కేశములు కలిగినట్టిది వి_్రత కేశములు గలది

117) ఓం దీర్ఘ కేశిన్యై నమః/దీర్ఘకేశ్యై నమః

పొడవైన వెంట్రుకలు కలది లంబకేశి, దీర్ఘకేశి యనగా బాగుగా పెరిగిన పొడవాటి వెంట్రుకలు గలది సాముద్రిక శాస్త్రప్రకారం నితంబముల వరకు చక్కగా సాగి, నల్లగానున్న కురులు కలిగినట్టిది పై మూడు నామములు కేశసంబంధ విభూతి నామములు

118) ఓం మహత్కుచాయై నమః/మహత్కుచా

పెద్దవైన స్తనములు గలది. స్తనములకు ఉత్ప్రేక్ష పదములుగా చక్రవాకస్తని, కరికుంభస్తని, పీనోన్నతస్తని యని అమృతస్రావియైన పృథుకుంభ రూపములుగా వర్ణనలు గలవు శిశుపోషకములకు మాతృ స్తనజన్యక్షీరములు, భూమాతస్తనలబ్ధములగు ఓషధీ విశేషములు జీవస్థితి పోషణకాధారములు 'కుచోన్నతే, కుంకుమరాగశోణే' యను మాతంగిధ్యానము రూపము గలదు విలసత్ పీనవక్షోరుహ ధ్యాయిని ప్రాణశక్తిగా జగన్మాత రూపు ధరించినది. మహత్ కుచాయైయను పేరు రూపము గొప్పదైన కుచ భారము కలిగినది కచభారావనమ్రా, వెంట్రుకలు ముడువబడిన కొప్పుభారము కలది

ప్రేతదేహా కర్ణపూరా ప్రేతపాణి సుమేఖలా
ప్రేతాసనా ప్రియప్రేతా ప్రేతభూమి కృతాలయా(34)

119) ఓం ప్రేతదేహాయై నమః

ప్రేతదేహము ధరించి విలసిల్లునది. శివుడు శక్తియుతుడైనపుడే స్పందన కలిగి, సృష్టిపాలనా సమర్థు డగును శక్తిలేక శవరూపమేయనగా ప్రేతరూపము అస్తిచర్మాది ధాతుయుతమైనదేహమే శవము

ప్రాణ శక్తి గలిగిన చలనముగల జీవుడగును 'గతవతివాయౌప్రాణోపాయా' భార్యావిశ్యతి తస్మిన్ కాయె -కాయము శవతుల్యము శవారూఢం అని ప్రాణశక్తి ఆమెయే ప్రళయతాండవమాడు వేళలో భూతలాది సృష్టిని ఆమె విరాట్ పాదఘట్టనల నుండి రక్షించుటకు శివుడే శవ/ప్రేతరూపమున ఆమె పాదముల కాధారముగా నద్భుతగులును

120) ఓం కర్ణపూరాయై నమః

కర్ణపూరములు (కుండలములు) గలిగినట్టిది నవరత్నఖచిత కుండలయుగళం సమర్పయామి యను ఉపాసనా ఉపచారపదము కర్ణాలంకారములు కర్ణముల శోభనినుమడించును అట్లు రత్నకుండల భూషాఢ్యా, మణికుండలయుగళం యననొప్పు యాభరణయుతమైన శక్తి

121) ఓం ప్రేతపాణిన్యై నమః

శివప్రేతపాణినియైన దేవి పాణి కర్మేంద్రియము ప్రేతశివరూపము కర్మేంద్రియచేతన, ప్రాణరూపమైన దేవి యుద్ధేశించినపుడే జరుగగలదు కాన శివాత్మకమైన కర్మలు వాని కాధారము ఆమె పాణియే యగును 2) ప్రేతగణములు ఆమె సహచరులు ఆ ప్రేతంచేతనే తన సంకల్పములన్నియు నెరవేర్చుచుండును గాన ప్రేతపాణిని భూతప్రేత పిశాచాదులు ఆమె ఆదేశమున చరింతురు 3) భీకరరణరంగమున అట్టహాసము చేయుచు నైరి సేనల దునుముగా హుంకారముననే అసువులు కోల్పోయిన ప్రేతలత్రిప్పి ఆకాశమార్గమున దూరముగా విసిరవేయుటచే నీ నామము సార్థకము 4) శివునికి కపాలధారి శిరసు ప్రధానముగాన ఆదిశక్తి కపాలహస్తగా కదనరంగమందగుపించును చండముండాసురుల శిరములు తెచ్చి దేవికి చూపగా చాముండాయని బిరుదు కలిగెను

122) ఓం సుమేఖలాయై నమః

మంచిమేఖల ధరించియున్నది మేఖల యన నడుము చుట్టు వడ్డాణము సువర్ణరత్న ఖచిత మేఖల కలిగిన దేవి 2) అంత విరాట్ రూపమున దివ్యతారకలు గ్రహములు విశ్వాంతరాళమై ఆమె నడుము భాగమున ప్రకాశించుచు అనంత స్వర్ణమేఖలగా కనబడుచుండును కంచిదామకటి సూత్ర సమర్పణ ఉపచార విశేషము

123) ఓం ప్రేతాసనాయై నమః

ప్రేతయే ఆసనముగా గలది ఆసనమనగా ఆధారభాగము హృదిపీఠము సహస్రారవర్తికయైన బిందు స్థానవాసి శివరూపమైన ప్రేతము దేహమాధారంగా నర్తించు ప్రాణశక్తి స్వరూపిణి ఆమెయే

124) ఓం ప్రియప్రేతాయై నమః

శ్మశానమునందు నివసించునది ప్రియమైన ప్రేతరూపముగా గలది ప్రేతయనగా శివరూపము శివప్రియా శివసంగిని, శివమనోరంజని, ఆహ్లాదశక్తి అర్ధశరీరిగా నిత్యము అభేద దృష్టితో ఆశ్రయించి యుండు సర్వవ్యాపక శక్తి

125) ఓం ప్రేత భూమికృతాలయాయై నమః

ప్రేతభూమి నివాసముగా గలది 1) ప్రేతభూమి శ్మశానము అదియే ఆలయము యన నివాసస్థానముగా చేసికొనియున్న శక్తిస్వరూపిణి. 2) ప్రేతలైన సహచరగణము నెలకొను తలమున తానును విహరించెడు శక్తి 3) శివనివాసస్థానమైన కైలాసమున నెలవుండు ఆదిశక్తి 4) భౌతిక వాంఛల, పంచతత్వముల వదిలి శ్మశాన రూపమైన మనస్థితి యందుండు పరాత్పరి

శ్మశాన వాసినీ పుణ్యాపుణ్యదా కులపండితా
పుణ్యాలయా పుణ్యదేహా పుణ్యశ్లోకీ చ పావనీ(35)

126) ఓం శ్మశానవాసిన్యై నమః

శ్మశానము నందు నివసించునది పై దానికి పర్యాయపదమే శ్మశానము ప్రేతభూమి కంకాళ

స్థావరమును శ్మశాన వాటియను తలము నామము కాళికి గలదు ఆ గ్రామసీమల వర్తించు శక్తి. 2) వీరభద్రుని నివాసస్థానము శ్మశానము ఆయన శక్తి భద్రకాళిగా వసించునది. 3) కైలాస సమీపమునశక్తి సాంప్రదాయానుసారము శ్మశానమను తలము గలదు అచట విహరించు మహామాయకు శ్మశానాలయ వాసినీయను పేరు గలదు 'శ్మశానకాళిక' ఆమెయే.

127) ఓం పుణ్యాయై నమః।

పుణ్యవతియైన దేవి వేదశాస్త్ర ప్రవర్తకమైన మార్గమున సంచరించుచు పరులకుపకారము చేయుచు, ప్రాణికోటి హితమునెంచు విధానమునే పుణ్యమార్గమని యందురు ఆయా క్రియల, మంచికర్మల సంతరించు శక్తి పుణ్యబలము (శక్తి) పుణ్యా అందురు ఇది జీవి కర్మల ననుసరించి పూర్వ జన్మ పుణ్యమని, సంచిత ప్రారబ్ధమని అందురు. పుణ్యము వలననే ఉత్తమ జన్మసంస్కారము, దేవీ సంబంధ జ్ఞానము కలిగి పునర్జన్మ రహిత నిత్యాశక్తి నివాసస్థానమైన పుణ్యలోకము అంద గలుగు దురు ఆ పుణ్యలోకము లేవన అంతరిక్షస్వర్గాదుల కంటే ఉన్నతమై దేవీ నివాసస్థానమై యున్న మణిద్వీపము

128) ఓం పుణ్యదాయై నమః।

అర్చించిన వారికి పుణ్యఫలమునిడునది పుణ్యాపుణ్యఫలప్రదాయిని దేవి ఎనుబది నాలుగు లక్షల జీవరాసులకు మానసికముగా, శారీరకముగాను కష్టము కలిగించక హితము చేయు కర్మ పుణ్యకర్మ వికృతమైనది పాపకర్మ ఆయా కర్మలననుసరించి ఫలము నొసగునది ఆదిశక్తి ఇది అంతరంగిక భావన బహిరంగ భావనల శుద్ధముగా చేసుకొని నిత్య అర్చనయందు పుణ్యమార్గము ననుసరించి పునరావృత్తి నివారక నిత్య మహాత్రిపురసుందరీ సాయుజ్య లోకమాదేవి కరుణచే లభించగలదు

129) ఓం కులపండితాయై నమః।

కులపరిణతి స్వరూపమైయున్నది కులము వస్తు సమూహం జాతి, వంశ, స్వభావాదుల వర్తించును గదా ఇంద్రియసమూహము మూలాధారాది చక్రస్థయైన దేవి, శమదమాది షట్కసంపన్న పరిణతి నందిన రూపమై, సంపూర్ణ జ్ఞానయుతమైనట్టి స్వరూపము ప్రభ్వి, పాలిని, నిర్దేశకర్త్రియై యున్నది

130) ఓం పుణ్యాలయాయై నమః।

పుణ్యములకు ఆలయమైన దేవి పరమేశ్వరిని ఉపాసించిన, పూజాస్తోత్ర పారాయణ సహస్రనామాది పఠనలచే, పుణ్యము సముపార్జించనగును దేవీ సాయుజ్యము అప్పై పొందనగును ఆమె సన్నిధియే పుణ్య ప్రదమైనది అనేక ఉపచారముల, వివిధ భక్తి మార్గముల సాధ్యమగును

131) ఓం పుణ్యదేహాయై నమః।

పుణ్యరూపశరీరము గలది ఆ పరమేశ్వరి దర్శనమాత్రముననే పుణ్యలబ్ధి నంది మోక్షమునందగలరు సర్వదేవమయ శరీరియైన ఆమె దేహమునందలి విభూతిగణములు సంస్మరణీయములు సృష్టి, స్థితి, లయాది మూలకర్త్రియై, సదాశివుని యర్ధాంగియై జ్ఞానమోక్షప్రసాదియైన ఆమె విశ్వరూపదేహ సందర్శనము భక్తియోగ సాధనమునై యున్నది

132) ఓం పుణ్యశ్లోకాయై నమః।

పుణ్యసంస్తుతి రూపమై యున్న దేవి పరమేశ్వరి దర్శనం పుణ్యదాయిని మోక్షదాయినీ, పాపభంజని, ఆర్తత్రాణ పరాయణీ, విద్యా, జ్ఞాన సంపత్‌ధాత్రిగా ననేక నామముల సంస్తుతించబడుచున్నది 'దేవి ప్రపన్నార్తిహరే ప్రసీద' యని కాలరూపిణియైన ఆమె కీర్తిని ప్రస్తుతించారు పంచాంగము విధి దేవి రూపు స్థాపించి షోడశోపచార పూజ (అంగపూజ, చక్రార్చనం, హోమం) కవచము, హృదయము, సహస్రనామ పఠనం, మూలమంత్రాది పఠనం (జపము) అర్ఘ్యాదుల యుతము అను అంగములు ప్రధానంగా చేయు ఉపాసనక్రమము ఆ పరాశక్తియు భక్తి జ్ఞాన వైరాగ్యములనెడు పథముల సత్యము గ్రహించి వివేకవంతులై పుణ్యకార్యముల చేయుచు పుణ్యస్థానముల మోక్షమందతగును

133) ఓం పావన్యై నమః

పవిత్రమైనది పావనం, పరమస్తుపుమాన్ ధ్యాతః దృష్టః కీర్తిత, శ్రుత పూజితః, స్మృతః ప్రణతః సర్వాన్ పాపానం ఉన్మూలయతి-ఉత్కృష్టమైనది దేవి పవిత్రమూర్తి సన్నిధానమున చేరు పాపుల పాపములను పోగొట్టి వారిని పవిత్రులుగా కూడా చేయును వర్ణాశ్రమ విహీనానాం, పాపిష్ఠానా మృణామపి, యద్రూప ధ్యానమాత్రేణ దుష్కృతాం సుకృతాయతే-యని గలదు దర్శన మాత్రమున పవిత్రీకరించును చండముండాసుర, ధూమ్రలోచనాదులు నటులే పవిత్రీకరింపబడి పూజార్హులైరి, నమస్కార మాత్రమున పాపభంజన చేయును

పుత్రా* పవి(వి)త్రా పరమా పురా పుణ్యవిభూషణా పూతా
పుణ్యనామ్నీ భీతిహరా వరదా ఖడ్గపాణినీ*(36) పాశిని

134) ఓం పూతాయై నమః /ఓం పుత్రాయై నమః

పవిత్రము చేయునది 'అవిద్యాది దోషరహితం, శుద్ధః పూతశూన్యః శాంతః' దర్శన మాత్రముననే సంచిత పాపకర్మ ఫలము ధ్వంసము చేసి పవిత్రులను చేయును పుత్రాయనుపేరు పాఠం పున్నామ నరకము నుండి దాటించువాడు పుత్రాయతి యను యర్థమును గ్రహించవచ్చును పితౄణ మోచన కారకుడు గదా పితరుల ఋణచ్ఛేదనగును పున్నామ నరకము దాటించు శక్తి.

135) ఓం పవిత్రాయై నమః/ఓం పరిత్రాయై నమః

పవిత్రము చేయునదికి పర్యాయపదము. పవిత్రీకరణము చేయు శక్తి ఆ సౌమ్యమూర్తి సౌమ్య సౌమ్యతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సుందరీ పరాపరాణాం పరమాత్వమేవ పరమేశ్వరీ- యని భక్తజన మానసములు సౌమ్యతరము చేసి పవిత్రీకరించును, రక్షించు స్వభావము గలది

136) ఓం పరమాయై నమః/ ఓం పురాయై నమః

పురాతనమైనది పరమాస్వరూపిణి నిత్యశుద్ధ బుద్ధి ముక్తి స్వరూపము పరమాయనబడును దేహముతో సరిపడక, శ్రేష్ఠమైన పరము పరదేవతా స్వరూపము 'గౌరీ రోహిణీ సర్వాణి శరీరాణి' అందలి చైతన్యము పరమేశ్వరీ యంశయే అవ్యక్త కాలస్వరూపమునై యున్నది. పురాపదము ఆద్యా, అనంత, అవినాశి, తత్త్వమునే ప్రబోధించును. 'నిరతి శయ పరమానంద రూపం శ్రద్ధాపురస్సరం ప్రత్యగాత్మత్వేన, సదానుసంధేయం మోక్షార్థిభిః పరాయ పరమేశాయ సర్వజ్ఞాయ నమోనమః అతీత గుణ సంగాయ విశ్వేశాయ నమోస్తుతే' యని పరమారూపము

137) ఓం పుణ్యవిభూషణాయై నమః

పుణ్యమే విభూషణముగా గలది.దేవి పుణ్యముల ప్రోవు అవియే భూషణములుగా ధరించినది కామదా, అర్తత్రాణ పరాయణీ, భక్తపాలినీ, దనుజదమని, ప్రాణదాయి, భువనపోషిణి, మొదలగు పుణ్యకార్యముల కాకరమై అవియే తన సర్వాంగ భూషణములుగా గలిగినట్టి పరాశక్తి. అల్పోపచార తుష్టి, బహుళ వాంఛా ప్రదాతగా స్మరించ బడుచున్నది

138) ఓం పుణ్యనామ్న్యై నమః

పవిత్ర నామముల కీర్తింపబడుచున్నది. స్వాహా, స్వధా, వషట్కార, స్వరాత్మికా, సుధా,అక్షరా, త్రిధా మాత్రాత్మికా స్థితా, దేవి, మహాదేవి, శివా, ప్రకృతి, భద్రా, నియతా, వైష్ణవి, మహామాయాది యనేక పుణ్య నామములచే వెల్లవేళలా కీర్తింపబడు గీర్వాణి, శర్వాణీ, భద్రకాళీ స్వరూప మాయియే గద అనేక సహస్రనామముల, సహస్ర పుణ్యమూర్తులు గోచరించ విలాసవతియై, శివ వామాంకయై, సదా శివ పర్యంకస్థితయై యొప్పారును ప్రతి ఒక్క నామమును సంస్మరణయోగ్యం, ఆపాధారమునై అనేక శక్తుల కాలవాలమై భక్తజన రక్షయు, వాంఛితార్థముల నిడగల సమర్థత కలిగిన పుణ్య నామములు. నంద గోపగృహే జాతా యశోదా గర్భసంభవా వింధ్యాచల వాసిని, రక్తదంతాయితి స్తువంతో

వ్యాహరిష్యంతి, మునిభిః సంస్తుతా సంభవిష్యామయోనిజా, కీర్తయిష్యంతి శతాక్షీమితి, దుర్గాదేవి తివిఖ్యాతం ఇట్లే శాకంభరీ శతాక్షి, భీమా, భ్రామరీ మొదలగు బహు నామముల నెరుక గలిగియున్న దేవి

139) ఓం భీతిహరాయై నమః

భయమును పోగొట్టునది భయాపహా 'దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః' స్మరణమాత్రమున ప్రత్యక్షమై భయమును పోగొట్టునది సంసార భయమును పోగొట్టుమూర్తి భయాపహా, ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములను మూడు విధముల త్రివిధా తాపముల వలన నేర్పడు బాధలను పోగొట్టునది. భవారణ్య కుఠారికా, భక్తగమ్యా, వశ్యా నామముల ఫలస్వరూపమును 'అరణ్యే, ప్రాంతరే, జలేస్థలే ఽపివా। వ్యాఘ్ర కుంభీరచోరేభ్యస్థానాని సర్వేషు' దేవి స్మరణచే సంకట మోచనమగును

140) ఓం వరదాయై నమః

భక్తులకు వరముల సిద్ధింపజేయునది త్రిమూర్తులు శక్రాది దేవతా గణములు అసుర భీతినుండి కాపాడుటకు దేవిని స్తుతించగా దేవి ప్రత్యక్షమై 'వరదాఽహం సురగణా' కావలసినవి కోరుకొమ్మని వరములనిడి నట్టి దేవి. అష్టమి, నవముల యందు పూజించగా అభిమత వరములు నిశ్చింతయముగా నిడుమాత అన్యదేవతలు వరద, అభయ ముద్రలు ధరించి చూపట్టినప్పటికీ, అట్టి ముద్రలు లేకయే స్మరణమాత్రమున భక్తవరదయై భాసిల్లునది 'వరం దక్షిణం దదాతి యజమాన రూపిణా' పరమేశ్వరి సౌమ్యవదనమున పాతునః సర్వభీతిభ్యః కాత్యాయని నమోస్తుతే యని ప్రార్థింతురు

141) ఓం ఖడ్గపాణిన్యై నమః/ఓం ఖడ్గపాలిన్యై నమః

ఖడ్గమును చేతధరించి పాలించునది ఖడ్గినీ, అసిధారిణీ, నైరుతి, నైష్టవి విభూతి, ఖడ్గహస్తయై యవతరించినది 'కాలశ్చదత్తవాన్ ఖడ్గం తస్యాశ్చర్మం చ నిర్మలం' వైరి సంహారదార్ధమై ఖడ్గమును ధరించిన దేవి శిష్టరక్షణ, దుష్ట(శిక్షణ) దండనాది పాలనా కర్తవ్యము నిర్వహించు పరాత్పరి

నృముండ హస్తా శస్త్రా* చ భిన్నమస్తా సునాసికా శాంతా
దక్షిణా శ్యామలా శ్యామా శాంతా పీనోన్నత స్తనీ(37)

142) ఓం నృముండ హస్తాశస్తాయై నమః

నరముండం హస్తమున శోభిల్లు దేహి నరకపాలము చేతియందు ధరించునట్టి దేహము గలది అసుర శిరస్సులచేత ధరించి, వికృత కరాళ నృత్యముచే వికాశదేహము గలది క్షేమముల గూర్చునది. కపాలినీ రూపిణియైన దేవి ప్రశస్త రూపము గలదియై భక్తరక్షణ చేయును మాలాకుంభకపాల నీరజకరాం చంద్రార్ధ చూడాం పరాం। సర్వజ్ఞేశ్వర భైరవాంక నిలయాం పద్మావతీం చింతయే-యని సప్తశతీ షష్ఠాధ్యాయ ధ్యానాంగము

143) ఓం భిన్నమస్తాయై నమః

భిన్నమైన మస్తకము కలిగినట్టి దశవిద్యారూపశక్తి శిరము భిన్నమైనను యనగా లేకుండినప్పటికీ జీవించియుండు శక్తి విభూతి శ్వేత కుమలాసని నాభిని యోనిచక్రం దీపలేవస్త్రములు రజో తమోగుణ సాహచర్య శక్తులు గలది అంతర్ముఖ సాధని యజ్ఞ, శిరసుకు ప్రతీకగా అన్నాగమన రూప శిర స్సంధానమున ప్రతిష్ఠితము కావున నిత్యయజ్ఞాంగ శిరస్సంధానం, ప్రవర్గ్యయాగమున తృప్తిపరుచు మందురు అపుడు మహామాయ షోడశియై భువనేశ్వరియగును. లేనిచో భిన్నమస్తయై సంసార నాశనమునకు ఉపక్రమించును ఆమె కర్త్రీ, ఖర్పర, రక్త, నాగ, దిగంబరత్వ సంహారశక్తి నిదానం హయగ్రీవరూప విష్ణువు. శిరచ్ఛేదం తదనంతరం సంధానము హయశిరస్సుచే జరిగినది శిరోయజ్ఞమునది.

**144) ఓం సునాసికాయై నమః**

మంచి నాసికా భాగము కలిగినట్టిది జ్ఞాన పంచేంద్రియములలో నొకటియైననాసిక ఘ్రాణశక్తి గలిగినట్టిది. అది చక్కగా పనిచేయునపుడే పదార్థ నిర్ణయము చేయవీలుపడును సురూప సుగంధ పరిమళముల గ్రహించుచు భక్ష్యాభక్ష్యముల నెరుగుచుండును

**145) ఓం దక్షిణాయై నమః**

దక్షిణా స్వరూపము గలది దాక్షిణ్యమూర్తియునై యున్నది దక్షప్రజాపతి కూతురునైనది 1) సనకసనందనాదుల బ్రహ్మజ్ఞాన నిరూపణకై పరమేశ్వరుని ప్రార్థింపగా ఈశ్వరుడు ఖాండీకమును వట వృక్షమున దక్షిణాభిముఖముగా పదియారేండ్ల వయసుకలిగియున్న బాలునిగా ప్రత్యక్ష మాయెను ఆ యవతార బ్రహ్మస్వరూపిణియైన శక్తి దక్షిణ రూపిణియే 2) దక్షిణాచారము విధి నర్పించ బడునది 3) సృష్టిస్థితిలయాదుల సగుణబ్రహ్మస్వరూపి, గురురూపిణీ, సరస్వతీ దేవి, స్వరూప శక్తియు నామెయే 4) గోలోకవాసిని, రాధాశాపగ్రస్తయగు సుశీల నామధేయను దక్షిణాదేవి యందురు ఆమె తపస్సు చేసి లక్ష్మి తనువు నందు సంక్రమించి లోకమున కానరాక యుండినది దక్షిణారాధన లేని యజ్ఞములు నిష్ఫలమగుటచే దేవతల ప్రార్థన మేర, బ్రహ్మ ఆమెను కనుగొని దేవతలకర్పించెను 5) ఋత్విగాదుల కీయబడు యాగీయ సంపద రూపము దక్షిణ దేవతయే దక్షిణాంతాంతు యని విడక యాగఫలము గలుగదు

**146) ఓం శ్యామలాయై నమః**

శ్యామల రూపమున నుండు దేవి శ్యామవర్ణము నలుపు లేక కాళవర్ణము పసుపు నీలము, 1) పదునారు సంవత్సరముల స్త్రీ పేరు శ్యామ 2) శ్యామల వర్ణకాంతి కలిగిన దేవి 3) అజ్ఞానముచే ఆవృతమై యుండు గర్భస్థపిండమును శ్యామాభా, కృష్ణాభా యందురు 4) ఆహ్లాదినీ శక్తి రాధ యుగళ ఛవియందు కృష్ణాలింగనా సమయమున శ్యామలవర్ణియైనది, శ్యామారూపము 5) అన్ని వర్ణములు కృష్ణవర్ణములో లీనమగును కృష్ణవర్ణము నుండి క్రమముగా ఉషస్సు, సప్తవర్ణములు వెదజల్లుచు ధవళ తేజము నంది, సాయం సమయమున తిరోహిత క్రమమున తెలుపు రంగు నుండి సప్తవర్ణముల మేళనము జరిగి చీకటియను కృష్ణవర్ణమావహించును బ్రహ్మగాయత్రీ ఉదయమున, మహేశ్వర సావిత్రీరూపి మధ్యాహ్నమున, విష్ణుసరస్వతీ రూపములుగా సాయం కాలమున వెలుగుచుండును బ్రహ్మ సరస్వతీ,విష్ణువులక్ష్మి, మహేశ్వర గౌరి యుగళములు (సత్వ తత్వము విష్ణువు– గౌరీ, రాజసతత్వ బ్రహ్మ, లక్ష్మి, తామసతత్వ మహేశ సరస్వతులుగా (మూడును పలికి) అను సంధాన విధి చెలగిరి ఆవాహనాది విధి ఉదయం బ్రహ్మరూపం, సూర్యోదయమునకు పూర్వం, మధ్యాహ్నమున మహేశ్వర రూపం, సాయంకాలమున విష్ణువు రూపం నందినట్లు సూర్యుని ప్రార్థన గలదు 'ధ్యేయా చాత్ర సరస్వతీ భగవతీ పీతాంబరాలంకృతా' యని శ్యామలవర్ణరూపి ఆవాహనము సూర్యాస్తమయమునకు ముందే ఉపాసన నిర్వర్తించవలెను.

**147) ఓం శ్యామాయై నమః**

కృష్ణ, శ్యామలవర్ణము గలిగినట్టిది కృష్ణ, నలుపు, రాత్రి, ప్రళయకాలమును సూచించును జగత్తంతయు అంతమున తనలోనే నిముడ్చుకొనునట్టి శక్తిరూపము మమత గలిగినట్టి శక్తియుగాను పూజింతురు. శ్యామసహచరి శ్యామాయను రాధారూపము

**148) ఓం శాంతాయై నమః**

శాంత రూపిణియైన దేవి. 'శబ్దహీనాయ, శాంతాయ, శబ్దలభ్యాయ సాక్షిణే సర్వోపాధి విహీనాయ, స్వయంభాసాయనైనమః' సర్వవికార శూన్యం అవిద్యానాశకము 2) సర్వక్రియా నివృత్తిరూపము శాంతము అసుర సంహారానంతరము 'వపుః పుణ్యస్థధావాతా సుప్రభోఽభూ ద్దివాకరః

'జ్వాలాభిస్సర్వయో శాంతా, శాంతా దిగ్వలితస్వనా' నిత్యకృత్యముల కాటంకముండ కుండుట
3) బుద్ధీంద్రియ ప్రాణవ్యాపార రహితతత్త్వము శాంత స్థితి దీని తరువాత శాంత్యతీత కళాప్రాప్తి
4) నవరసాలలో శాంత రసము గలదు అది చలస్థితిని యోగసమాధియగును బుద్ధావతార ప్రతీక 'అసతోమా సద్గమయా, తమసోమా జ్యోతిర్గమయా, మృత్యోర్మా అమృతంగమయా' అమృతప్రాప్తియై నిశ్చలచిత్తము కలిగి యుండుటే సమాధి.

149) ఓం పీనోన్నత స్తన్యై నమః

పృథుల ఉన్నత స్తనములు గలిగినది. పర్వతస్తనమండలం, సుశోభస్తన మండలాయని దేవి స్తనములు నలంకరించిరి గోమాత స్తనములు పాలతో నిండియుండి పోషక క్షీరముల నిడ సమర్థత గలిగినవి భూమాత స్తనములు పృథు పర్వతములు అందుండు ఓషధీసముదాయము నిడి ప్రాణరక్షకములై యున్నవి దేవీ స్తనములు నిర్వికార క్షీరయుతమై జీవప్రాణాధారములై యున్నవి ఆ క్షీరములు త్రావి గణేశకార్తికేయులిరువురు, శిశుభావమున బ్రహ్మజ్ఞానతేజస్సుకలై యుండిరని సౌందర్యలహరి భావము గలదు, సాముద్రిక శాస్త్రమున గూడా మాంసయుత పృథువక్షోజములు స్త్రీకి అలంకారం కృష్ణరూపియైనప్పటికీ అందలి క్షీరముల వర్ణముసుశోభమై ప్రాణాధారమగును

దిగంబరా ఘోర* రావా సృక్కాంతా రక్తవాహినీ వంహా
ఘోరరావా శివా ఖడ్గా విశంకా* మదనాతురా(38) నిస్సంగా

150) ఓం దిగంబరాయై నమః

దిక్కులే యంబరము (వస్త్రము)లుగా గలిగినది ఈ పదమున దేవియొక్క వ్యాపకత్వము సూచించును దిక్కులే యంబరముగా గలిగినది ఎందులకు? దేవికి దివ్యాంబరములు తప్ప, సాధారణ వస్త్రములు చాలవు నిరావరణయుతమైన వ్యాపక శరీరము కలిగియున్నది. విశ్వవ్యాపిని విశ్వవ్యాప్తమైన దేవీ శరీరాన్ని ఆచ్ఛాదించగల భౌతిక పరిమాణం లేనందున దిగంబరాయని పేర్కొనబడినది నిర్గుణరూపియైన దేవికి దేహమే యుండదుగదా ఎట్టి వస్త్రముల ధరింపజేయ నగును

151) ఓం ఘోరరావాయై నమః

ఘోర శబ్దములతో గూడిన భీషణ నినాదయుతమైన రూపం 'శివాశత నినాదినీ' అని వర్ణన గలదు 'గర్జగర్జ క్షణం మూఢ మయాత్వయహతే ఽ త్రైవ గర్జిష్యంత్యాసు దేవతా' అని భీకర స్వనమున, హుంకారాదుల, ధనుర్జ్యాసింహ ఘంటానాం, నాదాపూరిత దిఙ్ముఖా, నినాదైర్భీషణై, ఘోర రూపి మహారావే పరమేశ్వరి, మహేశ్వరి స్వరూప నారాయణిగా వర్ధిల్లును.

152) ఓం సృక్కాంతాయై నమః

యజ్ఞ రూపి పరమేశ్వరి సృక్స్రువములు యజ్ఞ నిర్వహణకు నావశ్యకమైనట్టి ఉపకరణములు సృక్ ధరించిన పరమేశ్వరి. మేడిచెట్టు కలపతో చివరి మట్టి ఆకుగా వెడల్పుగా నుండి, కాడగా గ్రహణమునకు వీలైన సాధనము యజ్ఞ రూపిణియై యున్న దేవి నిత్యహోమార్చనా అంగమైన ఉపాసనా క్రమమున యజ్ఞమునకే ప్రతీక సృక ఆజ్యము హవిసునిడు పరికరము యజ్ఞ నిర్వహణా శక్తి రూపిణియైన దేవి హవిర్ధారణకు ప్రాణిపోషణకు ఆధారమై యుండును

153) ఓం రక్తవాహిన్యై నమః

రక్తవాహినిగా నున్న దేవి దేహమందలి ప్రాణాధారమైనది రుధిరము పోషకాహారముల నాయా అంగతలములకు చేర్చుచుండును హృదయ కేంద్రము నుండి సిరలు, ధమనులు ఈ క్రియ యందు యుక్తములు అట్టి ప్రాణ శక్తి సంచారమునకు అధిష్ఠాత్రియైన దేవి దేహమందెట్లున్నదో విశ్వాంతరాళ పోషణకు అవసరమైన పోషక వస్తు సముదాయము నాయారీతుల నందజేయు శక్తి స్వరూపిణి.

154) ఓం ఘోరరావాయైనమః

ఘోర నినాదయుతమైన దేవి (151వ నామము పునరుక్తి) ఘోరాఘోరతర రూపిణి ఘోరేభ్యస్సర్వ సుందరీ అని అఘోర, ఘోరతర రూపశక్తి ఆమెయే

155) ఓం శివాసంగిన్యైనమః/ శివాఖడ్గిన్యైనమః

శివయుతమైన శక్తి శివాఖడ్గా శివ ఆసంగిని ఖడ్గము ఆయుధముగా ధరించునది ఎడమవైపు లేక విధి యర్ధశరీరిగా నున్న దేవశక్తి. శివకామేశ్వరాంక స్థా శివ ప్రియా శివశక్త్యాయుత అను పదముల నేకార్థ మొకటియే యగును శివునితో సమైక్యము నొందుటచే శివ ప్రియమైనది స్థూల, సూక్ష్మ పరా భేదములు లేని, శివకామ ఈశ్వర శబ్దముల ప్రజ్ఞాన స్వరూప, బ్రహ్మ పదములు అట్టి శివ శివసంగిని

156) ఓం విశంకాయైనమః। ఓం విసంగిన్యైనమః

సంగరహితమైన శక్తి సంగహీనా, బ్రహ్మ విష్ణు శివ పురోగాది దేవతలు ప్రార్థించినపుడు సింహవాహిని గా హిమాలయ కృతాశ్రయయై ప్రత్యక్షమైనది ఆమె యందు సర్వదేవతల శక్తులు చేరి పరమేశ్వరిగా యైనది ఆమె, ఆమె యొక్క విభూతులు మాత్రమే చండముండాసురాది వధ చేయగల్గినది. భక్త రక్షణకై ఆమె సంపుటిత శక్తిగా, సంగరహితమైనదిగా స్పష్టమగును ఇంకలేనట్టి పరాశక్తి స్వరూపము

157) ఓం మదనాతురాయైనమః

ఆతుర యౌవనవతియైన శక్తి నిత్యాషోడశికాయన పదునారు సంవత్సరముల ప్రాయమున తీవ్ర పూర్ణమనోభావన గల్గిన శక్తి వృత్తివాసనా రహితమైన పూర్ణానందానుభవమున విలసిల్లుమూర్తి తీవ్ర బ్రహ్మానందమున మదముచే పరమానంద ఘన స్వరూపిణిగా పాటల కాంతి ప్రభను వెల్గునది

158) ఓం మత్తాయైనమః

మదించిన స్వాత్మావృత్తి గల దేవి 'సర్వం ఖల్విదం బ్రహ్మ'యను పూర్ణ అహంభావ మూర్తి బహిరింద్రియ జ్ఞాన శూన్యతా లక్షణం. నిర్గుణ నిర్వికార స్థితియైన తురీయావస్థ స్వాత్మావృత్తి గల శక్తి తన లోనే తాను జగముల సృష్టిపాలన లయాది పంచక్రియలు సర్వవ్యాపికయై క్రీడించుశక్తి

మత్తా ప్రమత్తా ప్రమదా సుధాసింధునివాసినీ
అతిమత్తా మహామత్తా సర్వాకర్షణ కారిణీ (39)

159) ఓం మత్తాయైనమః

మత్తిల్లిన స్థితి యందున్న రూపము మత్త స్థితిలి సృష్టి పరము రూపము పూర్ణ బ్రహ్మానంద స్థితి అదియే సమాధి నిద్ర. 'నిద్రా భగవతీ విష్ణోరతుల తేజసః'యైన మహా మాయా స్వరూపము కారణానంద స్వరూపియై మహా పద్మవనాంతస్థయై భక్త సులభురాలుగా వెలుగుచుండును

160) ఓం ప్రమదాయైనమః

ఆనంద రూపిణియైన దేవి పూర్ణయౌవనిగా మదవతియై యున్న రూపము పరబ్రహ్మ పరిపూర్ణ రసానందయుతగా జగత్కల్యాణ హేతువగును అట్టి పరబ్రహ్మ పరిపూర్ణ రసానందయుతగా స్త్రీల యందుత్తమ లక్షణవతిగా సకల శ్రేయానంద భావపరిశీలిత గల్గిన రూపము

161) ఓం సుధాసింధు నివాసిన్యైనమః

అమృతాంభోనిధి నివాసినియై యున్న దేవి 1) భక్తకోటికి అమృతత్వము ప్రాప్తి చేయును 2) బ్రహ్మాండోపరి భాగము నందు సుధాసింధువు గలదు దాని మధ్య రత్నద్వీపము దాని మధ్య చింతామణి గృహము నందు దేవి పరశక్తయై విరాజిల్లు చుండును 3) పిండాండమందు సహస్రార కమల కర్ణికా రూపచంద్రమండలమే అమృత సరస్సు. రత్న ద్వీపము, చింతామణి మండపము,

పద్మ వనము నీప వనములాదిగా గలవు దేవియొక్క నివాసమదియే 4) శ్రీచక్ర మధ్య బిందువే నిధియని, పంచయోనుల నీప శ్రేణియనియు అష్టదళషోడశార దళాదికములు మహాపద్మ వనమనియు, రత్నద్వీపము, చింతామణీ గృహము నందు గలదనియు రుద్రయామిళాదుల వివరణ. 5) దేవీ భాగవతము పంద్రెండవ స్కంధమున పరివేష్టిత చక్రమున కాలాద్యవయవములు, అమృతవాపి సమూహములు గలట్టి దేవి నివసించు బ్రహ్మాండ తలము అమృత సింధువు మధ్య గలదని వర్ణన గలదు 6) సగుణ బ్రహ్మోపాసన వలన లభ్యమవు లోకమున 'అరణ్య'ములను రెండు అమృత హ్రదములు గలవు వానినే సుధా సాగరములందురు విదేహ జీవి ఈ హ్రదముల స్నానము చేసి బ్రహ్మలోక ప్రవేశమునందును

162) ఓం అతిమత్తాయై నమః

అధికమత్త స్థితియందున్న దేవి అధికముగా మదించిన (బలముగల్గిన) స్వేచ్ఛాప్రవృత్తి గలది 'అతి'మత్త స్థితికి విశేషణము దేవికామేశ్వరుని వామాంకస్థిత యందు బ్రహ్మాండపాలన క్రీడాసక్తయై విహరించును 2) స్థూల, సూక్ష్మ కారణ శరీరముల కతీతమై వాసనాక్షయ సహస్రారాంతర్గత చంద్రమండల మధ్యస్థ. సాక్షిస్వరూప చిత్కళా భావము సంశయ విపర్యయ రహిత జ్ఞానమత్తయైనది.

163) ఓం మహామత్తాయై నమః

మహితమత్త స్థితి గల్గిన దేవి 'మహా'విశేషణము గల మత్త రూపియైనది స్వాహా, స్వధా వషట్కార స్వరాత్మిక యైన సుధను గ్రోలుచు నిత్యమత్త స్థితిని భక్తుల శ్రేయస్సే పరమార్థముగా వర్ధిల్లు శక్తి శత్రుసంహారమునకు యాజ్ఞికులిడు హవి, సవనముల మత్తత నంది బలమునందుచుండును 'గర్జ గర్జ క్షణం మూఢ యావత్ మధుపిబామ్యహం' అమత్తిల్లిన స్థితియు భక్తాను కంపనయే

164) ఓం సర్వాకర్షణకారిణ్యై నమః

అంతటి నాకర్షించు శక్తి గల్గినది శ్రీ చక్రాధిదేవతా సముదాయములో తృతీయ చతురస్రాశ్రయ దేవి విభూతి షోడశదళ యర్చన యందును, కామ, బుద్ధి, అహంకార, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, చిత్త, ధైర్య, స్మృతి, నామ, బీజ, ఆత్మా, అమృతా, శరీరా కర్షిణియను వివరములు సర్వాకర్షణ కారిణీ పరములుగా వ్యవహార్యములు సర్వము అధీనము చేసికొను శక్తి నియంతగా విలసిల్లు చుండును 'సర్వస్వరూపే, సర్వేశే సర్వశక్తి సమన్వితే। సర్వతః పాణి పాదాంతే, సర్వతో౽క్షి శిరోముఖే, సర్వతః శ్రవణఘ్రాణే' అను పదములు నారాయణి, దుర్గాశక్తి తుత్త్వక్షలుగా తెలుపబడినవి

గీతప్రియా వాద్యరతా ప్రేతనృత్య పరాయణా
చతుర్భుజా దశభుజా అష్టాదశభుజా తథా(40)

165) ఓం గీత ప్రియాయై నమః

సంస్తుతి గీతముల శ్రద్ధ గల్గినది. స్వరసహిత సాహిత్యాలాపమున ప్రీతి గల్గినది భక్తులు సమర్పించు ఉపచారములలో గీతా గానము వశ సపర్య, ఆర్తాలాపము గూడ కరుణ రస గీతమే చతుష్షష్టి కళల యందునిది యొకటి స్తోత్ర పాఠములు, మంగళ హారతులు విని యానందించుచుండును

166) ఓం వాద్యరతాయై నమః

వాద్యనాదముల నాసక్తి గల్గినది సంగీత సంబంధి వాద్యములనేక విధ స్వరముల మధ్యవింపచేయును. భేరీ మృదంగ నిస్వనాదులతో పాటు తంత్రీవాద్యములను స్తుతి, గీతాలాపనల కనుగుణముగా వినదించుచుండ కొలువున సింహాసనస్థయై సఖియలతో గూడి వినోదించునది.

167) ఓం ప్రేతనృత్య పరాయణీయై నమః

ప్రేతయుత నృత్యమునందానదించునది. ప్రేతయన శివరూపం. ప్రళయతాండవమున భూమికి దేవి పాదములకు మధ్య శవ రూపమున నున్న శివుడు ప్రేతరూపము ఆ శరీరముపై ప్రచండ నృ

త్యము చేయుచు క్రీడించునది శక్తి స్వరూపిణీ దేవి శ్మశానవాసినిగా, నిత్య కంకాళ భరిత నృత్యమున, జీవులను పాదస్పర్శచే మోక్షమంద జేయునది లయకారిణి విభూతిగా నానందించుచుండును

**168) ఓం చతుర్భుజాయై నమః**

నాల్గుచేతులుగల మూర్తిరూపము గల్గినది. మీదుగా రెండుహస్తములు, క్రిందుగా రెండు హస్తములు. మొత్తం నాల్గు భుజాలుగల దేవి స్వరూపము ధర్మార్థకామమోక్షములు, అభీష్ట గ్రహణము, అనభీష్ట త్యాగమునకు సంకేతములు ధర్మమోక్షములభీష్టములు, అర్థకామములు అనభీష్ట పరిత్యాగములు. 2) చతుర్వర్ణములను సూచించునదిగా పేర్కొనిరి చతురాశ్రమములను సూచించును (బాల్య బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాసా శ్రమములు) చతుష్కూటమి క ఏ ఈ ల, హ స క ల, హ స క హ ల, సకల పరమేశ్వరి సూక్ష్మ రూపమగును 3) ఆయా అర్చారూపములను బట్టి చతుర్బాహువు ల పూరణము జరుగుచుండును సరస్వతికి పుస్తకం అక్షమాల వీణాధారణాది.(లక్ష్మికి రెండు కమలములు, వరదాభయ హస్తములు, రుద్రాణికి శర, చాప, పాశ, అంకుశము) కాళికి ఖడ్గ ముండ వర అభయ హస్తములు అర్చా రూపమునను సరించి ఆయుధ వినియోగములును జరుగుచుండును. అట్లు దశభుజాయని, అష్టాదశ భుజాయని వివిధ ఆయుధసముదాయం అమరు చుండి దేవి భక్తుల అభీష్టముల నెరవేర్చును అసుర సంహారము చేయుచు అష్టభుజామూర్తి యును యుండును

**169) ఓం దశభుజాయై నమః**

పది చేతులు గల్గిన శక్తి రూపము ఖడ్గినీ, శూలినీ, ఘోరా, గదినీ, చక్రిణీ, శంఖినీ, బాణ, భుశుండీ, పరిఘ. యుధా యనబడునవి పది ఆయుధములు పది చేతులలో ధరించి యున్నటువంటి దశ భుజా ఉపాసనారూపమై యున్నది

**170) ఓం అష్టాదశ భుజాయై నమః**

పదునెనిమిది చేతులు గల చండీరూపము సప్తశతీవిధిని అష్టాదశ ఆయుధములు ధరించి భక్త సంరక్షణియైన దేవి ఆయుధ పూజలో క్రమముగా 1) త్రిశూలం 2) చక్రం 3)శంఖం 4)శక్తి 5)చాపం 6) తూణీరం 7)వజ్రము 8)కులిశం 9) దండం 10)పాశం 11) అక్షమాలా 12) కమండలము 13)ఖడ్గము 14)చర్మము 15)పరశు 16)ఘంటా 17)హలము 18)ముసలాది సర్వము ధరించిన దేవి వివిధ దేవతలు పినాకి (1), కృష్ణ (2)వరుణుడు(శంఖ) (3) అగ్ని శక్తి(4), చాపబాణయుష్మవుల-మారుతము (5,6), ఇంద్రుడు(7), అమరాధిపుడు(8), యమ(9), వరుణ (10), ప్రజాపతి (11), బ్రహ్మ(12), కాల(13,14), విశ్వకర్మ(15), ఐరావత గజంఘంటం(16), అభేద్య ఆయుధములనేకం యిచ్చిరి మహాదుర్గయైనది

**కాత్యాయనీ జగన్మాతా జగతీ పరమేశ్వరి**
**జగద్బంధుర్జగద్ధాత్రీ జగదానంద కారిణీ (41)**

**171) ఓం కాత్యాయన్యై నమః**

కతుడను ముని కుమార్తెయైన శక్తి కాత్యాయని యని పిలువబడును 1) సకల దేవతల తేజస్సు నుండి ఉద్భవమైన పరాశక్తిని కాత్యాయని యందురు 2) కతుడను ఋషి కుమార్తెగా జన్మించి, తత్ స్వరూపమైన శక్తి రూపము కాత్యాయని 3) ఓఢ్యాణ పీఠాధిష్ఠాత్రియగు దేవి కాత్యాయని 4) కతుడను ముని శ్రేష్ఠుని ఆశ్రమమున పుట్టి పెరిగినది 5) కతులనే బ్రహ్మవేత్తల యందు నెలకొని యుండు శక్తి కాత్యాయని యందురు. 6) నిరంతర కన్యాత్వమున పరాధీనత లేని స్వేచ్ఛాశక్తి గలదిగా కాత్యాయని యందురు 7) భూలోకమున మహోత్తమమైన, దివ్యాప్త ఉత్తమమైన తేజము గలది కాత్యాయనిగా ప్రసిద్ధినందెను యని వామన పురాణం తెలుపును. 8)బ్రహ్మశిరస్సు మొదలగు స్థానముల ధరింపబడి వసించు శక్తి పరమేశ్వరిని కాత్యాయని యందురు 'క', బ్రహ్మ, కంఠీరం బ్రోక్ష మస్మిన్నారంచ కం మతం 'ధారణాద్వాసనాత్ కాత్యాయని యని మరొక అభిప్రాయం 9)

ఓం కాత్యాయన్యైచ విద్మహే, కన్యాకుమార్యై ధీమహి, తన్నో దుర్గి ప్రచోదయాత్ యను దుర్గా గాయత్రి, దుర్గ విభూతి స్వరూపమే కాత్యాయనిగా నుపాసింతురు

**172) ఓం జగన్మాతాయై నమః**

జగత్తునకు తల్లియైనది. 1) 'విసృష్టౌ, సృష్టిరూపాత్వం, స్థితి రూపాచపాలనే తథా సంహృతి రూపాంతే, జగతో౽స్య జగన్మయే' జగత్తును సృష్టిచేసి పోషించునదిగా, మాతృస్వరూపియై విలసిల్లు చుండును 2) బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, అనాది రూపియై సృష్టించి పరిపాలన చేయు శక్తిగను, పరమేశ్వరి జగన్మాతయై విరాజిల్లు చున్నది 3) భరిష్యామి సురాః శాకై రావృష్టైః ప్రాణధారకైః అని ప్రాణపోషణ శక్తి జగజ్జననియైనది 4) 'విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితి సంహారకారిణీమ్' అని తానే త్రిగుణ రూపయై త్రిలోకేశ్వరియై, స్వాహాస్వధావషట్కార స్వరాత్మికా రూపముల జగములనేలు మాతృ మూర్తి

**173) ఓం జగతాం పరమేశ్వర్యై నమః**

జగత్యా। పరమేశ్వర్యైనమః అని పేరు పరమపద్మును జగత్తులను పరమేశ్వరి శాసించునది పదునాల్గు భువనముల కాధారభూతమై పోషణియై శాసకియై, 'స్వచ్ఛావృత్తిని చరించుశక్తి' సర్వ లోకములకు పరమ అధీశ్వరియై యున్నది విశ్వంభరాయని గూడ యందురు లోకేశ్వరియును 'త్వంశ్రీ స్త్వమీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా। లజ్జాపుష్టిస్తథాతుష్టి త్వం శాంతి, క్షాంతిరేవచ' యనియును, 'అణిమాది గుణాధారాం, అకారాద్యక్షరాత్మికాం' సర్వ చేతనాశక్తియై క్రీడించుచున్నది

**174) ఓం జగద్బంధవే నమః**

జగత్తుకు బంధువైనది 1)సకల జగదుత్పత్తికి కారణము, మూల ప్రకృతియు అవ్యక్తరూపమునై యున్నది 2) మూల ప్రకృతి, మాయ, జగత్తు, నామ, రూపములుగా ద్వివిధము భాసిల్లు చుండును 3) దానవుల నుండి ఆపదలు గల్గినపుడు తానే యాదుకొనుచు, శత్రుక్షయము చేసి పోషించు శక్తి, ఉపాసించిన వారలకు వాంఛల కొసగి ప్రీతికరమైన శక్తియు నామెయే 4) ఆ బ్రహ్మ కీటపర్యంతం సృష్టిపోషణ వ్యవహారముల సర్వలోక బాంధవియై వెలుగును

**175) ఓం జగద్ధాత్ర్యై నమః**

జగముల ధరించునది జగముల సృష్టి పోషణాది కార్యముల నిర్వహించునది "ఇంద్రియాణాం అధిష్ఠాత్రీ భూతానాంచాఖిలేషుచ। భూతేషు సతతం వ్యాప్త్యై దేవ్యైనమోనమః ప్రాణధారిణి అమెయు శాకైరావృష్టైః ప్రాణధారకైః భరిష్యంతి కావున శాకంభరీరూపమైనది విశ్వంభరగా జగత్తుల నన్నింటిని తన పొట్టలో నిడుకొని పోషించు శక్తి

**176) ఓం జగదానందకారిణ్యై నమః**

జగముల కానందము గలిగించుమూర్తి 1)కర్త్యాత్రీ ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యైకుర్మో, భూభృతాం లక్ష్మ్యైశార్వాణ్యై అని వివిధ కృతుల సకల జీవుల క్షేమ భారమును వహించుచు తుష్టి గలిగించుచు పోషించు పుష్టి రూపిణియై యున్నది. 'సర్వదారిద్ర్య దుఃఖ శమనీం సుఖదుఃఖ నివారిణీం, భక్తానందకరీం దేవీం పర బ్రహ్మ స్వరూపిణీం, ఆనందకర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతా ఋషయస్తే త్రయః పుత్రాః అనియు, అశ్వదాయీచ గోదాయీ ధనదాయీ మహాధనే, పుత్ర పౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాది గో రథమ్। ప్రజానాంభవసి మాతా ఆయుష్మంతం కరోతుమాం అని లోకమందెల్లెడ భక్తుల వాంఛల దీర్చుచు ప్రసన్నయై జగదానందము వీక్షించు శక్తియై యున్నది

జగన్మయీ హైమవతీ మహామాయా మహామహా* లయా
నాగయజ్ఞోపవీతాంగీ నాగినీ నాగశాయినీ(42)

**177) ఓం జగజ్జీవమయ్యై నమః / జగన్మంయాయ్యై నమః**

జగత్తు నందలి జీవముల రూపమామెయే చరాచరములు, స్థావర, జంగమములు, దేవతిర్యక్ మానుష రూపములుచరములు, వృక్షాది పాషాణములు అచరములు సృష్టి నాల్గు విధములు జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజములన్ని రూపములు ఆమెయే సర్వసృష్టి పోషణయందుల కారకియై ఆమెయే జగత్తునందలి జీవ రూపములు ఆమెయే సర్వదేవతలు, స్వరాది రూపములుగా, స్వధాదికారకముగా, విశ్వ విభూతి గనుచు స్వేచ్ఛావృత్తమయి క్రీడించుచు ఆనందించుచుండును. ఇచ్ఛాజ్ఞాన క్రియాది త్రిగుణాత్మక తత్త్వశక్తి ఆమెయే

**178). ఓం హైమవత్యై నమః**

హిమవంతుని పుత్రికయైనది తస్యాం వినిర్గతాయాంతు కృష్ణాఽభూత్సాపి పార్వతీ కాళికేతి సమాఖ్యాతా హిమాచల కృతాశ్రయా హిమవత్ పర్వత వాసిని, హిమాలయ పుత్రి, అచలాత్మజ, శైలాద్రిసుతాయను పేరున ప్రఖ్యాతి నందిన దేవి దక్షపుత్రియైన సతి యోగాగ్ని దగ్ధయై మరుజన్మమున పర్వత రాజైన హిమవంతుని మేనకల పుత్రికగా జన్మించినది

**179) ఓం మహామాయాయ్యై నమః**

మహామాయారూపిణియైన దేవి మహావిద్యా మహామాయా, మహామేధా, మహాస్మృతిః మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ, జ్ఞానినామపి చేతాంసి బలాదాకృష్య మహామాయా ప్రయచ్ఛతి బ్రహ్మాదులకు గూడ మోహమును కల్పించుమాత 2) ప్రపంచమునకుమూల కారణమవు పరబ్రహ్మ శక్తి. సత్యము నావరించి యుండు శక్తి. ఆమోద యుక్తం వ్యసనాసక్తం జంతుం కరోతియా, మహామాయేతి సంప్రోక్తా, జీవిని జ్ఞానరహితుని చేసి అజ్ఞాన పరంపరల భ్రమింప చేయునది మమమాయాదురత్యయా ఆమె మాయా జాలమును గ్రహింప, తొలగింప నేరికిని శక్యము గాదు 3) స్థూల సూక్ష్మ కారణ శరీర త్రయ సమిష్టి మాయ ఆ మాయ ఈశ్వరాధీనము వ్యష్టి కారణ దేహమునవిద్య అవిద్య జీవులను వశపరచుకొనును వ్యష్టి కారణ దేహమున అవిద్య యందు జ్ఞానాంశ స్వల్పము ఇచ్ఛా క్రియ అధికముగ నుండును మాయ యందు జ్ఞానాంశ అధికముగా, ఇచ్ఛా క్రియలు అల్పముగా నుండును సచ్చిదానంద బ్రహ్మము కన్న నధికమైనది మహామాయ ఆత్మయందనాత్మ బుద్ధియు, అనాత్మయగు శరీరాదుల యందు ఆత్మ బుద్ధియు తోపింపచేయునది మహామాయ

**180) ఓం మహామహ్యై నమః**

మహిత గలవారి కంటె గొప్పదైనది. మాయా వినాపి మాయాకారిత్వాత్ మహామాయ మహాశక్తిమంతులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గూడ మోహింపచేయ గలట్టి మహామాయా శక్తి స్వరూపిణి మహా మహిత గలది మహితః శక్తి సామర్థ్యమస్యేతి మహాశక్తి, నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే ఆమె సమముగాగాని, యధికముగాగాని కనుపడని అత్యంత తేజ స్వరూపిణియైన శక్తి 2) మహిత మన భోగ, ఐశ్వర్య, వీర్య, బల, బుద్ధి, సిద్ధి యందు విశేషరూపమైన శక్తి గలది మహాయోగులకును ఈశ్వరియైనట్టి మహామహిత గలది దేవి తంత్ర, మంత్ర, యంత్ర స్వరూపమైన సర్వకాలీన సర్వలోకమయశక్తి. 3) సర్వదేవమయీం ఈశాం శక్తి సర్వ దేవతా శక్తి స్వరూపిణి. 4) మహాపద్మవనాంతస్థ, కారణానంద విగ్రహయై సర్వభూతహితముగా చరించుశక్తి దేవి ఖడ్గమాలాస్తుతిని మహామహేశ్వరీ, మహామహారాజ్ఞీ, మహామహాశక్తి, మహామహాగుప్తే, మహామహాజ్ఞప్తే, మహామహానందే, మహామహాస్పందే, మహామహాశయే, మహామహా శ్రీ చక్ర నగర సామ్రాజ్ఞిగా కీర్తింపబడినది.

**181) ఓం నాగ యజ్ఞోపవీతాంగిన్యై నమః**

నాగయజ్ఞోపవీతము ధరించిన శక్తి ఇక్కడ శివశక్తి అభేదత్వము అర్ధనారీశ్వర తత్త్వము నిరూపింపబడినది సదాశివ గణపతి, శక్తి ఉపాసనలలో నాగ భూషణములు ధరించి యుండుట

కాన వచ్చును గళహారములు, బాహులంబనలు, కటి సూత్రములు మొదలగువానికి సర్పరూప అలంకారములు వాడుట నాగజాతి వారు చేయుదురు నాగోపాసనా మూలమున, భక్తులకు సర్పముల వలన ఉపద్రవము గల్గదని భావన 2) ఇక పురుషులకు ఉపనయనముండును అపుడు యజ్ఞోపవీతము ధరింపచేతురు కాని స్త్రీలకు వివాహమే ఉపనయనము కాన వారికి యజ్ఞోపవీత ముండక మాంగళ్య ధారణ యుండును పతిగోత్రమున ప్రవేశించి పతి చేయు నిత్య వ్రతమున తోడు పడుచు సహధర్మచారిణిగ నుండును విశ్వయజ్ఞమున సగము పాత్ర ఫలము ఆమెది యగును పూజావిధానమున నాగహారం సమర్పయామి యనుచు ఉపచారము చేయరు

182) ఓం నాగిన్యైనమః

నాగశక్తి స్వరూపిణియైన దేవి 1)కుండలినీ రూపమున దేహమునాశ్రయించి యున్న శక్తి 2) ప్రకృతి యందు నాగము నొక విశిష్ట దేవతగా నర్చించుచు నాగదోషము నివారింప చేసుకొందురు ఆ దోషమున్న సంతతి విచ్ఛిత్తి గల్గునని శాస్త్రము తెల్పుచున్నది 3) సర్పరాజ్ఞి దేవతగా నొక ఋక్ సూక్తమును గలదు 4) శీఘ్రముగా పాకుచు పొగలిగినట్టిది నాగము దీని ఉనికి పాతాళమునను, భూమిపైన, ఆకాశగాములుగాను నుండును కావున త్రివిధయానాశ్రితములుగా పూజార్హములైనవి 5) కద్రువ సంతతి నాగములు అనంత,వాసుక్యాది ప్రముఖ సర్పములు దేవతాశ్రయములు గలిగి పూజలందుకొనుచున్నవి

183) ఓం నాగశాయిన్యైనమః

నాగశాయిని యైనట్టి దేవి 1) కుండలినీ శక్తి రూపమున పయనించి యున్న ప్రాణశక్తి 2) విష్ణుమాయారూపిణి, కృష్ణరూపి, వియత్ పథి పాలపుంతను ఆదిశేషరూపమునై సెలకొనియున్నది. 'వృశ్చిక రాశికి (సర్పెంటిస్)' అను నామము గలదు అతిభక్తమాయారూపిణి 3) నగము అనగా పర్వతము పర్వతముల నాశ్రయించి యున్నది 'హిమవత్పర్వత కన్యక పరమేశ్వరునితో' కైలాస శిఖరమున సెలకొని యుండుట విశేషమే గదా

నాగకన్యా దేవకన్యా గంధర్వ(గాంధారీ) కిన్నరేశ్వరీ * కిన్నరీసురీ
మోహరాత్రి ర్మహారాత్రి ర్దారుణా భాసురాంబరా * (43) భాసురాసురీ

184) ఓం నాగకన్యాయైనమః

నాగకన్యయై యున్న దేవి నాగేంద్ర హారయుతం, నగేంద్ర కన్య మానస యనియును హిమవత్పర్వత పుత్రి యైన పార్వతికి నామము నిత్యాషోడశికా రూపము. కాలావసానము వరకు పరమేశ్వరుని అర్ధాంగిగా కామేశ్వరి. నిర్మలయై కన్యా రూపముననే రత్న సింహాసన మాశ్రయించి యుండును. జగన్మాతయైన యామె నిత్యయౌవని ముగ్ధ, కన్య. తత్ స్వరూపశక్తి ఆమె విభూతియే

185) ఓం దేవ కన్యాయైనమః

దేవకన్యయైన దేవి శుద్ధలక్ష్మి మోక్షలక్ష్మి జయలక్ష్మి సరస్వతీ శ్రీలక్ష్మి వరలక్ష్మి శ్చ ప్రసన్నా యను శ్లోకము గల దైవశక్తి స్వరూపిణియైనది దేవిదేవ శరీరోత్థ్యా జగత్రయహితైషిణీ, యాదేవీ సర్వ భూతేషు విద్యా, లక్ష్మ్యాది రూపేణ సంస్థితమునైనది కన్యాంకనక సంపన్నాం కనకాభరణైర్యుతాం అని కన్యాదానమున దైవస్వరూపముగా నెంచురు విశేషమహిమలు గలిగి అర్థుల కామ్యము లిడెడు దైవి స్వరూపమునై యున్నది దివ్యశక్తులు గల కన్య దేవకన్య. దేవత యన వరమిచ్చుట, ప్రత్యక్షమగుట, దివ్యకాంతి కలిగియుండుట అను లక్షణములు గలది.

186) ఓం గాంధర్వ్యైనమః

గంధర్వీ గంధర్వ శక్తియై యున్నది గంధర్వులు దేవయోని సంబంధి విశ్వావసాదులునై యున్నారు దేవలోకమున దేవగంధర్వులు, మనుష్య లోకమున మానుషగంధర్వులు నుందురు ఉత్తమ కర్మలచే గంధర్వ లోకము చేరి నివసించువారిగా ప్రసిద్ధి పర్వతాగ్రముల విహరించు వారనియు, గాయక

శ్రేష్ఠుల వియు గూడ నందురు దేవిని తమ కలగానముల సేవించి తరించువారని, వారి గానమందలి శక్తి రూప మామెయే యగునని, రాగ తాన పల్లవియుత మనోహర గాన స్వరూప శక్తి అమెయే యగును ఆ గానశక్తి గల్గిన స్త్రీ రూపియు ఆమె యంశయై యున్నది

187) ఓం కిన్నరేశ్వర్యై నమః

కిన్నర గణముల కీశ్వరియై యున్నది దైవీగణములు గంధర్వ కిన్నర కింపురుషులని పేర్కొందురు. కిన్నర కింపురుషులు అశ్వముఖమున నరాకారము గల్గినట్టి దేవయోని విశేషము గాన ప్రజ్ఞ గలిగినట్టి వీరు నిత్య స్తోత్రముల దేవిని పూజింతురు వారి గాన శక్తి అమెయే ఆ గణములలో స్త్రీ మూర్తియై విశేష ప్రజ్ఞ గల్గినది తత్పమపరమేశ్వరీ రూపులై యున్నారు

188) ఓం మోహరాత్ర్యై నమః

మోహరాత్రి స్వరూపిణియైనట్టి దేవి జగత్త్రయమును భ్రమింపచేయునది.మోహము రాత్రి కృష్ణ పక్షమునకు సంకేతమునౌ కాళీరూపం మధుకైటభులను మోహింపజేసి విష్ణుమూర్తి కనుకూలముగా చేసినదియైన దేవి కాళరాత్రి మహారాత్రి, మోహరాత్రిశ్చదారుణా యని ప్రళయ కాలమున జగత్తం తయు జలాకీర్ణమై సూర్యచంద్రాదులు తమ గతుల తప్పి చీకటులు క్రమ్మునట్లు చేయు శక్తి. జగత్తును మోహింప జేయునది జగన్మోహినీ రూపము సంమోహమును గొల్పు కాళీరూపము విష్ణువు అమృత కలశము వశము చేసికొనుటకును భస్మాసురుని చంపుటకును జగన్మోహినీ యవతారము దాల్చెను. దాననే శంకరుని గూడ మోహింపజేసెను విష్ణుమాయా శక్తియే జగన్మోహిని

189) ఓం మహారాత్ర్యై నమః

మహారాత్రి స్వరూపిణియైనది కాల పరిగణనలో దినము సగము రాత్రి సగము అహోరాత్రము మానవ దినము, మానవ సంవత్సరము పితృ దినము పితృ సంవత్సరం బ్రహ్మ దినము బ్రహ్మ సంవత్సరం విష్ణు దినము ఆ పై రుద్ర దినం, పరమేశ్వరీ దినం అంతే పరిమాణం మహారాత్రి పరిమాణం ఆ సమయమున పరమేశ్వరి సాదాఖ్య కళ యొక్కటియే ప్రజ్వరిల్లుచుండును అట్టి సమయమున కథీశ్వరి మహారాత్రి స్వరూపిణి

190) ఓం దారుణాయై నమః

దారుణ రూపిణియైన దేవి చండోగ్ర రూపియై భరించుటకు శక్యముగాని శక్తి. అతి తీవ్రమైనది. చండముండాది రాక్షస సైన్యమునంతటిని యేకాకియై హతమార్చుటకు సర్వాయుధపాణియై అస్త్రశస్త్ర ఘంటా నాదయుత గర్జనల 'హుం'కార శబ్ద మాత్రముననే సంహారము చేయు శక్తి కరాళ రూప కాలాగ్ని సమాకృతి 2) రాత్రి ప్రళయకాలరూపం అర్ధరాత్రి ఘోరతమం రాత్రి 12 గంటల నుండి ఉదయము వరకు నుండు సమయం మహా కాళి సంబంధం శ్మశాన స్థలవాసిని కాళి శవారూఢ, మహాభీమ, ఘోరదంష్ట్ర, అట్టహాసముఖ, చతుర్భుజ, ముండమాలాధర, లలజ్జిహ్వ దిగంబరాది దారుణ రూపము గల శక్తి.

191) ఓం భాసురాంబరాయై నమః

ప్రకాశవంతమైనటువంటి వస్త్రములు ధరించినది రంగుల కాంతులు వికిరణము చేయునట్టి ఉజ్జ్వల వస్త్రములు ధరించినది. దిగంబరాయని విరాట్ మూర్తికి తగును మానవ నేత్రమునకు కానరానట్టి భాసుర వస్త్రములు గల్గినది 2)అసురులకు భీకర మాదెడునట్టి ప్రకాశవంతమైన తేజస్సు గల్గినట్టిది. అసురులకును గూడ హితము చేయునట్టిమాత 3)'అసూర్యానామతే లోకా అంధ తమః ప్రావృతా' యను కాళి అసూర్య లోకములకు వెలుగునిచ్చు శక్తియైనది

విద్యాధరీ వసుమతీ యక్షిణీ యోగినీ జరా
రాక్షసీ డాకినీ వేదమయీ వేదవిభూషణా(44)

192) ఓం విద్యాధర్యై నమః

విద్యాధరియై యున్న దేవి జీమూత వాహన, పుష్పదంతాది దేవతల గణములు గుటికాంజనాది విద్యల ధరించువారు మాతృకా స్వరూపిణి, సర్వమంత్రేశ్వరి, సర్వ విద్యేశ్వరి, సర్వవాగీశ్వరి రూపములుగా నెలకొనియున్న దేవి సర్వ యంత్ర మంత్ర స్వరూపిణియై విద్యాధరిగా వెలుగును 2)విద్యాహిసా, పరమాహిదేవి వేదస్వరూపిణి జ్ఞానస్వరూపిణి, వివేచనా శక్తి యామెయే విద్యలు పరా, అపరాయను రెండు విధములు బ్రహ్మ విద్యశ్రీ విద్యాది పరమేశ్వరియే మాయా కార్య వివేకమై విద్యాపరముపై కల, పరమా, విద్యా జ్ఞాన క్రియాత్మకము విమర్శని కాత్యాయనీ విద్య, చతుష్షష్టి విద్యా స్వరూపములు అన్నియు ఆమె రూపే. చతుర్వేద మంత్ర బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషదాది, వేదాంగములువారు, స్మృతి, పురాణ, ఇతిహాస, సంగీత, సాహిత్య, చిత్రలేఖనాది కళా విద్యలన్నింటి రూపమును నామెయేయై యున్నది

193) ఓం వసుమత్యై నమః

వసుమతి రూపునై యున్న దేవి 1)వసుమతి యనగా భూమి జీవులను భరించుచు వారి కావశ్యక మగు రత్నధన సంపదల నందజేయు రూపము పాదస్పర్శాది అవాంఛనీయ పాపముల క్షమా రూపియై భరించునది 2)అష్ట వసువులు (ధర, ధ్రువ, సోమ, విష్ణు, అనిల, అనల, ప్రత్యూష, ప్రభాసలను వారు) వొక గణము అష్టవిధ సంపదల కధిపతులై జీవపోషకముగువారు. వారి శక్తి భూ, హిరణ్య, రత్న, గో, ధాన్య, సంతాన, సౌభాగ్య, గృహ, ధన, పరివారకాగణములాది ఇవి పితృ దేవతలపై తరమున వసు రూపుల నుండి వంశపారంపర్యముగా లభించు చుండును వానికి కర్త్రి యైనది వరలక్ష్మియే 3) రాజులకు గూడ సంతతి, భవన, గో, అశ్వ అవి మణి రత్నాది, రథ హస్త్యాదిక అష్ట విధ భోగములమర చేయును 4) అష్ట విధరుద్రాంశలైన పృథ్వి, జల, వాయు, తేజ, మనో, బుద్ధి, చిత్త, అహంకారములాదిగా మాన్యత నిడునది 5) వసుదా, వసుధా, అహరము, సువర్ణ రూప ధనము నిడి కర్మఫలముల కూర్చునది అంత్య మోక్షము నిడునది 6) 'వసుం ప్రకృష్టం మోక్షాఖ్యం ఫలం భక్తేభ్య ప్రదదాతి' భక్తులకు మోక్షమునిడునది 7) దేవీ దివ్య వసు ప్రభాభయ భవ ప్రధ్వంసినీస్యాదమా'యని ధన లక్ష్మి రూపమున ఉపాసన. 8) ఓం శ్రీ వసుదే, వసుధారే, వసుకరి, ధనకరి, ధాన్యకరి, రత్నకరి స్వాహా అను మంత్రాధిష్ఠిత యైన దేవి

194) ఓం యక్షిణ్యై నమః

యక్షిణీ రూపముపై యున్న దేవి యక్ష గణముల కధిపతి కుబేరుడు ధనాధిపతియై యుండును అతని శక్తి యక్షిణి. అలకాపురి నివాస స్థానముగా వెలసిల్లు గణములు 2)సర్వాసాం యక్షిణీ నాంతు ధ్యానం కుర్యాత్ సమాహితః, భగినీ, మాతృ, పుత్రీ, స్త్రీ రూప తుల్యం యథేప్సితం అని యక్షిణుల ధ్యానరూప నిర్వచనం 3) యక్షిణీ యంత్రములు ఉపాసన, భౌతిక సంపదాప్తికి చేయనగును ప్రత్యేక నియమములతో నుపాసించనగును

195) ఓం యోగిన్యై నమః

యోగినీ రూపముపై యున్న దేవి 1) యోగములునాల్గు విధములు మంత్ర, రాజ, హఠ, లయ యోగములు జీవ పరమాత్మల సంయోగము, జ్ఞాత జ్ఞేయ ఏకత్వ భావనయు ఇంద్రియముల మనసున బంధించి ఏకైక్యము చేయుటయే యోగ స్వరూపము ఆ చిత్త వృత్తి నిరోధినీ శక్తి యోగినియే యోగయుక్తమైనది యోగిని విశృతి యోగిని 2)దేహమందలి షడార చక్రముల అధిపతులు యోగినీ రూపములే ఆ గణములు వర్ణకూట అధిదేవతలుగా వెలుగుచుందురు 1)అచ్చులు(16), డాకినీ-కంఠస్థానము, 2) క నుండి ఠ (12) రాకినీ హృదయం అనాహతం, 3)డ నుండి ఫ (10) లాకినీ మణిపూర స్థానము, 4)బ నుండి ల (6) కాకినీ మేఢ్రం స్వాధిష్ఠానం, 5)వ నుండి స (4) సాకినీ యోని ఆధార చక్రం, 6)హ,క్ష (2) హాకినీ భ్రూ, మధ్య ఆజ్ఞాచక్రం మొత్తము యేబది

అక్షరములు క్రమముగా నాయా చక్రముల కధిపతులునై యున్నారు 3) శ్రీ చక్ర పూజమందును ఆవరణ దేవతలుగా ప్రకట, గుప్త, గుప్తతర సంప్రదాయ కుల, నిగర్భ, రహస్య, అతి రహస్య, పరాపర యోగినులు నవావరణముల రక్ష చేతురు 4) ఉపాసనలలో పంచాంగ, దశాంగ, షోడశాంగాది రాద్రీకరణము అని, ఉపాసనా మంత్రములన్యాసము చేసి చివరికి పరమేశ్వరేశ్వరీ ఐక్య భావనను పరాకాష్ఠగా నెంచుదురు

196) ఓం జరాయై నమః

జరారూపిణియైన దేవి ముసలితనం, వార్ధక్యమునకు అధిష్ఠాన దేవత దానిని తొలగింప చేసికొనుటకు దేవి ఉపాసన 'జరాధ్వాంత రవి ప్రభాయైనమః' యని కొలుతురు 2)జరా రాక్షసిని గోడపై వ్రాసి రాకను నివారింతురు పసివారి మరణమును అకాల వృద్ధాప్యమును ఆమె ప్రభావమే 3)జర యన వృద్ధాప్యము దేహమునకుజీవికి గల్గువాసనా బంధము సులభముగాతొలగింప చేయునది. మృత్యుంజయ మంత్రార్ధము గూడా పండిన దోసపండు తొడిమ! పెట్టుమండి వేరగునట్లు ఈ దేహము అను వృక్షము నుండి జీవిని విముక్తుని చేసి ఉన్నత లోకములంద జేయుమని ప్రార్థన అ ప్రాణ శక్తి అధీనమేయైనది

197) ఓం రాక్షస్యై నమః

రాక్షసియై యున్నది రాక్షసనామార్థమున దేవదానవులనందరిని సమతా దృష్టిని పాలించుదేవి. దయ కనికరము లేని నైర్మరూపి దుష్టాంగంబు ఖండించి శిష్టాంగ శ్రేణికి రక్ష చేయు వాడు గదా అటులే హింసాద్వేషము గల మూకల హింసాది ప్రవృత్తిచే దండించి ధైర్యము చేసికొను శక్తి. రక్షో గణము రాక్షసి వికృతమే దేవి యిచ్ఛానుసారము శాంతి నెలకొల్పువారు

198) ఓం డాకిన్యై నమః

ఢాకిని యైనట్టి దేవి రూపము. 1)షోడశ స్వరాధిష్ఠాన దేవత ధానికి మిగిలిన వర్ణములన్నియు స్వరయుతమై నపుడే అర్థవంతమైన శబ్దము యేర్పడును. ఆ పై అర్థము భావము గలుగును అట్టి మూల స్వర శక్తి ఢాకినీ రూపిణి అంబికయే విస్పందేహముగా నగును 2) దేవి అనుచరురాలు ఉపద్రవమును కలిగించెడి దేవి రోషము అర్పనచే శుభము గల్గును 3)పదునారు దళముల చక్రము, స్వరములు, అమృతాది షోడశ యోగినీ రూపములు ధరించిన చక్రాధీశ్వరియై యున్నది. 'డ'కారము బీజ, న్యాస, మంత్ర సంకేతములుగా గల శక్తి. 4)విశుద్ధి చక్రేశంతే విశుద్ధి ఢాకిని విశుద్ధ నాధదేవి యని యర్చారూపమై యున్నది

199) ఓం వేదమయ్యై నమః

వేదమయియైనదేవి చింతామణి గృహద్వారముల తూర్పున ఋగ్వేదము, దక్షిణమున యజుర్వేదము, పశ్చిమమున అధర్వణ వేదము, ఉత్తరమున సామవేదము శుద్ధ విద్యాది తంత్రములన్నియు వాకిలి కడ కావలి యుండుదేవి ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, సర్వం ఖల్విదం బ్రహ్మ యని వేదసార మూర్తియైన దేవి స్వరూపము వేదవేద్య-వేదముల వలననే ఎరుకగనగు రూపము గలది 2)సకల ప్రపంచమున గల జీవుల సంబంధి సమస్త విషయములు యెరుకగనియున్న జ్ఞేయ జ్ఞాతృ రూపము. సకల దేశ భాషలును ఉత్పన్నమైనట్టి వైఖరీ రూప శక్తి వేదజనని పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యనువాచావస్థల పూర్ణ రూపమామెయే 3)జ్ఞాని నామసి వేతాంసి భగవతీహిసా పశుపక్ష్యాదులకు జ్ఞానము, శబ్ద పరిణతి కల్పించునట్టి శక్తియు నామెయే దానికి నిదర్శనము-పక్షులకు రాత్రియందు భూమి అగ్నిగోళముగా కన్పడి ప్రయాణము చేయవు. తెల్లవారుఝామున కలకలములతో బయలు దేరును వానికి ఆకాశము నుండి ఎఱను చూడగల్గు దూరదృష్టి వంటి శక్తి ఆ దేవి ప్రసాదమే

200) ఓం వేదవిభూషణాయై నమః

వేదములే విభూషణములుగా గలది 'విద్యాస్సమస్తా స్తవదేవి భేదాః' యనియుమవిద్యాసుశాస్త్రేషు అనియును, 'యాదేవి సర్వభూతేషు విద్యారూపేణ సంస్థితా' 'మేధే సరస్వతి వరేభూతి భాభ్రవి తాపసి' యను వివిధ నుతుల శర్వాణీ రూపమే వేదము 'మహావిద్యామహామాయా మహామేధాది' రూపమైనది 2) తెలిసికొనదగినది వేదము అట్టి జ్ఞానస్వరూపమును భూషణముగా గలిగిన విద్యారూపిణి కాని 'వేద్యా, అవేద్యా' యను రెండురూపములు ఆమెకుగలవు బ్రహ్మాది దేవతలును గ్రహింపనేరని విద్యాతత్త్వమామెయే జ్ఞానాతీత స్వరూపమును గ్రహింపనలవి కానందున అవేద్యా యనిరి తెలిసిన విషయమునైనను ఉపాసనావిధులనాయావాంఛల సిద్ధికై సగుణరూపము కల్పించి మానవరూపమున ద్వి,చతు,అష్ట, దశ, షోడశ, శత, సహస్ర భుజిగానూహించి సర్వదేవమయమైన యామెకు నాయుధములు చేర్చి అర్చింతురు ఎరిగిన వేదములకావల ఎరుకగనని కాంతిపుంజము ఆమెయేయని గ్రహింపనగును

[illegible]

శ్రుతిః స్మృతిర్మహావిద్యా గుహ్య విద్యా పురాతనీ
చింత్యాఽచింత్యా సుధా*స్వాహా నిద్రా తంద్రావ పార్వతీ(46) స్వధా

201) ఓం శ్రుత్యై నమః

శ్రుతిరూపమున యున్న దేవి శ్రోత్రేంద్రియ, జన్యశబ్దాది విషయక మనోవృత్తిరూపః తద్వ్యాప్త తత్ సాక్షియతాత్-ఋగ్, యజు, సామ, వేదముల శ్రవణగోచరములు గావున శ్రుతులనబడును అవియు బ్రహ్మస్వరూపమే అట్టి వేద స్వరూపిగా నున్నది గురుశిష్య పరంపరగా వాక్,శ్రోత్ర విధిని గ్రహింప బడునది శ్రుతియందురు 2) మూలాధార చక్రాధిష్ఠాత్రియగు సిద్ధవిద్యాదేవియొక్క మంత్ర విశేషము దియు. గర్భస్థ పిండముయొక్క పంచమమాస స్వరూప స్వభావస్థితిని బోధించును.(కదలిక, వినికిడి)

202) ఓం స్మృత్యై నమః

స్మృతి స్వరూపమునై యున్నది శ్రోత్రములు గ్రహించిన వానిని స్మరణీయ-మననముల ద్వారా, మునులు నిర్దేశించిన విధి మను, పరాశర, యాజ్ఞవల్క్యాది మహాపురుషుల స్మృతులు పందల సంఖ్యలో గలవందురు స్మృతులు శ్రుతి జన్యములైనందున పరమేశ్వరియు స్మృతి రూపిణియై యున్నది 2) ఆజ్ఞాచక్రాదిష్ఠాత సిద్ధమాతా దేవత మంత్ర విశేషమును, గర్భస్థ పిండము యొక్క యారవ మాస స్వరూప స్వభావస్థితియు బోధించును జీవుల త్రికాల కర్మల నన్నింటిని స్మృతి పథమున నేర్పరిచి యుండిన పరమేశ్వరి స్మృతి రూపమై యున్నది

203) ఓం మహావిద్యాయై నమః

మహావిద్యా రూపమునైయున్నది 1) ఆత్మవిద్యయే మహావిద్య. ఆత్మయే బ్రహ్మము మహత్ రూపమున మహా విద్యారూపమగును 2) కాళి, తారా, షోడశి, భువనేశి, బగళా,ఛిన్నమస్తా, ధూమ వతి, మాతంగి, త్రిపురభైరవి, కమలాయను దశ మహావిద్యలును అనూనముగా ఉపాసింప బడు చున్నవి ఇవి దేవి దశ విభూతులుగా అసుర సంహారము జీవరక్షణకై యుద్దేశింపబడినవి 3) వనదుర్గా మహావిద్యా, యజ్ఞవిద్య, మహావిద్యా, గుహ్యవిద్యా చ శోభనే-అని లింగపురాణము ఉపకోసలునకు అగ్నులు ఉపదేశించిన ఆత్మవిద్య, సనత్కుమారుడు నారదునికి ఉపదేశించిన భూమవిద్య, యాజ్ఞవల్క్యుడు మైత్రేయికిచ్చిన ఆత్మవిద్య, బ్రహ్మరంధ్రము నుండి మూలాధారము పర్యంతం హంస (ప్రాణరూపి) యాత్రానుభవ వివరణ మహావిద్యలుగా గ్రహింపబడినవి

204) ఓం గుహ్యవిద్యాయై నమః

గుహ్యవిద్యా రూపమునై యున్నదేవి ఇమేలోకే యేచరంతి ప్రాణా గుహాశయాని హితా స్సప్తసప్త-శిరసునందు సప్తరంధ్రములు గుహలుగా నోరు, శ్రవణ, నాసికాక్షి ద్వయములు ఇవియే

ప్రాముఖ్యముగా జీవలోక ప్రవృత్తుడగుచుండును 2) పరమేశ్వరి యొక్క సూక్ష్మరూపము అతి రహస్యమైనదగుటచే, మానవ గోచరాతీతమగుటచే గుహ్య అందురు గోప్త్రీ నామార్థము అతి రహస్యార్థ స్వరూపిణి యని భావము. 3) పంచ కోశాంతర్వర్తి యగు గుహాలయ ప్రాణరూపి పరమేశ్వరి సంచారము కావున గుహ్యాయనబడును 'యదంతం పంచకోశానాం గుహాశబ్దేన గీయతే' 'హృదయాకాశే నిహితా' యని ఉపనిషత్తులు ఘోషించును 4) అంతః కరణ సంబంధమైన దగుటచే గుహ్య, మనోవాచామగోచరము, జ్ఞానదృష్టికి మాత్రమే గోచరమగు గుహ్యరూపము గుహ్యమగు జ్ఞానరూపమున గుహ్యోపదేశమునుండి, గుహ్య భక్తులచే నిగూఢ గురు రూపధారియైన దేవి.

205) ఓం పురాతన్యై నమః

పురాతనియై యున్నది 'చిరంతనం పురాతనోఽహం పురుషోఽహమీశః శృతి చిరకాలస్థితి. అజోనిత్యః శాశ్వతోఽయం పురాణః' పరమేశ్వరి సృష్టికి పూర్వమందున్నది బ్రహ్మాది దేవతలు అనిత్యులైనను, పురాతనిగా కాల అవధులెరుగక, కాలాతీత, కాలకాల నామభూషణియై పురాతని లోకములలో క్రీడించు ఆద్యాశక్తి 'కాలేనాఽపరిచ్ఛిన్నత్వాత్ పురాభవతీతి పురాతనా' అవిచ్ఛిన్న కాలస్వరూపిణియైనది

206) ఓం చింత్యాయై నమః

స్మరింపదగినది చింతార్హరూపం పరమానంద రూపం సర్వేంద్రియ సంయమన పూర్వకం ఆత్మైవసర్వదాచింత్యం 2) అర్చితే ప్రణతాం ధ్యాత్వా సర్వభావవినిశ్చితైః ఆరాధితాస్తుతాచైవ సర్వసిద్ధిప్రదాయినీ, త్వం స్వాహా, త్వం స్వధా, త్వం హిషట్కార స్వరాత్మికా, సుధాత్వమక్షరే నిత్యే త్రిధామాత్రాత్మికాస్థితా' యను సర్వవిధ బాధలనుండి రక్షణ కల్పించు మాతృస్వరూపము చింత్యమై యున్నది—చింతనావిధానం. 'కర్మేంద్రియాణి సంయమ్య పంచబుద్ధీంద్రియాణిచ యోజయేత్ తాని మనసి హ్యహంకారే తథామనః అహంకారాంతథా బుద్ధే, బుద్ధిమాత్మానియోజయేత్ యత 'బుద్ధీంద్రియః పశ్యన్‌బుద్ధ్యా, బుద్ధ్యాత పరాత్పరం'

207) ఓం అచింత్యాయై నమః

చింతించుటకు రూపమిద్ది యని నిరూపించలేనిది పంచభూతాతీత గుణత్రయ రహిత, నిర్గుణ స్వరూపమైనది యతోవాచా నివర్తంతే అప్రాప్యమనసాసహ-అని మనసున కందని అవాఙ్మానస గోచరం రూపం, చింత్యమైన సగుణరూపం గాక అతీతమైన నిర్గుణ నిరాకార అచింత్యరూపం అంతఃకరణ వృత్తి విషయభూతమైనది

208) ఓం స్వధాయై నమః/ ఓం సుధాయై నమః

దేవతలకు హవిస్సు విడువపుడు స్వాహా, పితృదేవతలకిడునపుడు స్వధారూపము 2) అగ్నిమూర్తి యగు శివునికిమె యొక పత్ని. 'దేహింవామే, స్వధాం తథా' అని పరమేశ్వరి అంశను స్వధయను దేవతను బ్రహ్మ సృజించి పితరులకు ఇచ్చెను 3) కృష్ణవక్షం గోలోక రాధాసఖియు, రాధాశ్రమశీల అగ్నిమూర్తి పత్నియైనదియు, అగ్నే దక్షిణయై వల్లభుని దక్షభాగమున నివసించుచునది. అనాహతచక్ర దేవతయనగు వామదేవ మంత్రవిశేషము 4) గర్భస్థ పిండము యొక్క రెండవ మాసస్థితి 5) పితృప్రాణతుల్యా, ద్విజప్రీతికరా, ద్విజజీవన రూపిణీ, శ్రాద్ధాదిష్టాతృదేవి, శ్రాద్ధఫలప్రదా, బ్రహ్మమానస కన్య, పితృతుష్టి ప్రదయనుని నామముల కీర్తింపబడుచున్నది ఇక సుధాయనగా అమృతరూపిణీ, పోషిణీ, జీవులకన్నపానాదులనిడునది

209) ఓం స్వాహాయై నమః

స్వాహాదేవి అగ్నిపత్ని రూపిణియైన దేవి 1) దేవతాహవిర్దానవాచకము హవిసు విడుచునపుడు మంత్రాంతమున చేర్చు పదము దేవతలకు ప్రీతిప్రదము లేనిచో ఆయా దేవతలకు చెల్లదు ఇచ్చిన హవిసు రాక్షసులకు చెందును 2) అగ్నిమూర్తి యగు ఈశ్వరుని భార్య పార్వతీదేవి ఈమె పుత్రుడు

షణ్ముఖుడు 3) మహేశ్వరీ పీఠాధిష్ఠాత్రి 'స్వాహా మాహేశ్వరీ పురే' విశుద్ధచక్రదేవత యగు వజ్రేశ్వరి మంత్ర విశేషము ప్రథమామాస గర్భస్థ పిండము స్థితిని తెలియపరుచును 4) స్వాహాంతు దక్షిణపార్శ్వ యని మంత్రము స్వాహా, వహ్నిప్రియా, వహ్నిజాయా, సంతోషకారిణీ, క్రియాశక్తి, కాలరాత్రి, పరిపాకకరి, ధ్రువగతి, దాహిక, దమనక్షము సంసార సారరూప, దేవపోషణకారిణీ, ఘోరసంసారతారిణీ, దేవజీవనరూప యను పదహారునామములు పుణ్యదములు 5) స్వాహా పంతతిగా దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని యను త్రేతాగ్నులు 'స్వాహాసినై పితృగణ, స్వతృప్తి హేతు' యని సప్తశతి వాక్యము

210) ఓం నిద్రాయై నమః

నిద్రారూపిణియై యున్నది. నిద్రారూపేణ సంస్థితా ప్రాణినా, దేహమాశ్రిత ప్రళయాంతరము నేర్పడు ప్రశాంతియు దీర్ఘనిద్రయే విష్ణువు నిదురించియుండ కర్ణమలోద్భూతులైన మధుకైటభు పులుద్భవించిరి వారి ఉనికి ఎరుకలేదు బ్రహ్మ దేవిని స్తుతించ విష్ణువు శరీరము నుండి తొలగినంతనే యుద్ధము చేయగలిగెను, 'నిద్రాం భగవతీం విష్ణోరతులాంతేజ సాం ప్రభుః' నిద్ర అచేతనావస్థ శరీరము సంసార వ్యాపారముల బాగాడస్సియున్నపుడు జ్ఞానులనైనను మోహింపజేయునది

211) ఓం తంద్రాయై నమః

అలస స్వభావము గలిగినట్టిది తన్మయత్వమున, మాదకత్వమున కలుగు తాత్కాలిక అచేతనాస్థితి నిద్రావస్తకు పూర్వమేర్పడు స్థితి ఆవలింతలు కనులు మూతపడుట వంటి అజాగ్రత్త స్థితి మధుపానమున నేర్పడు మైకము 'మదాలసాం మంజుల వాగ్విలాసాం' అని కాళిదాసు మాతంగిని స్మరించెను తాంబూల చర్వణ సమయమున నివేదిత పదార్థముల రసము దేహమందు వ్యాపించు స్థితి యందు కూడా అంతర్లీన స్మృతిశక్తి యేర్పడును

212) ఓం పార్వత్యై నమః

పర్వతపుత్రియైన దేవి పర్వతరాజైన హిమవంతుని పుత్రియైనందున పార్వతియాయెను పూర్వ జన్మమున దక్షపుత్రి సతిగా అవమానము పాలై దేహము త్యజించి మరుజన్మమున పార్వతి అయెను 2) పరమేశ్వరి రూపము పర్వతము వలె కూటస్థము అచలము, ధ్రువమునై యున్నది ఎట్టిమార్పును లేని నిర్వికార చిన్మాత్ర స్వరూపము అచలాత్మజ, హైమవతి, గిరిజ, గిరికన్య, పర్వతరాజపుత్రి, మేనకాత్మజలు పర్యాయపదములు

అపర్ణా నిష్కలా లోలా సర్వవిద్యా తపస్వినీ
గంగా కాశీ శచీ సీతా సతీ సత్యపరాయణా(46)

213) ఓం అపర్ణాయై నమః

అపర్ణానామధేయము కలిగిన దేవి హిమాలయపుత్రిగా పార్వతి, శివుని యర్ధాంగియగుటకు తీవ్రమైన తపస్సు చేసినది కొంతకాలము నిరాహారము, నిద్రాహీనము, నిర్జలము, ఎండిన రాలిన ఆకులు గ్రహించి అవి కూడా లేకుండా తపస్సు చేసినందున యపర్ణయాయెను 2) అమె అనేక రూపములు, విభూతులు అనేకమైనప్పటికీని 'ఏకా' జగతి, వృక్షమునకు శాఖలు శాఖకు పత్రములు అనేకము మూలకాండము అపర్ణయై యున్నటికి యాధారభూతమగును రంగుల నేకముగా కనబడినను 'కాళ' వర్ణమున నన్నియు సదృశ్యమై వొకటే రంగయినట్లు 'అపర్ణ'తత్వ జగత్తుకామెయే మూలశక్తి.

214) ఓం నిష్కలాయై నమః

చలనరహితమైన స్థిరస్థితిశక్తి. నిష్క్రియా శూన్యం 'నతేన్యాద్విక్రియాం దుఃఖీ, సాక్షితా, కా, వికారిణాధి నిష్క్రియా పహ్నసాణీ, రసాకృతో ఉ హమలిక్రియా' 2) సప్తకుల పర్వతములు, దిజ్నాగములు స్థిరమై

యున్నపుడే భూచలనము క్రమమార్గమున జరుగును అట్టి స్థిరనిశ్చలమైన శక్తి ఆమెయే శాంత, నిర్వికల్పా నిర్వికారా, నిశ్చింతా, నిష్కలా,నిష్క్రియా, నిర్మలా–అనుబంధనామములు. 3) ధృవనక్షత్రము చుట్టు నక్షత్రసముదాయము భూమ్యాదిగ్రహములు తిరుగును ధృవము నిశ్చలముగా చేయు శక్తి ఆ పరమేశ్వరియే

215) ఓం లోలాయై నమః

లోల స్వభావము గలది పోషణారూపము లోలజిహ్వ, లోలాక్షి చంచల స్వభావము గల లక్ష్మీరూపము రక్తపానాసక్తిగల స్థితిని లోలజిహ్వారూపి దూరముగా నున్న వస్తువునైనను నందుకొను శక్తిగలది 2) ఉన్నత స్థానమునుండి సర్వలోకముల చరించు (చలించు) నేత్రముల క్రమముగా చూచుటచే లోలాక్షి, లోలదృష్టి గలది 3) మహాలక్ష్మీస్వరూపము

216) ఓం సర్వవిద్యాయై నమః

సర్వవిద్యారూపిణియైనది చతుష్షష్టి విద్యలకధిదేవతయై, సర్వయంత్ర, సర్వమాత్రాధిష్ఠానమై 'విద్యాసుశాస్త్రేషు వివేకదీపేష్వాద్యేషు కాత్వదన్యా' అని సకల విద్యాపారంగతయైన దేవి పరమేశ్వరి 2) విద్యలు రెండువిధముల పర, అపర, ఈ రెంటికీ పరమేశ్వరి ఆమెయే. 'విద్యాహి సా ★ పరమాదేవి, వేదశాస్త్రపురాణేతిహాస సకల కళానిధానమామెయే

217) ఓం తపస్విన్యై నమః

తపస్వినియైన దేవి 'సర్వేశ్వరి కామేశ్వరాంకస్థ' అగుటకు నిత్యలక్ష్యముగా తపస్సు చేయుచుండును. పార్వతి మన్మథుని దగ్ధానంతరము విరక్తుడైన పరమేశ్వరుని సుముఖుని చేయు లక్ష్యముతో అనేక వత్సరములు, అనేక విధముల తపసు చేసినది 2) తపస్సు లోకకల్యాణ నిమిత్తమై చేయు సక్రియా, నిష్క్రియా రూపమునై యున్నది అట్టి జీవకల్యాణమే నిత్యధ్యేయముగా జగజ్జనని పోషించు చుండు రూపమైన మంచి ధ్యేయము, లక్షణములు గలట్టి వరదాయిని

218) ఓం గంగాయై నమః

గంగరూపమై యున్నది. గంగా, త్రిపథగ, భూమ్యాంతరిక్ష, స్వర్లోకవ్యాపిని, సర్వవ్యాపినియై యున్నది 2) గోలోక శ్రీకృష్ణపత్నులలో నొక మహత్తరశక్తిరూపిణియై యున్నది 3) హిమవంతుని పుత్రి గంగ పరమేశ్వరుని సిగ నలంకరించినది ఇల్లాలును, శివతేజమును గలిగిన స్కందుని మాతగను ప్రసిద్ధి గాంచినది. సముద్రపత్ని రూపమునైనది 4) స్వచ్ఛమైన మనసుకు, పవిత్రాత్మకు, మనుజుల పాపముల పోగొట్టు సురనదిగా, సర్వజీవ ప్రాణాధారమై, భగీరథునిచే భూమికి తేబడి భాగీరథిగా భరతఖండ సస్యసంపదల కాధారమువు జలాశ్రయముగా నున్నది అట్టి సకల జనసంస్తుత, సర్వపాపహర శక్తియైన మహాదేవి రూపమునై యున్నది

219) ఓం కాశ్యై నమః

కాశీరూపమునై యున్నది. 'పుణ్యా భాగీరథీ లోకే, పుణ్యా వారణాసీ పురీ। పుణ్యా వేదా శివ పుణ్యాం పుణ్యాం తిర్యక్ త్రిపుండ్రకమ్' 'పంచపుణ్యకథ' 'శ్యామా, షోడశ వార్షికీ, సుకరుణా మూర్తి, వరాభయ హస్త ధారిణీ, విశ్వజననీ, విద్యేతి యాదృష్టం స్మరణం' కీర్తన సంస్తుతుల, అమల ఆత్మతత్వమర్పడును కాశీ, కాశీ, కాశీతియో బ్రూయాత్ యోజనానాంశతైరపి' కాశీయాత్రాఫలం లభేత్ కాశికి, కాశికా, వారణాసి, అవిముక్త సదక్షేత్రం, ఆనందవనం, ఆనందకాననం, రుద్రవాసం, మహాశ్మశానం అనుపేర్లు గలవు మరణ సమయమున కాశీ విశ్వనాథుడే దేహి చెవియందు తారక మంత్రోపదేశము చేయునని నమ్మకం సాక్షాత్ విశాలాక్షి, అన్నపూర్ణాదేవి రూపము శక్తియుతమైన క్షేత్రరూపము కాన్యాంతు మరణాన్ముక్తి జీవులకు మోక్షప్రదానము చేయు పవిత్రతీర్థము సప్త మోక్ష పురములలో నొకటి అయోధ్యా, మథురా, మాయ, కాంచి, అవంతి, కాశీ, ద్వారకలు

అను ఆంగ్లపదము న్యాయదేవతా రూపము

225) ఓం సునీత్యై నమః

సునీతి రూపమునై యున్నది మంచిస్వభావము గలిగి, సన్మార్గమున అచంచల విశ్వాసముతో నడిపించు శక్తి. 2) సునీతి ఉత్తానపాదుడను రాజు మొదటి భార్య, ఉత్తమ ఇల్లాలు సురుచి రెండవ భార్య లోకాభిరుచులకు, భోగభాగ్యములకు ప్రతీకగా నామె ఉపేక్షకు గురియైనప్పటికీ సునీతి తన కుమారుడైన ధ్రువుని సన్మార్గమున నడిపించి విష్ణుపద ప్రాప్తి, ధ్రువతారగా మింట వెలుగునట్లు చేసిన మాతృశక్తి. మంచి నడవడి, వినయరూపము ప్రసాదించు దేవతామూర్తి

226) ఓం సురుచ్యై నమః

సురుచి రూపమునై యున్న దేవి ఉత్తానపాదుని రెండవ భార్య, అందగత్తె భర్తానుకూలప్రీతి వరియము కలిగినది ఐహిక భోగసంపత్తికి ప్రతీక ఆమె అనుగ్రహమున భూ, హిరణ్య,గృహ సంతానాది భవ సుఖసాధనలు పొందనగును ఇహలోక సుఖసాధనాప్రాప్తికి ఆమె కటాక్షమే అయితే ఈశావాస్యమిదం జగత్ తేనత్యక్తే నభుం జీథా మాకశ్చిత్ గృద్ధభాక్ భవేత్– అను విధియాసక్తి పెంచు కొనక సుఖ భోగముల ననుభవించవలెను. అధికాసక్తి పతనహేతువగును

227) ఓం తుష్ట్యైనమః

తుష్టి స్వరూపమై యున్నదేవి 'యాదేవి సర్వభూతేషు తుష్టిరూపేణా సంస్థితా' సకల జీవాంతర్గత మైనట్టి శక్తి. ఇష్టప్రాప్తి అనిష్టనివృత్తియే తృప్తి భక్తజనులకి రెండు విధుల వరముల ప్రసాదించును, ఉపాసకులకు శాంతినొసగి స్వస్వరూప జ్ఞానము నొసగు నది తృష్టి, సకల జీవరాసుల పోషణ చేయుచు తుష్టి కలిగించు అంబ స్వరూపమేయగును 'లక్ష్మీర్లజ్జే మహావిద్యే శ్రద్ధే పుష్టి స్వధేధృతే' యని కీర్తింపబడినది తుష్టికి జత పుష్టి.

228) ఓం పుష్ట్యై నమః

పుష్టి స్వరూపమైయున్నది. 'యాదేవి సర్వభూతేషు పుష్టిరూపేణ సంస్థితా' సకల జీవులకు తానేయై యవసర పోషక పదార్థములనిడి పుష్టి (బలము) కలిగించు శక్తి తుష్టియే పుష్టి ఉపాసకులయొక్క పంచకోశములు (అన్నమయ, ప్రాణమయ,మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములు) వీనికి బలస్థైర్య జ్ఞాన విజ్ఞాన ఆనందములు ప్రసాదించు శక్తి ఆమెయే దేవదారు వనమున ఈ సంజ్ఞగల దేవత యున్నదందురు

229) ఓం ధృత్యై నమః

ధృతి స్వరూపమును ఆమెయే 'యాదేవి సర్వభూతేషు ధృతిరూపేణ సంస్థితా'యనబడును మనస్సు యొక్క స్థిరభావమే ధృతి జీవుల మనసున కాలంబున్నై ధైర్య స్థైర్యములు కలిగించు శక్తి ఆ పరమేశ్వరియే ఆత్మ వికాసము, స్వస్వరూప జ్ఞానమును ధృతిమూలక ప్రాప్తములగును పిండారకమను క్షేత్రమున నీ పేరుగల శక్తిగలదందురు ధైర్యరూపమున భావన, 'లక్ష్మీర్లజ్జే మహావిద్యే శ్రద్ధే పుష్టిస్వధేధ్రువే మహారాత్రి మహావిద్యే నారాయణి నమోస్తుతే' యని గలదు

230) ఓం క్షమావత్యై నమః

క్షమా స్వరూపిణియై యున్నది 'క్షమయాధరిత్రి'యని, జీవులు చేయు అనేక పాపములను భరించు శక్తి ఎట్టి అపకారమును తలపెట్టక, క్షమాబుద్ధితో వ్యవహరించు శక్తి. కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి–యని మాత మనస్సు కరుణాసముద్రమే కాని ప్రతీకారలేశముండదు 'శ్రీమన్మంద కటాక్షయుత, త్రైలోక్య కుటుంబినీ,త్రైలోక్య హితార్థమై అసురసంహారిణీ, కరుణారస సాగరమైన మూర్తి ఓర్పు గలది అసురులకును సాయుజ్యమిడు దేవి

**231) ఓం వాణ్యై నమః**

వాణీ స్వరూపురాలైన శక్తి వచన రూపశక్తి వాణీ, వాగీశ్వరి, సరస్వతి, వీణాపాణి, బ్రాహ్మణి, సర్వమంత్రతంత్ర స్వరూపిణి మొదలగు రూపముల విలసిల్లు వాగధిదేవతయైన శక్తి వాణి ఆమెయే చతుర్విధ శక్తిస్వరూపిణి పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ రూపములు ఆత్మానాత్మ విచారణము వలన కలిగిన బ్రహ్మ పరోక్షజ్ఞానస్వరూపిణి, సర్వవిద్యా స్వరూపిణియును ఆమెయ సర్వజ్ఞానశక్తి.

**232) ఓం బుద్ధ్యై నమః**

బుద్ధి స్వరూపమై యున్నది 'యాదేవి సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా' యని 'బ్రాహ్మివైష్ణవి, రౌద్రీ, కౌమారీ, కాలికా శివా సిద్ధిదాబుద్ధిదా శాంతా సర్వమంగళదాయినీ' మనోబుద్ధి చిత్తాహంకారముల నెడుతత్త్వయుతమునై యున్నది 'బుద్ధిర్బోధలక్షణా' అను దానిని బట్టి సకల జీవరాసులకావశ్యకమగు బుద్ధిని ప్రసాదించి నడిపించునది ఆమెయే

**233) ఓం మహాలక్ష్మ్యై నమః**

మహాలక్ష్మి స్వరూపమై యున్నది పరమేశ్వరి త్రిగుణాత్మక విభూతులలో మహాలక్ష్మి సత్త్వగుణాశ్రయయై యున్నది 2) సాంబమూర్తి వామోరువు నందు పరదేవత తేజః సమూహము శక్తిగా నావిర్భవించినది మధ్యమచరితాధిదేవత ఆమెయే శ్యామల యనబడు మనోహరాంగి 3) మహాలయ యను రాక్షసుని సంహరించుటచే మహాలక్ష్మి నామధేయము కలిగినది 4) విద్యా, ధన, ధాన్య, సంతాన, ధైర్య, వర, విజయ, మోక్షమను అష్టవిధరూపములైన మహాలక్ష్మి గజాశ్వ ఐశ్వర్య పశు గృహ ప్రదాతగా మరో నాలుగు రూపముల విలసిల్లును హరిప్రియ, మోక్షలక్ష్మి, మహాలక్ష్మి, సర్వలక్ష్మిరూపిణి, అయా జీవుల పూర్వకర్మానుసారం కలిమినిడు మహాప్రభా శక్తియే మహాలక్ష్మి 5) త్రయోదశ వర్ష కన్యకకు మహాలక్ష్మి యను సంజ్ఞ గలదు 6) కొల్హాపురం, కరవీరపురము క్షేత్రాధిదేవత, అష్టాదశ పీఠశక్తి 7) బ్రహ్మ భిన్నమగు ఆనందమునకు లక్ష్మియను సంజ్ఞ కలదు. 8) మహావిష్ణువు శక్తియైనది మహాలక్ష్మి, సర్వలక్షణ యుతయైనది మహాలక్ష్మి.

**234) ఓం లక్ష్మ్యై నమః**

లక్ష్మి స్వరూపురాలైనది 'లక్ష్మీర్లజ్జ మహావిద్యే శ్రద్ధే-నారాయణి' 'త్వం శ్రీస్త్వమీశ్వరీ త్వం బుద్ధిర్బోధ లక్షణా' 'సర్వైశ్వర్య శక్తి లక్ష్మి' 'లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగధామేశ్వరీం త్రైలోక్య కుటుంబి నీం సరసిజాం, ముకుంద ప్రియాం' యని అందురు 'శ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యా వహోరాత్రే పార్శ్వే, నక్షత్రాణి రూపం అశ్వినౌ వ్యాత్తం, ఇష్టం మనిషాణ, మముంమయిషాణ, సర్వలోకమ్మయిషాణ★ అని బుక్‌వర్ణన కలదు అట్టి అనంతశక్తి స్వరూపిణియైన దేవి

**235) ఓం నీలసరస్వత్యై నమః**

ఓం నీలసరస్వతియను శక్తి 'నౌకాసనాంసర్వవిభూషణాఢ్యాం, కర్త్రీ, కపాలచషకం త్రిశూలమ్' 'ఖడ్గధానం నరముండమాలా, భక్తేభ్యో భజే నీల సరస్వతీం తామ్' అని వర్ణన. మహా విద్యాస్వరూపము సేవించిన వారికి భోగమోక్షములనిచ్చు మూర్తియై యున్నది

స్రోతస్వతీ సరస్వతీ* వరతంగీ విజయా జయా స్తోత్రవతీ
నదీ సింధుః సర్వమంగళా తారా శివాన్యనివాసినీ(48)

**236) ఓం స్రోతవత్యై నమః/ఓం స్రోతస్వత్యై నమః**

స్రోత స్వరూపిణియై యున్నదేవి స్రోత యనగా తనంతట తానే వేగముగా పారెడి జలప్రవాహము త్రిపథగామి యైన గంగాఝరి వోలె కరుణ స్రవించు మాత రూపమై యున్నది 'అనాదివో పర్వతాదా సరస్వతీ యజతా గంతుం యజ్ఞం, హవం దేవీజాపాషణ' 'మహోఅర్ణ సరస్వతీ ప్రచేతయతి కేతునా' 'అంబితమేనదీతమే, దేవితమే సరస్వతి' వాగ్రూప ప్రవాహమును ధియః చోదన, నదీరూపముగను విశదమై యున్నది

**237) ఓం సరస్వత్యై నమః**

సరస్వతీ రూపమునై యున్నది సరస్వతీ, ఇడా, దేవీ భారతి యను మూడురూపములలో త్రిలోక వ్యాప్తినందిన మాత 2) జ్ఞానదాయిని, దేవీం వాచమజనయంత, దుహానాధేనుర్వాగస్మాన్ ప్రతీక యగును, విద్యాధిదేవత బ్రహ్మవిద్యాస్వరూపిణి అద్వైత జ్ఞాన ప్రదాతయగు బ్రహ్మజ్ఞానస్వరూపిణి 3) సరణాత్ సర్వదృష్టీనాం సరస్వతీ, సారస్వతమే సరస్వతి, ప్రసరణ శక్తి, వ్యాపకశక్తి, సకలజీవుల జిహ్వలనుండి వాగ్రూపమున వెలువడునది సరస్వతి యగును 4) బ్రహ్మమును తెలుపు విద్యాస్వరూపిణి. పుస్తక, జప, కటిహస్త వరదాభయ బాహుయుతం, వేరు రూపమున పుస్తకం అక్షమాల, వీణావాదినిగాను చతుర్భుజ రూపిణిగా కనబడును 5)శ్రీపంచమికి విశేషపూజ శ్రీదేవి స్వరూపము అజ్ఞాననివృత్తి చేయు వాగీశ్వర్యాఖ్యాణవతి 6) చత్వారివాక్పరిమితా పదాని గుహాత్రీ ణి విహితానేంగయంతి, తురీయం వాచో మనుష్యావదంతి, హృదయకుహరము నుండి నాల్కవెలికి యు ఉచ్చారణము. అర్థవంతమై ఇతరుల చేరుమందును మనోవాక్కాయ కర్మల నొకరూపుగానుండును భావన, శబ్దరూపం, ముఖాంగం 7) బ్రహ్మణి శక్తిగా 'కమండలు జలాక్షేపహత పీర్యాత్ర హతౌజసః విద్యాసు శాస్త్రేషు వివేక దీపేషు ఆద్యా' రూపము దేవి అష్టవిభూతులలో నొకటి 8) మేధే సరస్వతి వరే భూతి బాభ్రవితామసి, నియతే యని తృతీయచరిత అధిష్ఠాత్రిగా మేధారూపిణి సరస్వతి రూపమున విలసిల్లుచుండును ధీప్రద. 9) వాగ్దేవి, వేదవాక్, వాక్, ఆపదేవి, నదీరూపిణి, జలప్రవాహ రూపిణి. 10) మాణిక్యవీణా ముపలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసాం। మాహేంద్రనీల ద్యుతి కోమలాంగీం మాతంగకన్యాం మనసాస్మరామి కాళిదాసు శ్యామలాదండకం మాతంగీరూపం.

**238) ఓం మాతంగ్యై నమః**

మాతంగ కన్య మాతంగీ రూపమైనది మతంగముని పుత్రికగా మాతంగి యనబడును కాళిదాసు చతుర్భుజే చంద్రకలావతంసే, కుచోన్నతే, కుంకుమ రాగశోణే పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణహస్తే, నమస్తే జగదేక మాతః-అని మాతంగకన్యను స్మరించెను మహావిద్యావిశేషం. నీలసరస్వతి, శ్యామా రూపము.

**239) ఓం విజయాయై నమః**

విజయరూపిణి యైన దేవి. సర్వత్ర జయమే పొందు అపరాజిత 2) విజయముహూర్తకాలస్వరూపిణి. 3) అతిబలోన్మత్త పద్మనామక అసురుని వధించి విజయాఖ్యయైన పరమేశ్వరి 4) దసరాలో నవరాత్రి తర్వాత దశమి నాడు తారకోదయమున సర్వార్థసాధకకాలము సకాలో విజయాఖ్యయః మధ్యాహ్నకాలము పైని పదునొకండవ ముహూర్తము రాత్రి 8 గంటల 48 నిమిషముల సమయము. 5) అసురభావ నాశనమై సజ్జనులు వృద్ధికాంచ జయసంకేతమునకు ప్రతీక

**240) ఓం జయాయై నమః**

జయరూపిణి యైన దేవి. జయస్వరూపురాలు జయాయని పిలువబడును ఉపాసకులకు ఆత్మజ్ఞాన ప్రసాదమున జయముచేకూర్చి ముక్తికారణమగు దేవి మృత్యువును గూడా జయించునట్టి మృత్యుంజయ రూపిణి. జయయనునది ముఖ్యప్రాణసంకేతము 2) వరాహపర్వతమున జయ యను శక్తి గలదు 'జయాచ విజయాచైవ' దుర్గాదేవి విభూతులలోనైనది

**241) ఓం నద్యై నమః**

నదీ రూపమునై యున్న దేవి అంబితమే నదీతమే దేవితమే సరస్వతి-యని శ్రేష్ఠమైన నదీరూపమై యున్నదేవి. నిత్యప్రవహణ శీల 2) నదీ-సంతతి సమృద్ధా ప్రజలకువారి సంపత్తియు గలిగి ఆనందరూపిణియై యున్న దేవి 3) గంగే యమునేచైవ గోదావరి సరస్వతి, నర్మదా, సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు-సంకల్పం

**242) ఓం సింధవే నమః**

సింధుస్వరూపమై యున్న దేవి సింధువు మహార్ణవం రూపమై యున్న దేవి అమృతాంభోనిధి రూపమై యున్నదేవి కరుణాసముద్ర, దయాసముద్ర 'లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం' అని ప్రాణశక్తిని 'రక్తాంభోదిస్థపోతోల్లసదరుణ సరోజాధిరూఢాకరాబ్జైః' యను ప్రార్థన గలదు అట్టి కరుణార్ణవ మూర్తియైన దేవి భక్తులను కటాక్షించును

**243) ఓంసర్వమయ్యై నమః/ఓం సర్వమయ్యై నమః**

సకల భువనములు తానై విరాట్ స్వరూపిణి యైనది 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యైన సర్వసృష్టి, స్థితి, లయకారకము, కార్యకారణభేదము లేని ఆత్మస్వరూపిణి శివా శక్త్యంతమైన షడధ్వములు, ముప్పదియారు తత్త్వములు తానేయై యున్నదేవి 'నిమ్నా నిమ్నత రాగేషు నిమ్నేష్వప్రతిసుందరీ పరాపరాణాం పరమాత్మమేవ' అనియును, 'ప్రకృతిస్త్వంచ గుణత్రయ విభావినీ' 'భూతేషు సతతం వ్యాప్తా దేవ్యై' అను పదములచే సర్వమయత్వం. త్రికాలాతీత కాలరూపిణియు, అకారాది క్షకారాంత సర్వవర్ణాత్మరూపి ఆ దేవియే

**244) ఓం తారాయై నమః**

తారారూపిణియైన దేవి దశ మహావిద్యలలో తారా విద్య యొకటి ఉగ్రతారగా ప్రఖ్యాతి 'శవహృత్ ఘోరాట్టహాసాపరా, ఖడ్గ,ఫాలచంద్ర, కర్త్రీ ఖర్పరభుజముల హుంబీజం, నీలవిశాల పింగళ జటా జూట, నాగైర్యుతా కపాలకర్త్రియై జగద్ధ్వంసినిగా గననగును తారే, సుతారే తరే యను రూపి రాత్రి పండ్రెండు గంటలనుండి ఉదయం ఆరు గంటల వరకు తారాసామ్రాజ్యం కాళీ సమయము 2) అక్షోభ్య హిరణ్యగర్భ పురుషశక్తితార. ఉగ్రశక్తి స్వరూపిణి. ఆమెయే నక్షత్రనాడు శక్తియునై యున్నది 3) పంచకన్యలలో వాలి భార్య తార కూడా స్తుతించబడుచున్నది

**245) ఓం శూన్యనివాసిన్యై నమః**

శూన్య మందు నివసించునది శూన్యం గగనం అని ఆకాశ నివాసినీ, శూన్యాలయాయను సమానార్థము దహరాకాశమునందుగాని, భూతాకాశమునందుగాని, పరాకాశము నందు గాని యుండునది 'వృక్షయివస్తబ్ధో దివితిష్ఠత్యేకః అనుశ్రుతిః వివిక్తస్థాయన ఏకాకినిగా నుండును క్షితినుండి శివపర్యంతమైన తత్త్వగణనలో గగనమునకు పైనుండు ఆత్మస్వరూపిణి

**శుద్ధా తరంగిణీ మేధా లాకినీ బహురూపిణీ**
**స్థూలా సూక్ష్మా సూక్ష్మతరా భగవత్యనురాగిణీ * (49) రూపిణీ**

**246) ఓం శుద్ధాయై నమః**

శుద్ధ స్వరూపయైనది నిర్మలం, సత్వాది మలరహితం, అవిద్యాసంబంధమగు నెట్టి మాలిన్యమును లేని శుద్ధ జ్ఞానస్వరూపిణి గుణరహిత, రాగద్వేషాతీత, శుద్ధ చైతన్య స్వరూపమామెది పరబ్రహ్మము యొక్క నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తత్వమే స్వరూపముగా గలది శుద్ధ విద్యాస్వరూపురాలు మంగళదాయినియై నిర్మలమైన చండీ విద్యాదిస్వరూపురాలు

**247) ఓం తరంగిణ్యై నమః**

తరంగిణీ రూపిణియైన దేవి తరంగములు గలిగియున్నట్టి జలాశయ స్వరూపమై యున్నట్టి దేవి అలలు గలిగిన నదీ ప్రవాహము ప్రవాహము కాలమునకు ప్రతీక అలయొక పరిమాణ ఆవృతికి ప్రతీక అనేక యాగములు అలలుగా సాగినను నిర్మల జలప్రవాహ రూపిణియైన నిత్యస్వరూపిణి యైనది అనేక లీలలు చేయుచు లీలాతరంగిణియై నున్నది 2) 'అతః సత్యచిదానందా స్వతః శుద్ధా నసంశయః సత్యాత్మ లక్షణం త్వాత్మద్రవ్యం శుద్ధంతతః స్వతః' యని శుద్ధాంత గ్రంథమైన ప్రశాంత తరంగిణీ రూపమైన బ్రహ్మజ్ఞానా విష్ణస్వరూపిణి

**248) ఓం మేధాయై నమః**

మేధారూపమై వున్న దేవి మేధా అన బుద్ధి స్వరూపిణి 2) కాశ్మీరమున మేధనామ అని పద్మ పురాణం 'యాదేవి సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా' మేధాసిదేవి విదితాఖిల శాస్త్రసారా యని ధారణ, ధీశక్తి, స్వాధిష్ఠాన,చక్రాధీశ్వరి, సిద్ధేశ్వరి గర్భస్థపిండం యొక్క నాలుగో మాస సమాధి స్థితిని బోధించును 3) బ్రహ్మహమస్మీతి, స్మృతి రేవ మేధ–అనేక జన్మలు ఎత్తినప్పటికీ అనాది సిద్ధ పరబ్రహ్మ స్వరూపుడను స్మరణ కలుగుటయే మేధ జీవియందు ఈ భావమున నుండునది 4) మేధ సరస్వతి వరే భూతి భార్గవి తామసి నియతేత్వం నారాయణి అని సరస్వతీ రూపమై యున్నది

**249) ఓం లాకిన్యై నమః**

లాకినీ రూపిణియై వున్నదేవి మణిపూర మను చక్రాధిష్ఠాత్రియైన దేవి వయోవస్థావివర్జితయైన లాకిని బీజశక్తి కీలక న్యాసమంత్రాలన్నియు 'ల'కార సంకేతములుగా గలిగినట్టిది మణిపూరాబ్జ నిలయ, నాభిస్థానం, దశదళ కమలం, త్రినేత్రం, రక్తవర్ణం, శక్తివజ్రాయుధం, దండం, అభయ కరములు గలది మాంస ధాతువు కారణము డామరాది త్రిగస్వరయుక్తము

**250) ఓం బహురూపాయై నమః**

అనేక రూపములు గలది 1) స్థిర, చర, దేవ మానుష తిర్యగాది బహుప్రాణి రూపముల వ్యాప్తి చెందిన దేవి రూపం 2) ఏకాశక్తి, ద్విధా, షోడశధా, ద్వాత్రింశ, భేదాది అనేక రూప సమన్వితయైన మాత 3) శంకరా పురుషాః సర్వే స్త్రియః సర్వా మహేశ్వరీ' స్త్రీలింగ మఖిలం గౌరీ, పుంలింగంతు మహేశ్వరః స్త్రియస్సమస్తా తవదేవి భేదాః 4) విశ్వం బహువిధం జ్ఞేయం సాచసర్వత్ర వర్తతే. తస్మాత్ బహురూపత్వాత్ శివభావిత 5) త్వమేవ బహురూపేణా సత్త్వత్వేన వ్యవస్థితా–యని యనేక గృహిణీ రూపముల వ్యాప్తమైయుండును 6) సర్వవిద్యాస్వరూపిణియై బహుళ మార్గోపాసనల నామెయే లోపాముద్ర, షోడశితార, శ్యామలా, బగళా, వారాహి కామకలాది అనేక విద్యారూపిణి 64 కళల కధిష్ఠాత్రి యామెయే 7) అరూప పరభావత్వా ద్బహురూపాక్రియాత్మికా, భండాసుర, చండ ముండాసుర హననమందు బహువిధ క్రియకారిత్వాత్ తత్తద్రూప త్వేన బహురూపత్వమపి విద్యతే 8) లక్ష్మీ, లజ్జ, శ్రద్ధా, పుష్టి, స్వధా, స్వాహా వషట్కార, స్వర, సుధా, అక్షరాది వివిధ విభూతులు ఆమెయే

**251) ఓం స్థూలాయై నమః**

స్థూలరూపిణియైన దేవి, దృగ్గోచరమై, కరచరణా ద్యవయవ యుత శరీర ధారణ చేసినట్టిది, ఆ శక్తి ప్రాణ ప్రతిష్ఠ చేసిన తర్వాత వివిధ యర్చారూపములలో స్థూలముగా కనబడును అంగపూజ యందు రూపకల్పన జరుగును 2) వివిధ భూతప్రాణ సంఘములందును వ్యాప్తమై స్థూల రూపమున విలసిల్లును 3) యజ్ఞయాగాది క్రతు రూపమై సర్వజీవపోషణ చేయు అదృశ్యస్థూలశక్తి ఆమెయే

**252) ఓం సూక్ష్మాయై నమః**

సూక్ష్మ స్వరూపిణియై యున్నది 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అతి సూక్ష్మమైన అణువు రూపమున నుండునది సూక్ష్మాత్ సూక్ష్మతరం నిత్యం అణోరణీయాన్ యని స్థూలదృష్టికి కానుపించని యకారం సూక్ష్మదేహ రూపం పంచజ్ఞాన కర్మేంద్రియ, ప్రాణమయ, మనోబుద్ధి, చిత్తాహంకారాది సముదాయము. మనసు సూక్ష్మతరము, సంకల్ప వికల్పరూపము దానికన్నా బుద్ధి అతి సూక్ష్మము ఆయాత్మ స్వరూపిణియే పరమేశ్వరి 'అనురూపం దుఃఖగమ్యం, చైతన్యం సర్వతో నిత్యం సర్వప్రాణి హృదిస్థితమ్ః సర్వాతీతతరం సూక్ష్మం తస్మై సూక్ష్మాత్మనేనమః' యంవి సూక్ష్మం విదిన్వంతి పరం సూక్ష్మవిదోజనాః సూక్ష్మాత్ సూక్ష్మస్య యద్బ్రహ్మతస్మై సూక్ష్మాత్మనే నమః పరబ్రహ్మమతిసూక్ష్మము

**253) ఓం సూక్ష్మతరాయై నమః**

అతి సూక్ష్మమైనది 'సూక్ష్మదాకాశాదేరప్యతి సూక్ష్మ సర్వముద్రారహితం ఖం–సూక్ష్మం యథా తథా

ఖం సూక్ష్మమవ్యయం। తేనాస్పృష్టం వినాభూతం బ్రహ్మేవాహ తథా-ద్వయం'' యాదేవి సర్వ భూతేషు సూక్ష్మ ఆత్మరూపేణ సంస్థితా' యని సర్వవ్యాప్తమైన శక్తిస్వరూపము సర్వత్ర వ్యాప్తమై అగోచరమైన సూక్ష్మతర రూపము కలిగిన చేతనాశక్తి నాదబిందు కళాతీత సూక్ష్మతర ప్రాణరూపమై యున్న శక్తి.

254) ఓం భగవత్యై నమః

భగవతీ రూపము కలిగినది నిరతిశయాది ఐశ్వర్య సంపన్నయైన పరమేశ్వరి అ) భగమనగా 1-శ్రీ 2-వీర్య 3-ఇచ్ఛ 4-జ్ఞాన, 5-వైరాగ్య, 6-కీర్తి, 7-మహాత్మ్య 8-ఐశ్వర్య 9-యత్న 10-ధర్మ 11-మోక్ష 12-యోని యను అర్థములు ఇవియుగాక యుక్తాయుక్త వివేకము, విజ్ఞానము, బ్రహ్మజ్ఞానము మొదలగు సుగుణ సంపద గలదనియందురు ఆ) షడ్విధ ఐశ్వర్యయుక్త-సమగ్ర ఐశ్వర్యం వీర్యం యశస్సు, శ్రీ, జ్ఞానవైరాగ్యములు గలది ఇ) భగవాన్ యనగా ఉత్పత్తి, వినాశం భూతానాం ఆగతి గతిః (బ్రహ్మమూల) విద్య అవిద్య యెరిగిన వాడు, ఆ భగవాన్ శక్తియే భగవతి ఈ) 1-సర్వజ్ఞతా శక్తి 2) నిత్యతృప్తిశక్తి 3- అనాది బోధ శక్తి 4) స్వతంత్రతాశక్తి 5) నిత్యాలుప్తశక్తి (సర్వవ్యాపిసర్వగతాశక్తి) 6) అనంతతాశక్తి యను నీయారును భగములు ఈ శక్తులు గలిగి యున్నందున భగవతి, ఉ) భగమాలిని వికృతి భగవతి ద్వాదశాదిత్యులలో భగనామధేయుని శక్తి భగవతి ఊ) భజ్ ధాతువునుండి ఉత్పన్నమైనందున సకల దేవముని గణములచే పూజింపబడునది

255) ఓం అనురాగిణ్యై నమః/అనురూపిణ్యై నమః

అనురాగము కలిగిన దేవి అనురాగమున పరస్పర ప్రేమగలిగినట్టిది సకల సృష్టిస్థితి లయకారిణియై యెల్లజీవులయెడ మాతృప్రేమను పంచిపెట్టునది సకల భువన పోషిణి 'భరిష్యామి సురాః శాకైర వృష్టైః ప్రాణధారకైః' అను శాకంభరిగా, ఆర్తత్రాణపరాయణిగా, సర్వస్య ఆర్తి హారిణి, నిత్యకామేశ్వరి సర్వం కోర్కెంగమదాలసా స్వరూపిణియై యున్నది శబరి యెంగిలి పండ్లను శ్రీరాముడు అనురాగముతో గ్రహించుట, కుచేలుని అటుకులు శ్రీకృష్ణుడారగించుట యను ఘటనలు భక్తానురాగమునకు తార్కాణములు

పరమానంద స్వరూపా చ చిదానంద స్వరూపిణీ
సదానందమయా సత్యా సర్వానంద స్వరూపిణీ (50)

256) ఓం పరమానంద రూపాయై నమః /పరమాణు స్వరూపాయై నమః

నిరతిశయ సుఖ స్వరూపము బ్రహ్మానంద స్వరూపము ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్-సామాన్య మానవుని సుఖసంతోషములు తృటిమాత్ర పరిమితము దుఃఖావసానముగా వచ్చును పరమానందము తురీయస్థితియందలి పరమపురుషస్థితి ఆనందఘనస్వరూపిణి 2) అణువుకంటెను స్వల్పమైనది పరమాణువు ఇంద్రియములకగోచరముగు రూపము గలదియగును విభజించుటకు వీలు కానట్టి స్వరూపము

257) ఓం చిదానంద స్వరూపిణ్యై నమః

చిదానంద స్వరూపిణియైన దేవి చిత్శక్తి సకల ప్రాణికోటియందు జీవరూపమున నున్న పరమాత్మ శక్తి. అజ్ఞాన తిమిరమును పారగొట్టి ప్రకాశరూపముగు జ్ఞానశక్తిని ప్రసాదించునది ఆత్మ చైతన్య బ్రహ్మ స్వరూపమైన జగతి ఆనందమే తనదిగా క్రీడించునది చిత్తిరూపేణ యాకృత్స్నమేతత్ వ్యాప్య స్థితా జగత్-యని జగదానందకారిణి సకల భక్తజన కారిణి సకల భక్తజన జీవానందస్వరూపిణియై యున్నది దేవి-స్వయం ప్రకాశమున నిరతిశయానంద స్వరూపం-సర్వదా అవిద్యా తత్కార్య రూపబంధ రహితం అనంత చిద్ఘనానందే, నిర్వికల్పైక రూపిణీ, స్థితే, ద్వితీయస్యాభావాత్ కేవలత్వం కథ్యముచ్యతే'

258) ఓం సర్వానందమయ్యై నమః/ఓం సదానందమయ్యై నమః

సర్వప్రపంచ ఆనంద స్వరూపమునై యున్నది ఆపిపీలికాది బ్రహ్మాండమునంతయు సుఖ సంతోషమయానందములతో నోలలాడునట్లు కరుణించి, వారి యానందమునే తానాస్వాదించు

మాతృరూపి శిశువుల క్రీడలచూచి మాతహృదయము యానందించునట్లు ఆమె సర్వానందమయ స్వరూపిణి.

259) ఓం నిత్యాయై నమః/ఓం సత్యాయై నమః

నిత్యము సత్యరూపమునైన దేవి ఆదిమధ్యాంతరహిత కాలత్రయవ్యాప్త 'నిత్యోదితమ్ విమలమేక మనంత మాద్యం। బ్రహ్మాస్మినేతర కలాకలనం హి కించిత్' 2) దేశ, కాల,వస్తు, సజాతి, విజాతీయ, స్వగత భేదము లేనిది నిత్యసత్యస్వరూపము సర్వదిశావ్యాప్త, సర్వకాలస్థితః సర్వపదార్థరూపిణియై, అవయవ రహిత, సర్వానుగతయైన పరమేశ్వరి నిత్య. 2) తిథి దేవతలకు నిత్యయను సంజ్ఞ కలదు జాగ్రత్ స్వప్న సుషుప్తాది అవస్థలయందునను సర్వానుగతయై తురీయ స్థితి నందు నిత్యస్వరూపి

260) ఓం సర్వానంద స్వరూపిణ్యై నమః

సర్వజీవ ఆనంద స్వరూపిణియై యున్నది సర్వశాఖ్యదాత్రి, ప్రియ, మోద, ప్రమోద, ఆనంద, శబ్దవాచ్యాలి, ఇష్టదర్శన, అన్యసుఖము, ప్రియానంద రూపిణి, స్మరణచేతను సుఖము గూర్చునది, ఆ బ్రహ్మస్తంబ పర్యంతం కర్మలననుసరించి దృశ్యమానమౌ జ్ఞాన ఐశ్వర్యాది యుక్త సుఖము ఆనందాబ్ధిమ్న నది. సచ్చిదానంద స్వరూపిణి 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అట్టి బ్రహ్మానంద స్వరూపిణి

సునందా నందినీ స్తుత్యా స్తవనీయ స్వభావినీ* శుభా, భామినీ
రంగిణీ టంకినీ* చిత్రా విచిత్రా చిత్రరూపిణీ(51) రతినీ, భంకినీ

261) ఓం శుభదాయై నమః/ఓం సునందాయై నమః

శుభము గూర్చు దేవి భక్తులకు శుభములను, మంగళములను చేర్చు పరమేశ్వరి అర్థ, విద్యా మోక్షాది, వివాహ సంతాన ఆరోగ్యాది కామ్యములను ప్రసాదించు దేవేరి ఆమెయే గదా 'కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మోనమోనమః' 'భూభృతాం లక్ష్మ్యై శర్వాణ్యై' యనియును, 3) నంద, సునంద తనలో తాను మోదించునది జీవుల క్షేమముగని పరమానందము పెందును

262) ఓం నందిన్యై నమః

నందినీ మూర్తియైన దేవి నందతీతి నందినీ ఆనందమును అనుభవించుచున్న స్వరూపము. ఆనందమే స్వరూపముగా గలది 2) నందుని కుమార్తెగా యోగమాయ జన్మించి నందున నందిని యనబడుచున్నది దుర్గాదేవి స్వరూపిణి 3) కామధేనువు వంశమందున జన్మించినది నందిని దిలీపుడు వశిష్ఠుని యాశ్రమమున గోసేవ చేసి వంశాంకురము ప్రాప్తి నందెను రఘువంశమున నీకథ విస్తారముగా గలదు 4) గంగానదికి గల ద్వాదశ నామములలో నొకటి నందిని ప్రజ్ఞానాం బ్రహ్మయగు జ్ఞానానందమూర్తి.

263) ఓం స్తుత్యాయై నమః

అందరిచే స్తుతింపబడునది దేవ,దానవ, మానుష సంస్తుతయై యసుర సంహారము చేసి కీర్తింప బడు జయస్వరూపిణి. సామగానప్రియ, నమస్కార, ఆశీర్వచన, స్తుతి, పరాక్రమ, విభూతి, ప్రార్థన యను ఆరు లక్షణములు గల స్తోత్రములచే కీర్తింపబడునది వేద, సప్తశతీ స్తోత్ర పారాయణమందు ప్రీతి కలిగినది శక్రాదః 'తాంతుష్టువుః ప్రణతి నమ్ర శిరోధరాంసా వాగ్భిః ప్రహర్షపుల కోద్గమ చారుదేహాః' 'మత్తాసురైః పూర్వమభీష్ట సంశ్రయాత్తదా సురేంద్రేణ దినేషు సేవితా' కరోతుసానః శుభహేతు రీశ్వరీ, కాత్యాయనింతుష్టు వురిష్టలాభాత్, వికాసివక్త్రాబ్జవికాసితాశాః' పలుమార్లు దేవి స్తుతించబడినది.

264) ఓం స్తవనీయ స్వభావిన్యై నమః

స్తవనీయమగు గుణస్వభావములు గలిగిన దేవి 1) ఐశ్వర్య, వీర్య, యశశ్రీ, జ్ఞానవైరాగ్యములను నారు షడ్గుణములు, శబ్ద, స్పర్శ, రూప, రసగంధాది పంచభౌతిక గుణములు, త్యాగశౌర్య, ఔదార్యాది

గుణములు అత్యుత్తమములైనవి అనంత గుణసంపన్నగా, సర్వసంపూర్ణ రూపిణియైనట్టి దేవి 2) గుణములన వ్యూహములు కాల, కుల, నామ, జ్ఞాన, చిత్త, నాద, బంధు, కాల జీవములను తొమ్మిది వీని సంపుటిత సర్వాత్మ, ఏకాశక్తి రూపిగా పరమేశ్వరి స్వభావము గలిగియున్నది 3) సర్వమంగల మాంగల్య, సర్వార్థ సాధకి, శరణాగత దీనార్త పరిత్రాణా పరాయణీ, జగత్ప్రతిష్ఠ, నిత్యతరా, సుందరీ, విద్యాశాస్త్ర వివేకదీపియై, సహజ స్వభావముల పాలించు జనని

265) ఓం రంకిన్యై నమః/ఓం రంగిన్యై నమః

రంకిని రూపమైన దేవి అలస స్వభావియైన శక్తి, నిత్య మధుపానాసక్తియై మదాలసయై యానంద రూపిణియైనది 2) రం-అగ్నిబీజము, తత్ స్వభావమున దగ్ధము చేయు లయకర్త్రి స్వరూపిణి యగును 3) రంకిని యనగా నటనాశక్తిగల విదుషీమణి ప్రపంచమను నాటకరంగమునకు కర్త్రి తనలో తానే సృష్టి, స్థితి, లయాది క్రియల క్రీడించు శక్తి స్వరూపిణి

266) ఓం ఖంకిన్యై నమః/ఓం టంకిన్యైనమః

1-ఖం అనగా ఆకాశము అందుండు నక్షత్రములు, రాశి, సముదాయము అట్టి వియదాది సర్వస్వరూపిణియైన శక్తి ఆమెయే 2) అట్లే ఖం-అను బీజాక్షరము భూతముల పార ద్రోలును 3) భ్రమ రూపిణియైన శక్తి, భ్రమరాంబికా శ్రీశైలమందున్న పీఠశక్తి స్వరూపిణియై నది భ్రమరాంబికాయై నమః-మంత్రం 4) శుక్రాచార్యుడు శుక్ర నక్షత్రం స్వప్రకాశము గలది అట్టి ప్రకాశమూర్తి ఆమెయే 5) టంకిని టం-కార బీజాక్షరము సర్వవ్యాధిహరమైనది అట్టి శక్తి స్వరూపిణి టంకిని నాదములలో ధనుష్టంకారము అని భీషణ యోద్ధ ప్రతీకయైనట్టి శక్తి మూర్తి

267) ఓం చిత్రాయై నమః

చిత్ర స్వరూపిణియైనది చిత్రిణీయను సకలగుణసంపన్నయగు సుందరి చిత్తిని యను నాయికా భేదస్వరూపం చిత్రగతి గలిగినట్టిది అసాధారణమైనట్టి నేర్పు గలిగినట్టి దేవి స్వరూపమై యున్నది

268) ఓం విచిత్రాయై నమః

విచిత్ర స్వరూపిణి యైనది ఆమె అంతరంగము, నడవడి యెరగలేనట్టి విచిత్ర స్వభావిని గ్రహించుటను ఏ ఫలితమాశించి, జగత్సృష్టిచేసి, పాలన, ఆపై నాశము పొందించు క్రీడల యామె చిత్తవృత్తి గ్రహింపనెవరికి సాధ్యము గాదు అట్లే దానవులు బలముగా కొంతకాలము, దేవతలు బలముగా కొంతకాలము క్రీడించు అవ్యవస్థయు, నొక క్రీడయే ఎందులకో? ఇన్ని గోళములన్నిన్ని కోట్ల లక్షల జీవరూపములను సుత్పత్తి చేయుచు వొకదానినొకటి సంహరింపజేయు చేతమును కలిగించుచు విచిత్ర నటనాస్వరూపియై యున్నది

269) ఓం చిత్రరూపిణ్యై నమః

చిత్రరూపము కలిగినట్టి దేవి సర్వం ఖల్విదం బ్రహ్మ యని జరాయుజ, స్వేదజ, అండజ, ఉద్భిజాదుల రూపమామెయే వొకదానిపై నొకటి యాధారపడి ప్రకృతి సమతుల్యతను పాటించు శక్తి ఆమెయే విస్ఫోటనా శక్తి నక్షత్రములకు, అగ్నిపర్వతములకు నిడి ధ్వంసము చేయు శక్తి ఆమెయే. ఆమె అనేక రూపముల వ్యవహరించుచుండును

పద్మా పద్మాలయా పద్మవదనీ పద్మవిభూషణా

డాకినీ శాకినీ* క్షాంతా రాకినీ రుధిరప్రియా(52) శాకిని, హాకిని

270) ఓం పద్మాయై నమః

పద్మస్వరూపమై యున్న దేవి. కమలమందున్న లక్ష్మి పద్మప్రియే, పద్మిని, పద్మహస్తే పద్మాలయే పద్మ దళాయతాక్షి, విశ్వప్రియే, విష్ణుమనోనుకూలే యని హిరణ్యసూక్త (శ్రీసూక్త) పదములు పద్మాయన పద్మిని, పద్మము నాశ్రయించినది ద్వితీయ పరిశాదిదేవత. మహాలక్ష్మి స్వరూపి పద్మాసనే, పద్మోరు, పద్మాక్షి, పద్మసంభవేం అను మరికొన్ని పదములు ఆమె రూపములే. 2) మూలాధారాది

సహస్రారంత వ్యాప్తవ్రదళ వ్యాప్తినియైనందున బ్రహ్మస్వరూపిణి పద్మా అందురు

271) ఓం పద్మాలయాయై నమః

పద్మమునందుండునది పద్మమే ఆలయముగా గలది 'పద్మాసనాస్థాం విపులకటి తటీం ధ్యాయేత్' 2) కుడితొడపై ఎడమ పాదము ఎడమ తొడపై కుడిపాదమును ఉంచి తిన్ననైన ఊర్ధ్వకాయము గలుగు పద్మాసన స్థితి ఆ రూపుగనే కన్పట్టునది 3) మూలాధారాది షట్చక్ర దేవాలయములో ప్రాణశక్తి రూపమున కొలువున్న దేవి కుండలినీ స్వరూపిణియు నామెయే 4) శ్రీచక్ర బిందుమండల మధ్యస్థ బిందువునందు పద్మాసనస్థయై కొలువు తీర్చునది 5) బ్రహ్మ స్వరూపిణియు లక్ష్మి రూపిణియు నామెయే

272) ఓం పద్మముఖ్యై నమః

పద్మము వంటి ముఖము గలిగినది వికసించిన నేత్రములతో ప్రస్ఫుట పద్మము వంటి ప్రసన్న వదనముతో నొప్పారుదేవి సాముద్రిక లక్షణములలో నుత్తమ స్త్రీ లక్షణము ముఖమునకు విశాల నేత్రములు అలంకారము ప్రధానముగా ముఖాంగముగన్క పద్మాక్షి. పద్మనేత్రి పద్మదళాయ తాక్షియని నేత్రవర్ణన పదములు పద్మముఖి, పద్మవదనయును

273) ఓం పద్మవిభూషణాయై నమః

పద్మము నందలంకార యుక్తస్థితి పద్మముఖి, పద్మాసనే, పద్మ ఊరు, పద్మహస్తే, పద్మపాదేయని యంగములకు విశేషణముగా పద్మము వర్తిల్లుచుండును బాలకృష్ణుని రూపు వర్ణన 'కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం' అని గలదు కావున పద్మమే విభూషణముగా ధరించిన దేవి స్వరూపిణి అమల కమల సంస్థాం, కరకమలం కమలే, కమలాలయే, అను మూరు పదముల వలనను ప్రస్ఫుటమగు.రూపము

274) ఓం హాకిన్యై నమః/ఓం డాకిన్యై నమః

హాకిని లేక డాకిని స్వరూపిణియైన దేవి 1) హాకిని ఆజ్ఞాచక్రే భ్రూమధ్యే ద్విదళ కర్ణికాయాం శ్వేతాహంసవతి, త్రిశూలవరధారిణీ క్షమారూపి వర్ణదేవతా అధిష్ఠాతృదేవత షడ్వక్త్రం అబ్జసంస్థాం, త్రినేత్రం, హరిద్రాన్న ప్రసన్నాం జ్ఞానముద్రా, డమరుక, కమలా, అక్షమాలా, కపాలధారిణీ రూపము. 2) డాకిని విశుద్ధచక్రే, కంఠే షోడశ దళ కర్ణికా, శ్వేతా, సాలఖ్రసగ్ పుస్తకయు లావిశుద్ధరూపి స్వరదళ కమలా, రక్తవర్ణం, త్రినేత్రం, పాయసాన్న ప్రసత్తాం ఏకవక్త్రాం ఖట్వాంగ కపాల త్రిశిఖ మపి మహాచర్మ ధారిణియైన దేవి షడ్చక్ర, అధిష్ఠాన దేవత లామె విభూతులే

275) ఓం శాకిన్యై నమః

శాకిని రూపమై యున్న దేవి మహత్వాకవతి పుష్కలమైన శాకములు గల దేవి సహచరి శక్తియై యున్నది. 'శాకంభరి' యని 'భరిష్యామిసురా శాకైరావృష్టైః ప్రాణధారకైః' అని అందురు వనస్పతి సూక్తమును గలదు పోషణ క్రియలో శాకిని విభూతిగా వెలగును.

276) ఓం శాంతాయై నమః /ఓం క్షాంతాయై నమః

శాంత స్వరూపిణియైన దేవి సర్వక్రియా నివృత్తి రూపము శాంతము 'ఉపశాంతోఽయమాత్మా' ఇదియే కేవల ఆత్మస్వరూపము 2) శృంగారాది రసములలో శాంతి అంతిమము మొదటి ఎనిమిది దేహేంద్రియ బుద్ధి, ప్రాణ ధర్మముల దృశ్యరూప ధర్మములు. 3) అశాంతాయని సర్వదిగంత వ్యాప్తమని తెలియనగును 4) నిస్తరంగమైన అమృతసరస్సు 'స' వర్ణమునకు ముందుగా గల 'వ' అమృత బీజస్వరూపము శాంత స్వభావము. 4) క్షాంతము అనగా అకారాది సర్వవర్ణ స్వరూపము క్ష స్వరమంతముగా గల అక్షర రూపిణి

277) ఓం రాకిణ్యై నమః

రాకిణీ స్వరూపిణియైన దేవి అనాహత చక్ర హృదయే, ద్వాదశ దళకర్ణికా, శ్యామవర్ణా, అక్షశూల కపాల, ఢమరుక ధారిణి, త్రినేత్రి అనాహతచక్రాధిష్ఠాత్రి యైన దేవి కాలరాత్రి ప్రముఖశక్తియుతము, స్నిగ్ధ భక్ష్య సక్త. కకారాది, ఠకారాంత ద్వాదశవర్ణ శక్తియుతమైన దేవి

277) ఓం రుధిరప్రియాయై నమః

రుధిర పానాసక్తురాలైన దేవి రుధిరము సప్తధాతువులలో నొకటి వామదేవి రుధిరధాతువున కధిదేవత రుధిర పుష్టికర దేవత అనాహత స్థానము రుధిరమునకు ముఖ్యస్థానము. అధాతు రూప రుధిరపానేచ్ఛ కలిగినది తర్పణ క్రియకు జలమునకు బదులు రక్తముతో చేసిన ప్రీతికరము అజావ్యాది జంతు రక్తము కంటె స్వీయ రక్తతర్పణ శ్రేష్ఠమని భావన విష్ణువు తన నేత్ర కమలములను, రావణుడు స్వీయ శిరస్సులను సమర్పించుట దీనికి తార్కాణము

భ్రాంతిర్భవానీ రుద్రాణీ మృడానీ శత్రుమర్దినీ
ఉపేంద్రాణీ, మహేంద్రాణీ జ్యోత్స్నా చంద్ర స్వరూపిణీ (53)

279) ఓం భ్రాంత్యై నమః

భ్రాంతి స్వరూపిణియై యున్న దేవి భ్రమ యుక్తము మిథ్యారూపమై యున్నది జగత్తు అంతయు భ్రాంతిమయమే లయకారకమై మోహము కలిగించుచుండును. నాశనమగుచుండును 'యాదేవి సర్వభూతేషు భ్రాంతి రూపేణ సంస్థితా' అనగా మహామాయా స్వరూపముతున్నది లేనట్లు లేనిది ఉన్నట్లు కనిపించు దృశ్యము శాశ్వతమైనట్లుల భ్రమను కలిగించును. చలన స్వభావము గలది

280) ఓం భవాన్యై నమః

భవానీ రూపియైన దేవి 1)భవుడను మహాదేవుని, సంసారమును, మన్మథుని జీవింపజేసిన భవాని 2) భవుని పత్ని భవాని, 3) జలమూర్తియగు పరమేశ్వరుడు భవుడు, ఆ భవుని జీవింప జేయునది భవాని 4) స్థానేశ్వర మను పీఠాధిదేవతగా భవానీ నెలకొని యున్నది 5) సమస్త ప్రపంచమును జీవింపజేయుట బుద్ధివృత్తుల ప్రేరేపింపజేయుట 6) అష్టమూర్తులలో ఒకరైనటువంటి భవుని జీవింప జేయునది భవాని

281) ఓం రుద్రాణ్యై నమః

రుద్రశక్తియైన దేవి తామసప్రవృత్తి ప్రధానముగా గలిగి లయము యనగా సంహారము చేయుచుండును రుద్రమూర్తి ఆయన శక్తి రౌద్రి, రుద్రాణి యనబడును. 2) రుద్రమూర్తులు పదనొకండు, అజ, ఏకపాదం అహిర్బుధ్న్య, త్వష్ట,రుద్ర, హర, శంభు, త్ర్యంబక, అపరాజిత, ఈశాన, త్రిభువన మను ఆ మూర్తుల శక్తులు రుద్రాణీ రూపిణులు 3) రుద్రుడనగా రుజం సంహారమును, ద్రావయంతి–ద్రవింపజేసేవాడు, రోగములను పోగొట్టువాడు, మృత్యుంజయ శక్తియునైనది. తత్ శక్తి రూపమే రుద్రాణి 4) సంధ్యోపాసనలో మధ్యాహ్నోపాసన రుద్రాణి నవయవ్వన, త్రినయనా, వైయాఘ్ర చర్మాంబరా, కమండలు,ఖట్వాంగ, త్రిశూల, అక్షహస్త, వృషభారూఢ, యజురూపిణీ, మౌళి చంద్ర, విద్యుత్పుంజ జటాయుక్త మూర్తి 5) రౌద్రయైన మోహిన్యాయై గౌర్యై ధాత్ర్యై నమో నమః జ్యోత్స్నాయై చేందు రూపిణ్యై, సుఖాయై యనుసప్తశతిస్తుతి, 6) రుద్–దుఃఖం, దుఃఖ హేతుం ద్రావయతి నః ప్రభుః ధర్మాదీన్ ద్రావయంతి–బోధయతి, ప్రాపయతి కాలాత్మయుక్తాని, కరణాన్యఖిలాన్యపి అనంతశక్తిరేకైకో భువానధితిష్ఠతి

282) ఓం మృడాన్యై నమః

మృడరూపియైన పరాశక్తి, సకల భక్తులకు సుఖము గలగజేయు మృడానీ శక్తి సత్వగుణ ప్రధానమై నట్టి, ఇహ పర సుఖ ప్రదాత, స్వస్వరూపమున నోలలాడు వాడు విద్యాతీత శక్తులలో అనుపమ శక్తిగల మృడుని శక్తి మృడయన సుఖపెట్టువాడు మృడి, మృడానీ రూపమైనది దుర్గ

283) ఓం శత్రుమర్దిన్యై నమః

శత్రువుల మర్దించు శక్తియై యున్నది దేవమునిజన పీడల కలిగించు అసుర శత్రుమూకల చెండాడి శుభమును కలిగించు శక్తి. వింధ్యాచల వాసిని, రక్తదంతికా, శాకంబరీ, భీమా, భ్రామరి, లలితాది రూపముల ధరించుచు, తన విభూతులైన బ్రహ్మీ, మహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, మహేంద్రీ, చాముండీ, మహాలక్ష్మి రూపములను ప్రదర్శించుచు మధుకైటభ, చండముండాసుర, మహిషాసుర,రక్తబీజ, భండాసురాది దైత్య సంహారిణి ఆమెయే గదా దుర్గా దుర్గతి హారిణి, దుర్గమాసుర సంహారిణి, స్మరణ మాత్రమున రూపు ధరించి శత్రుసంహారము చేయును

284) ఓం ఉపేంద్రాణ్యై నమః

ఉపేంద్రుని శక్తియైన దేవి ఇంద్రునికి ఇంద్రుడు వామన భగవానుడు, విష్ణువు నారాయణుని స్వరూపమే మహామాయ నారాయణుని శక్తి ఉపేంద్రాణియై యున్నది వ్యాపక శక్తి నారాయణియే ఉపేంద్రాణి సమానార్థము సరళబ్దము. జీవపరము సకల జీవులకు పోషణ స్థానమైన పరమేశ్వరి, ఉపేంద్రాణి, ఇంద్రాణి విభూతియు నామెయే వజ్రహస్తాతద్వైంద్రీ, గజరాజో పరాస్థితా సహస్రనయనా యథాశక్రస్థదైవన. ఆమెయె వైష్ణవి ఏషాసా వైష్ణవీమాయా, మహాకాళీ దురత్యయా, ఆరాధితా వశీకుర్యాత్ పూజాకర్తృశ్చరాచరమ్ సర్వదేవ శరీరేభ్యాయాఽవిర్భూతాఽమితాప్రభా, త్రిగుణాసా మహాలక్ష్మి సాక్షాత్ మహిషమర్దిని

285) ఓం మహేంద్రాణ్యై నమః

మహేంద్రాణి రూపిణియై యున్నది దేవతాశాసకుడైన ఇంద్రుని శాసించునది మహేంద్రుడు శక్తి మహేంద్రాణి మహేశ్వరీ రూపశక్తి. 'మహత్' యనగా బ్రహ్మము అట్టి బ్రహ్మాండముల సృష్టి, స్థితి, పాలన, లయకర్త్రి, మహేశ్వరి, బ్రహ్మాండముల శాసనశక్తి ఆమెయే

286) ఓం జ్యోత్స్నాయై నమః

శీతలోజ్జ్వల కాంతియై యున్నది జ్యోతిప్రకాశరూపమునైన దేవి చల్లని వెన్నెల రూపమైనది శీత కిరణుడు చంద్రుడు ఆయన వలన వెన్నెలకాంతి పరమేశ్వరుని మౌళియందు సాధాఖ్యకళ లేక షోడశకళ నిత్యము వెలుగుచుండును ఆమె ఉపాసనమున నాస్థిర చంద్రుని శీతలకాంతి భక్తులపై నిత్యము ప్రసరించుచుండును 'జ్యోత్స్నాయై చేందు రూపిణ్యై సుఖాయై సతతం నమః' 'శరదిందు సమానాభ' యనియు, 'చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం' అని చంద్ర హిరణ్మయీ రూపిణి యైన దేవి

287) ఓం చంద్ర స్వరూపిణ్యై నమః

చంద్రస్వరూపిణియై యున్న దేవి పరమేశ్వరి జటలయందలంకారమైన నిత్యశీతల చంద్రుడే శిభావమైన రూపము గలది బ్రహ్మరంధ్రాధోభాగమున సహస్రారము అందమృతాంశునిధి అందుండు పరమేశ్వరి అమృతాంశునిధియైన చంద్రస్వరూపిణి సాయంకాలానుష్ఠానముల చంద్ర మండల మధ్యగా రూపమున ధ్యానించబడును 2) శ్రీవిద్యాపంచదశీ మంత్రోద్ధారణయందు చంద్రునిచే ననుష్ఠింపబడినట్టిది చంద్రవిద్య గలదు తదధిష్ఠాన చంద్ర విద్యోపాసరూపిణి 3) శరీరమున మూడవ కూటాంతమును ద్వాదశాంతం, పరాకాశము, సుధాబిందువు, బిందుమండలం, చంద్ర సూర్యాగ్నుల సంధిస్థానము. సోఽహం శక్తిరూపిణి. చిదాకారమైన చంద్ర మండల సంజ్ఞ గలదియును గావున నా రూపున నుపాసింపబడుచున్నది

సూర్యాత్మికా రుద్రపత్నీ రౌద్రీ స్త్రీ ప్రకృతిః పుమాన్
శక్తి*ర్ముక్తి ర్మతి ర్మాతా భక్తిర్ముక్తిః పతివ్రతా(54) సూక్తి

288) ఓం సూర్యాత్మికాయై నమః

సూర్యాత్మికాయై యున్నది. కోటిసూర్యులతో సమానకాంతి గలది తేజ స్వరూపిణి ఉదయం అగ్ని

రూపమున, మధ్యాహ్నం సూర్యరూపమున, సాయంత్రం చంద్రరూపమున తేజస్సును ప్రసరించెడు శక్తిస్వరూపిణి. 2) మణిపూర అనాహతముల సూర్యమండలముగాన రుద్రరూపియైన సూర్యాత్మ శక్తి. 3) ఉకారాంత సహస్రారరశ్మి ప్రభ, విద్యుత్పుంజ కాంతిరూపిణిగా మధ్యాహ్న సంధ్యా రూపం

289) ఓం రుద్రపత్న్యై నమః

రుద్రపత్నియైన దేవి 'రుద్రాణీ నవయౌవనాత్రినయనీ, నైయాఘ్రచర్మాంబరా' అనియు, రుద్రాణి యొక్క వివరము ఈ పదమున కొప్పును కతమ ఆత్మేతియో-యం విజ్ఞాన, మయః ప్రాణేషు, హృద్యంత ర్జ్యోతి పురుషః స్ఫూర్తత్వాత్ పురుషః సోఽయంజ్యోతి రాత్మేతి భణ్యతే'

290) ఓం రౌద్ర్యై నమః

రుద్ర రూపమున నున్న దేవి పర్యాయ పదము మృత్యుమృత్యు రూపమైన రుద్రుని అభిషేకమును 'అకాలమృత్యుహరణం, సర్వపాప ప్రణాశనం, విజ్ఞాన సంపదల ప్రదాత, అభిషేక ప్రీతయైన శక్తి శైవ శక్తులలో నొకటి వామా, జ్యేష్ఠా, రౌద్రీ, కాళీ, కల్యగ, వికరిణీ అవ్యయాది ద్వాదశశక్తులు

291) ఓం స్త్రియై నమః

స్త్రీ రూపమైన శక్తి అతివ, పడతి, భార్యయగు శక్తిరూపం శివరూపమైన పురుషుడు శక్తి లేక సృష్టి కార్యము నిర్వహించలేడు స్త్రియస్సమస్తాతవదేవి భేదా-షట్కర్మ యుక్త, గృహిణిగా, ఇల్లాలుగా, మంత్రిగా, దాసిగా, రాణిగా, క్షమామూర్తిగా దేవికనేక విభూతులేర్పడినట్లు అనేక రంగముల సంసార చక్రము నాశ్రయించి యున్నది మహామాయ అవిభిన్నాంగముగా క్రీడించుచున్నది అట్టి సృష్టిలో ననేక రూపములునై యుండును

292) ఓం ప్రకృత్యై నమః

ప్రకృతి రూపిణియైన దేవి లక్ష్మి అష్టోత్తరములలో ప్రకృతి మొదటి నామము భూమ్యాంతరిక్షములు అందు దృశ్యమానములగు తరు, లతా జంతు సంతతులు, గాలి, నీరు, అంతరిక్ష తారకలన్నియు ప్రకృతి యంగములే 'నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః, నమః ప్రకృత్యై భద్రాయై నియతా' విశ్వేశ్వరీ, జగద్ధాత్రీ, ప్రకృతి, సృష్టిస్వరూపమంతయు వ్యాప్తమై యున్న శక్తి

293) ఓం పుమానాయై నమః

పురుషుని రూపమునై యున్నది శూన్యము అందు శక్తి ఏకా క్రీడార్థమై పురుషుని సృజించెను విస్తృతిగా బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను సృష్టి, స్థితి, లయ కృత్యములు నిర్వహణకై సృష్టి చేసి, జగత్తునందలి పురుష, స్త్రీ శక్తియను ద్వైధ భావమును విస్తృతము చేసి యొకరొకై నొకరు ఆధారపడునట్లు ప్రేమను భక్తిభావముల పెంపొందించెను అర్ధనారీశ్వరుడని శివునికి పేరు 2) పురుషార్థములు ధర్మ అర్థ, కామ అంత్య మోక్షములను నాశ్రయించి ప్రతి జీవియు ప్రవర్తిల్లవలెను అన్నిటికిని గృహిణిగా చేదోడు వాదోడుగా పై సాధనల నంతర్యామిగా నుండునది

294) ఓం శక్త్యై నమః

శక్తి స్వరూపయైనది కౌమారీ శక్తిహస్తా మయూర వరవాహినీ, 2) ఆయుధములలో నొకటి అసుర సంహారార్థమై వినియోగము. 3) చిత్తిరూపేణ యా కృత్స్నమే తత్ వ్యాప్యస్థితా జగత్-ప్రపంచముననున్న వ్యాపక శక్తి నారాయణి మహావిద్యాధిరూపములు నామెయే క్షరాక్షర జగన్మాతృకా శక్తియు నామెయే 3)పంచదశీ కూటమున మూడవది సకల హ్రీం నాలుగు అక్షరములు గలది మధ్యభాగమున రెండు వర్ణములు మూలాధారమున నొకటి స్వాధిష్ఠానమును నాలుగవ వర్ణం వ్యాప్తమై యుండును సకల శక్తులకు కేంద్రము కుండలినీ స్థానము యోగులు సాధించునది సర్వశక్తియు నామెయే ప్రాణశక్తి గ్రాహక శక్తి సర్వవ్యాపక శక్తులను ననేక రూపముల ననేక భేదముల వర్తిల్లుచుండును

**295) ఓం సూక్త్యై నమః / ఓం ముక్త్యై నమః**

సూక్తిరూపమునై యున్నది 'సు' 'ఉక్తి' యన మంచిపలుకు, హితమైన భాషణము వాచామస్తు తవ శక్తి యుక్తా, ప్రచోదయిత్రీ సూనృతానాం, చేతంతీ సుమతీనాం-అని సరస్వతీ రూపమునై యున్నది సరస్వతి, ఇడా, భారతీయని, అగ్ని, నది, చేతనారూపమునై యున్నది మాటలాడువిధి కొకరి సంస్కారమును తెలియజేయును మాట మంచిదైతే జీవి మనుగడ కాధారముగును సకల విద్యాంతర్గతమైన సూక్తి అలంకారముగా నుండును వాగీశ్వరిదేవి కలభాషిణి, సుభాషిణి, మంజుభాషిణి, మృదుభాషిణి యను యనేక విశేషణములు గద్య పద్యాత్మక సర్వవాఙ్మయ రూపిణియై వెలగుచుండును

**296) ఓం మత్యై నమః**

మతి స్వరూపమునైయున్నది 'యాదేవి సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా' యని బుద్ధి రూపమున సంకల్ప వికల్పాత్మకమైన మతి స్వరూపమునై యుండును 2) విష్ణ్వాది దేవతలచే పూజింపబడు వేద జ్ఞానభవి మతి సుమతియని మంచిబుద్ధి ప్రసాదించు శక్తియై యున్నది వాగ్విభవ ప్రదమైన మతికి అధిష్ఠాత్రి సరస్వతి వాగీశ్వరీ దేవియే

**297) ఓం మాతాయై నమః**

మాతృరూపిణియైన దేవి కల్పాంతమున సకల చరాచర సృష్టిని బీజరూపమున ధరించి పునరావిర్భవింపజేయు శక్తి మాత రూపిణి అవ్యక్తము నుండి వ్యక్తమును చేయు అవ్యక్త స్వరూపిణి మాత. తల్లి, అత్త, గురుపత్ని, రాజ్ఞి, వదినలు మాతృసమానులు అష్టమాతృకలు బ్రాహ్మి, మహేశ్వరీ, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణీ, చాముండీ, మహాలక్ష్మి అటులే సప్తషోడశ మాతృకా శక్తులు అకారాది క్షకారాంత మాతృకా స్వరూపిణియును, కాయావరోహణమును క్షేత్ర దేవత 'మాతా' సంజ్ఞ గల అంబ, మాత, జననీ, ధాత్రి పర్యాయపదములు

**298) ఓం భుక్త్యై నమః / ఓం భక్త్యై నమః**

భుక్తి రూపమైనది 'భరిష్యామిసురాః శాకైరా వృష్టేః ప్రాణధారకైః శాకంబరీతి విఖ్యాతాం భువి' 'యాదేవి సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా' జలములు, శాకములు, పాకాదులు ప్రాణాధారములు 'క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా అలక్ష్మీం నాశయమ్యహం' అను వానిని నివారించు శక్తియును 'భుక్తి శక్తి స్వరూపిణి' 2) భక్తిస్వరూపిణియైనది నవధాభక్తి రూపములనేదైన నొక విధానమున తత్ స్వరూపిణియైన భగవతి భావనలలీనమై మోక్షమందుట యగును

**299) ఓం ముక్త్యై నమః**

ముక్తిస్వరూపిణియై యున్నది సంకల్ప వికల్పాత్మకమైన మనోనాశమే ముక్తి స్థితి అట్టి మోక్షలక్ష్మిని ప్రసాదించునది దేవియే 'పునరపి జననం పునరపి మరణం' - అను సంసార చక్రభ్రమణము నుండి విముక్తియే గావలెను 'జ్ఞానినామపి చేతాంసి' మోహింపజేయు శక్తి మహామాయ ఆమె ఉపాసనచే మోక్షజ్ఞానము గల్గగలదు నైశ్చయుద్ధైనసమాధికి 'త్రం ప్రయచ్ఛామి సంసిద్ధ్యై తవజ్ఞానం భవిష్యతి' అని పునరావృత్తి నివారకమైన మోక్షజ్ఞానము నిడునది ఆ మాతృమూర్తియే

**300) ఓం పతివ్రతాయై నమః**

పతిసేవ సన్నిధానములే ప్రతిముగా గల దైవీశక్తి కామేశ్వర, మనోహరా, ప్రాణనాడి, కామేశ్వరోత్సంగ వాసినీ, ఆలింగితాంగి, సుఖప్రదా, ప్రణయినీ, విలాసినీ, తపస్సిద్ధిః, మనః ప్రియా, ప్రాణనాథ, విమోహిని గృహేశ్వరీ యని త్రిశతిలోని పదముల పతిసేవలో నిత్యము లీనమై హితము గోరుచు అనుసరించు శక్తి స్వరూపిణియై యున్నది

ఇతి అరవింద కృత వివరణ సహిత లలితా త్రిశతీ నామావళ్యా సంపూర్ణః

సర్వేశ్వరీ సర్వమాతా శర్వాణీ హరవల్లభా,
సర్వజ్ఞా సిద్ధిదా భవ్యా భావ్యా భయాపహా (56)

301) ఓం సర్వైశ్వర్యై నమః

సర్వమున కధిష్ఠాత్రియైనది 'పరాపరాణాం పరమాత్వమేవ పరమేశ్వరీ' దృశ్యాదృశ్యముల కంటెటికి నామ రూప ప్రపంచమునకు నియంత్రి సృష్టిస్థితి లయకర్త్రియునైనది 'ప్రకృతిస్త్వంచ సర్వస్యగుణ త్రయ విభావినీ' మరియును 'బ్రహ్మేశగురువిష్ణూనాం తథేంద్రి స్య చ శక్తియః తద్రూపా వంది కాయః' సర్వశక్తి యుతమైనది 'ఈశిత్వ భావకలుషకలి నామపంతి। బ్రహ్మాదయో ప్రతిభవం ప్రలయా భభూతా ఏకస్యయేవ జగతి స్థిరసిద్ధిరాస్తే' అని సర్వేశ్వరి నిత్యస్వరూపముగానే యుండును

302) ఓం సర్వమాతాయై నమః

సకల జీవమాతృ స్వరూపిణియైన దేవి బ్రహ్మాది దేవతలకును అఖిలాండ బ్రహ్మాండముల సృజించుచు నన్నిట మాతృస్వరూపిణియైనది సర్వశక్తి స్వరూపిణి, సర్వమాతృకాస్వరూపిణియై సృష్టిస్థితిలయములను కృత్యముల క్రీడించుచుండును శ్రీమాతా భార్గేశ్వరీ యని మొదలుగా లలితాసహస్ర నామములు గలవు మాతా పదమునకు విస్తృతరూపము (297) సకల దేవదానవ జీవ మాతయని ఖ్యాతి

303) ఓం శర్వాణ్యై నమః

శర్వపత్నిరూపయైనది పరమేశ్వరుని అష్టమూర్తులలో నొకటైన క్షితిమూర్తి శర్వుడు సంహార సమయమున సకల లయమును చేయు మూర్తి శర్వుడు తత్‌శక్తి శర్వాణియై యున్నది 2) సర్వ భూత చయమును భరించు విశ్వంభర రూపుడీశ్వరుడు సర్వజీవ పోషక శక్తి శర్వాణి శక్తి 3) అష్టమూర్తులలో జలస్వరూపుడైన పరమేశ్వరుడు ప్రత్యక్షం శర్వాణి శక్తి.

304) ఓం హరవల్లభాయై నమః

హరుని ప్రియసతియైనది హరస్య ప్రియా, శివవల్లభా, హరునికి ప్రేమాస్పదమైనది హరుడు లయకారి యును అజ్ఞాన హరణము చేసి జ్ఞానము ప్రసాదించును దారిద్ర్య, దుఃఖహరుడైన మూర్తి యని తత్‌శక్తి హరిప్రియ అర్ధాంగి, హరపర్యంకోపస్థయై జగములనేలెడి శక్తి.

305) ఓం సర్వజ్ఞాయై నమః

సర్వమును తెలిసిన దేవి సామాన్యత, సర్వంజానాతి త్రికాలజ్ఞానము కలిగి భూత, వర్తమాన, భవిష్యత్తు సర్వమును తెలిసినది సర్వజ్ఞత, అనాదిబోధ, స్వతంత్రత, నిత్యత, సంపూర్ణత, అనంతత యను యారు లక్షణములు కలిగినది నిత్య, అలుప్త, జ్ఞానస్వరూపిణి, బ్రహ్మణియగు దేవి సర్వజ్ఞత, సర్వవేత్ర్త్వాది శక్తులు గలిగినట్టిది సర్వవిత్, సర్వేశి

306) ఓం సిద్ధిదాయై నమః

సిద్ధులను ప్రసాదించునది అణిమా, గరిమా, మహిమా, లఘిమా, ప్రాప్తి ప్రాకామ్య, ఈశిత్వవ శిత్వాది యష్టసిద్ధులను సాధకులైన భక్తులకు ప్రేమతో ప్రసాదించుదేవి సకల సంపదలను ప్రసాదించు వరద 'ఆశ్వదాయా, గోదాయి, ధనదాయి మహాధనే' 2) పిండాండంబున స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాత్రి సిద్ధేశ్వరి సిద్ధులు గోసంరక్షణ చేయువారు. వారికి గోసంపదనిచ్చు దేవి 3) కాశీక్షేత్రమున సర్వసిద్ధులు ప్రసాదించు సిద్ధేశ్వరి దేవి గలదు

307) ఓం సిద్ధాయై నమః

సిద్ధిరూపమేయైనది. 'సిద్ధం హి బ్రహ్మ' విశేషణ గుణప్రాప్తసిద్ధి అష్టసిద్ధిస్వరూపియు ఆమె ధనసిద్ధి, జ్ఞాన సిద్ధి, కామ్యసిద్ధి, మోక్షసిద్ధి, సకలవాంఛాఫలసిద్ధియని పరిపూర్ణమైన తపస్సిద్ధి స్వరూపిణి యామెయే అటులే సర్వసిద్ధ విద్యాస్వరూపిణియై–బాల, పంచదశాక్షరి, శ్రీవిద్యా, షోడశ్యాది సిద్ధ విద్యాస్వరూపమామెయే మూలాధార చక్రాధిష్ఠాత్రి సిద్ధవద్య దశమహావిద్యలుగా కాళీ, తారాది ఆమె విభూతులే. 2) 'కార్యకారణాత్మక ప్రపంచ సర్వ స్వాధిష్ఠ భిత్తిన తయా, ప్రమాణాంతర నిరపేక్షతయా,

అనాదిత్వాత్ కారణాంతరనిరపేక్షతయాచ స్వయం ప్రకాశమానత్వాత్-పూర్వమేవ సిద్ధం అట్టి అనాది స్వతః సిద్ధమైన కారణాత్మక శక్తి.

**308) ఓం భవ్యాయై నమః**

భవ్యరూపిణియై యున్న దేవి భవరూపమైన శక్తి భవ్యా సృజనాత్మకశక్తియునై యున్నది అనేక రూపముల జరుగు,పలు విధముల సృష్టిరూపమునై యున్నదేవి ఆరాధింపదగినది. శ్రేయోగుణము గల మూర్తి 'నమః ప్రకృత్యై భద్రాయై నియతాః' యని సర్వజగదాధారమైన శక్తి 2) భవాయ, భవలింగాయ, భవోద్భవాయ, భవనాశకాయ యనబడే పరమేశ్వరుని శక్తి

**309) ఓం భావ్యాయై నమః**

భావింపదగినది యైన శక్తి స్వరూపిణి సకల గుణకల్యాణమూర్తిగా, దేవముని, మానుషిగుణపాల కారి సర్వశ్రేయోదాయినిగా నిత్యము స్మరింపదగు మాతృమూర్తియై యున్నది గాఢస్వత్ కిరీట మమృతాంసు కలావతం, పరమామృతార్థ స్వరూపిణి, సహస్రార కమల కర్ణిక యందు భావింప దగును ఆమె నిత్యభావన మోక్షదాయకము

**310) ఓం భయాపహాయై నమః**

భయమును తొలగొట్టు మూర్తి. 'దుర్గేస్మృతాహరసి భీతి మశేషజంతోః స్వస్థైస్మృతామతి, మతీవశుభాం దదాతి' యనియు 'శరణాగత దీనార్తపరిత్రాణ పరాయణే సర్వస్యార్తి హరేదేవి నారాయణి నమోస్తుతే' నారాయణి రూపిణి యైన దేవి అటులనే 'సర్వదేవమయి మీశాంలక్ష్మీ మిమాం నృప! పూజయేత్ సర్వలోకానాం, సదేవానాం ప్రభుర్భవేత్' అభయమూర్తి, దురిత పాప ధ్వంసిని, మహిషాసురాది నాశకర్త్రియై శాంతి కలిగించు భద్రమూర్తి

శర్త్రీ హర్త్రీ పాలయిత్రీ శర్వరీ తామసీ దయా

తమిస్రా తామసీ స్థాణుః* స్థిరా ధీరా తపస్వినీ(56) యామినీస్థాచ

**311) ఓం శర్త్ర్యై నమః**

నిర్మాణ శక్తియైన దేవి పరమేశ్వరి నిత్యక్రీడలలో మొదటిది సృష్టి. సకల గోళజీవరాశి చైతన్యాది శక్తుల కారకమైన దేవి జగన్నిర్మాణ శక్తియై యున్న దేవి జీవదేవాది గణములు తమ తమ పనులు చేయునట్లు చేసి, సకల చేతనాశక్తియునై యున్న దేవి త్రిమూర్తుల సృష్టి, భూగోళ నిర్మాణము, కాలాద్యంగములు, జీవవనస్పతి, వినియోగముల నిర్దేశించి నడుపు శక్తి, అసుర సంహారము, భక్త పరిరక్షణ యను కృత్యము లామెపైనవి

**312) ఓం హర్త్ర్యై నమః**

హరించు శక్తియు నామెయేయైయున్నది లయశక్తి. జగత్ ప్రళయకాలమందు జగత్తుల లయము చేయునది 2) జీవబ్రహ్మైక్య కాలము చిత్తవృత్తి విశేషము తురీయ అతీతమైన పంచమదశ అను భావమును లయ మందురు. 3) పరమేశ్వరి కల్పాంతముల ప్రపంచ లయమొనరించి, వాసనా రూపముల అద్భుతముల వహించునదిగాన హరించు శక్తి హర్త్రీ 'బ్రహ్మాదయః ప్రతిభవం లయాభి భూతాః' 'ఏకస్యయేవ జగతి స్థితిసిద్ధిరాప్త'

**313) ఓం పాలయిత్ర్యై నమః**

పాలించు దేవియై యున్నది. మూడవది పోషణశక్తి, పాలించు శక్తియై జగద్ధాత్రి విరాజిల్లుచుండును 'విసృష్టౌ సృష్టిరూపాత్వం స్థితి రూపాచ పాలనే' చతుర్దశ భువనములకు నాధారభూతమై విశ్వంభర యైనది జగముల పోషించునది జగద్ధాత్రిగాను 'త్వం స్వాహా, త్వం సుధా, త్వం హిమవషట్కార స్వరాత్మికా' యను వివిధ క్రియల దేవ, పితృ మానవ పోషణ చేయుచు పాలించు శక్తి శాకంభరియు నామెయే అసుర సంహారము చేసి శాసించు శక్తియు నామెయే

314) ఓం శర్వర్యై నమః

శర్వరీ రూపమై యున్నది రాత్రి మన్మథరూపియని, తమసాకృతియని అర్థములు ఇవన్నియు కాళీ మనసునకు పర్యాయపదాలు మహామాయాస్వరూపములు కాళరాత్రి మహారాత్రి మోహరాత్రి శ్చ దారుణా అని కలదు 3) వత్సరములలో నొకదాని పేరు రజనీరూపశక్తియునై యున్నది

315) ఓం తామస్యై నమః

తామసీరూపమై యున్నది తమోగుణ మధికముగా గలిగియున్న స్త్రీశక్తి మహాకాళి 2) సాయం సరస్వతీరూపము 'ధ్యేయధాత్రి సరస్వతీ భగవతీ పీతాంబరాలంకృతా శ్యామల స్వరూపిణీ' యని గలదు 'కృష్ణా కృష్ణ పద్మాసనస్థా, కృష్ణాంబరధరా, కృష్ణవర్ణా కృష్ణ గంధానులేపనా కృష్ణమాలాంబర ధరా' యనియు, 'మహామోహచ భవతీ, మహాదేవి మహాసురి' అసురదండనార్థమై మహాసురి తామసి యైన దేవి స్వరూపం క్రోధ రక్తేక్షణా, దంష్ట్రాకరాళవదనా, భృకుటీ కుటిలోత్తస్యా ముష్టి వర్తమా భూత్తదా' రూపమునైనది

316) ఓం దయాయై నమః

దయామూర్తియైయున్న దేవి అవ్యాజక కరుణామూర్తి దయాసముద్ర, క్షమామూర్తియునై యున్న దేవీస్వరూపము 'దేవేశి భక్తసులభే' యని శ్రీమన్మందకటాక్ష లబ్ధవిభవా-భక్తి ఆపదల నాదుకొనుచు వాంఛల దీర్చుచూ భక్తజనవాత్సల్యము గలిగినట్టి దేవిరూపము 2) దయయన ఆనందము బ్రహ్మానంద స్వరూపిణి 3) శ్రీచక్రమునందలి బిందువు సర్వానందమయ చక్రమందురు పిండాండము దయకు స్థానము హృదయము ఆర్ద్రహృదయము గలిగినట్టి మాతృరూపిణి

317) ఓం తమిస్రాయై నమః

తమిస్రారూపిణియైనది చీకటి, కోపము రూపమునై యున్నది కాళరాత్రిరూపము అసురహంత్రిగా, క్రోధ రక్తేక్షణగా నున్నది 2) అంధతామిస్రమను నరకము చీకటి నాశయించి యుండును అట్టి కాళీ వర్గరూపిణి రాత్రి వ్యక్తరాత్రి అని దుఃఖమును కలుగజేయునది

318) ఓం తామస్యై నమః

తమో ప్రకృతి అధికముగా గలిగియున్న దేవి లయకాలమునందు సృష్టి సంహారమునకు గాను తామసీ రూపమున దేవి వెలుగుచుండును ఉగ్రరూపి, అస్త్రశస్త్ర ప్రయోగ మూర్తి భీషణ వినాదముల భయంకర మూర్తియై, యసురులకు కాళమూర్తిగా, భక్తులకు లయమూర్తిగా కనబడుచుండును

319) ఓం స్థాణవే నమః

స్థాణుమూర్తియైనది స్థాణువు శివునికి పర్యాయపదము నిర్వికారము, అత్యంతస్థిరమైనది యను అర్థము జగత్తంతయు ప్రళయమున లయము పొందుచుండగా నేమియు పట్టనట్లు స్థిరముగా వెలుగు రూపము అంతర్లీనమై చలనము లేనట్టి స్థితియును, బ్రహ్మాదులును ప్రళయాభిభూతులై చనగ, స్థిరముగా నొక్కతయే క్రీడించుచు వెలుగు శక్తి

320) ఓం స్థిరాయై నమః

స్థిరముగా నుండు శక్తి కొండ చలనము లేనిది పర్వత పుత్రి కాళి, స్థిరస్వభావము గలిగియున్నది యును, నిర్వికారియును, భూమిరూపమున నున్నదియని భావము పై స్థాణురూపమున కనుబంధము శాశ్వతత్వమునకు గుర్తు అనంతకాలరూపిణియను భావన

321) ఓం ధీరాయై నమః

ధైర్యమునకు రూపమైనట్టి దేవి 'యాదేవి సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' సంకోచము లేనట్టి శక్తి. అన్యాయమును ఎదిరించు శక్తి. అసురసంహారము చేయు శక్తి, ధీరగుణము గల శక్తి. సన్మార్గమున బుద్ధినిడును 'తంధీరా సజనయ తన్నయంతి' ఆమెయందే పుంస్త్వ గుణములు లీనమైయున్నవి

బ్రహ్మేశ గుహవిష్ణూనాం తథేంద్ర స్యచ శక్తయః' తద్రూపై చండికాయయుః' అని ధైర్యము గల స్వరూపమునైనది.

322) ఓం తపస్విన్యై నమః

తపస్వినీ రూపిణియైన దేవి తపమనగా మితభోజనము, ఉపవాసము, కృచ్ఛ్ర, చాంద్రాయణాదుల శరీరము శుష్కింపజేయుట ఆకలిదప్పులు, శీతోష్ణాది ద్వంద్వ సహనముచే కాయిక, వాచిక, మానసిక వృత్తుల నేకాగ్రత నొనర్చుట, సర్వేంద్రియ దమనచే బుద్ధిని పరమేశ్వరి పాదపద్మముల వద్ద నియమించుట. సదాచార పరాయణా, తాపత్రయ హీనత 2) తనకే ప్రతిఫలము నెంచక లోక కళ్యాణమునకై నిత్య సన్నద్ధులకు హితకారులు ఆట్టిబుద్ధిగల అంబ నిరపేక్ష జగత్కళ్యాణ శ్రేయోమనము గలిగినది

చార్వంగీ చంచలా లోలజిహ్వా చారుచరిత్రిణీ
త్రపా త్రపవతీ లజ్జా విలజ్జా హరయౌవతి(67) నిర్లజ్జా హ్రీంరతోపతి

323) ఓం చార్వాంగ్యై నమః

సుందరమైన అంగములు గల సుందరాంగి లక్ష్మి స్వరూపం 'హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం' అని బంగారు వర్ణము గలదిగా నెంతురు అట్లే కాళిక యన 'కృష్ణవర్ణాం హేమ ప్రభాభా ఇందు ఖండాంత మౌళిం, త్రినేత్రాం, హేమాబ్జస్థాం, పీతవస్త్రాం, ప్రసన్నాందేవీం దుర్గాం దివ్యరూపాం నమామి' 'జ్యోత్స్నాయై ఇందురూపిణ్యై' 'ఏతత్తేవదనం సౌమ్యం సౌమ్యేతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సుందరీ' యను పదములు తార్కాణము

324) ఓం చంచలాయై నమః

చంచలరూపిణియైన దేవి చంచలాయన లక్ష్మికి ప్రతీక. ఒకచోట స్థిరముగా నుండని స్థితి కాముకి, వాయువు, మెరుపు అని అర్థములుగలవు 'విద్యుద్దామ సమప్రభాం మృగపతిస్కంధ స్థితాం' చంచల చిత్తమును, కేంద్రీకరించుట కష్టము గాన ఆభాసమాత్రము ధ్యానలబ్ధి కాననగును ఆమె రూపమును స్థిరీకరించుట సులభం కాదు గావున చంచలా అని ధ్యానమాత్ర లబ్ధియని యర్థము నెంచ దగును

325) ఓం లోలజిహ్వాయై నమః

లోలజిహ్వ గలది చంచలమైన వ్రేలాడు నాలుక గలది రక్తబీజుని సంహరింప నెంచ, నతని రక్త బిందువులు భూమిపై పడి తద్రూపశక్తు లుద్భవమంద 'కాళీ విస్తార వదనాయై, లోలజిహ్వను చాచి యిచటచట రక్తబిందువులు పడుచుండువో వానిని గ్రహించుట జరిగినది. సర్వదిశావ్యాప్తమైన నాలుక గలది 'కాళీ కరాళ వక్త్రాంతర్గతర్ధ దశనోజ్జ్వలా' 'ఉవాచ కాళీం చాముండే విస్తీర్ణం వదనం కురు' అని అనుశాసించబడినది. 2) ప్రళయకాలమున కాలపురుషుని ముఖమునుండి అగ్ని, లోల జిహ్వరూపమున వెలువడి భస్మపటలము చేయుటయు, పురాణ ప్రసిద్ధము గదా 'జ్వాలాకరాళ మత్యుగ్రం' అని హుంకార శబ్దమాత్ర కీలలతోడను భస్మీకరించు శక్తి

326) ఓం చారుచరిత్రిణ్యై నమః

చారుచరిత్ర గలిగినట్టిదేవి. సుందరమైన పవిత్రమైన చరిత్ర గలది ఆమెయే కామేశ్వర, పరమేశ్వర వామాంకస్థ, మరొకరిని కామదృష్టితో చూడని పతివ్రత మహామాయా, మహాలక్ష్మి, మహాకాళీ స్వరూపముల లలితా రూపము, ప్రకృతి, సృష్టి వినాశకారులైన యసురుల నెందరినో వధించి శరణాగతుల కభయమిడు దేవి త్రైలోక్య స్వహితార్థాయ-వింధ్యాచల వాసిని, రక్తదంతికా, శాకంభరీ, భీమా, భ్రామర్యాదిశక్తి రూపములైనది

327) ఓం త్రపాయై నమః

త్రపారూపిణియైన దేవి త్రపాయన సిగ్గు, లజ్జ 'యాదేవి సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా'

యనియు, లక్ష్మీహృదయంలో 'ప్రేమత్రపాప్రణాహితాని, మాంగల్యదాస్తు మమ మంగళదేవతాయా' యను ముగ్ధరూపి త్రపా స్త్రీకి యలంకారము నిరహంకార సూచకముగా గూడా భావింపనగును

328) ఓం త్రపావత్యై నమః

సిగ్గు ఆభరణముగా కలిగినది. సిగ్గు సాధ్వికి ఆభరణము సంమోహకారి యగును. 'రూపసౌభాగ్యం కాంతీనాం సా ప్రతిష్ఠా మహాశ్రియః, త్రైలోక్యాయై చెందు రూపిణీ' యనుటలో పల్లవి వెన్నెల చిందు మోము అందు త్రపాభావన నిగూఢము 'లక్ష్మీర్లజ్జా మహావిద్యే' యని లజ్జ ఆభరణముగా గలది.

329) ఓం లజ్జాయై నమః

లజ్జాయుతయైన స్త్రీ. చిత్తవృత్తి భేద, అకృత్యప్రవృత్తౌ, పరదర్శనే, దుష్టత్వధియా, నివృత్తి సాధనేయను చిత్తవృత్తి భేదములు, సుశీలపత్నియని యర్థములు గలవు 'లజ్జాపుష్టి' తుష్టి, త్వం శాంతి రేవచ యను వివిధ లాక్షణిక నామములు బరగు దైవీ శక్తి దోషభావము మదిగల్గక, పరుల దర్శనమున, దుష్టబుద్ధి మరుగుపరచుట యందు, ప్రపంచమనరోసి నివృత్తి సాధన సందర్భమున నీ భావము వ్యక్త మగును

330) ఓం విలజ్జాయై నమః

లజ్జాహీనమైన శక్తియునై యున్నది దిగంబర రూపిణిగా క్షుద్రభూతి రూపము గలది తతోద్భూతసతః క్రోపాత్ అని అసురయుద్ధమున రోషరూపిణి యైన శక్తి. లజ్జకు వ్యతిరేక భావము రోషము ఉగ్రత యును 'శీర్షపదేత్వం సమరే, వర్షసర్వేషు నాశనం –అని దుర్గరూపము విలక్షణమైనది

331) ఓం హరయువత్యై నమః/ఓం హ్రీం

హరుని అర్ధాంగి, శక్తి బీజం హ్రీం 1) శక్తి ప్రణవమందు ద్వితీయం మాయా బీజం, అవ్యక్తం శబల బ్రహ్మవాచకం, భువనేశ్వరి మంత్ర స్వరూపం అష్టహకారాత్మక లజ్జాబీజ స్వరూపమైనది. 2) హ-కారం సూక్ష్మదేహం ర-కారం సూక్ష్మదేహ, ఈ-కారం కారణాత్మ, తురీయం హ్రీంకారం, 3) హకార రేఫ, ఈ కారముల సంహతి బ్రహ్మ, విష్ణు, రుద్రాత్మ సృష్టిస్థితిలయ ప్రతీకలు 4) హ్రీశ్చతేలక్ష్మీశ్చ, పత్న్యౌ, హ్రీం హరయః హరిహర స్వరూపము, జ్ఞానతేజ శక్తి సంపుట రూపము 5) హ్రీంకారం బ్రహ్మశక్తి, భువనేశ్వరీ బీజం, శక్తి, మాయ, హృల్లేఖ మొదలగు శక్తి రూపముల సూచించును 6) సర్వభూతముల 'హ్రీం' లజ్జాస్వరూపమై యున్నది హ్రీం మతి యనబడును 7) లలితా త్రిశతియందు 82వ నామము నుండి 100 వరకు (19) నామములు 'హ్రీం' భూషితములై యున్నవి 8) సమస్త విద్య ఐశ్వర్యాది ప్రాప్తి సాధనాలంబమై యున్నది పరమానంద మూర్తియని భావము హరప్రియా, శివవల్లభాయని సర్వేశ్వరి శక్తిగా నుతింపబడుచున్నది

332) ఓం రజోవత్యై నమః

రజోవతియైన దేవి రజః యన నెత్తురు, పవలు, ధూళి, పుప్పొడియను అర్థము 2) రక్తదంతి, రక్తవర్ణ, రక్తధాత్వాదిష్వాత్రి అని, విదేహ పోషకమైన ప్రాణాధారము రక్తమే స్వరూపమైనది 3) రజోధూళియని పవలు కన్పట్టు కాంత్య రూప ప్రభాసమును 4) పుప్పొడి, ఫలదీకరణమున కాధారము. వృక్షసంతతి వ్యాప్తి సూచించు ప్రత్యుత్పాదక శక్తి స్వరూపిణియైనది

సత్యవతీ ధర్మనిష్ఠా శ్రేష్ఠా నిష్ఠురవాదినీ,
గరిష్ఠా దుష్టసంహర్త్రీ విశిష్టా శ్రేయసీ ఘృణా(58)

333) ఓం సత్యవత్యై నమః /ఓం సరస్వత్యై నమః

సత్యవతియైన దేవి సత్యమనగా జడము, అనృతము, పరిచ్ఛిన్నము అయిన దానికంటే భిన్నమైన రూపము, సచ్చిదానంద స్వరూపము గలది. 2) పృథివి, జలము, అగ్ని మూడును సత్, వాయు, ఆకాశములు 'త్యత్' పరోక్షజ్ఞాన సంబంధి పరమేశ్వరి సత్, త్యత్ రూపమున భాసిల్లునని యర్థము 3) సర్వపదార్థ సముదాయమునందును కాలసంబంధములేక నిత్యముండునది గాన సత్యవతి

ఆత్మస్వరూపిణి అభినాశిరూపమైనది సరస్వతి, ఇడా, భారతీ యను సర్వవ్యాపక సత్యవాగ్రూపిణి యగును

334) ఓం ధర్మనిష్ఠాయై నమః

ధర్మాచరణ నిష్ఠ గలిగినది. ధర్మమన ఈశ్వరభక్తిమోక్షదింతయే ప్రధానముగా ప్రతము గలిగినట్టిది. ధర్మోరక్షతి రక్షితః యని యా ధర్మాచరణమే జీవితధ్యేయమైన దేవి 2) ధర్మస్వభావము ఆనందానుభవ నిత్యత్వాది యుతమైనది అదే ధర్మము భక్తులకిడునట్టిది 3) ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే-అని మహిషాసుర నాశిని దుర్గ, శాకంబరి, చండీ, కాత్యాయని, కాళీ మొదలగు యనేక శక్తిరూపములు ధరించి, ఆసుర సంహారము చేసి ధర్మము నిలబెట్టుటయు నిష్ఠ, ప్రతముగా గలది 'యథాయథా బాధాదానవోత్థా భవిష్యతి, తదా తదా అవతీర్యాహం కరిష్యామ్యరి సంక్షయం' సంకటములు సంభవించ దీనార్తి నాలకించు దేవి

335) ఓం శ్రేష్ఠాయై నమః

శ్రేష్ఠ వరిష్ఠ రూపిణియైనది అనుపమ స్థానమందు విరాజిల్లునది ఆద్యా, పూజ్యా,మూల,ప్రకృతి రీశ్వరీ, ఏకస్యయేవ త్రిజగతి స్థిరసిద్ధిరాస్తి, సర్వజ్ఞాతా, సదసి వాక్పటుతా, సంపత్కరాణి సకలేంద్రియ నందనాని, సామ్రాజ్యదాన విరతాని, సర్వాలంకార యుక్తాం సరసిజనిలయాం, సర్వమంత్ర సంక్రాంత మూర్తియైనది విరాట్ రూపి, 'దేవి దేవశరీరేభ్యో జగత్రయ హితైషిణి, మహారాత్రి, మహా విద్యా స్వరూపమై సర్వగుణ శ్రేష్ఠత, సొంపలరునట్టి మాతృరూపిణి

336) ఓం విస్ఫురనాదిన్యై నమః

విస్ఫుర నాదస్వరూపమైనది నిస్ఫుర నాదినీయన కఠోరమైన నాదము కలిగినది భీషణ నాదయుతమైనది రణచండీ స్వరూపము 'చండికాశక్తి రత్యుగ్రా శివాశతనినాదినీ' 'కాళీసముత్పత్య గగనం క్ష్మామతాడయత్, కరాభ్యాం తన్నినాదేన ప్రాక్ స్వనాస్తే తిరోహితాః' 'ఘోరరూపే మహారావే నారాయణి, ధనుర్జ్యాసింహ ఘంటానాం నాదపూరితదిఙ్ముఖా నినాదైర్భీషణై కాళీ జిగ్యే విస్తారితానన' అసుర సంహారార్థమై యోద్ధనాదముల వర్తిల్లు యార్తత్రాణ పరాయణియైన మాత

337) ఓం గరిష్ఠాయై నమః

గరిష్ఠ రూపిణియైన దేవి మిక్కిలి గొప్పది అతి దుర్భరమైన మహోగ్రశక్తి స్వరూపిణి, సకల గుణసంపదలు, సర్వోన్నత భావములు, కృత్యములు గలట్టి శక్తి మిగిలిన దేవతాగణము కంటే గరిష్ఠయైనది బలీయమైనది వరిష్ఠ, వాంఛనీయము, శ్రేష్ఠము, ఉన్నతము, గరిష్ఠము, బలీయమైన మహామాయయు మహాకాళీ, శక్తిస్వరూపము

338) ఓం దుష్టసంహర్త్ర్యై నమః

దుష్టులను సంహరించు శక్తి అహంకార స్వభావయుతులు దుష్టులు తామే శక్తివంతులమని పూజార్హులమని శాసించి యజ్ఞక్రియల ధ్వంసము చేయుచు శిష్టుల హింసించు వారు, అసుర స్వభావులుగా నుందురు అట్టి దానవుల వలన బాధలు గలిగినపుడు, యవతారమెత్తి దుష్టసంహారము చేయు శక్తి దుర్గ దుష్టదూరాయైయని దుష్టుల తొలగింపజేసి శిష్టుల బ్రోచుచుండును మహిషమర్దిని, దుర్గాసుర భంజని, భండాసుర సంహర్త్రీ, శుంభనిశుంభ దైత్య దమనీయను పెక్కు రూపములు గలవు

339) ఓం విశిష్టాయై నమః

విశిష్టరూపములు గలది ఉత్తమ జ్ఞానము గలది జ్ఞానాధిక, విలక్షణా, విశేషణయుక్తయైన దేవి 'దుర్గాయై దుర్గాపారాయై సారాయై సర్వకారిణ్యై' 'విద్యా సుశాస్త్రేషు వివేక దీపేషు, కాద్యేషు వాద్యా' ఆమెయే విశిష్టమూర్తియైనది 'పరాపరాణాం పరమాత్వమేవ పరమేశ్వరీ, అసురసంహారమునకు' 'బహుంజాలీలయైవోగ్రహుంకారోచ్చారణాదిభిః' సర్వశక్తులు ఆమెయొక్క విభూతులై యున్నవి అట్టి

కారణా నంద విగ్రహంరాలు సర్వదేవ శరీర ప్రభలను సంతరించుకొన్న విరాట్ స్వరూపిణి అమెయే సృష్టిస్థితి లయతిరోధానాను గ్రాహాది సర్వసత్తాకమైన పంచకృత్య స్వరూపిణి

340) ఓం శ్రేయస్యై నమః

శ్రేయస్సును కలుగజేయు మూర్తి 'కల్యాణ్యై ప్రణతాం వృద్ధై సిద్ధ్యై లక్ష్మ్యై, శర్వాణ్యై ధాత్ర్యై' యని కీర్తింపబడినది శ్రేయః యన ధర్మమోక్షపుణ్య శుభములని యర్థము అర్థకాము వర్గితము 'సక్రోధోపి మాత్సర్యం నలోభో న అశుభమతి' భవంతి కృత పుణ్యానాం కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతాభవతి' అని శ్రేయోభావముచే వెలుగు మాతృమూర్తి

341) ఓం ఘృణాయై నమః

ఘృణాస్వరూపిణియైనదేవి ఘృణ యన కనికరము యని జుగుప్సయనియు రెండు భావములు గలవు భక్తులయెడ కనికరము, శిష్టుల యెడ జాలి కలిగి, నాస్తిక వేద ధ్వంసకుల యెడ జుగుప్సాభావము కలిగి, అత్యాచారములు మిన్నయైన దండించు శక్తి 'తతోఽపహాసాతిరుషా భీమం భైరవ నాదినీ' 'భృకుటీ కుటిలాత్త స్యాబిలాట ఫలకాద్రుతం' యని వైరి భంజనమున వికారరూపి. సౌమ్య, సౌమ్యతర రూపము భక్తుల యెడ కలిగినది

భీమా భయానకా భీమనాదినీ భీః ప్రభావతీ,
వాగీశ్వరీ శ్రీర్యమునా యజ్ఞకర్త్రీ యజుఃప్రియా (59)

342) ఓం భీమాయై నమః

భీమస్వరూపిణియైన దేవి 'అదామాం మునయః స్తుద్వోర్త్యంతానమ్రమూర్తయః భీమాదేవీతి విఖ్యాతం' యను విభూతి 2) భీమ, భయానక రసము, మహాదేవమూర్తిభేదము శివుని ఆకాశమూర్తి భీమః తత్ శక్తి భీమా-దుర్గావిభూతి 3) భీమాసుర సంహర్త్రియైన దుర్గారూపము భీమాయైనది

343) ఓం భయానకాయై నమః

భయానకము నవరసములలో నొకటి భయము గొలిపెడు మూర్తి ఉగ్రమూర్తిగా నవతరించినపు డందరికి భయము గలుగును 'అతి భీషణా, చండికాశక్తి శివా శతవినాదినీ' ఘోరరూపే మహారావే నారాయణి యని దుర్గ యుద్ధ సమయమున చేయు భీషణ గర్జనలు మారుమోగుచున్న రూపము భయానక దృశ్యము

344) ఓం భీమనాదిన్యై నమః

భీమనాదరూపియైన దేవి ధనుర్జ్యాసింహఘంటానాం, నాదపూరిత దిఙ్ముఖా నినాదై ర్భీషణైః యను ఉగ్రమూర్తి భీషణ నినాదములు గలది 'మహాసురం పాదేనా క్రమ్య కంఠేచ శూలేనైన మతాడయత్' సింహనాదమతీ వకృతవాన్, ఘంటాస్వనేన తన్నాద మంబికా చోపబృంహయత్' ఘంటా సింహములు చేయు భీషణ గర్జనలు మారుమ్రోగుచున్న రూపము

345) ఓం భీత్యై నమః/ఓం భయాయై నమః

భీతిగొలుపు రూపమునైయున్నది 'తతోద్ధ్మాపసటః కోపాత్ కృత్వానాదం సుభైరవాన్ పపాతసురసేనాయాం' యను విక్రాంతమూర్తి 2) కృష్ణాఽభూత్సాపి పార్వతీ కాళికేతి సమాఖ్యాతాయను కాళీరూపము 'శవారూఢం, మహాభీమాం, ఘోరదంష్ట్రాం ముక్తకేశిం లలజ్జిహ్వాం, పిబంతీ రుధిరం, గగనేనటంతీం, ముండమాలాధరాం దేవీం కపాలడమరు త్రిశూలహస్తాం' అ త్రిస్పు చున్న భయంకర మూర్తి 'హుం' కారమాత్రముననే గుండెలవియ జేయును

346) ఓం ప్రభావత్యై నమః

కాంతిమతియైన రూపము పరమేశ్వరి తేజోదాయకములగు గోళములకును తేజస్సు నొసంగునది తేజోఘనస్వరూపిణి కోటి సూర్యసమప్రభ, అనంత కిరణ సముదాయము కలిగినది అణిమాది భిరావృతాం మయూఖై రహమిత్యేవ విభావయేత్ గౌరీం-విద్యుత్ పుంజాభాసమాన దేవతా పరివేష్టితము.

2) సావిత్రియే ప్రభావతి (సవితుః శక్తి) ఆదిత్యుని భర్గస్సు కామెయే 3) బహు ప్రభాయుతమైన కుండలినీ శక్తియామెయే ప్రాణశక్తి, తేజోరూపిణియై యున్నది.

347) ఓం వాగీశ్వర్యై నమః

వాగీశ్వరీ శక్తియై యున్నది వాగధీశ్వరీ, వాక్కులకు ప్రభ్వి, పరాశక్తి, నాలుగు విధములైన పరా, పశ్యంతీ, మధ్యమా వైఖరీ యను విధములు వాక్కున కధిదేవతయై యున్నది భారతీ, ఇడా, సరస్వతీ, వాణీ కల నామములు వది విద్యాది దేవతలు వాగ్దేవతలు వాగ్వాదిని, వాగీశ, వాగ్దేవి యను దేవి ఉపాసనా రూపములు వేరువేరుగా యున్నను సరస్వతీ సమముగా ధ్యానింతురు

348) ఓం శ్రియై నమః

లక్ష్మీరూపిణియైన దేవి 'త్వం శ్రీస్త్వం హ్రీస్త్వం బుద్ధిర్బోధ లక్షణా' యని ధనము, సుఖానందము, బుద్ధి యను నామెయే శ్రీ-కి నిఘంటువున సరస్వతీ, అవిద్య, అధికారము, కాంతి, కీర్తి, వృద్ధి, సిద్ధి, త్రివర్గ సంపదయని గలదు, మహాలక్ష్మీ, మోక్షలక్ష్మీ, మరియు సామ్రాజ్యలక్ష్మీ ధనధాన్య సంతాన ధైర్య రూపములును గలవు అష్టోత్తరములలో ప్రకృత్యై, వికృత్యై, విద్యాయై నమః అని ఆరంభమగును.

349) ఓం యమునాయై నమః

యమునా స్వరూపిణియైనది గంగాయమునా సరస్వతీ నదులు త్రివేణిగా ప్రయాగయందు సంపన్నమగును అందు యమునా జలములు నీలవర్ణముగా తమయునికి కన్పడునట్లు చేయును కావున నదులలో యమున కాళమునకు ప్రతీక జమునా, కాళిందిగా, యమునాదేవిగా దుర్గగా యభివర్ణింతురు సూర్యుని పుత్రికగా కూడా నెంతురు జీవనది ప్రాణశక్తికి ప్రతీక, కాళికాదేవతకు ప్రతీకగా ధ్యానింతురు 2) దేహమందున్న ఇడా, పింగళ, సుషుమ్నలను త్రివేణీ ప్రవాహములుగా నెంచి సంగమము భ్రూమధ్యమున గలుగునట్లు నెంతురు

350) ఓం యజ్ఞకర్త్ర్యై నమః

యజ్ఞకర్త్రిగా వెలుగు దేవి 1) యజ్ఞకర్తయగు సోమయాజి పరమశివ స్వరూపుడు కావున యజ్ఞకర్త్రి పరాశక్తియని భావన 2) సర్వకార్యాచరణమును తదధీనమగుటచే సర్వశక్తిస్వరూపిణియగు దేవి యజ్ఞకర్త్రియగును 3) అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ, యజ్ఞప్రియత్వమే యజ్ఞ కర్తృత్వ ప్రధానాంగమగును 4) యజ్ఞవారాహం అని విష్ణురూపము యజ్ఞమునకు భర్తయైన విష్ణువు సకల జీవపోషకమైన యజ్ఞమున నుపాస్యదేవత తచ్ఛక్తి యజ్ఞవారాహి మహామాయా 5) త్వంస్వాహా త్వం స్వధా త్వం హివషట్కార స్వరాత్మికా, సుధాత్వమక్షరే నిత్యా-యని పంచ యజ్ఞ రూపమైన దేవి. తానే యజ్ఞరూపమై నిర్వహింపజేసి జగత్ పోషణకాధారమగును

351) ఓం యజమానప్రియాయై నమః

యజమానప్రియమైన దేవి. యజ్ యను దేవపూజా సంగతి కరణాదానేషు దానికి యజుర్వేదము, గీతిరహిత, అనియతాక్షర పాదమునైన వేదభాగము రూపము యజస్సులయన దేవతలనుద్దేశించి యగ్నిముఖముగా నీయబడు హవిర్భాగములు అట్టివాని కధిష్ఠాత్రియై యజ్ఞముల ప్రీతి గల్గిన దేవి పంచయజ్ఞములు యన దేవ, పితృ, భూత, మానుష, బ్రహ్మ యజ్ఞములు శ్రీ చండీ రుద్ర సప్తసోమయాగాది యాచరణమున ప్రీతి చెందినది.

ఋక్సామాథర్వనిలయా రాగిణీ శోభనాసురా
కలకంఠీ కంబుకంఠీ వేణు వీణాపరాయణా(80)

352) ఓం ఋక్ సామాథర్వ నిలయాయై నమః

ఋక్ సామ అథర్వములకు నిలయము. 'శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాం నిదాన ముద్గీథ రమ్యపద పాఠవ తాంచ సామ్నాం, దేవీత్రయీ భగవతీ భవభావనాయ వార్తాచ సర్వజగతాం పరమార్తి హంత్రీ' యని వేదజననిగా కొనియాడుమడును 'అస్యనిశ్వసితమే తైతత్ యదృగ్వేదో యజుర్వేదస్సామవేద

అథర్వాంగీరస' యని నిశ్వాసనమున వెలువడిన శబ్దరూపములు పరమేశ్వరి సాక్షాద్బ్రహ్మ స్వరూపిణి పరాశక్తి నుండియే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యవస్థలు కలుగును శృతి, స్మృతి, వర్ణములు వేదాదారములై యున్నిటికినీ శబ్ద బ్రహ్మశక్తి నిలయమగును

353) ఓం రాగిణ్యై నమః

రాగిణీ రూపయైనది రాగము తత్ శక్తి రాగిణి సాహిత్య సంగీతములు సరస్వతీ స్తనద్వయము లందురు సంగీతమునకు రాగమాధారము అట్టి రాగమున కధిదేవతగా రాగిణిగా వెలసిల్లుచున్నది 2)రాగము యనగా ప్రేమ, అనుబంధము తల్లికి, బిడ్డకు, దేవతకు, భక్తునికి, భార్యకు, భర్తకు, ప్రకృతికి పరమాత్మకు గల పవిత్రమైన యనుబంధము అమలిన అచంచల అనుభూతి 3) చిత్తవృత్తి విశేషము అనురాగము వాసనామయమైన రూపము, అనురక్తి, కోరిక, కామము ఈ పాశములతో జీవి బంధించబడును ఆ యధిదేవత యనుగ్రహము వలననే వైరాగ్యము కలిగి మోక్షప్రాప్తికి జీవి యారాటపడనేర్చును అట్టిమాయాశక్తి రాగిణియై యున్నది

354) ఓం శోభనస్వరాయై నమః (ఓం శోభనాయై నమః ఓం సురాయై నమః)

1) సుముఖి, నళిని, సుభ్రూ మొదలగు సకల సౌందర్య రాశియైన పరమేశ్వరీ స్వరూపము యాదేవి సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా యని శోభగలట్టి దేవి శోభనా 2) సర్వదేవ శరీరేభ్యో యా ఆవిర్భూత, తత్తేజోరాశి మహాశక్తి స్వరూపమై వెలిగినది 3) అట్టి మహాశక్తి పలుకు కలధ్వని మంజుల భాషిణి యని కీర్తించుచుందురు పరమేశ్వరి పలుకులు విని సరస్వతి వీణను దాచి నిశ్శబ్దయైనటుల సౌందర్యలహరి పేర్కొనెను 4) కారుణ్య కందళిత కాంతి భరం కటాక్షం, కందర్పభావ సుభగా భులు భక్తి భాషు-సర్వజ్ఞత, సదసివాక్పటుతాం ప్రసూతే-సంపత్కరాణి సకలేంద్రియ నందనాని సామ్రాజ్య దాన నిరతాని సరోరుహాక్షి శోభనహిత వాక్కుల రంజింప జేయుచుండును

355) ఓం కలకంఠ్యై నమః

కలకంఠము గల దేవి కలయన అవ్యక్త మధుర సప్రయోజన ఆలాపసంలాప యుక్తము సెలయేర్లు మందముగా పారునపుడు వెలువడు మధుర ధ్వని అట్టి మధురనాదమును వెలువరించు కంఠము గలది కలవాణి, కీరవాణి, రసమంజుల వాణి గలది

356) ఓం కంబుకంఠ్యై నమః

కంబు కంఠిగా వెలుగు దేవి కంబు యన శంఖ నిమ్నరేఖ త్రయము శంఖము నందుండు రేఖాత్రయ లక్షణములు గలట్టి గళము గలది గుణపరిచాయక నామము శంఖము వలె గంభీర నాదమును వెలువరింప జేయు కంఠము గలిగినట్టిది శంఖ జలమును పవిత్రీకరణమున కుపయుక్తము శంఖ నాదము అశుభ గ్రహ వైరి నాశకము గాన యామె పలుకులు వెలువడ శుభము గలుగు చుండును

357) ఓం వేణు వీణాపరాయణాయై నమః

నాద పరికరములు వేణు వీణానాదయుక్తమైనది నాదాఖ్యా సర్వభూతేషు జీవరూపేణ సంస్థితా అట్టి నాదములు వెలువరించు జడమూర్తులు వేణువు వీణాదులు వేణువు వాయుసంఘట్టన వలన మధుర నాదమును వెలువరించును వీణాతంత్రుల సంఘట్టనమున నాదప్రవాహము వెలువడును ఈ రెంటియందున మనో వశీకరణ శక్తి కలదు కృష్ణ పరమాత్మ మంజుల వేణుగానము బృందావనమున మూర్ఛనల కల్పించినది మహామాయాస్వరూపి సరస్వతి యొక్క వీణా నాదము జగన్మోహనము అట్టి నాదమందు లీనమై యానందసంద్రమున మునిగి యున్నట్టి మాతృమూర్తి మహాపద్మాలయ కారణానంద విగ్రహయై యున్నది

వంశినీ వైష్ణవీ స్వచ్ఛా ధాత్రీ త్రిజగదీశ్వరీ
మధుమతీ కుండలినీ బుద్ధిః శుద్ధిః* శుచిస్మితా(81) సిద్ధి

### 358) ఓం వంశిన్యై నమః

వంశీ రూపమ్మై యున్నది వంశమునగా వంగడము, కులము, వెదురు యని గలదు మొదటి యర్థము గా కులపాలిని, కులాంగనా పదముల అర్థమున యవిచ్ఛిన్న సంతతి ఆచారమునకు నాధారభూతమ్మై నది 2) రెండవ యర్థము వెదురు దానితో చేయబడిన వంశీ-వేణువు రూపం దానికి ఛిద్రములు చేసి వాయువు పూరించిన మధురనాదము వెలువడును అది మోహనకరము, ప్రసన్న రూపము నైన నాదము వెలువరించునది వంశీ-జడపదార్థము దానికి చేతనత్వము గలిగించి నాదము వెలువరింపజేయు శక్తి స్వరూపమునై యున్నది అట్టి మంజుల వంశీ నాదము రూపమునైన శక్తి

### 359) ఓం వైష్ణవ్యై నమః

వైష్ణవీ రూపమునైన శక్తి విష్ణురూపము తత్‌శక్తి వైష్ణవీ సరస్వతీ రూపమే య్యై యున్నది సాయంసంధ్యలో 'సరస్వతీ భగవతీ పీతాంబరాలంకృతా శ్యామాతామస రూపిణీ పరిణమిత్ గాత్రాన్వితా వైష్ణవీ తార్క్ష్యస్థ మణినూపురాఙ్గ విలసత్‌గ్రైవేయ భూషోజ్జ్వలా' యని వర్ణింపబడి యున్న రూపము 2) తదైవ వైష్ణవ శక్తి గరుడోపరిసంస్థితా, శంఖ చక్ర గదాశార్ఙ్గ ఖడ్గహస్తా యనియు గలదు పరమేశ్వరి విభూతులలో నొకటి 'జయజయ వైష్ణవి దుర్గే' యని స్తుతింపబడినది. శక్తిపీఠమైన జ్వాలాముఖి వైష్ణవీ రూపమున వర్ణించబడుచున్నది 3) 'కాళరాత్రీ బ్రహ్మస్తుతాం వైష్ణవీం స్కందమాతరం సరస్వతీ మదితిం, దక్షదుహితరం నమామః పావనాగ్ం శివామ్' యని స్తుతి గలదు.

### 360) ఓం స్వచ్ఛాయై నమః

స్వచ్ఛమైన మనసు గలది రాగాదులచే యేమాత్రము కలుషితము గాని చిత్తస్థైర్యము గల దేవి 'దహరాకాశ నివాసిని ఆత్మప్రకాశము గలది స్వచ్ఛమనముల కీర్తింపబడునది దుఃఖరహిత త్రిగుణాతీత స్వచ్ఛస్ఫూర్తా మతిమతీవ్వై శుభాందదాసి' జ్యోత్స్నాయై చేందురూపిణ్యై, సుఖాయై సతతం- స్వచ్ఛరూపమునకు పర్యాయ పదము

### 361) ఓం ధాత్ర్యై నమః/ఓం ధరిత్ర్యై నమః

ధాత్రి రూపిణియైన యంబ 'సర్వస్యజగతో ధారణాత్వాత్' సకల చరాచరములను భరించునది ధరించునది ధర. పృథివి అదితి స్వరూపిణి క్షమాగుణ ప్రధానత గలది క్షమయా ధరిత్రి యందురు 2) సముద్రవసనే దేవి పర్వతస్తనమండలే విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే 'యను ప్రాతఃస్మరణ గలదు. 3) ఓం స్యోనా పృథివీనో భవాన్యృక్షరాట్ నివేశినీ యచ్ఛానశర్మస ప్రదాయని మంత్రము గలదు 4) ధాతా, విష్ణు, బ్రహ్మ, ఆదిత్య, సంవత్సర నామం, శక్తి స్వరూపము, ధాత్రి, ధరిత్రి పోషించునది

### 362) ఓం త్రిజగదీశ్వర్యై నమః

మూడు జగత్తులకు ప్రభ్వియైన దేవి త్రిజగములన స్వర్గ, మర్త్య, పాతాళ లోకములు భూ, భువః, సువః లోకములు, భూమి అంతరిక్ష స్వర్గములును (పదునాలుగు లోకములని పేరు భావన) వాటన్నింటికీ ఈశ్వరియైనది. శాసన, పోషణ చేయుచు పాలించు దేవి ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తిజగత్తుల కధీశ్వరియు నామెయే

### 363) ఓం మధుమత్యై నమః

మధుమతియైన దేవి అనంత స్వరూపముగు బ్రహ్మము సూర్యతేజమే మధువు సవితృదేవతా శక్తి దివ్యమధువు శ్రుతి విద్యా ప్రతిపాదిత మంత్రదేవతా స్వరూపిణి. 3) భావనాతీతులగు పరమహంసలు కూడా, సప్తభూమికలు, యందు తురీయావస్థ 'మధుమతి' యను యవస్థను అందవలెను ఉపచార విధానమున 'మధువాతా, ఋతాయతే, మధుక్షరంతి సింధవః మాధ్వీర్నస్సంత్వోషధీః మధుమాన్నో వనస్పతిః మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతునః' ఆ శక్తియే మధుమతి

**364) ఓం కుండలిన్యై నమః**

కుండలినీ రూపమై యున్నది పరాస్వరూపమైన సుషుమ్నానాడి సహస్రార మూలాధార మధ్య కులములకు ప్రదక్షిణిగా యారోహణావరోహణ గమనము గలది వక్రగతి గల భుజంగ స్వభావము గలది 2) కుటిలాంగి, భుజంగి, శక్తి, ఈశ్వరీ, కుండలినీ, అరుంధతీ, కుండలీయని సప్తనామములు 3) కుండలిని నిద్రించి యున్నంత కాలము జీవి అజ్ఞానయుక్తుడు జాగరణమున సంపూర్ణ జ్ఞానము గలిగి సమస్తమైన మహిమలను పొందును శరీరమందలి సర్వక్రియా శక్తులు యొక్క స్థలమున మూలాధారమున నున్నది కుండలిని యోగులు ఈ శక్తిని మేల్కొలిపి సహస్రారమున పరమేశ్వరునితో లయభావము నందసెంతురు 4) కుండలినీ వాగ్భవ బీజము గలది 'అ, ఇ, అమ్, ఐం' శబ్దతరంగ విస్తారము ముఖ్యప్రాణస్వరూపిణి

**365) ఓం బుద్ధ్యై నమః**

బుద్ధి స్వరూపమైనది 'యాదేవి సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా' యని గలదు చతుర్వింశతి తత్వములతో మనోబుద్ధి చిత్తాహంకారములు బోధ స్వరూపముగా నెలకొని యున్నది 'మేధ సరస్వతి వరే భూతి భాభ్రవి తామసి' యని వర్ణింపబడినది

**366) ఓం శుద్ధ్యై నమః/ ఓం సిద్ధ్యై నమః**

శుద్ధి స్వరూపమైనది అవిద్యాసంబంధమగు యెట్టి మాలిన్యము లేని శుద్ధ జ్ఞానస్వరూపిణి త్రిగుణాతీత శుద్ధ చైతన్యరూపిణి దీననే సిద్ధి ప్రాప్తించును అవిద్యా రహితము, నిర్మలమైనది 'శుద్ధలక్ష్మిర్మోక్షలక్ష్మి జయలక్ష్మి సరస్వతి' శ్రీర్లక్ష్మి వరలక్ష్మిశ్చ ప్రసన్నామమ సర్వదా' శుద్ధి బుద్ధి స్వరూపిణి, అమలిన, స్వచ్ఛమైన మనఃప్రాప్తికి అంబ కరుణ తద్రూపమే

**367) ఓం శుచిస్మితాయై నమః**

స్వచ్ఛమందహాసము కలిగిన దేవి స్మితమనగా మందహాసం శుచియన పరిశుద్ధ ఆచారం, ధావళ్యము, అమలినమని అర్థము 'సకుంకుమ విలేపనాం, అలికచుంబి కస్తూరికాం। సమందహసితే క్షణాం' అను వర్ణన గలదు ఆ మందహాసం జగన్మోహనము మధుకైటభనాశకారకమునైనది శుంభ నిశుంభాదుల బుద్ధి వక్రము చేసినది అదే మందహాసము భక్తుల ననుగ్రహించునదియై యున్నది

**రంభోర్వశీ రతీ రామా రోహిణీ రేవతీ మఘా* రమా, శంఖో**
**శంఖినీ చక్రిణీ కృష్ణా గదినీ పద్మినీ తథా(62)**

**368) ఓం రంభోర్వశ్యై నమః/ఓం రంభాయై నమః/ ఓం ఊర్వశ్యై నమః**

రంభ ఊర్వశియైన దేవి రంభ ఊర్వశ్యాదులు అప్సరసలు దేవకామినులు నర్తకులు గాయకులు వారి నర్తనశక్తి, గాయనశక్తియామెయేయై యున్నదని భావన రంభ, హ్రీంకారాది బీజ వర్ణముల స్తుతింపబడునది శ్రీవిద్య షోడశాక్షరాదుల యందు కూటరూపమున హ్రీంకారాది బీజోచ్ఛారణ విదితము 2) నారాయణుని తొడనుండి యుద్భవమైన ఊర్వశి అప్సరస దేవలోక నర్తకి వీరు నర్తనకు ప్రతీకలు ఆ నర్తన శక్తియే దేవి అప్సరసలు జలముల స్వభావము గలిగి ప్రాణములకు సుఖమును కలిగింతురు

**369) ఓం రత్యై నమః**

రతిరూపమునై యున్నది రతి భువన మోహన సౌందర్యమునకు ప్రతీక కామేశ్వరాంకస్థ యగు కామేశ్వరీ, త్రిభువన మోహనశక్తియై కోటిగుణరతి సౌందర్యభాసితయై వెలుగును మన్మథపత్ని, కామేశ్వరుడు కోటిమన్మథ సౌందర్యమూర్తి దేవి త్రిభువన మోహిని 2) రతి, యేకాంత శీలత్వమున నరతియు, వైరాగ్య వశమున విరతియు నగుటచే ఈశ్వరి శీలవతియు, విరాగిణియు, పరమేశ్వర రతిరూపిణి యనియు వర్ణింపబడుచున్నది 3) కామకలాబీజము, రమా, శ్రీకారము, రాకేందువదనా,

పూర్ణచంద్రముఖి, రతిరూప, క్లీం, మన్మథ శక్తియును

370) ఓం రమాయై నమః/ఓం రామాయై నమః

రమారూపిణియైన దేవి కామకలాస్వరూప లక్ష్మీ శబ్దము సరస్వతీ పార్వతులకు కూడా వర్తించును. రమింపజేయునది. నిత్యానంద లక్షణము గలది. యోగిజన హృదయారాధ్య రాజ్ఞి, సర్వలక్ష్మీ ప్రతీకగా నిలుచును 2) రమతునకు ఆనందము కలుగజేయు యానందమూర్తి 3)'రమాబీజము శ్రీ-లక్ష్మీ బీజమే 'హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం' యని రమారూపము వర్ణింపబడినది.

371) ఓం రోహిణ్యై నమః

రోహిణీ స్వరూపియైనదేవి కుంకుమాదులచే రక్తవర్ణయైన స్త్రీ రాగాది భావములచే నైనను విభిన్నమైనది. తొమ్మిదియేండ్లకన్యకను రోహిణి యందురు నవరాత్రులలో దేవికి ప్రతీకగా నుపాసింతురు దుర్గాదేవి అష్టదిక్ విభూతులలో నొకటిగా పూజింతురు కౌమార్యాది వరుసలో నాలుగవది 2) పగటియందు తొమ్మిదవ ముహూర్తము దైవ ప్రీతికరము

372) ఓం రేవత్యై నమః

రేవతీ రూపమైనది బలరాముని భార్య రేవతి తల్లి రోహిణి. క్రమమున నుపాసించబడినది 'భ' మండలమున నశ్విన్యాది యంతిమతార, మాతృకానది, బాలగ్రహభేదమున నుపాసింపబడు చున్నది దుర్గ 2) గుహ్యగణముల కధిపతియైన రేవతుని శక్తి సూర్యుని పుత్రుడు రేవతుడు తచ్ఛక్తి రేవతి (మనువు) రైవత యను శబ్దము, ఈశ్వరునికిని వర్తించును శక్తిరూపిణిగా వరదాయి

373) ఓం మఘాయై నమః

మఘస్వరూపిణియైనది మఘ నక్షత్రము పితృదేవతాకము పితృప్రీతికరమైనట్టి శక్తి మఘా 2) ఒక దేశము, ద్వీపము, పుష్పము, ఔషధమును సూచించినను, పితృదేవతాకమైన శక్తిగా, స్వధగా పూజనీయము 3) వసురూపిణి, సంపత్దాత్రులగు పితృదేవతార్చనచే సుఖ, సంతాన, సంపత్ ప్రాప్తి కలుగును

374) ఓం శంఖిన్యై నమః

శంఖిని రూపిణియైన దేవి. వరుణ దత్తశంఖము ధరించినది హస్తాలంకారముగా శంఖము ధరించిన స్త్రీ శంఖిని. అర్చనలో పాంచజన్యమైన శంఖము జలపూరణము చేసి తజ్జలప్రోక్షణమున పూజావస్తు సముదాయము పవిత్రీకరింతురు (శంఖోదకం) 2) స్త్రీ భేదములలో లాక్షణికమైన శీలవతి కాముకియైన సుందరి శంఖిని స్త్రీలకు ప్రతీకయైన దేవి

375) ఓం చక్రిణ్యై నమః

చక్రిణియైన దేవి హస్తభూషణలుగా విష్ణువునకు శంఖ చక్రగదా పద్మహస్తములు మహామాయా వైష్ణవికి నుండు కరగతములు రెండవది యైన చక్రము ధరించిన స్త్రీ శక్తి 2) సాముద్రిక శుభ లక్షణము ఏకచక్రీ మహాభోగీ, ద్విచక్రీ రాజపూజితా, త్రిచక్రీ లోకసంచారీ యని కరాంగుళ్యగ్రముల పరిశీలింతురు అటులే పాదములయందును అట్టి శంఖచక్ర సమన్విత శుభచిహ్నములు గలది 3) భ చక్రము నడుముగా గలది కాలచక్ర నియంతయైన ప్రభ్వి 4) షట్చక్ర, శ్రీచక్ర సర్వతోభద్రాదుల వ్యాప్తమై నిత్య అర్చనగల దిగంత వ్యాప్త శక్తి

376) ఓం కృష్ణాయై నమః

కృష్ణారూపిణియైన శక్తి. కృష్ణ దూష్యక్ష్మిని భక్షణన పాపాది దోషక్రష్టం పురుషార్థానామ కర్షక యని వివిధ యర్థములు పరబ్రహ్మ, వేదవ్యాసుడు, కృష్ణపక్షాభిమానియైన దేవత, కంటిలోని నల్లనగుడ్డు ఇవియు గాక నది యమున ద్రౌపదికి కూడా యిదే పదము వర్తించును నల్లని మేనుగల స్త్రీ శక్తి

కాళీ 2) 'తస్యాం వినిర్గతాయాంతు కృష్ణాఽభూత్సాపి పార్వతీ। కాళికేతి సమాఖ్యాతా హిమాచలకృతాశ్రయా' యని దేవి యొక్క విభూతి మహిషఘ్నయైన కాళీ

377) ఓం గదిన్యై నమః।

గదను ధరించినది శంఖ చక్రముల తరువాత గదను ధరించినట్టి వైష్ణవి శక్తి స్వరూపిణి అహంకార రూపమైన శంఖము, మనస్తత్త్వమనెడి సుదర్శన చక్రము, బుద్ధితత్త్వమైన గదను, నాల్గవచేత పద్మమును ధరించిన శక్తి. పద్మము స్వచ్ఛచిత్తమునకు ప్రతీక. 2) తథైవ వైష్ణవీ శక్తి గరుడోపరి సంస్థితా శంఖ చక్రగదాశార్ఙ్గ ఖడ్గహస్తాభ్యుపాయయౌ- ఉపాసనా రూపములలో గద ఆయుధముగా ధరించినట్లుగా ప్రతిష్ఠింతురు

378) ఓం పద్మిన్యై నమః।

పద్మినీ రూపమైన శక్తి. 'పద్మినీ పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి విష్ణుప్రియే, విష్ణు మనోనుకూలే' యనబడు వైష్ణవీ శక్తి. స్థిరాసనమునకు ప్రతీకయైన పద్మము సౌకుమార్యమును గూడా సూచించును సూర్యశక్తి పద్మములను వికసింపజేయునది పద్మము నందునికి గల్గిన బ్రహ్మ స్వరూపిణి

శూలిని పరిఘాస్త్రా చ పాశినీ శార్ ఙ్గపాణినీ
పినాకధారిణీ ధూమ్రా సురభీ* వనమాలినీ(63) శరభీ

379) ఓం శూలిన్యై నమః।

శూలమును ధరించిన శక్తి శూలాయుధమును చేతగొన్న దేవి 'శూలం శూలాద్వినిష్కృష్య దదౌ తస్యై పినాకధృత్' ఈశ్వరుని ఆయుధమైన శూలమును పరమేశ్వరికి నిడెను 'మహేశ్వరీ త్రిశూలేన, తథా చక్రేణ వైష్ణవీ' శూలినీ ఘోరాగదినీ యను యనేక ఆయుధములు ధరించిన దేవి ,

380) ఓం పరిఘాస్త్రాయై నమః।

పరిఘాస్త్రమును ధరించిన దేవి పరిఘ యన యినుపకట్లుగుదియ అట్టి ఆయుధమును ధరించినట్టి మహాదుర్గ. 'ఖడ్గినీ, శూలినీ, ఘోరా, గదినీ, చక్రిణీ, తథా శంఖినీ చాపినీ బాణభుశుండీ పరిఘాయుధ' యని దశభుజ శక్తి ధరించిన ఆయుధములు వివరింపబడినవి

381) ఓం పాశిన్యై నమః।

పాశముచేత గలిగినది వామ ఊర్ధ్వ హస్తమునందు పాశము ధరించి యున్న దేవి రాగస్వరూపమున జీవుల బంధించునది ఈ పాశమే ఉపాసనా పరులకు ఆభరణములుగాను, ద్వేష్టులకు బంధనములుగాను దోచును 'ఘృణా, లజ్జా, భయం, శంకా, జుగుప్సా చేతి పంచమీ, కులం, శీలం, తథాజాతిరష్టౌపాశ ప్రకీర్తితా' జీవికి ఎనిమిదియుపాశములే. 'పాశయుక్తో భవేజ్జీవః పాశముక్తో భవేచ్ఛివః' అస్త్రములలో నాగపాశమున బద్ధులైన రామలక్ష్మణులను గరుడుడు, అనిరుద్ధుని పాశములను పరమేశ్వరి తొలగించదమైనది

382) ఓం శార్ఙ్గపాణిన్యై నమః।

శార్ఙ్గపాణియైన దేవి 'ఇంద్రియాద్యహంకారాత్మకం శార్ఙ్గం నామధనుః' యని హస్తమున ధరించ శార్ఙ్గపాణి శార్ఙ్గ ధన్వి విష్ణుపరమైన నామము వైష్ణవీ శక్తికి నవే(ప్రాణి) హస్తములు 'సర్వదేవశరీర నిర్గత తేజస్సుతోపాటు, వారి ఆయుధములను సంతరించిన దేవి సర్వాయుధ పాణియై విలసిల్లును

383) ఓం పినాకధారిణ్యై నమః।

పినాకం హస్తమున ధరించినది పినాక ధన్వియని పరమేశ్వరునికి పేరు అంటకు కూడానవే ఆయుధములు 'శూలం శూలాత్ వినిష్కృత్య దదౌ తస్యై పినాకధృత్' యని పినాకపాణి శూలమిడినట్లు గలదు. పినాకపాణిగా అంబను వర్ణించిరి

384) ఓం ధూమ్రాభాయై నమః

ధూమ్రవర్ణము గల దేవి ధూమ్రమయన శివుడు యని, అర్ధశరీరియైనందున ధూమ్రాభశివశక్తియగును 2) సూర్యుని కరంలో నొకటి ధూమ్రవర్ణము సర్వవర్ణములు లీనమైన యామె సర్వవర్ణాత్మిక 3) ధూమ్రలోచనుడను యసురుని సంహరించినది గాన ధూమ్రా

385) ఓం సురభ్యై నమః/ఓం శరభ్యై నమః

సురభి రూపమైనది రమ్యము, ప్రసిద్ధము, సువాసన ద్రవ్యములను గాయత్రీ ముద్రలలో నొకటి! గోవులకు మాత, కామధేనువు భక్తుల కోర్కెలను తీర్చునది పోషకములగు పంచగవ్యములను ప్రసాదించునది నిత్యపరిమళము, వెదజల్లు శరీరము గలదియునగును 2) శరభావతారము వరాహావతారాంతమునకు గాము కలిగినది తత్శక్తి శరభి యగును

386) ఓం వనమాలిన్యై నమః

వనమాలినియైన దేవి 1)భూతతన్మాత్ర రూపముగు వైజయంతి యను వనమాలను దాల్చినట్టి దేవత వనమాలి విష్ణునామము మోకాళ్ల వరకు వ్రేలాడుచున్న ఋతువులలోని పూవులు గలిగి, నడుము లావైన గుచ్ఛము, చిగురుటాకులు, పుష్పములు గలిగిన విష్ణుదేవుని మాలప్రతీక 2) వనమున శబ్దము. స్తోత్రప్రీతి కలిగినది కావున వనమాలా విభూషిణియునగును 3) వనమనగాదు చేను, అడవి, గృహము అందు లభ్యమౌ పరిమళ పత్ర పుష్పదామము ప్రకృతి ప్రతీక వానిని పోషించునది గాను అంట వనమాలిని యగును

రథినీ* సమర ప్రీతా వేగినీ రణపండితా వ జ్రిణీ
జటినీ వజ్రిణీ* నీలలావణ్యాంబుధి చంద్రికా(64) తింటినీ

387) ఓం రథిన్యై నమః

రథమందు విలసిల్లునది రథమునకు, శరీరము నొక్కనితో పోరాడు విలుకాడు, స్యందనము యను యర్థములు స్యందనా రోహయైన దేవి రథిని 'తథాయం స్యందన వరోయః పురాఽపిత్ ప్రజాపతే' యని శ్రేష్ఠ రథమున నున్నట్లు యర్థము 2) శరీరము వరముగా, శవరూప శరీరమును ప్రాణశక్తి అధిరోహించినపుడే చేతన గలుగును శరీరమందావహించెడు శక్తి రథిని

388) ఓం సమరప్రీతాయై నమః

యుద్ధమందు ప్రీతిగలది. సంగరము చేయుట యందు ప్రీతిగలది అసుర సంహారము చేయుట యందు నేర్పు గలది 'తతః పరివృత్తాస్తాభిరీశానో దేవశక్తిభిః హన్యతాం అసురాం' సురలకు ప్రీతిని కలిగించు నది 2) నిత్య కామేశ్వర పర్యంకో ల్పంగ మన్మథక్రీడాసక్తయైన దేవి పరమేశ్వరయుత ప్రీత ఆనందకారిణి

389) ఓం వేగిన్యై నమః

శీఘ్ర గమనము గలది శీఘ్రము, వడి, ధార, ప్రవాహము, రేత, మలమూత్రాదుల వెల్వరించు యంత్ర శక్తి. 2) తృతీయావరణ పూజలో అనంగవేగినీ యను శక్తి గలదు 'తత్ జవహంతి రుషా, సోఽభ్యద్ధావత్తాం అసురో' యని చండప్రచండ పరాక్రమమున విజృంభించు శక్తి నదీవరద ప్రవాహము వలె పెంరేగునదియును

390) ఓం రణపండితాయై నమః

యుద్ధ విశారదయైనది పరమేశ్వరి విభూతులు ఆవరణ శక్తులే/ లోకనాశంకరులై వెలుగుచుండును. ఆయా విభూతుల నాయా సమయముల ప్రేరేపించి యసుర సంహారముచేయు శక్తి యుద్ధము చేయుటయందు నేర్పరి 'సముత్పత్యా పాఽరూఢా తం మహాసురం పాదేనాక్రమ్య కంఠేచ,

శూలేనైనను తాడయత్ అట్టి ప్రజ్ఞ గల దేవి

391) ఓం జటిన్యై నమః

జటలు గలిగిన దేవి జట యన వెంట్రుకల పోగు వ్రతదారుల శిఖ 'జటినే నమః' యని ఈశ్వరపరనామము ఆ శక్తి జటిని 'జటోద్ధూత సటా కోపాత్' అని చండీరూపు వ్రత పారాయణులు కేశ సంస్కారముచేయక జడ కట్టిన స్థితి ఇక్కడ అర్ధరాత్ర పారాయణిగా వ్రతము, వాంఛితార్థ ప్రదాతగా, సృష్టిస్థితి లయయుక్త కాలచక్ర భ్రమణ శక్తిగా వ్రతము

392) ఓం వజ్రిణ్యై నమః

వజ్రిణి శక్తి. వజ్రియన వజ్రాయుధముగల ఇంద్రుని నామము ఇంద్రుని శక్తి రూపం వజ్రిణి/వజ్రాయుధమును లేక వజ్రములు పొదుగబడిన యాభరణములు ధరించిన స్త్రీయును శచీదేవి రూపిణి యు, మనోభావమున వ్యక్తముగుచుండును 'కిరీటిని మహావజ్రే సహస్రనయనోజ్జ్వలే వృత్ర ప్రాణ హరేచైంద్రీ, వజ్ర హస్తేతథైవైంద్రీ గజరాజో పరిస్థితా, సహస్ర నయనా యుధాత్మక యని వర్ణన

393) ఓం లీలాయై నమః/నీలలావణ్యై నమః/లీలాయై నమః

అనాయాసముగా ననేక రూపముల వర్తిల్లును విలాసార్థముగా శరీరమును ధరించు శక్తి. బ్రాహ్మీ మాహేశ్వర్యాది యష్టశక్తులు శైలపుత్ర్యాది నవదుర్గాది రూపములు నందా, రక్తదంతికాది యనేక యవతారములు కౌమార్యాది నవవయో రూపములు పార్వతి కాళికాది షోడశశక్తి సంపుటి దశమహావిద్యా స్వరూపములన్నియు నామెయే సృష్టిస్థితి లయ తిరోధాన యను గ్రహాది కార్యకర్త్రియై నిత్య క్రీడ సలుపుట లీలయే ఆ మూర్తి కాళి నీలలావణ్యమూర్తి తామసరూపియైనను, శత్రు చ్ఛేదన మూర్తిగా, భక్తానుగ్రహ మూర్తిగా, పరమేశ్వర పర్యంక లీలావినోదమూర్తిగా, తలచిన రూపమున ప్రత్యక్షమై వాంఛ నిడు మాతృమూర్తి

394) ఓం లావణ్యాంబుధిచంద్రికాయై నమః

మనోహర రూపిణియైన దేవి 'లావణ్యాం' అని సౌందర్యం పరమానంద స్వరూపము అతిశయ ప్రీతి విషయత్వం, శీలత, సర్వావయవ సాధారణ సుందర తరళకాంతియుత స్వభావము అట్టి లావణ్యమునకు సముద్రము, నిధియందున చంద్రుని వోలె స్వచ్ఛమైన శీతల వెన్నెల కాంతులు పరమ చంద్రరేఖవోలె 'అంబ' వెలుగుచున్నది కరుణారస పరిపూర్ణ శాంతరూపము

బలిప్రియా సదా పూజ్యా దైత్యేంద్ర మథిని తథా
మహిషా సురసంహంత్రీ కామినీ* రక్తదంతికా(66) వాసినీ

395) ఓం బలిప్రియాయై నమః

బలినివేదన యందు ప్రీతి గలది పూజాసమయమందు అర్పించు కానుకల, ఉపహారముల ప్రీతి గలది త్యాగపూర్వకముగా నొసర్చబడు నివేదనము బలి 2) అహంకార మమకారాది యరిషడ్వర్గ ములను త్యాగపూర్వకముగా విసర్జించి జీవాత్మ పరమాత్మయందు హోమము చేయుట యనగా లయమందుట 3) పంచభూతతృప్తికై నిడు బలులచే ప్రీతి చెందునది (యమ, చిత్రగుప్తాదులకు నిడునది)) 4) జంతు బలులు, బ్రాహ్మణులకు నిషిద్ధము గాన కూష్మాండం, ఇక్షుదండం, నారికేళం, శ్రీఫలాదుల సమర్పణ తగినది దానతృప్తి చెందును 5) బలులందు గ్రామ్య జంతువులు, అరణ్యకములు, మానుష, శిశు, ఆత్మరుధిరాది ప్రోక్షణబలులచే పూజించు వామాచారమును శంకరుల వారు సంస్కరించి యుపాసనా విధానము నిర్ణయించుచు కులాచారము నేర్పరిచిరి

396) ఓం సదాపూజ్యాయై నమః

ఎల్లవేళలా పూజింప దగినది సుఖమున, కష్టమున, గమనమున గేహాంతరబాహ్యస్థలములను, సర్వవేళలను స్మరింపదగినది. కీర్తింప దగినది భజింప పూజింప తగినదియును. 'అర్చితాం జగతాం

ధాత్రీం తథా గంధాను లేపనైః భక్ష్యైసమస్తైః స్తైద్రవ్యైర్ద్రవ్యైర్ధూపై ధూపితాం॥ యాఖ్యాతో ప్రణతాం ధ్యాత్వా సర్వభావవినిశ్చితైః॥ ఆరాధితాస్తుతాచైవ సర్వసిద్ధి ప్రదాయిని' 'సర్వదేవమయం తాం లక్ష్మీమిమాంన్నృప॥ పూజయేత్ సర్వలోకానాం ప్రభుర్భవేత్' అందులకు షోడశ, చతుష్షష్ట్యాది యుపచారములును గీత వాదిత్ర నృత్యములను తుష్టిపరచవలెను

397) ఓం పూర్ణాయై నమః

పూర్ణ స్వరూపిణి యైనది 'పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే' యన పరిమాణము లేనిది లేక యనంత పరిమాణం కలది దేశకాల వస్తుకృతమగు పరిచ్ఛేదము లేనిది పూర్ణయనబడును అనంత ప్రకృతి, అద్యంత రహిత పరిపూర్ణ వస్తువు గాన బ్రహ్మస్వరూపిణిగా నెంచిరు 2) సర్వసంపూర్ణ పదార్థం, సృష్టికి పూర్వపరములనున్న సత్యపదార్థము క్షయవృద్ధి రహితమును పరబ్రహ్మ స్వరూపమై, సకలైశ్వర్యముల ఖనియై పూర్ణ పురుషార్థ ప్రదాయిని యగు దేవి 3) పంచమీ, దశమీ, పంచదశీ తిథులు పూర్ణతిథులనబడును ఈ తిథులయందు నిర్వర్తించు యజ్ఞయాగాది క్రియలు పూర్ణఫలము నొసగును 4) పూర్ణమను సంజ్ఞ శూన్యమును, అనంతమును తెలియజేయునది సంఖ్య కుత్తరమున విలువ గలదు పూర్వమున శూన్య విలువ గలదిగా సూచింపబడును సగుణ నిర్గుణ స్వరూప స్వభావము గలది 5) 'అనంత, దేహాది పరిచ్ఛేద రాహిత్యేన సర్వగతత్వేన సర్వాత్మకతయాచ సదా అనుసంధేయా' అటులే వసిష్ఠప్రోక్తం, అంతః పూర్ణో బహిః పూర్ణః పూర్ణకుంభయివార్ణవే తదేతద్ పూర్ణమ ప్రవర్తితి

398) ఓం దైత్యేంద్ర వంధిన్యై నమః

దైత్యరాజుల సంహరించిన శక్తి. భండాసుర, శుంభనిశుంభ, మహిషాసుర, మధుకైటభ హంత్రిగా వెలసినది వేదనిందక, బ్రహ్మద్విష, దేవతానిందకులగు దితిపుత్రులైన దైత్యవాచ్య, హిరణ్యాక్షాది దైత్య రాజ సంహారక శక్తియునై యున్నది దుర్గ, లలితారూపి 'మాతర్మేమధుకైటభఘ్ని, మహిషప్రాణాపహారోద్యమే హేలానిర్మిత ధూమ్రలోచనవధే హేచండముండార్దిని, నిశ్శేషీకృత రక్తబీజ దనుజే, నిత్యే నిశుంభాపహా శుంభ ధ్వంసిని' అని దుర్గ కీర్తింపబడినది అటులే భీమాసుర హంత్రి భండాసుర, అరుణాదుల వధించునదియును

399) ఓం మహిషాసుర సంహార్త్ర్యై నమః

మహిషాసురుని సంహరించిన శక్తి 'యాదేవి మధుకైటభ ప్రమదినీ' యా మహిషోన్మూలినీ యా ధూమ్రేక్షణా చండముండదమనీ, యా రక్తబీజాసని యా శుంభాది నిశుంభదైత్య శమనీ యాసిద్ధా లక్ష్మీ పరా సాచండీ నవకోటి సహితా మాంపాతు విశ్వేశ్వరీ' యని మహిషాసురాదులిందరో హతమైన రూపము 'గారుడోపల సన్నిభాం మణిమౌళికుండల మండితాం నౌమిఫాల విలోచనాం మహిషోత్తమాంగ నిషేదుషీమ్॥ చక్రశంఖకృపాణఖేటక బాణకార్ముక శూలకాం॥ తర్జనీమపి బిభ్రతీం నిజబాహుభిః శశిశేఖరామ్' అను మూర్తి వర్ణన గలదు

400) ఓం కామిన్యై నమః

కామినీ రూపమైన శక్తి 'కామానాం భోగపదార్థానాం యదాదృష్టిం తస్యయతీ, ప్రేరయతీతి' యని వివరణ భోగపదార్థములను ప్రస్తుతం అనుభవనీయములుగా ఉన్నవి ఉన్నట్లుగా ప్రేరేపించునది 2) కమనీయ మనోహర మనోజ్ఞ మంజుల రూపము గలిగినట్టి సర్వగుణ యుత స్త్రీ 3) మిక్కిలి కామము గల స్త్రీ ఇక్కడ దేవి నిత్యకామేశ్వర పర్యంకోపవేశ యానందమూర్తి సదా శివకామినీ 4) మాతృమూర్తి స్వరూపము. అందరిచే వర్ణించతగినది వాంఛాపూర్తికై కొలువదగిన దేవి స్త్రీ సంతానాది యైహిక భోగోపయుక్త కామముల నిడు శక్తి

ఇతి ఆదిశంకర కృత శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర చతుర్థశత నామావళ్యార్థ సంపూర్ణః

401) ఓం రక్తదంతికాయై నమః

రక్తదంతములు గల దేవి 'తతో మాం దేవతాః స్వర్గే మర్త్యలోకేచ మానవాః స్తువంతో వ్యాహరిష్యంతి

సతతం రక్తదంతికామ్' రుధిరపానము చేసి యెరుపు వర్ణముగా మారినట్టి దంత ప్రభ కలిగినది రక్తబీజాసురుని సంహరింపగా నుత్పన్నమైన రక్తబిందువులు భూమిని తాకి తద్రూప యసుర శక్తి యుద్భవమవుచున్నందున నివారింపగా కాళీ వదన విస్తారము చేసి పడు రక్తబిందువుల నన్నింటినీ పానము చేసి యున్నది కొందరు రాక్షసులను నోట నైదికొని నమిలి నాశనము చేసినది

రక్తపా రుధిరాక్తాంగీ* రక్తఖర్పర ధారిణీ రుధిరాసక్తా
రక్తప్రియా మాంసరుచి ర్మాసవాసక్త* మానసా(66) వాసవా, వాసరక్తా

402) ఓం రక్తపాయై నమః

రక్తపానము చేయు దేవి రక్తపానము చేయు బలిగయుని, ఢాకిని యను యర్థము వామాచారము ననుసరించి జంతు రక్తము శ్రేష్ఠమనుచు స్వీయదేహ రక్తమును తర్పణ చేయుదురు 2) బలి విధానమున కుంకుమాక్తక ఫలము రసము నిత్తురు దేవికి రౌద్రపోషక రుధిర పానము చేయింప ప్రీతి చెంది యసురవధ నిర్విఘ్నముగా చేయును

403) ఓం రుధిరాక్తాంగ్యై నమః

రుధిర మంటిన యంగములు గలది ఖండన మూర్తియైన రుద్రాణియే, అనేక యసురుల సంహారము చేయుగా రక్తము వెల్లువలై పారి, కదన రంగమున బిందులు ద్రొక్కుచూ పారు సలుపు రుద్రమూర్తి వొడలిపై ధారలు చిమ్మ రక్తస్రావి దేహయై వెలుగు మూర్తి భీషణమూర్తి

404) ఓం రక్తఖర్పర హస్తాయై నమః/ఓం రక్తఖర్పర ధారిణ్యై నమః

ఖర్పరముయన కుండపెంకు బిచ్చపుపాత్ర యైన కపాలముయని అర్థము కపాలము శిరస్సము గాన శిరచ్ఛేదనము చేసి దానిని చేత ధరించి వికటాట్టహాసము చేయు మూర్తి ఖట్వాంగ పదము కూడా వ్యవహృతము 'శిరోమాలా విభూషణా, విచిత్ర ఖట్వాంగధరా' యనియు 'కాళీక కరాళవదనా విస్తీర్ణాంతా ఉసిపాశిని విచిత్ర ఖట్వాంగధరా, నరమాలా విభూషణా' యని వర్ణన

405) ఓం రక్తప్రియాయై నమః

రక్తప్రీతి గలిగిన శక్తి సప్తధాతువులలో నొకటైన రుధిరమునందు ప్రీతి గలది ప్రాణి చేతనకు దేహమందు రుధిరమత్యావశ్యకము ఆరుధిర ధాతువు పానమునందు ప్రీతి కలిగిన దుర్గ భక్తులు దైవదత్తమని పవిత్రీకరించి చేయు జంతురక్తమునందాసక్తి కలిగినది,

406) ఓం మాంస రుచిరాయై నమః/ఓం మాంసరుచ్యై నమః

మాంస ధాతువు నందభిమానము గలది మాంస ధాత్వాశ్రితము మణిపూరచక్రము వయోవస్థావివర్జితయను దేవత మాంసమున కధీశ్వరి శరీరమున పుష్టిసూచకము పుష్టినొసంగు దేవత, యాధాతువున ప్రీతిగలది యజ్ఞమందు నల్లమేకబలి పవిత్రమని యెంతురు

407) ఓం ఆసవాసక్తమానసాయై నమః

మద్యమునందు ప్రీతి గలది ఆసవమునకు కల్లు, ఫలపుష్పకృతాసవము. తేనె, పుష్పముల నుండి సేకరించిన రసము, ద్రాక్షాసవము, మధువు, బెల్లం పానకము, మొదలగు వానితో చేయనగు మద్యము అందు ఆసక్తి గల మనసు గలిగినది ఇది మేధో వృద్ధికరము. సిద్ధేశ్వరీ యను దేవత మధువునందు ప్రీతిగలది 'గర్జగర్జ క్షణ, మూఢయావత్ మధుపిబామ్యహం' యని రణరంగమున దేహదార్ఢ్యతకై మధుపానము చేయు శక్తి. ఉపచారములలో అమృతాసవ చషకం పరికల్పయామి యని సమర్పించుట యొక యుపచారము

గలచ్ఛోణిత ముండాలీ కంఠమాలావిభూషణా
శవాసనా చితాంత స్థా మాహేశీ వృషవాహినీ(67)

**408) ఓం గలచ్ఛోణిత ముండాల్యై నమః**

మెడ నెరుపు చేయు కపాలమాల గలది యుద్ధమందు అసుర సంహారము చేయుచు ఛేదించిన శిరములన్నింటిని మాలగా గుచ్చి కంఠమున ధరించగా, నా శిరసుల నుండి కారు రక్తధారలచే యెరుపెక్కిన గ్రీవము గలది గలద్రుధిర శిరోమాలా విభూషణా ముండమాలా ధరాదేవి కాళిం, శిరో మాలికాం రక్తాలిప్తపయోధరాయుని త్రిపురభైరవి రూపం 'ఛిన్నశిర కర్త్రికాం' యని రక్తాచ్ఛాదిత గళమును పేర్కొనును ఈ నామములన్నియు రక్తమాంసాసవపానాసక్తులై, కపాలమాలా ధారిణులైన మూర్తులను యసురసంహార వేళల భావించి వర్ణించబడినది

**409) ఓం కంఠమాలా విభూషణాయై నమః**

కంఠమాల అలంకారముగా కలిగిన దేవి 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' శిరస్సు నయనము లు గలిగినది రావణాసురుడు పూవులకు బదులు శిరసుల నర్పణ చేసెను విష్ణువున్ను నూరవ పుష్పముగా తన పద్మనేత్రముల నర్పించెనని గలదు అట్టి ముఖ్యాంగముల మాలగా ధరించునది శక్తి. మాలయన కంఠసీమను అలంకరించినది. అది పుష్పముల మాల, మణిమయ మాల, రత్నమాల, శిరోమాల యును గావచ్చును

**410) ఓం శవాసనాయై నమః**

శవము ఆసనముగా కలిగినది ప్రకృతి తాండవ వేళల, యసుర సంహార వేళలలో నృత్యము చేయు సందర్భమున, భూమి యస్థిరత చెంది పంచ భూతములును కకావికలగును అట్టి పంచభూత రక్షణమునకు గాను, పాదఘట్టనల తీవ్రత తగ్గించుటకు శవాకారమున శివుడే యాధారమునవుచు రక్షించు చుండును కావున దేవికి శవారూఢ, శవాసన యనియు తారను–శవహృద్ ఘోరాట్ట హాసాపరాయని శవ హృదయముపై కదనము త్రొక్కుచున్నట్లు వర్ణన గలదు

**411) ఓం చితాంతస్థాయై నమః**

చిద్రూప అంతస్థయైన దేవి తమోసహాయగుట చితియనబడును జీవుడు జాగ్రదవస్థ నుండి సుషుప్తి చెందుటకు మధ్య స్థితిగా తురీయ సహాయమగు స్థితి చితి అజ్ఞాన విరుద్ధమైన శక్తియే చిత్తు జీవులయందు సాక్షిరూపము, సచ్చిదానంద జ్ఞాన, సూర్యచంద్రాగ్నుల ప్రకాశ స్వరూపము త్రిపుట మధ్యమద స్వరూపము జాగ్రత్ సుషుప్తుల మధ్య తురీయ స్థితి యందుండు శక్తి రూపము

**412) ఓం మాహేశ్యై నమః**

మాహేశీ, మహేశియైన దేవి మాయాంతు ప్రకృతిర్విద్యాన్మాయినంతు మహేశ్వరీ మహత్తుకు ఈశి, ప్రభ్వి యైన దేవి సర్వజ్ఞతయనాది బోధ, స్వతంత్రత, నిత్యత, సంపూర్ణత, యనంతత యను షడంగములు గలది మహాపూజ్యారాలు మహత్ లోకమునకు ఈశాని, యజ్ఞతేజ చిత్ ప్రకాశముల కాధ్య 2) మహాయన గోప్త, రాజ్యసంపదకధిష్ఠాత్రి హిరణ్యగర్భాది అప్రమేయ పరమాత్మ స్వరూపిణి

**413) ఓం వృషవాహిన్యై నమః**

వృషవాహినియైన దేవి వృషమన ధర్మము, ఎద్దు, వీరు కాము, కృష్ణునికి వర్తించు శ్రేష్ఠవాచకము వృషభ రాజము యనవగును. శైలపుత్రిని వాంఛిత లాభాయ వృషారూపిణి 'మహేశ్వరీ వృషారూఢా త్రిశూల వరధారిణీ యని త్రిశూల చంద్రాహిధరే మహావృషభ వాహిని' యని వర్ణింపబడినది

వ్యాఘ్రత్వగంబరా చీనచైలినీ సింహవాహినీ
వామదేవీ మహాదేవీ గౌరీ సర్వజ్ఞభామినీ(68)

**414) ఓం వ్యాఘ్రత్వగంబరాయై నమః**

వ్యాఘ్ర చర్మము ధరించిన దేవి మాధ్యాహ్నిక సంధ్యోపాసనములో 'రుద్రాణి నవయౌవనా త్రినయనీ వైయాఘ్ర చర్మాంబరా' యన పెద్దపులి చర్మము ఆవరణ వస్త్రముగా గలిగిన దేవి కాత్యాయనీ రూప

వర్ణనతో 'శార్దూల చర్మవాహనా' యని గలదు వ్యాఘ్రాసురుని సంహరించి వాని కోరికపై చర్మము వసనముగా నలంకరించుకున్న శివశక్తి రూపము

415) ఓం చీనచేలిన్యై నమః

చీనచేలములు గలిగినది నగ్నీ చేయబడిన వస్త్ర విశేషము చీనాంబరము అందు లక్ష్మీ స్వరూప విభూతిగా రత్నఖచిత జాజ్జ్వల్యమాన చేలాంచలము గలిగినది యందురు కంచుక, సహితాయ, కౌశేయ, వాససీం సమర్పయామియని ఉపచారము పట్టు వస్త్రముల ధరించిన దేవి హాస్యరూపము రత్నమణిమయ ఖచితములైన వస్త్రములు ధరించినది

416) ఓం సింహవాహిన్యై నమః

సింహం వాహనముగా గలది 'విద్యుద్దామ సమప్రభాం మృగపతి స్కంధ స్థితాం' యని 'సింహం మూపున యాశీనురాలు 'తతోద్ధూత సటః కోపాత్ కృత్వానాదం సుభైరవాన్ మహాసుర సేనాయాం సింహదేవ్యాస్సువాహనం' సింహవాహినియై యసుర సంహారము చేసినది మృగపతియైన సింహము యేనుగ కుంభస్థలమును పంజాతో దాడి చేసి చంపగలదు దానిని వశముచేసి కొన్న శక్తి స్వరూపిణి

417) ఓం వామదేవ్యై నమః

వామదేవియైనది సదాశివుని పంచాస్యములలో నుత్తరాభిముఖ మూర్తి వామదేవుడు తత్ శక్తి వామదేవి 2) ప్రకాశించుచున్నట్టి వామభాగము గలవాడు అర్ధనారీశ్వరుడు వామదేవుడు తన యందిముడ్చుకొనిన ప్రపంచ కారణ బీజముల వెళ్ళగ్రక్కునది వామదేవి
3) దుర్గాదేవికి నామాంతరము 4) పిండాండంబున అనాహత చక్రాధిష్ఠానయగు దేవత 5) అతి సుందర లావణ్యదేవత వామదేవి 6) వామశబ్దము కర్మపరమైనపుడు కర్మఫలము నిచ్చునది 7) వామాచార, కౌలాచార విధి నర్చనంది భక్తాభీష్టమునెరవేర్చునది 8) సకల దేవతలకు వందనీయుడైన పరమేశ్వరుడు వామదేవుడు వందనీయ వామదేవి

418) ఓం మహాదేవ్యై నమః

మహాదేవియైనది మహావిశేషణము గల దేవీరూపము సకల దేవత కంటే యధికుడగు పరమేశ్వరుని శక్తిస్వరూపిణి 2) గండకీ నది యందు చక్ర తీర్థాధిష్ఠాన దేవత మహాదేవి 3) అప్రమేయ ప్రమాణములు గల విరాడ్రూప శరీరము గలది అనంత శక్తియుతమైనది యును. 4) దేహాంగంబుల నధివసించు వివిధ దేవీ స్వరూపముల సాముదాయక శక్తిమహేశ్వరి. 5) మహాదేవుని యష్టమూర్తులలో చంద్రుడు మహాదేవుడు, వాని శక్తి రోహిణి కుమారుడు బుధుడు (వామ పురాణం)

419) ఓం గౌర్యై నమః

గౌరియైన దేవి 2) గౌరవర్ణదేహ శంఖ కుందేందు వర్ణశరీర 2) కాళి దేహము శ్యామల వర్ణము సదాశివుడు శ్యామాయని హేళన చేయ తపస్సు చేసి బ్రహ్మవరమున గౌరవర్ణ శరీరియైనది 3) కన్యాకుబ్జ పీఠాధిదేవత గౌరి. 4) గౌరీ యను పేర నొకనదియు గలదందురు. 5) అష్టవర్షప్రాయ కన్య గౌరి 6) రౌద్రాయై నమో నిత్యాయై గౌర్యై ధాత్ర్యై నమో నమః 'స్తుతి' 7) 'దేవిదేవ శరీరేభ్యో జగత్త్రయ హితైషిణి పునశ్చగౌరీ దేహాత్ సా సముద్భూతాయదా భవత్' 8) గౌరీ దేహ సముద్భూతాయా సత్త్వైక గుణాశ్రయా సాక్షాత్ సరస్వతీ ప్రోక్తా 9) దక్షపుత్రి సతియే మరు జన్మమున హిమవత్ పర్వతపుత్రిగా జన్మించినది 10) గంగ అగ్రజ, గౌరీ అర్ధశరీరిగా యిరువురు భార్యలు గలిగినట్లుగా పురాణము

420) ఓం సర్వజ్ఞ భామిన్యై నమః

సర్వజ్ఞాని శక్తి రూపమై యున్నది భూతభవిష్యత్, వర్తమానముల సంపూర్ణ జ్ఞానము కలిగిన సర్వజ్ఞాని భార్యయై యున్నది సర్వజ్ఞత, అనాదిబోధ, స్వాతంత్ర్యత, నిత్యత, సంపూర్ణత, అనంతత యను

భగవల్లక్షణములు గలిగిన దేవి 2) సర్వద్రవ్యగుణ క్రియ వాక్యాదులు సర్వశబ్దమున కర్థములు పరమేశ్వరుడు సర్వ స్వరూపుడు జ్ఞాన స్వరూపియును జగచ్చక్రము నంతను నడిపించు పరమేశ్వరి నియంత

**బాలికా తరుణీ వృద్ధా వృద్ధమాతా జరాతురా,**
**సుభ్రూ* ర్విలాసినీ బ్రహ్మవాదినీ బ్రహ్మణీ సతీ(69) సుభ్రూ, బ్రాహ్మణీ మహీ**

**421) ఓం బాలికాయై నమః**

బాలిక స్వరూపిణియైనది 2) బాలాత్రిపుర సుందరీ స్వరూపము అనేక శక్తి మంత్రములున్న శబ్ద బ్రహ్మము 3) అంట బ్రహ్మ శక్తి సృష్టికి ముందే నిత్యబాలా స్వరూపిణి రెండు నుండి పది సంవత్సరముల వరకు బాల స్వరూపిణిలుగా పూజింపబడుదురు 4) త్వం కుమార ఉతవా కుమారి బాలలీలలు గల కుమారి స్వరూపము బాలలీలా వినోదిత్వాత్ బాలేతికథితా ప్రియా 4) శ్రీచక్ర మందు బాలాతృతీయ బీజ స్వరూపిణి యని యర్థము 5) ఉదయ సంధ్యలో ఋగ్రూపిణి బాలికా యని ఉపాసనా రూపము గాయత్రి

**422) ఓం తరుణ్యై నమః**

తరుణీరూపమైనది నిత్యషోడశ వర్షా పదునారేండ్ల ప్రాయము నిత్యమైనట్టి తరుణీ రూపమునున్న దేవి 2) పరమేశ్వరీ సదానంద స్వరూపిణీ అట్టి భువనేశ్వరి సదాషోడశ వర్షాచ నవయౌవన దర్పితా, 3) మధ్యాహ్న సంధ్యారూపము రుద్రాణీ నవయౌవనా త్రినయనీ యని సావిత్రీ రూపిణియైనది

**423) ఓం వృద్ధాయై నమః**

వృద్ధారూపిణియైన దేవి సాయం సంధ్యయందు పరిణమిత్ గాత్రాన్వితా వైష్ణవీయని పరిణతి చెందిన యంగములు గల వృద్ధ శరీరి సరస్వతీ రూపమున ధ్యానింతురు 2) సకల జగత్తుకంటె ముందు న్నది గాన ఆర్యావృద్ధాయందురు 3) బ్రహ్మమే వృద్ధాయనబడును సృష్టికి ముందుండెను గాన 'అహమేకావ పూర్వంతు నాన్యత్కించిత్ సనాధిపా' యని 'అహమస్మి ప్రథమజా' అనబడు శక్తి.

**424) ఓం వృద్ధమాత్రే నమః**

వృద్ధమాతా స్వరూపిణి. ఆద్యులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకే జననియైన మాతృమూర్తిగా వృద్ధమాత యగును 2) జీర్ణశరీరి గత యౌవన యగు స్త్రీ యగును అనుభవజ్ఞానమునందు పెద్దదైన స్త్రీ శక్తి 3) జ్ఞానవృద్ధ గాన బాధలు కలిగినపుడు యుపశమనమునకై దేవిని ప్రార్థించు చుందురు 4) అందరికంటే పెద్దదైన మాతృస్వరూపిణి ఆమెనుండియే యనేక శక్తులుద్భవించును అసుర సంహారమునందు తోడ్పడును 5) 'బ్రహ్మేశగుహ విష్ణూనాం తథేంద్రస్యచ శక్తయః శరీరేభ్యో వినిష్క్రమ్యంతా తద్రూపై చండికాయః' ఆ శక్తుల సృష్టిలయకారియామెయే

**425) ఓం జరాతురాయై నమః**

జరాతురయైన దేవి వార్ధక్యమున కధిష్ఠాత్రి జరాదేవి ప్రాణి వృద్ధత్వమునకు కారణమైన లయకారిణి దేవి. అజరామరణం ప్రసాదించు దేవి దీర్ఘ జీవితము ప్రసాదించునది భక్తజనులకు రోగహీన పూర్ణ జీవితమిడి అంత్యమున మోక్షము ప్రసాదించునది దేహమున్నది జీవికి కారాగారము విముక్తి యందు జర ప్రాప్తించును అట్టి వృద్ధాప్య మతీతమై మోక్షమందుటకు యెట్టి శ్రమ లేకుండా చేసి శీఘ్ర మోక్షప్రదానము చేయు శక్తి 2) జరారూపిణియైన దేవి వృద్ధా, ఆతురా, శీఘ్ర చలనము గలదియని వేరు పదముల యర్థము వర్తిల్లును

**426) ఓం సుభ్రువే నమః**

మంచికనుబొమలు గలది మంచి అందమైన, శుభప్రదమైన కనుబొమలు గలదేవి కార్ముకము వలెనున్న కనుబొమలు సాముద్రిక లక్షణము 2) ముఖమున మన్మథునిగా శోభన గృహమున

కట్టబడిన మంగళ తోరణముల వరుస వలెనున్న కనుబొమలు గలది 3) 'భ్రూపి సంధ్యయోస్తేజః' సంధ్యా తేజము నుండి భ్రూలత లేర్పడినవి 4) అసుర సంహారమున భ్రుకుటీ కుటిలాస్త్రస్య అని ముడిచిన కనుబొమలు గలది

427) ఓం విలాసిన్యై నమః

విలాసినియై యున్నది సుషుమ్న మార్గమున బ్రహ్మరంధ్రము నాచ్ఛాదించి యుండు విక్షేపక శక్తి స్వరూపిణి. విష్ణుమాయా విలాసిని బ్రహ్మశక్తి మోక్షమార్గమైన బ్రహ్మరంధ్రము నాచ్ఛాదించి యుండు శక్తి. 2) విలాస వ్యామోహములే జీవనపతన హేతువు ముముక్షు పద నిరోధకములగు ఈ విలాసిని శక్తి కటాక్షించి భక్తుల బంధముల తొలగించుటయే పరమానంద స్థితి

428) ఓం బ్రహ్మవాదిన్యై నమః

బ్రహ్మవాదినియై యున్నది ఏ స్థానమునందు ముక్తినంద తగునో నదియే బ్రహ్మస్థానము పంచభూతముల యందు నంతర్యామియైన రూపము నిఖిల జ్ఞానసాధనచే నందదగినది సర్వము తానేయై మరొకటి లేని 'ఏకోహం' సర్వం ఖల్విదం బ్రహ్మ, చతుర్దశ భువనాధారం, ఆద్యంత రహిత, శుద్ధబుద్ధముక్తస్వరూప, సచ్చిదానంద, నిర్గుణ నిరాకార, సంతత శ్రీకర, సర్వమంగళకరము వ్యాపక స్వభావము కలిగి జగత్తున కధిష్ఠాన భూతయైనది బ్రహ్మజ్ఞాన రూపిణియైన దేవి, ఆత్మయభేద జ్ఞానము 'అహం బ్రహ్మాస్మి' యను రూపాంతరము 'తత్త్వమసి' యాది వాక్యజనిత అగాధ జ్ఞానము చిత్ ప్రతిబింబ సమైకత్వము శుభాశుభ వృత్తిరహిత సమదర్శనము లింగత్రయ పరిత్యక్తుడైన జ్ఞాని అట్టి అద్వైత యభేదజ్ఞానమైన బ్రహ్మవాదనను సమర్థించు శక్తి స్వరూపిణి, 3) పరబ్రహ్మమును గూర్చి వివరించు సమర్థించు నదియు 'చోదయిత్రీ సూనృతానాం, చేతంతీ సుమతీనాం, యజ్ఞందధే సరస్వతీ' యని మోక్షమార్గమును నిర్దేశించు వాగీశ్వరీ దేవి

429) ఓం బ్రాహ్మణ్యై నమః

బ్రాహ్మణీ సతి బ్రాహ్మణీ స్వరూపమైన దేవి బ్రాహ్మణ స్త్రీ స్వరూపిణి. 'బ్రాహ్మణో భగవాన్ సాంబో, బ్రాహ్మణానాం హిదైవతం, విశేషాద్బ్రాహ్మణో రుద్ర మీశానాం శరణం వ్రజేత్' అట్టి బ్రాహ్మణ శక్తియామె బ్రాహ్మణ సుమంగళిని పరదేవతా బుద్ధితో పూజింతురు 2) వేదోచిత వర్ణాశ్రమ కర్మానుష్ఠాన బద్ధుడు బ్రాహ్మణుడు సహచరీ శక్తి కులాంగన బ్రాహ్మణి 'స్త్రియ స్సమస్తాస్తవ దేవి భేదాః' కర్మాచరణయుతు లైన శక్తి రూపియు నామెయే

430) ఓం సత్యై నమః/ఓం మహ్యై నమః

సతీ లేక సత్యరూపయైన దేవి మహీరూపమైనది సతీరూపిణి పతివ్రత సత్యస్వరూపిణి దక్షకన్య యని, బ్రహ్మస్వరూపమునందు రూఢి గలది త్రికాలాబాధ్యమైనది పరబ్రహ్మము పరమేశ్వరి అగ్నిదేవతా మూర్తులయందునను, గో, విప్రపతివ్రతాదులందునను నెలకొని యున్నది 2) మహద్వ్యాప్య స్థితా సర్వం మహీతి, ప్రకృతిర్మతే, ప్రకృతిస్వరూపిణి భూదేవతా రూపిణియును 3) వేదములలో మహియను దేవత యదితియని, ఉపయామ యని ఉదహరింపబడినది 4) క్షమ స్వరూపిణి మాతృదేవతా స్వరూపురాలు సర్వజగజ్జనని సర్వజీవ మాతృకయును

సుప్తవతీ చిత్రలేఖా లోపాముద్రా సురేశ్వరీ
అమోఘారుంధతీ తీక్ష్ణా భోగవత్యనురాగిణీ *(70) త్యనువాదినీ

431) ఓం స్వప్నవత్యై నమః/ఓం సుప్తవత్యై నమః

స్వప్న సుప్తవతియైన రూపము నిద్రావస్థలో ప్రపంచానుభవము స్వప్నమనబడును సాక్షిరూపముగా పరాశక్తిగా స్వపంతి స్వప్నము సూక్ష్మశరీర సంబంధి జన్మాంతర యనుభూతులైనను యావర్తన పొందుచుండును మనోబుద్ధులు రెండును కంఠ స్థానము పొంది యుండునని స్వప్నావస్థ అట్టి స్థితికి యధిష్ఠాత్రియని 2) నిర్వికార స్వరూపస్థితి సుప్తమనబడును అది సంప్రదాయావస్థ మనో

బుద్ధులు రెండును హృదయగతములగు స్థితి అందుకు ప్రాజ్ఞుడను సమిష్టి ఈశ్వరుడే, అభిమాని గాన సుషుప్తావస్థ స్వరూపిణి సుప్తవతి యనబడును ఈ రెండును జాగ్రదావస్థకు వ్యతిరిక్తము

**432) ఓం చిత్రలేఖాయై నమః**

చిత్రలేఖ నామధేయముగలది చిత్రలేఖయను యప్సర బాణాసురుని పుత్రి ఉషచెలికత్తె, చిత్రలేఖలు గీయుటలో నిపుణురాలు అట్టి చిత్రలేఖ విద్యారూపిణి ఆమెయే 2) విచిత్రవర్ణనల ననేక జీవుల విభిన్న రూపముల సృష్టిచేయు శక్తి. 3) చంద్రరేఖ మౌళిపై చిత్రముగా కాంతులీనునట్టి శోభగలది చంద్రరేఖగాను తాదాత్మ్యత చెప్పబడినది

**433) ఓం లోపాముద్రాయై నమః**

లోపాముద్రా రూపిణి అగస్త్యుని భార్య. లలితా పంచదశీ మంత్రోద్ధారణ చే తాదాత్మ్యత నందిన రూపము హాదివిద్య, అదే లోపాముద్ర విద్య, అట్టి మహత్తర తాపసీ స్వరూపిణియైన దేవి కాది విద్యామంత్రము నందు పంచదశీ విద్య తృతీయ కూటమి దానిని శక్తి ప్రణవత్రయ యుక్తముగా చేర్చి దాన సర్వోప చారములందు చేయవలయునని రహస్యార్థము

**434) ఓం సురేశ్వర్యై నమః**

సురేశ్వరియైన దేవి సకల దేవతలకు ఈశ్వరి మూల కారణము పాలించు శక్తి మహిమ గలిగినది సకల దేవతాసమైక్య శక్తి స్వరూపురాలైనందున సురేశ్వరి యనబడును స్వర్గాధివాసిపురాధిపతియైన యింద్రుని శక్తి శచి యందురు ఆమె పరమేశ్వరి యంశమే ఇంద్రునకు నీశ్వరియై ఆదింద్రాణి శక్తులు తన విభూతులై వెలుగు సురల ప్రభ్వి

**435) ఓం అమోఘాయై నమః**

అమోఘరూపిణియైనదేవి వ్యర్థము గానిది అనగా సత్ స్వరూపమైనది. పరమేశ్వరీ శక్తి. ఇదే పేరుగల నొక నదియు గలదు శక్తియు, అమోఘా, అమేయా, అప్రమాణమైన, అనిర్దశ్యమైన సత్యరూపశక్తి పుంజము మహావిద్యామహామాయా, మహామేధా, మహాస్మృతిం మహామోహచ భవతీ మహాదేవి, మహాసురీ యని తిరుగులేని వ్యర్థముగాని అమోఘ విద్యా శక్తి సంపన్నురాలై యున్నది

**436) ఓం అరుంధత్యై నమః**

అరుంధతీ రూపిణియైనది బ్రహ్మమానస పుత్రుడైన వశిష్ఠుని శక్తి ఆమె పూర్వజన్మమున బ్రహ్మమానస పుత్రియైన సంధ్య, విష్ణువుని గూర్చి తపస్సు చేసి మరు జన్మను మేధాతిథి యజ్ఞకుండమందావిర్భవించి మునిపుత్రిగా వశిష్ఠుని వివాహమాడినది పతివ్రతలలో సత్యోత్తము రాలు సప్తఋషుల పత్నుల వేషములు ధరించ నెంచిన అగ్నిపత్ని అరుంధతి రూపము మాత్రము దాల్చలేక పోయినది ధృవలోకమున సప్తర్షి మండలంలో నారవ నక్షత్రమైన వశిష్ఠుని ప్రక్కగా మినుకుమను నక్షత్ర శక్తి ఆమెయే. అందులకు నూతన దంపతులకా నక్షత్రము దాంపత్య స్థిరత్వమునకు చూపుదురు మరణాసన్నమైన జీవులకామెకనుబడదు

**437) ఓం తీక్ష్ణాయై నమః**

తీక్ష్ణ స్వరూపిణి యైనది తీక్ష్ణా పదమునకు తారాదేవి వాడి వేడిమి ఉగ్ర నక్షత్రములు ఆలస్యములేనిది సూక్ష్మగ్రాహి 'జ్వాలా కరాళ మత్యుగ్ర మశేషాసుర సూదనమ్' అందురు స్ఫురద్దర్శన దంష్ట్రా భా సా భీమరూపా, తేజోమండల దుర్ధర్షా భ్రామరీ చిత్ర కాంతి భృత్, రక్తదంతికా వర్ణనము రక్తాయుధ, రక్తనేత్ర, రక్తకేశాతి భీషణా, రక్తతీక్ష్ణనఖా రక్తరసనా, రక్తదంష్ట్రికా, అధిక తాపము, అధిక వాడిగల నఖములు మొదలైనవి గలిగి ఉగ్రమైన దేవి

**438) ఓం భోగవత్యై నమః**

భోగవతియైన దేవి భోగమనగా సుఖానుభవము బ్రహ్మానంద స్వరూపమును దానిననుభవించు మనోబుద్ధుల స్వరూపమైనది 2) భోగములు అష్టవిధములు–గృహము, శయ్య, వస్త్రం, ఆభరణం,

మాంగల్యము, పుష్పము, గంధము, తాంబూలము భోగము అనగా నైవేద్యము అనియును 3) సకలైశ్వర్య నిలయమై భోగస్థానమునందు వెలుగు శక్తి భోగవతి జీవుల కర్మానుసార ఫలము భోగము నిచ్చు కాను శక్తి భోగవతి 4) నాగకన్య భోగిని పట్టణము కూడా కలదందురు

**439) ఓం అనురాగిణ్యై నమః**

అనురాగము గలది భక్తుల యెడ కటాక్షభావము గలది ప్రేమమూర్తియైనది 2) నిత్యము భర్తయైన సదాశివునికి యనురాగము నందించు ప్రేమమూర్తి అనుకూలమైన కోర్కె ప్రేమగలిగి వర్తించు మహాదేవి 'తద్విగ్రహాస్యసదయా సుధయాప్లుతస్య' యనియు, ''కల్యాణ వృష్టిభిరివామృత పూరితాభిః' యను కారుణ్య కందళిత కాంతి భరం కటాక్షం యనబడునట్టి అమృత ప్రేమవర్షిణి యామె.

**మందాకినీ మందహాసా జ్వాలాముఖ్యసురాంతికా**
**మానదా మానినీ మాన్యా మాననీయా మదాతురా*(71) మదోద్ధతా**

**440) ఓం మందాకిన్యై నమః**

మందాకిని రూపమైన దేవి ఆకాశగంగ, ఛందభేదం, సంక్రాంతి భేదమని యర్థము పవిత్రతకు చిహ్నము గంగ, దివిజగంగ రూపమై ప్రాణమై సముదాయమునకు, ప్రాణాధారములైన జలముల ప్రసాదించు దేవి 'యేచింతయంత్య మృత వారిధి రంతుజాలై రాప్లావ్యమాన భువనామమృతేశ్వరీంత్వాం' 'అమృతామృతర శ్మిప సంతర్పిత చరాచరం' యని అమృతేశ్వరి రూపం అట్టి అమృతప్రావి నిధి యంబ

**441) ఓం మందహాసాయై నమః**

మందహాసము గల దేవి 'శ్రీమన్మందకటాక్ష యుత' అమీలితాక్ష మధిగమ్య ముదాముకుందం ఆనంద కందళిత కాంతి భరం కటాక్షం 'కాంసోస్మితాం, హిరణ్య ప్రాకారా మార్ద్రాం, జ్వలంతీం' మందహాస విశేషణములు , ఆ మందహాసమునసే సంమోహయతి భువనత్రయమపి-మధుకైటభుల నా మందహాసమే మోసగించినది పైపై ప్రసన్న, వరదాభయ, చిరునవ్వులు చిందించు దేవి

**442) ఓం జ్వాలాముఖ్యై నమః**

జ్వాలాముఖియైన దేవి దేవి పీఠములలో నొకటి జ్వాలాముఖి 2) విద్యాభేదమునై యున్నది నారసింహ శక్తి, 'జ్వాలా కరాళ మృత్యుగ్రము శేషాసుర సూదనం' అని నోటినుండి యగ్ని జ్వాలలు చిమ్ము దేవి జ్వాలానృసింహ రూపి మధ్య చక్రం మహాస్యంజ్వాల దనల శిఖాగ్రస్త వేతాళవర్గం' యని వర్ణన 'నారసంహీ నృసింహస్య బిభ్రతీ సదృశం వపుః ప్రాప్తా తత్ర కటాక్షేప క్షిప్త నక్షత్ర సంహతి'

**443) ఓం అసురాంతకాయై నమః**

అసురుల నంతము చేయు శక్తి మధుకైటభ, చండముండాసుర, రక్తబీజ, శుంభనిశుంభ, భండాసుర, అరుణాసురాది, యనేక యసుర సంహారము చేసి యసురాంతకిగా దేవతలచే కీర్తింపబడిన దేవి ఇత్థం యదాయదాబాధా దానవోత్థా భవిష్యతి తదా తదాఽవతీర్యాహం, కరిష్యామ్యరి సంక్షయం—యని దేవి యభయమిచ్చినది 'దేవి ప్రసీద పరిపాలయనోఽరిభీతే ర్నిత్యం యథాఽసుర వధాదధునై వసద్య' యని ప్రార్థించ కరుణించును 'జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతివేదః సనః పర్షదతి దుర్గాణి' యని భక్తులనరాతిగణమునుండి రక్షించును

**444) ఓం మానదాయై నమః**

మాన్యత నిడు దేవి దేవ,మనుజ భక్తాదులను, ధనధాన్య సుత కళత్ర గృహాద్యుప కరణముల నిడి, పూజ్యత కల్పించు దేవి 'సాలోక్య సామీప్య' సారూప్యాది తలముల నమ్మగహించి వరదాయిని యగును మహిషాసురాదులైనను వేడగా మాన్యత కల్పించి వారిని పూజార్హత కల్పించిన పరమ కృపాళువామె

445) ఓం మానిన్యై నమః

మానినియైన దేవి విస్తారమైన గౌరవము గలది మానిని యన యాదరాభిమానములు, గౌరవమును గలది సదాశివుడే నిత్యప్రియునిగా గల దేవి కామేశ్వరి దైత్యహంత్రిగా ప్రసిద్ధి గాంచినది సర్వదేవతలచే గౌరవింపబడునది పతివ్రతారూపిణియైన దేవి మాన్యత గురుత్వము గలది

446) ఓం మాన్యాయై నమః

మాన్యయైన దేవి ఆమెను మహామాయా, మహాలక్ష్మి, మహాసరస్వతి, జగదాద్యా, జగజ్జననీ, సర్వభూత హితైషిణి, సాధుపోషిణి, అసుర సంహార్త్రి యాది, సృష్టి స్థితిలయాది పంచకర్తృక రూపిణి. సర్వదేవ ప్రాణసంఘములచే గౌరవము నందుదేవి, జగదేకశక్తిగా కొలువై యున్నది

447) ఓం మాననీయాయై నమః

మాననీయమైన దేవి అందరిచేతను గౌరవింపబడునది 'సర్వదేవ శరీరేభ్యోయా ఆవిర్భూత అమితప్రభా' త్రిగుణా మహాలక్ష్మి మహిషమర్దినియైనది, 'హోత్వాత్వరీ జగద్ధాత్రి విష్ణుతేజ స్వరూపిణిగా, స్వాహా స్వధావషట్కారాదుల దేవమనుజాది పోషణ చేయుచు మాననీయమైనది తతోమాందేవతా స్వర్గే మర్త్యలోకేచ మానవా 'స్తువంతో వ్యాహరిష్యంతి ' యని గలదు

448) ఓం మదాతురాయై నమః

మదాతురమైన దేవి. అష్టవిధ మదములలో యౌవనమొకటి. నిత్యషోడశికా దేవి యున్మత్తత జరుగుచుండును మదమన సంతోషము, యానందము యొక్క యాధిక్యత గలది ఆనందాతుర రసైకానుభవమున ప్రకాశించు ఘనయానంద స్వరూపిణియే మదాతుర శక్తియైన దేవి వాసనారహితమైన పూర్ణానందానుభవమున తేజరిల్లును ఆనంద మదనాతురాయని తృతీయావరణ సంక్షోభణ చక్రశక్తియై యున్నది

మదిరా మేదురోన్మాదా మేధ్యా సాధ్యా* ప్రసాదినీ నమ్యా
సుమధ్యానంత గుణినీ సర్వలోకోత్తమోత్తమా(72)

449) ఓం మదిరాయై నమః

మదిరారూపమైన దేవి ఆసవము దేవతలకిదు సోమము వలెను మదిర సత్వస్వరూపమైన పానీయము. 'గర్జగర్జ క్షణం మూఢ యావత్ మధుపిబామ్యహం' దాన దేహము మదిరాపూరితమై మదిర స్వరూపి యైనది దుర్గావామము 2) దివ్యప్రభావాశ్రితమై బ్రహ్మస్థానమున వృద్ధి చెంది పానయోగ్యమైన సుధారూప మదిరను మునులు గ్రోలుదురు అదియే మదిరయని వివేకులు గ్రహింతురు, నిర్వికార నిరంజన పరబ్రహ్మ విషయయోగమున జనించిన ప్రమథన జ్ఞానమే మదిర

450) ఓం మేదురాయై నమః

మేదుర రూపమైనది ధట్టమైన విగ్గయనగా శరీరకాంతి కలిగినది సాంద్రపోషిత లక్ష్మీరూపము 'హిరణ్యవర్ణాం చంద్రాం ప్రభాసాం యనియు, దుర్గారూపము 'ఏతత్తే వదనం సౌమ్యం, లోచన త్రయ భూషితం, సర్వదేవ శరీరేభ్యోయా ఆవిర్భూతాఽమిత ప్రభా' సా మహాలక్ష్మి మహిషమర్ది నీయని విద్యుద్దామ సమప్రభ గలిగినది

451 ఓం ఉన్మదాయై నమః

ఉన్మాది రూపియైనది అనంగదశాభేదము, రోగము, వ్యభిచారీ భావము యని యర్థము 'కోపేన చాస్య వదనం మషీవర్ణమభూత్ తదాభృకుటీకుటిలాతస్య' ధనుర్జ్యాసింహ ఘంటానాద పూరిత దిఙ్ముఖా' 'వినాదైర్భీషయా' ఇవియన్నియు ఉన్మాదోద్దీపనములు 'తతో జహాసాతిరుషాభైరవ నాదినీ రూపా'

452) ఓం మేధ్యాయై నమః

మేధా స్వరూపిణియైనది 'బుద్ధిస్వరూపిణి అథమేధా సకలము సమహితము చేసికొనగల మానసిక తత్వము యాదేవి "మేధే సరస్వతి వరే భూతి బాభ్రవి తామసి నియతే త్వం' యని 'యాదేవి సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా' యని పరమేశ్వరీ రూపము 2) బ్రహ్మైవాహమస్మీతి స్ఫురితేవ మేధ యని యనేక జన్మలెత్తుచుండినను, తానుయనాది, సిద్ధుడు, పరబ్రహ్మ స్వరూపుడు యనుస్మరణ గలుగుటయే మేధ 'మేధాసి దేవి విదితాఖిల శాస్త్రసారా' జీవియందుగల ధారణ శక్తియును, ధీశక్తి యామెయే 3) స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాత్రియగుసిద్ధేశ్వరి మంత్ర విశేషమును, గర్భస్థ పిండము యొక్క నాలుగవ మాస స్వభావ స్థితియు బోధించును 4) కాశ్మీర మండలమున మేధాదేవి యను దేవత 'మేధా కాశ్మీరమండలే' అని పద్మపురాణము

453) ఓం సాధ్యాయై నమః

సాధ్యరూపిణియైన దేవి గణదేవతావిశేషం సాధ్య గణములు పండ్రెండు సిద్ధసాధ్యమంత్రములని యుపాసనచే సాధింపదగినవి, మంత్ర క్రియా భేదములు దివ్య వర్గమునను సాధ్యులుందురు ఇచ్ఛాశక్తి స్వరూపిణి సాధ్యా, వ్యవహారయోగ్యమగు పక్షమై యున్నది 2) పంచాంగమందు యనుకూలమైన యోగము ఆమె ప్రసన్నయైన సర్వమును సాధ్యమే

454) ఓం ప్రసాదిన్యై నమః

కోర్కెల ప్రసాదించు శక్తియై యున్నది ప్రసన్నతాకారకమైన శక్తి ప్రసన్నురాలైన దేవి భక్త రక్షణార్థమై సదా సిద్ధము పుత్రపౌత్ర ధనధాన్య హస్తి, అశ్వ, అజా, అవి, గో,రథాది సంపత్తుల ప్రసాదించు శక్తియును, 'ఆరాధితాస్తుతాసైవ సర్వసిద్ధి ప్రదాయినీ' 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యంబకే దేవి' 'కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మోనమోనమః' 'సర్వస్యార్తిహరే దేవి' యనియు వైశ్యవణికు ఖండజ్ఞానమును, సురథునకు అఖండ రాజ్యమును ప్రసాదించిన దేవి, దుర్గాభగవతీ, భద్రా, శాకంభరీ, సర్వభూత హితేశ్వరీ, క్షిప్రప్రసాదినియును ఆమెయే

455) ఓం మధ్యమాయై నమః

నడితరవయసు గలిగినది నాయికా భేదములలో మధ్యయను నాయికా భేదము అందు శ్రేష్ఠమైనది సకల కళాభ్యస్తమైన సమ్మోహన పరుచు, వాత్సల్యరూపమైనట్టి దేవి, మంచి నడుము సొంపు గలది సర్వజనాహ్లాద కారిణి

456) ఓం అనంత గుణిన్యై నమః

అనంత గుణములు గలది ఐశ్వర్య, వీర్య, యశః, శ్రీ, జ్ఞాన వైరాగ్యాది షడ్గుణములు శబ్దస్పర్శ రూపరసగంధాది పంచభూత గుణములు. త్యాగ, శౌర్య, ఔదార్యాది యనేక యుత్తమ గుణములు గలది యనంత అంతము లేని లెక్కించలేనన్ని సద్గుణముల కాశ్రయమై యున్న దేవి గుణనిధి 2) సత్వరజస్తమాది గుణములు మూడైనను వృత్తిరీత్యా యనంత గుణములుగా వెలుగును 3) కాల, కులనామ, జ్ఞాన చిత్తనాద బిందుకాల జీవవ్యూహములను తొమ్మిది యనేక సంవిధాన రూపములైన పరమేశ్వరి యనంత గుణరూపిణిగానుపాసించబడును 4) ప్రసన్నద, వర, దాన, క్షమాది సుసంపన్న గుణయుత మహాదేవి ప్రకృతి స్వరూపిణి

457) ఓం సర్వలోకోత్తమాయై నమః

అన్ని లోకముల నుత్తమురాలు ఊర్ధ్వలోకములు ఏడు, యధోలోకములు యేడు లేక స్వర్గ, మర్త్య, పాతాళలోకముల యుత్తమురాలు, పూజ్యురాలు, పరిపాలనాకర్త్రి, ఆద్యా, పూజ్యా, శ్రేష్ఠా, గరిష్ఠయైనది. బ్రహ్మేశ గుహ విష్ణునాంచతథేంద్ర స్య చశక్తయ' వినిష్క్రమ్యతద్రూపై చండికాయయౌ 'లక్ష్మీర్లజ్జే మహావిద్యే శ్రద్ధే పుష్టి స్వధే ధృవే' అంతయు యామె విభూతియైన ఉత్తమరూపము

458) ఓం ఉత్తమాయై నమః

ఉత్తమురాలైనది అనుత్తమాయని దేవి నామము అమెకాక మరొకరాపదమున కర్హులుగారు శ్రేష్ఠత, విష్ణు, మేటి, గుణాంత్య, గుణోత్తమా, గుణాతీత, ఉత్కృష్టస్వరూపమైనది సర్వోత్తమా 2) దేవతలలో సహస్ర దళ పద్మస్థ, యశస్విని స్వరూపిణి, మహావిద్యా, మహామాయా, మహామేధా మహాస్మృతి, మహామోహాచ భవతీ మహాదేవి, మహాసురీ, అన్నింటను యుత్తమస్థితి (457 458 కలిపి 'సర్వలోకోత్తమాయ నమః' యనియు వ్యవహరింపదగును ఉత్తమోత్తమము అతిశయ భేదము

జయదా జిత్వరీ జైత్రీ జయశ్రీర్జయశాలినీ
సుఖదా శుభదా సత్యా సభాసంక్షోభకారిణీ (73)

459) ఓం జయదాయై నమః

జయమును కలుగజేయునది ఉత్తమ ఉపాసకులకు నాత్మజ్ఞాన ప్రసాదమున సంసార కర్మల సడలింప జేసి యాత్మజయమును చేకూర్చునది. జయదా- సర్వత్రా జయస్వరూపిణియై భక్తులకు విజయము గలిగించు శక్తి. 2) వరాహ పర్వతమున జయయను పేర దేవత వరములిడును 'ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి తదా తదావతీర్యాహం' అని లోకముల అసుర సంతప్తమైనపుడు అవతారమెత్తి సద్భక్తులకు జయము చేకూర్చు శరణాగత దీనార్తయై లోకముల పాలించు దేవి ,

460) ఓం జిత్వర్యై నమః/ఓం జిత్వరాయై నమః

జిత్వరియైన దేవి, జిత్వరియన జయిష్ణుశక్తి, సదా జయమునే పొందునది. దేవీ సూక్తం 'అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృథివీ ఆవివేశ' 2) ఇంద్రియాణామధిష్ఠాత్రీ, భూతానాం చాఖిలేషుచ భూతేషు సతతంతస్యై వ్యాప్తైదేవ్యై నమో నమః అట్టి దేవి ప్రసన్నత వలననే జితక్రోధ, జితకాములై యోగులు వర్తిల్లుదురు

461) ఓం జైత్ర్యై నమః

సదా విజేతయైన దేవి రూపము మధుకైటభ సంహారమునకై భ్రూవిక్షేపముననే, మహిషాసుర శుంభ నిశుంభ, రంభ, రక్తబీజ, అరుణాసురాదులందరినీ దండించి, ఓడించి, ఓటమి ఎరుగక సదా విజేతయై నిలిచినది జయిష్ణు శీలయైనది పై పదముల విస్తృతరూపమే పర్యాప్తభావము వెలి బుచ్చును

462) ఓం జయశ్రియై నమః

జయలక్ష్మీరూపమునైన దేవి 1) జయయను ముఖ్యశక్తిరూపమున జాలంధర పీఠస్థ సంజ్ఞ గల యనాహత చక్రమునకు నా జయయే ముఖ్యశక్తి స్వరూపిణియై వోడ్యాన పీఠమనబడు భ్రూమధ్య యాజ్ఞాచక్రముననూ, యటులే శ్రీ చక్రమందలి సర్వానందమయ చక్రస్థయైనట్లు, జయాశక్తి వర్ణింపబడినది 2) ధ్యానించు వారలకు సర్వత్ర విజయీ భవేత్ యని జయశ్రీయైన గెలుపురూపమే వారిది 3) శుద్ధలక్ష్మిర్మోక్షలక్ష్మీ జయలక్ష్మీ సరస్వతీ-యని మహాలక్ష్మీ విభూతి రూపమై యున్నది

463) ఓం జయశాలిన్యై నమః

జయశాలిని యైన దేవి శాలినియన ప్రకాశించునది. జయమందగా నేర్పరి, యుద్ధమందు యెదిరి శక్తుల జయించుట, ప్రతివ్యూహ మేర్పరచి, యరిప్రయోగముల భస్మపటలము చేయుటయు, సదా జయమునే వరింపజేయు శక్తి, అపరాజితా రూపమునై యున్నది రణరంగములందు, యరిప్రయోగ ధ్వంసనాది క్రియల సాటిలేని మేటి శక్తియైనది

464) ఓం శుభదాయై నమః

శుభముల నిడునది 'కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై' పరమేశ్వరి తన భక్తులకు సమస్త శుభములు గలుగజేయును అనంత శుభమగు మోక్షమును ప్రసాదించు శక్తియు నామెయె 'కల్యాణ వృష్టిభి రివామృత పూరితాభి లక్ష్మీస్వయంవరణ దీపికాభిః' అంటు కరుణయు 'సర్వమంగళ మాంగల్యే శివే

సర్వార్థ సాధకే శరణ్యే' యనియు 'సిద్ధిదా, బుద్ధిదా, శాంతా, సర్వమంగళ దాయినీ' 'సర్వదేవ మయీం ఈశాం లక్ష్మీం పూజయేత్, సర్వలోకానాం ప్రభుర్భవేత్' 'ఆరాధితాస్తుతా చైవ సర్వసిద్ధి ప్రదాయినీ' అట్టి శుభద రూపమామెది

465) ఓం సుఖదాయై నమః

సుఖముల కలిగించు దేవి ఐహికాముష్మికాది సమస్త సుఖములను, కైవల్యమును ప్రసాదించు దేవియై యున్నది సుఖములు రెండు విధములు, 1) విషయములు ఐహికం, 2) పరమ సుఖము ఆముష్మికము, 3) ఇంద్రియముల వలన గ్రహింపబడినది, స్వల్పకాల మాత్రానుభవము గలిగినది కాలవ్యవధి యంతమును గలది అంతమున దుఃఖమును గలిగించునదియును వానిని సంపాదించుటలో దేహయాసం, ధనవ్యయం, మనః చంచలత గలుగును, భోగముల తృప్తి గలుగదు తన్నాశమున యపార దుఃఖమును గలుగుచుండును రెండవది ఆధ్యాత్మికము, భక్తి, ఉపాసనామార్గముల సర్వక్రియా ఫలములు పరమేశ్వరాంకితము చేయుచు, యాత్మజ్ఞానము గలిగి నిత్యనిరతిశయ జ్ఞానామృతమును గ్రోలుచు, సచ్చిదానంద మూర్తిగా, సహస్రార చక్రస్థలిందు తేజమున, సంలీన మగుట అదియే మోక్షము

466) ఓం సత్యాయై నమః

సత్యస్వరూపయైనది. కాలత్రయేపి, బంధుకాన్యామ్ 'సత్యం సంవేదనం శుద్ధం బోధాకారం నిరంజనం। సర్వం సర్వగతం శాంతమస్త్వ వస్తుమితోదయం సత్యం ఆయతమ్' సత్యమే వ్రతముగా గలది 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని బ్రహ్మ స్వరూపమైనది సర్వకాలాతీతమై వెలుగొంది, త్రికాలారాధ్యగా భక్తాభీష్టముల నెరవేర్చుచుండును వరదయగుచు సత్యనిరూప శక్తిగా, యసుర సంహారము చేయుచు శాంతిని నెలకొల్పును

467) ఓం సభాయై నమః /ఓం సఖ్యై నమః

సభ స్వరూపమైనది, సత్యమే వ్రతముగా గలది. 1) సభయన పండితుల సమూహము వేదవిదుల ఘోషయుతము నిండు సభయందు వివిధ సంస్తుతుల సదాశివ వామస్థయై కొలువు దీర్చియుండిన శక్తి స్వరూపము శాసకిగా, శరణాగత దీన ఆర్తులగు వాంఛితార్థములనిడు ప్రసన్నకూటమి రూపము 2) సఖియన మిత్రత గలది అనుచరి మిత్రత యన ఆపదలయందు తోడు పడునది హితవు చేయునది 'త్రైలోక్య స్యహితార్థాయ వధిష్యామి మహాసురం' త్రైలోక్య ప్రాణులకు పోషణీ, హితవు చేకూర్చునది బిడ్డలవలె పాలించు శక్తి భక్తానుగ్రహ కారిణిగా వెలగును

468) ఓం సంక్షోభకారిణ్యై నమః

సంక్షోభము గలిగించుశక్తి శ్రీచక్ర చతుర్థావరణయందు సర్వసంక్షోభిణీ శక్తి గణము కొలువుండి యుండును సర్వసౌభాగ్య దాయక చక్రము అగుముల నల్లకల్లోలము సృష్టించు సమర్థత కలిగిన శక్తి కూటమి. తామసీ సంహార శక్తి సామర్థ్యము గలదియై యున్నది ప్రళయరూపిణీ

శివదూతీ భూతి*మతీ విభూతి ర్భీషణాననా ర్భీష
కౌమారీ కులజా కుంతీ కులస్త్రీ కులపాలికా(74)

469) ఓం శివదూత్యై నమః

శివుడు దూతగా కలిగినది 'యతోనియుక్తో దౌత్యేన తయాదేవ్యా శివః స్వయమ్ శివ దూతీతి,లోకేఽస్మిన్ తతః ఖ్యాతిముపాగతా' శుంభ నిశుంభుల కడకు శివుని దూతగా పంపి యున్నందున శివదూతియైనది. 'శివదూతీ స్వరూపిణి హతదైత్యే మహాబలే ఘోరరూపే మహారావే నారాయణి' యని వర్ణన దూతత్వమున నియమించు వారలు విశ్వాసపాత్రులై శత్రుబలభేదినియై యుండగల సమర్థుడు 2) సదాశివుని సాన్నిధ్యము గలుగుటకు శివభక్తియే దూతిక యగుచున్నది.

ఈశ్వరానుగ్రహము లేక (జన్మ) సఫలము, ఆత్మసాక్షాత్కారముగా గలుగును 3) షోడశీతిథి నిత్యలందు శుక్లపక్షము నందలి సప్తమీతిథి నిత్యగా నున్నది 4) పుష్కర క్షేత్రాధిష్ఠాత్రి శివదూతి, సదాశివ రూపిణి, విద్యాస్వరూపము, సదాశివుని సహచరియునై యున్నది పైనున్న సభాపదము పఠింపును

470) ఓం భూతపత్న్యై నమః

భూతనుతియైన దేవి 'నమః ప్రకృత్యై భద్రాయై' యని ప్రకృతి పంచభూతముల సముదాయమే యైనంయున ప్రకృతి మతి గలది 2) 'ఇంద్రియాణాం అధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషుయః భూతేషు సతతంతస్యై వ్యాప్త్యై దేవ్యై నమో' యని సర్వభూతహితే మాతా ఏహ్యేహి యని యావాహనా క్రమము ఆమె భూతమతి యన తెల్పును

471) ఓం విభూత్యైనమః

విభూతిరూపమైన దేవి ఐశ్వర్యము శివుడు ధరించు భస్మము, విభూతి అంశము విశేష వివిధ భావములని 1) పుత్ర, పౌత్ర, ధన ధాన్య హస్త్యశ్వాది గోరథమ్‌- మొదలగు నైహికమైశ్వర్యములు 2) అంతిమ లయ స్థితి అన్నింటికి భస్మరూపమేగాన శివుడు శ్మశాన విభూది ధరించును వైరాగ్యమునకు సంకేతము 3) అంబయే యసుర సంహారమందు శత్రుసైన్యములు యధికమైనపుడు తన విభూతులైన బ్రాహ్మణ్యాదియష్టశక్తుల వెలిజేసి సంహరించినది 4) మహామాయాశక్తి అవసరమైనపుడు శాకంభర్యాదియవతారముల ధరించి యంతగా వెల్గొందును 5) సృష్టి స్థితి, సంహార, తిరోధానయనుగ్రహాదులన్నియు నామెకు నిత్యక్రీడలే

472) ఓం భీషణాననాయైనమః (ఓం భూషణాననాయై నమః)

భీషణమైన ముఖముగలది ।'కోపేనచాలస్యా వదనం ఘహీవర్ణమా భూత్తదా? భృకుటీ కుటిలా' యను భీషణాననముగలది అపార సంహార వేళల భీషణ హుంకారాదుల గర్జనల తేరిపార చూడలేని భయదాననము రౌద్రరూపి, ఉగ్రశక్తి ।'కాళీ సముత్పత్య గగనం క్ష్మామతాడయత్' యను ఉగ్రరూపము, ముఖమును గల్గినది ।'కాళీకరాలవదనా' ।'కాళీ కరాళ వక్త్రాంతర్గుర్దర్శ దశనోజ్జ్వలా'యని వర్ణన

473) ఓం కౌమార్యైనమః

నిత్య కుమారీ స్వరూపమైనదేవి ।'కౌమారీ శక్తి హస్తాచ మయూర వరవాహినీ। యోద్ధుమభ్యాయయౌ గుహరూపిణీ' ।'దైత్యాన్ జఘాన కౌమారీ తదాశక్త్యా...తికోపనా- పరమేశ్వరీ విభూతులలో స్కంద పత్నియైన కుమారీశక్తి, బాల హంసక గృహ నిరోధినిగా ప్రసిద్ధిగాంచినది కుమారస్వామి శక్తి 2) పండ్రెండేండ్ల కన్యకను కుమారి యందురు కుమారీ తంత్ర విద్యగలదు కౌమరితయునగును హిమవంతుని పుత్రికగా, దక్ష కన్యకగా, కన్యాకుమారి శక్తిగా పూజలందుకొనును

474) ఓం కులజాయై నమః

కులజయైన స్త్రీ కులాంగన ఇంద్రియ సమూహమునందు వ్యవస్థితయైనది కులము - వస్తు సమూహ, జాతి వంశ స్వభావ వర్తనము సూచించును పాతివ్రత్యాది సుగుణ సంపద గలయున్నత వంశమున బుట్టినది ప్రకృతిరూపిణి, సర్వాంతర్యామియైనది కుండలిన్యాది చక్రస్థితయై యుపాసకులకు నున్నత లోకముల ప్రసాదించు శక్తియునైయున్నది ఆమె యటుయెడు తరము లిటు యెడు తరముల తరింపచేయు ప్రత్యక్షమోక్ష కారణశక్తియునై యున్నది

475) ఓం కుంత్యైనమః

కుంతీ రూపిణియైనదేవి మిక్కిలి కోపముగలది ఉగ్రతారారూపిణి భక్తిపరముగా యతి సామ్యా, శత్రుపరముగా నతిచండా 'దుర్గాయై దుర్గాపారాయై రూపమై యున్నది తతోద్వాతసట, 'కోపాత్'

యను రుద్రాణి శక్తి 2)కుంతి పాండవుల మాత, యొక దేశము కుంతీదేవి యర్చన, యరుంధతీయర్చనలని కొన్ని పర్వములలో ప్రచారమునున్నది

476) ఓం కులాంగనాయై నమః

కులాంగనయైనది ముందు వివరింపబడినట్లు ఉన్నత వంశ క్రమముగల స్త్రీ సత్కుల, రూప, విద్యాశీల స్వభావములు గలది మనోవాక్కాయ కర్మల పతివ్రతయై యనుసరించు కులనారీరత్నము అట్లే సుషుమ్నా మార్గమున సంచరించు ముఖ్యప్రాణ స్వరూపిణి, హంస స్వరూపిణియేమియె

477) ఓం కుల పాలికాయై నమః

కుల రక్షకియైన దేవి కుల ధర్మముల పాలించునది వర్ణ ధర్మము ఆశ్రమ ధర్మము వంశ పారంపర్య ధర్మము విద్యాక్రమము, ఆచార ఉపాసనా విధానము కాపాడుచుండును 2) ఊర్ధ్వ అధోగమన ములుగల ముఖ్యప్రాణస్వరూపిణి, గమనమున విశ్రమస్థానముల ననుసరించు నదియగుచు కుల ప్రతిపాదక గ్రంథములు, ద్రవ్యముల, సంకేతముల యొక్క రహస్యము రక్షించుచు పాలించునది

కీర్తిర్యశస్వినీ భూషా భూష్యా* భూత పతిప్రియా భూష్యా
సుగుణా*నిర్గుణాఽధిష్ఠా నిష్ఠా కాష్ఠా ప్రకాశినీ(75)సగుణా,దృష్టా,ప్రతిష్ఠితా

478) ఓం కీర్త్యై నమః

కీర్తి స్వరూపిణియైనది ప్రఖ్యాతినందిన శక్తిస్వరూపిణి 'విశ్వేశ్వరీ జగద్ధాత్రీ, స్థితి సంహారకారిణీ'యనియు, 'సౌమ్యా సౌమ్యతరాశేష సౌమ్యేభ్యస్త్వతి సుందరీ'' పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ''దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః 'సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యంబకే' యనబడుచు బహుళ కీర్తిగల దేవి

479) ఓం యశస్విన్యై నమః

యశస్వినియైన దేవి కీర్తికి పర్యాయపదము యశస్సు. మేధా స్వరూపముగా నున్నది 2) తస్యనామ మహద్యశః' యని సిద్ధేశ్వరీ, సిద్ధవిద్యా, సిద్ధమాతా యనబడుచు సకల ప్రపంచముకు సర్వ సిద్ధిప్రదాత యగుచు యశమును గల్గియున్నది 3)సహస్రారచక్రాధిష్ఠాత్రియగు దేవత కీనామముగలదు ।'త్వం శ్రీస్త్వం మీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా లజ్జాపుష్టి స్తథాతుష్టి స్త్వంశాంతిః క్షాంతి రేవచ' యని పలు విధములు యశోగానమును దేవతలు మనుజాలు చేయుచుందురు

480) ఓం భూషాయై నమః

భూషారూపిణి యైనది అలంకార రూపమైనది 'మహా పద్మవనాంతస్థే కారణానంద విగ్రహే, సర్వావరణ సంయుతే, సర్వభూత హితేమాతా' అష్టవిభూతులైన శక్తులు స్వస్థానముల దివ్య కర్ణికా మధ్యమున ఏకా । కామేశ్వరాంకస్థయై ద్వైధీభావము గల్గించుచు విరాజిల్లునది త్రిశూల చంద్ర హిధరే మహా వృషభవాహినీ మహేశ్వరీ స్వరూపము

481) ఓం భూష్యాయై నమః / భూష్యాయై నమః

అలంకరింపబడినది దేవి స్వరూప వర్ణనలో సర్వమాంగల్యయుక్తా ప్రాణశక్తియనియు పాశాంకుశ పాశమభీతి ముద్రాం, కరైర్వ హంతీం కమలాసన స్థాంయని లక్ష్మీసూక్తము చండికకు అమల హారం, చూడామణి కుండల కటకముల, అర్ధచంద్రకేయూర, నూపురా ద్యలంకరణాలు శూల, చక్ర, శంఖ, శక్తి బాణ, వజ్రకులిశాద్యాయుధములచే నలంకరింపబడినది అట్లులే కుంకుమ చందనోక్షిత, కర్పూరాగరుధూపాది సేవ్యమానదేవీరూపం

482) ఓం భూత పతిప్రియాయై నమః

భూతపతికి ప్రియురాలైనది. భూతపతియైన పరమేశ్వరుని యర్ధాంగి. భూతములనగా శివ

గుణములు. ఆకాశ, వాయు, వహ్ని, జల పృథ్వీ రూపములైదును వీనికి యధిపతి శివుడు, శివునికి ప్రియ పార్వతియై యున్నది 2) కృష్ణపక్షమును సూచించును 3) భూతానాం చాఖిలేషు చయా వ్యాప్త్యై దేవ్యైనమోయని శక్తి వ్యాపక తత్వము 4) ఈశానః సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతి యని ఈశుని శక్తి పార్వతియే

**483) ఓం సగుణాయై నమః/ఓం సుగుణాయై నమః**

గుణయుతమైన శక్తి ఐశ్వర్య, వీర్య, యశ, శ్రీ, జ్ఞాన, వైరాగ్యములను షడ్గుణములును, శబ్ద, స్పర్శ రూప రసగంధాది పంచభూతాత్మక గుణములు, త్యాగ వీర, శౌర్య, ఔదార్యాది భావ గుణములు. ఇట్టి విశేషసుగుణములన్నియు ప్రాపుగా గలిగిన సగుణ సుగుణరూపిణియైనది. 2) సత్వ, రజస్తమో గుణయుతగా నాయా సందర్భముల పాలించు శక్తి 'విసృష్టౌ సృష్టి రూపాచ, స్థితిరూపాచ పాలనే। తథాసంహృతి రూపాంతేయని రజస్సత్వతామసగుణాశ్రయ

**484) ఓం నిర్గుణాయై నమః**

నిర్గుణరూపిణియైనది గుణరహితయును 'నిర్గుణో నిష్క్రియో నిత్యోనిర్వికల్పోనిరంజనః నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽస్మి నిర్మలః అవ్యక్తం కారణం యత్తదక్షరం పరమమ్ పదమ్ నిర్గుణం శుద్ధ విజ్ఞానం పదాపశ్యంతి సూరయః సాక్షీ, చేతా, కేవల, యస్మాన్నాస్తి పురుషాద్భిన్నాత్ర ఘనాత్ పరం కించిదపి వస్త్వంతరం తస్మాద్ సూక్ష్మత్వ, మహత్వ ప్రత్యగాత్మత్వానాం సాకాష్ఠా నిష్ఠా పర్యవసానం సర్వప్రత్యగ్రూపం పురుషాన్న పరంకించిత్ సాకాష్ఠా సాపరాగతిః 'ప్రకృతిస్త్వంచ గుణత్రయ విభావినీ, పరాప్రకృతి గుణాతీత స్థితి లక్షణములచే నిరూపించబడరాని సాత్వికాదిగుణ, పంచతన్మాత్ర, గుణహీనురాలైన చిన్మాత్ర సాక్షిస్వరూపి, సాక్షిచేతాకేవలా, నిర్గుణశ్చ యను నిర్గుణరూపిణి పరమేశ్వరి

**485) ఓం తృష్ణాయై నమః/తధిష్ఠాయై నమః**

తృష్ణ రూపిణి 'యాదేవి సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా' యని సర్వవ్యాపకత్వము గలట్టి దేవి. 'తృష్ణయన దప్పిక, లోభము, వ్యాధి'యని సకల జీవులయందు ఆకలిదప్పులు శరీర స్వాభావిక ములు, అందులకే పంచయజ్ఞములు చేయుదురు బలులనిత్తురు ఆ తృష్ణాశక్తి ఆమెయే

**486) ఓం నిష్ఠాయై నమః**

నిష్ఠారూపిణి యైనది ఉత్కృష్టమైన నిష్ఠ బ్రహ్మజ్ఞానం ఆత్మయందు లయభావన చేసి తురీయావస్థస్థితి నందుట నిర్గుణాత్మక స్వరూపమున నుండుట జ్ఞానస్వరూప మాత్రముగా నుండుట. స్వయం తిష్ఠదయం సాక్షాద్బ్రహ్మ విత్ ప్రవరోమునిః ఈదృశీయం పరానిష్ఠాయని సాక్షాత్ బుద్ధినిలయింపజేసి బ్రహ్మైక్యసమాధినందుట నిష్ఠ, అట్టి రూపమామెది

**487) ఓం కాష్ఠాయై నమః**

కాష్ఠ స్వరూపిణియైన దేవి కళాకాష్ఠయన కాలపరిమాణము జ్యోతిశ్శాస్త్ర ప్రకారము పదునెనిమిది నిమేషముల కాలము. 2) సూక్ష్మకాల స్వరూపమనియు, వేదాంత వాక్యార్థ నిర్ణయమును కాష్ఠా యందురు 'సాకాష్ఠా సాపరాగతి' గమ్యస్థానం పరమేశ్వరియే 'వేదాంత వాక్యానాం నిష్ఠా కాష్ఠేతి కథ్యతే (సూ సం.కార్యానాం) 3) గగనాత్మకుడగు భీముడను పరమశివునియొక్క పత్ని దిక్స్వ రూపిణి యగుటచే కాష్ఠా యనబడును వీరి కుమారుడే స్వర్గనామధేయుడు 'మహామహిమ్నో దేవస్య భీమ స్య పరమాత్మనః దశస్వరూపాదిక్ పత్నీ (లిం పు)

**488) ఓం ప్రతిష్ఠాయై నమః/ఓం ప్రకాశిన్యై నమః**

ప్రతిష్ఠితయైన దేవి పరమేశ్వరి సకల జగత్తున కాధారరూపము అధిష్ఠాత్రి ప్రతిష్ఠా సర్వవస్తూనాం ప్రతిష్ఠా పరమేశ్వరి పరమేశ్వరియందు సర్వము ప్రతిష్ఠింపబడి యున్నందున ప్రతిష్ఠితా 'స్వమహిమ్నిస్థితా ప్రతిష్ఠితా' అన మహిమయందు తానే ప్రతిష్ఠితమైనది ప్రకాశించునదియును

2) ప్రతిష్ఠా కలారూపయైన దేవి 'అతి సౌమ్యాతి రౌద్రాయై నతాస్తస్యై నమోనమః నమో జగత్ ప్రతిష్ఠాయై దేవ్యైనమోనమః' యని జగత్తున ప్రతిష్ఠితమైన దేవి

ధనిష్ఠా ధనదా ధాన్యా* వసుధా సు(స్వ)ప్రకాశినీ ధన్యా
ఉర్వీ గుర్వీ గురు శ్రేష్ఠా షడ్గుణా* త్రిగుణాత్మికా(78) సగుణా

489) ఓం ధనిష్ఠాయై నమః

ధనిష్ఠారూపియైన దేవి ధనిష్ఠ యన యతిశయ ధనవతియు, వసుదేవతాధిష్ఠిత ధనిష్ఠా నక్షత్రమునగును. ధనము లక్ష్మీ స్వరూపము మహాలక్ష్మి పరమేశ్వరీ రూపమే యగుటచే ధనిష్ఠ యనబడును 'పుత్రపౌత్ర ధనధాన్య హస్త్యశ్వాద్యవిగోరథమ్ ప్రజానాం భవసి మాతా' యనియు, ''ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః ధనమింద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే' యని యష్టవిధ దిగ్వ్యాప్త ధనములు చేకూర్చు ధనవతియై యున్నది. 3) రత్నభూతమహానిధిం యథా 'సిత వేధసోఽద్భుతమ్ నిధిరేష మహాపద్మః సమానీతో ధనేశ్వరాత్' యని కుబేరుని సకల సంపదలు పరమేశ్వరి యంశయే కన్యారత్నము వానికి మించినదని యర్థము 'కన్యాం కనక సంపన్నాం కనకాభరణైర్యుతాం' అందురు

490) ఓం ధనదాయై నమః

ధనమును ప్రసాదించునది పరమేశ్వరి భక్తులకు ధనధాన్యములు ప్రసాదించుచుండును యజ్ఞాచరణమున, అహంకార రహితముగా, మమ రహితము, దక్షిణారూపమున నారాధింపబడి దత్తము చేయబడునది ధనము హోమకాలమున వ్రేల్చబడునది ధాన్యము ఈ క్రియలకు ఆవశ్యకమగు ధనసంభారములు గలిగించు దేవి 'అశ్వదాయీ గోదాయి ధనదాయి మహాధనే, ధనం మే జుషతాం సర్వకామార్థ సిద్ధయ' ఉపచారములలో నొకటి నానారత్న ప్రదాం దేవీ 'సర్వలోక మహేశ్వరీ' యని ఉద్వోదక స్నాన సమర్పణము 'త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కార స్వరాత్మికా' దేవపితృ హుతములను వసు రూపములే 'భవిష్యామి సురాశ్చాపి రావృష్ట్యాః ప్రాణధారకైః' యని వసుసంపద యష్టవిధముల జీవులకు నందుబాటులో నుంచుచు జగద్ధాత్రి పోషిణియై ప్రకాశించు దేవి స్వరూపము

491) ఓం ధాన్యాయై నమః

ధాన్యస్వరూపియైన దేవి ధాన్యమును ఒక సంపద రూపమే ప్రాణి పోషణములు యజ్ఞకార్య సంభారమునునై యున్నది 2) ధాన్యం యన ధూర్తువాలిలి గల ఇల్లు లక్ష్మీప్రదము. 3) వరిగోధుమ జొన్న, సజ్జ, రాగి మొదలగు ధాన్యములు, కంది, పెసర, మినుము మొదలగు పప్పుధాన్యములు, పండ్లు, కూరలు, భూమి నుండి ఉద్భవమై సకల జీవరాశికి ప్రాణాధారము లగుచున్నవి. అట్టి శాకంభరీ రూపిణి యైన శక్తి

492) ఓం వసుధాయై నమః

వసుధ యన పృథ్వీ రూపయైన దేవి ధరణి, పృథ్వి, వసుధ సకల చరాచరములను ధరించునది. ధరణి సకలమున కాధారభూతమైన పృథ్వి, అదితి స్వరూపిణి, క్షమారూపి, సకల పోషక ధనముల ప్రసాదించునది 'వసుధ, మేదినీ, దేవి, వసుంధరా స్వాద్వసుధా, దేవి వాసవీ, బ్రహ్మవర్చసః' యని భూసూక్తం

493) ఓం సుప్రకాశిన్యై నమః

సుప్రకాశినియైన దేవి రూపము శుభజ్యోతి స్వరూపమైనది. మంచి ప్రకాశము గలిగించినది అగ్ని, విద్యుత్, సూర్యమండల ప్రభాయుతమైన దేవి 2) అణిమాదిభిరావృతా మయూఖై రహమిత్యేవ విభావయేద్భవానీమ్ యని యష్టసిద్ధుల కిరణసముదాయ యుతమైనది. 3) తేజోదాయకమగు

గోళములకు తేజము నొసంగునది యగుటచే తేజోఘన స్వరూపిణి కోటి సూర్యసమప్రభ గలిగిన పరమేశ్వరి గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ రూపముల భర్గతేజము ప్రభవింపజేసి 4) మూలాధారాది చక్రముల దివ్య ప్రకాశము వెదజల్లు కుండలినీ రూపశక్తిగా యనుభూతిని చెందుదురు

494) ఓం ఉర్వ్యై నమః

ఉర్వీ రూపమైనది ఉర్వి భూమికి పర్యాయపదము బృహత్యయుక్తాయామ్ గొప్పదియైన భూమి రూపము పృథ్వియైన నదులు, వనములు, కొండలు మొదలగు సిద్ధరూపములు పశు, జంతు సరీసృపాది యనేక జీవరాసులు, జలచర, ఖేచర గణములకు నాధారమై బృహద్రూపము ధరించినది ఉరు గాయః ఉర్వీ, అట్టి భూమాత ప్రకృతి స్వరూపిణి పర్యాయపదము

495) ఓం గుర్వ్యై నమః

గుర్వి రూపమైనది గురుమూర్తియై యున్నది గౌరవయుక్తమైనది గర్భిణి గురుపత్నియను యర్థమును గలదు ప్రకృతి నిత్యప్రసవ భూమినుండి ఆయా జంతువుల నాయావస్తువులు ఫలసంభారములు ఉత్పత్తి యగుచుండుట జీవ పోషణ చేయుటచే భూమాత, భూదేవి, విష్ణుపత్ని, పరమేశ్వరిగా నతులందుచున్నది 2) సమస్త విద్యానాముపదేష్టృత్వాత్, సర్వేషాం జనకత్వాత్ వాగురు తత్శక్తి గుర్వీ, త్రిమూర్తి స్వరూపిణి 3) శ్రీవిద్యా గురు స్వరూపముగా నున్న దేవత గుర్వీ, 4) శ్రీమేధా దక్షిణామూర్తి విద్యత్ ప్రపంచమునకు గురువు మేధ సరస్వతి వరేభూతి భాభ్రవి తామసి అని ఆమేధా రూపము పరమేశ్వరియై యున్నది శ్రీవిద్యాస్వరూపిణియామె

496) ఓం గురుశ్రేష్ఠాయై నమః

గురువులలో శ్రేష్ఠురాలై యున్నది 'గుకార స్త్వంధకార స్స్యాత్ రుకారస్తన్నివర్తకః' యని యజ్ఞానాంధ కారమును పారగొట్టి జ్ఞానజ్యోతిని వెలిగించునట్టి గురుపరంపరలలో శ్రేష్ఠురాలు 2) విద్య, బ్రహ్మవిద్య నుపదేశించువాడు గురువు శ్రీగురుః సర్వకారణభూతాశక్తి, గురుముఖతః విద్యలు నేర్వవలెను లేనిచో నిష్ఫల మగునని ప్రసిద్ధము అందు శ్రేష్ఠురాలు 3) హిమవంతునకు బ్రహ్మవిద్యనుపదేశించిన పరమేశ్వరి గురుమూర్తి యనబడుచున్నది (కేన) 3) హిమవంతునకు బ్రహ్మ విద్యనుపదేశించిన పరమేశ్వరి గురుమూర్తి యనబడుచున్నది గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః

497) ఓం సద్గుణాయై నమః/ఓం షడ్గుణాయై నమః

సద్గుణములు గల దేవి ఐశ్వర్య వీర్య, యశ, శ్రీ, జ్ఞాన వైరాగ్యములను షడ్గుణముల రూపమునై యున్నదేవి ఇవియేగాక పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శరూప, రస,గంధాదియు, త్యాగ, శౌర్య, ఔదార్యాది యనేక సద్గుణములకు నిధియైన పరమేశ్వరి సకల సద్గుణ స్వరూపియునై యున్నది

498) ఓం త్రిగుణాత్మికాయై నమః

త్రిగుణాత్మకయై యున్నది సత్వాది గుణత్రయ స్వాధిష్ఠాన భూతః పరమాత్మా-సత్వరజస్తమ గుణములు మూటికి యధిష్ఠాత్రియైన గుణాతీతగా పేరొందినది పరమేశ్వరి మూలప్రకృతి స్వరూపిణి. 'విసృష్టౌ సృష్టిరూపాత్వం, స్థితి రూపాచ పాలనే' తథా సంహృతి రూపాంతే జగతోఽస్య జగన్మయే' 'ప్రకృతిస్త్వంచ గుణత్రయ విభావినీ, కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రి శ్చదారుణా' యని యందురు 2) ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు యని త్రిశక్తుల కధిష్ఠాత్రియైనందున త్రిగుణాత్మిక 3) స్వర్గమర్త్య పాతాళాది త్రిపదములు గలవు గంగయు, హిమ, ద్రవ, వాయురూపముల త్రిపథగా వెలగు త్రిగుణాత్మిక యగు దేవి రూపము

రాజ్ఞా వాంఛా మహాప్రజ్ఞా సుగుణా నిర్గుణాత్మికా
మహాకులీనా నిష్కామా సకామా కామజీవనా(77)

599) ఓం రాజ్ఞ్యై నమః

రాజ్ఞియైన దేవి కామేశ్వరునితో పట్టాభిషిక్తురాలైన కామేశ్వరీదేవి సదాశివుని యర్ధాంగియైన గౌరీరూపము సకల చరాచరప్రపంచమునకు పరిపాలన, పోషణకర్త్రి యగుటచే భువనేశ్వరి దేవ, ముని, రాజసమూహములచే నర్చించబడుటచే, నాత్మవైభవము గల్గి ప్రభ్వి యగును 'సర్వదేవమయీమీశాం లక్ష్మీ మీమాంన్నపపూజయేత్, సర్వలోకానాం ప్రభుర్భవేత్' యని భక్తులకే విశేష ప్రభుత నాపాదింప జేయుశక్తి మాతా మహారాజ్ఞిగా ప్రసిద్ధము

600) ఓం ఆజ్ఞాయై నమః

ఆజ్ఞా స్వరూపిణియైన దేవి రెండు దళములు గల భ్రూమధ్యమందున్న యాజ్ఞాచక్రమున కధిష్ఠాత్రి హాకినీ దేవిరూపమును, ఆజ్ఞాచక్రాబ్జ నిలయా యనబడు సిద్ధమాత సంజ్ఞ గల దేవత ఆజ్ఞాచక్రము 2) గంగ యమున సరస్వతులను ఇడా, పింగళ, సుషుమ్నల సంగమ స్థానము కూటత్రయ, ఖండత్రయ, మండల త్రయాత్ త్రిపుర స్థానము సర్వేంద్రియ నియామక స్థానము 2) సర్వదేవ మయ శక్తియై సర్వనియంత గాదేవాసురాది సకల జీవులను నాజ్ఞ, క్రమము నందుంచునది ఆజ్ఞాశక్తియై యున్నది

ఇతి అలితశతర శ్రుతి లలితసహస్రనామమునకు పంచమశతి వ్యాఖ్యా సంపూర్ణః

601) ఓం మహాప్రాజ్ఞ్యై నమః

మహాప్రాజ్ఞురాలైన దేవి బుద్ధి కుశలత, పాండిత్యం, సర్వసాక్షి, పరమాత్మా, వేదవేదాంగవేత్త, కారణశరీరాభిమానియగు జీవుడు సమర్థుడని యర్థము అట్టి ప్రాజ్ఞత శక్తియే మహాప్రాజ్ఞ 2) పరానిష్ఠా స్వరూప స్థితియే ప్రజ్ఞాన ఘనరూపము జ్ఞానమున కన్న వేరు వృత్తి లేనిది మహాప్రాజ్ఞత ప్రజ్ఞాన ఘనత యును పాలునీళ్ళు, నీటిలో ఉప్పు కరుగు విధమున, నంతలు సర్వపదార్థ వ్యాపకమై సమత్వము నందు మహాప్రాజ్ఞత

602) ఓం సుగుణాయై నమః/ఓం సగుణాయై నమః (483, 497 పదములు చూడుము)

సుగుణములు గల దేవి సుగుణములు గల దేవి మంచి ఉన్నత భావములు, వర్తన గలిగియున్న దేవి ఆర్తత్రాణ పరాయణి, దానవుల వల్ల బాధలు గలిగినపుడు అసుర సంహారము చేసి ధర్మము నిలబెట్టును కాటకములు సంభవించిన శాకంభరి యగును కొలుచువారలకు ఈతిబాధలు తొలగజేసి యైహికాముష్మిక సంపదలందీయును సర్వలోక ప్రభుత నిచ్చును వైశ్వర్యునికి మోక్షజ్ఞానమును, సురధునిక ఖండ సామ్రాజ్య మిచ్చినది సర్వభూత హిత, దయామూర్తి, దివ్య, యతిదివ్యమూర్తి పరమేశ్వరి

603) ఓం నిర్గుణాత్మికాయై నమః

నిర్గుణాత్మికయైన దేవి గుణరహిత, గుణాతీత, ప్రత్యేక గుణ మంటూ లేక సర్వగుణముల కాధారమైనట్టి మూర్తి సాత్వికాది గుణములు, ఇత్యాది గుణములు లేనట్టి గుణాతీత ఆత్మస్వరూపిణి. నిరాకార, నిష్కలా, నిరాకులా, నిష్కామా, నిర్లేపాది స్వభావము గల నిత్యకు ఫలానా గుణాత్మమని నిరూపింపలేని యాత్మస్థితి మిత్రులు శత్రువులు, బంధువైరి గణములను భేదము గనని యభేద గుణము గలది

604) ఓం మహాకులీనాయై నమః (476 చూడుము)

మహాకులీనయైన దేవి మహాకులీనయన జీవనిత్య వ్యవహారమునకు సంబంధించి సర్వభూతహితముగా జేయు యజ్ఞయాగాది క్రతువుల కాధారమైనది 'నమః పుణ్యస్థధామా, సుప్రభో ఽభ్యుద్ధిరాకరః జ్జ్వలుశ్శాశ్వయః శాంతా, శాంతా ద్విగుణితస్వనా' యని యగ్నులు ప్రజ్వరిల్లుచుండును నిత్యవేద ఘోషల భూతలమునిండి సర్వప్రాణి సముదాయము శాంతి, తృప్తి భావముల నుండ, సర్వవస్తు సంభారముల సర్వమానవ చేతముల సాంప్రదాయ సిద్ధము నడుపు

దేవియై యున్నది సమసత్కుల, రూప, విద్యాశీలములు గల సంతతి ప్రవృద్ధమై నిత్యజీవనము సాగించు దేవి

505) ఓం నిష్కామాయై నమః

నిష్కామయైన దేవి ఏదైనా ప్రతిఫలము నాశించి చేయు కర్మ కార్యము ఆశించక చేయునది నిష్కామము 1) సంపూర్ణ కామస్యకిమిచ్ఛేతి, ఆమెయే దేవదానవులకు సకల వాంఛల ప్రసాదించునది సంపూర్ణ కామములు ఆమె యధీనమున నుండెడిది ఇంకేమి కామ్యము మిగులును కావున నిష్కామము 2) కామము బుద్ధ్యాదుల యధిష్ఠానమగు నాత్మజన్యములు పరమేశ్వరీ వానికంటే పూర్వము, అతీతము గాక కామ్యాభావ లుప్తము 3) కాముడను మన్మథుడు ఈమె ప్రసాదియే గాన మహామాయా నిష్కామ పరిపూర్ణానంత యానంద స్వరూపిణి

506) ఓం సకామాయై నమః

సకామయైన దేవి కామేశ్వరుడైన సదాశివునితో గూడియున్న పరమేశ్వరి స్వరూపమై యున్నది 2) భక్తుల వాంఛలు తీర్చి, యసుర నాశనము చేసి శాంతి నెలకొల్పు కామ్యము గలది 3) సకల భోగములు కల్పించు కామధేను, కల్పవృక్షాదియుత పరమేశి సహజముగా తన భక్తుల కోర్కెలననంతముగా తృప్తి పరుచును 4) నిత్యకామేశ్వర పర్యంకోత్సుకయును

507) ఓం కామజీవన్యై నమః

కామజీవనియై యున్న దేవి 1) పరమేశ్వరుని ఫాలనేత్రాగ్నిలో మన్మథుడు భస్మముగాగా వానికి మరల జీవనదానము చేసిన దేవి. 2) అనురక్తి కలిగించుట సహభావము ప్రేరేపించు మహామాయాశక్తి. 'వాసనాద్వాసు దేవస్య వాసితంతే జగత్త్రయమ్' యనియును 'జ్ఞానినామపి చేతాంసి సమ్మో హయతి'' సహబంధు, గృహ, స్త్రీ, సంతానా ది వ్యామోహముల పెంచుచు జగత్తుల యందలి జీవచేతన కాధారమై నిత్యక్రీడ సలుపు దేవి 3) 'విద్యాసు, శాస్త్రేషు వివేక దీపేష్వాద్యేషు కాత్యదన్యా మమత్వగర్తేతి మహాంధకారే విభ్రామయతి' యని కామజీవనిగా జగద్వ్యాప్తమైనది ఆహార నిద్రా భయమైథునాది రూపవ్యాప్తము చేయుదేవి

కామదేవకలా రామా ఽభిరామా శివనర్తకీ
చింతామణిః కల్పలతా జాగ్రతీ దీనవత్సలా(78)

508) ఓం కామదేవకలాయై నమః

కామదేవుని కామకళయైన దేవి 1) కామేశ్వరుని యొక్క కలావిభూతిశక్తియై యున్నది ఇచ్ఛాశక్తి స్వరూపిణియైన దేవి 2) కామకళ మూడు విధములు అ) బిందుత్రయం హార్ధకలా, అగ్రబిందువు కామేశ్వర స్వరూపము బిందుద్వయం కలాస్వరూపము ప్రకాశాంగ, సర్వవర్ణాగ్ర్య 'అ'కారము విమర్శాంగ సర్వవర్ణాంత్య 'హ'కారము కల్పిసి అహం యను ఆత్మమంత్రము ప్రథమ రూపము. శిష్యబోధ యందు వినియోగము 3) కామరాజ బీజమందలి 'క్లీం' కారము అందు 'క' కార 'ల'కారముల వదలి కేవల బిందుయుతతురీయ స్వరము 'ఈం' నినువారం సుకృతులు, స్వర్గాదులు, సాయుజ్యావాప్తి బీజన్యాసమున లక్ష్యమగును 4) షోడశాక్షరీ మంత్రవిద్య శివశక్తి సమైక్య రూపము షోడశకలాస్వరూపము. నిత్య కలాస్వరూపము ఐహికాముష్మిక పూర్ణఫలదాయకము కామకలాంగనా స్వరూపము సృష్టికి మునుపున్న యఖండాకార నిర్వికల్ప పరబ్రహ్మ స్వరూపముగా భావించి యుపాసింపదగును.

శ్లో॥ అగ్రబిందు పరికల్పితానన మన్యబిందురచిత స్తనద్వయం
నాదబిందు రశనాగుణాస్పదాం, నౌమితే పరశివాం పరాంతరామ్
శ్లో॥ ఈకారోర్ధ్వగతో, బిందుర్ముఖం, భానురధోముఖీ
స్తకార దహనోతాంతా, యోనిరూర్ధ్వకలాభవేత్

-ముఖం ఊర్ధ్వబిందువు సూర్యుడు అధోముఖ స్తనములుగా నగ్నిచంద్రులు, వీని సమైక్య యోని బిందువు కామకళ షోడశ కామకళలు- న్యాస స్థానములు 1) శ్రద్ధా-పాదములు, 2) ప్రీతి-గుల్ఫములు, 3) రతి-తొడలు, 4) ధృతి-భగము, 5) కీర్తి-నాభి, 6) మనోభవ-కుచములు, 7) విమలా-హృదయము 8) మోదినీ-కక్షలు 9) ఘోరా-కంఠము, 10) మదనోత్పాదికా-ఓష్ఠము, 11) మదా-గండము, 12) మోహినీ-నేత్రములు, 13) దీపినీ-చెవులు, 14) వశంకరీ-ఫాలము, 15) రంజనీ-శిరము, 16) మదనాకళ-సర్వశరీర వ్యాప్తి శుక్లపక్షమున వామాంగముల, కృష్ణపక్షమున దక్షిణాంగములు నుండును ప్రతిపదాది తిథుల క్రమము పై క్రమమగును.

509) ఓం రామాయై నమః

రామస్వరూపిణియైనది రామా యన సంగీతాదికళలలో నిపుణత గలస్త్రీ బాలభావనల రమించురూపము కోటిరతిలావణ్యమూర్తి 'రూపసౌభాగ్య కాంతీనాం సాప్రతిష్ఠా మహాశ్రియా' 'సర్వశ్రుత సదసివాక్పటుతా ప్రసూతే' మొదలగు సౌమ్య, సౌమ్యతర గుణముల కధిష్ఠాత్రి అతిసుందరి

510) ఓం అభిరామాయై నమః

అభిరామయైన దేవి అభిరామయన యతిసుందరముగు, మనోహరమైన రూపము గలది. అతి మృదుల ప్రియరూపమును, తనలోతానే లీనమై యఖండ సచ్చిదానంద రూపియై, నిత్యపరమానంద డోలల నిమగ్నయైన మహాకారణానంద విగ్రహము 'అతిసుందరీ పరాపరాణాం పరమా' ఆ పరమేశ్వరియే నిత్యలీలా వినోద, సుఖసల్లాపాదుల లీనమై కాలరూపిణియైన జగదీశ్వరి

511) ఓం శివనర్తక్యై నమః

శివనర్తకియైన దేవి 1) శివ యనగా చేతనారహిత దేహరూపము ప్రాణస్వరూపిణియైన నర్తకి యాడించినపుడే చేతన కలుగును కావున ఈ దేహనర్తనమునకు నా పరమేశ్వరియే కారణ స్వరూపిణి 2) శివుడు నటరాజు సంగినిగా శివనర్తకి యానంద తాండవము చేయుచుండును శివుని నటన తాండవము శివాని నటన లాస్యభరము సౌమ్యవలనముగల యంగ ప్రక్షేపణ గలది. 3) జగత్సృష్టి స్థితి లయ తిరోధాన, యనుగ్రహములను క్రీడలు యామె జగత్ నర్తన క్రీడాంగములే జగన్నాటక సూత్రధారి లయయుత నాట్య స్వరూపిణి యామెయే

512) ఓం చింతామణ్యై నమః

చింతామణి స్వరూపమైన దేవి కోరిన ఫలములనిచ్చునది చింతామణి అట్టి చింతామణి గృహాధిష్ఠాత్రియైన ఈశాని చింతామణి స్వభావమైన యనంత ఫలములనిడును 2) చింతితార్థ ప్రదములైన మంత్రములకుత్పత్తి స్థానము, శ్రీచక్రము మాతృకా చక్రము. బ్రహ్మాండ పిండాండములు సమాన ధర్మములు గలవిగా చింతామణి యంత గలవి వాని కధీశ్వరియైన మహాచింతామణి స్వరూప. 3) సకల చింతల దూరీకృతము చేయుచు భక్తాభీష్టము నిడు మోక్షప్రదాయినియైన యా మహేశ్వరియే కామధేనువు, కల్పవృక్షము, చింతామణి, సర్వకామ ప్రదాన సామర్థ్యములు గలవి యన్నియు దేవి విభూతులే.

513) ఓం కల్పలతాయై నమః

కల్పలత రూపమైన దేవి కల్పయన సంపాదించునది. నందనోద్యాన మందు దివ్య వృక్షముల యలంకార నిమిత్తము కల్పలతలు గూడ ప్రసిద్ధములు కోరిన వస్తువుల సృజించి యర్థుల కొసగుటచే కల్పములనబడును అట్టి అభీష్ట ప్రదాతలైన కల్పలతలు యంతగా గలిగినట్టిదేవి 2) సాముద్రిక లక్షణములలో దేవి భుజములు కల్పలతలు, మృదువైన తీవవలె నున్నవని వర్ణింతురు అట్టి భుజాసంపదలు గల దేవి 3) కల్పమనగా బ్రహ్మది యొక్క చతుర్యుగముల కాల సముదాయము అట్టి కల్పముల నెన్నింటినో వరుసక్రమమున పెరుగు లతారూపమును ధరించిన దేవియని యర్థము

514) ఓం జాగ్రత్యై నమః

జాగరూకురాలగు దేవి ప్రతి జీవికి, జాగ్రత్ స్వప్నసుషుప్తి యను మూడు యవస్థలు గలవు అందు జాగ్రదవస్థాభిమానియైన జీవుడు విశ్వుడనియు, స్వప్నావస్థాభిమానియైన జీవుడు తైజసుడనియు, సుషుప్త్యవస్థాభిమానియైన జీవుడు ప్రాజ్ఞుడనియు యందురు, జీవియొక్క జాగ్రదవస్థాంత, స్థూల శరీరాభిమానియగు విశ్వరూపి పరమేశ్వరియె ఈ దశయందు జీవి సర్వేంద్రియ జ్ఞానము గలవాడై యుండును ఇట్టి సర్వేంద్రియ జ్ఞానము గల స్థూల శరీర వ్యాపారముల జరుపునది యగుటచే పరమేశ్వరి జాగ్రతి యగును

515) ఓం దీనవత్సలాయై నమః

దీనుల యెడ యభిమానము గలది ఆర్తుల యెడ వాత్సల్యము గల దేవి 'శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే। సర్వస్యార్తి హరే దేవి' 'దేవి ప్రపన్నార్తి హరే ప్రసీద ప్రసీద' యని దేవతలు ప్రార్థించినపుడు విశ్వసంరక్షణకై 'యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి, తదా తదావతీర్యాహమ్' యని వింధ్యాచల వాసిన్యాది రూపముల వెల్వడును 'దేవతాస్స్వర్గలోకే, మర్త్యలోకే చ మానవా, స్తువంతో వ్యాహరిష్యంతి' యని శత్రుబాధల తొలగద్రోలు దేవి యగును 'కల్యాణ వృష్టిభిరివామృత పూరితాభిః' యని యంత కరుణ, దీనజన వాత్సల్యత ప్రస్ఫుటమగును

కార్తికీ కృత్తికా* కృత్యా అయోధ్యా విషమాసనా కీర్తికా
సుమంత్రా మంత్రిణీ ఘూర్ణా హ్లాదినీ క్లేశనాశినీ(79)

516) ఓం కార్తిక్యై నమః

కార్తిక రూపిణియైన దేవి కార్తికేయుని శక్తి కౌమారీదేవియైనది 'కౌమారీ శక్తిహస్తా చ మయూర వరవాహినీ। యోద్ధుమభ్యాయయౌ దైత్యాన్ అంబికాగుహరూపిణీ' కుమార గణముల కధిష్ఠాత్రియైనది షడననాతు కౌమారీ, పాటలాభాసుశీలకా, రవి (12) 'బాహుర్మయూర స్థా, వరదా, శక్తిధారిణీ పతాకాంబిభ్రతీ దండం పాత్రం బాణంచ దక్షిణే' వామే చాప, మథో ఘంటా, కమలం కుక్కుటం, తథా పరశుం బిభ్రతీ నైవ, తథస్త్వభయాన్వితా' యని బాల్యగుహ నివారిణీ రూపం

517) ఓం కృత్తికాయై నమః

కృత్తికాస్వరూపిణి యైన దేవి కృత్తిక యను యారు నక్షత్రముల గుంపు. స్కంధ మాతృకలును యైనవి కృత్తికా నక్షత్రం అధిపతి యగ్ని అట్టి యాగ్నేయ రూపిణి దుర్గ స్వరూపము 'జాతవేదసే సునవామ, సోమమరాతీ యతో నిదహాతి వేదః' యని కీర్తింపబడుచున్నది అటులే 'జ్వాలాకరాళ మత్యుగ్రమ శేషాసుర సూదనం' యని యగ్నితత్వము గలదేవతయై యున్నది

518) ఓం కృత్యాయై నమః

కృత్యస్వరూపిణి యైన దేవి పంచకృత్యములు, సృష్టికర్త్రి, గోప్త్రీ సంహారిణీ, తిరోధాన కరీ యను గ్రహకరీయను రూపములు. వీనివలన ధర్మాధర్మ నివర్తితము, సర్వావస్థా వివర్జితము, తురీయత్వము, విజ్ఞానానంద రూప యధిష్ఠాన బ్రహ్మముపదేశింప బడును ఈ కృత్యముల వలన పరమును ఉత్కృష్టము, నిర్వికారము, కూటస్థములకు స్థానమైన యధిష్ఠానము తెలియనగును. కర్త్రీ, గోప్త్రీ సంహారిణీ మొదలగు కృత్యముల స్వరూపమైన దేవి కృత్యా 2) సృష్టికర్త్రీ బ్రహ్మరూపాచ, గోప్త్రీ గోవిందరూపిణీ, సంహారీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ, సదాశివానుగ్రహాచ పంచకృత్యపరాయణా

519) ఓం అయోధ్యాయై నమః

అయోధ్యా రూపిణియైన దేవి. శత్రువులచే జయింపరానిది వైరులచే యజయ్యమగు పురము 'సర్వదేవాంశ సంభూతా యా నిరూపా అమితప్రభా' అట్టి సర్వదేవమయీ శక్తిని తేరిపార చూడ నశక్యము శ్రీచక్ర నవావరణములందు బ్రహ్మాండ గోళములు క్షణములో నాశనమొనర్పగల శక్తులు పరివేష్టించి

కాపలియుండ వారిని దాటి త్రికోణ గత బిందుస్థాన, మహాపద్మవనంతస్థ కారణానందవిగ్రహారాలి దర్శనమే కష్టము అట్టి దేవితో పోరుసలుప తలపెట్టి అద్వితీయులైన శక్తులచేతనే మహిషాసురాదులు మడిసిరి 2) ఆమె లక్షణములలో నిర్గుణ, నిరాకార, నిర్లేపాది నామములను బట్టి, నిర్దేశించలేని శూన్యముతో పోరు సల్పవశము గాదు 3) శ్రీరామ జన్మస్థలియైన సాకేత నగరము అట్టి రక్షణ శ్రేణులు గల అంబ, హుంకారాదుల చేతనే భస్మము చేయుగలదు 4) జ్వాలా కరాళ మత్యుగ్ర మహిషాసురాసూదని త్రిశూలేన రక్షిత మహేశ్వరి భద్రకాళీ రూపి 5) అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ అవంతికా, పురీద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయికా

520) ఓం విషమాయై నమః

విషమ రూపము గల దేవి. టిసి, ఎగుడు దిగుడుతో పాటు కోపము గలది దారుణమైనది సంకట రూపిణియని యర్థము దంష్ట్రాకరాళ వదనం, శిరోమాలా విభూషణం, భీషణ నినాదము, 'జ్వాలా కరాళ మత్యుగ్ర మత్యుగ్రమత్యంతిదా' నామశక్తి ఇట్టి త్రినేత్రధారి, సంకట రూపిణి, జగత్రయ హితము నెంచియే కోపము చెందుచుండును అపుడు వదనము మషీవర్ణము కాలవర్ణముగా మారును

521) ఓం సమాయై నమః

సమరూపముగలది సమానాధిక వర్జితాయనబడు దేవి వర్తన అసుర బృందమును సుర బృ ందముతోపాటు పోషించునది. 'త్రైలోక్య మింద్రో లభతాం, దేవాసంతు హవిర్భుజః యూయం ప్రయాత పాతాళం, యది జీవితు మిచ్ఛాథ' యని వారిని పోషించి సమశక్తియు నామెయే 'దివాంధా ప్రాణినా, కేచిత్, రాత్రావంధాస్తథాపరే కేచిద్దివాతథారాత్రౌ ప్రాణినస్తుల్య దృష్టయ' అని వివిధ ప్రాణులయెడ సమతుల్యత పాటించుచు సమదృష్టిని పాలించును అమరులైన యసురులైనను పాలకులుగా మారుచుందురు

522) ఓం సుమంత్రాయై నమః

సుమంత్ర రూపము గలది పరిపాలనా దక్షత గలదేవి తన అనుచర బలమును, శ్రీచక్ర యంత్రస్థ వ్యాప్తము చేసి, ధర్మపాలనము చేయుదేవి 2) పరమేశ్వరి సకల భువన పరిపాలనలను మంత్రిణీ దేవియగు రాజశ్యామలయందుంచినది 'శ్రీకృష్ణశ్యామలశ్చైవ, శ్రీరామోలలితాంబికా యను విధిని రాజశ్యామల విష్ణుశక్తి, స్థితి కర్తృత్వం, ప్రపంచ పాలనము, సువ్యవస్థగల పాలిని

523) ఓం మంత్రిణ్యై నమః

మంత్రిణీ దేవి స్వరూపమైనది విషంగుడు, విశుక్రుడు యను వారిరువురు, భండాసురుని సోదరులు. వాని బాహుయుగ్మము నుండి జన్మించిన వారు, విషంగుడను వానిని మంత్రిణీ దేవియగు శ్యామలా దేవి సంహరించుట తెలుసుకుని దేవి సంతసించెను 2) విషంగుడన ప్రాపంచిక విషయాభిలాషి, విషయ లోలుడు విషదృష్టి కలవాడు విజ్ఞాన దృష్టి పోషయగు రాజశ్యామల మంత్రిణిచే చంపబడెను విశుక్రునితో యుద్ధము చేయుటకు దండినీ దేవిని పంపించినది 3) వాక్యార్థ విచారయుక్త బుద్ధి వలన ద్వైతవృత్తి భేదభావము నశించునని భావము మంత్రిణి పాలనావ్యవస్థలో ముఖ్యభూమిక నిర్వహించినది

524) ఓం పూర్ణాయై నమః/ఓం ఘూర్ణాయై నమః

పూర్ణరూపిణియైన దేవి పరిమాణము లేని సర్వపరిపూర్ణ వస్తువునైన పరబ్రహ్మ స్వరూపిణియైనది 'పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే' 2) పూర్ణతిథులు/పంచమి దశమి పంచదశి కళలలో పదిహేనవది, పూర్ణాషోడశ కళాపూర్ణావృత కళ ఆ కారాధిష్ఠాత్రి పూర్ణాయను సంజ్ఞగల పరమేశ్వరి 2) ఘూర్ణాయన భ్రమణము చరాచర జగత్తు

యొక్క భ్రమణశీలశక్తియైన దనవచ్చును

525) ఓం హ్లాదిన్యై నమః

హ్లాదినీ శక్తి రూపమైనది ఈశ్వరీ శక్తి విశేషం, హ్లాదినీ శక్తి పరాశక్తి, ఆహ్లాదినియన సుఖము, ప్రియానుభూతి కలిగించు దేవి రాధికను కృష్ణ పరమాత్మయొక్క హ్లాదినీ శక్తిగా పరిగణింతురు గోలోక సంభవా, మూలప్రకృతీ, రాసేశ్వరీ, రాసవాసినీ, రసికేశ్వరీ, లభూప రమణీ, రమ్యారాశీశీ, రమణోత్సుకా లభూప, గోపసంఘస్య రాధాయా లోమరూపతః అమెయే కామేశ్వర పర్యంకోపస్థయైన సచ్చిదానంద రూపిణి.

526) ఓం క్లేశనాశిన్యై నమః

క్లేశనాశినియైన దేవి క్లేశము యన దుఃఖము, అవిద్యారాగద్వేషాది వికృత భావనలు నశింపజేయునది 'నక్రోధోనచ మాత్సర్యం, నలోభో న అశుభాయతిః' 'భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా' యనియు, 'ఆపదామప హర్తారం దాతారం సర్వసంపదాం' యనియు, 'దుర్గా దుర్గార్తి హారిణీ' యను పదముల క్లేశము తొలగొట్టి సుఖసంపదలందియు భక్త సులభురాలుగా వెలుగు చుండును

త్రైలోక్య జననీ జ్యేష్ఠా నిర్మాంసా మల*రూపిణీ మంత్ర
తటాగ నిమ్న జఠరా శుష్కమాంసాస్థి మాలినీ (80)

527) ఓం త్రైలోక్యజనన్యై నమః

త్రిలోక జననియైన దేవి స్వర్గమర్త్య పాతాలాది మూడు లోకముల వ్యాప్తము సృష్టిస్థితి లయకారకత్వముల కర్త్రీ సృజన శక్తి జననియైనది కాన మూడు లోకముల సృష్టికి జననియైనది 'త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురం' అట్టి భద్రత గమనించు మాతృ శక్తియై యున్నది 2) 'భరిష్యామిసురాశాకైరా వృష్టై ప్రాణధారకై' యని శాకంభరిగా లోకమాతృ జననియైనది

528) ఓం జ్యేష్ఠాయై నమః/ఓం శ్రేష్ఠాయై నమః

అగ్రగణ్యురాలైన దేవి. సకల జగత్తుకంటె ముందున్న శక్తిరూపము ప్రపంచమున సృష్టికి ముందున్న దేవత జ్యేష్ఠ, ఆదిశక్తియై నందున పూజయందు యగ్రగణ్యురాలు మహా విద్యా మహామాయా, మహామేధా మహాస్మృతిః మహామోహాచ భవతీ మహాదేవీ మహాసురీ అట్టి సంతుష్ట మూర్తిని ముందుగా పూజించ వలెను. 2) 'వయసాధికః కాలాదవచ్ఛిన్నః జ్యేష్ఠోఽహం' యను స్మృతి

529) ఓం మీమాంసామంత్ర రూపిణ్యై నమః/ఓం నిర్మాంసామల రూపిణ్యై నమః

మీమాంస మంత్రరూపమైన దేవి. మీమాంసయన వేద విచారణ. విచారపూర్వకముగా వేదమంత్రముల తత్త్వమును రూపింపజేయు శక్తియై యున్నది. దేవి యదార్థతత్త్వమును తెలుపునది 2) దేహస్థ మాంసము మలములు అవిద్యాకారకములు అట్టి వికారములు లేనట్టి రూపము విషయలోలత యను మాంసము విశ్లేషము జేసి యమలిన భావముల నంటను గొలువవలెను

530) ఓం తటాగనిమ్న జఠరాయై నమః

తటాకమట్లు నిమ్న జఠరము గలది తటాకము యన జలావాసము నీటి స్వభావమును బట్టి పైన సమతలాకారము. విస్తృతముగా వ్యాపించినది అట్టి విశాల నిమ్న జఠర భాగము గలది అంట కుక్షిని సచరాచర చతుర్ధ భువనముల సంవ్యాప్తమై యుండ భరించు జఠరము విస్తృతము సమతలము, వికృతిరహితముగా నాకసము వలె వ్యాప్తము

531) ఓం శుష్కమాంసాస్థిమాలిన్యై నమః

మాంస రహితయస్థి మాలికలు గలది శుష్క యెండినది యింకినది. మాంసరహితయైన యస్థి

ధాతువు ఎక్కువ మక్కువ గల దేహభాగము అట్టి అస్థిధాతువునందు సిద్ధవిద్యాయను దేవత యధిష్ఠాత్రియై యుండును అస్తులు వృద్ధి గుణము గలవి అంత్యేష్టియందు మిగిలిన భాగములు అగ్నియందు భస్మముగాగ, యస్థి శకలములు మిగిలి యుండును వానిని నదులలో కలిపి జలావాసమున్నంత వరకు స్వర్గవాసము కల్గవలెనని ప్రార్థింతురు అట్టి యస్తులు మాలికగా గలిగిన దేవియై యున్నది కపాలమును యస్థి ప్రతీకయే

**అవంతీ మధురా హృద్యా త్రైలోక్య పావన క్షమా*           పావనీశ్వరి**
**వ్యక్తావ్యక్తానేకమయా శ్రీ శ్రుతి శివవాదిని(81)**

**632) ఓం అవంత్యై నమః**

అవంతీ రూపమైన దేవి అంబ దక్షయజ్ఞ వాటియందు యోగాగ్నిలో భస్మముగాగ నామె శరీరమును శివుడు ఉన్మత్తుడై కొనిపోవుచుండ, విష్ణువు, శ్రీచక్రముచే వివిధ యంగముల ఛేదన చేయ, ఊర్ధ్వ ఓష్ఠం పడిన భైరవ పర్వత ప్రాంతమున యవంతీ దేవిగా వెలసినది ఏబది నాలుగు పీఠములలోనిది యవంతి అచటి భైరవ మూర్తికి లంబకర్ణ నామము అట్టి యవంతీ పీఠాధిష్ఠాత్రియై యున్నది

**633) ఓం మధురాయై నమః**

మధురారూపమైన దేవి మధురాపట్టణమునందు వెలసిన శక్తిదేవకి రూపిణి 2) మధుర కంసపట్టణం అచటి కారాగారములో శ్రీకృష్ణ జననమైనది. మహామాయా తనస్వ స్వరూపదర్శనమిచ్చినదచటి అష్టాదశ పీఠ వివరణలో కంస పట్టణే చాముండీయని యారాధింపబడుచున్నది అష్టోత్తరశత పీఠ వివరణలో దేవకీశక్తి యని గలదు శ్రీకృష్ణ జననియైన దేవకి గూడ పూజ్యురాలే ఆ పట్టణమును పవిత్ర స్థలమే

**634) ఓం హృదయాయై నమః/ఓం హృద్యాయై నమః**

హృద్య స్వరూపిణియైన దేవి మనోహరమైన స్వరూపము గలది హృదయము బ్రహ్మస్థానము ఉపాసనా శ్రేష్ఠరూపము హృదయమందు నిక్షిప్తమై యుండును భావించు వారల హృదయముల కానందము గూర్చునది 'నాహంతిష్ఠామి వైకుంఠే, కైలాసే నైకుంఠే వా నయోగిహృదయే వసామి కింతు మద్భక్తా హృదయాంభోజ మధ్యమే' 2) సంస్కృత వేదమంత్రము, అశుచిత్వాది దోష రహిత యాహారము హృదయహితమునైనది

**635) ఓం త్రైలోక్యపావనాయై నమః**

త్రిలోక వ్యాప్త పవిత్రమూర్తియైనది స్వర్గమర్త్య పాతాళములను నీ మూడు లోకముల వ్యాప్తమవుచు పవిత్రమూర్తి, జనని, యారాధ్యగా, సకల జీవరాశి హితము చేయుచు, దేవముని గణసంస్తూయమానమవుచు, కరుణారస దృష్టిని సర్వసుఖ శాంతి గలిగించి యజ్ఞయాగాది రక్షణచేయు పావనమూర్తియైనది

**636) ఓం క్షమాయై నమః**

క్షమాస్వరూపిణి యైనది క్షమాగుణము గలిగి యపరాధముల క్షమించు మాతృమూర్తియైనది 'కుపుత్రో జాయేత, క్వచిదపి కుమాతా న భవతి' యని సదాక్షమాగుణము గలిగి, దేవాసురుల యెడ కనికరము గల తల్లి ధరిత్రి క్షమాగుణ ప్రతీక

**637) ఓం అవ్యక్తాయై నమః**

అవ్యక్తరూపిణియైనది శబ్దాద్యశేష, విశేషశూన్యమ్, వ్యక్తము గానిది అవ్యక్తము స్పష్టము గానిది రూపమును వదించుట కష్టము గాన నిర్దేశింప లేనట్టి రూపము గలది 2) ఇరువది నాలుగవ తత్త్వము ప్రథమ సృష్టి స్వరూపము శబల బ్రహ్మాకారము అవ్యక్తము అట్టి రూపము గలది మహామాయ, ఇంద్రియాదుల కగోచరము 3) అస్పష్టరూపమైన సకల వర్ణ సముదాయమును కుక్షియందు గలది ప్రధానము, యోని, ప్రకృతి 4) అవ్యక్తము, స్వప్నానుభూతులు అదే కారణదేహము అవిద్య,

కర్మవాసనగా వ్యవహరింతురు 5) తపసు చేతను గూడ తెలియబడని బ్రహ్మస్వరూపము అవ్యయవ్యాప్త మూర్తి విష్ణువు తత్ శక్తి అవ్యక్త

**538) ఓం వ్యక్తాఽవ్యక్తాత్మికా మూర్త్యై నమః/వ్యక్తాయై/అవ్యక్తమూర్త్యై నమః**

వ్యక్తమైన మహత్తత్వము అదియే యవ్యక్తమునైన రూపము గలది నామరూపముల జడస్వరూపమనియు, దానియందు చైతన్య స్వరూపమూర్తిగా నున్న పరమేశ్వరి వ్యక్తమగు కార్యరూపమునను, నవ్యక్తమగు కారణరూపమున నుండునది పంచభూతములకు పూర్వమేనున్న సర్వవ్యాపక మూలప్రకృతి యవ్యక్తము అందునుండి పంచభూతాత్మక వ్యక్తరూప ప్రపంచమునూ పరమేశ్వరియే 'వ్యక్తం సర్వం మారూపం అవ్యక్తంతు మహేశ్వరః' 2) వ్యక్తము, ముక్తిదము, స్వయంభూలింగము, అవ్యక్తము ప్రాపంచిక ఫలకము. శిలారూపము వ్యక్తావ్యక్తము ఐహికాముష్మిక ఫలదము, నదీ లభ్యము మూడును వ్యక్తాఽవ్యక్త స్వరూపిణీ రూపములే

**539) ఓం అనేక మూర్త్యై నమః/ఏక మూర్త్యై నమః**

ఒకే మూర్తి యనేక మూర్తి ఆద్యాయని, యేకాయని, మూలప్రకృతి ఈశ్వరియని తానే సర్వదేవ శరీరావిర్భూత మూర్తిరూపము కాలానుగుణముగా కారణమును బట్టి ననేక మూర్తులుగా, విభూతులుగా నావిర్భవించినది 'స్త్రియస్సమస్తా తవదేవి భేదా' యని యనేక రూపములు నామెయే సకల జీవకోటి చేతనాశక్తి అంతర్గత శక్తి స్వరూపిణి. ఆమెయే 'యేకా' యనేకవ్యాప్తురాలు. చేతనాచేత నాత్మక సకల ప్రపంచరూప. 'ఏష ఆత్మాఽహమవ్యక్తో మాయావీ పరమేశ్వరః కీర్తితః సర్వవేదేషు సర్వాత్మా సర్వతో ముఖః మయాతతమిదం విశ్వం జగదవ్యక్తమూర్తినా మత్స్థాని సర్వభూతాని యస్తం వేద సవేదవిత్'

**540) ఓం శరభ్యై నమః**

శరభారూపమైన దేవి ఊర్ధ్వనయనే, అష్టాపద మృగము సింహమును చంపెడు మృగము. కుమారస్వామి శక్తియు, విష్ణువు యవతారములలో వరాహావతారమున భూమి రజస్వలగా నున్నపుడు సంగమించగలిగినట్టి యసురసంహారమై మహాపరాక్రమ రూపమైన వరాహ రూపియవతార సమాప్తికి శివుడు శరభావతారమెత్తి నిజలోకము పొందెను ఆశరభ రూపశక్తి శరభః కారణ జన్మ కుమారస్వామి నిర్వచనము గల్గుటచే కౌమారీ శక్తి హస్తరూపిణి వ్యక్తమగును

**541) ఓం భీమనాదిన్యై నమః**

భీమనాద స్వరూపమైనది 'ఘోర రూపే మహారావే' యని, 'శివా శతనినాదినీ' ధనుర్జ్యా సింహ ఘంటానాం నాదాపూరిత దిఙ్ముఖా' నినాదైర్భీషణై యని భీమనాద రూపిణి సింహనాదములతో పాటుదయించిన హుంకారాది భీషణ నినాదముల రణరంగమున భూమ్యాకాశ వ్యాప్తమవుచు చెలరేగిన స్వనముల స్వరూపమునైనది

**క్షేమంకరీ శాంకరీ చ సర్వ సమ్మోహకారిణీ**
**ఊర్ధ్వతేజస్వినీ క్లిన్నా మహాతేజస్వినీ తథా(82)**

**542) ఓం క్షేమంకర్యై నమః**

క్షేమము చేయు మూర్తి 'త్రిశూలం పాతు నో భీతేః భద్రకాళీ నమోస్తుతే' 'కరోతుసానః శుభహేతు రీశ్వరీ, శుభానిభద్రాణ్యభిహంతుచాపదా' 'యాచస్మృతా తత్క్షణమేవ, రహంతి నః సర్వాపదో భక్తి వినమ్రమూర్తిభిః' 'త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురం' యని సకల జీవులయెడ సమ భావము కలిగి, సర్వక్షేమములు ప్రసాదించు దేవియై యున్నది

**543) ఓం శంకరియై నమః/శాంకర్యై నమః**

శంకర రూపిణి యైన దేవి 'శం, సుఖం కరోతీతి శాంకరీ' సుఖము, జ్ఞానము, ఐశ్వర్యము

మొదలగునవి పరమేశ్వరి యధీనములు భక్తుల కిడియానందము గలిగించును 2) ప్రతియుగాది మధ్యాంతముల స్త్రీ రూపమున (విష్ణు మాయా రూపమున) శంకరు యర్ధాంగిగా శంకరున నుసరించుటచే 'శాంకరీ సంపత్కారిణి సకలేంద్రియ నందనాలి, సామ్రాజ్యదాన నిరతాని సరోరుహాక్షి' యను రుద్రాణి రూపము

544) ఓం సర్వసంమోహన కారిణ్యై నమః

సర్వమును సంమోహన పరుచునది, సర్వప్రపంచమును భ్రమింపజేయునది 'మహామాయా హరశ్చైతేతయా సంమోహ్యతే జగత్। జ్ఞానినామపి దేవీ భగవతీ హిసా బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి' త్రిమూర్తులను సైతము సమ్మోహింపజేయు శక్తి స్వరూపిణి. భేద బుద్ధిని గలిగింపజేసి మోహింపజేయునది 2) నాలో వున్న యామహాశక్తియే బ్రహ్మను ప్రపంచమును వ్యామోహింప జేయు యనంతమాయాశక్తిచే, దేవదానవ, మానవయుత ప్రపంచము సృజించి, పోషించి లయింపజేయుదునని నెను (కూర్మ పురాణము)

545) ఓం ఊర్ధ్వ తేజస్విన్యై నమః

ఊర్ధ్వతేజస్వినియైన దేవి సర్వోపరిస్థిత తేజమూర్తియైనది స్వప్నావస్థయందున్న తైజసుడనే సూక్ష్మదేహాభిమాని యగు జీవునియందు నాత్మరూపముగా నుండి తైజసాత్మక పూర్ధ్వ ప్రకాశినిగా వెలుగును. 2) ఆదిత్య వర్ణతపసాఽధిజాతో, దేవి తేజము త్రిలోకవ్యాప్తము అందు బిబిని ప్రకాశించు చంద్ర, సూర్య సమతేజము, మణిలోకస్థిత కోటి సూర్య, చంద్ర సమతేజముల దేవి యొలిప్పారును అట్టి దివి వ్యాప్త మహత్తేజ రూపము గలిగిన దేవి 3) సర్వదేవ శరీరేభ్యో యాఽవిర్భూతా అమిత ప్రభా త్రిగుణా సా మహాలక్ష్మీ' 'నిర్గతం సుమహత్తేజ స్తచ్చైక్యం సమగచ్ఛత। 'అతీవతేజస కూటం జ్వలంతమివ పర్వతమ్। జ్వాలావ్యాప్త దిగంతరమ్ అతులంతత్తేజ సర్వదేవ శరీరజమ్' అట్టి ఊర్ధ్వ తేజస్విని సమన్వయ రూపమే పరమేశ్వరి

546) ఓం క్లిన్నాయై నమః

క్లిన్నాదేవి స్వరూపిణి కామశంకరి నిత్యాదేవి 'నిత్యక్లిన్నే మదద్రవే' యను శక్తి స్వరూపము వశీకరణ శక్తి పటలమునందు 'కామః జగతి సర్వజ్ఞాశక్తి' రూపమయినది. 2) షోడశికాదేవి రూపముల నొక విభూతి అత్యంత దయార్ద్ర హృదయము గలదేవి 3) నిత్యక్లిన్నా మధోవక్త్ర్యా, త్రిపురాం భక్తిముక్తిదాం. షోడశ తిథులలో తృతీయ నిత్యక్లిన్నయను సంజ్ఞ గలది యన్నిత్యం తత్పర్యం యని భువన పోషణకై దయార్ద్ర హృదయయగునది

547) ఓం మహాతేజస్విన్యై నమః

మహాతేజస్సు గలిగిన దేవీరూపము తేజస్సు చైతన్యాత్మక ప్రకాశము అఖండ చైతన్య స్వరూపము. స్వయం ప్రకాశయుక్తమైనది. 'యదాదిత్యం గతంతేజ' యని సూర్య చంద్రాగ్ని నక్షత్రాదుల కాంతి, ఆమె ప్రకాశ సంభూతమే సర్వజీవ హృదంతరాళముల వ్యష్టిరూపమున వెలయు సూర్యచంద్రాది శక్తియునై యున్నది 1 శ్రీచక్ర నవావరణముల నుండి పరమేశ్వరి తేజము మూడువందల అరువదియైదు కిరణ సమూహములుగా వెలుగుచుండును (త్రిగుణ15, అష్టదళ-8, దశదళ-20, దశదళ 60, చతుర్దశ-56, అష్టదళ 64, షోడశ-112, పృథివ్యాది 30 మొత్తం=365) ఈ సంఖ్య అహోరాత్రములు సంవత్సర ప్రమాణ మేర్పడి కాలవ్యక్త్యయకారకమగును 2) అగ్నిదేవుని పట్టణం తేజోవతి స్థూలమూర్తి యందు నయనములు సూర్యచంద్రాగ్ని తేజరూపములు

అద్వైతా యోగినీ* పూజ్యా సురభీ* సర్వమంగళా భోగినీ, యమవతీ
సర్వప్రియంకరీ భోగ్యా ధనినీ* పీతాశనా(83) ధరణీ

548) ఓం అద్వైతాయై నమః

అద్వైత స్వరూపిణియైనది భేద, వికల్పరహితము, ద్వైత రహితమైన రూపము అద్వైతము 'ఏకో

కామేశ్వరీ శక్తి ద్వికోపాధియోగతః పరాపరేణ రూపేణ క్రీడతి తస్య సన్నిధౌ' 'ఏకమేవాఽద్వితీయ సజాతీయ, విజాతీయ, స్వగత భేదము లేనియు లేనిది. 2) ద్వైతము వేరు తాను వేరని భావించువారు ద్వైతులు.సంకల్ప వికల్పాత్మక మానసులు,జీవాత్మైక్యమును నిర్ధారించునదియే అద్వైత స్వరూపిణి. 3) పరమేశ్వరీ శక్తి ఏకా క్రీడార్థమై పరమేశ్వరుని యర్ధాంగిగా జేసి వెలుగునది. 'విసృష్టౌ సృష్టిరూపాత్వాం స్థితి రూపాచ పాలనే, తథా సంహృతి రూపాంతే జగన్మయీ' యని బ్రహ్మవిష్ణురుద్ర రూపులకు శక్తి రూపములుగా సరస్వతీ, లక్ష్మి, గౌరీ యంశలుగా నుద్భవించునది కాని యొక్కతియే

649) ఓం భోగిన్యై నమః/ఓం యోగిన్యై నమః

భోగినీ స్వరూపమైన దేవి భోగినియనగా సుఖానందానుభవము బ్రహ్మానంద స్వరూపిణీ దేవి 2) అష్టవిధ భోగములు 1) గృహము, 2) శయ్యా, 3) వస్త్రం, 4) ఆభరణం, 5) మాంగల్యం, 6) పుష్పం 7) గంధము 8) తాంబూలం 3) భోగమనగా నివేదనము వివిధ భోగముల నారగించునది భోగిని భోగములు గలది 4) జీవుల కర్మఫలానుభవము భోగము వీనిని సంప్రాప్తింపజేయు పరమేశ్వరి భోగిని 5)భోగినీ యను సంజ్ఞగల నాగకన్యయుక్తి కలదు సకలైశ్వర్య నిలయరూపము

యోగిని–1) యోగములు నాలుగు రకములు మంత్ర,రాజ,హఠ, లయ యోగములనునవి చిత్త, వృత్తినిరోధకత్వమే యోగము అట్టి స్వరూపము నేర్పరచునది యోగిని 2) మూలాధారాది సహస్రారాంత సప్తకమలముల డాకినీ,రాకినీ,లాకినీ, కాకినీ, సాకినీ, హాకినీ, యాకిన్యాది సప్త యోగినుల స్వరూపమాది శక్తియే. 3) శ్రీచక్రావరణములందు ప్రకట, గుప్త, గుప్తతర, సంప్రదాయ, కుల, నిగర్భ, రహస్య, అతిరహస్య, పరాపర, రహస్య యోగినులు వ్యాప్తమైన బిందువు పరమేశ్వరి యైనది. అట్టి పరమయోగినీ రూపము సదాశివ పర్యంకస్థయా కామేశ్వరీ దేవియే యగును

650) ఓం పూజ్యాయై నమః

పూజ్యారాలగు దేవి. మహోత్కృష్టమైనయ ప్రతిభ గలది. సృష్టికాది యైన రూపము దేవగంధర్వ యక్ష, కిన్నర,అప్సరాది దేవగణములు రాక్షస, మనుజాలచే పూజలందు కొను పరమేశ్వరీ రూపమునై యున్నది. త్రిగుణ సామ్యావస్థగల పరమేశ్వరి పూజార్హురాలు 2) పరబ్రహ్మము నిర్గుణ నిరాకార దర్శియైనందున నైహికాభిలాషులచే పూజించలేము గాన సగుణరూపియే పూజనీయము.

651) ఓం సురభ్యై నమః/ఓం యువత్యై నమః

సురభి రూపియైన దేవి సురభికి రమ్య, ప్రసిద్ధ, సౌగంధ్య, పరిమళ వస్తువులు వసంతఋతువు, గాయత్రీముద్ర, తులసీ, మాతృకా భేదం, దివ్యగోవుయైన కామధేనువుల సూచించును, ఇవి యన్నియు ప్రకృతి స్వరూపములు. వీనియందు పరమేశ్వరి యంశ నెలకొని సకల జీవపోషణము లగుచున్నది 2) ప్రాప్త యౌవన నిత్యాషోడశికా స్వరూపము జవరాలైన స్త్రీ. 'స్త్రియస్సమస్తా తవదేవి భేదా' యని పదహారుమండి ముప్పదియేండ్ల వయసుగల మధ్యయౌవని స్త్రీజాతి రూపిణియైనది 'స్త్రీరత్నమతిచార్వంగీ ద్యోతయంతీ దిశస్త్విష' 'స్త్రీరత్నమేషా కల్యాణీ-యని కాళికా రూపము

652) ఓం సర్వమంగళాయై నమః

సర్వమంగళ రూపిణియైన దేవి అనంత కళ్యాణరూపిణి సకల శోభన గుణయుత సర్వమంగళ స్వరూపురాలైన పరమేశ్వరి 'సర్వాణి హృదయస్థానిమంగళాని శుభానిచ దదాతి చే ప్సితాల్లోకే తేన సా సర్వమంగళా' 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థసాధికే శరణ్యే త్ర్యయంబికే దేవి నారాయణి నమోస్తుతే' బ్రాహ్మణ, గో,అగ్ని స్వర్ణ ఘృత, సూర్య, పుణ్యస్త్రీ, తులసీ, బిల్వ, పుష్ప, దర్పణాదులు వీని దర్శనము మంగళకారకము వానియందాభాసించు సర్వమంగళ రూప 'లక్ష్మీర్లజ్జా మహావిద్యా శ్రద్ధా, పుష్టిస్స్వధా ధృతి మహారాత్రి, మహావిద్యాస్వరూపిణియైన దేవి జగద్వ్యాప్తరూపియై సర్వమంగళముల నిడును

553) ఓం సర్వప్రియంకర్యై నమః

అందరికిని ప్రియమును చేకూర్చునది 'క్షుత్పిపాస మలాంజ్యేష్ఠా మ లక్ష్మీం నాశయామ్యహం। అభూతి మసమృద్ధించ సర్వాం నిర్ణుదమే గృహాత్' యని యందరికి ప్రియమును, క్షేమమును గలిగించునది 'పద్మాసనే, పద్మకరే, సర్వలోకైక పూజితే' నారాయణ ప్రియే సుప్రీతాభవ సర్వదా–యని ప్రార్థించ సుఖమును చేకూర్చును 'త్రైలోక్య ప్రహితార్థాయ' సామ్యా సామ్యతరాశేష సౌమ్యేభ్యస్త్వతి సుందరీ' యని ప్రియంకర రూపము

554) ఓం భోగ్యాయై నమః

భోగ్యరూపమైనది భోగ్యమనగా యనుభవింపబడెడు శబ్దాది విషయములు ధనధాన్యఫలరూపము. 'ఇంద్రియాణామధిష్ఠాత్రీ భూతానాం, చాఖిలేషు యా' విషయ భోగానంద రూపము 2) ప్రకృతిస్త్వంచ గుణత్రయ విభావినీ ప్రకృతి జన్యశ్రాళై రావృష్టి ప్రాణధారణై 3) త్వం స్వాహా త్వం స్వధా త్వం హివషట్కార స్వరాత్మికా, సుధాత్వమక్షరే–యన పంచయజ్ఞాధార భోగ్యరూపి 4) పుత్రపౌత్ర ధన ధాన్య హస్త్యశ్వాదిగోరథం స్వరూప భోగ్యజనితానందము రూపమాదేవియే.

555) ఓం ధరణ్యై నమః/ఓం ధనిన్యై నమః

ధరణీ రూపమైన దేవి ధరణీ, పృథ్వీ స్వరూపా సర్వస్య జగతో ధారణాత్; 'ల'కార స్వరూపము అదితి స్వరూపి, క్షమాప్రతీక. 'అశ్వక్రాంతే, రథక్రాంతే, విష్ణుక్రాంతే వసుంధరా' యనియు మేదినీ దేవి వసుంధరా విశ్వవసుధా, హిరణ్యగర్భిణీ ప్రసూవరీ అనేక రత్నసంభూతా 'సముద్రవసనే దేవి పర్వతస్తన మండలే' యని సర్వప్రాణి కోటిని రక్షించుచు పోషణకై శక్తి, రత్నాదుల ధరించుటచే ధరణి/ధనపతి ధనదాయైన దేవి

556) ఓం పిశితాశనాయై నమః

పిశితాశినియైన దేవి పిశితము అనగా మాంసము వామాచారులిడు మాంసము గ్రహించునది వైదికార్థమున, కామక్రోధ లోభ మోహ, మద మాత్సర్యములను పశుప్రవృత్తుల, వివేకమను ఖడ్గమున ఛేదించి నిర్విషయమను మాంసమును పరమాత్మ కిడి సుఖానుభూతులనందుమని యర్థము అట్టి నిర్విషయ సంస్థితి రూపమైన దేహిగ జేయుటకు పరమేశ్వరి కృపయే

భయంకరీ పాపహరా నిష్కళంకా వశంకరీ
ఆశా తృష్ణా చంద్రకళా నిద్రాణా వాయువేగినీ(84)

557) ఓం భయంకర్యై నమః

భయంకర రూపిణియైనది భయంకర రూపము ధరించినది. అసుర సంహారార్థమై ధర్మప్రతిష్ఠాపనకై యుద్ధమవసరమైంది. 'నాదాపూరిత దిఙ్ముఖా, జ్వాలాకరాళ మృత్యుగ్రం, హుంకారోచ్చాట నాదిభిః రౌద్రరూపిణి గగనం క్షామతాడయత్। రూపమున అసాధువులకు భయంకరియే.

558) ఓం పాపహరాయై నమః

పాపహారిణియైన దేవి అవిద్య, అజ్ఞాన, సుకృత, దుష్కృతాదులన్నింటిని నశింప జేయునది 'మేరు పర్వతమాత్రోఽపి పాపస్య కర్మణః కాత్యాయనీం సమాసాద్య నశ్యతి క్షణమాత్రతః' కావున దేవి మంత్ర ఉపాసనా స్మరణాదుల నొనర్పవలెను 'కుంభధ్వంసిని సంహరాశి దురితం, దుర్గే నమస్తే అంబికే' 'సంపత్కరాణి సకలేంద్రియ నందనాని। సామ్రాజ్య దాననిరతాని సరోరుహాక్షి త్వద్వందనాని దురితాహరణోద్యతాని' దర్శన మాత్రమున పాపసంకటములు తొలగించును

559) ఓం నిష్కళంకాయై నమః

కళంక రహితాయైన దేవి 'శుద్ధం–అపాపవిద్ధం' కళంకము, పాపము గాని లేని దేవి రూపము శృతి రాగ ద్వేషములు, పాపపుణ్యములు, ధర్మాధర్మములు యంటని పరమానంద స్వరూపిణి దృశ్య

ధర్మములన్నియు దృగాత్మనుండి యావిర్భవించును కాన కేవలము దృగ్రూప మాత్రయగు పరమేశ్వరి నిష్కళంక యనబడుచున్నది

580) ఓం వశంకర్యై నమః

వశంకరియైన దేవి. సర్వలోక వశంకరీ యగుటచే, చతుర్దశ భువనములందలి సమస్త జీవజాలమును, నిగర్వసంపదాదుల తనయుపాసకుల వశము చేయుదేవి సర్వజన వశంకరియని పిద్ధి 'ఆరాధితా స్తుతాచైవ సర్వసిద్ధిదాయినీ' అణిమాది గుణాధారాం అకారాద్య క్షరాత్మికాం యయిన దేవి సర్వ వశ్యకరీ శ్రీచక్ర చతుర్ధావరణార్చనయందు, సర్వతో వశంకరిణీ వశీకరణ శక్తి దేవ్యంబాయని పూజింతురు ప్రథమావరణార్చనలో వశిత్వసిద్ధి దేవ్యంబాయని తృతీయావరణలో సర్వవశంకరీ ముద్రాశక్తిని కొలుతురు

581) ఓం ఆశాయై నమః

ఆశారూపమైన దేవి ఆశా యన దిక్కు, తీవ్రమైన ఇచ్ఛ, ఆసక్తి, కోర్కె మొదలగు యర్థములు గలవు ఆనందము ఇంద్రియతత్వము, స్త్రీ సంపదాదులయందు కోర్కెలు మిక్కుటమవుట, ఒక కోర్కె తీర మరియొకటి యనంతముగా పెరుగును కొన్ని లభ్యమును మరికొన్ని యలభ్యముగా నుండును 2)ద్వితీయావరణ చక్రము సర్వాశాపరిపూరక చక్రము కామ, బుద్ధి, యహంకార, శబ్దాది పంచతన్మాత్ర, చిత్త ధైర్య స్మృతి, నామ, బీజాక్షరి,ఆత్మా, అమృత, శరీరా క్షరి దేవీమయము, ఐహిక, ఆముష్మిక, సుఖసంపత్తి క్రమమును, నింకను యారుయావరణలు సాయుజ్యమునకు దాటవలెను

582) ఓం తృష్ణాయై నమః

తృష్ణా స్వరూపిణియైన దేవి 'యాదేవి సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా' యని సర్వజీవవ్యాప్తమైన లక్షణం, తృష్ణయన పిపాస, దప్పి, లోభము, ప్రాప్తాభిలాషయని పై యాశ పదమునకు పరాకాష్ఠ 'ఆహారనిద్రాభయ మైథునాని' సర్వజీవ వ్యాప్తరూపమున నున్న చైతన్య రూపములు వానిని పొందుట కెంతయో యారాటపడుదురు. 'జ్ఞానినామపి చేతాంసి బలాదాకృష్య మహామాయా ప్రయచ్ఛతి'నైరుతి దిక్పాల పూజ యందు 'తృష్ణాసహితాయ నిరుతయే నమః' యని నైరుతి దిగధిష్ఠాత్రి యగును

583) ఓం చంద్రకళాయై నమః

చంద్రకళా స్వరూపిణియైన దేవి చంద్రకళలు పదునైదు వృద్ధి క్షయములు గలవి పదునారవది నిత్యసంజ్ఞ గలది అట్టి పదునారవ సాదాఖ్యయను నిత్యకళను ధరించిన దేవి శ్రీవిద్యా షోడశీ మంత్ర స్వరూపురాలుగాను, కామకళా, ఏకాక్షరి విద్య, నిత్యకళాస్వరూపురాలని భావము 2) అష్టమీ తిథియందలి చంద్రకళ శుక్లకృష్ణ పక్షముల నొకేరీతి హెచ్చుతగ్గులు లేకయుండుట వలను దేవి యర్చన యష్టమి తిథియందు విశేష ఫలితమునిచ్చు నందురు దుర్గాష్టమీ నిదర్శనం దేవి మకుటాలంకారముగా నీ చంద్రకళను ధరించి యుండును 'విశుద్ధ జ్ఞానదేహాయ, త్రివేదీ దివ్యచక్షుషే శ్రేయః ప్రాప్తి నిమిత్తాయ నమః సోమార్ధధారిణే' యని గలదు 'త్రిశూలచంద్రాహిధారే మహావృషభ వాహిని। మహేశ్వరీ స్వరూపేణ నారాయణి..' 'అర్ధ చంద్రంతథా శుభ్రం' 'నిష్కళంక అర్ధచంద్రధారి' 'మహాహివలయా ప్రాప్తా చంద్రరేఖా విభూషణా' అట్టి చంద్రకళాస్వరూపిణియను భావము

584) ఓం నిద్రాణాయై నమః

నిద్రాణిరూపియైన దేవి. యోగనిద్ర 'విశ్వేశ్వరీ జగద్ధాత్రీం స్థితి సంహార కారిణీం' నిద్రాం భగవతీం విష్ణోరతులం తేజసః ప్రభుః 'కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ దారుణా' యని తామసీ ప్రకృతి నేత్రస్య, నాసికా, బాహు, హృదయేభ్య స్తథోరసః నిర్గమ్య దర్శనే తస్థౌ' యను రూపము వివిధ యంగవ్యాప్తముగా పేర్కొనబడినది

564) ఓం ఇంద్రాణ్యై నమః

ఇంద్రాణి రూపిణి తూర్పుదిగధిపతి ఇంద్రుడు తచ్ఛక్తి ఇంద్రాణి శచీదేవి రూపిణి యైనది 'వజ్రహస్తా ఐంద్రీ, గజారూఢా పరేష్ఠితా ప్రాప్తసహస్ర నయనా యథాశక్రః కిరీటినీ మహావజ్రే సహస్ర నయనోజ్జ్వలే। వృత్రప్రాణహరేఐంద్రీ నారాయణి' రూపం ఇంద్రాణీదేవి యష్టవిభూతులలో నొకటియై యోద్ధగా యంబకు తోడు పడిన శక్తిరూపిణి

565) ఓం వాయువేగిన్యై నమః

వాయువేగము గలది పంచభూతములలో వాయువు ప్రాణాధిపతి హరిణ మృగవాహి తచ్ఛక్తి వేగవతి కొందరు గంధర్వాది పతియని పేర్కొనిరి. ప్రళయము సృష్టించుటలో మహావాతము రూపమైనది అగ్నికి తోడుపడునట్టి (రూపము) భూతము అట్టి పంచభూతములందు వ్యాప్తమైన దేవి సర్వభూత లక్షణయుత సర్వభూత హితము చేయు దేవియై యున్నది అంతరిక్షచారమునకు, దేహవిముక్తి తరువాత ప్రాణసంవహనమున కాధారము వాయుశక్తియే

సహస్ర సూర్య సంకాశా చంద్రకోటి సమప్రభా
నిశుంభ శుంభ సంహంత్రీ రక్తబీజ వినాశినీ(85)

566) ఓం సహస్ర సూర్య సంకాశాయై నమః

సహస్ర సూర్య సమకాంతి కలిగిన దేవి 'వేయి సూర్యుల కాంతి సమానమైన వెలుగు గలది విద్యుత్కాంతి సమప్రభాం' యని మూర్తినుతి 'ఆలోకింటకుపెం। జీకటి నెవ్వండేకాకృతి వెలుగు' యని యట్టి దివ్యకాంతి కలిగిన శక్తిరూపిణి యామె సూర్యుని చూచుటకు నల్లరంగుటద్దములు ధరించి చూచుచుండ, కాళీ ప్రసన్నత వల్ల దేవి ప్రభకాంచనగును తేరిపార చూడ నశక్యమై నందున నాభాసరూపము ద్యోతకముగుచుండును

567) ఓం చంద్రకోటి సమప్రభాయై నమః

కోటి చంద్రుల సమమైన కాంతి కలిగిన దేవి రూపము బ్రహ్మరంధ్రం అధోభాగమునందు సహస్రార కర్ణిక చంద్రమండలాకారము. పరమేశ్వరి మౌళి శశాంకధారి అమె ముఖము చంద్రబింబము అందుండివెలువడు తేజము కోటి చంద్రుల కాంతిని మించును. కోటి కందర్ప లావణ్యా, శివావామాంక వాసినీం 'ఏకకాలోదితానేక చంద్రకోట్యర్క కోటిభాం। చంద్రకోటి ప్రతీకాశాం' యని వర్ణన గలదు

568) ఓం నిశుంభ శుంభ సంహర్త్ర్యై నమః

శుంభనిశుంభాసురుల సంహరించినశక్తి, 'విశ్వోపీకృత రక్తబీజదనుజే, నిత్యాయిశుంభాపహే శుంభ ధ్వంసిని సంహరాసి దురితందుర్గే' సప్తశతీతృతీయ చరితమందు శుంభనిశుంభ దైత్యుల వధ చరిత్ర గలదు ఈ చరిత మహాసరస్వతీ రూపియైన కాళి శుంభ నిశుంభ హననీ మహిషాసుర మర్దినీ స్వరూపిణియే

569) ఓం రక్తబీజ వినాశిన్యై నమః

రక్తబీజ దనుజాని సంహరించినది రక్తబీజుడను రాక్షసుడు బ్రహ్మ వలన వరములు పొందెను నేలపై (రాలిన)చిందిన రక్తబిందువు లెన్నియో, అన్ని తుల్య రక్తబీజ యాకారములు యేర్పడగలవని, అంత రణాంగణమంతయు రక్తబీజమయమైయుండ, కాళిక తన నోరు విస్తరించి, నేలను పడక మునుపే రుధిరము పానము చేసి వృద్ధి నణచినది అట్లై రక్తబీజాని సంహారము జరిగినది 'విశ్వోపీకృత రక్తబీజదనుజే నిత్యేని శుంభాపహే' యని సంస్తుతి

మధుకైటభ సంహంత్రీ మహిషాసురఘాతినీ
వహ్నిమండల మధ్యస్థా సర్వసత్వ ప్రతిష్ఠితా(86)

570) ఓం మధుకైటభ సంహర్త్ర్యై నమః

మధుకైటభులను రాక్షసులను సంహరించినది ప్రళయాంతమున విష్ణువు శయనించి యుండ వాని కర్ణములనుండి మధుకైటభులను రాక్షసులుద్భవించిరి బ్రహ్మను చంపబోవ బ్రహ్మ మహామాయను స్తుతించెను. ఆమె విష్ణువును మేల్కొలిపెను యుద్ధమందు తన క్రీగంటిచే రాక్షసుల సంమోహన పరచి, విష్ణువుచే వారిని సంహరింపజేసెను ఇది ప్రథమ చరిత కథ, 'మాతర్మే మధుకైటభఘ్ని, మహిషప్రాణాపహారోద్యమే' యన మధుకైటభ సంహారిణి ఆమెయే

571) ఓం మహిషాసుర ఘాతిన్యై నమః

మహిషాసుర ఘాతినియైన దేవి 'జయజయహే మహిషాసుర మర్దిని,రమ్యకపర్దిని శైలసుతే' యను దుర్గరూపము 'మహిషప్రాణాపహారోద్యతే' యని ద్వితీయ చరితకు మూలాధారమైన దేవి మహాలక్ష్మి చరితకు రంభునికి, మహిషికి జన్మించిన మహిషాసురుడు,రక్తబీజుడును దేవలోకములాక్రమింప సర్వదేవ శరీరములనుండి 'మహాలక్ష్మి రూపము' యవతరించినది 'సర్వదేవ శరీరేభ్యో యావిర్భూతాఽమితా ప్రభా। త్రిగుణా సా మహాలక్ష్మి స్సాక్షాత్ మహిషమర్దినీ'

572) ఓం వహ్నిమండల మధ్యస్థాయై నమః

వహ్నిమండల మధ్యముననున్న దేవి వహ్నిమండల వాసినియైన దేవి శ్రీచక్రమండలి మహాత్రికోణతలమున వహ్నిమండలము అందుండునది 2) పిండాండమున మూలాధార మండలము, వహ్ని సంజ్ఞ గలది కుండలినీ శక్తిరూపమున వసియించునదిగాన వహ్నిమండల వాసిని 3) త్రివృత్త పరిధుల సూర్యచంద్ర వహ్నికలాక్రాంత మండలములు, 4) శ్రీచక్రము నందు నాలుగు శివకోణములు శివుని ఐదు కోణములు శక్తియధీనమున నుండును 'రుద్రోహ ఏష యదగ్ని' అగ్ని స్వరూపుడైన రుద్రుని యంతర్లీనమైన శక్తి దాహకశక్తిగా వెలుగుచుండును బిందువున ప్రకాశాంతయా దేవి స్వరూపమే యైయున్నది

573) ఓం సర్వసత్వ ప్రతిష్ఠితాయై నమః

సర్వసత్వములు యామెయందే ప్రతిష్ఠితమైన రూపము సర్వశక్తులు యామెయే సృష్టిస్థితి లయ తిరోధాన యనుగ్రహాది సర్వశక్తి సమన్వితయైనది బాలా, శ్యామలాది శక్తి సముదాయము అణిమాది, భగమాలినీ, సర్వంత సర్వశక్తిమయము సర్వమంత్ర సర్వస్వరూపిణి బీజ, కీలకాది సర్వశాస్త్ర వర్ణ మంత్ర ఫలాధిపతి యామెయే. సూర్యుని ప్రకాశశక్తి, చంద్రుని యాహ్లాదము అగ్నిదాహకత, భూమి సర్వాధారత, బీజ, అంకురశక్తి, ఓషధీ ప్రాణపోషణ, క్షీరప్రాణాధార శక్తి, గరళ ప్రాణ హరణాది సర్వసత్వ గుణశక్తి యామెయే 2) బ్రహ్మణ, గుహ విష్ణూనాం తథేంద్రస్య చ శక్తయః। శరీరేభ్యో వినిష్క్రమ్య తద్రూపై చండికాయయుః' యని సర్వదేవతల తేజము ఆయుధ సంపత్తి తనదిగా సుప్రతిష్ఠితమైన దేవి స్వరూపము

సర్వాచారవతీ సర్వదేవ కన్యాఽఽశ్రితా* దేవతా — అధి

దక్షకన్యా దక్షయజ్ఞనాశినీ దుర్గతారిణీ*(87) — తారికా

574) ఓం సర్వాచారవత్యై నమః

సర్వాచార స్వరూపిణియైన దేవి ఆగమములు యాచార వుపాసనాదుల నిర్దేశించును, అన్ని యాగముల మూలశక్తి యామెయే శీలము,మంచి నడవడి, స్నానాద్యచమనవిధానం శ్రుతి స్మృతి సమ్మత వ్యవహార యాచార విధానమైనది. ఆగమము మంత్ర శబ్దజన్య జ్ఞానము, తత్సాధన శబ్దరూప ప్రమాణము వివరించునది. వైష్ణవ, శైవ, జైన, బౌద్ధాది భేదాతీతమై సర్వాచార స్వరూపిణియైన దేవి స్వరూపమై యున్నది సకలాగమములందంతర్లీనమైన వేదాంతసారము అదియే బ్రహ్మవిద్యా స్వరూపము. ఆ బ్రహ్మస్వరూపిణి సదాచారమునునే లక్ష్యముగచుండును. 'ఆచార ప్రభవో దేవా' యని యుపాసనాకాధారము ఆచారము. అట్టి సర్వాచార స్వరూపిణి, సర్వవర్ణ మంత్రాధార భూతమైన దేవి సద్భావనాక్రాంత సదాచారవతిగా ప్రతిష్ఠితము

575) సర్వదేవకన్యాధిదేవతాయై/సర్వదేవకన్యాయై నమః/అధిదేవతాయై నమః

సర్వదేవ కన్యా రూపిణియైన దేవి 'స్త్రియస్సమస్తాస్తవదేవిభేదాః' అందు వయసును బట్టి బాలా, కన్య, తరుణి, వృద్ధావస్థలుండును బాలారూపము నిర్వికారస్థితి, కన్యకొంతయైదిగి గంధాది సారభ భోగజ్ఞానము గలిగినది కన్యకనగా పెండ్లికాని పడుచు, రాశి, దుర్గాభేదము దేవకన్యలు యష్టవిధములు. నర,నాగ, గంధర్వ, విద్యాధర, యక్ష సిద్ధి, కింపురుష, పిశాచ కన్యలు. వీనియన్నింటికి అధిష్ఠాత్రి దేవతారూపము అటులే అహల్యా ద్రౌపతీ, తారా, కుంతీ/సీతా మందోదరీస్తథా। పంచకన్యాస్మరణము గలదు. దశవర్ష బాలిక, యుపాసనాక్రమమున బాలాదియర్చలతో రెండవ వత్సరమునుండి పదియవ వత్సరము వరకు గల కన్యల పూజించు యాచారము. 'ఏకవర్షాతుయా కన్యా పూజార్థం తాం పరిత్యజేత్'' ద్వివర్షా దారభ్య దశవర్షావధిక్రమాత్' పూజను విధిక్రమముగా, కన్యకా, త్రిమూర్తికా, కళ్యాణి, రోహిణి, కాళికా,చండికా, శాంభవి, దుర్గా, సుభద్రా రూపముల విధి అష్టై వయసుగల కన్యలు వర్ణితము

576) ఓం దక్షకన్యాయై నమః

దాక్షాయణి దక్షసుతారూపిణియైన దేవి ప్రజాపతులలో నొకరైన దక్ష, ప్రజాపతి కూతురు సతీనామధేయ అరువదిమంది పుత్రికలలో సతిని యీశ్వరునికిచ్చి పెండ్లి చేసెను 2) కార్యసాధనీయత దక్షత శక్తి గలది దాక్షాయణి దక్షుడు పరమేశ్వరి నుపాసించగా నాతనియింట సతిగా నవతరించి దాక్షాయణి యైనది

577) ఓం దక్షయజ్ఞ వినాశిన్యై నమః

దక్షయజ్ఞము నాశనము చేసిన శక్తి దక్షయజ్ఞ విధ్వంసమునకు కారణమైనది మున్నొక యజ్ఞమున దక్షుని రాకనందరు నామోదించ, నిశ్చలముగా కూర్చుండిన శివుని గాంచి, వుపేక్షించినాడని కినుక వహించి, తాను శివసతుల పిలువకయే బ్రహ్మాండ యజ్ఞము తలపెట్టెను శివుడు వారించినను వినక పుట్టినింటి కేగి యవమానితయై యోగాగ్నిని భస్మమాయెను అంత శివగణములు యజ్ఞధ్వంసము చేసినవి దేవతలు శివుని శాంతింపజేసి, దక్షునికి మేక తల తగిలించి యజ్ఞపూరణ చేసి ఫలితమిడిరి దేవికారణముగా శివగణములు ధ్వంసము చేసినందున దక్షయజ్ఞ వినాశినియైనది

578) ఓం దుర్గతారిణ్యై నమః

దుర్గతారిణియైన రూపము 'దుర్గా దుర్గతితారిణి' నవదుర్గారూపములు శైలపుత్రీ బ్రహ్మచారిణీ, చంద్రఘంటా, కూష్మాండా, స్కందమాతా, కాత్యాయనీ, కాళరాత్రీ, మహాగౌరీ, సిద్ధిదా యనునవి అష్టై అపరాజిత 2) తొమ్మిది వత్సరములు గల, బాలిక దుర్గ, భీమరథి తీరమున సన్నుతి క్షేత్రం విజయవాడ ఇంద్రకీల పర్వతస్థ.నాశస్థలమున సుబాహురాజుచే పూజింపబడిన రూపము నామెయే 3) రురుపుత్రుడు దుర్గమాసురుని సంహరించి దుర్గయైనది శక్రాది దేవతలకు అభయమిడిన మహిషాసుర హంత్రి 'దుర్గాయై దుర్గాపారాయై సారాయై సర్వకారిణ్యై ఖ్యాత్యై తథైవ కృష్ణాయై, ధూమ్రాయై, సతతం నమః' దుర్గా శబ్దము తుదినున్న 'అ'కారము హంతృవాచకము,దుర్లభ, దుర్గము, దుర్గతి, దుఃఖహంత్రి తారిణి యామెయే

ఇజ్యాపూజ్యా విభావరీ। సత్కృతిర్బ్రహ్మచారిణీ* రూపిణీ
రంభోరూ శ్రుతరా రాకా జయంతీ వరుణా* కుహూ।(88) కరుణా

579) ఓం ఇజ్యాయై నమః

ఇజ్యారూపియైన దేవి ఇజ్య యన విష్ణువు, గురువు, బృహస్పతి, పుష్యమీన నక్షత్రాధి దేవత పూజ్యయను యర్థములుగలవు ఆద్యా, పూజ్యా, సర్వదేవ నమస్కృతా, పురాతనియన వెల్లను ఇజ్య యన గోవు, యాగ, దాన, ఉపాసనా రూపము పంచ యజ్ఞప్రతగా యుగాది యుపాసనా పరతిందుతేజోశక్తిగా సర్వభూతహిత కర్మల ప్రేరేపించు శక్తియగును

580) ఓం పూజ్యాయై నమః

పూజ్యారూపిణియైన పూజ్యురాలు ఉన్నత వంశ, కుల, విద్యాది గుణముల శ్రేష్ఠయై యందరిచేత పూజార్హమైన స్థితిగలిగినది సృష్టిస్థిత్యాది క్రియల సకల జీవుల జననియై భువనపోషిణియై కొలువబడుచుండును సర్వభూతహిత కారిణియై, క్షమామూర్తియై దానవాదులను గూడ రక్షించి పూజార్హత నిడుశక్తి పునరావృత్తి యైన దీపదము 'ఆరాధితాస్తుతాసైవ సర్వసిద్ధి ప్రదాయినీ'

581) ఓం విభీర్వై నమః/విభాయై నమః

భీరుగుణము లేనిదేవి భయము గుణము నెరగని దేవి 'యోమాంజయతి సంగ్రామే యోమేదర్పం వ్యపోహతి। యోమే ప్రతిబలోలోకే, సమేభర్తా భవిష్యతి' యని సవాలువిసిరి, 'తత్రాగచ్ఛతు శుంభోవానిశుంభోవా మహాసుర' ప్రళయమూర్తులైన బ్రహ్మాది శక్తులు పర్యవేష్ఠింది యుండ దర్పమున వెలుగు దేవి పిరికితనము లేనిది. 'అట్టాట్టహాసము శివం, శివదూతీచ కారహా తైః శబ్దైరసురాస్త్రేసుః శుంభః కోపం పరంయయా' 2) ప్రకాశరూపము

582) ఓం భూత్యై నమః

భూతిరూపిణియైన దేవి శివుని యణిమాద్యష్టైశ్వర్యములు, బూది, సంపద, అట్టి సంపత్ ప్రదాత్రియైన దేవి రూపము 'భూత్యైభవేన్మమభుజంగ శయాంగ నాయా' యని లక్ష్మీస్తోత్రం సమృద్ధ ధనదాన్య మణిమాణిక్య పుత్రపౌత్ర సంపదలనుసృష్టిభూతుల భక్తులకు ప్రసాదించు దేవిరూపిణి

583) ఓం సత్కీర్త్యై నమః

సత్కీర్తి గలిగినదేవి మంచిపనుల వల్లమంచివారు చెడుపనుల వల్ల చెడ్డవారను యశస్సు సంభవించును. యశస్సుకు పర్యాయము శరణాగతదీనార్త– ఆపదలను యాదుకొను దేవి దానవుల వలన సకలబాధలు కలిగినపుడు దుష్టశక్తుల నిర్జించు శక్తి సర్వబాధా ప్రశమని, సర్వస్యాఖిలేశ్వరి, భువనజననీ, సంపత్ప్రదాయి, మోక్షదాయినీ యను యనేక సహస్రయున్నత గుణయుతయని దేవ, గంధర్వ, మానవులందరిచే సదా కీర్తింపబడుచున్న రూపము

584) ఓం బ్రహ్మరూపిణ్యై నమః/ఓం బ్రహ్మచారిణ్యై నమః

బ్రాహ్మణి రూపిణియైన దేవి చతుర్ముఖ బ్రహ్మస్వరూపుడైన ఈశ్వరుని శక్తి. నవదుర్గా రూపములలో ద్వితీయం బ్రహ్మచారిణీ 'హంసయుక్త విమానాగ్రే, సాక్షసూత్ర కమండలం। ఆయాతా బ్రహ్మణా శక్తిబ్రహ్మాణీసాఽభిధీయతే' ప్రాతః సంధ్య గాయత్రిరూపి ఋగ్రూపిణి బాలికగా పిలుదము పరబ్రహ్మ యందు లీనమైన మనసు గలది బ్రహ్మచారిణియు ననదగును

585) ఓం రంభోర్వ్యై నమః

రంభోరువులు గల దేవి సాముద్రిక లక్షణము, రంభయన యరటి చెట్టు దాని స్తంభములను బోలు యూరుభాగములు, తొడలు గలిగిన దేవి 'పద్మాసనే పద్మఊరు పద్మాక్షి' యని లక్ష్మీస్తుతి 'కింకిణీరత్నఖచితా దళనా జఘనస్థలీమ్। సువృత్తఘన జంఘోరుగుల్ఫాం' యని మృదుల సువృత్త పూరు భాగములు గల దేవేరి సర్వసాముద్రిక శుభలక్షణి

586) ఓం చతురాకారాయై నమః॥ ఓం చతురాయై నమః (ఓం రాకాయై నమః)

నేర్పరితనము గలది, ఇతరుల మనసు నొప్పించక వ్యవహరించునది, చతురగుణము, అట్టి చతుర గుణములలో చిరునవ్వుతో పనము చేసికొనగలది 'ఈషత్ సహాసముఖం' నాయికా భేదములలో చతుర యొకతె కార్యదక్ష, నిపుణ యాలస్యహీన గుణములు గలది 'విద్యా సుశాస్త్రేషు వివేకదీపే ష్వాద్యేషు కాత్వదన్యా। సర్వజ్ఞాతా సదసినా వాక్పటుతా ప్రసూతే'

587) ఓంరాకాయై నమః

రాకాయన పూర్ణచంద్ర ముఖియైనది షోడశ కళా పరిపూర్ణమైన చంద్రబింబమును రాకా యందురు రాకేందు వదనా-యని పూర్ణ చంద్రబింబము వృత్తము బిందువే యగుటచే బిందు రూపిణియగును ప్రథమ పుష్పిణీయని, నవజాత రజోనార్యాయనుయర్థము గలదు రజోగుణయుతగానెంతురు రాకాయన నదీ దేవతా రూపము గలదు పాడ్యమి విద్ధ పూర్ణమరాకా

588) ఓం జయంత్యై నమః

జయంతీ రూపిణి। 'జయంతీ, మంగళా, కాళీ, భద్రకాళీ, కపాలినీ, దుర్గా, క్షమా శివాధాత్రీ స్వాహాస్వధా నమోస్తుతే' యని యర్గలాస్తోత్రం, జయతి-సర్వోత్కర్షేణ వర్తతే విజయశాలిని సర్వత్ర జయముగల్గు రూపము ఆత్మ జయమును గల్గించి ముక్తినిడునది మృత్యువును జయించి మృత్యుంజయు గాను వెలుగును ఆత్మజ్ఞాన ప్రసాదిని ఓంకార స్వరూపిణి. 'జయత్వందేవి చాముండే' యని కీర్తింపబడుదేవి

589) ఓం కరుణాయై నమః / వరుణా

కరుణా స్వరూపిణియైన దేవి కరుణారస సముద్రయైన దేవీ రూపం. అపరిమిత దయాస్వభావము గల దేవి యామె రసమునయానందము, పరమేశ్వరుని కరుణానంద స్వరూపురాలైనది 'కారుణ్య వారిధి భరంబ భవత్కటాక్షై, కారుణ్య కందళిత కాంతిభరం కటాక్షం శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవాం' 'శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే' సర్వభూత హితయైన దేవీ స్వరూపము

వారుణీ-జలరూపిణియైన దేవి పంచభూతములలో నొకటైన యంబ్, ఆప, జల, నీరములు

590) ఓం కుహూమై నమః

కుహూ రూపియైన దేవి చంద్రకళ కనబడనియమావాస్య కాని పదునారవదియైన సాదాఖ్య కళ నిత్య రూపము, కుహుయధిష్ఠాత్రియైన దేవపత్ని పూజనీయము పై పదమున వచ్చిన రాకా, పూర్ణచంద్ర నిర్దేశం కుహుస్థిర సాదాఖ్య కళానిర్దేశము క్రమముగా కళలు వృద్ధిపొందుచుండును గనుకవృద్ధి సంకేత సూచకమైన కుహూ దేవతను గొల్తురు ఈ తిథుల పరిపూర్ణ తిథులుగా ఉపాసనకు విశేషము అమావాస్య పితృ ప్రీతికరము

మనస్వినీ దేవమాతా యశస్యా బ్రహ్మవాదినీ

సిద్ధిదా* వృద్ధిదా వృద్ధిః సర్వాద్యా సర్వదాయినీ(89) బుద్ధిదా

591) ఓం మనస్విన్యై నమః

మనస్వినియైన దేవి తురీయావస్థ స్థితియందు సచ్చిదానంద మాతృస్వరూపిణియైన దేవి 2) మానసయవాంతర భేదవృత్తులు పదకొండు కామ,సంకల్ప చికిత్స, శ్రద్ధ సత్య, ధృతి, అధృతి, హ్రీం, భీ, ధీ యనునవి వీనికి యైహిక, పారమార్థిక, దృక్ భేదమున, సామాన్యని, విజ్ఞానియందు భావయుతముగనుండును వాని ప్రేరణ చేయునది దేవియె 3) స్థూల, సూక్ష్మ, కారణ దేహములు చేసిన కర్మలననుసరించి, ఇచ్ఛ, ఉపాయ, ప్రయత్న, సాధన దశలుగా ప్రవర్తింపజేయుచు సాక్షి భూతముగా గమనించునది మనస్విని 4) స్వాధీనమైన మనసుగలది 5) మనస్వియన శూరుడు, శరభ మృగము, మంచి మనసు గలవాడు, అభిమాని తత్ శక్తిరూపం మనస్విని తుల్య మనమున సకల ప్రాణుల పోషించునది ఎవరికీ తలవంచని 'ఆద్యా' ప్రకృతి, స్వరూపిణి

592) ఓం దేవమాతాయై నమః

దేవతల మాతయైన దేవి దివి తేజోమండలము అందు చరించు తేజస్వరూపులు దేవతలు ఆకసమున క్రీడించుట, ప్రకాశించుటచే దివ్యులు వీరందరికీ మాత రూపమైనది-పరమేశ్వరి దేవశియైన ప్రభ్వి 2) దేవతలకు ప్రభ్వి ఇంద్రశక్తి శచి మహేంద్రి స్వరూపిణి యామె యంశయే దేవతల పోషిణి 3) మానవ శరీరాంగముల కొక్కొక్క దేవత యధిష్ఠాత్రి సూర్యచంద్రులు నయనములకు, ఇంద్రమిత్రులు వరుణులాది పంచేంద్రియ సంపత్తికి. వీరికందరకు యధిష్ఠాత్రియైన ప్రాణశక్తి పరమేశ్వరియే 4) దేవమాతయదితి ఆదిత్యులు అదితేయులని పిల్వబడ, యదితి తేజోరూపము

శ్రీమాతయే

593) ఓం యశస్విన్యై నమః

యశోరూపమైన దేవి మేధా దేవియను దేవతయే యశస్విని సహస్రార చక్రమున కధిష్ఠాత్రి యగు దేవతయు ।తస్యనామ మహద్యశః, పేరు మహత్ యశస్విని । 'స్వర్గే మర్త్యలోకేచ మానవాః స్తువంతో వ్యాహరిష్యంతి సతతం' 'తదామాంమునయస్సర్వే స్తోష్యంతా నమ్రమూర్తయ.'' భీమా దేవీతి విఖ్యాతం', 'త్రైలోక్య స్యహితార్థాయః భ్రామరీ తిచమాం లోకాస్తదాశోష్యంతి సర్వతః' ఇట్టి యనేక రూపముల చండముండాసుర, మహిషాదియనేక దైత్యుల సంహరించి యశోరూపియైన దేవి 'నమోజగత్ప్రతిష్ఠాయై దేవ్యైకృత్యై' ఆమె లీలలు సమ్మోహకములు

594) ఓం బ్రహ్మవాదిన్యై నమః / ఓం బ్రహ్మచారిణ్యై నమః

మహదహంకార పృథివ్యప్తేతో వాయురాకాశాత్మక బృహద్రూప యండకోశమున, కర్మజ్ఞానార్థ రూపమున భాసించు, యద్వితీయ యఖిలోపాధి వినిర్ముక్తక, తత్సకలశక్తి ఉపబృంహిత, అనాద్యంత, శుద్ధ, శివ, శాంత, నిర్గుణిత్యాదివాచ్య మనిర్వాచ్య చైతన్యమే బ్రహ్మము 'అన్నాద్యస్యయతః సృష్టికి పూర్వమందున్నదే బ్రహ్మపదార్థం.'' బ్రహ్మసత్యం జగన్మిథ్య'' అహం బ్రహ్మాస్మి' సర్వంఖల్విదం బ్రహ్మ ।ప్రజ్ఞానం బ్రహ్మ' మొదలగు వేదాంత వాక్యముల సారమైయున్న దేవి 2) 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా'' బ్రహ్మణి ఆతిష్ఠ'యని యానంద కోశమందు ప్రతిష్ఠితమైన దేవి బ్రహ్మబోధరూపిణి. బ్రహ్మమునః చారణ మనము గల్గినది

595) ఓం సిద్ధిదాయై నమః

సిద్ధులనిడుదేవి అణిమా మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం యనుయినిమిది దూరశ్రవణ, లోకాంతర గమన, క్షుత్పిపాసారాహిత్య, త్రికాలజ్ఞానాది సిద్ధులెన్నో గలవు జ్ఞాన వైరాగ్యములను గల్గి, బాల పంచదశా క్షరీ, శ్రీవిద్యా, షోడశాది శ్రీవిద్యాయుపాసనలచే పరబ్రహ్మ నందము, మోక్షము, సకల వాంఛా ప్రాప్తిని గల్గించు సిద్ధిదాత్రిదేవి కాళీ, తారా, మహావిద్యా షోడశీ, భువనేశ్వరీ, భైరవి, ఛిన్నమస్తా ధూమవతీ విద్యలును సిద్ధవిద్యలు బగళా, మాతంగీ, కమలాయను పది రూపములు వీని సాధనా ఫలితములను ప్రసాదించు దేవియామెయే కాశీక్షేత్రమున సిద్ధేశ్వరి గలదు. స్వాధిష్ఠాన చక్రాధి దేవతయును, యాజ్ఞాచక్రయధిష్ఠాత్రి సిద్ధమాతయామెయే

596) ఓం వృద్ధిదాయై నమః

వృద్ధిని ప్రసాదించుదేవి వృద్ధియన వర్ధనము పెరుగుట, సంపత్ సమృద్ధి, సంతోష, ధనాతిశయము లాభము మొదలైనవి సకల వాంఛాప్రదాయినియైన దేవి యుపాసక భక్తులకు సకల సంపత్తి శ్రేయముల నిడుచుండును 'పుత్ర పౌత్రధనం ధాన్యం హస్త్యశ్వాజావిగోరథం' మున్నగు సంపత్తుల నవిచ్ఛిన్నముగా ప్రసాదించును. 'ఆరాధితాస్తుతాసైవ సర్వసిద్ధి ప్రదాయినీ, 'విద్యాసు శాస్త్రేషు వివేకదీపేషు ఆద్యేషు' నిధియైన దేవి భక్తులకు సర్వజ్ఞతా, సదసద్వాక్పటుత్వాదులనిచ్చి సకల వృద్ధి గల్గించు చుండును

597) ఓం వృద్ధ్యై నమః

సంవృద్ధి రూపయైన దేవి బ్రహ్మమే వృద్ధిరూపము సకల చరాచర ప్రపంచము యొక్క సృష్టికి పూర్వమందున్నది 'అహమస్మి ప్రథమజా అహమేవాస పూర్వంతు, నాన్యత్ కించిత్ నగాధిప - దేవీభాగవతం వృద్ధియన పెరుగుదలయు యామెయే సృష్టిస్థిత్యాది కృత్యముల నభివృద్ధి చెందును 'సర్వదేవ శరీరేభ్యో, యావిర్భూతా సనాతని' అందరి శక్తులనంది వృద్ధిరూపయైన దేవి సురథ మహారాజుకు రాజ్యము విభ్రంశ్యస్య జన్మని' 'నిజం రాజ్యం, హతశత్రుబలం', సమాధి వైశ్యునకు 'జ్ఞానంవనై నిర్విణ్ణమానసః' దానితోంటో వృద్ధిగా । సావర్ణికోనామ మనుర్భవో భవి భవిష్యతి 'సూర్యాజ్జన్మ సమాసాద్య సావర్ణ రూపియాయను అష్ట మనువులు ।సూర్య, దక్ష, బ్రహ్మ, ధర్మ, రుద్ర, రౌచ్య

భోక్త్యా మనువులు నైశ్వర్యమునకు యఖండ సిద్ధిజ్ఞానములు ప్రసాదించి మోక్షము గల్గించినది. సంవృద్ధిరూప

598) ఓం సర్వాద్యాయై నమః

సర్వమునకు ముందుగానున్న రూపము 'విద్యాస్సమస్తాస్తవదేవి భేదా' స్త్రియస్సమస్తా సకలా జగత్సు త్వయైకయాపూరిత మంబ ఏతత్', 'త్వం వైష్ణవీశక్తి రనంతవీర్యా, విశ్వస్య బీజం పరమాసి మాయా' 'ఆధారభూతా' జగతస్త్వమేకా, మహీస్వరూపేణ యతః స్థితాఽసి 'యనియును ' ఏకైవాహం జగత్యత్ర ద్వితీయా, కా, మమాపరా పశ్యైతా దుష్టమయ్యేవ విశంత్యోమద్విభూతయ' యని యన్నింటికీ మూలాధారం శ్రేష్ఠమునామెయు 'త్వం శ్రీస్త్వ మీశ్వరీత్వం, హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా। లజ్జాపుష్టి స్తథా తుష్టి స్త్వంశాంతి క్షాంతిరేవచ' సర్వ ప్రపంచ మామెరూపమే యననగును సర్వాత్మక, సర్వాద్య శక్తిరూపము గొల్వనగును

599) ఓం సర్వదాయిన్యై నమః

సర్వ సుఖ సంపదలనిడుదేవి దేవి ప్రసన్నురాలైన సర్వార్థ సిద్ధులొసగూడును వాంఛాకల్పతరువు, ఆరోగ్యదాయీచ, గోదాయీ, ధనదాయీ మహాధనే, ధనంమేజాషతాందేవి, సర్వకామార్థ సిద్ధయే', 'సర్వ మంగళ మాంగల్యే సర్వార్థ సాధకే' యనిగొల్తురు 'కరోతుసానః శుభహేతురీశ్వరీ, శుభాని భద్రాణ్యభి హంతుచాపదః' అభయదాయిని యనియు 'యాచస్మృతాతత్ క్షణమేవ హంతినః సర్వాపదోభక్తి వినమ్రమూర్తిభిః' 'శత్రుహంతయును 'ఆరాధితాస్తుతాసైవ నృణాంభోగ స్వర్గాపవర్గదా' మోక్ష సామ్రాజ్యదాయిని యైన యంబ

ఆధార రూపిణీ ధ్యేయా మూలాధార నివాసినీ
ఆజ్ఞా* ప్రజ్ఞా పూర్ణమనా శ్చంద్రముఖ్యనుకూలినీ(90) ఆజ్ఞా

600) ఓం ఆధారరూపిణ్యై నమః / ఓం అగాధ రూపిణ్యై నమః

ఆధారరూపమైనదేవి 'యస్యాః ప్రభావమతులం భగవాననంతో / బ్రహ్మాహరశ్చ నహివక్తుమలం బలం చ/ సాచండికాఽఖిలజగత్పరి పాలనాయ నాశాయ చా శుభభయస్య మతింకరోతు 'హేతుః సమస్త జగతాం, ఇదంజగదాత్మశక్తి, సర్వజగతాం పరమార్తిహంత్రి' ఆధారభూతా జగతస్త్వమేకా మహీస్వరూపేణ యతః స్థితాఽసి'యని సర్వజగత్తుకు నాధారభూతము 'దుర్గేస్మృతా హరసిభీతి మశేషజంతోః స్వస్థై స్మృతామతిమతీవశుభాందదాసి దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా సర్వోపకార కారణాయ సదాఽర్ద్ర చిత్తా', అంబ స్వరూపము ప్రభావము తెలియనేరము గనుక యగాధ రూపిణిగ వెల్వొందును రక్షారేవ సర్వాధారాదే, సకలస్య విశ్వస్యాధార భూతయే ఆధార మానంద మఖండబోధం

ఇతి లలితాంబికా కృత శ్రీలలితా సహస్రనామస్తోత్ర భాష్యే నవతి తమశ్లోకవ్యాఖ్యా సంపూర్ణః

601) ఓం ధ్యేయాయై నమః

ధ్యేయ-ధ్యానింపదగిన రూపము 'శూలేన పాహినోదేవి పాహిఖడ్గేన చాంబికే ఘంటాస్వనేన పాహి, చాపజ్యానిస్వనేనచ। ప్రాచ్యాంరక్ష ప్రతీచ్యాంచ చండికేరక్ష దక్షిణే/ భ్రామణే నాత్మ శూలస్య ఉత్తర స్యాంతథేశ్వరీ। సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యే విచరంతి తే / యాని చాత్యంత ఘోరాణి తైరక్షాస్మాం స్తథాభువమ్' । 'ఏ షాసా వైష్ణవీ మాయా, మహాకాళీ దురత్యయా। ఆరాధితావశీ కుర్యాత్ పూజా కర్తు శ్చరాచరమ్॥' 'ధ్యాయేయం రత్నపీఠే శుకకల పఠితం శృణ్వతీ శ్యామలాంగీ, తత్ స్వరూప నిత్య ధ్యానము మోక్షదము ' ప్రణతానాం ప్రసీదత్వం దేవి విశ్వార్తి హారిణి త్రైలోక్య వాసినా మీడ్యే లోకానాం వరదాభవ'యని ధ్యానింపతగును

602) ఓం మూలాధార నివాసిన్యై నమః

మూలాధార నివాసియైన దేవి మూలాధారమునందలి చతుర్దళ పద్మమున కర్ణికాంతర్గతమైన

యధిష్ఠాత్రిదేవి సిద్ధ విద్యారూపిణి, ప్రకాశన నాల్గు వర్ణములు బీజములుగా గల చక్రము పృథ్వీ తత్వం స్వరూపము సకల సృష్టికాధార భూతము ధూమ్ర వర్ణం (పసుపురంగు వర్తులాకారమున భూమండలము గలదు తెల్లని గజరూపముపై లంబీజముండును అధిపతి బ్రహ్మశక్తి ఢాకిని కుండలినీ స్థానమిదియె దీని మధ్యన విద్యుల్లేఖ కాంతితో త్రికోణము క్లింబీజము స్వయంభువ లింగము చుట్టూ మూడున్నర వలయములు సర్పాకార కుండలినీ శక్తి సర్వదా నిద్రావస్థ గల్గినది పరాశక్తి బ్రహ్మనాడియగు సుషుమ్నా స్వరూపముగా నున్నదని భావన

603) ఓం ఆజ్ఞాయై నమః

ఆజ్ఞారూపిణి, భ్రూ మధ్యమందు రెండు దళములు గల యాజ్ఞాచక్రమందున్న కమలము స్థానముగా గలది అచట హాకినీయను యోగినీ ధ్యానము జ్యోత్స్నామయమైన స్వస్థానము నివద తత్త్వ స్వరూపము తెలియనగును, 'హక్ష'యను యక్షరములు ద్విదళమునగలవు ఇదియే త్రిపురానివాస స్థానము ఇడా, పింగళ, సుషుమ్నల ఖండత్రయ త్రివేణి ఇందుపై కాలవ్యవస్థ యుండదు. సర్వేంద్రియ నియామక స్థానమదియే దీనిని ఓఢ్యాణపీఠమునియు, ప్రయాగక్షేత్రమునియు చెప్పుదురు.

604) ఓం ప్రజ్ఞాయై నమః

ప్రజ్ఞా స్వరూపిణియైన దేవి ప్రత్యక్ స్వప్రకాశః సాక్షీ, చిద్రూపః ప్రజ్ఞానం బ్రహ్మ తేజోమయమైన స్వాత్మ స్వరూప జ్ఞానము కంటె వేరు వృత్తిలేని బుద్ధికి, ప్రజ్ఞాన ఘనమని పేరు తురీయావస్థగాన తురీయపాద బ్రహ్మాకార స్థితియని భావము పరానిష్ఠితియే స యదా సైంధవ ఘనోఽనంతరోఽబాహ్య కృత్స్నోఽత; ప్రజ్ఞానఘన–యన. సైన యంతర, బాహ్యమును విచక్షణ లేక సర్వత్ర లవణరుచి వ్యాపించియుండునట్లు, పరమేశ్వరి సర్వవ్యాప్త 'ఇంద్రియాణామధిష్ఠాత్రీ భూతానాంచాఽఖిలేషుచ భూతేషుసతతం వ్యాప్త్యై దేవ్యై'యను స్వరూపం ప్రజ్ఞాన మన్నప్రత్యక్షైనవ్యత్తిభేదేన, నిత్యేన జ్ఞానేన ఘనం. నిరంతరము విద్యాలోకేన అస్పృష్టం రూపం

605) ఓం పూర్ణమనాయై నమః

పూర్ణమైన మనసుగలది. 'పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే' దేశ కాల వస్తు ప్రమాణములేని సర్వ పరిపూర్ణమైన మనసుగలది బ్రహ్మ స్వరూపిణి సృష్టి సర్వము తానయే అందలి విభేదములు మాయా కృతములు వానికతీతమైన పూర్ణ స్వరూపిణి, నిత్య సచ్చిదానంద స్వరూపిణి ఆనందాంబుధిర సోల్లాసినియగుదేవి

606) ఓం చంద్రముఖ్యై నమః

చంద్రముఖి స్వరూపియైనది సాముద్రిక లక్షణము పూర్ణచంద్రముఖి కాని అష్టమ దిన ప్రీతికరము కోల ముఖముగును ప్రశాంత శీతల ప్రసన్న హాసోపేతమైన ముఖముగలది దరస్మితముఖి పంకజ ముఖి మొదలగునవి ఉత్తమ స్వరూప లక్షణములు 'సామ్యా సామ్యతరోప సామ్యేభ్యస్త్వతి సుందరి' సౌమ లక్షణం సామ్యత అట్టి కరుణా స్వరూపిణియైన ప్రసన్నముఖిదేవి 2) ఎట్టి వికార భావములు, చొరనీయని మనసు బ్రహ్మసంక్రాంతము అట్టి పరబ్రహ్మ స్వరూపిణియైన దేవి, చల్లని వెన్నెలలు సదాజగతిని రక్షించుచుండును. 'చంద్రాం ప్రభాసాంయశసాజ్జ్వలంతీం శ్రియందేవీ' 'చంద్రాభాం చంద్రమాశానం, సూర్యాభాంశ్రియమీశ్వరీం చంద్ర సూర్యాగ్ని సర్వాభాం శ్రీ మహాలక్ష్మీ ముపాస్మహే' సర్వమంగళదాయక లక్షణ స్వరూపం 'హేమ ప్రఖ్యామిందుఖండాంతమౌళిం' "చతుర్భుజే చంద్రకళావతంసే'యని మౌళిచంద్రుని భాసమున యంబ వెల్గుచుండును చల్లని వెన్నెలలు పాలుముఖము గలదని యర్థము 'ఈషత్ సహాసమమలం పరిపూర్ణ చంద్రాను కారి, కనకోత్తమ కాంతి కాంతం'

607) ఓం అనుకూలాయై నమః

అనుకూలముగ వర్తించునది సదాయనుకూలవతియై భక్తులకనుగ్రహము చూపు దేవియైనది 'సర్వాశ్రయాఖిల మిదం జగదంశభూతః మవ్యాకృతాహి పరమా ప్రకృతి స్త్వమాద్యా'ధర్మాణిదేవి

సకలాభిపదైవ కర్మాణ్యాత్మాద్రుతః ప్రతిదినం సుకృతీకరోతి' యనియు 'దుర్వృత్త వృత్తశమనం దేవి శీలం రూపంత దైతమచింత్యమతుల్యమన్నై। 'వైరిష్వపి ప్రకటితైవ దయాత్వయేత్థం' రక్షణాయ చ లోకానాం దేవానాముపకారిణీ। "కరోతుసానః శుభ హేతురీశ్వరీ, శుభాని భద్రాణ్యభిహంతు చాపదః ।"యాచస్మృతా తత్క్షణమేవ హంతి, నః సర్వాపదః' ఇట్లు సదాయనుకూలవతిగా చరించు దేవి

వావదూకా నిమ్ననాభిః సత్యసంధా దృఢవ్రతా
ఆన్వీక్షికీ దండనీతి స్త్రయీ త్రిదివసుందరీ(91)

608) ఓం వావదూకాయై నమః

వాఙ్మయియైనదేవి 'మహా విద్యామహామాయా మహా మేధామహాస్మృతిః' రూపిణియును 'విద్యా సుశాస్త్రేషు వివేక దీపేషు' అన్య ప్రతిభావంతులు లేని దేవి 'సర్వజ్ఞతా, సదసి వాక్పటుతా' ప్రసాదించుదేవియై యున్నది 'ప్రణోదేవీ సరస్వతీవాజేభిర్వాజినీవతీ ధీనామ విత్ర్యవతు' యను ధీప్రసాదిని 'ప్రచోదయిత్రీ సూనృతానాం, చేతంతీ సుమతీ నాం యజ్ఞందధే సరస్వతీ' యని సర్వ వాఙ్మయ రూపిణియైన సరస్వతీ రూపిణి మేధారూపిణి, విద్యారూపిణియైన దేవి

609) ఓం నిమ్ననాభ్యై నమః

లోతైన నాభిస్థానము గలది సాముద్రిక లక్షణము నిమ్న నాభిగలిగియుండుట 'యాసా పద్మాసనస్థా విపులకటితటీ పద్మ పత్రాయతాక్షీ గంభీరావర్తనాభిస్తన భరనమితా' యనిశ్రీ సూక్తమందుగలదు 2) ముఖ చంద్రకళంకాభ, మృగనాభి విశేషికాయై నమః -ఇచట మృగనాభియన కస్తూరి పరిమళ ద్రవ్యము సువాసనలు వెదజల్లునది పద్మనాభ సహోదరియనియామెకు పేరు సృష్టిచేయు బ్రహ్మ పద్మనాభుని, నాభి కమలమునుండి జన్మించెను దేవేరిగూడ, తన యుదరమందున్న యనేక జగముల రక్షణ కర్త్రియై వెలుగుచుండును 3) నాభియన కేంద్ర స్థానము శరీరమునకు మధ్యభాగమైనట్లే, విశ్వమునకు దేవి నిమ్ననాభి మధ్యమ స్థానము జగదాధారము నిమ్నలి పార మెరుగ లేనియనంత విశ్వసముదాయ ప్రవృత్త కేంద్రమగును

610) ఓం సత్యసంధాయై నమః

సత్య సంధురాలైన దేవి పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణి. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' ఎల్లపుడు సత్యము నాశ్రయించి యుండునది సత్య సంధా సంకల్పోయస్యాతి, సత్య సంధః తప్పనటువంటి ప్రతిజ్ఞగలదేవి అతిక్రమింపని ప్రతిజ్ఞగలది సత్య స్వరూపురాలు 'ఇత్థం యదా బాధా దానవోత్థా భవిష్యతి। తదాతదావతీర్యాహం, కరిష్యామ్యరి సంక్షయం' యని మహామాయ యనేక యవతారములనెత్తి త్రిభువన క్షేమకారిగా తన సత్యసంధతను చాటించినది నిత్య స్వరూపిణి, సత్య రూప, సత్య సంకల్ప, సత్యకామయను నామముల సదా వర్థిల్లు సత్యసంధురాలు

611) ఓం దృఢ వ్రతాయై నమః

దృఢ మైన వ్రతము గలది సత్యమేవ్రతముగా గలది సత్యవ్రత, దృఢవ్రతయును అట్టి వ్రతము సాధించు దృఢమైన గట్టి సంకల్పముగలదేవి ఆత్మోపాసనయే సత్యవ్రతము ఆత్మార్పణ బుద్ధిచే పొందనగు యమృత జీవనమున నీరోగ శరీరుడుదేవి 2) శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే, సర్వస్యార్తి హరేదేవి నారాయణి' యని యార్తుల, దీనుల, జిజ్ఞాసుల మోక్షకాముల వాంఛితార్థములు తీర్చు దృఢ సంకల్పముగలదేవి

612) ఓం ఆన్వీక్షికాయై నమః

ఆన్వీక్షికియైన దేవి ప్రజల యోగక్షేమములు పరిశీలించుచుండు నేత్రములు గలది విశ్వచక్షువులు గలది 'జగత్సాక్షిణీ విజయతే తమమూర్తిరేకా' సాక్షిభూతమైనట్టి నేత్రములుగలది జీవుల పుణ్యపాప వర్తనము గమనించుచూ యోగక్షేమములవహించెడి శతాక్షి, సహస్రాక్షియైన బహునేత్రములతో

జగత్తును పరిశీలించుచుండునది సూర్యాదిదేవతా చక్షుశ్శక్తి 'విశ్వతశ్చక్షురుత, విశ్వతో ముఖ' యని వ్యాపక వర్ణనగలదు. 'సర్వతః పాణి పాదాంతే, సర్వతోఽక్షి శిరోముఖే, సర్వతః శ్రవణ ఘ్రాణే నారాయణి నమోస్తుతే' అట్టి నేత్రముల పరిశీలించుదేవి

613) ఓం దండనీత్యై నమః

దండనీతి రూపమైనది చతుర్విధోపాయములు సామ, దాన, భేద దండోపాయములు ఆఖరుదైన దండనీతి రూపమామెయే శివదూతిగా హితబోధచేసి వినని పక్షమున సంహారము చేయుపరమేశ్వరీ రూపము 'ఆన్వీక్షకీ, త్రయీ వార్తా, దండనీతి స్త్వమేవ' విజ్ఞాన బోధకముగు యన్వీక్షకీవిద్యయు 2) ధర్మాధర్మ బోధకముగు త్రయీ విద్యయు 3) అర్థానర్థ బోధకముగు వార్తాయను విద్యయు 4) నయానో భయానో, నయా నయ బోధకముగు దండనీతి విద్యాస్వరూపమామెయే ఉచితబోధచేసి దండించు నది 'భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః భీషాస్మా దగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమః' వాయు, సూర్య, అగ్ని, ఇంద్ర, యమాదులు యామె దండనలోని వారే. నీతిశాస్త్రము, అర్థశాస్త్రము అందున్న విధి నిషేధముల తెలుపు శాసనకర్త్రి స్వరూపిణి యామెయే

614) ఓం త్రయ్యై నమః

త్రయీ స్వరూపిణియైనది ధర్మాధర్మ బోధకముగు విద్య, ఋగ్యజుస్సామ రూపిణియైన దేవి వేద స్వరూపిణి జ్ఞాతాజ్ఞాత విషయముల బోధించును ఆదిత్యుడు త్రయీమయుడు బ్రహ్మ విష్ణు మహేశ రూపిణి. అంత్యాక్షరీమంత్ర స్వరూపురాలును, త్రేతాగ్ని స్వరూపురాలును భూర్భువస్సువ వ్యాహృతి త్రయీరూపమును, తేజోరూపి సూర్యచంద్రాగ్ని రూపమనియు జ్ఞాన, కర్మ నీతి స్వరూపురాలును 'అ, ఇ, ఉ' కారముల రూపమైన సామ ఋగ్యజుర్వేద రూపిణియని భావింపనగును

615) ఓం త్రిదివ సుందర్యై నమః

త్రిలోక సుందరియైనదేవి 'త్రిపురస్య, పరమ శివస్య సుందరి' శ్రీ చక్రాధిష్ఠాత్రిదేవత త్రిలోకముల పాలించుదేవి స్థూల సూక్ష్మ, కారణ శరీరములందు, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల సాక్షిరూపమైన దేవి 2) బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులని త్రిపురములు ఆపై సహస్రారము సదాశివ స్థానము ఆ పరమశివుని భార్య త్రిపుర సుందరి త్రిదివః యనస్వర్గము 'త్రిపాదూర్ధ్వ ముదైత్ పురుషః' పై మూడు లోకములు విష్ణు స్థానవ్యాప్తములు త్రిదివ పర్యతం 'సౌమ్యా సౌమ్యతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సుందరి' యని యామెకు మించిన సౌందర్యరాశి లేదని భావన

జ్వలినీ జ్వాలినీ శైలతనయా వింధ్య వాసినీ
ప్రత్యయా* ఖేచరీ ధైర్యా తురీయా విమలాతురా(92) అమేయా

616) ఓం జ్వలిన్యై నమః

జ్వలన రూపిణియైన దేవి 'సదా జ్వలన్, ఏష ఏవ జ్వలన్నేష, ఏవ సర్వతోముఖః' జ్వలన స్వభావముగల యగ్నిరూపమునై యున్నది అంటరాని వెలుగునేడిమి మిక్కుటముగును అంటినదగ్ధమై బూడిద యగుచుండును అగ్ని స్వరూపములలో నొకటైన 'జాతవేదసే సునవామ' యని దుర్గాస్తుతి 2) జ్వలన స్వభావము తీక్ష్ణ స్వభావము 'యాదేవీ సర్వభూతేషు కాంతి రూపేణ సంస్థితా' యని జ్వలన స్వభావము ప్రకాశవంతముచేయుటయను లక్షణములు యగ్నికి గలవు. పంచ భూతములలో నొకటైన యనలరూపశక్తియై యున్నది

617) ఓం జ్వాలిన్యై నమః

జ్వలింప జేయునదియై యున్నది 'జ్వాలా కరాళ మత్యుగ్ర మశేషాసురసూదనం త్రిశూలం పాతునో భీతేర్భద్రకాళి నమోస్తుతే 2) వహ్ని శబ్దము దివారూపము ప్రాకార శబ్దము రాత్రి రూపము ప్రపంచ సృష్టి లయముల తెల్పుచున్నవి. 3)వహ్నిరేవదదౌతస్య మగ్నిశ్చైవ వాసనః శుచిత్వం, అగ్ని యొక్క

మరొకలక్షణమై యున్నది 4) అనలాత్మికయైన దేవి చంద్రకళలు పదునైదు నిత్యాశక్తులు గా నున్నవి షోడశీ మహాకళ నిత్యగా నుండును పదునాల్గవకళ జ్వాలామాలినిదేవి చుట్టు ప్రాకారములు నిత్య కళలు ఆవరించి యుండును 5) సూర్యచంద్రాగ్నులకు తాప ప్రకాశ తేజముల నిడు దేవి యామెయే

618) ఓం శైలతనయాయై నమః

శైల రాజ పుత్రికయైన దేవి పర్వతరాజపుత్రి, గిరి కన్య, హిమాచలాత్మజ, మున్నగు పర్యాయ పదములు పరమేశ్వరియే ముందు దక్షకన్యసతిగా నవతరించి యోగాగ్ని దగ్ధయై మరుజన్మమున హిమాచల కన్యకగా నావిర్భవించి, పరమేశ్వరుని పెండ్లియాడినది సప్తకులాచలములు - హిమ వంతము నిషధము, వింధ్య, మాల్యవంతము, పారియాత్రము, గంధ మాదనము, హేమకూటములు అందు శ్రేష్ఠుడు హిమవంతుడు శైలేంద్ర తనయగా ప్రసిద్ధి గాంచినది 'అతిక్రుత్వామతిందేవా హిమవంతం నగేశ్వరం జగ్మస్త్రతతో దేవం విష్ణుమాయాం ప్రతిష్టువు 'యని విష్ణుమాయ ' హిమాచల కృతాశ్రయా' యనుటయున్నది. నవదుర్గా రూపము 884562 మలలో మొదటిది శైలపుత్రి 'వందే వాంఛిత లాభాయ చంద్రార్థ కృతశేఖరామ్' వృషారూఢాం శూలధరాం, శైలపుత్రీం, యశస్వినీమ్'- యని ప్రథమం శైలపుత్రీయని పూజింతురు బ్రహ్మచారిణి, చంద్రఘంటా, కూష్మాండ, స్కంద మాతా, కాత్యాయని కాళరాత్రి, మహాగౌరీ, సిద్ధిదాయినీ క్రమరూపిణి

619) ఓం వింధ్య వాసిన్యై నమః

వింధ్య వాసినీ రూపిణియైనదేవి వైవస్వతేఽన్తరే ప్రాప్తే అష్టావింశతిమేయుగే శుంభో నిశుంభశ్చైవాన్యా పుత్పత్స్యేతే మహాసురౌ నందగోప గృహేజాతా యశోదా గర్భసంభవా। తతస్తౌ నాశయిష్యామి వింధ్యా చలనివాసినీ' మరియు 'త్రికూటేచ తథాసీతా, వింధ్యేయా వింధ్యవాసినీ' యని వివరణ 2) 'వారుణి మద విహ్వలాయై, విశ్వాధికాయై, వేద వేద్యాయై' మనోలయాంతమున ప్రజ్ఞాన ఘన స్వరూపిణియై యచలమై వింధ్య పర్వతమువలె యున్నత స్థానమైన సహస్రారమున నివసించి యున్న దగుటచే వింధ్యాచల వాసియైనది మేరుపర్వతముకంటే స్వర్గమే ఉన్నతమై అగస్త్యుని దక్షిణ యాత్రకు సాగిలపడి వంగిన రూపము ప్రస్తుత వింధ్యాచలము వృత్తిశూన్యమైన మనసుగలది మనోలయాంత మందు నిలచిన ప్రజ్ఞాన స్థితియైన యానంద స్వరూపిణి

620) ఓం ప్రత్యగ్రూపాయై నమః

ప్రత్యగా రూపిణియైన దేవి ప్రతికూలమును పొందించునదిగాన 'ప్రత్యక్' ఇంద్రియములను విషయోన్ముఖము చేయుట బహిర్ముఖము దానికి ప్రతికూలము ప్రత్యక్షరూపము 'అంతరాత్మ - ఉన్ముఖత్వమును పొందించుట ప్రత్యక్ స్థితి ప్రత్యగవలోక్యమాన స్వరూపము 'పరాంచికాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాఙ పశ్యతి నాంతరాత్మన్' బాహ్యవిషయలోలుపత యున్నంత వరకు పరాఙ్ముఖుడు కావలదు ఆత్మావలోకన పరుడగుట యంతర్ముఖత్వము అదియె ప్రత్యఙ్ముఖమును అట్టియంతరాత్మ దర్శనమందు పరమేశ్వరిని చూడగల్గుటయే మోక్షపథము

621) ఓం ఖేచర్యై నమః

ఖేచరీ రూపిణియైన దేవి ఖేచరయన పాదరసము, విద్యాధరుడు, శివుడు, ముద్రాభేదము యని యర్థము గలదు ఖేచరియని శక్తిరూపము గగనమందు విహరించునది గగనాంతస్థ క్షిత్యాది శివపర్యంతమైన తత్వగణనమున పైనుండు యాత్మస్వరూపమైనది 'వివిక్తస్థా' యను నామాంతరమున, పరాకాశము, భూతాకాశమునందు సర్వమునకు లోపల బయట సర్వ వ్యాప్త రూపమైనదేవి 'పృథ్వియువస్తత్వో, దివితస్థలోక దహరాకాశ భూతాకాశ, పరాకాశములందుండు దేవి

622) ఓం ధీర్యాయై నమః

ధైర్య స్వరూపిణియైన దేవి 1) నమాత్సర్యం న చక్రోధో నతితిర్నచ భేదధీః యత్ప్రత్తానాం వినీతానాం ధైర్యలక్ష్మీం నమామ్యహం 2) పరమేశ్వరి చతుష్షష్టికళల యందు పాండిత్యముగలది. పరమేశ్వరియంద

ద్వైతబుద్ధిగల యుపాసకులు ధీరులు సన్మార్గ బుద్ధి నిచ్చునది యని భావన 'యాదేవి సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' యని శక్తిగల్గింది మనోధైర్యము గల్గించుదేవి 'దుర్గేస్మృతా హరసిభీతి మశేషజంతోః స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి' యని స్మరించిన వారి భయమును పోగొట్టి ధైర్యమును గల్గించు దేవియైయున్నది. 'సర్వ స్వరూపే సర్వేశే, సర్వ శక్తి సమన్వితే భయేభ్యస్త్రాహి నోదేవి దుర్గే' యని ధైర్యము గల్గించు దేవి యామెయే

623) ఓం తురీయాయై నమః

తురీయావస్థ స్వరూపిణియైన దేవి 'ఆద్యంతరహితం సత్యం చిన్మాత్ర నిర్వికల్పం। యత్తద్వృద్ధి పరం రూపం జీవస్యైతః తురీయకమ్' 2) మనోబుద్ధులు రెండును భ్రూమధ్యమును చేరినపుడు తురీయావస్థ ఇది స్థూల సూక్ష్మకారణ స్థితుల కతీతము 3) మనోబుద్ధులు నేత్రగోళముల నాశ్రయించిన జాగ్రదావస్థ కంఠము నాశ్రయించిన స్వప్నావస్థ హృదయమునాశ్రయించిన సుప్తావస్థ శిరస్సున సహస్రారగతమైనపుడు తురీయావస్థ యందురు అదే సచ్చిదానంద తురీయస్థితి నిలకడ గలది సమాధి, ఉన్మని, మనోన్మని, అమరత్వము, లయము, పరమపదము, అమనస్కము అద్వైతము, నిరాలంబం, నిరంజనం, జీవన్ముక్తి సహజ స్థితి, 'యత్ర నాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి , నాన్యద్విజానీతి స భూమా' అట్టి భూమావస్థ స్వరూపిణియైనది జీవన్ముక్తికి సోపానమీ యవస్థ. నిలకడ జెందిన తురీయాతీత యందురు 4) త్రికాలాబాధ్యమై సాక్షిభూతుడు, అసంగుడు, జ్ఞాత సంజ్ఞలచే తుర్యాయనబడును. పరమానంద విజ్ఞాన ఘన, ధర్మాధర్మ వివర్జిత స్థితులు, దీనికి విశేషముగా వర్తించును 5) భూమైన సుఖంతు తురీయ ప్రాప్తియే జీవన్ముక్తికి సోపానము అట్టి వారు పరమేశ్వరీ తుల్యులు

624) ఓం విమలాయై నమః

మల రహితము, 'జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాః సంస్పృష్టమ్ శుద్ధచైతన్యం। యాస్స్వచ్ఛా సమతా, శాంతా జీవన్ముక్త స్వయాస్థితి సాక్ష్యవస్థాద్వ్యవస్థితే, సాతుర్యాకలనోచ్యతే, అంత పరమేశ్వరీ పరిశుద్ధ జ్ఞాన స్వరూపిణి, అమలిన తత్వం, ఆణవమలము గాని, సూక్ష్మదేహ సంబంధి మాయిక మలము, కారణ దేహ సంబంధి కార్మిక మలమును లేనట్టిది శారీరిక సంబంధి వస, రక్త, శుక్ల, మజ్జ, మూత్ర, విష్ఠ, సైంఘాణ, నఖ, శ్లేష్మ, అశ్రు, దూషిక, స్వేద, కులకమును జిహ్వా మలము, ద్విప్రక మనుదంత మలము పదునాలుగు విధముల మలినము లేనిది 2) అవిద్యా సంబంధమైన మలము లేనిది విమలా, అమలా, నిర్మలా స్వరూపిణి

625) ఓం ఆతురాయై నమః

ఆతుర స్వభావము గలది, సర్వసంక్షోభ చక్రమునందు 'అనంగ కుసుమాది' శక్తులలో యనంగ వేదినీ, అనంగమదనాతురాయను శక్తులును గలవు. ఆతుర శబ్దార్థము రోగి బాధింపబడువాడు, భయపడువాడు యను అర్థములు గలవు ఇచట యాపేదన చెందమృత స్వరూపిణి, 'తాన్ విపక్షాన్ సురాన్ దృష్ట్వ చండికా ప్రాహసత్వరా'' ఉవాచ కాళీం, చాముండేతి విస్తీర్ణం వదనం కురు' యని యుద్యుక్త చెందిన రూపము 'క్రోధరక్తేక్షణా, హంతుం బ్రహ్మాణం జనితోద్యమా, సముద్ధాయ స్తరాస్త్రాభ్యాం యుయుధే భగవాన్ హరి' యని యసురపీడిత దేవతల పట్ల యాందోళన చెందును 'వవుః పుణ్యస్తథా వాతా, సుప్రభోఽభూద్దివాకరః। జజ్వలుశ్చాగ్నయః శాంతా, శాంతాదిగ్జనితస్వనా' అసుర సంహారానంతర మునీరోగ స్థితి యజ్ఞయాగాది క్రియకలు యధావిధి జరుగుచు దేవతల హవనము వారికి యందుచుండ దేవికి ప్రశాంతత గలుగును కాని యామె లీలలలో యసురులు కాలగతిలో బాధలు కలిగించుచు హింసను ప్రేరేపించుట చేయాతుర స్వభావము గలిగియున్నది

ప్రగల్భా వారుణీ క్షామా* దర్శినీ విస్ఫులింగినీ ధ్యాయంశ్శివ
భక్తి।* సిద్ధి। సదాప్రాప్తి। ప్రాకామ్యా మహిమాఽణిమా(93) భుక్తి

626) ఓం ప్రగల్భాయై నమః

ప్రగల్భ రూపిణియైన దేవి పరమేశ్వరీ సృష్టి, స్థితి, లయ, తిరోధాన, యనుగ్రహాది పంచకృత్యములు అందు ప్రౌఢత్వము (ప్రతిభ) గలది 2) దైత్యదానవ సంహార శీలి, క్షిప్రప్రసాదియగుట తన సమ్మోహనము లేక, ప్రపంచమునందేదియు నుండని దగుటచే ప్రగల్భాయందురు ప్రగల్భా యన ప్రత్యుత్పన్నమతియైన నాయికారూపము 'ఆధారభూతా జగతస్త్వమేకా' 'మేధా సరస్వతీ, భూతి, భ్రాంతి' భూతేషు సతతం వ్యాప్తం లక్ష్మీ లజ్జా మహావిద్యా శ్రద్ధా పుష్టిస్వధా ధృతి మహారాత్రి మహావిద్యా' స్వరూపిణియైన దేవీ రూపం

627) ఓం వారుణ్యై నమః

వారుణీరూపమైన దేవి 'అధశ్చోర్ధ్వం స్థితా నాడీ వారుణీ సర్వకామినీ। పుంసా దేవతాప్రోక్తా, వారుణీ వాయుదేవతా' వాయు సంచారము గలనాడి వారుణీ। దీని నడుపు చేయుట వలన బ్రహ్మ రంధ్ర సహస్రారము నుండి అమృతస్రావము అగును దాని సేవన వలన నానంద, తన్మయత, ప్రకృతి జ్ఞానహీనత గలుగును 'సైషాభార్గవీ వారుణీ విద్యా' వారుణీ విద్యయే బ్రహ్మవిద్య, తత్సాధనచే అమృత పానమద విహ్వలత గలుగును 2) ఖర్జూరము వలన పుట్టిన రసము వారుణి దాని పానమున ప్రాణికుత్తేజము కలుగుచుండును అట్టి మధుపాన రూపిణి అమృతసారి రూపిణియైన దేవి

628) ఓం క్షామాయై నమః/ఓం ఛాయాయై నమః

క్షామరూపిణియైన దేవి క్షామా కృశించిన యబలరూపము దుర్భిక్షము కృశాంగి, సాముద్రిక లక్షణము 2) 'యాదేవి సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా' శక్తి రూపము సర్వత్ర ఛాయగా వ్యాప్తము 'ఇంద్రియాణాం అధిష్ఠాత్రీ భూతానాంచాఖిలేషు చ, భూతేషు సతతం వ్యాప్త్యై' దేవీ రూపము 'బ్రహ్మేశ గుహ విష్ణూనాంత థేంద్రస్య చ శక్తయః వినిష్క్రమ్య తద్రూపై చండికాయయా' ఛాయాశక్తి రూపము

629) ఓం దర్శిన్యై నమః/ఓం శశిన్యై నమః

దర్శినీ రూపమున దేవి దర్శ యని పేరు యమావాస్య శక్తికి రూపం అందుజేయబడిన యాగము కుహూయన చంద్రకల కనబడని యమావాస్య. చంద్రకళ యుక్తయమావాస్య దర్శయగును పదునారవ షోడశీయైన సాదాఖ్యకల విస్తృత రూపము పితృదేవతల కతి ప్రీతికరము అట్టికలా యుక్త యమావాస్య రూపము మహారాత్రి రూపము మహామాయా యర్చనాదులకును విశేషము అట్టి దర్శరూప శశి, యందు చేయు యాగస్వరూపి

630) ఓం విస్ఫులింగిన్యై నమః

విస్ఫులింగ రూపమైన దేవి విస్ఫులింగములు విషపోషము అగ్నికణముల విస్ఫోటన రూపము, అగ్నిపర్వతముల నుండి వెలువడు యగ్నిగోళముల రూపమై యున్న శక్తి. 'బిభ్రాణామనలాత్మికాం శశిధరాం, దుర్గాం త్రినేత్రాం భజే' సూర్యచంద్ర యగ్నినేత్రములు యని-ఫాలనేత్రము తెరువగా నందుండి వెలువడినవి విస్ఫులింగములు మన్మథుడు భస్మమాయెను 'సర్వదేవ శరీరేభ్యోయా ఆవిర్భూతా యామితా తేజతా' అట్టి సర్వతేజ స్వరూపియైన దేవి విద్యుద్దామ సమప్రభాయని సాముదాయిక రూపము

631) ఓం భక్త్యై నమః

భక్తిరూపమైన దేవి భక్తచిత్త, భక్తనిధి, భక్తమానసచరి, భక్తసౌభాగ్యదాయినీ, భక్తిగమ్యా, భక్తప్రియా, భక్తివశ్యాది యనేక నామముల కీర్తింపబడును దేవమునిగణ స్తోత్రములు వేదపఠనముల రూపము తానేయై విరాజిల్లు దేవీరూపము భక్తిగూడ నవవిధములు, దాస్య సఖ్యాదులనేదియైనను దేవీదత్తమనమున సంకల్పించిన, దాన మోక్షము గలుగును భక్తిముక్తి ప్రదాయిని యగు దేవి

832) ఓం సిద్ధ్యై నమః (అష్టసిద్ధుల వివరము ప్రారంభం)

అణిమా, మహిమా, ప్రాప్తి ప్రాకామ్య మహిమాతథా ఈశిత్వంచ వశిత్వంచ తదా కామావసాయితా దూరశ్రవణమేవేతి, పరకాయ ప్రవేశనమ్ మనోయాయిత్వ మేత్యేతి, సర్వజ్ఞత్వ మభీప్సితం వహ్నిస్తంభం, క్షుత్పిపాసా నిద్రాస్తంభనమేవచ కాయవ్యూహంచ వాక్సిద్ధిం మృతసయనమీప్సితమ్ సృష్టీనాం కరణం నైవ ప్రాణాకర్షణ మేవచ ప్రాణానాంచ ప్రదానాంచ లోభాదీనంచ స్తంభనం ఇంద్రియాణాం స్తంభనా, బుద్ధిస్తంభన మేవచ' సిద్ధిరూపిణియైన దేవి సర్వసిద్ధి ప్రదాయిని, సర్వార్థ సాధకి, సర్వసంపత్ప్రదాయిని యగు దేవిరూపము 'అణిమా మహిమాచైవ గరిమా లఘిమా తథా ప్రాప్తి ప్రాకామ్యమీ శిత్వంవశిత్వంచాష్టభూతయో' అష్టసిద్ధులు యని గలవారు సిద్ధులు వారిచే కాంక్షితము సర్వసిద్ధులు ప్రసాదించు దేవి మహా చింతామణి రత్నము గలిగి సర్వకామ్యప్రదము నొసగు వెలుగు, కారణానంద విగ్రహము

833) ఓం సదాప్రాప్త్యై నమః/ఓం సదాప్రీత్యై నమః

ప్రాప్తిరూపమైన దేవి 'సదోదితా, సదాప్రాప్తా, సదాతుష్టా, సదా శివా, సదాప్రీతాది రూపముల వెలుగు దేవి పరమేశ్వరి నిత్య బ్రహ్మ స్వరూపము స్మరణ మాత్రమున దృశ్యమాన యగు స్వరూపము. సర్వకాల సర్వావస్థల యందు 'దుర్గేస్మృతాహరసి భీతిమశేషజంతో స్వస్థై స్మృతామతి మతీవ శుభాందదాసి' భక్తుల సంరక్షకిగా యందు బాటులో నుండు దేవి, నవదుర్గలలో నవమం సిద్ధిదా ప్రోక్తాయని తొమ్మిదవ దుర్గా రూపం సదా ప్రాప్తించుచుండును 'మామేవ మాతరనిశం కలయంతు నాన్యే' యని సదా ధ్యానించ, సదా ప్రీతినిడుచుండును ప్రాప్తియను సిద్ధి, తలచినది లభించు చుండును అట్టి శక్తిదాయిని ఆమె

834) ఓం ప్రాకామ్యై నమః

ప్రాకామ్య సిద్ధిరూపిణియైన దేవి తనయొక్క జ్ఞానేంద్రియ సహాయమున దూర విషయముల గ్రహింపగలుగుట, ప్రాప్తి తన యభీష్టముల నెరవేర్చుకొనుట ప్రాకామ్య సిద్ధి యనబడును ఐశ్వర్య భేదము, ఇచ్ఛ కద్దులేనిరూపము నీటియందు వలెనే, భూమియందు చరించుట, మునుగుట, తేలుశక్తిగల సిద్ధి 'స్వేచ్ఛాసాధకమైన శక్తిరూపము

835) ఓం మహిమాయై నమః

మహిమా సిద్ధిరూపిణి 'పెద్దదిగా చేయగలుగుట, బృహత్ స్వరూపి యగుట, అష్టైశ్వర్యములలో నొకటి. విభవము యొక్క విస్తారరూపము, మహత్వం గలిగియుండుట రుద్రరూపియైన హనుమాన్ సురస, లంకిణి శత్రు పోరాటమున సముద్రము దాటు వేళల మహిత రూపము'ను ప్రదర్శించి యుండెను అట్లే దేవి తన యష్టవిభూతుల సృష్టిజేసి, జగత్ శోషకులగు యసురుల సంహారమున మహితరూపము ప్రదర్శించినది మహామాయా స్వరూపిణి మహాసిద్ధులనిది యొకటి.

836) ఓం అణిమాయై నమః

అణిమాసిద్ధి రూపిణి. 'అణుభావ జగత్మూలం, భావి భవిత్రో రథేద వివక్షయా అణు పరమసూక్ష్మ, సయి ఏషా అణిమ్నై తదాత్మ్యం' తన స్వరూపమును చిన్నదిగా చేసికొనగలుగుట దీని స్వభావము. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' యని సంస్తుతించ బడినది సూక్ష్మరూప ధారణ శక్తి సర్వజీవగణముల యింద్రియ ప్రాణరూపిణియై సూక్ష్మరూపిగా వెలుగునది 'అణిమాది గుణారాధ్యా' అట్టి శక్తులచే నారాధింపబడును తద్విభూతి రూపియైనది

అణిమా మహిమాప్రాప్తి ప్రాకామ్య మహిమాతథా ఈశిత్వంచ వశిత్వంచ తదాకామావసాయితా దూరశ్రవణమేవేతి పరకాయ ప్రవేశనమ్ మనోయాయిత్వమేత్యేతి సర్వజ్ఞత్వ మభీప్సితం వహ్నిస్తంభం క్షుత్పిపాసానిద్రాస్తంభనమేవచ వాయువ్యూహంచ వాక్సిద్ధిం కృతాపయనమీప్సితమ్ సృష్టీనాం కరణం నైవ ప్రాణాకర్షణమేవచ ప్రాణానాంచ ప్రదానంచ లోభాదీనాం చ స్తంభనం ఇంద్రియాణాం స్తంభనం

వ బుద్ధిస్తంభన మేవచ యని అష్టసిద్ధుల వివరణ విస్తృతము

837) ఓం గరిమాయై నమః (లఘిమా 842గా వచ్చినది)

గరిమా రూపిణియైనది తన శరీరమును చాలా బరువు గలదిగా నొనర్చుకొనుట గరిమాసిద్ధి రూపం గరిమ యన గురుత్వం బరువుగా నుండుట పోకయైశ్వర్య విశేషము తృణావర్తుని సంహారము కృష్ణునిచే, ప్రలంబాసురుడు బలరామునిచే, లంఖిణి పోటము హనుమచే నీ శక్తివలనే విజయమందుట జరిగినది

ఈశాసిద్ధిర్వశిత్వా చ ఈశిత్వోర్ధ్వ నివాసినీ
లఘిమా చైవ సావిత్రీ గాయత్రీ భువనేశ్వరీ(84)

838) ఓం ఇచ్ఛాసిద్ధ్యై నమః/ఓం ఈశాసిద్ధ్యై నమః

ఇచ్ఛా సిద్ధిరూపమైనది ఇచ్ఛ, కోరికలు సిద్ధింప జేయు రూపము తన యభీష్టము నెరవేర్చుకొనగలుగుట, ప్రాకామ్య సిద్ధిరూపము, సర్వాశాపరిపూరక చక్రస్వామిని సర్వాభీష్ట ఫలప్రదాయిని అష్టైశ్వర్యాది సకల కామ్యముల నొసంగు కామ్యదాయిని యగు రూపము 2) ఈశా సిద్ధియనగ దూరదర్శన శక్తి గలది దూరశ్రవణ లోకాంతరగమనాది సిద్ధులలో నొకటి ఈశాసిద్ధియన దూరగత దృష్టిశక్తి గలిగినది దీర్ఘదృష్టి గలిగిన దేవి (ఈశా వివరణ)

ఇచ్ఛా వివరణ-రామేచ్ఛానామకారిణీ ఇచ్ఛాముప్త్యాత్మి రూపిణీ। శరీర కానన మత్త విభ్రోల్లాస కారిణీ। మత్తేంద్రి యోగ్రకలభా, రసనా కలభాషిణీ మనోగహన సంలీనా, ఉన్మదంత ద్వయాన్వితా మదోత్కటా వాసనావ్యూహ స్ఫూర్తిః ప్రసరద్వపుః సంసార దృష్టయోనామ తస్యా, స్వమర భూమయ భూయో యత్రాను భవతి నరోజయ పరాజయే। ఇచ్ఛానామ నిహంత్యేతాన్ కృపణాన్ జీవసంచయాన్)

839) ఓం వశిత్వసిద్ధ్యై నమః

వశిత్వ సిద్ధిరూపము సర్వభూత ప్రపంచమును తనకు వశ పడునట్లు చేసికొనగలుగు శక్తి స్వరూపం. శివుని అష్టైశ్వర్యములలో నొకటి సమస్తమును వశపరుచుకొనగల సిద్ధిస్వరూపము ఉపాసనలో అణిమాసిద్ధి, లఘిమాసిద్ధి, గరిమాసిద్ధి, మహిమా సిద్ధి, ఈశిత్వసిద్ధి, వశిత్వసిద్ధి, ప్రాకామ్యసిద్ధి, భుక్తిసిద్ధి, ఇచ్ఛాసిద్ధి, ప్రాప్తిసిద్ధి, కామసిద్ధియని దశ మహాసిద్ధులు దేవి ఖడ్గమాలా స్తోత్రంలో నుదాహృతం. ప్రథమ చతురస్రపూజయందు వినియోగం రాజమాతంగి మంత్రమున సర్వరాజ వశంకరీ, సర్వపురుష వశంకరీ, సర్వదుష్టమృగ వశంకరి సర్వసత్వ వశంకరీ, సర్వలోక వశంకరి యని మాతృ మహిత కీర్తించ బడినది. అష్టి ఆశేషజన మోహినియైన సర్వసత్వ స్వరూపిణియైన వశంకరీ రూపం.

840) ఓం ఈశిత్వసిద్ధ్యై నమః

ఈశిత్వ సిద్ధి స్వరూపము తన శక్తి సామర్థ్యముల నితరులయందు కలిగించుట, ఈశిత్వము 'ఆరాధితాస్తుతాచైవ, సర్వసిద్ధి ప్రదాయినీ, నానారత్న ప్రదాదేవి, సర్వలోకమహేశ్వరి' 'మహాలక్ష్మి మహాకాళీ చైవ బ్రాహ్మీ సరస్వతీ' ఈశ్వరీ పుణ్యపాపానాం సర్వలోకమహేశ్వరీ–అష్టి ప్రభుత కలిగిన రూపము 'ప్రసీద విశ్వేశ్వరీ పాహివిశ్వం త్వమీశ్వరీ దేవి, చరాచరస్య' ఈశిత్వభావ కలుషీకరిణాము సంతి బ్రహ్మోదయః ప్రళయాభిభూతా ఏకస్యయేవ జగతి స్థిరసిద్ధి రాప్తే-యని కీర్తింపబడి సర్వలోకముల ఈశ్వరియైన యంబ విభూతియే ఈశిత్వసిద్ధి ఈసిద్ధి ప్రాప్తించిన -సర్వలోకానాం ప్రభుర్భవేత్ యని భక్తులకు సామ్రాజ్యసిద్ధి గల్పించు దేవి

841) ఓం ఊర్ధ్వనివాసిన్యై నమః

ఊర్ధ్వతలమందు నివసించునది ఆమె పునికి భూమిపై ఎత్తయిన శిఖరములు గల హిమాలయ పర్వతములు హిమాచల కృతాశ్రయా యందురు 2) నిర్గతం సుమహత్తేజం బ్రహ్మణః శంకరస్యచ అన్యేషాం చైవ దేవానాం శక్రాదీనం శరీరతః అతివతేజసః కూటం జ్వలంతమివ పర్వతం దదృశుస్తే సురాస్తత్ర జ్వాలావ్యాప్త దిగంతరమ్। తదభూన్నారీ వ్యాప్తలోకత్రయం ఆమె స్వర్గపర్యంతం వ్యాప్తినొందిన

యంతరిక్ష రూపి 3) మణిద్వీపము బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ప్రయాణము చేసి యచట పరబ్రహ్మాదుల గమనించి, బిందుపరిధి చేరి స్త్రీత్వ భావమునంద విశ్వమందున్నతమైన తలమున నుండునది అట్టి మూడు యున్నత తలముల వ్యాప్తమై వసించునది దేవీ భాగవతములో గోలోకమున్నతము యని యందు వ్యాప్తినందిన యాహ్లాదినీ శక్తియని నెంచవగును

642) ఓం లఘిమాయై నమః (637 తదుపరి సిద్ధి)

లఘిమా రూపిణియైన దేవి అణిమాద్యష్టసిద్ధులలో నొకటి శరీరమును తేలిక జేసుకొని, వాయు మార్గమున పయనించగల శక్తి లోకాంతరగమన శక్తి. దీనివలన గలుగును ఐశ్వర్య విశేషమును లాఘవము యను యుద్ధము గలదు నేర్పరితనము, సులువుగా పనులు చేసికొనగలదు

643) ఓం గాయత్ర్యై నమః

గాయత్రి రూపిణియైన దేవి 'గాయంతం త్రాయతే యస్మాద్గాయత్రీ తేన కథ్యతే'' గాయనాద్గమ నాద్వాపి గాయత్రీ త్రిదశార్చితా'' గాయత్రీ గాయనాత్మత్వాత్'' గాయతిచ త్రాయతేచ' యను పెద్దల భావములు ఉపాసించిన వారి ప్రాణముల రక్షించు దేవియై యున్నది ప్రాతః స్మరణ సవితాశక్తి 2) పరబ్రహ్మ చైతన్యశక్తియే గాయత్రి, సావిత్రి, సరస్వతిగా త్రికాలముల వ్యాప్త సంధ్యారూపము స్తుతించుటచే బ్రహ్మతేజము సంప్రాప్తమగును భరణ, రమణ, గమనక్రియాచరణమున భర్గశక్తియే సావిత్రీ బ్రహ్మానంద సంతత ప్రవాహ రూపమున ప్రవించు శక్తి సరస్వతి వేదత్రయ సారరూపమైనది గాయత్రి 'గాయత్రీ వా ఇదం సర్వం సర్వవ్యాపక రూపిణి వేదమాత' 3) ఓం యను వ్యాహృతి నాదము నుండియే ప్రపంచ ముద్భవించినది. ప్రపంచ వ్యాప్తమైన నాదమే యనాహతమై దహరా కాశమున వర్తిలును నాదాను సంధానము చేసి గాయత్రీ మంత్రానుష్ఠానము చేయవలెను అష్ట విధ ప్రకృతులకన్న పరమైనది సర్వప్రపంచమున నంతర్లీనమై జీవభూతముల ప్రాణధారణ రూపియైన నాదశక్తి పరాప్రకృతి గాయత్రీ రూపమేయనదగును 4) త్రికూటము, త్రిపదగాయత్రి మహామంత్ర రాజము బ్రహ్మక్షత్రియ వైశ్యులకుపనయన కాలమందున నుపదేశింపబడు బ్రహ్మవిద్య జీవితాంతం వరకు నుపాసింపవలసి యున్నది గాయత్రీ ఛందం, విశ్వామిత్ర ఋషి, సవితృదేవతా, అగ్ని ముఖముగను, బ్రహ్మశీర్షముగను, విష్ణు హృదయము, రుద్రశిఖా, పృథివీయోనిగను, శ్వేత వర్ణాత్రిపదా, షట్కుక్షి సాంఖ్యాయన సగోత్రః పంచప్రాణవాయు, పంచశీర్ష, చతుర్వింశ త్యక్షరా రూపము బ్రహ్మసాక్షాత్కారమే వినియోగము గల మహామంత్రరాజము తురీయపాదోపేతమైన ద్వాత్రింశత్ వర్ణాత్మకముగా వెలుగును ఈ పాదము వానప్రస్థులకే యని యందురు. ప్రథమము త్రికూటాత్మకం, ద్వితీయం చతుష్కూటాత్మకం, షోడశ కలాయుక్తము, ఇహపరలోక సౌఖ్యప్రదాత, బ్రహ్మజ్ఞాన ప్రదాయిని 'నగాయత్ర్యా పరం మంత్రం నమాతుః పరదేవతా' యని గాయత్రి మాతా స్వరూపం, ప్రకట గాయత్రీ, గుప్తగాయత్రి యని రెండు విధములు గుప్త విద్యారూపమైన రెండవది బాల, పంచదశీ, షోడశ్యాది విద్యారూపములుగా నుపదేశింపబడుచున్నది 5) విశ్వప్రాణదాయకు డైన సూర్యుడు త్రిమూర్తి స్వరూపుడు సవితా, భర్గ, మార్తాండాది రూపము గాయత్రి, సావిత్రీ సరస్వతీ శక్తిరూపములుగా, భ్రూస్థాన కేంద్రమున ధ్యానింపబడు సంధ్యా రూపములు సృష్టి, స్థితి, లయాదులకు ప్రతీకలైన ఉదయ, మాధ్యాహ్నిక, సాయం సంధ్యల నవశ్య ముపాస్యనీయము ఆయురారోగ్య జీవన ప్రదాతయైన సూర్యశక్తి, తత్కారణదేవతా గాయత్రీ శక్తియే, ద్విజత్వసాధనీ విద్య, గాయత్రీ ప్రాణరూపము హంసరూపియైన ప్రాణములు అహోరాత్ర కాలపరిమితిలో యిరువదియొక్క వేల యారువందల మారు ఉచ్ఛ్వాస నిశ్వాసము రూపముల పైకిక్రిందికి ప్రసరించు చుండును హంసగాయత్రి, మంత్రగాయత్రి అటులే వివిధ గాయత్రి ధ్యానరూపములు గలవు ప్రతిదేవత స్వరూపమునకు సంబంధించి ధ్యానరూపగాయత్రియే నిర్దేశింపబడినది. బ్రాహ్మణులకు విశ్వామిత్ర ఋషి, గాయత్రీ ఛందస్సును, క్షత్రియులకు హిరణ్యస్తూప ఋషి, బృహతీ ఛందస్సు రూపము, వైశ్యులకు వామదేవ ఋషి జగతీ ఛందస్సుగను గల రూపము ధ్యేయ

మందురు 6) బ్రహ్మోపదేశ కాలమున ధరింప జేయు యజ్ఞోపవీతము గాయత్రి సంజ్ఞగలది మూడు తొమ్మిదులు, ఇరువది యేడు పోగులు త్రివ్యాహృతియుక్త గాయత్రి మాత చతుర్వింశతి అక్షరముల ప్రతీక ఇచ్ఛా, జ్ఞాన క్రియాశక్తుల వ్యవకలనాంశములని కూటమి రూపముగా వ్యక్తమందురు 7) ధ్యానరూపము బ్రహ్మాణీ, చతురానన, అక్షవలయ, కుంభైం స్రుక్ స్రువౌ కరైః బిభ్రాణాం అరుణకాంతిం ఇందువదన, ఋగ్రూపిణీ, బాలికా, హంసారోహణ, కేళి రంభరమణీ, శుభ్రాంశుకా భూషితా యని బ్రాహ్మణి యని బ్రహ్మాణి ధ్యానము రూపమును ప్రాతః సంధ్య నిర్దేశించినది 8) సప్తశతియందును హంసయుక్త విమానాగ్రే సాక్షసూత్రక మండలు 'ఆయాతః బ్రాహ్మణ శ్శక్తిః బ్రహ్మణిసా-భిదీయతే హంసయుక్త విమానస్తే బ్రహ్మణీ రూపధారిణీ, కౌశాంభ, క్షరికే దేవి'' కుండులు జలాక్షేప హతౌజస్కాన్ హతౌజసః బ్రహ్మణీ చాకరోత్ శత్రూన్ యేన యేనస్మ ద్ధావతి' యని పరమేశ్వరి విభూతియైన బ్రహ్మణిశక్తి యభివర్ణించబడి యున్నది. 9) ఉపనిషత్తులలో ఓంకారాత్ వ్యాహృతిర్భవతి, వ్యాహృత్యాగాయత్రి భవతి, గాయత్ర్యా సావిత్రీ భవతి, సావిత్ర్యా సరస్వతీ భవతి, సరస్వత్యా వేదా భవంతి, వేదేభ్యో బ్రహ్మభవతి, బ్రహ్మణో లోక భవంతి, తస్మాల్లోకా ప్రవర్తంతే' యను వివరణ గలదు

644) ఓం సావిత్ర్యై నమః

సావిత్రీరూపిణియైన దేవి 'బుద్ధి, కర్మాణి వా-స్మాకం, అయం ప్రేరయతి, తస్యతు దేవస్య సవితుః భ్యాతమ్' బుద్ధికర్మల ప్రేరేపించువాడు సవిత సర్వస్వభావములు కలిగించువాడు, పవనము వలన పావనము చేయుట వలన సవితః సవిత సకల జగత్తుల సృజన చేయువాడు, అట్టి సవితృశక్తియే సావిత్రి తేజోమయమగు భర్గశక్తియే భరణ, రమణ, గమనముల నొనర్చునది సావిత్రి గాన సూర్యమండలమందున శక్తియు, పరమశివుని భార్యయు సావిత్రీ యని యందురు దేవతలచే పూజింపబడునది, యోగులచే నారాధింపబడునది, స్మృతులచే కొనియాడబడునది సహజ శుద్ధమైన రూపము 2) స్రవించుట యన ప్రవహించుటచే తేజము గలుగును గాన సావిత్రీ యందురు మాధ్యాహ్నిక యజ్ఞస్వరూప సావిత్రి ఆమె వదన గహ్వరము నుండి వేదములు పురుష రూపమునవెల్వడినట్లు భారతేతిహాసమొకటి గలదు ఈ సావిత్రియే ప్రభావతి, మందేహాది రాక్షససంహారిణియును శుద్ధ స్ఫటిక, శుద్ధ సత్వస్వరూపిణి, తపస్విని, బ్రహ్మరూప సర్వసంస్కారి, పరమానంద రూపిణీ, పంచప్రకృతుల యందు సావిత్రి నాలుగవది పుష్కర తీర్థాధిష్ఠాత్రి సావిత్రి దేవత యని పద్మపురాణం 3) మాధ్యాహ్నిక సంధ్యలో రుద్రాణి రూపము 'నవ యౌవనా, త్రినయనీ, వ్యాఘ్ర చర్మాంబరా, ఖట్వాంగ త్రిశిఖా, అక్షసూత్ర వలయా, అభీతిర్దధతీ, విద్యుద్విలంబి జటాకలాప, విలసద్ బాలేందుమౌళిశ్రియా, సావిత్రీ వృషభస్థితా' సర్వసంపత్ప్రదాయినీ రూపం 4) మహేశ్వరీ వృషారూఢా, త్రిశూల వరధారిణీ, మహావలయా ప్రాప్తా, చంద్రరేఖా విభూషణాయని సప్తశతి పేర్కొనెను

645) ఓం భువనేశ్వర్యై నమః

భువనానాం లోకానాం ఈశః భువనేశ్వరీ రూపము భువనములు పదునాలుగు అతల వితల, సుతల, తలాతల, రసాతల మహాతల, పాతాళములను, సప్తాధస్థిత భువనములు, భూః,భువ, సువః, మహః, జనః, తపః, సత్యమనెడు యూర్ధ్వస్థితభువనములు వీటికన్నిటికీ ఈశ్వరి, ప్రభ్వి, భోగిని రూపమైన పరమేశ్వరి, హ్రీంకార మంత్ర స్వరూపిణి, భువనేశ్వరిని ప్రాతః కాలమున భైరవీరూపమున, సాయంకాలమున పార్వతీ రూపమున నుపాసించుట, ఫలదాయకమని పెద్దలందురు 'శివేన సహితాం దేవిం భావయేద్భువనేశ్వరీం'

మనోహరా చితా దివ్యా దీవ్యుదారా మనోరమా
పింగళా కపిలా జిహ్వా రసజ్ఞా రసికా రసా(95)

646) ఓం మనోహర్యై నమః

మనోహరి రూపము గల దేవి మనస్సుల హరింపజేయు వశ్యరూపిణియైన దేవి 'మహామాయా హరస్చైషా, తయా సంమోహ్యతే జగత్। జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా'' బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి' 'మహామోహాచ భగవతీ మహాదేవీ మహాసురీ' అందరిని మూఢ బుద్ధుల చేసి మనసు హరించు రూపము 'సౌమ్యా సౌమ్యతరా శేష సౌమ్యేభ్య స్త్వతి సుందరీ' యని త్రిభువన సుందరి త్రిపురసుందరి యను, స్తుతి కోల్పోయి యసురగణాదుల యగ్నియందు పడు శలభముల వలె యామెచేత వధింపబడిరి 'ఈషత్సహాసమమలం పరిపూర్ణ చంద్రబింబానుకారి, కనకోత్తమకాంతం। అత్యద్భుతం ప్రహృతమాత్తరుషా' అని మహిషాసురుని చిత్తుని చేసిన రూపమామెయే

647) ఓం చితాయై నమః

చితారూపిణి యైన దేవి శవదహనాధారమైన పొయ్యి రూపము శ్మశానవాస నిలయా యని ఆరంభించిన నామము అట్టి శ్మశానమందువెలుగు చిచ్చునది, చితా,కాయక, మానసిక, ఆణవిక, పాపకర్మల భస్మము చేసి దేహవిముక్తికి యాధారమైన యగ్ని క్షేత్రము రుద్రభూమి పునర్జన్మాది మోక్షప్రాప్తిని గలిగించు దేవి పాలనలో జీవుల మార్గవిధానము నిర్ణయించబడును

648) ఓం దివ్యాయై నమః

దివ్యరూపియైన యంబ, 'ద్యోతన వాన్ స్వయం జ్యోతిశ్చిత్' 'దివివాస్యాత్మనిభవః అలౌకికో వా దివ్యోహ్యమూర్తి పురుషః దివ్యాస్తు' దివ్యులు దివియందుండు వారు అంతరిక్ష చరులు అట్టి మనోహరమైన యాకారము గలది అంతరిక్షస్థితి యై యసురసంహారము చేసి రక్షించు శక్తి దేవతలకు సహజముగు ప్రకాశ స్వరూపిణి. 'హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజత స్రజాం '' 'సౌమ్యా సౌమ్యతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సుందరీ''సూర్యచంద్రాగ్నిప్రభాయుత దివ్యరూపి, స్ఫురద్దర్శన దంష్ట్రాభాసా భీమరూపాఽపి భూమిప, రూపసౌభాగ్య కాంతీనాం సాప్రతిష్ఠా మహాశ్రియా' యని దివ్యమంగళ విగ్రహము

649) ఓం దేవ్యై నమః

దేవీ రూపమైనది ఆకృతిమమనాద్యంతం, వేదనందేవ ఉచ్యతే 'సర్వదేవ మయిమీశాం లక్ష్మీమీమాం స్పృహ, రౌద్రాయై, నిత్యాయై, గౌర్యై, ధాత్ర్యై, జ్యోత్స్నాయై. ఇందురూపిణ్యై యనియును, దేవీ దేహశరీరేభ్యో జగత్రయ హితైషిణి''మేధ సరస్వతి బ్రాహ్మి, చాముండాది యనేక శక్తుల సముదాయమైన సమగ్ర మహాదేవీ రూపమై యున్నది

650) ఓం ఉదారాయై నమః

ఉదార స్వరూపురాలై యున్నది భక్తాభీష్టముల నధికముగా ప్రసాదించుటలో నుదారమైన మనసుగలది దేవి 'కళ్యాణి ప్రణతో వృద్ధ్యై సుద్ధై కుర్మో నమోనమః ''శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవాం బ్రహ్మేంద్ర గంగాధరాం, త్వాం త్రైలోక్య కుటుంబినీం' యని సకల జీవుల యెడ మాతృస్వభావం గల దేవి 'కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతన భవతి' క్షమాగుణమున దోషములు హరించుచు తన్ను నమ్ముకున్న వారిని త్రైలోక్యాప్తమై బ్రోచెడు తల్లి

651) ఓం మనోరమాయై నమః

మనోరమ రూపిణియైనది మనోహరమైన సౌందర్యము గలది బుద్ధి, శక్తిభేదము, మనసు నందు సదారమించునది భక్తుల జపపూజాపాసనాదులలో మంత్రరూపమున, సగుణ రూపమున ప్రబోధించి, వారి మనసులందు నర్తించునది 'మనసః కామమాకూతిం, వాచం సత్యమశీమహి ''పశూనాం రూపమన్నస్య మయిశ్రీః శ్రయతాం యశః' అట్టి మనోయాహ్లాద రూపమైనదేవి 'రూపై రనేకై ర్బహుధాఽత్మమూర్తి కృత్వాంబికే తత్ప్రకరోతి నాన్యా ''ప్రణతానాం ప్రసీదత్వం దేవి విశ్వార్తిహారిణి।

త్రైలోక్య వాసినా మీడ్యే లోకానాం వరదాభవ' 'విశ్వాస్య పరతా శక్తి నారాయణి' 'త్వయ స్వమనస్తాసకలా జగత్సు త్వయ్మైకయా పూరితమంబ' యని యెవరి మనసుకు నచ్చినరీతి మనోన్మయ రూపమున నర్తించుదేవి

652) ఓం పింగళాయై నమః

పింగళ రూపిణియైన దేవి పింగళ యన రుద్రుడు అగ్ని,వత్సరము,నిధి, నాగ,యక్ష భేదములు యని యందురు పింగళాయన రుద్రాణి ఇడ పింగళ, సుషుమ్న యను ముఖ్యనాడీ కూటమి గలదు అందు సూర్యనాడి, ప్రాణ సంచారమునకు ముఖ్యములట్టి పింగళ రూపిణియైన నలుపు, పసుపు కలిసిన వన్నె, యోగచూడామణి ఉపనిషత్తునందునాడీ వివరణ గలదు

653) ఓం కపిలాయై నమః

కపిలారూపిణియైనది అగ్నిరూపం, విష్ణువు, మునియని, గోరోజన వర్ణమని, కపిలాయని, పుల్లావు,నది, పుండరీక దిగ్గజశక్తి యని యర్థములుగలవు విష్ణుశక్తియైన మహామాయా స్వరూపమున నున్న దేవి కపిలగోవు గూడా విశేషశక్తి రూపిణియని, దైవాంశ గల గోవులలో కపిల శ్రేష్ఠమని, యుక్తిశక్తి కపిలారూపిణి

654) ఓం జిహ్వాయై నమః

జిహ్వారూపిణియైన దేవి జిహ్వాయన యగ్ని నాలుక, అగ్నిజ్వాలారూపం, నాలుక రసనేంద్రియము, 'జ్వాలా కరాళ మృత్యుగ్రం' నోటినుండివెలువడు అగ్నిజ్వాలలు గల మూర్తి భేదము జలతత్త్వ స్వరూప రసనేంద్రియము రక్తజిహ్వయని,రక్తబీజవధకై చాపిన నాలుకపై, రక్తబిందువులు భూమిపై పడకుండగా యాస్వాదించిన లలితజిహ్వరూపిణి, రుచితెలిసికొను నాల్క శక్తియుదేవి రూపమే

655) ఓం రసజ్ఞాయై నమః

రసజ్ఞయైనరూపము 'పంచకోశాంతరే, అపరోక్షతయా భాసమానం, సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ సోఽయం మధురాది రసవత్సదా యోగిభి అవ్యవధానేనా ఆస్వాదనీయ భావః సర్వదేశ, సర్వకాల సుఖానుభూతిః రసజ్ఞః' ఇతి రసనేంద్రియ స్వరూపముయైనది పై నాలుక కనుబంధము 2) రసజ్ఞః నవరసములు భావప్రదర్శనా యుక్తములు శాంతాది నవరసములు భావపుష్టిగల యానందరసము ప్రధానముగా ధ్యేయము ఆనంద స్వరూపిణియైన దేవి బ్రహ్మానంద ప్రజ్ఞాన ఘనస్వరూపిణి రూపము శృంగారాది నవరసముల సారము గ్రహించు పరిణత సాముదాయకానంద స్వరూపిణి.

656) ఓం రసికాయై నమః

రసికయైన దేవి బ్రహ్మానందము నందు నోలలాడునది పూర్ణానుభవము గలది. రసికా సచ్చిదానంద స్వరూపిణి సృష్టిస్థితి లయ తిరోధానుగ్రహాది పంచకృత్యములు సలుపుచు నిత్యానందార్ణవ మునిగి తేలుచు 'మహాపద్మవనాంతస్థ కారణానంద విగ్రహా' గా పరబ్రహ్మానుభూతి మగ్నయైన దేవి

657) ఓం రసాయై నమః

రసస్వరూపిణియైన దేవి నవరసముల,రతి,హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జుగుప్సా విస్మయ శమాదులని పాఠమొకటి శృంగార వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, భీభత్స, రౌద్ర, శాంత నరసములని మరొక పాఠము సదాశివ సంయోగే శృంగారః యుద్ధభూమౌ వీరరసః భక్తపాలనే కరుణః, విభూతి ప్రస్తావే, అద్భుతః, హాస్యద్వివిధ ,పరిచారకాగణే మృదుహాస, రణాంగణే అట్టహాస, హుంకారాది ఘోషశబ్దయుతే భయానకః, శిరస్త్రాణముండ ధారణ సమయే భీభత్సః, శూల విదారణే రౌద్రః, అసురసంహారానంతరే శాంతః, యన శాంతా ద్విగుణితస్వనా యని యన్ని రూపముల నన్ని రసముల కాకారమై వీటి కలితమైన యానందాం బుధియున్నట్టియా దేవి రూపము రసావధిరూపమే.

సుషుమ్నేడా యోగ*వతీ గాంధారీ నవకాంతకా భోగ నర
పాంచాలీ రుక్మిణీ రాధా రాధ్యా భీమా చ రాధికా(88)

658) ఓం సుషుమ్నాయై నమః

సుషుమ్నా రూపిణి దేవి ముఖ్యనాడీ స్వరూపములు సుషుమ్నా, ఇడా, పింగళలు భ్రూస్థానము త్రివేణివలె కలిసి యుండి ప్రాణ సంచారమున కుపయోగ పడును పింగళ యను దాని వివర ముందు వచ్చియున్నది(652) సుషుమ్న నాడి బ్రహ్మనాడి/రాకా యందురు వీణాదండమ నుండి మస్తకము వరకు వ్యాప్తము అష్టప్రకృతి రూపమైనది అధిదేవత శివుడు సుషుమ్నకు దక్షిణముగా పింగళా యను యుత్తరాయణ సంబంధి సూర్యనాడి అదధి పతిబ్రహ్మ రూపము సుషుమ్నకు వామభాగమున యిడా యను దక్షిణాయన సంబంధీ చంద్రనాడియు గలదు నా మండలము డెబ్బది రెండువేల నాడులు గలది అందుపదునాలుగు ముఖ్యమైనవి సుషుమ్న పింగళా,ఇడా, సరస్వతీ,పూషా,వరుణా, హస్తి,జిహ్వ, యశస్వినీ, అలంబుసా, కుహూ, విశ్వోదరా పయస్విని, శంఖినీ, గాంధారి యనునవి ఆయా నామములనీ నాడీ సాముదాయికశరీరమునం పరమేశ్వరీ రూపము నాపాదించుకొనవచ్చును

659) ఓం ఇడాయై నమః

ఇడాస్వరూపిణియైన దేవి 1) ఇడా సరస్వతీ,భారతీయని త్రిలోక త్రికాల వ్యాప్త దేవీత్రయము యజ్ఞకర్తగా యిడాదేవిని యగ్నితోపాటు నాహ్వానింతురు ఇడా, శాసని, యజ్ఞాంక కాళిని, దేవహూ ర్యనుయజ్ఞిని బ్రహ్మవిద్యారూపిణియైన వేదవాణి మనుసంబంధిని, గోరూపిణి దేవిని యిడ యందురు 'ఇడాసై మానవీతి యజ్ఞాను కాశిన్యాత్''మాతా రుద్రాగీం వసో విశం, వాచమురీ యంతి' 2) పై నాడీ వివరముల ముఖ్యతయ మందొకటి వామభాగ వ్యాప్త చంద్రనాడీ స్వరూపము ఇడా పింగళా సంధి యమావాస్య. ఇడా కుండలినీ సంధి చంద్రగ్రహణ సమయమని, అటులే పింగళా కుండలినీ సంధి, సూర్యగ్రహణ సమయమని, పింగళా ఇడా సంధి పూర్ణమాసి యనీ యందురు మూలాధార ప్రవేశం అధ్యవిష్ణువు,ఉచ్ఛ్వాస, నిశ్వాసములు మాస సంక్రాంతులనీ వివరము గలదు

660) ఓం యోగవత్యై నమః

యోగవతీరూపిణి యోగము నాలుగు విధములు మంత్రరాజ, హఠ, లయ యోగరూపములు జీవపరమాత్మల సంయోగమే యోగము ఇంద్రియములనుమనస్సును బంధించి జీవేశ్వరుల యభేద భావన కలిగించుటయే,చిత్తవృత్తి నిరోధము షట్చక్ర వ్యాప్త డాకినీ, రాకినీ, లాకినీ, కాకినీ,శాకినీ, హాకినీ, సహస్రార వ్యాప్త యాకినీలు యోగవతీస్వరూపములే 2) శ్రీచక్రయావరణ యందు ప్రకట, గుప్త,గుప్తతర, సంప్రదాయ, కుల, నిగర్భ, రహస్య, అతిరహస్య, పరాపర రహస్య యోగినీ గణామ్న తమై మహాయోగినీ స్వరూపమునైనది 3) జీవికి భోగ్యమగునట్టి శబ్ద స్పర్శరూప, రసగంధాది పంచభూతాత్మిక,యింద్రియ సంయోగ జనిత రసానందము గలిగించు శక్తి యోగవతియే 4) రాజయోగము సాంఖ్య, తారక, యమనస్కములను మూడు విధములు యోగ విషయ త్రిపుటిగా శివశక్తి సామరస్యము భావింపనగును త్రిపుటి యనుభవ ఫలమే యోగానందము జీవబ్రహ్మైక్య సంయోగమే యోగానందము అది లభింపజేయుట కుపాస్యదేవత యామెయే 5) మహామాయయే యోగానందుడను నృసింహస్వామి స్వరూపిణి మహావిష్ణువు నిద్రకు కారణం యోగానంద, యోగనిద్ర, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల కతీతమైన తురీయయను మహానంద స్థితి,యోగుల లక్షణం ఆస్థితి నానందించు యోగవతీ స్వరూపిణి

661) ఓం గాంధార్యై నమః

గాంధారీ రూపిణి యైనది నాడులలో మరొక ముఖ్యమైన నాడీస్వరూపం 2) దుర్యోధనాదుల

తల్లి, జైనుల దేవతా స్వరూపిణి, పార్వతి సహచరులలో నొకతియని యర్థము గాంధారి, సరస్వతి మధ్యనుండియెడమ చెవి వరకు ప్రసరమైన నాడీవిశేషం అధిపతి చంద్రుడు పూషా-అధిపతి ఆదిత్యుడు కుడి చెవి చివరవరకు వ్యాప్తనాడీ విశేషం 2) కండ్ల గుడ్డలు కట్టి, సూర్యచంద్ర ప్రకాశము నిరోధించి, మనో నేత్ర ప్రధానమున దర్శించగల శక్తి 3) పార్వతీదేవి చెలికత్తె యును, తదాంశ సంభూతులే ఈమె పరమేశ్వరి విభూతియే

862) ఓం నరకాంతకాయై నమః

నరకాంతకి యైన దేవి, నరకాసురుడను, యమాధిపతియైన తలము, పాపపుణ్యముల ననుభవించెడి స్థానము 1) వరాహరూపియైన విష్ణువునకు, రజస్వలయైన భూదేవికి గలిగిన సంతతి నరకుడు భూదేవి విష్ణువును ప్రార్థించి జీవింప వసతి గల్పించమన ప్రాగ్జ్యోతిషపురము నేర్పరిచి యందు కామాఖ్య శక్తిని ప్రతిష్ఠింపజేసెను అంత కాలమున కామాఖ్య యదృశ్యమై నరరూపధారియైన కృష్ణుని చేత సంహరింపబడెను భూదేవి ప్రతీకయైన సత్యభామే తన పుత్రుని సంహరించినదనివేరుపాఠం అట్టి నరకాంతకియైన శక్తి స్వరూపిణి విష్ణుమాయే కామాఖ్య యని కాళీపురాణమున కథ గలదు 2) నరకముల జీవుల చేసిన పాపములకు శిక్షవేయు యముని కఠిన తలములు అవి పెక్కు సంఖ్యలుగా గలిగి వివిధ శిక్ష లమలు చేయుస్థానములు శత సంఖ్య యని కొందరందురు అట్టినరకవాసము లిగొట్టి మోక్షమును ప్రసాదించు శక్తి పరమేశ్వరియై యున్నది సైన్యమైన సుమేధునికి జ్ఞానమిడి మోక్షమును ప్రసాదించు శక్తి పరమేశ్వరియైయున్నది శుద్ధలక్ష్మిర్మోక్షలక్ష్మి జయలక్ష్మి సరస్వతి' 'సర్వభూతా యథాదేవి త్వం ముక్తి ప్రదాయిని'' త్వం స్తుతా స్తుతయే కావాభవంతు పరమోక్తయః' 'సర్వస్య బుద్ధిరూపేణ జనస్య హృది సంస్థితా'' స్వర్గాప వర్గదే నారాయణి నమోస్తుతే' యని నరకాంతకి యైన రూపము

863) ఓం పాంచాల్యై నమః

పాంచాలీ స్వరూపిణియైనది వృత్తి భేదము ద్రౌపది యని యర్థము పాంచాలియే కృష్ణయన బడు మహామాయాస్వరూపిణి ధర్మరాజాదులు పంచ దేవాత్మ సంభూతులు పాంచ భౌతిక దేహాదిష్ఠాత్రి యైన ప్రాణి పాంచాలి స్వరూపమే యము, వాయు,యింద్ర, యశ్విని దేవతల యంశలతో ఆకాశ, వాయు, అగ్ని, జల,పృథ్వీతత్వ సంభూతయైన దేహ, ప్రాణి పాంచాలి విశేషార్థములు -ఇంద్రుని సౌభాగ్యలక్ష్మి, స్వర్గాధిదేవత, ఇంద్రుల పరంపరలో నైదుగురిచే ననుభవింపబడిన స్వర్గలక్ష్మి యైదుగురకు పత్నియైనది 'అహల్యా, ద్రౌపదీ, సీతా, తారా, మండోదరీస్తథా పంచకన్యా స్మరేన్నిత్యం మహాపాతక నాశనం' యని నిత్యకన్యాస్వరూపులైన వారి స్మరణపాఠము గలదు 2) పాంచాల వృత్తి నొకచో గలదు కన్య వయసుకు పైబడిన పతి, దేవరులకును గృహిణిగా నుండి తక్కువ వయసు గల దేవరులను పుత్రునిగా పోషించు ప్రథ గలదు

864) ఓం రుక్మిణ్యై నమః

రుక్మిణీ రూపిణియైన దేవి విష్ణువు పూర్ణావతారమైన శ్రీకృష్ణుని పట్టమహిషి, మహాలక్ష్మి యవతారమే రుక్మమనగా స్వర్ణలోహము బంగారువన్నెగల శరీరముగల దేవేరి ఆమెను 'పద్మినీం పద్మవర్ణాం' యనియు, కనకదుర్గ,కనకలక్ష్మి రూపముల నర్చింతురు

865) ఓం రాధాయై నమః

రాధాస్వరూపిణియైనదేవి. శ్రీకృష్ణవల్లభయైన రాధ గోలోకవాసుడైన శ్రీకృష్ణుని యాహ్లాదశక్తి. రాధేతి సకలాన్ పాపాన్ యని స్మరణ చే సర్వపాపములు ఖండింప జేయును. 'రాధాకృష్ణాత్మికా, నిత్యం కృష్ణారాధాత్మకో ధృవం' యని 'రా' శబ్దోచ్చారణచే భక్తియు ముక్తియును 'ధా' శబ్దోచ్చారణచే హరిహర పదప్రాప్తి గలుగునని గలదు 'ప్రాణాధిష్ఠాత్రి యాదేవి, రాధారూపాచ, సాముసే,ఽ రాధా

రాసేశ్వరి,కృష్ణ ప్రాణాధికా, ప్రియా,గోలోక వాసినీ, బ్రహ్మస్వరూపా'' యస్యావశే,తస్యతు సర్వశక్తి, సర్వైవలీలా సకలా గుణాశ్చ। సౌందర్య మాధుర్య విదగ్ధధ్యాసారాధిక రాజతి కృష్ణకాంతా 2) క కారోనాయకః కృష్ణః సచ్చిదానంద విగ్రహః 'ఈ'కారః ప్రకృతి రాధామహాభావ స్వరూపిణీ, 'ల' శ్చా నందాత్మకః ప్రేమసుఖంచ పరికీర్తితంచుంబనా శేషమాధుర్యం బిందునాదం సమీరితం- యని 'క్లీం' బీజలక్షణముగా తెలుపబడినది

566) ఓం రాధ్యాయై నమః

రాధ్యారూపిణి ఆరాధ్యశక్తి, రాధా యన అసాధ్యమున సాధించుట,సిద్ధించుట, పరిపక్వ మగుట,శుభాశుభ లోచనము 'రిరంస''యా రమణీ దేహత్వేన, ఆవిర్భూతి, గోలోకస్థపరమేశ్వరా ర్ధంగ స్వరూపశక్తి భేదము అష్ట మూర్తిధ్యానము ఉపాస్యము, శ్రీదాము శాపమున భూతలమందు వృషభానుసుతగా జన్మించి, శ్రీకృష్ణ ప్రాణాధికయైన మహాలక్ష్మి రూపము చింతనీయము 2) జీవులస్మరణ నొంది, వారి కర్మపరిపాకము కలిగించి, గోలోక వాసముకలిగింప జేయుశక్తి. గోలోకము అత్యున్నతమని గలదు

567) ఓం భీమాయై నమః/ ఓం భామాయై నమః (342 పునరావృతము)

భీమ స్వరూపిణియైన దేవి 2) భామాయన పృథ్వీతత్వ ప్రతీకయైన సత్యభామ, శ్రీకృష్ణుని యనురాగిణి అతిలోక సుందరి. కోపన రూపి అలకచెంది శ్రీకృష్ణుని కాలితో దన్నినదని గాథ. 'కోప స్వభావమునకు ప్రతీక దుర్గాదేవి' 'పునశ్చాహం యదా భీమం రూపం కృత్వా హిమాచలే, రక్షాంసి భక్షయిష్యామి మునీనాంత్రాణ కారణాత్। తదామాం మునయః సర్వేస్తోష్యంత్యానమ్ర మూర్తయః' 'భీమాదేవీ తివిఖ్యాతం తన్మే నామ భవిష్యతి' యని భీమాదేవి వ్యుత్పత్తి భీముడని పిలువబడు రుద్రుని శక్తి

568) ఓం రాధికాయై నమః

రాధికా స్వరూపిణియైన దేవి. రాధాశక్తి స్వరూపమే రాధిక కృష్ణప్రియ పైన వివరింపబడతినది. రాధిక యన నైశ్వర్య, ఐశ్వర్య ప్రదాత్రి శక్తి 'ఆత్మారామస్య కృష్ణస్యధ్రువ మాత్మాస్తి రాధికా' శ్రీకృష్ణుని యాహ్లాదిని శక్తి శ్రీకృష్ణుడానంద రసఘనీభూత విగ్రహుడు ప్రేమ రససార ఘనీభూత విగ్రహమురాధారాణి శక్తి. 'కృష్ణేన ఆరాధ్యత యితి రాధా, కృష్ణం సమారాధయతి సదా' యితి రాధికా' యని రాధికోపనిషత్తు పేర్కొనినది

అమృతా తులసీ బృందా కైటభీ కపటేశ్వరీ
ఉగ్రచండేశ్వరీ వీర*జననీ వీరసుందరీ(97) వీరా

569) ఓం అమృతాయై నమః

అమృత స్వరూపిణి. 'అమృతం అవినాశిస్వభావం, సచ్చిదానంద రూపం, బ్రహ్మ తద్వ్యతిరిక్తం సర్వా అనృతం జడదుఃఖాత్మకం తస్మిన్నేవ సమాశ్రితం। సర్వప్రపంచ వినిర్ముక్తం బ్రహ్మైవాన్ ఇతి అనుసంధ్యాత్' మృత్యువును దూరముచేయునది అమృతపానము దేవతలు దానిని పానము చేసి యమరులైరి అకారాది షోడశ స్వరములును మహాశక్తులచే యధిష్ఠితము అందు 'అ' కారాధిష్ఠాత్రి 'అమృతాఖ్య' శక్తి అన్నము, గోరసము, జలములును గూడా సూచించును

570) ఓం తులస్యై నమః

తులసీ శక్తి స్వరూపిణి కార్తీక పూర్ణిమ దినమున ధర్మధ్వజసుతగా నావిర్భవించిన గోలోకవాసిని, శప్తయై పుడమిని చేరి, శంఖ చూడుడను రాక్షసుని ఇల్లాలుగా విష్ణువుచే వంచింపబడి తులసీ వృ క్షముగా పూజ్యయైనది 'వృందా వృందావనీ విశ్వపూజితా విశ్వపావనీ। పుష్పసారా నందినీ చతులసీ కృష్ణజీవని' యను ఎనిమిది పేర్లు పలికిన యశ్వమేధ ఫలము గలుగును ఆమె మరల గోలోకము తిరిగి చేరినది తులసీదేవి ప్రకృతి దేవి ప్రధాన యంశం, విష్ణుప్రియ, కల్పవృక్ష స్వరూపం, పంచప్రకృ

తిరూపములుగా గణేశ జనని, దుర్గ,లక్ష్మి, సరస్వతి,సావిత్రి, రాధయను దేవతలు ప్రకృతి దేవి యంశలుగా గంగా, తులసి, జరత్కారు, దేవసేనా, మంగళ, చండీ వసుంధరా మొదలగునవి అష్టియంశా స్వరూపిగా పూజనీయము

671) ఓం వృందాయై నమః/బృందాయై నమః

వృందా రూపిణియైనది 'వృందా రూపాశ్చ వృక్షాశ్చ యదైక త్రభవతిచ, విదుర్బుధా స్తేన వృందం మత్ప్రియాం భజామ్యహం' వృందా వనమున పెరుగ వృందాయని, విశ్వపావనిచే పూజితగా విశ్వ పూజిత, పవిత్రవృక్షముగా విశ్వపావని, పుష్పసారముగా పూజలందు వినియోగం పుష్పసారా, భక్తా నందదాయిగా నందిని, సమమైనము లేనికతనందున తులసి, కృష్ణప్రాణరూపిణిగా కృష్ణజీవని యను నామముల విఖ్యాతి జ్ఞానులకు సిద్ధస్వరూపి గోలోకమున లక్ష్మి, గంగ, సరస్వతులు- ప్రకృతి రూపి సపత్నిగా, సరస్వతిచే శపించబడి యంతర్ధానమైనది రాధతో గలిసి పంచ ప్రకృతి రూపము

672) ఓం కైటభ్యై నమః

కైటభ రూపిణి, నిదురించు విష్ణువు కర్ణముల సంభవులైన మధుకైటభులు బ్రహ్మను చంపబోవ, నిద్రమేల్కొనునట్లు చేసి రాక్షసుల మోహింప జేసి, మధుకైటభుల సంహార కారణమైన దేవి స్వరూపం 'మాతుర్మే మధుకైటభఘ్ని మహిష ప్రాణాపహారోద్యమే'' యాదేవి మధుకైటభ ప్రమథిని' యని కైటభుని సంహారకర్త్రిగా కైటభి యైనది

673) ఓం కపటేశ్వర్యై నమః

కపటేశ్వరియైన దేవి 'అన్యథా స్థితి వస్తునః' 'అన్యదా ప్రకాశన రూపి, హృదయస్థ భావన నిగూహన రూపి, వ్యాపార భేదే'మనసులోని భావనను కప్పిపుచ్చుటయు, వొక విధముగానున్న దానిని మరొకటి గా కనబరుచు ప్రవృత్తి, మహామాయా స్వరూపిణి భ్రాంతియే 'యాదేవి సర్వభూతేషు భ్రాంతి రూపేణ సంస్థితా' యందురు 'జ్ఞానినామపి చేతాంసి బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయ చ్ఛతి' 'మహామోహాచ భవతీ మహాదేవీ మహాసురీ' కపట కృత్యముల నసురాళి విధ్వంసము చేసి శాంతి స్థిరము చేయు దేవి కపటులను శాసించునది కపటేశ్వరి. ఈశ్వరుని ఉపాసనతో, నముకమున 'నమోవంచతే, పరివంచతే, స్తాయూనాంపతయే నమో'యను శక్తిరూపిణి కపటేశ్వరిగా వెలగును

674) ఓం ఉగ్రచండేశ్వర్యై నమః

ఉగ్రచండీశ్వరీ రూపము 'తతోదేవి శరీరాత్తు వినిష్క్రాంతాతి భీషణా చండికాశక్తి రత్యుగ్రా శివ శతనినాదినీ' యను ఉగ్రరూపము చండముండాసుర సంహర్త్రిగా చండియైనది ఈశ్వరి ఏడు సంవత్సరములు గల బాలికను చండిక యందురు తీక్షణమైన శాసనము గల దేవి అత్యుగ్ర శత్రు సంహారిణియైన ధర్మరక్షక రూపమై యున్నది

675) ఓం వీరజనన్యై నమః

వీరుల పుట్టించు తల్లి యుద్ధమునుండి వెనుదిరగని యజేయులైన వారు వీరులు ప్రసిద్ధిగాంచిన త్రిమూర్తులు, గణపతి, వీరభద్రుడు, స్కంధుడు మున్నగువారు వారికి జననియైన దేవి పరమేశ్వరి. బ్రహ్మజ్ఞానము గలవారు శ్రీవిద్యా దీక్షాపరులును వీరసంజ్ఞలవారు వీరుడను సంజ్ఞగల గణనాథుని తల్లియందురు అరిషడ్వర్గముల జయించి, మహావాక్య విచార ప్రసంగముల ప్రతిగల వీరులకు మాతృస్వరూపియైనది దేవి వీరమాత

676) ఓం వీరసుందర్యై నమః

వీరసుందరి యైన దేవి భండాసుర మహిషాసురాది యసురుల ఖండించిన దేవి వీరాయనబడును దుష్టసంహారము, సృష్టి, స్థితి, లయాది పంచకృత్యకారిగాను, శ్రీవిద్యోపాసన దీక్షాపరులైన వారి వుపాస్య దేవతగను వీరసుందరి వెలగును 'త్వం వైష్ణవీ శక్తి రనంత వీర్యా' వీర్యములు గల దేవి 'రూపై రనేకై ర్బహుధాఽత్మమూర్తి కృంత్వాంబికే, తత్ప్రకరోతికాన్యా' అమెయే బహురూపముల

తన వీర శక్తి ప్రదర్శించి శత్రునిర్మూలనము చేయు దుర్గ, భవసాగర తారిణి

**ఉగ్రతారా యశోధాఖ్యా దేవకీ దేవమానితా**
**నిరంజనా చిత్రదేవీ క్రోధినీ కులదీపికా (98)**

**677) ఓం ఉగ్రతారాయై నమః**

ఉగ్రతారా రూపిణి ఉగ్రరూపియైన తార దశ మహావిద్యాధిష్ఠాత్రి ప్రత్యాలీఢపదముల శవహృదిపై ఘోరాట్టహాసము చేయుట హుంకార ఝంకారధ్వని, జటాజూట నాగ పరివేష్ఠిత కపాలకర్త్రిగా భాసిల్లును హిరణ్య గర్భశక్తి తార హిరణ్యగర్భుడు క్షుధతో నుగ్రుడై హవిసులు లభింపగా శాంతించెను. ఆశక్తి 'ఉగ్రతార' క్షుధాశక్తిరూపిణి నాలుగు చేతుల విషసర్పములు, శవారూఢ, ముండ ఖర్పరధారిణి, నాగబద్ధ జటాజూట రూపిణియై రాక్షసాంతకియైన రూపము 'తారయతి అజ్ఞానాంధ తమసః సముద్ధరతి భక్తాన్ యా, సాతరా' జ్ఞానప్రకాశ రూపిణి, శబ్ద, నక్షత్ర, కనుపాప యర్థము

**678) ఓం యశోదాఖ్యాయై నమః**

యశోద నామధేయ శక్తి యశోద నందపత్ని సప్తమ దేవకీగర్భము సంకర్షణునిగా రోహిణీ గర్భమునందు పెరిగెను యశోద గర్భమున మహామాయ, దేవకీగర్భమునందు అష్టమజాతుడైన శ్రీకృష్ణునితోపాటు నుద్భవించినది కంసుడు చంపబోవ పైకెగసి, వాని మృత్యువు వేరొకచోట సుఖమని పలికినది. అట్టి మహామాయను గర్భమున దాల్చినది యశోద గనుక యశోదాఖ్యాయై నది దేవి 'నందగోప గృహే జాతా, యశోదాగర్భ సంభవా, తతస్తౌ నాశయిష్యామి వింధ్యచలవాసిని' యగు పరమేశ్వరి.

**679) ఓం దేవక్యై నమః**

దేవకీ స్వరూపమైనది అదితి కశ్యపుల గర్భమున ముమ్మారు తాను జన్మింతునని పరమిడి విష్ణువు మొదట వామనావతారముగా జన్మించెను దేవకీ వసుదేవులు అదితి కశ్యప స్వరూపులే వారికి కృష్ణునిగా జన్మించెను వసుదేవుని భార్యయైన దేవకి యదితియంశ పరమాత్ముని గన్నతల్లిగా పరమేశ్వరి పూజార్హ అయ్యెను

**680) ఓం దేవమానితాయై నమః**

దేవతలచే గౌరవింపబడు, పూజింపబడు దేవి త్రిజగత్తులకు జనని, పోషణి సంహారిణియైన దేవి. సర్వదేవతా శక్తి కూటమి రూపమేర్పడుప నందరు దేవతలచే పూజింపబడుచున్నది 'త్రైలోక్య హితార్థాయ వధిష్యామి మహాసురం' 'సర్వదేవమయీ మీశాం లక్ష్మీ మీమాంనృప పూజయేత్ సర్వలోకానాం ప్రభుర్భవేత్' 'దేవ్యాయయాతత మిదం జగదాత్మశక్త్యా నిశ్శేషదేవ గణశక్తి సమూహమూర్త్యా తామంబికామఖిల దేవ మహర్షి పూజ్యాం భక్త్యానతాః స్మ విదధాతు శుభానిసా' యని సర్వజనని

**681) ఓం నిరంజనాయై నమః**

నిరంజన రూపిణియైన దేవి నిష్క్రియం, నిష్కళం, శాంతం, నిరవద్యాం, నిరంజనం, త్రిధామసాక్షి, 'సత్యజ్ఞానానంద లక్షణా, యహంకార దోషరహితా నిర్లేపా నిరవద్యం నిరంజనం' ఏ విధమైన అవిద్యా సంస్కారము మలినము లేని శుద్ధ విద్యాస్వరూపిణి సహస్రార చంద్ర మండలమున చిత్కళా రూపి ఆనంద స్వరూపిణి నిరంజన, భావాభావములు, యిష్టాయిష్టములు, సంగసర్గములు లేని నిరంజన. 2) అంజనమనగా కాటుక, అవిద్య, అజ్ఞానము, మహావిద్యా మహామాయా మహామేధా సరస్వతి యని మలినరహిత శుద్ధ విద్యాస్వరూపిణి అణవ, సూక్ష్మ, కార్మిక మల రహితము, స్థూల శరీరాభిమానము లేనట్టి విశుద్ధ చంద్రకాంతి రూపిణి, చితిరూప మహాసత్తా సామ్రాజ్ఞీ, పరమేశ్వరీ, త్రిపురా భాసతేయస్యామభిన్నాం విభిన్నవత్ (త్రిపురారహస్యం)

682) ఓం చితాధిప్యై నమః/చిత్రాదేవ్యై నమః

చిత్రా/చిత్రా దేవీ స్వరూపిణి. చితాయన తమోపహ, జాగృత్ స్వప్న, సుషుప్త్యవస్థల కతీత తురీయస్థితి చితి యనబడును 'సైషా చితిరితి ప్రోక్తా జీవనాత్మవిశేషిణామ్' జీవించియుండునట్లు చెప్పుట కాధారమైన శక్తి. అజ్ఞానవిరుద్ధమైన శక్తి. బ్రహ్మపదార్థము తెలుపునది సత్తా స్వరూపమున నుండునది జడరూప జగత్తునకు చైతన్య ప్రకాశములు గలుగజేయునది త్రిపుటియొక్క ఏకాకారమే చిత్ అని జీవప్రపంచ సాక్షిరూపము ప్రపంచ మూలకారణం పరమేశ్వరి సూర్యచంద్రాగ్నుల ప్రకాశ స్వరూపము 'సర్వప్రపంచ వినిర్ముక్త, చిన్మాత్ర చిదేకర నిత్యాయమాత్మతిదిక్కాలాద్యనవచ్ఛిన్న మద్య ష్టోభయ కోటికమ్ చిన్మాత్ర మక్షయం శాంతమేకం బ్రహ్మోస్తి నేతరత్'

683) ఓం క్రోధిన్యై నమః

క్రోధ స్వరూపిణియైన దేవి క్రోధమే స్వరూపమైన శక్తి 'క్రోధాకారం కుశోజ్జ్వలా' చేతయుజ్జ్వల యంకుశము ధరించి క్రోధమూర్తియైనది ద్వేషమను చిత్తవృత్తియే క్రోధము దానవులచే బాధింపబడి దేవతలు పరమేశ్వరిని వేడుకొనిరి అపుడు రౌద్రరూపము ధరించి సంహార్త రూపము దాల్చిన దేవికి యుద్దీపన భావము క్రోధము 'కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ దారుణా' యనియు, యనలాత్మికయైన దుర్గ తృతీయ నేత్రమున లోకముల భస్మపటలము చేయు శక్తి గలదు అసుర సంహార వేళల సర్వాయుధయై యసుర సేనల చెండాడు క్రోధ స్వరూపము ఆవేశ మూర్తిగా విరాజిల్లును

684) ఓం కులదీపికాయై నమః

కులదీపికా రూపిణి కులమును ప్రకాశవంతము, కీర్తిమంతము, యశో విభవ మందజేయు శక్తి స్వరూపిణి కులమనగా మాతృమేయమానం, సంప్రదాయాచారం, పాతివ్రత్యాది గుణశీలయుత వంశము శివశక్తి సామరస్యం, సుషుమ్నమార్గము, పితృవంశపరంపర, విద్యా గురువంశము, మొదలగు వానికి సంకేతము అట్టి కులమునకు దీపిక, మార్గదర్శి, వెలుగునిచ్చు రూపము గతి, శక్తిస్వరూపమైన పరమేశ్వరి

కులరాగీ*శ్వరీ జ్వాలా*మాత్రికా ద్రావణీ ద్రవా వాణీ,వాణీ
యోగీశ్వరీ మహామారీ భ్రామరీ బిందురూపిణీ (99)

685) ఓం కులవాగీశ్వర్యై నమః(ఓం కులరాగీశ్వర్యై నమః)

కుల విద్యాస్వరూపిణియైన దేవి వాక్కున కధీశ్వరి పరాశక్తి పై పదముల వివరణయందు, సంప్రదాయ సిద్ధమగు యుపాసనాదుల స్వరూపమైన విద్యాస్వరూపిణియైన దేవి వైఖరీవాక్కునకు మూల కారణమైన దేవీ స్వరూపం భారతి, వాణి, సరస్వతి పర్యాయపదం వృత్తకాస్వరూపిణియై యున్నది. 'విద్యాసు శాస్త్రేషు వివేకదీపేష్వాద్యేషు కాత్వదన్యా' అట్టి విద్యాస్వరూపిణి

686) ఓం జ్వాలాయై నమః

జ్వాలారూపిణియైన దేవి జ్వాలామాలిని యను పదునాలుగవ నిత్యాశక్తి స్వరూపము షోడశీ కూటాది దేవత 'జ్వాలాకరాళా మత్యుగ్రము శేషాసుర సూదనం' యనదగు యగ్నిజ్వాలలు వెదజల్లి, కరాళము ఉగ్రరూపము గలిగిన దేవి 'విద్యుద్దామ సమప్రభాం మృగపతి స్కంధస్థితాం' యని విద్యుత్తు వెలుగులు ప్రసరించు దేవి శీర్షము 'కాళీ కరాళ వక్త్రాంత దుర్ధర్షదశనోజ్జ్వలా' రూపము 2) లక్ష్మీరూపమున చంద్రాం ప్రభాసాం యశసాజ్వలంతీం యని శీతలమగు ప్రభాయుతము సూర్య చంద్రాగ్ని నేత్రజ్వాలలు, త్రివిధములు తీక్షణము, శీతలము, దాహకము లైనవి త్రిగుణాన్వితా, త్రివిధ జ్వాలా స్వరూపిణియైన దేవి సర్వాపదలను తొలగించును

687) ఓం మాతృకాయై నమః/మాత్రికాయై నమః

మాతృకా స్వరూపిణియైన దేవి మాతృకలనగా సప్తమాతృకలు/సప్తమ్యుత మాతృకలందురు శ్రీ,

లక్ష్మి, ధృతి, మేధా, పుష్టి, శ్రద్ధా సరస్వతులు 2) షోడశ మాతృకలు–గణేశ, గౌరి, పద్మా, శచీ మేధా, సావిత్రీ, విజయా, జయా, దేవసేనా, స్వధా, స్వాహా మాతరః లోకమాతరః ధృతి, పుష్టి తుష్టి, కులదేవతలు శుభములకు ముందు పూజ్యార్హులు 3) చతుష్షష్టి మాతృకాన్యాసము యని యరువది నాలుగు మాతృకలను దేహాంగముల న్యాసము చేయు విధి గలదు చతుష్షష్టి యోగినీ పూజ, మాతృకా విభూతులైన వీరందరూ పరమేశ్వరీ యంశ సంభవులే అ) అ కారాది క్షకారాంత వర్ణసముదాయమును, స్వరములను మాతృకలందురు ప్రతి దేవతకు నక్షర న్యాస స్థానములు అక్షరాధిదేవతాపరం పరలు భిన్నములుగా గలవు ఆయా స్థానములందు నాయా యధిదేవతను నుపాసనామూర్తి రూపమునుసరించి చేయవలెను ఆ) సర్వదేవ దనుజ, మనుజ, చతుర్విధోత్పన్న సకల ప్రాణులకు మాతృమూర్తియై వెలుగొందు జననీస్వరూపము, ప్రకృతిస్వరూపమునే యర్చనీయము

**688) ఓం ద్రావణ్యై నమః**

ద్రావణీ రూపిణియైన దేవి ద్రవింపజేయునది ద్రావణీ శక్తి. లవణ, శర్కర, క్షీరాదులను జలమునందు వైచిన వాని వునికి కోల్పోయి యేకరూపద్రవముగా స్థిరముగునట్టి శక్తి, అసుర సంహారము చేయుచు, వారిని ప్రకృతిలో భాగముగా తనలో లీనము చేసికొను శక్తి ఆమెకు భేదము తెలియదు అందరూ నొకటే 2) భక్తుల మనముల బాధ కలిగినపుడు హృదయము ద్రవించి వెంటనే ప్రత్యక్షమగును కరుణారస పూరిత దృష్టి కలిగి 'త్రైలోక్య స్యహితార్థాయ' సంభవించుచుండును 3) ద్రావణీ యను శక్తి మన్మథుని బాణ విశేషము. స్థిరము చేయనగు మనస్సును ద్రవింపజేసి మనోచాంచల్యత స్పృ ష్టించును అట్టి ద్రవిత మాతృశక్తి పరమేశ్వరి

**689) ఓం ద్రవాయై నమః**

ద్రవరూపిణియైన శక్తి. ద్రవము అనగా ద్రవించు పదార్థము జలము, క్షీరము, తైలము, మొదలగునవి నిమ్నప్రదేశములకు ప్రవించి స్థావరమేర్పరచుకొను ప్రవాహ రూపము పైన సమతలముగా నుండును పంచభూతములలో జలమొకటి దాని స్వభావము ద్రవత్వము జలశక్తి రూపిణి ఆసవగతి, పలాయనము, రసము, వేగము, పరిహాసము, కరగుట, ద్రవపదార్థముయని యర్థములు 2) ఆసవమున మదిర దేవికి యతిప్రీతి తత్తుల్యమదిరా, మదపాటలా, మధుప్రీతా, మధుమతీయను నామముల ప్రసిద్ధము దేవతలకు బలకరమునై యున్నది

**690) ఓం యోగీశ్వర్యై నమః**

యోగీశ్వరియైన దేవి యోగిని నామము అందు శ్రేష్ఠత ఈశ్వరీ పదము యోగమున చిత్తవృత్తి నిరోధకము. జ్ఞానేంద్రియములన్నింటిని నిగ్రహించి, క్షేత్రజ్ఞ (జీవ) పరమాత్మల యేకత్ర భావము కలిగింప జేయుట షట్చక్ర సారమైన సహస్రారమునందు ప్రాణశక్తిని నిల్పుటచే పరమేశ్వరీ సన్నిధాన మేర్పడును అందు విశేషప్రజ్ఞ గలది యోగీశ్వరి 2) శ్రీచక్రమందు యోగిని గణ పరివేష్టితయై వారి కధిష్ఠానమైన దేవత శ్రీలలితా పరాభట్టారికాది నామముల మహాయోగీశ్వరీయని కొలువైయుండు భోగిని 2) వస్తు గుణముల నాయాయింద్రియముల సంయోగింప చేయుశక్తియు నామెయే

**691) ఓం మహామార్యై నమః**

మహామారీ రూపమునైన దేవి మహామారీయన మహాకాళి, సంహారశక్తి 'బాలగ్రహాది భూతానాం బాలానాం శాంతికారకమ్' అనియు, 'గ్రహపీడాచోగ్రాసు, ఉపసర్గా శమం యాంతి గ్రహపీడాశ్చ దారుణః' యని సప్తశతి పరన పూజావిధి యందురు అటులే దుస్స్వప్ననాశనము, రక్షోభూత పిశాచ భయ నివారణకు నుపాసన యావశ్యకము 'సృష్టిస్థితి వినాశానాం శక్తిభూతే సనాతని గుణాశ్రయే గుణమయే నారాయణి నమోస్తుతే' 'రక్షాంసి యత్రోగ్ర విషాశ్చనాగా, యత్రార

యోదస్య్యబలానియత్ర' 'దావాన లోయత్రత ధాత్రమధ్యే తత్రస్థితాత్వం పరిపాసి విశ్వం. వ్యాధుల వల్ల మరణములు గలుగుచుండ, శాంతిక్రియలు విహితము 'మహాకాళ్యా మహాకాలే మహామారీ స్వరూపయా। సైవకాలే మహామారీ సైవ సృష్టిర్భవత్యజా'

692) ఓం భ్రామర్యై నమః

భ్రామరీ రూపధారిణి అరుణాసురుడను దైత్యుడు, సకల జీవకార్య విరోధియై బ్రహ్మవలన పొందిన వరములచే గర్వించి యుండెను పురుష, స్త్రీ దేవగణములచే మరణము లేకుండ ప్రార్థించి యుండెను అంట తన శక్తులతో గూడి భ్రమరముల (తుమ్మెదల) రూపముల ధరించి వానిని ముట్టుముట్టి కరిచి చంపివేసినది అందులకు భ్రామరీ, భ్రమరాంబ శక్తిగా శ్రీశైల పీఠమున నెలకొని యున్నది దేవీ యవతార వర్ణనలో 'యదారుణాఖ్య స్త్రైలోక్యే మహాబాధాం కరిష్యతి తదాహం భ్రామర రూపం కృత్వా౽సంఖ్యేయషట్పదమ్ ' ' త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురం' యని దేవి భవిష్యవాణి తెలిపినది 3) అపస్మార రోగము, మతిభ్రమణమునకును కారణమైన భ్రామరీశక్తి-గదా౽పస్మారాది రోగములకు శాంతి చేయనగును

693) ఓం బిందురూపిణ్యై నమః

బిందురూపిణియైన దేవి పిండాండమున బ్రహ్మరంధ్ర యధోభాగమున చంద్రమండల మందుండి 'ఓం హ్రీం' మంత్ర బీజములచే గుర్తింపనగు శబ్దబ్రహ్మరూపమే బిందువు. శక్తియుత బ్రహ్మమే బిందువు పంచాశద్వర్ణమాతృకకు కారణమగు నాదశాస్త్ర మాతృక శ్రీబిందువే ఆ శివశక్తియే బిందు రూపిణి ఆమెయే బిందు స్థానము సర్వానందమయ చక్రము 2) బిందుస్థానం సుధాసింధువు మనోలయ భావన యావశ్యకము శ్రీచక్రస్థల బిందుతర్పణ పరాం శ్రీరాజరాజేశ్వరీ-యని సుధాధారలు బిందువు వద్ద తర్పణ చేయుటచే మోక్షప్రాప్తి గలుగును. 3) నవమావరణం బైందవ చక్రం వామభాగము బగళాముఖి, దక్షిణ భాగము కాళరాత్రి, యగ్రభాగమున రాజమాతంగేశ్వరీ త్రికోణశక్తి పరివేష్టితమైన బిందువునందు పరబ్రహ్మ చక్రమున శ్రీమహాత్రిపురసుందరీ దేవి, పరబ్రహ్మాత్మశక్తి నెలకొనియుండునని భావింతురు

దూతీ ప్రాణేశ్వరీ గుప్తా బహులా డామరీ* ప్రభా చమరీ
కుబ్జికా జ్ఞానినీ జ్యేష్ఠా భుశుండీ ప్రకటాకృతిః* (100) తిథిః

694) ఓం దూత్యై నమః

దూతిస్వరూపిణి యైన దేవి సందేశములను చేరవేయునది సంచారికా స్వరూపిణి. దూత స్వామి సందేశమునే వివరించును తత్ప్రతినిధిగా వర్తించుచుండును యుద్ధ ప్రారంభమునకు ముందు, చివరి ప్రయత్నముగా దూతని పంపుచుందురు శివాని శుంభనిశుంభాది యసురులతో సంప్రదింపులకు శివుని పంపియున్నది 'శివదూతీ స్వరూపేణ హతదైత్యే' 'చండికాశక్తిరత్యుగ్రా దేవి' శుంభ నిశుంభుల కడకు శివుని రాయబారిగా పంపి శివదూతియైనది 'దూతత్వం గచ్ఛ భగవన్ పార్శ్వం శుంభ నిశుంభయోః' స్వర్గము దేవతలకిచ్చి వెళ్ళుమని సందేశమిచ్చినది. 2) శుక్లపక్ష సప్తమీ తిథి నిత్యలందు శివదూతి గలదు సదుపాసకులను బ్రహ్మపదము చేర్చుటకు చివరిమెట్టుగా దూతికగా వ్యవహరించు దేవీరూపము

695) ఓం ప్రాణేశ్వర్యై నమః

ప్రాణేశ్వరీ రూపిణియైన దేవి ప్రాణములనగా నింద్రియములు 'ప్రాణస్య ప్రాణః' పంచప్రాణముల కధిపతి ప్రాణేశ్వరి 2) ప్రాణధారణ చేయు సకల జరాయుజ, స్వేదజ పిండాండజ, ఉద్భిజ, జీవముల కధీశ్వరి 3) శవరూపమైన శివునికి చేతనారూపమై ప్రాణముల కల్పించు ప్రాణేశ్వరి శక్తి యామెయే

696) ఓం గుప్తాయై నమః

గుప్త రూపిణిదేవి గోప్త్రీ స్వరూపమై సర్వగుణ ప్రధానయై సకల చరాచర ప్రపంచమును సంరక్షించు పరమేశ్వరి అహంకార రూపమున గుప్తముగా నుండునది భద్రముగా వంశాచారమును శిష్యున కుపదేశించి కొనసాగించబడు శ్రీవిద్యాస్వరూపిణి యోగినీ గణములు శ్రీచక్రమునియు, ప్రకట, గుప్త గుప్తతర, సంప్రదాయ, కులోత్తీర్ణ నిగర్భరహస్య, రహస్యతర, పరాపర రహస్యలుగా పేర్కొనబడి యతిగూఢముగా బిందు రూపమున వెలుగుచుండు పరమేశ్వరి నిత్యసదాశివ కరకమల దృఢబద్ధయై వెలుగుచుండును

697) ఓం బహురూపాయై నమః

బహుళ రూపిణియైన దేవి 'బహూని యస్యారూపాణి, స్థిరాణి చరాణిచ, దేవ మానుష తిర్యగ్ంచ బహురూపా తతశ్శివా ''ఏకధాచ ద్విధాచైవ, తథా షోడశ ధాస్థితా, ద్వాత్రింశద్భేద భిన్నాయాయ్యాతాం వందే పరాత్పరామ్ ''అరూపా పరభావత్వాత్, బహురూపా క్రియాత్మికా' యను దానని బట్టి బహుళ కర్తృత్వము అపాదించబడనిది 'త్వమైవ బహురూపేణ పత్నీత్వేన వ్యవస్థితా స్త్రియస్సమస్తా తవదేవి భేదాః' యందురు సర్వరుద్రుల శక్తి స్వరూపిణి బహురూపిణి వివిధ విద్యా స్వరూపిణియు, బహురూపా, ఒక్కదేవి రూపము కృష్ణపక్షయధి దేవత షట్కృత్తికలని యర్థము గలదు

698) ఓం డామర్యై నమః

డామరీ రూపిణియైన దేవి మణిపూరక పీఠే, నాభౌ, దశదళ కులకర్ణికా, కపాలశూలసతిముద్రాకరా కిరీటకేయూర, కాంచీ నూపుర భూషయుతా, లాకినియధిదేవతగా గల చక్రం అందలి దశ బీజాక్షరములు శక్తులు వివరణ డామరి, ఢంకారిణి, జామరి, తామసి, స్థాణ్వి, దాక్షాయణి, ధాత్రి, నందా, పార్వతి, ఫట్కారి శక్తులు పరమేశ్వరీ యంశలే అందు డామరీ శక్తి రూపిణియైన దేవి

699) ఓం ప్రభాయై నమః

ప్రభారూపిణియైన దేవి కోటి సూర్యసమప్రభ గలది 'అణిమాదిభిరావృతాం, మయూఖై రహమిత్యేవ విభావయేద్గౌరీమ్'' ప్రభావతః సవితుః శక్తిః ప్రభావతి' అదిత్యుని భర్గస్సు 2) బహుప్రభావము గల కుండలినీ శక్తియే ఊర్ధ్వగామియై సహస్రారమున యను భూతమగు జ్యోతిష్మతి, ప్రభావతి 3) సూర్యుని శక్తియే ఊర్ధ్వగామియై సహస్రారమునయను భూతమగు జ్యోతిష్మతి, ప్రభావతి 4) సూర్యుని భార్య ప్రభ దుర్గాదేవిశి ప్రభ యను సంజ్ఞగలదు అత్యంత ప్రకాశ పుంజ స్వరూపిణి

700) ఓం కుబ్జికాయై నమః

కుబ్జిరూపిణి యైన దేవి అష్టవర్ష కన్యకను కుబ్జిక యందురు దేవమూర్తి భేదమునైనది కుబ్జ, యను మరుగుజ్జురూపము గూని రూపము, రామావతారమున పంచవటి యరణ్యము చేరిన స్వామిని చూచి శూర్పణఖ రావణుని సోదరి మనసున కామించె, ద్వాపరమున కుబ్జగా జన్మించి, స్వామియను గ్రహమునకు పాత్రురాలైనది 'కుబ్జిక' మరుగుజ్జురూపమున నున్న వినాయకుని శక్తి స్వరూపిణి 3) 'స్త్రియస్సమస్తాస్తవ దేవి భేదాః' యనగా మరుగుజ్జ రూపిణులైన వారును దేవి యంశలే

ఇతి ఆదిశంకర కృత లలితాసహస్రనామస్తోత్ర సప్తశతతమ నామవ్యాఖ్యా సంపూర్ణః

701) ఓం జ్ఞానిన్యై నమః

జ్ఞానస్వరూపిణియైన దేవి జ్ఞప్తి స్వరూపం. 'అనిత్యత్వాది దోషరహితం స్వరూపచైతన్యం సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, స్ఫురణ రూపంతు జ్ఞానం శుద్ధం పదైవతు'' జ్ఞానమే పరమేశ్వరి 'ప్రజ్ఞానం బ్రహ్మ' 'విజ్ఞానమానందం బ్రహ్మ''ప్రజ్ఞానఘనం' మున్నగు శృతి వాక్యములు గలవు పాదాది శిరః పర్యంతం ప్రజ్ఞాన స్వరూపిణి, జ్ఞానమే బ్రహ్మము అదే బంధ హేతువు విశ్వమంతయు జ్ఞాన మయము జ్ఞానమునకు పరమైనది లేదు సర్వభూతహృదంతరాశముల ప్రకాశరూపమై యంతః కరణ వృత్తుల ప్రేరేపించు చుండును. నిజమైన బ్రహ్మజ్ఞానము అచంచల నిష్ఠాపరులకు మోక్షహేతువు.

ఇంద్రియ విషయములగు లౌకిక జ్ఞానము బంధహేతువు 'జ్ఞానమస్తి సమస్త జంతోర్విషయ గోచరే' 'విషయశ్చ మహాభాగయాతి చైవం పృథక్పృథక్' 'యతో హ్యజ్ఞానినః సర్వే పశుపక్షి మృగాదయః' 'జ్ఞానంచ తన్మనుష్యాణాం యత్తేషాం మృగపక్షిణాం' 'అజ్ఞానమూర్తి దేవతయే' 'మహామాయా హరస్త్యైషాం తయాసం మోహ్యతే జగత్। జ్ఞానినామపి చేతాంసి భగవతీ హిసా'

702) ఓం జ్యేష్ఠాయై నమః

పెద్దరాలు అగ్రగణ్యయైన దేవి సృష్టికి పూర్వమే యున్నది గాన ఆద్యా, జ్యేష్ఠారూపిణి మూల ప్రకృతి ఈశ్వరీ, పరమేశ్వరీ రూపము ఇచ్ఛాశక్తి స్వరూపయై జగత్ సృష్టికి కారణమైనది సర్వ శక్తులకును ఆది యందే యున్నది 'విష్ణుః శరీరగ్రహణ మహమీశాన ఏవచ, కారితాస్తే యతస్త్వాం కః స్తోతుం శక్తిమాన్ భవేత్' యని బ్రహ్మస్తుతి 'హేతుః సమస్తజగతాం జగదంత భూతామవ్యాకృతాహి పరమాప్రకృతి స్త్వమాద్యా' 'ఇంద్రియాణామధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషుయా। భూతేషు సతతం వ్యాప్త్యై దేవీ రూపము 'సృష్టిస్థితి వినాశానాం శక్తిభూతే సనాతని। గుణాశ్రయే గుణమయే' 'స్త్రియస్సమస్తాస్తవదేవి భేదాః త్వయైకయాపూరితమంబ' యని సర్వవ్యాపిని, సనాతని, ఆద్యా పరమేశ్వరి

703) ఓం భుశుండ్యై నమః

భుశుండీ రూపిణియైన దేవి భుశుండియన అగ్నియంత్రము శిలలు విసిరెడు యంత్రమైన ఆయుధ విశేషము వర్ణనలో దేవి 'ఖడ్గినీ, శూలినీ, ఘోరా, గదినీ, చక్రిణీ తథా శంఖినీ చాపినీ బాణాభుశుండీ పరిఘాయుధా' యని అస్త్రభుజాస్వరూపిణియైన మహామాయాజ్వాల కరాళ రూపిణియై విలసిల్లును 2) భుశుండియను కాకి ప్రశస్తి రామాయణమున గలదు మహాజ్ఞాని, త్రికాలదర్శియైన యాకాక రూపుని చేరి గరుత్మంతుడు యనుమానముల తీర్చుకొనెనని గలదు అట్టి త్రికాల జ్ఞానీ పారదర్శక శక్తి స్వరూపిణి అంబ ప్రసాదమే

704) ఓం ప్రకటాకృత్యై నమః

ప్రస్ఫుటమగు యాకారముగల దేవి ప్రతిష్ఠితమగుటకు ప్రకటాకృతియే కారణము సర్వజనుల యనుభవములోని యహంతా శక్తి ఆమె చేతనయే 'తమహం ప్రత్యయం వ్యాజ్యాత్ సర్వేజానంతి జంతవః తథాపి శివరూపేణ నవిజానంతి మాయయా' సగుణ రూపశక్తిని మాత్రము అనుభవములో వర్ణింతురు గాని నిర్గుణ పరాత్పరశక్తిని మాయాచ్ఛాదన జేసిన గాని, తెలిసికొనలేరు సగుణ రూపిణి యైన శక్తి, 'అతి సౌమ్యాతి రౌద్రాయై న తాస్తస్యై నమోనమః నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమో నమః' యని యంబ యతి సుందర విగ్రహం కళ్యాణి రూపమున, వైరి భంజన రౌద్ర రూపమున భక్తవత్సలతను మాతృరూపమున ప్రతిష్ఠింపజేసి వుపాసనా విధి నిర్వహింతురు

ద్రావణీ* గోపినీ మాయా కామబీజేశ్వరీ ప్రియా* ద్రవిణీ, క్రియా
శాకంభరీ కోకనదా సుసత్యా చ *తిలోత్తమా(101) కాంభవీ శీఘ్ర కామేంసా
మయూషలస్తా క్మాలా త్రిలోచనా

705) ఓం ద్రావిణ్యై నమః

ద్రావిణి రూపిణియైన దేవి ద్రవింపజేసి హృదయము గలదేవి 'శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే, సర్వస్యార్తి హారిణి' 'యాచస్మృతా తత్క్షణాదేవి హంతినః సర్వాపదో భక్తి వినమ్ర మూర్తిః' 'కళ్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్వతి' 'కళ్యాణ వృష్టిభిరివామృత పూరితాభిః లక్ష్మీ స్వయంవర మంగళ దీపికాభిః' 'కారుణ్య కందళిత కాంతిభరం కటాక్షం। కందర్పభావ సుభగాఖిలు భక్తిభాజః' 'కారుణ్యవారిధి రంభ భవేత్ కటాక్షే' 'సంపత్కరాణి సకలేంద్రియ నందనాని। సామ్రాజ్యదాన నిరతాని సరోరుహాక్షి' యనగా కరుణారస దృష్టితో సర్వజీవుల వాంఛాప్రదాయిని యగు దేవి

706) ఓం గోపిన్యై నమః

గోపినీ స్వరూపిణి, గుప్తరూపిణి గోపనమునగా జగత్ సంరక్షణము పరిపాలనా ధర్మము సత్వగుణ ప్రధానమైన ఈశ్వరీ తత్వము 'సమస్త భూతాని పాలయన్,రక్షన్ జగతి ఇతి గోప్త్రీ'' స్వమాయయా స్వమాత్మానం సంవృణోతి' సర్వజీవులయందు 'అహం' రూపమున గుప్తముగా నుండునది పరమేశ్వరి జ్ఞానము గలిగించు విద్య సదాచార పరులకు, భక్తిగల వారికి, కులజ్యేష్ఠునకు, నమ్మిక గలవారికి మాత్రమే బోధించియము అట్టి గుప్త విద్యారూప భద్రతలచే గోపిని, వేద స్వరూపిణియే పరమేశ్వరి శ్రీవిద్యాస్వరూపిణి 'కామోయోనిః కమలావజ్రపాణిః' అని విద్యను గుప్తముగా నుపదేశింతురు గావున 'గోపినీ, రక్షతి సంస్పృశ్య విశ్వాభువనాని గోపా'

707) ఓం మాయాయై నమః

మాయారూపిణియే మాయాధిష్ఠాత్రి 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరి' 'మాయాసా పరమాశక్తి రవ్యయాగిరిజాశివా మాయా విశ్వాధికో రుద్రస్త్వం జ్ఞాత్వా సమునిర్భవేత్' ఎరుక ముఖ్యము 'విచిత్ర కార్యాకరణా అచింతిత ఫలప్రదా, స్వప్నేంద్రజాలవల్లోకే మాయాతేన ప్రకీర్తితా' ప్రసిద్ధముగా యెల్లర యనుభవములో నున్నను, యిట్టిదని నిర్ణయింప శక్యముగాని శక్తి 'మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః, మహామోహాచ భవతి మహాదేవీ మహాసురి' 'జ్ఞానినా మపి చేతాంసి బలాదాకృష్యమోహాయ మహామాయా ప్రయచ్ఛతి' ఆత్మయంద నాత్మ బుద్ధియు అనాత్మయందాత్మ బుద్ధియు గల్గించునది, మాయారజ్జు సర్పభ్రాంతియు దాని పరిణామమే ఆ మోహమును తరింప సామాన్యులకు తరముగాదు మాయావులను మించిన మాయావి మహామాయా స్వరూపిణి గర్భము వెల్వడునపుడు మాయ గ్రమ్మును 'గర్భాంతర జ్ఞానసంపన్నం, ప్రేరితం సూతి మారుతైః ఉత్పన్నం జ్ఞానరహితం కురుతేయా నిరంతరమ్' 'వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్రయం' 'సర్వభూత నివాసోఽసి వాసుదేవ నమోస్తుతే' 'మానుషా మనుజ వ్యాఘ్ర, సాభిలాషా సుతాన్‌ప్రతి లోభాత్ ప్రత్యుపకారాయ నన్వేతాన్ కింన పశ్యతి'' తదాపి మమతావర్తే మోహగర్తే నిపాతితా' యని సంసార బంధనము నేర్పరిచి వీనిలో కొట్టుమిట్టాడునట్లు చేయును బ్రహ్మజ్ఞానము మహామాయా ఛేదనానంతరమే ప్రాప్తించును

708) ఓం కామకోటేశ్వర్యై నమః

కామకోటేశ్వరియైన దేవిరూపము. 'క్లీం'కారస్య, శివకామస్య స్త్రీం క్లీం బీజస్వరూపిణి 'హ్రీం'బీజం శక్తి సంబంధం క్లీం మాయా శివకామశక్తి కృష్ణ బీజమునై యున్నది కామదైవత బీజమైన దీనిని జపించుటచే లక్ష్మీనారాయణ ద్వంద్వ రూప వుపాసనా ఫలితమును గలుగును 'క్లీం' బీజ పునశ్చరణమున సకల ప్రపంచమును వశ్యము చేసికొను శక్తి గలుగును 'శ్రీం' లక్ష్మీబీజం చక్ర వుపాసనాదుల 'ఓం ఐం హ్రీం శ్రీం క్లీం'యను పంచ బీజోచ్చారణమును చేయుచుందురు

709) ఓం ప్రియాయై నమః

ప్రియ రూపమైనది ప్రేమ స్వరూపి గావున ప్రియ, ప్రియంకరి భక్తులకందరకు వాంఛితార్థముల చేకూర్చును స్వాహా రూపమున దేవతలకు, స్వధా రూపమున పితరులకు, వషట్కార రూపమున స్వరాత్మికగా సకల జీవ జంతుప్రాణి పోషణ చేయుచుండు శక్తి. పంచ యజ్ఞములకు మాతృకగా తుష్టిరూపిణి పుష్టి, శాంతి రూపిణి. త్రైలోక్య హితమువేగోరుచు నందరకు ప్రీతిపాత్రమైన దేవి 'అంబ ప్రసీద' యని దానవ బాధలు తొలగుటకు ప్రార్థింప వెంటనే సిద్ధముగ స్వామిని 2) సదాశివుని పర్యంక మందు నిత్యము భాసిల్లు దేవి పరమేశుని సచ్చిదానంద రూపిణి 3) శివరూప శివుడు దేహ అంమందు ప్రాణి పరమేశ్వరి. దేహమందు ప్రాణ చలనము చేసి, సర్వజన హిత కార్యముల ప్రేరేపించుచు సుఖసంతోషములనంద జేయు రూపము 4) గృహిణివంటి సమస్త స్త్రీ జాతి పరమేశ్వరి యంశమే ఆయా కులముల వర్తింప ప్రేమమూర్తులు అనేక రూపముల బాల, యువ, వృద్ధా, మాతృ, సోదరీ, భ్రాతా సేవాపరాయణి యాపె యంశలే. అనుగ్రహించిన సుఖకరము, ఆగ్రహించిన

ప్రళయము సదాచరణీయాశయము

710) ఓం శాకంభర్యై నమః

శాకంభరీ రూపిణియైన దేవి శాకంభరీ యని యవతార విశేషము పంటలు పండక, యాహారము లేక ప్రాణులు సంకటమున బడ, ప్రాణాధారకములైన శాకములు పంచుచు శాకంభరిగా కీర్తినందిన దేవి అసుర బాధల నుండి దేవతల రక్షించుటకు సంహారార్థమై యనేక యవతారముల నెత్తును. అందు 'తతో௨హమఖిలం లోకమాత్మదేహ సముద్భవైః భరిష్యామి సురాశ్శాకైరావృష్టేః ప్రాణ ధారకైః శాకంభరీతి విఖ్యాతిం తదాయాస్యామ్యహం భువి' యను విభూతి 'శాకంభరీ, నీలవర్ణా, నీలోత్పలా విలోచనా, గంభీరనాభి, స్త్రివళీ విభూషిత తనూదరీ' యని శాకంభరి వివరణ గలదు

711) ఓం కోకనదాయై నమః

కోకనద స్వరూపిణియైన దేవి ఎఱ్ఱ తామర పూవు యని యర్థము రక్తకమలం శాకంభరియే గాక కమలగా దేవి యవతారము గలదు దశ విద్యలలో పదవది 'కాంత్యా కాంచన సన్నిభాం, హిమగిరి ప్రఖ్యైశ్చతుర్భిర్గజైః హస్తోత్క్షిప్త హిరణ్మయామృతఘటైరాసించ్యమానాం శ్రియం। బిభ్రాణా వరమబ్జయుగ్మమభయం హస్తైః కిరీటోజ్జ్వలా క్షౌమాబద్ధనితంబ బింబలసితాం వందే௨రవింద స్థితాం' 'పద్మాననే పద్మ ఊరు పద్మాక్షీ పద్మసంభవే' యని పద్మమయ రూపమునే వర్ణింతురు

712) ఓం సుశీలాయై నమః/ఓం సుసత్యాయై నమః

సత్యవతి, సుశీలయైన దేవి విష్ణువు యొక్క దూత శ్రీకృష్ణుని భార్యలలో నొకతె మంచి చరిత్రగల స్త్రీయని, గోలోకమందు రాధయొక్క విభూతి చతుర్భుజ విష్ణువు సంగిని మంచి నడవడిగల స్త్రీ పతివ్రత కులశీల సంపదకు, యున్నతికి, యామె ప్రతిభయే కారణము, సుసత్యమున్న పరబ్రహ్మ స్వరూపిణి. 'యత్ర నార్యస్తు పూజ్యంతే తత్రదేవాః రమంతే' అర్ధాంగినియై యజ్ఞకర్మల తోడుబడును. సత్ సంతతికై నాధారమవుచు, పంచయజ్ఞకర్మల నిర్వహణలో గృహస్థ ధర్మపాలనలో తోడుబడును

713) ఓం తిలోత్తమాయై నమః

తిలోత్తమ రూపిణియైనది అప్సరసలలో ప్రసిద్ధిగాంచిన యందగత్తె రంభ, ఊర్వశి, తిలోత్తమలు దేవలోక యప్సరసలు నాట్యశాస్త్ర కోవిదులు ఇంద్రసభ రంజింపజేయు దేవగణము అతి సౌందర్యమునకు, నలంకార శాస్త్ర ప్రవీణతకు ప్రతీకలు అట్టి యందము, నాట్యవైదుష్యమాయంది యంతలే.

అమేయా విక్రమా* క్రూరా సమ్యక్ఫలా త్రివిక్రమా విక్రమా
స్వస్తిర్హవ్య*వహా ప్రీతిరుగ్రా ధూమ్రార్చిరంగదా(102) సుశ్లిహవ్యా

714) ఓం అమేయాయై నమః

అమేయాత్మ రూపిణియైనది ప్రపంచమందలి సకల పదార్థములు ప్రమాణములు గలవి. దేవి సంపూర్ణగాన ప్రమాణమునకు వీలుగానిది. పరాశక్తి మాతృమాన మేయములనే త్రిపుటిలో మేయస్వరూపి ఈశ్వరుడు, మాతయని భావము 2) వాగింద్రియములకు గాని, మనస్సుకు గాని యాద్యంతములు. లేనిదగుటచే యామె యాత్మ 'ఇయానితి మాతుం పరిచ్ఛేత్తుం నశక్యతే' గణించుటకు, విభజించుటకు నలవిగానిది నిత్య, సత్య, జ్ఞాన, యనంత, అపరిచ్ఛిన్నయానంద, అపౌరుషేయ, సిద్ధ, స్వతంత్ర, స్వతః ప్రమాణరూపిణియైన దేవి నిష్కల, నిష్క్రియా, నిత్య నిర్గుణ, నిర్మల, నిశ్చల, యనంత, అచ్యుత, అజర, అమరమునై అమే యాత్మయగును సర్వభూతాత్రేయ సర్వదేవ సత్వయుక్తాత్మికగా నైనది

715) ఓం విక్రమాయై నమః

విక్రమ స్వరూపిణి. 'కిం వర్ణయామి తవరూప మచింత్య మేతత్। కించాతి వీర్య మసురక్షయకారి భూరి। కించాహవేషు చరితాని తవాద్భుతాని' 'దృష్ట్వా తుదేవి కుపితం భ్రుకుటీ కరాళముద్యచ్ఛశాంక సదృశ చ్ఛవియన్న సద్యః ప్రాణాన్ముమోచ మహిషస్తద తీవచిత్రం। కైర్జీవ్యతే హి కుపితాంతక దర్శనేన' ఆమె నెదిరింప నేరికి శక్యము

716) ఓం క్రూరాయై నమః/ఓం అక్రూరాయై నమః

క్రూర స్వభావము గలది 'జగత్యాం పాతయామాస భక్షయంతే న వక్షసి। స గతాసుః పపాతోర్వ్యాం దేవీ శూలాగ్రవిక్షతః' 'తతోఽజహాస సా తీవ్రం భీమాభైరవ నాదినీ। కాళీ కరాల వక్త్రాంత ర్దుర్దర్శ దశనోజ్జ్వలా' యని యతిక్రూర భయంకరరూపము యుద్ధభూమి యందసుర సంహారార్థమై క్రూరత చూపును, భక్తసంరక్షణార్థమై శరణు వేడిన వారిపట్ల అక్రూరత చూపును

717) ఓం సంపత్శీలాయై నమః/ఓం సమ్యక్శీలాయై నమః

సంపద, శీలవతియైన దేవి సంపదలు గలిగి సదాచారవతి యైన దేవి లక్ష్మీ స్వరూపిణియై అష్టవిధ సంపదలు యింటియందు వెలిగి సుఖసంతోషముల కాలవాలమగును సుశీలతకు సంపత్ పోషము సమ్యక్ యను యుజా నడత కలిగినది.

718) ఓం త్రివిక్రమాయై నమః/అతి విక్రమాయై నమః

విక్రముముగల దేవి. త్రైలోక్య విక్రమము గల దేవి, భూమ్యాంతరిక్ష దివి వ్యాప్తయై, త్రిదివముల విక్రమము, బలము చూపగల దేవి త్రివిక్రమ యని వామనునికి పర్యాయనామము రెండు పాదముల భూమ్యంతరిక్షముల నాక్రమించి, మూడవది బలి తలపై నుంచి పాతాళమునకు త్రొక్కెను దేవి విభూతుల ఇంద్రాణ్యాదులు తమ వాహనములపై నిలిచి చరించుచు విక్రమించిరి 'తతో కాళీ సముత్పత్య గగనం, క్ష్మామతాడయత్। కరాభ్యాంతన్నినాదేన ప్రాక్స్వనాస్తే తిరోముఖా★ యని త్రిలోక విక్రాంత సుందరి దర్శనీయము ప్రత్యంగాత్మ స్వరూపిణి అత్యుగ్రా అతివీర అతిమహావ్ అతి విష్ణుః అతిజ్వలన్, అతి సర్వతోముఖ, అతినృసింహ, అతి భీషణ, అతిభద్ర, అతి మృత్యోర్మృత్యు, అతి నమామి అత్యహం' ఇందు నృసింహ మంత్రము గలదు

719) ఓం స్వస్త్యై నమః

స్వస్తిరూపిణి దేవి స్వస్తిమతియన దీవన, దయా సంధత్వము గల అవినాశి 'కరోతు సా నః శుభహేతు రీశ్వరీ, శుభాని భద్రాణ్యా భిహంతు చాపదః' మనోవాక్కులకగోచరమైనను సత్తామాత్రముచే నిర్వాచ్యమైన బ్రహ్మవస్తువు సర్వత్ర యున్నందున సు అస్తి స్వస్తి రూపమగును తత్సత్ సత్యం రూపము 'త్రైలోక్య స్యహితార్థాయ సంభవతి' 'యామాతృశక్తి' 'స్వస్తి' రూపమిదియే

720) ఓం హవ్యవాహాయై నమః

హవ్యవాహ రూపిణి హవ్యవాహయన హవ్యము కొనిపోవునది అగ్నిరూపము 'జాతవేదసే సునవామ సోమ' యని దుర్గాదేవి స్తుతి అగ్నియొక్క రూపము. 'జ్వాలా కరాళ మత్యుగ్ర మశేషాసుర సూదని' యైన దేవి 'త్వంస్వాహా, త్వం స్వధా' యని దేవతలకు, పితరులకు హవిస్సుల గొని వారి పోషణ పాలన విధి చరించు దేవి హవ్యవాహాలు సదా యాచరణ పూజయందు వెలిగి, 'తస్యయజ్ఞస్య సుకృతం భవానాస్యసందధే' యని యజ్ఞఫలితమిడు దేవి

721) ఓం ప్రీత్యై నమః

ప్రీతిస్వరూపిణియైన దేవి ప్రీతియనగా సంతోషము, ప్రేమ, తృప్తి (మన్మథుని యొక్క భార్య) 'యాదేవి సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా' యని స్తుతి తుష్టిరూపిణి 'సౌమ్యా సౌమ్యతరా శేష సౌమ్యేభ్య స్త్వతిసుందరీ। పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ' ప్రీతి స్వరూపిణి. 'కరిష్యామి సురాణాం రాజ్యేస్మై ప్రాణాధారకై' యని శాకపుష్టి కలిగించును లజ్జా,పుష్టి,స్తథా, తుష్టి, స్త్వం,

శాంతి, క్షాంతి రేవతయని ముల్లోకముల సృష్టిస్థితి పాలనకర్త్రిగా, ప్రీతిస్వరూపిణిగా గుర్తించ నగును

722) ఓం ఊష్మాయై నమః

ఊష్మరూపిణియైన దేవి ఊష్మయన గ్రీష్మఋతువు అక్షరమాలలో శ,ష,స,హలు అందురు తేజోద్రవ్యము యొక్క సూక్ష్మావయవము షడృతువులను కాలస్వరూపమే కాలరూపిణియైన దేవికి గ్రీష్మఋతువు కాలాంగము తాపన గలిగియునది 2) బ్రహ్మ, విష్ణువు,రుద్రుల తేజము ఏకీభవించి జ్వాలారూపమైనది ఆపై యవయవము లాయుధములు చేర్చి మహిషాసుర మర్దిని యావిష్కరణ మైనది తేజోబిందు తాపన కేంద్రమును ఊష్మ యందురు అట్టి జాతవేద స్వరూపిణి ధూమార్చి ఊష్మాదులు అగ్నికళలు

723) ఓం ధూమ్రార్చిష్యై నమః

ధూమ్రార్చి రూపమైన దేవి సూర్యకళయును అగ్నిమండల కళాన్యాసములలో ధూమ్రార్చి దశ కళలలో మొదటిది. రెండవది ఊష్మ కళా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగ, సుశ్రీ, సురూపా, కపిలా, హవ్యవాహినీ, కావ్యకళలు గలవు హవ్యవాహ, ఊష్మ, ధూమ్రార్చ్యాదులు కళారూపమునున్న పరమేశ్వరీ యావరణ శక్తులే

724) ఓం అంగదాయై నమః

అంగదా రూపిణి దక్షిణ దిగ్దంతి యొక్క భార్య అంగద కాని సోమ కళాన్యాసములలో పదునాల్గవ స్వరము 'ఔం' అధిష్ఠాత్రిగా అంగదా కళ అమృతాది షోడశ సోమకళలు యనబడును అమృతస్రావియైన చంద్రుని రశ్మియంతలే వీని కధిష్ఠాత్రి యా పరమేశ్వరియే అగ్నికళలు, సూర్య, సోమ, బ్రహ్మ, విష్ణు, రుద్ర కళల వాహ్వానము చేసి యధిష్ఠాత్రి దేవతల న్యాసము చేయుదురు

తపినీ తాపినీ విశ్వభోగదా ధారిణీ ధరా
త్రిఖండా రోధినీ* వశ్యా సకలా శబ్దరూపిణీ (103)    బోధినీ

725) ఓం తపిన్యై నమః

తపినీ కళారూపిణి సూర్యకళలలో తపిన్యాది ద్వాదశ శక్తులు గలవు తపింపజేయువాడు సూర్యుడు. గ్రీష్మఋతువున యధికమైన తేజస్సు గలిగి ప్రజలను తపింపజేయును చైత్రమాసమును తపినీ యందురు అటులే దాని పేర నొక నదియు గలదందురు (తపత్)

726) ఓం తాపిన్యై నమః

తపింప జేయునది గ్రీష్మఋతువులో రెండవ నామము తాపిని వైశాఖ మాసమున మరింత తీవ్రముగా వుండును తాపినీ యనునది మన్మథుని పంచబాణములలో నొటి కాని యిక్కడ సూర్యకళయే యుచ్చరించ బడినది తపస్సంబంధమైన తీక్ష్ణతయు గ్రహించనగును

727) ఓం విశ్వాయై నమః

విశ్వరూపియైన కళ 'విశ్వార్చిర్విశ్వతోముఖీ' విశ్వమునంతయు పరిశీలించగల చక్షువులు గలది చక్షుస్థానము ముఖముగను, విశ్వతోముఖి వర్తించును అట్టి విశ్వవ్యాప్తమైన వెలుగునిచ్చెడివి 'విశ్వార్చిర్విశ్వతోముఖీ' యని విశ్వమున కంతకు వెలుగునిచ్చెడు సూర్యకళయైనది సూర్యకళగా నుపాసింతురు విశ్వసాక్షిగా, చైతన్యరూపిణియైన పరమేశ్వరి యంశ యామెయే. బిందు స్థానమున సూర్యకళలను న్యాసము చేయుదురు

728) ఓం భోగదాయై నమః

భోగరూపి ఇదియును సూర్యకళలలో నొకటి తపినీ, తాపినీ, ధూమ్రార్చి, మరీచి, జ్వాలిని, రుచిరీ, విశ్వాబోధినీ, సుషుమ్న, భోగదా, ధారిణీ, క్షమాయను పంద్రెండు సూర్యకళలను బిందు స్థానమున న్యాసము చేయుదురు భోగముల నిడునది భోగదా ధనము, రాజ్యము, సుఖము, దుఃఖము, స్త్రీ, భూమ్యాది యనుభవము జీవుల కర్మలననుసరించి ప్రసాదించునది

729) ఓం భోగ్యాయై నమః

భోగస్వరూపిణి 'ఆశ్వదాయిచ గోదాయి, ధనదాయి మహాధనే' పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వా జావి గోరథం స్త్రీసుఖాది యైహిక విషయములను ప్రసాదించు పరమేశ్వరి ఉపాసనా ఫలమంతయును పరమేశ్వరి కర్పింపగా స్వీయానుభవమునను, సుఖసౌఖ్య ప్రాప్తి నందగలరు

730) ఓం ధారిణ్యై నమః/ఓం ధరాయై నమః

ధారిణీ రూపయైన దేవి ధరాపదము పేరుగా నున్నది ఇదియు సూర్యకళలో నొకటి 'ఆధారభూతా జగతస్త్వమేకా' యని సమస్త జగత్తును తనలోనే ధరించు దేవి సకర్వాష్ఠ జగతోధారణ త్వాత్ సకలాధిష్ఠాత్రి పృధివియైనది 'ప్రసీద విశ్వేశ్వరి పాహివిశ్వం, త్వమీశ్వరీ దేవి చరాచరస్య' యని సర్వ జీవధారి, స్వాహా, స్వధా వషట్కార రూపముల జగత్తును ధరించు పరమేశ్వరి రూపిణి

731) ఓం త్రిఖండాయై నమః

త్రిఖండ రూపిణి, త్రిఖండేశి, త్రిఖండాముద్రా స్వరూపం ఆముద్రాది దేవతయైన పరమేశ్వరి శ్రీవిద్యాపంచదశీ మంత్రము మూడు ఖండముల కధిదేవత గాన త్రిఖండా యనబడును పది ముద్రల యందు పదవదైన ఆఖరు ముద్ర ఈ ముద్ర మూడు ఖండములుగా నుండును ఇదే పంచ దశాక్షరీ మంత్ర త్రికూటమి యగును వీనిని వాగ్భవ, కామరాజ, శక్తి కూటము లందురు అవియే మూడు లోకములైన భూమ్యాంతరిక్ష దివములు మూడు వ్యాహృతులు ఓం భూః భువః సువః యని ఈ సకల త్రితత్వములను ప్రభ్వ యైన పరమేశ్వరి త్రిఖండారూపిణి

732) ఓం బోధిన్యై నమః/ఓం రోధిన్యై నమః

బోధినీ కళారూపము సూర్యకళలలో బోధిని యనునదొకటి ఎరుక గలిగించునది. మేల్కొలుపుట, కార్తీక శుక్ల ఏకాదశి యందురు శివచక్రములలో కైలాసమిది బోధినీ కళ, అవిద్యారోధిని రూపమైనదియు నైన పరమేశ్వరీ కళాస్వరూపము

733) ఓం వశ్యాయై నమః

వశ్యారూపయైనది పరమేశ్వరీ ఆయుధములలో వశీకరణాయ పాశమునియొకటి చతుర్ధావరణ యందు సర్వతోముఖ వశీకరణ శక్తి. రాజమాతంగి మంత్రోద్ధారణలో సర్వరాజ, పురుష, దుష్టమృగ, సర్వసత్వ సర్వలోక వశంకరిగానెంతురు గావున సకల జగత్తు తన వశమునందు యుంచుకొన గలిగిన శక్తి.

734) ఓం సకలాయై నమః

సకలము తానేయైనది సకలాయైనమః కళాయుతముగా నున్నది సకల ప్రపంచమును తానేయైనది. 'విద్యాసమస్తా తవదేవి భేదాః స్త్రియస్సమస్తా సకలాజగత్సు। త్వయ్యైకయా పూరితమంబ' యని గలదు 'సర్వస్వరూపే సర్వేశే సర్వశక్తి సమన్వితే భయేభ్యస్త్రాహి' 'రూపైరనేకైర్బహుధాత్మమూర్తిం కృత్వాంబికే తత్ప్రకరోతి, నాన్యా' 'విశ్వేశ్వరీత్వం పరిపాసి విశ్వం, విశ్వాత్మికాధారయసీతి విశ్వమ్। విశ్వేశ వంద్యా భవతీ భవంతి''విశ్వాశ్రయా' 'హేతుస్సమస్త జగతాం త్రిగుణాపిదోషైర్నజ్ఞాయసే హరిహరాదిభిరప్యపారా సర్వాశ్రయాఽఖిలమిదం జగదంశ భూత, మవ్యాకృతాహి పరమాప్రకృతి స్త్వమాద్యా.' సకలారూపిణి.

735) ఓం విశ్వరూపిణ్యై నమః/ఓం శబ్దరూపిణ్యై నమః

ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వాత్మం విశ్వసంభవం యను విశ్వరూపాయైనమః రూపము శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాం నిధానముద్గీథ రమ్యపదపాఠవతాంచ సామ్నాం। దేవిత్రయీ భగవతీ భవభావనాయ సర్వజగతాం పరమార్తిహంత్రీ శబ్దమునుండి వెలువడు సకల వర్ణముల కధిష్ఠాత్రి 'మాత్రాధీనం జగత్సర్వం' యని నాదప్రాధాన్యము తెలియనగును విశ్వమన ప్రపంచం, స్థూల రూపం, బ్రహ్మాండము, సూక్ష్మరూపము పిండాండము ఈ రెండును సమాన ధర్మములు గలవి జాగ్రద్దశ యందలి స్థూలదేహాభిమానియగు విశ్వుని రూపమున నుండునది 'విశ్వరూపిణి విశ్వత్వేన స్థితం రూపం,

విశ్వరూపాయ, విశ్వాసలభ్యాయ, విదితాత్మనే, విశ్వోత్తరాయ, విశ్వస్య సాక్షిభూతయే నమః'
బీజరూపా మహాముద్రా వశినీ* యోగరూపిణీ యోగినీ
అనంగ కుసుమానంగ మేఖలానంగ రూపిణీ(104)

736) ఓం బీజరూపాయై నమః

బీజరూపిణియైనది 'త్వం వైష్ణవీశక్తి రనంత వీర్యా, విశ్వస్యబీజం పరమాసిమాయా' 'సమ్మోహితం సమస్తమేతత్' 'సృష్టిస్థితి వినాశానాం శక్తి భూతే సనాతని గుణాశ్రయే గుణమయే' యని 'వర్షంతుతే విభావరి దివోభ్రస్య విద్యుతః రోహంతు సర్వబీజాన్యవబ్రహ్మ ద్విషోజహి' బీజరూపియై సకల బీజకూటముల మొలకెత్తుటకును కారణస్వరూపియైన దేవి

737) ఓం మహాముద్రాయై నమః

మహాముద్రా స్వరూపిణి ఉపాస విధానములలో నాయా పుపచార సేవనలో చేయు కరవిన్యాసము సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వవశంకరి, సర్వోన్మాదిని సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని, సర్వత్రిఖండముద్రలు నవావరణ పూజాల వినియోగము శ్యామలా దండకమున సర్వయంత్రాత్మికే సర్వతంత్రాత్మికే, సర్వముద్రాత్మికే యని గలదు ఆవాహనాది షోడశోపచారముల యందు ముద్రలు చూపుచుందురు వివిధ దేవతా వుపాసనా ప్రక్రియల నాయా కల్పోదకములైన ముద్రల ప్రదర్శించినచో నుపాస్యదేవత యత్యంత ప్రీతి నొందును మహాముద్ర యన చివరికి చూపించు సాముదాయిక ముద్రా స్వరూపము పైన తెలిపిన త్రిఖండ ముద్రాస్వరూపము వివరము 589వ నామము 731 నామము చూడనగును

738) ఓం వశిన్యై నమః

వశిరూపిణి అణిమాద్యష్టసిద్ధులలో వశిత్వసిద్ధి యొకటి సమస్త ప్రాణికోటిని తన వశము చేసికొనగలుగు శక్తి. అష్టమావరణ శక్తులతో 'వశీకరణాయ కామేశ్వరవాసం' కామేశ్వరీ బాణముయని ఎదుటి వారి మనముల బంధింపజేయు శక్తి. రాజమాతంగేశ్వరీ శక్తి సర్వరాజ వశంకరి, సర్వపురుష, సర్వసత్వ, సర్వలోక, సర్వదుష్టమృగ వశంకరిగా నెంచురు, అట్టి సర్వవశిని శక్తి రూపిణి ఆమె

739) ఓం యోగరూపిణ్యై నమః

యోగరూపిణీ శక్తియై యున్నది యోగములు నాలుగు విధములు రాజయోగం, హఠయోగం, మంత్ర యోగం, లయయోగం, యోగసాధకులకు నుపాసనారూపమై యోగరూపిణియైన దేవి సర్వ చిత్త వృత్తిని బంధించి జీవపరమేశ్వరుల యైక్యత సాధించుటయే యోగము. అందులకు ప్రకటాది నవావరణ శక్తుల సాముదాయిక రూపమైన శ్రీదేవి యోగరూపిణి సర్వసర్వాత్మికగా వ్యాసము చేయ సహస్రారము నందు క్రీడించు యాకిని శక్తి.

740) ఓం అనంగ కుసుమాయై నమః

అనంగ కుసుమ రూపిణి. తృతీయావరణ దేవతా సముదాయము అనంగ కుసుమా, అనంగ మేఖలా, అనంగ మదనా, అనంగ మదనాతురా, అనంగ రేఖా, అనంగ వేగిని, అనంగాంకుశా, అనంగమాలినీ యని సర్వసంక్షోభిణీ చక్రమైన, అష్టదళ చక్రాధిష్ఠాత్రులైన యోగినీ గణములు వీరి వర్ణన రక్తా పుండ్రేక్షు చాపపుష్ప బాణధారులు, పేటీకృత కోశమండలా, రక్తకంచుక ధారిణీ యని నాభి స్థానమున ప్రదక్షిణ క్రమముగా నెంచి ధ్యానింతురు అనంగ మదనాతుర అనంగవేగిని దక్క మిగిలిన సప్తయోగినులు క్రమముగా పేర్కొనబడినవి అనంగవేగిని యని (108) యుదహ రింపబడిన అష్టయోగినుల భావింపవలెను

అనంగ యన మన్మథుడు, మనసు, ఆకాశం, శరీరరహిత (అంగ రహిత) రూపము

1) అనంగ యన కామోద్దీపనమైన పరిమళ పుష్పరూపిణి యననగును 2) సహస్రార కమలము యనంగ కుసుమయని తలచి మనసు నర్పించుట, ఉపాసనా విధిలో విష్ణువు, శివునికి, అన్నదు

కాళహస్తీశ్వరునికి నేత్రముల నర్పించినట్లు, రావణుడాది శిరములు నర్పించినట్లు గలదు ఆదేవిధి మనోకుసుమము నర్పించ వెలుగుదేవి యనంగ కుసుమారూపిణి 3) ఆకాశమంతయు నొక విరాట్కుసుమముగా నెంచి మణిద్వీపముపై నునికి కల్పింప జేసియందు కారణానంద విగ్రహము స్థాపించుట, 4) నిర్గుణోపాసన యందు రూపరహిత, యంగరహిత తేజమే గ్రహించబడును అట్టి తేజోమూర్తి విభూతి యొకటి సర్వదేవ శరీరముల నుండి యావిర్భవించిన తేజోరాశి యామెయె గదా వీనికి ప్రత్యేక పూజాక్రమమును గలదు

741) ఓం అనంగమేఖలాయై నమః

అనంగ మేఖలా స్వరూపిణి, మేఖలాయన ఋషి, గిరిభేదం, కొండ నడుము, ఎనిమిది పేటలు గల స్త్రీ మొల నూలు, ఒడ్డాణము, నడికట్టు, ముంజకట్టి, మొలత్రాడు, నర్మదానది యని యర్థము. నాభితలము నడుము ప్రాంతము అక్కడ దేవికి యలంకారముగా నొడ్డాణము, మొలనూలు, పదాతివుడు బంధించు ముంజస్థానము, భారత భూమికి నడుమ ప్రవహించు నర్మదానదిగాను భావించనగును 'ఘన గోదావరి కటిసూత్రంబుగ' హిందుమాత ధరించినదని గేయము. ప్రకృతియను భారతదేశమును గదా ప్రస్తుతము నుదహరించిన యష్టశక్తులు నడుమనున్న బొడ్డుకు ఎనిమిది దిక్కుల రక్షణ చేయు యోగినీ గణ సముదాయము ఇవియన్నియు మూలప్రకృతి ఈశ్వరి యంశలే యా యష్టయోగినిలు

742) ఓం అనంగ రూపిణ్యై నమః

అనంగరూపిణియైన దేవి అంబ వుపాసనలో సగుణోపాసన, నిర్గుణోపాసన విధములు సమస్తలోక వ్యాప్త పంచభూతాత్మిక, ఇంద్రియాది స్థాతియైన దేవి, రూపమిదియని నిర్ణయించలేము సకలజీవుల యందు నాయారూపములందామెయే యుండ మానుషరూపము, జలచర రూపము గగన వ్యాప్త నిరాకార రూపమాయని నిర్ణయించలేముగాన యనంగరూపిణి యగును

అనంగ మదనాఽనంగ రేఖాఽనంగాం కుశేశ్వరీ,
అనంగమాలినీ కామేశ్వరీ సర్వార్థసాధికా(106)

743) ఓం అనంగమదనాయై నమః

అనంగ మదనారూపిణి మన్మథుడు, వసంతఋతువు యని యర్థము ఈశ్వరుని నేత్రాగ్ని కీలల భస్మమై కేవలము భావరూపముగానే వెలుగుచుండును రతిదేవికి మాత్రము సశరీరునిగ దోచును కావున యనంగ రూపియైన యనురాగభావము దాల్చిన దేవి యనంగమదనా, ప్రకృతి సౌందర్యము, ఆది దైవిక, సౌందర్యమునందు పొంగు వున్మత్త భావరూపమే

744) ఓం అనంగరేఖాయై నమః

అనంగరేఖారూపిణి. రేఖయన కొంచెము కపటము, ఆభోగము, వ్రాయుగీత, పాణిపాదరేఖలుయని యు రేఖయన యాకారము తెలుపు చిత్రపటము దేవి రూపము తెలియనేరనపుడు మానవరూపము నాపాదించి, యాయుధములకు తగ్గ చేతులు, నలంకారములు, సృజించి, యేర్పర్చబడిన పూహాచిత్రమేగా ఆమె యర్చామూర్తి అట్టి యనంగరేఖ యామె యంశమే

745) ఓం అనంగాంకుశేశ్వర్యై నమః

అనంగా కుశేశ్వరియైన దేవి అంకుశమనగా ఆయుధ విశేషము మత్తగజమును మావటీడు అంకుశములోనే అదుపు చేయును మనసు గూడ మత్తగజము వంటిది దానిని అదుపు చేయుటకు అనంగాకుశమే కావలసి యున్నది మనస్సునకును అంగములుండవు గదా దానియంగ హీన అంకుశమే అవసరము అట్టి అంకుశము అధీనమునందుంచుకొని నియంతయైన పరమేశ్వరి, భక్త సాధక మనసుల నిర్గుణ రూపము నైపు కేంద్రీకృతముగునట్లు అదుపుచేసి తన దర్శన భాగ్యము గలిగించుచుండును

746) ఓం అనంగమాలిన్యై నమః

అనంగమాలినీ రూపము మాలినియన, పూలుకట్టి యమ్ము స్త్రీ, పార్వతీదేవి, చంపా నగరం నది, ఆకాశగంగ, మాతృక యని యర్థములు గలవు పార్వతీదేవి యొక్క విభూతియే. ఆకాశగంగ రూపము విరాట్ రూపమునకు మాలికవలె తోచుచుండును అట్టి యనంగ మాలిని విశ్వధాత్రికి నడుమ భాగమున నొప్పుచుండుట విశేషము (గంగా యమునలే కంఠహారములు - గీత)

747) ఓం కామేశ్వర్యై నమః

కామేశ్వరీ రూపిణియైన దేవి జీవసమిష్టి స్వరూపమే పరమేశ్వరుడు కామేశ్వరీ కామేశ్వరులు సృష్టి యందలి స్త్రీ పురుష ప్రకృతికి ప్రతీకలు కామేశ్వరుని మాయా శబలిత రూపమున పరమేశ్వరి, ముఖ్యప్రాణ నాడియైన సుషుమ్నా స్వరూపమున నుండునది 'శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం। నచేదేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి' యని సర్వానందమయ బైందవ చక్రమున, పరబ్రహ్మ స్వరూపిణి, పరామృత శక్తి స్వరూపిణి, సర్వచక్రేశ్వరీ, సర్వవిద్యేశ్వరి, సర్వపీఠేశ్వరి, సర్వవాగీశ్వరి, సర్వయోగేశ్వరి, సర్వవీరేశ్వరి, సర్వసిద్ధేశ్వరీ, సర్వతత్త్వేశ్వరీ, సర్వ కామేశ్వరీ, సర్వరక్షేశ్వరి, సర్వ జగదుత్పత్తి మాతృకా చైతన్య శక్తియైన కామేశ్వరి కామేశ్వర పర్యంక విభూషితయై పరమానంద యానంద సాగరమున నోలలాడుచుండును.

748) ఓం సర్వార్థసాధకాయై నమః

సర్వార్థముల సాధక రూపిణి. పంచమావరణల సర్వార్థ సాధక చక్రం సర్వసిద్ధి ప్రదా సర్వసంపత్ప్రదా, సర్వప్రియంకరీ, సర్వమంగళకారిణీ, సర్వకామప్రదా, సర్వదుఃఖ విమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్ననాశిని, సర్వాంగసుందరీ, సర్వసౌభాగ్యదాయినీ, 'సర్వదేవమయీం మీనాంక్షీం మీమాంస్యః పూజయేత్ సర్వలోకానాం ప్రభుర్భవేత్' యని 'సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే శరణ్యే త్ర్యంబకే దేవి (గౌరి) నారాయణి నమోస్తుతే'

సర్వతంత్రమయీ సర్వమోహిన్యానంద రూపిణీ
వజ్రేశ్వరీ చ జయినీ సర్వదుఃఖ* క్షయంకరీ(108) ద్వంద్వ

749) ఓం సర్వతంత్రమయ్యై నమః

సర్వతంత్ర స్వరూపిణియైన దేవి తంత్రమనగా నుపాసనా విధానము దేవతానుగ్రహము సంపాదనకై యారాధనలు నిర్వహించు కల్పోక్తకలాపములు యజ్ఞములు, సోమాది యాగములు వీనిని సర్వతంత్రములందురు 'బహుధాఽప్యాగమై ర్భిన్నా పంథానస్సిద్ధి హేతవః త్వయ్యేవనిపతంత్యోతి స్రోతస్వినస్సాగరాయివే' ఆగమములనేక విధములు భిన్నములైనను, సర్వము, నదులు సంద్రమేయగునటుల నా పరమేశ్వరీ యుపాసన యొక్క విభిన్నాంగములే 'యజంతే సాత్త్వికా దేవాన్, యక్షరక్షాంసి రాజసాః ప్రేతాన్ భూతగణాంశ్చాన్యా యజంతే తామసాజన' యని తంత్రములు సాత్త్విక, రాజస, తామసికములు యను మూడు విధములు సాత్త్వికములు తంత్రము లనియు, రాజసికములు యామళములనియు, తామసికములు డామరములనియు పేర్కొందురు అట్టి బహుళ తంత్రములలో, వశిష్ఠ, సనక, సనందన సనత్కుమార శుక సంహితలు శుభాంగములు సమయాచారమునకు చెందినవి కౌలవామాచార తంత్రములలో ముఖ్యము లరువది నాలుగు వీటియన్నింటి స్వరూపమైన పరమేశ్వరి సర్వతంత్ర రూపాయగును

750) ఓం సర్వమోహిన్యై నమః

సర్వమోహినీ రూపము మోదము యనగా ఆనందము గలిగించునది. మద్యము వలె నున్మత్త భావము గలిగించునది 'త్వం శ్రీ త్వమీశ్వరీ త్వం, హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా లజ్జాపుష్టిస్తథా తుష్టిస్త్వం శాంతిః క్షాంతి రేవచ' యని సర్వజన హితమును గోరుచు నందరినీ తుష్టి పరచును సర్వలోకేశ్వరిగా వెలుగును ఆమె స్వభావం 'సౌమ్యా సౌమ్యతరాశేష సౌమ్యేభ్యస్త్వతి సుందరీ పరాపరాణాం పరమా త్వ

మేవ పరమేశ్వరి' యని సకల ప్రాణులకు జగన్మాతయై యందరి సంతోషమును చూచి తానే తృప్తి చెందు దేవతాస్వరూపము

751) ఓం అరుణాయై నమః

అరుణాస్వరూపిణి అరుణాయన యెరుపు వెలుపు సూర్యుడు తత్ శక్తి అరుణాశక్తి. అరుణానది ప్లక్ష ద్వీపములో గలదు నదీరూపి దేవత అరుణాయన క్షత్రియ వర్ణ సంకేతమునైన రక్తవర్ణము 'అరుణాం కరుణాతరంగితాక్షీం' యని స్తోత్రము సప్తశతి అష్టమాధ్యాయంలో రక్తవర్ణ స్వరూప దేవి యైన దేవీ రూపము

752) ఓం ఆనంద కలికాయై నమః / ఆనంద రూపిణ్యై నమః

ఆనందరూపిణియైన దేవి జీవియందు సత్, చిత్, ఆనంద కళలు సమైక్యమైన పరబ్రహ్మ స్వరూపిణి సత్యస్వరూపిణి, చిత్ స్వరూపిణి, ఆనంద స్వరూపిణి, నిత్యానందమునందు దేవి రూపము. అఖండము అద్వైతము శాశ్వతము చిదానందైకఘనమునగునదియే యానంద కళారూపము ఇంద్రియముల ద్వారా యనుభవము, ప్రతిబింబానందము, అకారణ ప్రసక్తిలేక భావసామ్యము గల్గినది వాసనానందము జ్ఞానమూలకముగ గలుగు బ్రహ్మానందమే నిజానందము పరానంద స్వరూపిణి। 'బలిష్ఠః పృథివీ సర్వా వస్యా విత్త పూర్ణస్యాత్ మానుష ఆనందః శతంమానుషమనుష్య గంధర్వాణామానందః తస్య శతం దేవగంధర్వాణామానందః శతందేవ గంధర్వాణా మానందం పితృణాంచిర లోకానామానందః శతంతస్య అజా, నజానాం దేవానాం ఆనందం। తస్యశతం దేవానామానందం ఇంద్రస్యానందం। శతంతస్య బృహస్పతే, శతాతస్య ప్రజాపతేః తస్య శతం బ్రహ్మణో ఆనంద - అని బ్రహ్మానందము యొక్క వివరణ గలదు సర్వావస్థ దుఃఖాయాస హీనం సుఖరూపం ఆనందరూపమమృతం యద్విభాతి

753) ఓం వజ్రేశ్వర్యై నమః

వజ్రేశ్వరీ రూపిణియైన దేవి శ్రీచక్రమందు అవ్యక్త స్వరూప త్రిభుజమందు కోణత్రయాధి దేవతలు కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలిని 2) పిండాండమందు విశుద్ధాచక్రాధిదేవత 3) వాగ్వై వజ్రః గను వాగీశ్వరియే వజ్రేశ్వరి 4) ప్రాకారములలో పన్నెండవది వజ్రమయ ప్రాకారము ఆవరణ మధ్యము వజ్రమయమైనది అధిదేవత వజ్రేశ్వరి 5) వజ్ర విరాజితములనింద్రుడిచ్చెను 'కిరీటిని మహావజ్రే సహస్రనయనోజ్జ్వలే వృత్ర ప్రాణ హరే చైంద్రి' యని ఇంద్రశక్తి విభూతి వర్ణనము 6) పంచదశతిథి నిత్యలందు శుక్ల పక్ష షష్ఠి తిథి నిత్య వజ్రేశ్వరి సంజ్ఞగలది వజ్రాయుధము ధరించిన దేవి

754) ఓం జయిన్యై నమః / ఓం జనన్యై నమః

జయినీ రూపిణి జయమునే పొందెడు శక్తి సర్వత్ర జయము గల్గజేయు శక్తియునై యున్నది అరిషడ్వర్గముల జయించి యాత్మజయమును చేకూర్చి ముక్తినందించు దేవి మృత్యువును, కాలమును గూడ జయించు శక్తి మృత్యుంజయ శక్తి. వరాహ పర్వతమున జయాయను దేవి గలదు సర్వలోకములకు జనని మాత త్రికోణ నిలయ జయయనునది ముఖ్య ప్రాణసంకేతముగను

755) ఓం సర్వ దుఃఖ క్షయంకరి

సర్వ దుఃఖనాశనము చేయు దేవి 'దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః స్వస్థైః స్మృతా మతిమతీవశుభాందదాసి దారిద్ర్య దుఃఖభయ హారిణి కాత్వదన్యా సర్వోపకారణాయ సదార్ద్ర చిత్తా 'సర్వబాధా ప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి ఏవమేవత్వ యాకార్య మస్మద్వైరి వినాశనం' 'అధిభౌతిక అధి దైవిక, ఆధ్యాత్మికములైన త్రివిధ తాపములు దుఃఖ కారకములు వానిని తొలగించి మోక్షమార్గము చూపునది పరమేశ్వరి

షడంగ యువతీ యోగయుక్తా జ్వాలాంశుమాలినీ
దురాశయా దురాధారా దుర్జయా దుర్గరూపిణీ (107)

756) ఓం షడంగ యువత్యై నమః

షడంగ యువతీ రూపము షడంగములైన హృదయం, శిరస్సు, శిఖా, నేత్ర, కవచ, అస్త్రములను యారును వీనికధిదేవతలు, అంగదేవతలతో కలిసి పూజించుచుందురు క్రమముగా నధిదేవతలు సర్వజ్ఞ నిత్యతృప్త, అనాదిబోధ, స్వతంత్రా, అలుప్తా, అనంతాదిశక్తులు 2) వేదరూపిణిగా భావించి షడంగములుగా శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము జ్యోతిషము కల్పములను యారువిధములు యువతీ స్వరూపముగా గలది 3) పరమేశ్వరి అంగ, ఆయుధ, ఆవరణ, నిత్యా, ఆమ్నాయ, పరివార దేవతలచే పరివృతమైన మాత స్వరూపము 4) మనిషి యశస్సునందుటకు షడంగ దేవతల శక్తులైన ఐశ్వర్య, వీర్య, యశ, శ్రీ, జ్ఞాన వైరాగ్యములను నారునుగలవు

757) ఓం యోగ యుక్తాయై నమః

యోగయుక్త స్వరూపిణి జీవబ్రహ్మైక్య సంయోగమే యోగము అదిగలిగియుండుటచే యోగయుక్త యందురు మంత్ర, రాజ, హఠ, లయాదుల సర్వయోగయుక్తయైన దేవి స్వాధిష్ఠానాది యోగిని గణయుక్తమైనందున యోగయుక్త సాంఖ్యాది యోగయుతయైనదేవి

758) ఓం జ్వాలాంశుమాలిన్యై నమః

జ్వాలా కిరణమాలిక గల దేవి తిథులకులు పదునైదు నిత్యాశక్తులుగా నున్నవి షోడశీ కళ మహానిత్యా. అందు పదునాల్గవ కళ జ్వాలామాలిని శ్రీదేవి చేత యాజ్ఞప్తయై ముప్పది యోజనములు గల యుద్ధభూమియందు, ఉన్నత అగ్నిప్రాకార రూపమున నేర్పడినది లలితా భండాసురుని యుద్ధమందు జ్వాలామాలిని పాత్రగలదు. 'జ్వాలాకరాళ మత్యుగ్రము శేషాసుర సూదనం' 'కాళీకరాళ వక్త్రాంతర్గతగర్భ దశనోజ్జ్వలా' 'జ్వాలాపుంజముల జేసి వెల్వరించు' దేవియైయున్నది 3) నిత్యస్వ త్య రూపమును 'వపుః పుణ్యస్తథావాతా, సుప్రతో ఉత్భూర్జ్వాకరః' 'జ్వలజ్జ్వాలుత్పాద్యయః శాంతా శాంతి ద్విగుణితస్వనా' యజ్ఞాంగ రూపమునైన దేవి

759) ఓం దురాశయాయై నమః

దురాశయముగల దేవి పరమేశ్వరి లీలలలో సృష్టిస్థితి లయము, తిరోధానము యనుగ్రహములను నైదు కృత్యములచే జీవులతో క్రీడించుచుండును మోక్షప్రదాత సామర్థ్యమున్నప్పటికీ, భౌతిక సంపదల గల్గజేసి, మహామాయా ప్రభావమున దేవగణములతో గూడ నాటలాడుచుండును కొంత కాలము దేవతలు పాలించగా కొంత కాలము రాక్షస పాలన గూడ కాలచక్రమున నేర్పరచుచుండును జీవులకు మోహకములైన యాహార, నిద్రా, భయ, మైథున సుఖము గల్గించి దూరముగానుంచును మధుకైటభుల చండముండాసురుల మోహింపజేసి వారిని సంహరించుశక్తిగానైనది అనేక పరీక్షలనిడుచు ధృఢ చిత్తులకే కొద్దిమందికో సాయుజ్య పదవి నిడుచుండును.

760) ఓం దురాధర్షాయై నమః / దురాధారాయై నమః

దురాధర్షిణియైన దేవి ఇంద్రియ స్వాధీనత లేనివారికి కానుపించదని భావము 2) దైత్యాదిభిః ధర్షయితుంనశక్యత ఇతి దురాధర్ష. దైత్యాదులచే ధర్షింప నశక్యమైనదేవి. ఆమె హుంకార మాత్రముననే దైత్యులు దహించుచుందురు అట్టి మాయతో యుద్ధము చేయనేరికి సాధ్యము అటులే నాలసులు నింద్రియ లోలురు చంచల చిత్తులు మొదలగు వారిచే దర్శింపనలవిగాని మూర్తి కేవలం జ్ఞాన సమాధి యందే దర్శనమగును.

761) ఓం దుర్జ్ఞేయాయై నమః / దుర్జయాయై నమః

ఎరుకగనుట కతి కష్టమైన స్వరూపము 'యస్యాః ప్రభావమతులం భగవాననంతో, బ్రహ్మాహరశ్చన హివక్తుమలం' బలంవయని త్రిమూర్తులే గ్రహింపవేరని యుక్తులము గలది 'హేతుస్సమస్త జగతాం త్రిగుణాపి దోషైః రక్షాయసే హరిహరాదిభిరస్యపారా' 'తపక్ష్యహానసముమలం ప్రాణా న్యమేవ మహిషస్త అతివిచిత్రం' యని యంబయంత రంగము తెలిసికొనలేక మహిష, చండ

ముండా సురులను యుద్ధమందు నిహతులైరి 'వైరిష్వపి ప్రకటితైవ దయాత్వయేద్ధమ్' అని శత్రువులపై గూడ దయచూపు స్వరూపిణియైన దేవి రూపం 2) దుర్గమాయన జయింపనలవిగాని స్వరూపము ఆమె ప్రభావము, బలముల మహిత భగవాన్ అనంతుడు, బ్రహ్మహరులు లేశ మాత్రమైన నెరుకలేనివారు 'చండికాఖిల జగత్పరిపాలనాయ / నాశాయచాశుభమతిం కరోతు' అసుర సంహారిణిగా నటియశక్తియై యున్నది

762) ఓం దుర్గ రూపిణ్యై నమః

దుర్గ రూపిణియైన దేవి దుర్గ మాసురుడను రాక్షసుడు, యింద్రాది దేవతలను బాధింపగా పరాశక్తి ప్రత్యక్షమై యారాక్షసుని వధించినందున దుర్గయైనది 2) కాశీ క్షేత్రమున సుబాహుయను రాజాకు వరము లొసగి దుర్గగా పూజలందుకొను దేవి 3) నవవర్ష బాలికకు పెండ్లిగావియెడల దుర్గ నామధేయమున వ్యవహరించి పుపాసింతురు 'దుర్గాయై దుర్గా పారాయై సారాయై సర్వకారిణ్యై ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః' "దుర్గాఽసి దుర్గ భవసాగర నౌతరంగా" చక్రతిందువు నధిష్ఠించి సర్వప్రాకార రక్షణ దళములు గలిగినట్టి, మణిద్వీప వాసినస్మరణచే భక్తుల రక్షించుదేవి. ఆమె స్వరూపము 'క్షేయా, అనంతా, అక్షాఽపైకాఽనైనేతి, మంత్రాణాం మాతృకాదేవీ, శబ్దానాం జ్ఞాన రూపిణీ। జ్ఞానానాం చిన్మయాతీతా, శూన్యానాం శూన్యసాక్షిణీ। యస్యాపరతరం నాఽస్తి సాదుర్గా ప్రకీర్తితా'

**దురంతా దుష్కృతిహర దుర్ధ్యేయా దురతిక్రమా**
**హంసేశ్వరీ త్రిలోకస్థా* శాకంభర్యనురాగిణీ*(108) కోణస్థా కంపినీ**

763) ఓం దురంతాయై నమః

దురంత రూపిణియైన దేవి దుర్యనగా దుఃఖమును యంతము చేయు దేవి జీవులు యనేక జ్ఞాతాఽజ్ఞాత పాపములు చేయుచుందురు వానికి తగు ఫలితము నంతమున గాననగును. కాని దేవి స్మరణచే, నా దుఃఖముల నధిగమించదగును ఆమె తత్త్వసారము తెలిపికొననేరికి సాధ్యముగాదు. దుర్జ్ఞేయా, గభీరా, భక్తుల పరీక్షి దుఃఖములనిడు వ్యసనిని అపై సాయుజ్యమిడుటయు నామె విలాసమే

764) ఓం దుష్కృతి హరాయై నమః

దుష్కృతుల హరించు దేవి 'యానికానిచ పాపాని జన్మాంతర కృతాని' "జ్ఞానతోవాఽజ్ఞానతోవా" ప్రకృతి యంగములైన నితర జీవుల హింసయు, యజ్ఞాదిక్రియలు చేయక వానికి విఘాతము గల్గించుటయు, ఈర్ష్యా ద్వేషాదిలోలుడై హింస యసత్య భాషణము స్తేయముఽబ్రహ్మచర్యము, లోభియై సంపద సేకరణ, క్రయ విక్రయాది దుష్కృతులును దేవిని స్మరింపక చేయు క్రియులు, వానివలన గలిగిన పాపముల పోగొట్ట దేవియే సమర్థురాలు 'యాచస్మృతాపాత్ క్షణాదేవహంతినః, సర్వాపదో భక్తి వినమ్రమూర్తిభిః'

765) ఓం దుర్ధ్యేయాయై నమః

దుర్ధ్యేయయైన దేవి ధ్యేయాయన ధ్యానింపదగినది దుర్ ధ్యేయ సాధన చేతనే లభించునదిగాని సాధారణముగా లభింపని రూపము 'యస్యాప్రభావమతులం భగవాననంతో బ్రహ్మ హరశ్చ నహి వక్తుమలం బలంచ' ఆమె లీలలు బ్రహ్మాదులచే యెరుగబడనివి అట్టి మూర్తి 'యాశ్రీః స్వయం సుకృతినాం భవనేష్వలక్ష్మీః, పాపాత్మనాం కృతధియాం హృదయేషు బుద్ధిః' సుకృతుల హృదిభవన నివాసియు, దుష్కృతుల బుద్ధిమూఢతయు గల్గించు స్వరూపిగాన బ్రహ్మయపి హరిహరాది భా రప్యపారా' యని ధ్యేయచిత్తమునకు స్థిరతగల్గినపుడే సాధకముగా ప్రేమమూర్తియై యున్నది.

766) ఓం దురతిక్రమాయై నమః

అతిక్రమింపరాని శక్తిరూపిణి దురాధర్షా, దుర్గమాయని బ్రహ్మాదులకును విధియనుల్లంఘనీయము.

ఇక్కడ విధిని నిర్దేశించునది కాలము అ కాల స్వరూపిణి యంబ ఆమె శాసనమునకు లోబడి త్రిలోకములు వర్తిల్లును ఆమె భయముననే సూర్యుడు నుదయించును గాలి ప్రవహించును 'ధర్మ్యాణిదేవి సకలాని సదైవ కర్మాణ్యత్యాదృతః ప్రతిదినం సుకృతీకరోతి 'యని 'హేతుస్సమస్త జగతాం త్రిగుణాపి దోషైర్నజ్ఞాయసే హరిహరాదిభి రప్యపారా' యనియామె నిర్దేశముగాదని దేవాదులును, యతిక్రమించ వీలుపడని వ్యవస్థ మోక్షసాధనకామె యుపాసనయే మార్గము

767) ఓం హంసేశ్వర్యై నమః

హంసేశ్వరీ స్వరూపిణియైన దేవి హంస మంత్రస్వరూపముగలది 'హంస హంసాయ విద్మహే, సోహం సోహం మధీమహి, హంసః సోహం ప్రచోదయాత్' యని హంస గాయత్రి హంస యనప్రాణము ఇరువది యొక్కవేయి ఆరువందల మార్లు (21,600)= (72 x 300)(60 x 360)(24x60x15) దినమునకు చలనముచే జీవచైతన్యవంతుడగును సర్వాంతరస్థయై హంసేశ్వరి హృదయ కుహరమున నివసించును హంస, పరమహంసలని తురీయాశ్రమ నైష్ఠికులు, వారి మనోతలమున, సదాధ్యేయ మూర్తియై హంసేశ్వర నివసించుచుండును హం ఉచ్ఛ్వాసం, సః నిశ్వాసరూపం సంయుక్తరూపం హంస 'షట్చక్రములవ్యాప్తి అధారం 600, స్వాధిష్ఠానం 6000, మణిపూరకం 6000, అనాహతం 6000, విశుద్ధము 1000, ఆజ్ఞాచక్రం 1000, సహస్రారం 1000, మొత్తము కలిపి 21,600' సంఖ్య యగును హంసకాలపరిధి

768) ఓం త్రికోణస్థాయై నమః / ఓం త్రిలోకస్థాయై నమః

త్రిలోకవాసినియైన దేవి చంద్ర సూర్యాగ్నులు మూడును, ఇడా పింగళ సుషుమ్నలును, బిందు పరివృత త్రికోణశక్తియుతమును, మూలాధార స్వాధిష్ఠాన అగ్నిరూపము, మణిపూర యనాహత సూర్యమండలము, విశుద్ధ, ఆజ్ఞాచంద్రమండలముల వ్యాప్తమైయున్న తేజోరూపము భూమ్యంతరిక్షదివములన్న త్రైలోక్యముల వ్యాప్తమైయున్న దేవిరూపమును ।లోకత్రయేపి ఫలదా ।త్రైలోక్యమే తదఖిలం రిపునాశనేన' త్రాతా విశ్వేశ్వరీ జగద్ధాత్రి, సృష్టి స్థితి సంహారకారిణియైన త్రిపురవాసిని, త్రికోణస్థయైన దేవి

769) ఓం శాకంభర్యై నమః

శాకంభరీ రూపిణియైన దేవి 'తతోఽహమఖిలం లోకం. ఆత్మదేహ సముద్భవైః భరిష్యామిసురాః శాకై రావృష్టైః ప్రాణధారకైః। శాకంభరీతి విఖ్యాతింతదాయాస్యామ్యహంభువి' 'శాకంభరీంస్తువన్, ధ్యాయన్, జపన్, సంపూజయన్, న్నమన్। అక్షయమశ్నుతే శీఘ్రమన్న పానామృతం ఫలమ్' ప్రాణధారకయైన దేవి. ప్రకృతి స్వరూపిణియైన దేవి ఓషధివనరులు, శాకములు, అన్న స్వరూప హవిసులు దేవతలకు స్వాహా, పితరులకు స్వధారూపము, జీవులకు నన్న స్వరూపముగా భూమి నుండి వుత్పత్తి చేయును దైవదత్తమని భావించి వానిని జఠరాగ్నికి నివేదించి ప్రాణముల నిల్పుకొనుచుందురు. అట్టి ప్రాణధారణకై బహుళ పోషకాన్న కర్త్రి శాకంభరీదేవి

770) ఓం అనురాగిణ్యై నమః / ఓం అనుకంపిన్యై నమః

అనురాగముగల దేవి రూపము 'కరోతుసానః శుభహేతురీశ్వరీ' 'త్రైలోక్యస్యహితార్థాయ అవతరతి' 'యాదేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా' అను కంపన భావిని సదా 'కారుణ్య కందళిత కాంతిభరం కటాక్షం' 'దేహస్య శశ్వ దమృతాప్లుత శీతలస్య' 'కారుణ్య వారిధి భరంబ భవత్ కటాక్షైః, 'అభయకరాం విశ్వయోనిం' అట్టి మాతృస్వరూపిణియైన దేవి భక్తులయెడ ననురాగముయను కంపన కలదియగును

త్రికోణ నిలయా నిత్యా పరమామృత రంజితా
మహావిద్యేశ్వరీ శ్వేతా భేరుండా కులసుందరీ(109)

771) ఓం త్రికోణ నిలయాయై నమః (768 త్రికోణస్థా)

త్రికోణ పరిధిని నివసించు దేవి. త్రికోణ రూపిణీ శక్తి. 'బిందు రూప శివస్యతు ।అవినాభావ సంబంధ. తస్మాద్బిందుత్రికోణయో' పరమేశ్వరి త్రికోణరూపిణి బిందువు పరమేశ్వరుడు ఈ రెండును యవినాభావ సంబంధముగలవి మూల ప్రకృతి స్వరూపి, సత్వగుణ సంయోగమున నవ్యక్తగా, రజో గుణ సంబంధమున మహత్వగాను, తామసగుణ సంయోగమున నహంకారముగను మహా త్రికోణ కోణముల వ్యాప్తమైయుండును యోని చక్రవ్యాప్తి, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తి స్వరూపిణిగా వ్యాప్తమైన దేవి

772) ఓం నిత్యాయై నమః

నిత్య స్వరూపిణి. అవినాశి స్వరూపము, నిత్య, ఆదిమధ్యాంత రహిత, కాలత్రయ వ్యాప్త బాహ్య, పూజ్యరూపము. శుద్ధ పాడ్యమి నుండి అమావాస్య తిథులన్నియు నిత్యా దేవతాధిష్ఠితములై యున్నవి. 2) నిత్యాషోడశికా స్వరూపములు - నిత్యాకామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహావిద్యేశ్వరి, శివదూతి, త్వరితా, కుల సుందరీ, నిత్యానిలపతాకా, విజయా సర్వమంగళా, జ్వాలామాలిని, చిత్రా, త్రిపురసుందరీయని పేర్కొనబడినవి వీనిసాముదాయిక రూపము నిత్యా. 3) కల్పోప సంహృతిషు కల్పితతాండవస్య / దేవస్యఖండపరశోః పరభైరవస్య పాశాంకుశైక్షవశరాసనా పుష్పబాణా సా సాక్షిణీ విజయతే తవమూర్తిరేకా యని బ్రహ్మాది దేవతలు ప్రళయాభిభూతులు 'ఏకస్యయేవ జగతి స్థిర సిద్ధిరాస్తే' యను నిత్య కళ

773) ఓం పరమామృతాయై నమః

పరమామృతానందస్వరూపిణి సోమకళలు అమృతాది పూర్ణామృతాంత షోడశ స్వరూపిణులైన దేవతాగణములన్యాసము బిందుస్థానమున చేయబడును అట్టి అమృతరూపి సోమకళలచే నిత్యము దేవతల తుష్టికి యమృతస్రావియగుచు, తరగని, నిత్యప్రవాహియైన సాదాఖ్య పరమామృత కళా యుక్తయై యవే సోమకళల పృథ్విని పోషధులుత్పన్నముచేసి జీవుల ప్రాణాధారమునై నిత్యానందమున వెల్గు పరబ్రహ్మానంద స్వరూపిణియైన దేవి

774) ఓం రంజితాయై నమః

అట్టి పరిపూర్ణ యమృత కళలతో ప్రాణుల పరితోషపెట్టురంజితా రూపిణియునై యున్నది ఆమె యనుగ్రహముననందురు సుఖసంపత్తులచే వర్థిలుచు ప్రార్థించుచుందురు, రంజిత యన మనోజ్ఞయు బ్రహ్మానందము గల్గించునది 'ఓం పరమామృతా రంజితాయై నమః' ఏక పదరూపము

775) ఓం మహావిద్యేశ్వర్యై నమః

మహావిద్యలకు ప్రభ్వి. ఆత్మవిద్యయే మహావిద్య. ఆత్మయనబ్రహ్మం అట్టి మహత్ బ్రహ్మ విద్యా స్వరూపిణియైనది ఇట్టి మహావిద్యలు పదిగలవు కమల, బగళా, భువనేశ్వరీ భైరవి, ధూమావతీ, ఛిన్న మస్తా, తారా, మాతంగి, షోడశీ, కాళరాత్రి కాళీయనునవి 'యజ్ఞ విద్యా మహావిద్యా గుహ్య విద్యాచ శోభనే' యనునవి సప్తకోటి మహామంత్ర వ్యాప్తార్థకములు హంస యాత్రానుభవమే యాత్మవిద్య 'మహావిద్యా మహామాయా, మహా మేధా మహాస్మృతిః। మహామోహాచభవతీ మహాదేవి మహాసురీ' అటు మహావిద్యాధిష్ఠాత్రియీశ్వరియై యున్నది

776) ఓం శ్వేతాయై నమః

శ్వేత స్వరూపిణి 'శ్వేతరూపధరా దేవి, ఈశ్వరీ, వృషవాహనా' శ్వేతయనగ శివునియొక యవతారము, గవ్వ, శుక్రుడు, పర్వతనామము వెండి, తెల్లనిదియందురు విభూది (భస్మము) పులుముకొన్న కర్పూర ధవళాంగ శరీరియైన పరమేశునికి యిల్లాలుగా శ్వేతాయైనది 2)మంచుతో కప్పబడిన హిమవద్గిరిసుతయైన కారణమునను శ్వేతాయగును 3) స్వచ్ఛమైన మనసుగల వారి హృదయముల నెలకొనియుండుటచే శ్వేతాయను నామసార్థకమగునది

777) ఓం భేరుండాయై నమః

భేరుండ రూపిణియైన దేవి గండభేరుండ పక్షి దేవతా భేదం యక్షిణి. శ్రీయంత్రమున షోడశనిత్యలలో నాల్గవది కామేశ్వరి నిత్యా, భగమాలిని నిత్యక్లిన్నా, భేరుండా మొదలుగా పదునారవది త్రిపురసుందరి అందు క్రమముగా చంద్రకళల వృద్ధిగానా యా దేవతలు పూజింపబడుదురు

778) ఓం కులసుందర్యై నమః

కుల సుందరియైన దేవి శ్రీచక్ర స్థిత నిత్యాదేవతా షోడశి సముదాయమున తొమ్మిదవది కుల సుందరి కుల మన వస్తు, సమూహ, జాతి, వంశ, స్వభావమందు వర్తించునది పాతివ్రత్యాది సుగుణ సంపదగల వంశమున బుట్టినది ఇంద్రియ సమూహమున మాతృమేయముల మధ్యను మానరూపముగానున్న దేవి సహస్రారాంతస్థయైన శ్రీదేవి.

త్వరితా భక్తి సంయుక్తా భక్తి వశ్యా సనాతనీ
భక్తానందమయీ భక్తభావితా భక్తశంకరీ(110)

779) ఓం త్వరితాయై నమః

త్వరితారూపిణి, శ్రీచక్రస్థిత నిత్యాషోడశికాదేవతా క్రమమున పెనిమిదవ శక్తి స్వరూపముగానున్నది త్వరితయన శీఘ్రగుణము గల దేవతా విశేషము క్షిప్రప్రసాదిని, క్షిప్రగామిని లోకాంతర వ్యాప్తయైన శతాక్షి, సహస్రాక్షి, విశాలాక్షి, విశ్వనేత్రిగా శీఘ్ర చాలనము గల దేవి స్వరూపము

780) ఓం భక్తి సంయుక్తాయై నమః

భక్తి సంయుక్తయైన దేవి భక్తజనుల హృదయములలో నివసించుదేవి సర్వేశ్వర్యై భారమువేసి నిత్య ఉపాసనా, సద్ధర్మపరాయణులు దేవి భక్తిగలవారు, వారి హృదయములందు సదా నివాస ముండుటచే భక్తచిత్త భక్తిసంయుతయగును భక్తులయెడల ప్రీతిగలదేవి వారి హృదయము లందే రమించుచు పరబ్రహ్మ ఆనందానుభూతి గల్గించుచుండును

781) ఓం భక్తివశ్యాయై నమః

భక్తికి వశమగు దేవి రూపము సర్వ స్వతంత్రురాలయ్యును, భక్తజనులకు వశ్యయగుచుండును 'ద్రుతస్య భగవద్ధర్మాత్, ధారావాహిక తాన్ గతా సర్వేశమనో వృత్తి' భక్తి లక్షణమిది. 'ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ జ్ఞాని' యను నాల్గు విధములైన భక్తులకు వశపడునది వారి కోర్కెల దీర్చునది 'యాచ స్మృతాదేవి హంతినః పరమాపదో భక్తి వినమ్రమూర్తిభిః' 'ఆరాధితా వశీకుర్యాత్ పూజాకర్తుస్సురా చరమ్' యని భక్తి ప్రాధాన్యత తెలుపబడినది స్వాత్మదేవత భక్తికి వశ్యమగును మోక్షదాయినియగును

782) ఓం సనాతన్యై నమః

'త్వమాదిస్త్వమనాదిశ్చాత్వం ప్రభుః సర్వతోముఖః / త్వమాత్మాత్వం మహాదేవస్త్వం యజ్ఞస్త్వం సనాతనః / సనాతనిరూపిణి, చిరంతన, ఆనాది నిధనం దేవం అత్యయోనిం, సనాతనం అప్రతర్క్యమ విజ్ఞేయం అనాది పరంపరగానున్నట్టి మాతృస్వరూపిణి, మహాలక్ష్మి మహా సరస్వతీ, మహా మాయా స్వరూపిణియైన దుర్గ. ఆమెయే సృష్టిస్థితి, నాశ, తిరోధాన యనుగ్రహకర్త్రిగా వెలుగును. జగదాత్మశక్తి నిశ్శేష దేవగణ శక్తి సమూహమూర్తి, అఖిలదేవ మహర్షి పూజ్యాయైనట్టి పరమేశ్వరి. హరిహర బ్రహ్మాదులు నాదిశేషులను యామె ప్రభావమెరుంగలేని వారు అందరికంటె ముందున్న అద్యాగా మహాపద్మ వనాంతస్థ కారణానంద విగ్రహయైన మూలప్రకృతి ఏకా, ఈశ్వరి యామెయె

783) ఓం భక్తానందమయ్యై నమః

భక్తానందమయమూర్తి, 'ప్రణతానాం ప్రసీదత్వం దేవి విశ్వార్తి హారిణి/త్రైలోక్యవాసినామీడ్యే లోకానాం వరదాభవ' 'సర్వాబాధా ప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి' యని బాధల తొలగించి సుఖము గలిగించు రూపము ''త్వామాశ్రితానాం నవిపన్నరాణాం, త్వామాశ్రితాహ్యాశ్రయతాం ప్రయాతి'' సర్వమంగళ మాంగళ్యే శివే, సర్వార్థ సాధకే శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి' యని భక్తానుగ్రహకారిణియై వెలుగును.

784) ఓం భక్తభావితాయై నమః

భక్తులచే నుపాసింపబడునది భక్తిచేత పొందదగినది మోక్షమందు ప్రేమగలవాడు అంతరంగ బహిరంగ భక్తిగల్గిన యాత్మానాత్మ విచారపరునకు నిజరూపమున ప్రత్యక్షముగుచుండును 2) అహంయను భావము నశించి సర్వక్రియాఫలముల దేవ్యర్పణముజేసి భావించనగును అమెను భక్తితో నారాధించినచో జగత్తు వశ్యమగును అంత్యమున మోక్షప్రాప్తిగల్గును

785) ఓం భక్తశంకర్యై నమః

భక్తులకు శుభములు గల్గజేయునది 'కరోతుసానః శుభహేతురీశ్వరీ శుభాని భద్రాణ్యభిహంతు చాపదః' 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే' యనియు 'త్రైలోక్యస్యహితార్థాయ యసురసంహారిణి' 'యదాబాధా దానవోత్థా భవిష్యతి తదావతీర్యా హ్యహం కరిష్యామ్యరి సంక్షయం' యని యనేక రూపముల తన సృష్టియైయున్న సమస్త జంతు జాలము లకును శుభముల గల్గించుచు మాతృమూర్తియై పోషించునది 'సర్వభూతా యదాదేవీ, స్వర్గముక్తి ప్రదాయినీ, త్వంస్తుతాస్తుతయే కావా భవంతు పరమోక్తయః'

సర్వసౌందర్య నిలయా సర్వసౌభాగ్య శాలినీ
సర్వసంభోగ భవనా సర్వసౌఖ్యాను*రూపిణీ (111) ళ్ళ్యవి

786) ఓం సర్వసౌందర్య నిలయాయై నమః

సర్వ సౌందర్యములకు నిలయరూపిణియైన దేవి 'సౌమ్యా సౌమ్యతరాశేష సౌమ్యేభ్యస్త్వతి సుందరీ। పరాపరాణాం పరమాత్వమేవ పరమేశ్వరీ' 'భువనమోహిని ఈషత్ సహాస' దృష్టిని మధుకైటభ చండ ముండాసురులను మోహింపజేసి నాశనము చేసినది 'స్త్రీ రత్న మేషా కల్యాణీ త్వయా కస్మాన్నగృహ్యతే' యని దూత పల్కెను 'స్త్రీ రత్నమతి చార్వంగీ ద్యోతయంతీ దిశస్త్విషా' యని, 'జ్యోత్స్నాయై చేందురూపిణ్యై సుఖాయై సతతం నమః' యని మోహమును సుఖమునుగల్గించు సౌందర్య రూపము.

787) ఓం సర్వసౌభాగ్య శాలిన్యై నమః

సర్వ సౌభాగ్యములనిడుదేవి, 'యాశ్రీః స్వయం సుకృతినాంభవనేష్వలక్ష్మీః పాపాత్మనాంకృతధియాం హృదయేషుబుద్ధిః', 'కల్యాణ్యై ప్రణతాంవృద్ధై సిద్ధ్యై నమో నమః' నమస్కరించిన సమస్త కళ్యాణములనొసగును 'బ్రాహ్మీచ వైష్ణవీ రౌద్రీ, కౌమారీ, కాళికా, శివా' 'సిద్ధిదా, బుద్ధిదా, శాంతా, సర్వమంగళదాయినీ' 'ఆరాధితాస్తుతాసైవ సర్వ సిద్ధిప్రదాయినీ' యని జగత్త్రయమును వశ్యము చేయు మాతృరూపిణి 'ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యోధనం వసుః ధనమింద్రో బృహస్పతి ర్వరుణం ధనమశ్నుతే' అట్టి సకల సౌభాగ్యముల భక్తులకు చేకూర్చు మూర్తియై యున్నది

788) ఓం సర్వ సంభోగ భవనాయై నమః

సర్వసుఖకర భవనరూపిణియైనది సంభోగమువలన శరీర సుఖముల కల్గించు సాధనములు, అవి గల్గిన 'ఆవాస' స్థానరూపిణి 'పుత్ర పౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాదిగోరథం' మున్నగునవి 'స్త్రియ స్సమస్తా తవః భేదా' యని మాతృ, భగినీ, భార్యా, సుతాస్నుషా, దాసిగణాది రూపముల సుఖసంతోషముల గల్గించు రూపము 'లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీం, దాసీ భూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం, శుద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ జయలక్ష్మీ సరస్వతీ। శ్రీలక్ష్మీర్వర లక్ష్మీశ్చ ప్రసన్నాభవ సర్వదా' ఇట్లు సుఖ భోగముల భక్తానందదాయిని యగు దేవి రూపము

789) ఓం సర్వసౌఖ్యాను రూపిణ్యై నమః

సర్వ సుఖముల రూపమునైయున్నదేవి ఐహికాముష్మికాది సకల సుఖములను కైవల్యమును నందించునది 1) విషయ సుఖము పంచేంద్రియ సుఖానుభవము మంచి దృశ్యముల చూచుట, మంచి మాటల వినుచుండుట, పరిమళ ద్రవ్యాది సేవనము షడ్రసోపేత భోజనము, స్త్రీ పుత్రీపరిచారకాది యనుకూలత వైరిజనవిస్తేజము ప్రభుత మొదలగునవి 2) ఆముష్మిక

సుఖములు సద్ధర్మాచరణము, ఇష్టదేవతా పుపాసనము, అరిషడ్వర్గ నాశనము, దాన ధర్మాది క్రియల లక్ష్యమయెడు పుణ్యార్జనాయుతమైనది వేద పురాణాది పఠనము, జ్ఞానసముపార్జన చేసి దాని పరబ్రహ్మస్వరూపమెరిగి దానియందు లయమై యంతమున మోక్షప్రాప్తినందుట ఈ రెండు విధముల సుఖమును ప్రసాదించుదేవి పరమేశ్వర రూపిణియైనది

కుమారీ పూజనరతా కుమారీ వ్రతచారిణీ
కుమారీ భక్తి సుఖినీ కుమారీరూప ధారిణీ (112)

700) ఓం కుమారీ పూజనరతాయై నమః

కుమారీ పూజన మందాసక్తిగలదు కుమారీయనయొక విద్యాభేదము ద్వాదశ వర్షీయకన్య అవివాహిత కన్య పుత్రిక, పార్వతి, జంబూద్వీపాంశ భేదములు యర్థములీయబడినవి 'స్త్రియస్సమస్తాస్తవ దేవి భేదాః' యని జన్మించినప్పటి నుండి, దశలుగా రెండేండ్ల నుండి, పుపాసనలో కుమారీ పూజనయంగముగానున్నది బాల, కౌమార, యౌవన (తరుణి) వృద్ధాయనుభేదముల వెలుగును కుమారీ పూజ, సువాసినీ పూజ అంగములు, నవయౌవనములోనికి యడుగిడుచుండు వయసు వరకు కుమారి, ప్రవృద్ధ శరీరిగా విస్పష్టమువుచుండును అట్టి కౌమార దశయున్న స్త్రీరూపము పూజార్హమై క్రమము దప్పక సేవించుట యను క్రియ శ్రీదేవికి ప్రీతికరము ఆ కుమారి రూపముగా పరమేశ్వరి యంబ పూజనందుచు 'కన్యాకుమారి'గా ప్రసిద్ధిచెందినది.

701) ఓం కుమారీ వ్రతచారిణ్యై నమః

కుమారీ వ్రతము పాటించునది, వివాహముగువరకు కన్య, కన్యగానున్నపుడు పరమేశ్వరీ పూజయందు మాత్రమే మనసు లగ్నమై సకల గృహకార్యముల, విజ్ఞానమున ప్రతిభపొందనగును బ్రహ్మచర్య వ్రతమువలె కుమారీ వ్రతముగూడ, సుదయమునసే లేచి గృహాంగణముల పరిశుద్ధి, స్నానానంతరము పూజాసుమముల సేకరణ, పూజ, పెద్దల గౌరవించుట, సేవ చేయుట మొదలగునవి విహితకార్యములు దేవ సందర్శనము భక్తి, గౌరీపూజా విధాన గ్రహణము వంటి సదాచార గుణములననుసరించుచు నందరికి యానందము గల్గించుచుండవలెను

702) ఓం కుమారీ భక్తి సుఖిన్యై నమః

కుమారీ రూపము ధరించిన దేవి, 'స్త్రియస్సమస్తాస్తవదేవి భేదా' యని కుమారి భక్తి విఖ్యాముగలదేవి బాలరూపమున పరిపూర్ణతనంద కుమారి శరీరసుఖభోగ కర్తవ్య జ్ఞానముగలది. ఆ వయసునందున్నట్లు దేవ రూపము గ్రహించి నిర్గుణ నిరాకార, నిత్య శుద్ధ బుద్ధ, నిర్వికారమనముల నా పరాశక్తితో సంలీనమవుటయే కుమారీ భక్తి అట్టి కుమారి భక్తితో సాధకుడు పంలీనమై, నిష్కళంక పరంజ్యోతినియందు తన భావనలన్నియు సంలీనముచేసి సుఖుడై వెలుగుట కుమారీ భక్తియన తన కుమార్తెనట్టి నిర్వికార ప్రేమభావమున హత్తుకొని మురియుచుండునో, యట్టి భక్తిపారవశ్యమున యనంభిన్నదేవీమూర్తియందు సాధకుడు వాత్సల్య భక్తిగలవాడై సుఖించుచుండవలెను

703) ఓం కుమారీ రూపధారిణ్యై నమః

కుమారీ రూపము ధరించిన దేవి, అన్ని యవస్థలయందును స్త్రీలు పూజనీయులే ఉపాసనలలో రెండేళ్లు పైబడిన కన్యలనే గ్రహింతురు ఏలయన సుగంధాస్వాదన వస్త్రాలంకారణాదుల పరిజ్ఞానము గలిగి వారికి చేయు నుపచారముల ఫలితము గ్రహింపగలిగి సంతసించవలెను అట్టి సుఖ సంతోషానుభవము గల్గు కుమారీ రూపధారిణియైన దేవి సగుణరూపిణిగానెంచి పూజించుట యనుక్రియ

కుమారీ పూజక ప్రీతా కుమారీ ప్రీతిదప్రియా
కుమారీ సేవకాసంగా కుమారీ సేవకాలయా(113)

704) ఓం కుమారీ పూజక ప్రీతాయై నమః

కుమారీ పూజలయెడ ప్రీతిగలదేవి దేవీ ఉపాసకులు నిర్మలమనముల, కుమారీ రూపధారిణియైన సగుణదేవీ రూపమున సమస్తోపచారములచే పూజించగా, నా దేవీ స్వరూపయాహ్వానమున, నా దేవియే బాలరూపమున ప్రీతిచెంది, యట్టి సాధకులకు వాంఛితార్థము లిచ్చుచుండును పుత్రుడు యా వంశమందలి పది తరములనే తరింపజేయుగా సత్కన్య పుట్టినింటి వారియనేక తరముల తారణకు దోహద మగును అట్టి కన్యాదానమున 'కన్యాం కనక సంపన్నాం కనకాభరణైర్యుతాం దాస్యామి' 'బ్రహ్మలోక జిగీషయాయని తన వంశమువారు ముక్తిపొందునట్లు కన్యాదాత సంకల్పం మెట్టినింటివారి వంశవృద్ధికిని దోహదకారి అట్టి కుమారీ రూపమును పూజించిన యెడల దేవి యతి ప్రసన్నురా లగును

705) ఓం కుమారీ ప్రీతిద ప్రియాయై నమః

కుమారికి ప్రీతిగల్గించువారియెడ ప్రియభావముగలది కుమారీ మనసున కాహ్లాదము కలిగించునవి యలంకరణ వస్తువులు, పసుపు, బొట్టు, కాటుక పరిమళ ద్రవ్యములు, గాజులు, కంఠాభరణములు, చెవి, ముక్కు, నడుముకు ధరించు బంగారు నగలు, కాలికి గజ్జెలు మున్నగునవి అట్టి ప్రీతికరమైన వస్తువులను పెద్దలు బహుమతులుగా నిచ్చుచుందురు అట్టి ప్రీతికరమైన వస్తువులతో నానందము నొందు కన్యలు, దేవీ స్వరూపముగా భావించదేవియు వరదురాలగును వారి ముఖమున చిలుకు ఆనందమున దేవీ స్వరూపము చూడనగును

706) ఓం కుమారీ సేవకాసంగాయై నమః

కుమారీ సేవక గణ స్నేహము నందుండు దేవి కుమారి తన వయసు గలవారితో నాటపాటల కళాప్రదర్శనముల నెంతో యుత్సాహముగా కాలము గడుపుట గాంచగా, నా బాలికల కేరింతల నొందనగు తన్మయత్వము చూచువారలకును, మత్సాహము, దైవత్వము కానుపించును అట్టి కుమారీగణ సాన్నిహిత్యమును భావనచెంది, పరబ్రహ్మ పూర్ణమనమున సుఖకర కాలము ననుభవించుటయే జీవితగావలసినది సత్, చిత్, ఆనందమూర్తులై యనంత కాల ప్రవాహమున దేవి ప్రతీకలైన కుమారీ గణమైత్రియానందకరము

707) ఓం కుమారీ సేవకాలయాయై నమః

కుమారీ సేవన ఆలయస్థానమైన దేవి ఆలయము పవిత్ర స్థలము అచట దైవీభావనలు దప్ప చొరకూడని ప్రదేశము అట్టి దేవాలయముల, దేవికి ప్రతిరూపములైన కుమారీగణము పూజలందునగును 'యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతా' అట్టి పవిత్ర స్థానముల కుమారీ గణములను దేవి ప్రతీకగాచెంది షోడశోపచారములచే, వస్త్రాలంకరణాది, సుగంధ ద్రవ్య సముదాయమునిడి కొలుచువారలయెడ దేవి ప్రసన్నురాలగును అట్టివారికి సకల సౌభాగ్యముల నందీయును. ఈ యెనిమిది నామములు కుమారీ ప్రాశస్త్య వివరణ పదములు

ఆనందభైరవీ బాలా భైరవీ వటుభైరవీ

శ్మశాన భైరవీ కాలభైరవీ పురభైరవీ (114)

708) ఓం ఆనంద భైరవ్యై నమః

ఆనంద భైరవీ రూపిణియైనది. భైరవియన చాముండేశ్వరి, మహావిద్యామూర్తి భేదము శివగణాధిపతి, రుద్రుడు, భేతాళుని సోదరుడు యని గలదు శివాంశ సంభూతులైన భైరవులు ఆలయములలో నష్టదిక్కుల శాసకగణములుగా పూజింపబడుదురు 2) ప్రపంచ సంహార కాలము నందీశ్వరుడు, భైరవరూపమును ధరించి సంహారము చేయును భైరవుని శక్తి భైరవియని పిల్వబడును భైరవియే భవాని ఆనందతాండవమూర్తి 3) సూర్యమండలము మధ్యమున ననాహత స్థితద్వాదశ దళకమలనాభ స్థానమున మార్తాండ రూపమున ధ్యానించబడుచున్నది గాన పరమేశ్వరి భైరవియనబడుచున్నది.

ఆనందస్థితి యందుండు భైరవుని శక్తి యానంద భైరవి 4) ఆవరణ దేవతలైన భైరవులు – అసితాంగ భైరవః బ్రాహ్మీదేవి, రురుభైరవః మహేశ్వరీదేవి, చండభైరవః కామేశ్వరీదేవి క్రోధ భైరవః వైష్ణవీదేవి, ఉన్మత్త భైరవః వారాహీదేవి కపాల భైరవః మహేంద్రీదేవి భీషణ భైరవః చాముండీ దేవి సంహార భైరవః మహాలక్ష్మీదేవి రూపములనెంది ప్రాచ్యాది దిక్పూజ జరుగును ఆనందభైరవి దేవియంశలే 5) పండ్రెండు సంవత్సరముల బాలిక భైరవి ఆనందభైరవి పరాశక్తి రూపము మరియు నొక రాగిణీ భేదమునై యున్నది భైరవి పదయుక్త నామములు పదునాల్గు గలవు భైరవ్యాంశలే

799) ఓం బాల భైరవ్యై నమః

బాల భైరవీ రూపిణి భైరవి యన ఆది శక్తి పూజా పరాయణులైన స్త్రీలనందరను భైరవి రూపములుగా గ్రహింతురు పరమేశ్వరుడు భైరవరూపుడు వయోభేదములను బట్టి బాలరూపమునున్న భైరవి బాలికయైన రూపము పూజనీయురాలు

800) ఓం వటుభైరవ్యై నమః

వటురూపిణియైన భైరవి వటువు, బ్రహ్మచర్యము పాటించు బ్రహ్మచారిణీ రూపిణియైన దేవి దానినే కుమారీ వ్రతము యనననగును ప్రథమం శైలపుత్రీచ, ద్వితీయం బ్రహ్మచారిణీయని, బ్రహ్మణి శక్తికి ప్రతీక హంసయుక్త విమానాగ్రేసాక్ష సూత్రకమండలు రూపిణి

ఇతి ఆదిశంకర కృత కాళీసహస్రనామస్తోత్ర అష్టశత నామావళ్యార్థ సంపూర్ణః

801) ఓం శ్మశాన భైరవ్యై నమః

శ్మశాన భైరవీ రూపము శ్మశానమున మొదటినామమున వివరింపబడినది దేవికి శ్మశాన కాళికాయై నమః యని శ్మశాన భైరవీ రూపముననే అభివర్ణింపబడినది అరిషడ్వర్గాదుల భస్మముచేసి నిత్య శుద్ధ పరమాత్మ తత్త్వము గ్రహించ నైహిక సుఖాదులు, 'అహం' అను భావనయు భస్మము చేసినపుడే జీవికి ముక్తికల్గును అచట భైరవుని యిల్లాలుగా భైరవి సహచర శక్తి కాళీయంశ విషయద్ధ్యానముల కొలిచిన వారికి జ్ఞానము ముక్తియు కల్గచుండును అట్టి శ్మశాన భైరవీ రూపము వుపాసనీయము

802) ఓం కాలభైరవ్యై నమః

కాలభైరవీ రూపిణి "కాశికా పురాధినాథ కాలభైరవం భజే' ఆయన శక్తియే కాలభైరవి. కాలభైరవుని నివాస స్థానము శ్మశానవాటిక సహచరిగా కాళీరూపిణి కాలరూపమైన ఈశ్వరాంశ సంభవుడు కాలభైరవుడు శక్తి కాలభైరవీ రూపిణి

803) ఓం పురభైరవ్యై నమః

పుర భైరవీ రూపమైనది త్రిపురముల కలయికయైన దేవికి రక్షకియైన భైరవీ స్వరూపము దేహత్రయములు స్థూల సూక్ష్మ కారణ శరీరములు 2) ఇచ్ఛాజ్ఞాన క్రియా శాంతా శక్తుల నిలయము ప్రకాశాంశ వామాజ్యేష్ఠా రౌద్రీ యంబికాపశ్యంతీ పంచశక్తుల విమర్శాంశ స్వరూపము ఈ తొమ్మిది శక్తులు త్రిపురా సంజ్ఞ గలవారు ఇట్టి నవ చక్రాధీశ్వరియైన త్రిపుర సుందరియే త్రిపుర రక్షక భైరవి

804) ఓం మహా భైరవ పత్న్యై నమః

మహా భైరవుని పత్ని స్వరూపిణి, మహావిద్యా, మహా మాయా, మహా మేధా మహాస్మృతిః మహామోహాచ భవతీ మహాదేవి మహాసురీయనబడు దేవి మహాకాలరూపుడైన మహా భైరవుని యిల్లాలుగా వ్యవహరింపబడునది మహాభైరవి శక్తి యనబడు దేవి మహాప్రళయవేళల భైరవుని తోడుగా నర్తించు దేవియై యున్నది.

మహాభైరవ పత్నీ చ పరమానంద భైరవీ
సురానంద భైరవీ చ ఉన్మాదానంద భైరవీ (115)

805) ఓం పరమానంద భైరవ్యై నమః

పరమానంద భైరవి రూపిణి, సత్, చిత్, ఆనంద రూపిణి పరబ్రహ్మ స్వరూపిణియు, పరమానంద

రూపిణియైన భైరవీరూపము. ఆనందమే బ్రహ్మస్వరూపము ఆ బ్రహ్మ స్వరూపము మది బద్ధముచేసి సంతతానందమున నోలలాడువాడు మోక్షసామ్రాజ్య ప్రాప్తినందును అట్టి పరమ ఆనంద రూపి భైరవుని శక్తి భైరవి

806) ఓం సురానంద భైరవ్యై నమః

సురానంద స్వరూపిణియైన భైరవి సురయన యమృతము అమృతానందము అంట విలాసము. అమృతాంభోధి నిలయము – లౌకికార్థమున చెల్వడు మధురసముగాదు ఆ సురయానంద దాయకము బ్రహ్మస్వరూపమున జీవపరమాత్మల సంగమానందము అట్టి యమృతానంద స్వరూపిణి సురానంద భైరవియనవగును అట్టి పరబ్రహ్మ స్వరూపము మదియందు నిక్షిప్తము చేసిన మోక్ష కారకము

807) ఓం ఉన్మత్తానంద భైరవ్యై నమః / ఓం ఉన్మాదానంద భైరవ్యై నమః

ఉన్మత్తానందమున వెలుగు భైరవీ స్వరూపము విశుద్ధ చక్రస్థ ఉన్మత్త భైరవుని శక్తి వారాహి స్వరూపిణియైన ఉన్మత్తానందభైరవి అతిమత్తత గల స్థితి దయ్యము పట్టినవాని వలె భౌతిక పరిసరముల గమనించక, తనలో తాను లీనుడై యానందము పొందు రూపము తత్ శక్తియున్మత్త భైరవి

యజ్ఞానంద భైరవీ చ తథా తరుణ భైరవీ
జ్ఞానానంద భైరవీ చ అమృతానంద భైరవి (116)

808) ఓం ముక్తానంద భైరవ్యై నమః / ఓం యజ్ఞానంద భైరవ్యై నమః

ముక్తిప్రసాధక కారణమునవు భైరవీ స్వరూపము జీవుడు దేహాభిమానము వదలి ముక్తిపొంది పరబ్రహ్మలో లీనమై యానంద స్థితియందుండుట అట్టి కారణ స్వరూపిణి ముక్తానంద భైరవి. జీవి దేహాభిమానము వదలి పరబ్రహ్మయందు లీనమై యానంద సంయుతుడైన స్థితి రూపిణి. అదియే బ్రహ్మయజ్ఞమునగును.

809) ఓం తరుణ భైరవ్యై నమః

తరుణ భైరవీ రూపము తరుణి యన యౌవనము గలది ఎల ప్రాయము గల యువతి పరిపూర్ణాంగ లావణ్యము గలిగిన యౌవనశక్తి సమయుతమునై వెలుగునది పరిపూర్ణ జ్ఞానము బలము సమర్థత గల తరుణ భైరవీ రూపిణియైనది

810) ఓం జ్ఞానానంద భైరవ్యై నమః

జ్ఞానానంద భైరవీ రూపము, జ్ఞానము భక్తి యను రెండు మార్గములు కైవల్యమునకు సోపానములు భక్తి జ్ఞాన వైరాగ్య సాధకములచే జీవి దేహ విముక్తుడగును సమాధియను వైశ్యవర్యునికి జ్ఞానము గోరగా, నఖండ జ్ఞానము దేవి ప్రసాదించినది దాన యానందమునందు జీవి జ్ఞానానందభైరవి ప్రసాతి ' ' జ్ఞానమస్తి సమస్తస్య జంతోర్విషయగోచరే జ్ఞానినో మనుజాః సత్యం జ్ఞానినః సర్వే పశుపక్షి మృగాదయ 'మహామాయాహరత్యైషా, తయాసంమోహ్యతే జగత్' ఆ సామాన్య జ్ఞానముగాక దైవ సంబంధ జ్ఞానము సాధన చేతగాని నొనగూడదు

811) ఓం అమృతానంద భైరవ్యై నమః

అమృతానంద భైరవి రూపిణి. మృతముగానిది యమృతము శాశ్వతము ఇచట శాశ్వత రూపమైన యానందము జీవ బ్రహ్మైక్యమునందు సమాధిస్థితియందు నిర్మలానంద చిత్తుడై మోక్షస్థితినందును శాశ్వతా నంద సిద్ధికై యోగులు నిత్య తపమాచరించు చుందురు అమృతాది షోడశ యోగినీ పరివృతమైన భైరవి యానందామృత రూపిణియై వెలుగును

మహాభయంకరీ తీవ్రా తీవ్రవేగా తరస్వినీ* తపస్వినీ
త్రిపురా పరమేశానీ సుందరీ పురసుందరీ (117)

812) ఓం మహాభయంకర్యై నమః

మహాభయంకరీ రూపిణి. రౌద్రస్వరూపిణి, భయంకర రూపిణి 'కాళీ కరాళ వదనా వినిష్క్రాంతాఽసి పాశినీ, విచిత్ర ఖట్వాంగధరా నరమాలా విభూషణా' యని భావము 'కోపేన చాస్య వదనం మషీవర్ణ మభూత్తదా। భృకుటీకుటిలాత్తస్య' యను మహాభయంకరీ రూపిణి

813) ఓం తీవ్రాయై నమః

తీవ్ర స్వరూపిణి అతిశయము అధిక్యము తీక్ష్ణత గలిగిన స్వరూపము 'క్షిప్యతే కుపితాంతక దర్శనేన' 'అత్యద్భుతం ప్రహృతమాత్తరుషా, తథాపి వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ। ప్రాణాన్ముమోచ." యన 'హుంకారేణైవ తం భస్మ చకార' యను రూపములు నిదర్శనము

814) ఓం తీవ్రవేగాయై నమః

తీవ్ర వేగము గల రూపము 'ఏవముక్త్వా సముత్పత్య సాఽరూఢా తం మహాసురం' 'పాదేనాక్రమ్య కంఠేచ శూలేనైనమతాడయత్' యని తీవ్ర శూలఖడ్గ చాలనము గలదేవి 'తథాపి సోఽభ్యధావత్తాం ముష్టిముద్యమ్య వేగవాన్' 'సముష్టిం పాతయామాస హృదయే దైత్య పుంగవః' - దేవీమాహాత్మ్యము -తృతీయాధ్యాయం పష్ఠమాధ్యాయం సప్తశతీ గ్రంథములో నిట్టి యుద్ధవర్ణనలు విశదముగా గలవు. ఆమె వీరావేశమున యసురులను చంపిన రూపము తీవ్ర వేగ చాలనముగల దేవిగా యభివర్ణింపబడినది

815) ఓం తరస్విన్యై నమః

తరస్విని రూపిణి, తరింపజేయునది సంసార సాగరమును దాటుటకు నావరూపము ఆవశ్యకముగును. ఆ నావలో సుఖముగా నీటిపై పయనించి తరించవచ్చును ఇట్టి భవబంధ సంద్రమును దాటించుటకు దేవిని శరణుపొందుటయేగదా అట్టి దేవి శరణము అగాధ సంద్రమున తెప్పకొయ్య, నావ వంటిదిగాన తరస్విని

816) ఓం త్రిపురాయై నమః

త్రిపుర రూపిణియైన దేవి త్రిమూర్త్యాది సకల త్రితయములకు, పురాయన పూర్వమేయున్నది గాన త్రిపురాయందురు బ్రహ్మ విష్ణు రుద్రులును, ఆహవనీయ, గార్హపత్య దక్షిణాగ్నులను రూపములకు, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులును, వామరౌద్రి జ్యేష్ఠ రూపములును ఉదాత్తాఽనుదాత్త స్వరిత రూపములను, భూః భువః సువః రూపములను, స్వర్గమర్త్య పాతాళములను, త్రిపథ, 'అ' 'ఉ' 'మ' త్రితత్త్వముల రూపమును, సత్వ, గుణ, రజో, తామస గుణాది త్రయమును, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యాది వర్ణత్రయమును (2) సర్వత్రయం, త్రయాయస్మాత్ తస్మాత్ త్రిపురామతే' అట్లే శరీరాభిమానమగు యాత్మతత్త్వము, సూక్ష్మశరీరాభిమానియగు విద్యాతత్త్వం కారణ శరీరాభిమానియగు శివతత్త్వము, మూడు విధములైన నియతిచే త్రిపురాయనగును

817) ఓం పరమేశాన్యై నమః

క్షరత్వం విద్యామృతం విద్యేతి పరికీర్త్యతే, తే ఉభే ఈశతేయస్తుసోఽన్య యస్యాంత స్థాని భూతాని యస్మాత్సర్వం ప్రవర్తతే యమాహుస్తత్పరం తత్వం స దేవః పరమేశ్వరః పరమేశాని రూపిగనుత్కృష్ట బ్రహ్మాది నియంత 'సౌమ్యా సౌమ్యతరాశేష సౌమ్యే భ్యస్త్వతి సుందరీ। పరాపరాణాంపర మా త్వమేవ పరమేశ్వరీ' యని 'యచ్చకించిత్ క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మికే తస్యసర్వస్య యాశక్తి సాత్వం' యని యుత్తమోత్తమ స్థితి పరమాం ప్రకృతి, పరా, అపరా, పరమా క్రమము ఆమె యనంత ప్రభావం గలది 'భగవాన్'' అనంతో బ్రహ్మ హరశ్చనహివక్తుమలం బలంచ' అట్టి అవ్యక్త అజ్ఞాత, 'త్రిజగదాధార భూతయైన, యజన్మి సచ్చిదానందరూప చైతన్య యనంత స్వభావ పరమేశాని'' స ఆత్మా సర్వ భూతానాం। స బాహ్యాభ్యంతర పరః॥ సోఽహం సర్వగతః శాంతో జ్ఞానాత్మా పరమేశ్వరః'' అట్లే శక్తి వివరణ

818) ఓం సుందర్యై నమః

సుందరీ మహాత్రిపుర సుందరియే 'రూపైరనేకై బహుధాత్మమూర్తిం కృత్వాంబికే త్వత్ప్రకరోతి, కాన్యా'ని అన్నిరూపములామెయే 'ఓం అరుణాం కరుణాతరంగి తాక్షీం ధృతపాశాంకుశ బాణచాపహస్తామ్। అణిమాదిభిరావృతాం మయూఖై రహమిత్యేవ విభావయేద్ భవానీమ్' 'స్త్రీ రత్న మేషా కల్యాణీ', 'జ్యోత్స్నాయై చేందు రూపిణ్యై సుఖాయై సతతం నమః' 'మోహయామాస అసురౌ మధుకైటభౌ యనియు ఈషత్ సహాసముఖం', చండముండాసురల మతుల భ్రమింపచేసినదీ శక్తియే

819) ఓం పురసుందర్యై నమః

పురసుందరీ రూపిణి పురములన జనావాసములు అందు నివసించు దేవి స్వరూపిణి పురసుందరి. 'సర్వారాధ్య' అటులనే దేహమందుగల త్రిపురముల నెలకొన్న పుపాసనారూపము త్రిలోకవ్యాప్త, సర్వ స్త్రీమూర్తి స్వరూపమను - అట్టి జగన్మోహిని యతిలోక సుందరి స్వరూపిణియైన పరమేశ్వరి భ్రూవిక్షేపమున శాసించుచుండును.

త్రిపురేశీ పంచదశీ పంచమీ పురవాసినీ
మహాసప్తదశీ చైవ షోడశీ త్రిపురేశ్వరీ (118)

820) ఓం త్రిపురేశ్యై నమః

త్రిపురేశీ రూపిణి. శ్రీచక్రమున సర్వానందమయ చక్రాధీశ్వరియైన దేవి స్థూల సూక్ష్మ కారణ దేహము లకు ఈశాని ముఖ్య ప్రాణస్వరూపిణి బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంధులుగా విభాగములు గలవు వానికి అధీశ్వరియైన దేవి త్రిపురములకు ఈశాని త్రిపురేశి త్రిపురాది పద వివరము (816) పైన గలదు

821) ఓం పంచదశ్యై నమః

పంచదశీ రూపిణియైన దేవి పూర్ణ తిధులైన పూర్ణిమకు, అమావాస్యకును గల పదము మహావిద్యా భేదములలో పంచదశీ విద్యయని గలదు 'కఏ ఈలహ్రీం, హసకహల హ్రీం, సకల హ్రీం' అను (15) పదునైదు అక్షరముల త్రికూటమిని పంచదశీ విద్యగా నుదహరింతురు పంచదశీ తిధులయందు చేయు యజ్ఞయాగాదికములు, దానములు దేవపితృకార్యములు విశేష ఫలప్రదములు పూర్ణ ఫలితమునిచ్చునవి అట్టివాని వల్ల దేవియు ప్రీతిచెందును

822) ఓం పంచమ్యై నమః

పంచక్లేశాని అవిద్యా అస్మితా (అహంకారం) రాగ, ద్వేష, మరణ భయం వానిని నివారించునది పంచమీ స్వరూపిణి - 'వందే, దేవీం సకల వరదాం పంచమాం, మాతృకామధ్యే'య, బ్రహ్మాది యష్టమాతృకా షట్కములో నైదవది. వారాహీదేవి తత్స్వరూపిణి. పంచ భూతము లందైదవది యైన యాకాశ స్వరూపిణి పంచబ్రహ్మలయందైదవ పరమశక్తి సదాశివశక్తి పంచకోశములందైదవదైన యానందమయకోశ స్వరూపిణి. సామీప్య సాలోక్య, సారూప్య, సాయుజ్య క్రమమైన నైదవ కైవల్య శక్తి దేవి తురీయాతీత స్థితియందుండుటచే పంచమి యనబడుచున్నదిగా వర్ణమాలలో పంచమ జాతియైన జనులచే చేయబడు నిత్య క్రియాది దోహదకర శక్తి స్వరూపమునైనది

823) ఓం పురవాసిన్యై నమః

పురవాసినియైన దేవి. పురముల యందు నివసించు శక్తిరూపిణి. జనావాసములందు యర్చింపబడు దేవతాశక్తి స్వరూపిణి గ్రామరక్షి, కులదేవత, గ్రామదేవతాది వివిధ రూపములనర్చించబడు శక్తి త్రిపురముల యందును వసించు శక్తియైయున్నది త్రిపురములనగా సకల త్రిత్వములని గ్రహించనగును త్రైలోక్యస్య హితార్థాయ పంభవతి పరిత్రాణ పరాయణి

824) ఓం మహా సప్త దశ్యై నమః

మహాసప్తదశీ రూపము శ్రీ విద్యాభేదములలో పదునేడు యక్షరములు గల మంత్ర సంపుటి స్వరూపము గలదు. ఆ సప్తదశీమంత్రోపాసకులకు నుపాసనా రూపిణియైన దేవి పైనుదహరించిన పంచదశీ సంపుట మంత్రమునకు ముందు ఓం హ్రీంయను బీజాక్షరములు పూరించిన సప్తదశీరూపమగును అట్టి సప్తదశాక్షరీ మంత్రాధి ష్ఠాతృదేవతగా మహాసప్తదశీ యుదాహృతము

825) ఓం షోడశ్యై నమః

షోడశీ స్వరూపిణి మహాత్రిపుర సుందరీ విద్యా విధానం సోమయజ్ఞం, పదకొండవ రోజు పితృశ్రాద్ధ విధానము పదునారు వర్ణములుగల శ్రీయుక్త రాజరాజేశ్వరీమంత్ర విశేషము షోడశీ విద్య, షోడశీ కళయగు మహానిత్యా కళాస్వరూపము వృద్ధి క్షయములు లేనిది. పదునారవ యక్షరం శ్రీగా గ్రహించిన పంచదశీ షోడశాక్షరియగుచున్నది. శ్రీదేవికిని షోడశాక్షరికిని భేదము లేదు. పంచదశీ కూటత్రయము మూడు బీజములుగాను, ఇతరములు పదమూడు బీజములుగాను పదునారగునని భావన పదునారు రోజులు సాగు సోమయజ్ఞ స్వరూపము దేవియే పితృకర్మల సాముదాయక సంవత్సర స్వరూప నివేదనయను షోడశీ స్వరూపమునై యున్నది

826) ఓం త్రిపురేశ్వర్యై నమః

త్రిపురేశ్వరి స్వరూపిణియై (820) పదము యొక్క పునరుద్ఘాటనయే త్రిపురా వాచ్య సమస్తమునకు ఈశ్వరియైనందున త్రిపురేశ్వరి, ఈశి, ఈశ్వరి, మహేశి, సమానార్థకములే త్రిపురములకు యధిష్ఠాత్రియైన రూపముగ త్రిపురేశ్వరీ స్వరూపిణి, ఖడ్గమాలాస్తోత్రమున త్రిపురే, త్రిపురేశి, త్రిపుర సుందరి, త్రిపుర వాసిని, త్రిపురాశ్రీ, త్రిపుర మాలిని, త్రిపురా సిద్ధే, త్రిపురాంబా మహాత్రిపుర సుందరీయని నవ చక్రాధిష్ఠాత్రులను పేర్కొందురు

మహాంకుశ స్వరూపా చ మహాచక్రేశ్వరీ తథా
నవచక్రేశ్వరీ చక్రేశ్వరీ త్రిపురమాలినీ(119)

827) ఓం మహాంకుశ స్వరూపాయై నమః

మహాంకుశ స్వరూపిణియైన దేవి అంకుశము ఆయుధ విశేషము, దానిని మావటీడు మదమత్త వారణము నడుపుటయును మానవులలో నెలకొన్న జంతు స్వభావముగల మనను కంటికి కానుపించనిది దండించుటకు దొరకనిది దానిని దారిలోనికి తెచ్చుటకు మహాంకుశము యవసరమైయున్నది అట్టి మదమత్త చిత్తమును దారిలో పెట్టుటకు దేవి యనుగ్రహ మాహాత్మ్యము కాన మహాంకుశ స్వరూపగా పేర్కొనబడినది. 'సకుంకుమ విలేపనా మలిక చుంబి కస్తూరికాం। సమంద హసితే క్షణాం, సశరచాప పాశాంకుశాం అశేష జనమోహిని మరుణమాల్య భూషాంబరాం' యని యుంట స్మరణగలదు

828) ఓం మహాచక్రేశ్వర్యై నమః

మహాచక్రేశ్వరీ స్వరూపిణి చక్రరాజము వివరణ - పది యోజనములు ఎత్తు, నాలుగు యోజనముల నిడివి, తొమ్మిది పర్వములు గల్గి, అనంత ధ్వజములతో సర్వాయుధములచే నలంకరింపబడినదై, విరాజిల్లుచుండును అదియే శ్రీచక్రమండలి నవావరణాత్మకమైన మహామండలము మంత్రిణి శ్యామలాంబగేయ చక్రము దండనాయికి వారాహి, కిరిచక్రమునందున్న భండాసుర వధోద్యుక్త లలితా రూపము. శ్రీచక్ర నవావరణముల త్రిపుర పరిధి, మూడు చతురస్రముల వ్యాప్తి, అణిమాది, అష్టమాతృకాముద్రాశక్తుల పూజించి క్రమముగా నీ చక్రముల నుపాసింపనగును సర్వ త్రైలోక్య మోహన చక్రం, సర్వాశా పరిపూరకం సర్వ సంక్షోభణకం, సర్వ సౌభాగ్య దాయకము, సర్వార్థ సాధకం, సర్వ రక్షాకరం, సర్వ రోగహరం, త్రికోణ చక్రం బైందవ చక్రముని దేవి విభూతుల నాయా చక్రాధిష్ఠా

త్రులుగా తలంచి చేతురు ఈ సముదాయమంతయు మహాచక్రేశ్వరి యధీనమున నుండునవే. బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ మన్వస్ర (14) నాగదళ (8) షోడశపత్రయుక్తం వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ, శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః అదిపంచశివ మంచకే శంకరాంక కృత పీఠికాము తే కాదిహాది మనురూపిణీ మహంభావ యామి పరదేవతాంశివామ్' 'బిందు చక్రమున పంచ ఫలక నిర్మిత మహాసనమందు సదాశివ పర్యంక భాసితయై పూజలందుకొను 'ఏకా'త్మత్వ రూపమున మహాచక్రేశ్వరి భక్తాభీష్ట ప్రదాతయై సర్వారిష్ట వినాశియై, సకల భువన పోషణ కర్త్రియై, మహానంద విగ్రహ స్వరూపియై మహాపవాంతస్థయై విరాజిల్లును

829) ఓం నవ చక్రేశ్వర్యై నమః

నవచక్రాధిష్ఠాత్రియైన దేవి మూలాధార స్వాధిష్ఠాన, నాభి, హృది, కంఠ, భ్రూమధ్య, లలాట, శిరస్సు బిందుస్థానములు క్రమముగా తొమ్మిది చక్రములను సంధానము చేయుచు, నాయధిష్ఠాత్రిగణములైన హాకినీ, రాకిణీ, లాకినీ, కాకిన్యాది యోగినుల, నాపై త్రికోణ బిందు సముదయము సహస్రారాంతముగా నుపాసన చేయుదురు దేహమందే యీ నవ చక్రములను సంధించి నవచక్రేశ్వరి రూపమున ధ్యానింపుదురు

రాజచక్రేశ్వరీ* రాజ్ఞీ* మహాత్రిపురసుందరీ రాజరాజేశ్వరీ వీరా
సింధూర పూరరుచిరా శ్రీమత్త్రిపుర సుందరీ(120)

830) ఓం చక్రేశ్వర్యై నమః

చక్రేశ్వరియైన దేవి శ్రీ చక్రస్థిత బిందు తర్పణపరాం, శ్రీ రాజ రాజేశ్వరీం భావయే–యని సాధకుడు క్రమముగా నావరణల నధిగమించి బిందు స్థానమున నెలకొన్న సహస్రార చక్రమున ననంత శక్తియుతమైన చక్రేశ్వరిని ధ్యానించి లయమునొందుటకు ప్రయత్నించుటయే మోక్షసాధనము, భూపురములను దాటి యనగా, స్థూల సూక్ష్మ కారణ శరీరాధారమైన పరిధుల దాటి, త్రివృత్తములు – అగ్ని సూర్య సోమ కళలను, బ్రహ్మ, విష్ణు, (మహేశ్వరుని) మను, సదాశివ కళల విరాట్ ఫలకమందు ప్రతిష్ఠింపజేసి యాపై సర్వశక్తియుతమైన నవావరణ వ్యాప్త చక్రేశ్వరిని ధ్యానించుట క్రమముగా చేయవలెను

831) ఓం త్రిపురమాలిన్యై నమః

త్రిపుర మాలినీ రూపిణియైన దేవి అంతర్దశార చక్రేశ్వరి స్వరూపిణి. స్థూల సూక్ష్మకారణ శరీరములు, పురత్రయము, బ్రహ్మ విష్ణు రుద్రుల త్రిమూర్తులు, బాలాదుల త్రయము, పంచ దశీకూట త్రయము మొదలగు త్రిపుర పంక్తియందున్నందున త్రిపుర మాలిని రూపిణియైన దేవి (828) నైనామమున నుదాహృతమైన శక్తి

832) ఓం రాజచక్రేశ్వర్యై నమః

రాజచక్రేశ్వరీ రూపిణి 'పరాపర రహస్య యోగినీ గణసేవిత సర్వానందమయ మహారాజ చక్ర బైందవ పరబ్రహ్మ స్వరూపిణి, సర్వచక్రేశ్వరి, సర్వ విద్యేశ్వరి. సర్వ వాగీశ్వరి, సర్వ యోగేశ్వరి, సర్వ పీఠేశ్వరి, సర్వ సిద్ధేశ్వరి, సర్వ తత్త్వేశ్వరి, సర్వ కామేశ్వరి, సర్వ రక్షేశ్వరి, సర్వ జగదుత్పత్తి మాతృకా సర్వ చైతన్యశక్తి మహా త్రిపుర సుందరీ రూపిణిగా సర్వాలంకార యుక్తమై విరాజిల్లుచున్నది

833) ఓం వీరాయై నమః / ఓం రాజ్ఞ్యై నమః ఓం వీరరాజ్ఞ్యై నమః

వీరరాజ్ఞియైన దేవి ఖడ్గమాలాస్తోత్రమున మహాత్రిపుర సుందరి, మహా మహేశ్వరి, మహా మహారాజ్ఞీ, మహా మహాశక్తే, మహా మహాగుప్తే, మహా మహాజ్ఞప్తే మహా మహానందే, మహా మహాస్కందే, మహా మహాశయే, మహా మహాశ్రీచక్ర నగర సామ్రాజ్ఞియని యభివర్ణితయై విరాజిల్లు రూపము మధుకైటభ ప్రమథనీ, మహిషాసురఘాతినీ, ధూమ్రేక్షణరక్త బీజ దమనీ, చండముండా సురనిబర్హిణీ, శుంభ నిశుంభ

దైత్య దమనియైన వీరరాత్రి స్వరూపిణి

834) ఓం మహా త్రిపుర సుందర్యై నమః

మహా త్రిపుర సుందరీ రూపిణి 'త్రిపురస్య పరశివస్య సుందరీ' నవకోణాత్మక చక్రమందు నాలుగు శైవ కోణములు, ఐదు శక్తి కోణములు కలిపి శివశక్త్యాత్మక శ్రీచక్రము తొమ్మిది కోణములు, తొమ్మిది యావరణముల చక్రములు గలిగి బిందు మధ్యమున శ్రీమహాత్రిపుర సుందరీదేవి విరాజిల్లును సర్వానందమయ బైందవ చక్రమున 'మహాపద్మవనాంతస్థే కారణానంద విగ్రహే 'యనదగుదేవి శ్లో॥ 'హ్రీంకారాసనగర్భితానల శిఖాం సౌః క్లీం కళాబిభ్రతీం, సౌవర్ణాంబరధారిణీం వరసుధా ధౌతాంత్రినేత్రోజ్జ్వలాం, వందే పుస్తక పాశమంకుశ ధరాం, స్రగ్భూషితాముజ్జ్వలాం, త్వాంగౌరీం త్రిపురాం పరాత్పరకళామ్ శ్రీచక్ర సంచారిణీం' యని ఖడ్గమాలాస్తుతి రూపిణి.

835) ఓం సింధూరపూర రుచిరాయై నమః

సింధూర పూరిత కాంతియుతమునైన దేవి సుమంగళీ చిహ్నమైన సింధూర తిలకము సీమంత మందు, సింధూర తిలకముచే నలంకరింపబడి భాసమానముగు దేవీస్వరూపం పాపయందు పగడ కాంతికి మించునట్లు సింధూర పూర్ణకాంతులీనుచునై వెల్లుచున్నది ఉపచారములలో సీమంతే సింధూర తిలకరత్నం పరికల్పయామియని సిందూరమును లలాటమున నర్పింతురు

836) ఓం శ్రీమత్త్రిపుర సుందర్యై నమః

శ్రీమత్త్రిపురసుందరీ రూపిణి త్రిపురస్య పరశివస్య సుందరీ పత్నియని పరమశివుని పత్ని శ్రీ చక్రాధిష్ఠాన దేవతారూపిణి స్థూల సూక్ష్మకారణ శరీరమునకు, జాగ్రత్స్వప్నసుషుప్తి అవస్థాత్రయమునకు సాక్షిరూపముగు దేవి పరమేశ్వరి యిచ్ఛామాత్రమున శివుని శరీరము పైభాగము అయిదు ముఖములు, నాల్గు భుజములు గల పద్మకేసర గౌరాంగ బ్రహ్మరూపము, మధ్యభాగమున నీలకాంతి ఏకముఖ చతుర్భుజ శంఖ చక్ర గదాధర విష్ణురూపము, అధోభాగమున నయిదు ముఖములు, నాల్గ హస్తములు, శ్వేతమేఘ శరీరకాంతి చంద్రార్థ శకల శిరోభూషణయుక్త రుద్రరూపమునాయెను ఇట్టి త్రిపురములును పరమేశ్వరునియందుండుటచే త్రిపురుడనబడును ఆ పరమేశ్వరుని భవ్యశక్తి శ్రీమత్త్రిపురసుందరియని త్రిదేవి సంకలిత నామము, ఆయా మూర్తుల యిచ్ఛిన్న శక్తులుగా శ్రీమత్త్రిపురసుందరి వెలుగుచుండును

సర్వాంగ సుందరీ రక్తారక్త వస్త్రోత్తరీయకా॥ యవనీ
యవా॥ యావక సింధూర రక్తచందన ధారిణీ(121) జావా

837) ఓం సర్వాంగ సుందర్యై నమః

సర్వాంగసుందరీ రూపిణియైన దేవి సర్వాంగ సుందరియైన రూపము. శ్రీ రాజరాజేశ్వరీ ధ్యానమున సర్వాంగముల వివరణ గలదు కోటి కందర్పలా వణ్యాశివవామాంకవాసినీం, ఏకకాలోదితానేక చంద్ర కోట్యర్క కోటిభామ్। ప్రభాపటలితానేక కోటి బ్రహ్మాండ మండలాం। జపాకుసుమ సంకాశా మణిసోమ జపాత్మికామ్। సర్వాలంకార యుక్తాం సతతమభయదాం। భక్తినమ్రాం భవానీం। శ్రీవిద్యాం శాంతమూర్తిమ్। నిత్యాషోడశికా స్వరూపిణీం శాంతాం యౌవన మధ్యస్థాం, సర్వ శృంగార వేషాఢ్యాంయని సర్వసుగంధ పరిమళయుక్త సౌందర్య మూర్తి వర్ణనగలదు

838) ఓం రక్తాయై నమః

రక్తస్వరూపిణి రక్తమునకు లోహిత వర్ణము, పరాగము, ఆసక్తి, క్రీడారతి, ఎఱ్ఱ నెత్తురు కుసుమ పువ్వు, రాగము సింధూరము బందుజాలము యని యర్థములు గలవు. రక్తము దేహమందలి సప్తధాతువులలో నొకటి అది వాసనామయము అహంతా మమతలకు మూల కారణము దగ్గర బంధువుల యెడ గల్గు ప్రేమానురక్తిత దేవికి భక్తులయెడ గలుగు ప్రేమానురక్తిత త్రైలోక్య సృష్టిలో

దేనికి యనుబంధముగలిగి 'రక్తా'యనబడును

839) ఓం రక్తవస్త్రోత్తరీయకాయై నమః

ఎరుపు వస్త్ర ఉత్తరీయములు గల దేవి 'సకుంకుమ విలేపనామలిక చుంబి కస్తూరికాం, సమంద హసితేక్షణాం సశరచాపపాశాంకుశాం। అశేష జన మోహినీం అరుణమాల్య భూషాంబరాం। జపాకుసుమభాసురాం జపవిధౌస్మరేదంబికాం' యని యరుణభూష అంబరములు గలదిగా వర్ణింపబడినది ఎరుపు వర్ణం రక్తవర్ణం వస్త్రములు ధరించిన యనురక్తత రాజసగుణము, వశ్యశక్తి గలుగుచుండును

840) ఓం యవాయై నమః

యవాస్వరూపిణి తూకమునందు యారు తెల్లావాల పరిమాణము, యవలుధాన్య విశేషము పేరుచేయబడినది ఇందుజీవిక కుపయోగించు ప్రాణిపోషకమైన యవధాన్యరూపిణి యజ్ఞసంభారములలోనికి గూడ యుపయోగపడును యజ్ఞకర్త్రిగా నాయాసంభారములు యామె రూపమేయన జెల్లును

యవాయావక సింధూర రక్త చందన రూపధృక్
చమరీ వాలా కుటిలా నిర్మల శ్యామకేశినీ(122) చామరీబాల

841) ఓం యావక సింధూర రక్తచందన ధారిణ్యై నమః

యావకరూప సిందూర రక్త చందన ధారిణి, సింధూర రక్తచందనములు మాంగళ్య పరిమళ ద్రవ్యములు, సింధూరం పాపటను దేహాంగముల రక్తచందనమును నలదుచుందురు అయలంకరణ రూపము యావక రూపము గానయావక సింధూర రక్తచందన ధారిణిగాయంబ ఉపచారముల విశేషముగను యవరూపము గోధుమగింజ రూపమున నిడివిగ నలంకరించబడిన సిందూరాది స్త్రీదేవి

842) ఓం యవాయావక సిందూర రక్తచందన రూప ధృక్యై నమః

యవాయావక సిందూర రక్తచందనముల రూపము ధరించినది అంబ ఉపచారముల సిందూర రక్తచందనముల సేవనము వలన, నాయా రూపమున కనుపట్టుదేవి స్వరూపము రక్తచందన దిగ్ధాంగయని సిందూర శోభితయని యందురు

843) ఓం చమర్యై నమః

చమరీ రూపిణి, చమరీ మృగము, పూగుత్తియనియు యర్థముగలది పూగుత్తి స్వరూపిణియైన దేవి ఉపాసనా విధిని పుష్పమాలలు గుచ్ఛములుగాజేసి దేవిని పూజించుచుందురు అలంకార విధిని పుష్పాలంకరణ గూడ విశేషము ఆయా ఋతువుల నుద్భవించు పూలు పండ్లు, ధాన్యాది వస్తువుల ముందుగా దేవికి నర్పించి కృపకై ప్రార్థింతురు పుష్పగుచ్ఛములు శిరమున, కంఠము, ముంజేతులకు నలంకరణ చేతురు అవియు సుమంగళ ద్రవ్యములుగా దేవి స్వరూపములే అట్టి ప్రసూన గుచ్ఛ స్వరూపిణి దేవి

844) ఓం వాచకుటిలాయై నమః / వాల కుటిలాయై నమః

కుటిలమైన వాక్కు గల్గినదేవి కుటిలయన ఛందస్సు, వంకరయైనది, నంది వర్ణనం సరస్వతి కుటిలత్వం యన నర్మగర్భితమైన వాక్కు గలిగినది రెండవది సరస్వతిని వాక్ ప్రవాహముగా వర్ణింతురు జల స్వభావము క్రిందివైపుగా పారుట, ఋజుచలనముండదు అట్టి కుటిలమైన అనువయమైన వాక్కు గలిగి నట్టి దేవీ స్వరూపము

845) ఓం నిర్మలాయై నమః

నిర్మల స్వరూపిణి అణవమైన, మాయిక, కార్మిక మలత్రయ రహితమైనది అవిద్య తమస్సు యజ్ఞా

నము లేనిది శుద్ధ జ్ఞాన స్వరూపిణి దృక్ రూప సంబంధములైన కులములు లేని నిత్య శుద్ధ స్వరూపిణి 'జ్యోత్స్నాయై చేందు రూపిణ్యై, సుఖాయై, సతతం నమః' యను నిర్మల జ్యోత్స్న స్వరూపిణి (624) పదము విమలయర్థము వర్తించును అమల, విమల, నిర్మల శుద్ధ పదములు బ్రహ్మజ్ఞాన ప్రబోధితములు

846) ఓం శ్యామకేశిన్యై నమః

నల్లని కురులుగలది దేవి స్వరూప వర్ణన ఆరంభం దేహ సౌందర్యమునకు నల్లని కురులు దోహద కములు పూర్ణ చంద్రముఖము యొక్క కాంతి యినుమడించుటకు నల్లని తుమ్మెద రెక్కల వంటి కురులు శోభనిడును నల్లని పొడవైన శిరోజములు గల్గియుండుట శుభ సాముద్రిక లక్షణము అట్టి శుభ లక్షణమైన కృష్ణ శిరోజములు గలదేవి

వజ్రమౌక్తిక రత్నాఢ్య కిరీట కుండలోజ్జ్వలా
రత్నకుండల సంయుక్తా స్ఫురద్గండ మనోరమా(123)

847) ఓం వజ్రమౌక్తిక రత్నాఢ్య కిరీట మకుటోజ్జ్వలాయై నమః

ఉజ్జ్వల కిరీటము గల్గినది వజ్రములు, మౌక్తికములు, రత్నములు పొదిగినటువంటి కిరీటము శిరముపై ధరించిన మకుటము, నాయా రత్నకాంతులచే సుజ్జ్వలమై ప్రకాశము వెదజల్లుచున్నది శిరసున కందము రత్నఖచిత కిరీటాది భూషణముల ఆ కిరీటాది యలంకారముల దేవి శోభాయమానమై ప్రకాశించుచున్నది

848) ఓం రత్నకుండల సంయుక్తాయై నమః

రత్నకర్ణాభరణములు గల్గినది కుండలములు వలయములు చెవిపోగులు గుండ్రని వస్తువాభరణములు చెవికి శోభనిడును ఆ కర్ణకుండలములు రత్నఖచితమై ప్రకాశవంతమైనవి ఆ రత్నఖచిత కర్ణాభరణయుక్తమై దేవి ప్రకాశించుచున్నది.

849) ఓం స్ఫురద్గండ మనోరమాయై నమః

విస్పష్ట గండ స్థలము గల మనోహర మూర్తి గండస్థలముయన చెక్కిలి భాగములు సహజముగా 'అంట' పూర్ణచంద్రముఖి జ్యోత్స్నస్వరూపి అందు ధరించు నాసికా, కర్ణ కంఠ శిరోలంకారముల రత్న ప్రభలు ప్రసరించి గండ భాగమున వాని కాంతులు ప్రసరమై యత్యధిక స్పష్ట ప్రకాశములీనుచుండ మనోహరమూర్తిగా కన్పట్టుచున్నది

కుంజరేశ్వరి కుంభోత్థ ముక్తారంజిత నాసికా
ముక్తావిద్రుమ మాణిక్య హారాఢ్య*స్తనమండలా(124) హారాఢ్య

850) ఓం కుంజరేశ్వర కుంభోద్ధ ముక్తారంజిత నాశికాయై నమః (కుంభోత్థ)

కుంజరేశ్వర కుంభముల వలెనున్న విశాలమైన కపోలముల క్రిందుగా ముత్తెములు పొదిగిన నాసాభరణము విశేషకాంతులీనుచున్నది నాసికా భరణముయన నత్తు ముత్యములు పొదిగినది. ముఖమున నందముగా నొప్పారుచున్నది ముక్తారంజితమైన నాసాభరణము గల్గిన నాశిక విశేష కాంతులీనుచు ముఖారవింద శోభనినుమడింప చేయుచున్నదని యర్థము

851) ఓం ముక్తావిద్రుమమాణిక్యహారాఢ్యస్తనమండలాయైనమః(హారాఢ్యస్తన మండలా)

ముక్తామాల పగడముల, మాణిక్య మణిహారములచేనున్నతినందు స్తనమండలములు గలిగినట్టి దేవి ముత్యము, పగడము, పద్మరాగము, (కెంపు) వీనితో గూర్చబడినట్టి హారములు స్తనమండల మందాక్రమింపబడినవై దేవి యందమున కుద్దీప్తములుగా వెలుగుచున్నవి

సూర్యకాంతేందు కాంతాఢ్యా స్పర్శాశ్మగళ*భూషణా కంఠ
బీజపూర స్ఫురద్బీజ దంతపంక్తి రనుత్తమా(125)

852) ఓం సూర్యకాంతేందు కాంతాఢ్య స్పర్శాశ్మ కంఠభూషణాయై నమః (గళ)

సూర్యకాంత చంద్రకాంత స్పర్శమణులు కంఠభూషణములుగా గల దేవి స్వరూపము సూర్యకాంతమున సూర్యుని రశ్మి సోకి యగ్ని పుట్టు నట్టి మణి, స్ఫటికము చంద్రకాంతమున చంద్ర మణి, చలువరాయి, జాబిలిరాయి ఆహ్లాదకరమైన చల్లదనము నొసంగునట్టి మణి. స్పర్శాశ్మయనగా స్పర్శమణి పరుసవేది దీని ప్రభావమున లోహములు స్వర్ణమయముగా పరివర్తన చెందును (పసరుగూడ గలదందురు) దీని స్పర్శచే స్వర్ణదీపకాంతి గల్గును ఈ మూడు తత్త్వములు గలిగినట్టి కంఠభూషణములు ధరించియున్న దేవి తత్త్వములకు సంబంధించి, సూర్యచంద్ర, అగ్ని స్పర్శచే దాహకత్వము గల్గించునది)మణులను కంఠమందు ధరించియున్నది ఆభరణముల రూపము 'సూర్యేందు మండలాకారమణి తాటంక మండితామ్' యని వర్ణన

853) ఓం బీజాపూర స్ఫురద్బీజ దంత పంక్తి రనంత్తవాయై నమః

బీజాపూరమున మాది ఫలము సర్వ బీజ వ్యాప్తమైన ఫలముగ దానిమ్మపండు రూపమగును దాడిమీ బీజములు ఎఱుపు వర్ణమున ప్రకాశవంతములై తోచును అందు ఉపచారములలో నిత్యతాంబూల సేవం వలన యెరుపు చార గలిగి కాంతివంతములైన దంత పంక్తియన పలు వరుసలు గలిగియనుత్తమము పేరు పోలికలేనిది అయందమునకు వేరుసరిలేని విధిని శోభగల్గినది ఇందు పుత్త మోత్తమైన దాడిమీ బీజముల వలె, యెరుపు రంగు చక్కని పొందిక గల పలువరుసచే శోభ యలరారుచున్న రూపము దాడిమీ బీజసందోహ సందేహ దశనావలి

కామకోదండికా భగ్న*భ్రూకటాక్ష ప్రవర్తితీ భంగ్న
మాతంగ కుంభ వక్షోజా లసత్కనక దక్షిణా*(128)లసత్కోక నదేక్షణా

854) ఓం కామకోదండాభంగ్న భ్రూయయుగాక్షి ప్రవర్తిన్యై నమః (భగ్నభూ)

కాముని పాలించిన విల్లువలె పైకి విస్తృతమైనట్లు భ్రూలతోయుగ్మయుత నేత్రములు విలాసమునందుచున్న అభుగ్నయన కొంచెము వంకర తిరిగినవి భగ్నయన చెదరిన, కటాక్షమును యుగ్మములు గలవు కాముని కోదండము, చెరకు గడ, తుమ్మెదల వింటినారి, పంచ పుష్పబాణములు గలిగి మనోన్మత్త కారకములుగా వెలగును అట్టి ప్రభావమే దేవి భ్రూలతలయన కనుబొమలుగలది భ్రూవిక్షేపమాత్రమున సర్వజగత్తును దేవి వశ్యమగుచుండును అట్టి భ్రూలతలు రెండు - వాని క్రిందుగా విశాల నేత్రములు, ఆ నేత్రముల నుండి వెల్వడు కాంతి కిరణములే కాముని పుష్పబాణములకు ప్రతీక వానినుండి కటాక్ష బాణములు, యసుర సంహారమున క్రోధరక్త వీక్షణములు వెల్వడుచుండును వంగిన కనుబొమలు గల భ్రూయుగ్మము, వాని సేమను నలంకరించు విశాల నేత్రద్వయము గల్గిన దేవి రూపము।కటాక్ష సరణీనిర్యత్ కరుణాపూర్ణ లోచనాం (వీక్షణాం),ఆ కరుణాతిత కందర్పకరకార్ముక విభ్రమాంయన వర్ణనలు గలవు భగ్నభ్రూయన విరిగినటుల యొత్తియుండిన కనుబొమలు కోపకుటిల వీక్షణ ప్రసారముల వినియోగము

855) ఓం మాతంగ కుంభ వక్షోజాయై నమః

హస్తి కుంభముల పోలిన వక్షోజములు గలదేవి మాతంగము మత్తమాతంగము యనగా మదించిన యేనుగు కుంభస్థలమందు నున్నమాంస పిండములచే యేనుగు కుమ్మును పెద్ద వృక్షముల పైతము కూల్చివేయును. అంతటి శక్తివంతమైన, బలియమైన కుంభస్తనములు, యౌవన స్త్రీలకు దేహమందు కలుగు వికారములలో యెదిగివచ్చు వక్షోజములు - సాముద్రిక లక్షణము అవి యందముగా పొందికగా దేహ సౌందర్యమునకు కూర్చబడిన యలంకారములలో నొకటిగా వర్ణింపబడినది

856) ఓం లసత్ కోకనదేక్షణాయై నమః/ఓం లసద్ కనకదక్షిణాయై నమః

అలింగన క్రీడవలె దీప్తమౌ కమలముల వీక్షణము గంది కోకనదమనగా ఎర్రని తామర, కలువ

లును, కోకనదము, తామర, సూర్యమిత్రము, కలువ చంద్రముఖము ఆయా భాసముల వలన దీప్తమందు పుష్పరాజములు నొకవంక తీక్షణమైన వేడి చూపును, రెండవ వంక దాక్షిణ్యయుతమైన చల్లని చూపును వెలుగును రెండు నేత్రముల కాంతులు ప్రసరించుచుండును సూర్య చంద్రాగ్ని లోచనాయ నమః యని మూడు నేత్రములు అమరిన దేవి మూడవ నేత్రము ప్రళయకాలముననే తెరువ బడునందురు రక్తలోచనములు గల దేవి

**మనోజ్ఞ శష్కులీ కర్ణా హంసగతి విడంబినీ**
**పద్మరాగాంగదద్యోత ద్దో*శ్చతుష్క ప్రకాశినీ(127)          జ్యోతిర్ద్యో**

**857) ఓం మనోజ్ఞశష్కులీ కర్ణాయై నమః**

సుందరమైన కర్ణములు గల దేవి, శష్కులీయను పదమునకు కర్ణరంధ్రములు, మత్స్య విశేషముయను యర్థములు గలవు. చెవి కమ్మభాగముల రంధ్రములు చేసి బంగారు రత్నఖచిత కర్ణాభరణములకు నాలంబన కలిగింపజేతురు అట్టి సుందరమైన చెవి కమ్మ భాగములు గల దేవి స్వరూపము తాటంకయుగళీ భూత, తపనోడు మండలాయని లలితా నామము ఇచట కర్ణాభరణములచే శోభిల్లుచున్న చెవి కమ్మలు గల దేవి

**858) ఓం హంసగతి విడంబిన్యై నమః**

అడుహంస చాలన తిరస్కరించు గతి గలదని భావము గతియన నడక, అంట నడచుటలో గల హొయలు అనుసరించ హంసలు తొట్రుపాటు పడును ఆమె నడక హంసలకు గతి విధములు నేర్పు చున్నవా, యనునట్లు గలవని సౌందర్యలహరి సాహిత్యములో భావముగలదు హంసగతి నతిశయించి విశేషగతి ప్రాచుర్యము హొయలు గలదేవి 2) మరాళము సరస్వతీ దేవి యొక్క వాహనము సరస్వతికి ప్రతీక. గతియన చలన స్వభావము వాగ్విడంబన యనగా యంటు పలుకులు సరస్వతీ దేవి తంత్రీనాదముల మాధుర్యమును గూడ క్రింది జేయునట్టి లాలిత్యము మాధుర్యము, సహృదయత గలిగియున్నవి అట్టివిశేష చాలనయన, ప్రవర్తన యతిశయించునట్టి దేవి రూపము మరాళ మందగమనాయని వర్ణన

**859) ఓం పద్మరాగాంగదద్యోత దోశ్చతుష్కప్రకాశిన్యై నమః**

పద్మరాగాంగముల ప్రస్ఫుటమౌ నాలుగుచేతులు శోభ వెలుగుదేవి పద్మరాగము యనగా కమలము, రక్తవర్ణము, దేవి సర్వాంగ సుందరి, మేనికాంతి, పద్మరాగ కాంతితో పోల్చుదురు ప్రస్ఫుటమౌ యంగభాగములన పద్మరాగముద్యోతక మగును అందు కంచుక పరిధిదాటిన హస్తభాగములు, ఇచట యంటకు నాలుగు చేతులు మాత్రము ప్రకాశించుచున్నవి యని యున్నందున 'చతుర్బాహు చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమ రాగశోణే' యనియు, మహాలక్ష్మికి కూడా చతుర్హస్తమూర్తిగా భావించుచుందురు గాన యట్టి నాలుగు చేతుల వర్ణన ఆయా చేతులలో పాశ, అంకుశ, వరద, అభయ ముద్రాయుత యాయుధములు గలిగియున్నట్లు వర్ణింతురు

(860 నుండి 864 వరకు గల యైదు నామములు కొన్ని గ్రంథముల లుప్తము/శ్లోకమును లుప్తమే)

**నానామణి పరిస్ఫూర్జద్ శుద్ధ కాంచన కంకణాయై నమః**
**నాగేంద్ర దంత నిర్మాణ వలయాంచిత పాణికీయై నమః(127a)**

**860) ఓం నానామణి పరిస్ఫూర్యచ్ఛుద్ధ కాంచన కంకణాయై నమః**

అనేక మణుల పొదుగుటచే నుజ్జ్వల కాంతులీను, స్వచ్ఛకాంచన నిర్మిత కంకణములు గలదని భావము కంకణములు ముంజేతులకు ధరించు యాభరణవిశేషములు వాని పదునారువన్నెల (ఇరువది నాలుగు కారెట్లు) స్వర్ణముతో నిర్మించి యందు యనేక రంగుల కాంతులీను మణి విశేషణములతో పొదిగి చేతికి ధరించగా, నాయా కాంతులదేవి హస్తములు శోభ–ఉజ్జ్వల కాంతులీనుచున్నది యని భావము

861) ఓం నాగేంద్రదంత నిర్మాణ వలయాంచిత పాణికాయై నమః

ఏనుగు దంతముచే చేయబడిన వలయములు గల, చేతులు గల దేవి నాగేంద్రము యనగా గజములలో నెక్కువకాలము పెరిగినది శ్రేష్ఠమైనది సత్తువ గలది దాని దంతములు దృఢముగా నుండును ఆ దంతములలో చేయబడు అనేక యాభరణములలో హస్తవలయమున ముంజేతి గాజులుగా చేతులకు నలంకరింతురు ఆ హస్తిదంతములను స్వర్ణమణి విశేషములతో పొదుగుచు చేయబడిన యలంకారములు చేతుల శోభ పెంచుచుండును

అంగులీయక చిత్రాంగ్యై విచిత్ర క్షుద్రఘంటికా
పట్టాంబర పరీధానా, కలమంజీర*రంజిన్యై నమః (127బి) శింజిన్యై

862) ఓం అంగులీయక చిత్రాంగ్యై నమః

చేతులకు నుంగరములు ధరించినట్టి శోభ గలదేవి అంగులీయకము యన వుంగరము చేతి వ్రేళ్ళకు ధరించు స్వర్ణాభరణములు వానివలన హస్తశోభయతిశయించును 'రత్నాంగులీయక విభాసిత దంగులి పల్లవామ్' మృదుతరాంగులీయకములకు రత్నాంగులీయక భాసము గలిగినది పాదాంగులీయకం, కరాంగులీయకం, కాలివ్రేళ్ళు, చేతివ్రేళ్ళకు సంబంధించినవి కాళ్ళకు వెండి యాభరణములు గూడ చేయింతురు అట్టి స్వర్ణ/రజతాంగులీయక శోభ వెలుగు చిత్రమైన యంగములు గల దేవి చిత్రాంగి యనుటలో నాయంగముల అద్భుత విశేష సౌందర్యమును గలిగింపగా హస్తపాదములు అద్భుతాశ్చర్య చిత్ర వర్ణాంగములుగా శోభ వెలుగును

863) ఓం విచిత్ర క్షుద్ర ఘంటికాయై నమః

విచిత్ర ధ్వనులీను మొలనూలు గజ్జెలు గలిగినట్టి దేవి స్వరూపము క్షుద్రఘంటికలు యన చిన్నగంటలు యని యర్థము వానివలి శబ్దము వెలువరించు గజ్జెల మొలచుట్టు ధరించు యాభరణ విశేషము క్షుద్రమనగాయల్పమైనదనియును, క్షుద్రశక్తుల నుండి శరీరమునకు రక్షణ కలిగించు చిరుగంటలనియు యర్థము అట్టి చిరుగంటలు గలిగినటువంటి మొలనూలు గల్గి విచిత్ర శోభ వెన్నారు దేవి స్వరూపం కందిదామకటి సూత్రము

864) ఓం పట్టాంబర పరీధానాయై నమః

పట్టు వస్త్రములు ధరించి యున్న దేవీ రూపము "పీతాంబరం కనకమౌక్తిక భూషితాంగీం' అరుణదుకూల పరిధానం అరుణ కుచోత్తరీయం, అరుణారుణ వస్త్ర పరిధానం, యనియుపాసనా విధి, పట్టు వస్త్రములు ధరించియున్న దేవీ రూపము త్రివిధకాల వుపాసనా క్రియలలో గాయత్రిగా ఉదయం రక్తాంబరధరిగాను, సావిత్రిగా మధ్యాహ్నం, శ్వేతాంబరధరిగాను, సాయంత్రం సరస్వతిరూపుగా కృష్ణాంబరధరగాను పేర్కొందురు సరస్వతి రూపమున పీతాంబరాలంకృతా యని గలదు అట్టి పీతాంబరములచే నలంకరించబడిన దేవి

కర్పూరాగరు కస్తూరీ కుంకుమ ద్రవలేపితా,
విచిత్రరత్న పృథివీ కల్ప శాఖితలస్థితా(128)

865) ఓం కర్పూరాగరు కస్తూరీ కుంకుమ ద్రవలేపితాయై నమః

అంగరాగములుగా ప్రసిద్ధినందిన కర్పూరం, అగరు, కస్తూర్యాదులు పరిమళ ద్రవ్యములు ద్రవరూపమున దేహమునకు నలదగా, పరిమళ భరిత దేహము సువాసన వెల్వరించుచుండును అట్టి పరిమళ సుగంధ ద్రవ్యములు అంగలేపనములుగా, నలదిన పరిమళ భరిత రూపము

866) ఓం విచిత్ర రత్నపృథివీ కల్పశాఖి తలస్థితాయై నమః

విచిత్ర రత్నమయ పృథివి యందు కల్పతరుశాఖ స్థితి గలిగినట్టి దేవి స్వరూపము అంబ త్రిలోకవాసిని పృథ్వి యందును విలసిల్లును ప్రకృతి స్వరూప ఆ పృథ్విగర్భమున నోషధిరత్నములు, ఖనిజములు సంప్రాప్తించు చుండును సర్వజీవ పోషకాధారమునై యున్నది అందు దేవి నెలవు

కల్పతరుశాఖ దేవలోక వృక్షము కల్పతరువు దానిక్రింద స్థితుడై యేది వాంఛించిన అది లభ్యమగుచుండును అట్టి వాంఛా కల్పతరువు శాఖ యును త్రిలోకవ్యాప్తములు ఆ కల్పతరువు శాఖ క్రిందియాసీనయైన దేవి, రత్నగర్భయైన పృథ్వి, యందలి జనులకు సకల వాంఛలు రక్షణ నొసంగుచు కాచుచున్నది

867) ఓం కలమంజీర రంజిన్యై నమః

కలనూపుర శబ్దాహ్లాదిని యైన దేవి ఇందు మంజీరము యనునూపురము కాలి యలంకరణము గలది నడుమునపుడు దానికి గల చిరుగజ్జెల చేకలనాదముద్భవించును. ఆ ప్పుడు మధురనాదమున భక్తుల మనముల సంతోషపెట్టు పరమేశ్వరి శింజానమణి మంజీర మండిత పాదాబ్జ మండలాం- యని వైభవము తెలుపు రూపము పాదనూపురములు, పాదాంగులీయుగముల వర్ణనచే పాదాంత పరమేశ్వరి వర్ణన కూర్చబడినది

రత్నద్వీప స్ఫురద్రత్న సింహాసన నివాసినీ* విలాసినీ
షట్చక్రభేదనకరీ పరమానంద రూపిణీ (129)

868) ఓం రత్నద్వీపస్ఫురద్ రత్నసింహాసన నివాసిన్యై నమః

రత్నద్వీపమున ప్రస్ఫుటమగు రత్నసింహాసనమున నాసీనురాలైన పరమేశ్వరి స్వరూపము అంబ నెలవుగా గల మహోన్నత తలము మణిద్వీప వర్ణనలో వజ్రవైఢూర్యాది రత్నఖచిత ద్వీపముల వర్ణన గలదు అన్ని ద్వీపముల యందును యంబ సత్, చిత్, ఆనంద స్వరూపము ప్రస్ఫుటమగు చుండును అట్టి రత్నద్వీపమందు రత్నఖచిత సింహాసనమున యంబ యాసీనురాలై, త్రైలోక్య పాలన చేయుచుండును రత్నసింహాసనస్థయైన దేవి వైభవము గాంచ ముక్తిగలుగును

869) ఓం షట్చక్ర భేదన కర్త్ర్యై నమః

షట్చక్ర భేదన కారకమైన దేవి రూపము మూలాధార స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత విశుద్ధ, ఆజ్ఞాచక్రములు, (మూలాధారము బ్రహ్మగ్రంధి, మణిపూరం, విష్ణుగ్రంధి, ఆజ్ఞాచక్రము రుద్రగ్రంధి యని పేరు పొందును గలదు రెండు చక్రస్థానములు నొక్క గ్రంధికి చెల్లును) ఈ మూడు గ్రంధులు దాటిననే గాని సహస్రార చక్రమున ప్రవేశముగలుగదు అచట చంద్రమండల సుధాసముద్రము, జ్యోత్స్నాపూరిత చింతామణి గృహమున పంచ ప్రేతాసనస్థయై మహాకామేశ్వరాంకమున నున్న పరమేశ్వరిని చూడవలనుపడును అందులకు షట్చక్రభేదనానంతరం పరమేశ్వరి యనుగ్రహముననే వాసై సహస్రార గృహసీమకు ప్రవేశము గలదు మోక్షకారణమైన పరమేశ్వరి సన్నిధానము అంబయనుగ్రహమున భేదించగలుగును

870) ఓం పరమానంద రూపిణ్యై నమః

పరమానంద స్వరూపిణియైన దేవి నిరతిశయ సుఖ స్వరూపము బ్రహ్మానందమే స్వరూపముగా గలది 'ఆనందో బ్రహ్మేతివ్యజానాత్' పంచకోశములతో కూడ నైదవది యానందమయ కోశము తురీయ స్థితి యందలి పరమపురుష స్థితి ఆనంద ఘనస్వరూపిణి యైన పరమేశ్వరి 'పరమానందా' యనబడును 'మహాపద్మవనాంత స్థ కారణానంద విగ్రహ' ఏహ్యాహియని యాహ్వానము

సహస్రదళ పద్మాంతా చంద్ర మండల వర్తినీ,
బ్రహ్మరూపా శివాక్రోడానానా సుఖవిలాసినీ (130)

871) ఓం సహస్రదళ పద్మాంతచంద్ర మండల వర్తిన్యై నమః

సహస్రదళ పద్మమందు నెలకొను చంద్రమండల జ్యోత్స్నయందువర్తిల్లు దేవి స్వరూపము సహస్రారాంబుజారూఢాయని లలిత నామము అనంత శక్తులకు స్థానమై యనంత ప్రకాశము

గలిగి, యనంత జ్ఞాన ప్రసారమును పిండాండంబున గల్గజేయునది బ్రహ్మరంధ్రమున సహస్రారమను సహస్రదళపద్మమున నధివసించు దేవీ స్వరూపము నిర్మల శీతల జ్యోత్స్నా స్వరూపిణి.

872) ఓం బ్రహ్మరూపాయై నమః

బ్రహ్మస్వరూపిణియైన దేవి సృష్టికృత్యము రజోగుణ ధర్మము త్రిగుణాత్మకమైన పరమేశ్వరి మూర్తులలో బ్రహ్మస్వరూపమొకటి చతుర్ముఖ బ్రహ్మరూపమున చరాచర ప్రపంచమును సృష్టిచేయును ఆ ప్రపంచమునకు నాధారభూతమగు చిదాకారమే బ్రహ్మస్వరూపము బ్రహ్మస్వరూపం బృహదాకారం, త్రిలోక వ్యాప్తము, సమస్తప్రాణి కోటిచేతనా స్వరూపము మనసును వ్యాపారరహితము చేసి, సంకల్పవికల్ప రహితముగా నుండు నిశ్చలస్థితియే బ్రహ్మరూపము

873) ఓం శివక్రోడాయై నమః

శివక్రోడస్థితయైన దేవి క్రోడాయన రొమ్ము భాగము, శివక్రోడాయన శివుని రొమ్ము భాగము, ప్రళయతాండవమున భూసంరక్షణార్థమై శివుడు శవరూపుడై దేవీ పాదముల ఘాతల తీవ్రతను తనలో నిముడ్చుకొనెను దేవి యాసీనురాలైన ఫలకము పంచప్రేతాసన మయము సదాశివ ఫలకముపై యాసీనురాలగు దేవి శివక్రోడారూపము 'శవారూఢం, మహాభీమాం' యని కాళీ స్వరూపము. తారారూపము 'శవహృద్ ఘోరాట్టహాసాపరా' శివుని రొమ్ముపై యాలీఢయైన దేవి

874) ఓం నానాసుఖ విలాసిన్యై నమః

నానా సుఖ విలాస స్వరూపిణియైన దేవి సుషుమ్నా మార్గమున బ్రహ్మరంధ్రము నాచ్ఛాదించి యుండు విక్షేపశక్తి స్వరూపిణి విలాసిని విష్ణుమాయా అట్టి విష్ణుమాయా శక్తి ప్రపంచమందలి సుఖ భోగములు యనేకముగా సృజించి ప్రజలతో క్రీడించు చుండును ఇక్కడి సుఖభోగములు తాత్కాలికము కాని సహస్రార చక్రమున నిర్మల జ్యోత్స్నలో యమృతపానము చేయగలుగుట, పిటువంటివి మించిన సుఖము, ఆ మనోజ్ఞమందు పరమేశ్వరి నిత్య విలాసినియై వెలుగుచుండును

హరవిష్ణువిరించీంద్ర గ్రహనాయక సేవితా
శివా శైవాచ రుద్రాణీ తథైవ శివనాదినీ* (131) వాదినీ

875) ఓం హరవిష్ణువిరించీంద్ర గ్రహనాయక సేవితాయై నమః

బ్రహ్మవిష్ణు శివయింద్ర గ్రహనాయకాది దివ్యజనములచే సేవించబడునట్టి పరమేశ్వరి రూపము 'అతీతోపపూర్వస్య వక్త్రేణోపదనాత్తతః' నిష్క్రామ మహత్తేజో బ్రహ్మణః శంకరస్యచ అన్యేషాం చైవ దేవానాం శక్రాదీనాం శరీరతః' అటులే వారియున్నియాయుధముల సముదాయమును దేవి యంశలుగా 'అతులం తత్తేజః సర్వదేవశరీరజం, ఏకస్థం త దభూన్నారీవ్యాప్తలోకత్రయంత్విషా' పరిణామము 'ఏవం స్తుతాసురైర్దివ్యైః కుసుమైర్నందనోద్భవైః అర్చితాంజగతాం ధాత్రీ తథా గంధానులేపనైః భక్త్యాస్సుమస్తై స్త్రిదశై ర్దివ్యైర్ధూపై స్తుధూపితా, ప్రాహ' ప్రసాదసుముఖీ సమస్తాన్ ప్రణతాన్ సురాన్- యని యసుర బాధల తొలగించుమని ప్రార్థించు దేవతలయెడ ప్రసన్నురాలైనది 'సుత్తాసురైః పూర్వమభీష్టసంశ్రయా త్తథా సురేంద్రేణ దినేషు సేవితా కరోతుసానః శుభహేతు రీశ్వరీ శుభాని భద్రాణ్యభిహంతు చాపదః' 'యాచస్మృతాతత్ క్షణమేవహంతి నః సర్వాపదో భక్తి వినమ్ర మూర్తిభిః' యని 'త్రైలోక్యస్య హితార్థాయ' వర్తనము, త్రైలోక్య జనపూజ్యాయై వెలుగు చుండును

876) ఓం శివాయై నమః

శైవమయమైన దేవి శివస్వరూపిణి 'యస్యపుంసః పరాశక్తి ర్భావగమ్యా మహీయసీ, నిర్గుణాస్వగుణైరేవ నిగూఢా విష్కృతాశివా' 2) శివం కరోతీతి శివా 'కరోతుసాన శుభహేతు మీశ్వరీ, శుభానిభద్రాణ్యభిహంతుచాపదః' 3) పరమశివుని యర్ధాంగిగా శివాయనబడును సర్వమంగల

మాంగళ్యే శివే సర్వార్థ సాధికే, శరణ్యే త్ర్యంబకే దేవి' మంగళదాయి 3) ఉత్తమమయిన మోక్షపదము బ్రహ్మపదవి స్వరూప జ్ఞానము గలిగించు కరుణామూర్తి 5) శివయువ ముక్తిస్వరూపం త్రిపుటి యందు మధ్యమ పదము జ్ఞానము ఆదియే ప్రజ్ఞానం 6) చండికాశక్తి రక్తుల్లగా శివ శతనినాదిని యగు ఖండన మూర్తియునై యున్నది

877) ఓం శైవాయై నమః

శైవసంబంధియైన దేవి శివసంబంధమైన శక్తిశైవం శ్రీచక్రమునందు నాలుగు శైవకోణములు నైదవుశక్తి కోణములు, మొత్తము నవకోణాత్మక శ్రీచక్రము శైవయాచార యుక్తం సదాచారము సంప్రదాయక ముపాసనా విధానమున ప్రీతిచెందు దేవీ స్వరూపము

878) ఓం రుద్రాణ్యై నమః

రుద్రాణి స్వరూపం సంధ్యోపాసన యందు మధ్యాహ్నము రుద్రాణి రూపము. 'రుద్రాణీ నవయౌవనా త్రినయనీ, వైయాఘ్ర చర్మాంబరా ఖట్వాంగత్రిశిఖాక్ష సూత్రవలయా-సావిత్రీ వృషభస్థితా భవతు సుఖకరీ' యను రూపము 'రౌద్రాయైన నమో నిత్యాయై గౌర్యై ధాత్ర్యై నమో నమః' రౌద్రరూపిణి రుద్రాణియగు పరమేశ్వరి

879) ఓం శివారాధిన్యై నమః

శివారాధిని రూపము శుభకరమైన నాదము గలది నాదమనగా బ్రహ్మస్వరూపమైన ఘోషగలది షట్చక్రభేదన దశ యందు నాదము వెలువడును. అదియనంత ఘోషగా తైలధార వలె స్థిరపడినపుడు సమాధిస్థితి బ్రహ్మసాక్షాత్కారము పరమబ్రహ్మానంద తత్వం అట్టిస్వరూపమైనది శివారాధిని

మహాదేవ ప్రియా దేవీ* తథా వానంగ మేఖలా మాతంగినీ శ్రీమత్ చ
డాకినీ యోగినీ చైవ తథోపయోగినీ మతా (132)

880) ఓం మహాదేవప్రియాయై నమః

మహాదేవుని ప్రియురాలు. మహాదేవుడు సదాశివుడు, కామేశ్వరుడు అట్టి పరమోన్నత పురుషశ్రేష్ఠునకు ప్రియశక్తియైనట్టి కామేశ్వరీ, మహాగౌరీ, పరమేశాని, మహాదేవప్రియా త్రిమూర్తుల శక్తులుగా మహామాయా మహాలక్ష్మి మహాసరస్వతీ రూప విడంబన గలిగిన పరమేశ్వరియే

881) ఓం దేవ్యై నమః

దేవీ రూపిణి దివియనగా తేజోమండలము దివియందు చరించు వారు దేవతలు వారి శక్తి స్వరూపిణి. దేవి 'దివ్యతి క్రీడతి యస్మాత్ ద్యోతతే రోచతే దివి తస్మాద్దేవయితి ప్రోక్తా'' స్తూయతే సర్వదేవతైః' దివ్యప్రభావము, విశేషశక్తులు గల నాకచరులు వారి సాముదాయక శక్తి స్వరూపిణి దేవి ఆరోగ్యం సూర్యోపాసనచే, జ్ఞానం శివోపాసన చే గలుగును అటులే దేహమునందు వివిధ యంగములు దేవతా వ్యాప్తములు కన్నులు సూర్యచంద్రులు చెవులు దిక్కధిదేవతలు ఇంద్రాదులు యింద్రియాధిష్ఠదేవతలు వారందరి శక్తి స్వరూపము త్రిలోక సర్వజీవవ్యాప్త దేవీ స్వరూపము

882) ఓం అనంగమేఖలాయై నమః

అనంగ మేఖలా రూపిణి శ్రీచక్ర తృతీయావరణ శక్తి యనంగమేఖలా నాభిస్థిత చక్రదళస్వామిని (సర్వసంక్షోభిణీ చక్రము) ఈ నామము పునరావృతము (741) శరీర నిర్మాణమున కాధారము నాభి దాని పరిధి మేఖల నాశ్రయించు దేవి

883) ఓం ఢాకిన్యై నమః

ఢాకినీ స్వరూపము 'డ' కారము బీజన్యాసమంత్ర సంకేతములుగా గల ఢాకినీ యను దేవత విశుద్ధి చక్రమున కధిష్ఠాత్రి విశుద్ధి చక్రనిలయా యనియందురు దాని స్థానము

'గ్రీవారూపే విశుద్ధే స్వర (స్వప) దళ (16) కమలే రక్తవర్ణాం త్రినేత్రాం
శ్రీఖట్వాంగం కపాలం త్రిశిఖమపి మహాచర్మం సంధారయంతీం
వస్త్రైకైకేన యుక్తాం, పశుజనభయదాం। పాయసాన్నేప్రసక్తామ్
స్పృక్స్థాం వందేఽమృతాద్యైపరివృత వపుషం। ఢాకినీ భావయేత్తాం'
అమృతాది షోడశ కళలు పరివృతమైన దేవి స్వరూపము

884) ఓం యోగిన్యై నమః (196వ నామము)

యోగినీ స్వరూపిణి యోగినీ పదము పునరావృతము (196) మూలాధారాది, సహస్ర రంత సప్తచక్రాధిష్ఠాత్రులు యోగినీ గణములు డాకిన్యాదులు 2) చిత్తవృత్తి నిరోధకమైన మంత్ర, హఠ, లయ రాజయోగములందు, పొందు యేకాగ్రత యోగినియని యందురు జ్ఞానజ్ఞాతృజ్ఞేయ యేకత్వభావమున యోగమేయనియు, నట్టింటికీ యోగినీ శక్తిస్వరూపిణియై పరాశక్తి విరాజిల్లుచున్నది

885) ఓం ఉపయోగిన్యై నమః

ఉపయోగినీ రూపిణియైనది ఉపయను అవ్యయము సమీపము, ప్రారంభము, సాదృశ్యము, వ్యాపముయను యనేక రూపములు గల యర్థములు యోగినీ రమించు తలము ఉపయోగిని రమించు, ఉపరమించు, యోగించు, ఉపయోగించు యని జీవబ్రహ్మం సమైక్యస్థితి నిరూపణయే ఉపపద విశేషార్థము

886) ఓం మతాయై నమః

మత స్వరూపిణి, ఉద్ఘోషింపబడినది, ఎరుగబడినది సమ్మతము పూజింపబడు నది, శిష్టసమ్మతము యను యర్థములు గలవు. అభిమతము యను యంగీకారము త్రిలోకాధిపతివాసులును దేవిని త్రిజగద్వంద్య భువనపోషిణి యని ఏకాభిప్రాయమున సంస్తుతి చేసియుండిరి అటులే దుష్టగ్రహాదులచే యీతిబాధలు తొలగుటను,నుత్పాతములు పశమించుటకు కాల విశేషములు చైత్ర ఆశ్వయుజ నవరాత్రాదులు యర్చించుటకు ప్రాతిపదికమైనవని యేకాభిప్రాయము 'సర్వబాధాప్రశమనం,త్రైలోక్యస్యాఖిలేశ్వరి' పూజచే గలుగును సమాధివైశ్యునికి జ్ఞానమును, సురథునికి నఖండ రాజ్యము నొసంగిన దేవి తన భక్తుల నెందరినో రక్షించి పూజలందుకొనుచున్నది అట్టి సంప్రదాయ బద్ధ వుపాసనా క్రియయే మతము కులాచార కౌలాచార, దక్షిణ వామాది మతములు క్రియయు వేరైనను వేరు మతములుగా పేర్కొనబడినను నంతయును దేవిని ప్రసన్ను రాలిని చేసికొనుటచే గావున, విభిన్న మతములైనను యేకమతి దేవి వుపాసన యాచరణీయము

మాహేశ్వరీ వైష్ణవీ చ భ్రామరీ శివరూపిణీ
అలంబుషా* భగవతీ క్రోధరూపా సుమేఖలా(133)      సా

887) ఓం మహేశ్వర్యై నమః

మహేశ్వరీ రూపిణి 'మహాంశ్చాసావీశ్వరః సర్వదాప్రత్యగాత్మత్వేన ఉపాస్య పునరావృతము (68) వేదాద్యంతముల ప్రతిష్ఠితుడై ప్రకృతి సహితుడైన మహేశ్వరుడు త్రిగుణాత్మక బ్రహ్మ, విష్ణు, కాలరుద్రునిగా కన్పట్టును శక్తిమాహేశ్వరి 2) త్రిమూర్తులు సగుణులు మహేశ్వరుడు నిర్గుణుడు, త్రిమూర్తులకు కారణస్వరూపుడు అట్టి నిర్గుణ స్వరూపిణి తురీయ మిధునరూపమే యని యభిప్రాయము 'బ్రహ్మాణ్యాది యష్టశక్తులు' బ్రహ్మేశ గుహ విష్ణూనాంత థేంద్రస్య చ శక్తయః' గలది కాన మహేశ్వరి

888) ఓం వైష్ణవ్యై నమః

వైష్ణవీ శక్తి రూపిణి అంబ విభూతులలో వైష్ణవి యొకటి 'తథైవ వైష్ణవీ శక్తి గరుడోపరి సంస్థితా

శంఖచక్ర గదాశార్ఙ్గఖడ్గహస్తాభ్యుపాయయా' అటులే 'త్వం వైష్ణవీ శక్తి రనంత వీర్యా విశ్వస్య బీజం పరమాసిమాయా' 2) దేవి పంచకృత్య పరాయణి, అందు సృష్టిస్థితిలయాదులకు బ్రహ్మ విష్ణు మహేశ్వరాంశులుగా వెలుగుచుండును సత్వప్రధానమైన విష్ణురూపుని శక్తిగా నామె వైష్ణవి యనబడుచు భువనపోషణ చేయును

889) ఓం భ్రామర్యై నమః

భ్రామరీ రూపిణి 'యదారుణాఖ్యస్త్రైలోకే, మహాబాధాం కరిష్యతి, తదాహం భ్రామరం రూపం' 'కృత్వాఽసంఖ్యేషట్పదం। త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురం' యని భ్రామరీ రూపి యైనది ద్వాదశలింగ క్షేత్రములలోని శ్రీశైలమున భ్రామరీపీఠ శక్తిగా భ్రమరాంబ నెలకొనియున్నది 'శ్రీశైల స్థలవాసినీ భగవతీం శ్రీమాతరంభావయే' యనబడుచు పరమేశ్వరి యనుగ్రహించుచున్నది

890) ఓం శివరూపిణ్యై నమః

శివరూపిణియైన దేవి శివుని యర్ధాంగిగా సగముమేనునాక్రమించిన దేవి యర్ధనారీశ్వర రూపమున శివరూపిణియే 2) శివరూపిణి శివుడు, శక్తియుతుడైనపుడే శివంకరుడు శివరూపిణి శక్తి. అట్టి యభిన్న శివశక్త్యైక స్వరూపము జ్ఞాతవ్యమగును 3) శివుడు జ్ఞాన స్వరూపుడు, అట్టి బ్రహ్మజ్ఞానము పరమేశ్వరీ యనుగ్రహమున కలుగుచుండును గాన శివరూపిణి 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే। శరణ్యే త్ర్యంబకే గౌరి' యని అంబ శుభంకరి

891) ఓం అలంబుసాయై నమః

అలంబుసా రూపిణి. ఒకదేశ విశేషమని నిఘంటువు కాని ముఖ్య ప్రాణవాహకయైన నాడీ స్వరూపమై యున్నది ముఖ్యమైన పదునాలుగు దేహవ్యాప్త నాడులు సుషుమ్న, పింగళా, ఇడా, సరస్వతీ, పూషా, వరుణా, హస్తిజిహ్వా, యశస్వినీ, అలంబుసా, కుహూ, విశ్వోదరా పయస్వినీ, శంఖినీ గాంధారీ (14) అందు అలంబుసా జలస్వరూపియైన నాడి అధిదేవత వరుణుడు నాభికందము నుండి గుదాభాగము వరకు వ్యాప్తమై నిత్యదేహ క్రియల తోడుపడుచుండును అందు ప్రాణసంచారిణి రూపిణి పరమేశ్వరి

892) ఓం భోగవత్యై నమః

భోగవతీ స్వరూపిణి భోగవతి యన నాగపురము పాతాళగంగ, మాతృక నదియను వివరములు గలవు సుఖానందానుభవము భోగము గృహము శయ్య, వస్త్రాభరణ మాంగళ్యములు పుష్పగంధాది తాంబూల సర్వభోగయుత 2) భోగమున నివేదన ప్రాణి స్వరూపమున నున్న యంబకు సాత్వికాహార నివేదన పాలు, పండ్లు, భక్ష్యాదులు 3) భోగవతియన నాగుల నివాసస్థానమైన పాతాళ పట్టణము దేహమందు కుండలినీ శక్తి సర్పాకారముగా చుట్టుకొనియుండ, నా కుండలినీ రూపి నాగ శిరముపై సహస్రార చక్రమున దేవి కొలువుండును

893) ఓం క్రోధహారిణ్యై నమః

క్రోధ స్వరూపిణియైన దేవి క్రోధమే దేహస్వరూపియైన దేవి, ద్వేషమను చిత్తవృత్తియే క్రోధము అట్టి చిత్తవృత్తిని యదుపుచేయగనంత క్రోధము నెదుర్కొనవలెను దాన అసురీభావన నిర్వీర్యమగును సాధుజనుల హింసించుచు, యజ్ఞయాగాది ధ్వంసము చేయుచున్న మూఢులనణచ పరాశక్తియే సర్వాయుధయై 'తతోఽతికోపపూర్ణస్య భ్రుకుటీకుటిలాన్ముఖాత్। కాళీ కరాళ వక్త్రాంతర్నిర్గతా' యని వర్ణన రూపము గలదు 2) చిత్తవృత్తులగు క్రోధాదులు ముఖ్యప్రాణము నాశ్రయించి యుండి, ప్రతీకారానుకూల దేహేంద్రియ బుద్ధి ప్రాణములు గల జన్మయందున, నా క్రోధమే సమిష్టిగ యాకారము వహించిన యంకుశము క్రోధాకారాంకుశము ధరించినట్లుగా లలితా నామముగలదు ధర్మపాలనలో దుష్టశిక్షణా భావము నెంచిన దేవీరూపము

894) ఓం సుమేఖలాయై నమః

మంచి మేఖల కల రూపిణియైన దేవి మేఖలా యన కొండ నడుము, స్త్రీ కటి సూత్రము ఎనిమిది పేటలు గలది వడ్డాణము, నడికట్టు, హోమకుండము చుట్టునుండు మృత్తికాభిత్తి ముష్టిబంధనాది యర్థములు గలవు అందు దేవి నడికట్టు యాభరణము బంగరు వొడ్డాణము యందముగా నొప్పుచున్నది విశేష ప్రభ గల దేవి నడికట్టు స్వర్ణపటుక, పీనస్తనభారమున దేహమునిటూరుగా నుండుట కేర్పరచినదని భావము భూమ్యాకాశముల గలుపుచు చుట్టిన కట్టడమని పెద్దలు అభివర్ణించిరి

గాంధారీ హస్తిజిహ్వా చ ఇడా చైవ శుభంకరీ
పింగలా దక్షసూత్రీ* చ సుషుమ్నా చైవ గంధినీ(134) బ్రహ్మదాత్రీ

895) ఓం గాంధార్యై నమః

గాంధారీ స్వరూపమైనది ముఖ్యమైన ప్రాణవాహక చతుర్దశ నాడులలో గాంధారి యొకటి పైన (891) అలంబుసా వచ్చినది ఈ నాడికి చంద్రుడధిదేవత గాంధారి సరస్వతుల మధ్యము నుండి కుడి చెవి వరకు వ్యాప్తమైన నాడీ విశేషము 2) గాంధార దేశమునకు సంబంధించినది సింధూరము, పార్వతీ, సహచరులలో నొకతె ధృతరాష్ట్రుని యిల్లాలుగా తానును కండ్లకు గంతలు కట్టుకుని పతివ్రతగా వన్నెకెక్కిన గాంధారి గూడా దేవి యంశమే జైనులను శాసించెడు దేవత 3) కాని ముఖ్యముగా దేహస్థిత ముఖ్యనాడుల పరిచయము అటుయిటుగా కానవచ్చును రాబోవు నామములలో హస్తి జిహ్వా, ఇడా, పింగళాదిముఖ్యనాడులుదహరింపబడినవి

896) ఓం హస్తిజిహ్వాయై నమః

హస్తి జిహ్వాస్వరూపిణి. హస్తిజిహ్వ యను నాడి కధిదేవత వరుణుడు ఇడానాడికి తూర్పుగా యెడమ కాలి బొటన వ్రేలివరకు వ్యాపించిన ప్రాణవాహక నాడి జలతత్వం ఈ నాడుల వివరణ జాబాలి దర్శనోపనిషత్తు నందుగలదు ఈ ముఖ్యమైన పదునాలుగు నాడులను గురించి యోగోపనిషత్తులు గలవు మొత్తం నాడులు సుమారు డెబ్బది రెండు వేలుగా పేర్కొనిరి

897) ఓం ఇడాయై నమః

ఇడా స్వరూపిణి త్రివేణి యనబడు ఇడా, పింగళా, సుషుమ్న నాడుల కలయిక స్థానం భ్రూమధ్యమం ఇడాధి దేవత విష్ణువు దక్షిణాయనము సూచించును చంద్రసంచారము ప్రధాన నాడియైన సుషుమ్న నాడికి వామభాగమునందు నెలకొనియుండి ప్రాణ సంచార ప్రధానమైన నాడి. ఇడా, పింగళ సంధి అమావాస్య యనియు, చంద్రగ్రహణ మేపుడేర్పడునని భావము ఇడా కుండలినీ సంధి. అట్టి ప్రాణనాడి స్వరూపిణి

898) ఓం శుభంకర్యై నమః

శుభంకరీ రూపియైన దేవి భక్తులకు శుభములు గలుగజేయు కరుణాస్వరూపిణి 'కరోతుసాన శుభహేతురీశ్వరీ, శుభానిభద్రాణ్యభి హంతు చాపదః' అనంత శుభమునకు మోక్షమును ప్రసాదించునది 'సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమోస్తుతే' యని భావన. 'లక్ష్మీ ప్రదాన సమయే నవవిద్రుమాభాం। విద్యాప్రదాన సమయే శరదిందు శుభ్రాం। విద్వేషవర్గ విషయేపి తమాలనీలాం। దేవీం త్రిలోకజననీం సతతం ప్రపద్యే' యని త్రిగుణా రూపిణి యాచును శుభములు గలిగించును

899) ఓం పింగళాయై నమః

పింగళ నాడి స్వరూపిణి ముఖ్యమైన స్వరూపిణి అధిదేవత బ్రహ్మ ఉత్తరాయణమునందలి సూర్య చారము సూచించును. సుషుమ్న నాడికి దక్షిణముగా నెలకొనియున్న ముఖ్యప్రాణ వాహకనాడియై

యున్నది పింగళా కుండలినీ సంగమము సూర్యగ్రహణ కారకము యని యందురు 2) పింగళ యన రుద్రుడు తత్‌శక్తి పింగళా రుద్రాణి శక్తి సూర్యపార్శ్వవర్తి, వత్సర నామము, నాగజాతుల నొకటి, వామన (కుముద) దిగ్గజము భార్య, సూర్యనాడి, కుడిముక్కురంధ్రము యను వేరు యర్థములు గలవు ఈ నామము పునరావృతం (852) కుడివైపునున్న ముఖ్యప్రాణవాహక నాడి

**900) ఓం దక్షసూత్ర్యై నమః**

దక్షసూత్రరూపిణియైన దేవి సూత్రమునకు సూత్రాత్మ, పంచభూతములకు కారణతత్వము పరమపదము, బ్రహ్మము, సంజ్ఞ పరిభాష, విధి నియమ, ప్రతిషేధాధికారకమైన రూపముయను వివరణ గలదు దక్షపదమునకు 'జ్ఞాతవ్యేషు, కర్తవ్యేషు, వా ఉపస్థితేషు, సద్యయేవ జ్ఞాతుం కర్తుంచ సమర్థే' యని యంట పదునాలుగు భువనములు, సచంద్రార్కాది గ్రహములు, నొక క్రమవిధి కాలచక్రమునందు చాలన చేయుచున్నందున 'దక్షసూత్ర్యై' యని పిల్వబడును పంచకృత్య పరాయణిగా 'భ' చక్రచాలనయామె సంకేతములనే జరుగుచుండును గాన యామె భ చక్ర సూత్ర దక్షచాలన కర్త్రియగును

ఇతి ఆలితంశర కృతి శాలవిభూప్రణాతింత్యత్ర తితితింతితనాతితాత్యాఖ్యా పంచపూర్ణ।

**901) ఓం సుషుమ్నాయై నమః**

సుషుమ్న నాడి స్వరూపిణి సుషుమ్న యను నది ప్రధాన ప్రాణవాహక నాడి దీనినే బ్రహ్మనాడి 'రాకా' యని పిలుతురు పరమశివుడు అధిదేవత వీణాదండము నుండి మస్తకమువరకు వ్యాప్తమై యున్న ప్రాణవాహక నాడి ఈ ముఖ్యనాడులలో నష్ట ప్రకృతి స్వరూపముల నాపాదింతురు పృథ్వి, జల, తేజ, వాయు లాకాశములును, మనో బుద్ధియహంకారాదులు, అధిష్టాత్రులుగా పేర్కొనబడినవి

**902) ఓం గంధిన్యై నమః**

సుగంధి స్వరూపిణి మురయను సుగంధ ద్రవ్య విశేషము దేవి పరిసరము లన్నియు సుగంధయుత పుష్ప భరితములై యుండును 'కర్పూర వీటికాగంధ సుగంధిత దిగంతరామ్, సాంద్రచారిత సంపన్న కస్తూరీ తిలకాంచితాం' యను భావములు వుపాసనలో కనబడును గంధ పరిమళము సానపై మృదుద్రవముగా చేసి లేపనమున, పుష్పాది రూపమున, ధూపనాదుల నెల్వరింపనగు సుగంధ ద్రవ్యములు అంట సేవలో వినియోగపడుచుండును అట్టి అంగలేపనములచే సుగంధ యుతమునైన మేనుగలిగిన పరమేశ్వరి రూపము

**భగాత్మికా భగధరా భగేశీ భగరూపిణీ**
**లింగాఖ్యా చైవ కామేశీ త్రిపురా భైరవీ తథా(136)**

**903) ఓం భగాత్మికాయై నమః**

భగాత్మికయైన పరమేశ్వరి భగవిశేషణముగా గల నామములు వరుసలో వచ్చును ఆ విశేషణమునకు ప్రస్తుతము విస్తృతార్థము నాపాదించుట యావశ్యకము 1) భగమనగా షడ్గుణ సమూహము 'ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్యయశసః శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంభగ' 2) కోశమున శ్రీ, వీర్య, ఇచ్ఛా, జ్ఞాన, వైరాగ్య, కీర్తి, మాహాత్మ్య, ఐశ్వర్య, యత్న, ధర్మ, మోక్ష యోని యను పంద్రెండు యర్థములీయబడినవి 3) 'ఉత్పత్తించ వినాశంచ, భూతానామగతిం, గతించవేత్తి, విద్యామవిద్యాంచ సవాచ్యో భగవాన్' ఇతి అట్టి సర్వజ్ఞానియైన భగుడు ఈశ్వరుడు 4) సర్వజ్ఞత శక్తి నిత్యతృప్తి శక్తి, అనాదిబోధ శక్తి, స్వతంత్రతా శక్తి, నిత్యాలుప్తశక్తి, యనంతతాశక్తి యను యారును భగములనబడును పై భగపరమేశ్వర గుణ విశేషణములన్నియు గలిగి, సదాశివాత్మ శక్తిగా పరమేశ్వరి భగవత్స్వరూపిణి భగాత్మిక యననగును.

**904) ఓం భగధార రూపిణ్యై నమః/భగాధారాయై నమః/భగధరాయై నమః**

భగ యనగా సంపద్ గుణముకు నాధార రూపిణియైన దేవి 'యస్యాస్సమస్తా సురతాసముదీరణేన తృప్తిం ప్రయాతి సకలేషు మఖేషు దేవి స్వాహాసి వైపితృగణస్య చ తృప్తిహేతు రుచ్చార్యసే త్వమత ఏవ జనైః స్వధాచ' యని భగమున యజ్ఞసంపద. స్వాహా స్వధాది హవిరూపములు, వానికి యాధారమైన దేవి భగాధారయన నగును 'ఆధారభూతా జగతస్త్వమేకా' యని యామెయే యాధారము

905) ఓం భగశాలిన్యై నమః

భగశాలిని యైన దేవి శాలినీయన వృత్తమని, శ్లాఘ్య ప్రదయగు స్త్రీయని యర్థము ఐశ్వర్య, సద్గుణ సంపన్నయుక్తమై, ఘనయశస్సు ప్రశంసల నందిన పరమేశ్వరి 'స్తుతాసురైః పూర్వమభీష్ట సంశ్రయాత్తథా సురేంద్రేణ దినేషు సేవితా' యన త్రైలోక్య పాలిని, పావని, పోషిణి యని కీర్తింప బడినది. శాలినీ యన నేర్పు కలిగిన స్త్రీయని భావము

906) ఓం భగేశ్యై నమః

భగములకు ప్రభ్వి యైనది ఐశ్వర్యాది స్వామిని, పై వివరములు గల సంపదలు సద్గుణములకు 'ఈశా' యైన పరమేశ్వరి ఆమె వానికి నిధి, ప్రభ్వి. భక్తులకు ప్రసాదించునది 'విద్యాసు శాస్త్రేషు వివేకదీపేష్వాద్యేషు కాత్వదన్యా' ఆమె స్వాధీన మందే సిద్ధులు సంపదలు వెలుగుచుండును. 'ధర్మావహం, పాపనుదం మహేశి'

907) ఓం భగరూపిణ్యై నమః

భగరూపిణియైన దేవి సుఖము, గృహము, భార్య, సంతానము, సంపదల వలన గలుగుచుండును ఆమెయే శ్రీరూపము స్త్రీరూపము , మాతృరూపము కలసివచ్చు గృహ రూపమునై యున్నది అట్టి భౌతిక సంపదలు, సత్క్రమవర్తనకు తోడుపడగా నాముష్మిక సంపదకును మార్గము చూపించు పరమేశ్వరీ రూపమున వెలుగుచుండును

908) ఓం లింగాఖ్యాయై నమః

లింగమను పేరు గలిగినది లింగము పదమునకు గురుతు శివుని సగుణ రూపములందొకటి వ్యక్తము, వ్యాప్తము, ప్రధానము, ప్రకృతి, మహత్తత్వము, శబ్దనిర్దిష్టతత్వము, అర్థప్రకాశన సామర్థ్యము పుం, స్త్రీ నపుంసక లింగములు గాక పరరూపమైన అలింగత్వమును పేర్కొనదగును లింగ విశేషణములగల నామములు కొన్ని గలవు ఇందు అద్యాయన పేరు గలది యని, అర్ధనారీశ్వర లింగము లింగాఖ్య యుననగును

909) ఓం కామేశ్యై నమః

కామేశ్వరీ స్వరూపురాలైన దేవి కామం యన ఇచ్ఛవచ్చినటుల, అనుమతి, కోరబడినది, వీర్యము మొదలగు యర్థములు గలవు. 'ఏకా, స్వేచ్ఛాచారిణీ, ఇచ్ఛానురూపధారిణీ "రూపైరనేకై ర్బహుధాత్మ మూర్తిం' యనియు, 'స్త్రియస్సమస్తా తవదేవి భేదా' యని దేవి వివిధరూపముల వర్తిల్లును సర్వవాంఛా ప్రదాతగా, సర్వకళా శక్తిగను,ఆమె కామేశ్వరుని యుల్లాలుగను వర్తిలుచుండును

910) ఓం త్రిపురాయై నమః

త్రిపురా రూపిణియైన దేవి త్రిమూర్త్యాది సకల త్రితత్వములకు పూర్వమే యున్నందున త్రిపురా త్రిసంఖ్యా రూపములుగా వెలుగు సకల త్రిత్వములకు పరమేశ్వరి ఆత్మవిద్యా శివతత్త్వములకు, సత్వరజస్తమో గుణవ్యాప్త ప్రీతిరూపులైన, హరిహర బ్రహ్మాదులకు భూమ్యాంతరిక్షస్వర్గాదికి, గంగా యమున సరస్వత్యాది త్రివేణీ కూడలి మొదలగు వన్నింటికిని పరమేశ్వరి

911) ఓం భైరవ్యై నమః

భైరవీ స్వరూపురాలు శివుని యవతారమే భైరవుడు ప్రపంచ సంహార కాలము నందలి రూపము భవానియే భైరవి. విస్తృతముగా దిగ్వ్యాప్త యష్టభైరవ శక్తులుగా బ్రహ్మాది శక్తులను నుపాసన

లింగభవా రూపమునై యున్న దేవి భవా యన పూజ్యారాలు లింగరూపియైన శివుని రూపమే తనదై పూజ్యత గలిగినది భవనామార్థములు శివుడు, సంసారము, సత్తాప్రాప్తి, ఉత్పత్తి, సమృద్ధి, క్షేమమను యర్థములుగలవు అట్టి సృష్టిస్థితి వినాశన కర్త్రియైన దేవి భవ రూపమున గోచరించును

918) ఓం లింగలింగాయై నమః

లింగలింగా స్వరూపిణి భువనములన్నియు తన కుక్షియందుంచుకొని పంచకృత్య పరాయణగా పేరొందిన మహాలింగ స్వరూపిణి అనేక భువనములకు నాధారమైన మహాలింగ స్వరూపిణి యనదగును ఈ నామములన్నియు అద్వైతార్థ లింగరహిత, పరబ్రహ్మ స్వరూప నిరూపణకుద్దేశించిన నామములు 2) గణిత శాస్త్రమున జ్యామితి యందుప్రధానము ముఖ్యస్వరూపములు సూర్యుడు, చంద్రుడు, వృత్తచతురస్రాకారములు, వాని సంయోగమున నేర్పడు రూపములు లింగాకారము చతురముపైవృత్తావ్యాధన దీర్ఘచతురముపైన నర్ధవృత్తమున్నట్లు స్పష్టమగును అట్టి సమైక్య రూపమున నవిభిన్న శివశివారూపములు ద్యోతక మవును అర్ధవృత్తము, అష్టమినాటి చంద్రుని ప్రతీక శివాప్రతీకరము దీర్ఘచతురము శివరూపముగా నెంచిన వాని సంయోగమే లింగరూపము

919) ఓం పావక్యై నమః

పావక రూపిణి 'పావకానః సరస్వతి వాజేభిర్వాజినీవతీ। యజ్ఞం వష్టు ధియావసుః' యని ప్రజ్ఞా దాత్రి పావకమున అగ్ని, అష్టవసువులలో నొకడు. సదాచారి, సప్తవింశతి యగ్నులు, శోధకులు, కుమారస్వామి యను యర్థములు గలవు దుర్గాదేవిని 'జాతవేదసే సునవామ' యని కొలుతురు అటులే 'వహ్ని రపదదౌ రుద్ర్య మగ్నిశౌచం చ వాససీ' యని శుచిత్వము అగ్నిశక్తిగా యుండును చేరినది వ్యర్థమునకు స్వచ్ఛత కలిగించునది. అటులే తాపసికి పవిత్రత చేకూర్చునది 'దర్శనాదేవ ఘ్నంతి పాపకోటయః' అగ్ని దూదిని దహించునట్లు పాపములు దర్శనం చేతనే నశించును అష్టవర్షాత్ భవేత్ గౌరీ, నవవర్షాతు రోహిణీ, దశవర్షా భవేత్ కన్యా, అత ఊర్ధ్వం రజస్వలా రోమదర్శన సంప్రాప్తి సోమోభుంక్త్యథ కన్యకాం, రజోదృష్ట్యా గ్నిః, గంధర్వః కుచే దుష్టాతు పావకః

భగవతీ కౌశికీ చ ప్రేమరూపా చైవ ప్రియంవదా
గృధ్రరూపీ శివారూపా చక్రేశీ చక్రరూపధృక్ (137)

920) ఓం భగవత్యై నమః

భగవతీ రూపిణి. భగమనగా వివరణ (903) ముందు నామముల వచ్చినది అట్టి ఐశ్వర్యయుతమైన దేవి భగవతి స్వరూపిణి 'భగవతీం భిక్షాందేహి' యని పలుపు తల్లిరూపమున నున్న దేవినే యాత్రి యుంచును. శరీర ధాతుబల సంపద, భూగర్భ నిక్షేపములు, అంతరిక్ష జలాది సంపదలన్నియు నామె యధీనములే కృపకలిగిన గాని మానవ మనుగడ లేనిచో కష్టము

921) ఓం కౌశిక్యై నమః

కౌశికీరూపిణియైనదేవి 'శరీరాకోశాద్యత్తస్యా" పార్వత్యా నిస్సృతాంబికా। కౌశికీతి సమస్తేషు తతోలోకేషు గీయతే। తస్యా వినిర్గతా యాంతు కృష్ణాభూత్సాపి పార్వతీ। కాళికేతి సమాఖ్యాతా హిమాచల కృతాశ్రయా' యని కౌశికియే మహాకాళి, యోగమాయ, దేవీమూర్తి, నదిపేరు, వృత్తిభేదము యని నిఘంటువు పేర్కొన యర్థములు అట్టి యోగమాయా స్వరూపిణి

922) ఓం ప్రేమరూపాయై నమః

ప్రేమ స్వరూపిణి ప్రేమయన స్నేహము, భక్తి, సర్వజీవజాతి తన సృష్టియే గాన వానియందు వాత్సల్యము గలది మాతృమూర్తిగా ప్రేమయే ఘనీభవించిన రూపము ఆనంద ఘన రూపిణి చిత్కళా, ఆనంద కలికా, ప్రేమరూపా మొదలగు నవియు యంట సచ్చిదానంద స్వరూపము నెరుక పరుచును 'కళ్యాణవృష్టిభి రివామృత పూరితాభిః కారుణ్య వారిధిభిరంబ భవత్కటాక్షైః' యనియు

'శ్రీమన్మందకటాక్ష లబ్ధవిభవం బ్రహ్మేంద్ర గంగాధరాం త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్' యందురు ప్రేమమూర్తియైన యంబ సర్వమంగళ, మాంగల్య రూపిణి సర్వార్థసాధికయై వెలుగును

923) ఓం ప్రియంవదాయై నమః

ప్రియంవదా స్వరూపిణి ప్రియముగా మాటలాడునది ప్రేమపూర్వకముగా వ్యవహరించునది 'సర్వజ్ఞాతా సరసి వాక్పటుతాం ప్రసూతే" "వాగ్వాదిని వాగ్దేవి యనియు మంజుల భాషిణి, మృదుభాషిణి యని యెన్నో విధముల చెప్పవచ్చును అటులే 'ఈషత్సహాస, మమలం, పరిపూర్ణ చంద్ర బింబాను కారి కనకోత్తమ కాంతికాంతాం" అత్యద్భుతం ప్రహృత మాత్తరుషా, తథాపి వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ' యని మహామాయా స్వరూపిణి భక్తుల యెడ ప్రియభాషిణి, శత్రువుల యెడ హుంకారిణిగా వెలుగును

924) ఓం గృధ్రరూపిణ్యై నమః

గృధ్ర రూపియైన దేవి గృధ యన గ్రద్ద పక్షిరాజు, పేరాశ గలవాడు యని నిఘంటువు, కాని పక్షిరాజైన గరుడుడు విష్ణుమూర్తి వాహనం 'త్వమేవ వైష్ణవీ శక్తి" గరుడోపరి సంస్థితా శంఖ చక్రగదా శార్ఙ్గ ఖడ్గ హస్తాభ్యుపాయయా' గ్రద్ద యెంతో నిశిత దృష్టి గలది పైనుండి నేలపై చరించు చిన్న జంతువులను గూడ పసికట్టు నేర్పరి అటులయు పై లోకముల నున్నప్పటికీ, త్రిలోక వ్యాప్త నిశిత చక్షువులు గలిగియున్నదని భావము అట్టి నిశిత దృష్టి ప్రతీకయైన గృధ్రమునకు ప్రతి రూపముగా నున్నదని భావన శతాక్షి, సహస్రాక్షి, అనంతాక్షిగా వెలుగును

925) ఓం శివరూపాయై నమః/శివారూపా/ శిక్మరూపా

శివరూపిణి యైన దేవి మంగళ స్వరూపియైన దేవి మోక్ష స్వరూపిణి. 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే' యని జీవులకు సకల శ్రేయములు నొసంగునది 'కరోతుసానః శుభహేతురీశ్వరీ, శుభాని భద్రాణి, అభిహంతుచాపదః' త్రైలోక్యహితమునే గోరుచు వాంఛితార్థదాత్రి యగుచు సకల భువన తోషిణిగా శుభంకరి యగు దేవి

926) ఓం చక్రేశ్యై నమః

చక్రేశి స్వరూపిణి శ్రీచక్రమందు 'బిందు, త్రికోణ, వసుకోణ, దశారయుగ్మ మన్వస్ర నాగదళ షోడశ పత్రయుక్తము వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ' యని రూపము నవచక్రాధీశ్వరి సర్వత్రైలోక్య మోహన చక్రం, సర్వాశాపూరి పూరక చక్రము, సర్వ సంక్షోభిణ చక్రం, సర్వసౌభాగ్యదాయక చక్రం, సర్వార్థ సాధక చక్రం, సర్వరక్షాకర చక్రం, సర్వరోగహర చక్రం, సర్వసిద్ధిప్రద చక్రం, మహామహా శ్రీచక్ర నగరస్వామినియైన దేవి భండాసుర వధార్థము గూడ లలితాంబిక సర్వశక్తులను వివిధ చక్రస్థానముల ప్రతిష్ఠించి యుద్ధము చేయించినది

927) ఓం చక్రరూపధృతవే నమః

చక్రరూపము ధరించిన దేవి చక్ర రూపమున తన విభూతులను ప్రతిష్ఠించి మణిద్వీపమున 'ఏకా' రూపియై సదాశివ పర్యంకోపరి సుఖాసీనయై వెలుగుదేవి స్వరూపము చక్రరూపము ధరించినటులే యున్నది విశ్వమందలి గోళములన్నియు ఉత్తరధృవము యాధారముగా తిరుగుచున్నట్లు కానుపించును ఆయా కక్ష్యలను భ్రమణమును చక్ర చలన స్వరూపమే విశ్వభ్రమణ, చాలకశక్తిగా నంబయే చక్రరూపము ధరించినట్లుగాన నగును

ఆత్మయోని బ్రహ్మయోని ర్జగద్యోని ర యోనిజా
భగరూపా భగస్థాత్రీ భగినీ భగమాలినీ*(138) రూపిణీ

928) ఓం ఆత్మయోన్యై నమః

ఆత్మయోని స్వరూపిణి. 'ఆత్మావా అయోనిశ్చ ఆత్మయోని, సర్వస్యాత్మా సర్వస్యయోని' 'త్రికోణ రూపిణీ శక్తిర్బిందు రూప శివస్మృతః' శ్రీచక్రముందలి బిందువును యోని చక్రముయందురు యోనియన కారణము పరమేశ్వరి సమస్త జగత్తునకు కారణభూతః "హేతు స్సమస్త జగతాం జగదంశ భూతం అవ్యాకృతాహి పరమాప్రకృతిస్త్వమాద్యా' ఆత్మయోని తనకు తానుగా విచ్చుగల రూపమును ధరించునది 'విశ్వేశ్వరి త్వం పరిపాసి విశ్వం, విశ్వాత్మికాధారయసీతి విశ్వం, విశ్వేశ వంద్యా భవతీభవంతి, విశ్వాశయా యేత్వయిభక్తినమ్రాః" విశ్వయోని స్వరూపమామెయె, సవితాప్రకృత్, విశ్వవిదాత్మయోని'

929) ఓం బ్రహ్మయోన్యై నమః

బ్రహ్మయోని స్వరూపిణి. బ్రహ్మాండముందలి సకల చరాచర సృష్టికి యాధారభూతమైనది బ్రహ్మవిష్ణు రుద్రగ్రంధుల కావల సహస్రారాంతమునందు ప్రాణముల స్థిరీకరణకు నీ మార్గముండే ప్రాణములు పయనించవలసి యున్నది. పరబ్రహ్మ స్థానమే సచ్చిదానంద స్థితి పరబ్రహ్మ తాదాత్మ్య స్థితి సూక్ష్మప్రాణ శరీరమున గాని సాధ్యము గాదు 'అపరస్య బ్రహ్మం వేదానాం వాయోనిః' కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిం' నాలుగు ముఖములు, నాలుగువేదములు, పంచముఖమున నోంకార జన్మ.

930) ఓం జగద్యోన్యై నమః

జగద్యోని స్వరూపిణి. సకల చరాచర జగత్తు నందువ్యాప్తయనేక కోట్ల జీవుల సృష్టిస్థితి వినాశక్రమము పరమేశ్వరి యధీనముననే జరుగుచుండును భువనములు గూడ ప్రళయాంతమున నశించగా క్రొత్త సృష్టి యంబ కృపాలేశముననే జరుగుచుండును జగద్యోని, విశ్వయోని యని యిచ్చువచ్చిన రూపున సృష్టి చేయుచుండును 2) దీనినే కాలాకాశరంధ్రములు (బ్లాక్‌హోల్) యని యందురు ఉత్తర అమెరికాకు తూర్పుగా నొక జలయోని గలదు అయా ఆవరణలో ప్రవేశించిన జలవాయు వాహకము లన్నియు తెలియని యఘాతమునకు నాకర్షింపబడి చొచ్చుకొని పోవును అటులే యాకాశము నందు నేర్పడు మహత్ శూన్యము జగద్యోని స్వరూపము సాధారణ దృష్టికానగనిది వాచామగోచరం అట్టి యలౌకికంబగు పెంజీకటి స్వరూపిణియైన దేవి

931) ఓం అయోనిజాయై నమః

అయోనిజ స్వరూపిణి, 'పరమార్థత సర్వ ప్రపంచ కల్పకత్వరహిత, స్వాత్మస్థ'మని భావము- యోనిమార్గమున వెల్వడక స్వచ్ఛందముగా నుద్భవమైన శక్తియని ఆమె ఆద్యా పురాతనీ, సనాతనియని యెరుకగల త్రిమూర్తులు దేవతల కంటె 'ఏక'రూపమున పరిఢవిల్లిన పరదేవత అసుర బాధల తాళలేక త్రిమూర్తియుతమైన దేవతల తేజస్సు నుండి యుద్భవించిన సంకలిత మహత్తేజోమూర్తి సర్వాయుధ ధరగా పరమేశ్వరి ప్రకాశితమైనది అపై దేవతలు హిమాలయముల చేరి ప్రార్థింపగా సింహస్థయై గౌరి ప్రసన్నురాలయినది కౌశికి, కాళి, సరస్వత్యాది రూపములెన్నో తనకు తానుగా ధరించి దైత్యుల బాధల నుండి లోకముల రక్షించుచుండును

భగాత్మికా భగాధారా రూపిణీ భగమాలినీ
లింగాభిధాయినీ లింగప్రియా లింగనివాసినీ(139)

932) ఓం భగరూపాయై నమః

భగస్వరూపిణియైన దేవి భగపదమునకు వివరణ (903) పూర్వమే వచ్చియున్నది ముందు పదముల యర్థమే. అట్టి భగదిప్పైన ఐశ్వర్య, వీర్య, యశో, స్వరూపయై యంబ భక్తులకు ననంత విభూతి ప్రసాదించుచుండును సమస్త లోకసంపదలును నామె యధీనమై యుండును

933) ఓం భగస్థాత్ర్యై నమః

భగరూప సంపదల స్థిరీకరించునది ఏ జీవికి నెంత యైశ్వర్య, వీర్యాదులు కలుగవలెనో నంతమేరకే యనుభవయోగ్య మగుచునుండును సంపదలనేక రూపములు, జల, వాయు, వోషధి, రత్నాది, గృహ, ఆభరణ పరికరములన్నియును వివిధ యైశ్వర్య రూపములే అంబ కరుణచే నవిచ్ఛిన్న సంతతియుగల్గును జీవుల పాప పుణ్యములను బట్టి జన్మనిర్దేశము, సంపద నిర్దేశము నామె యేర్పరచు విధి విధానమునమసరించియే ప్రాప్తించుచుండును 'పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాజావి గోరథం ప్రజానాంభవసి మాతా ఆయుష్మంతం కరోతుమాం' యని ప్రార్థన.

934) ఓం భగిన్యై నమః

భగినీ రూపమైన దేవి స్త్రీయస్సమస్సా తవదేవి భేదాఃయని యింటి ముందు పారాడు బాల, సోదరి, తల్లి, నాయమ్మ (వృద్ధా) సహచరీ రూపముల వర్తిల్లుచుండును. అందు భగినీ స్వరూపమొకటి. సోదరిగా నెంతో ప్రాముఖ్యము గలదు గ్రీకు సాహిత్యమునందును అంటిగోని భర్త సోదరుని మధ్య ప్రాముఖ్యత నిర్ణయములో భర్తగా ప్రస్తుతమున్నవాడు గానిచో మరియొకడు లభించగలడుగాని సోదరుడు తల్లి గర్భమునుండి జన్మించినవాడు మరియొకడు సోదరసమముగా లేడుగదా! అట్టి విశిష్ట భగినీ భావన మన దేశమందును గలదు ఆడుబిడ్డను రెండు కులముల పదునాల్గు తరములనుద్ధరణకై కన్యాదాన సమయమున స్పష్టపరచి వరుని కర్పింతురు వారసత్వమున గూడ పుత్ర, పౌత్ర దౌహిత్రుని క్రమమున వారసులలో సహజ సంతతిగా దౌహిత్రుడు వచ్చును

935) ఓం భగధారిణ్యై నమః / ఓం భగమాలిన్యై నమః

భగధారిణీ రూపము, సర్వ సంపదలు తనయందె ధరించు ధరణిగాను, సకల జల సంపదలు నోషధి, శుక్రశోణితములు ధరించు యంతరిక్షముగాను, యంబ జగదుత్పత్తి స్థితి పోషకిగా నలరారును 'మహీస్వరూపేణ యతః స్థితాసి అపాం స్వరూప స్థితయా, త్వయైతదాప్యాయతేఃయనియు త్వంవైష్ణవీశక్తి రనంత వీర్యా విశ్వస్య బీజం పరమాసి' యని సర్వ సంపదల నిధి

936) ఓం లింగాభిధాయిన్యై నమః (908)

లింగాభిధాయినియైన దేవి, అభిధాయన పేరు, భావన, శబ్ద శక్తి, అభిధావృత్తి లింగాఖ్యాయైయను నామము (908) పూర్వము వచ్చినది లింగమందారోపింపబడిన శక్తి స్వరూపిణి, లింగముయన సంకేతము యారోపితార్థము గలది సగుణోపాసకులు రూపమొకటి కల్పించి యుపాసింతురుగదా

937) ఓం లింగప్రియాయై నమః

లింగ ప్రియత్వము గల్గినది మహా విద్యా మహామాయా మహామేధా మహాస్మృతి, మహా మోహాచ భవతీ మహాదేవీ మహాసురీ మహేశ్వరియును, ఒకరికొకరికి ప్రేమ యనుబంధముయను భావన గల్గించుటలో దేవి క్రీడల నెరుగలేము పురుషస్త్రీ జాతుల సృష్టించి, పరస్పర ప్రేమ గల్పించి, లింగల రూపమున స్థిరీకరించి జగత్ పాలన చేయుచుండును (2) లింగము మహేశ్వరుడు - తత్ ప్రియమైన శక్తి పరమేశ్వరి. అట్టి సంసార మాయాజాలమున పరిభ్రమించు జీవి, పరమేశ్వరి యెరుక గననంతవరకు జనన మరణ చక్రమున మునుగుచు తేలుచును ప్రయాణించుచుండును 'పునరపి జననం పునరపి మరణం '

938) ఓం లింగ నివాసిన్యై నమః

లింగరూపమునందుండునది పరమేశ్వరుడు అర్ధనారీశ్వరుడు పరమేశ్వర చిహ్నమైన లింగము పరమేశ్వరి యొక్క అభిన్న స్వరూపమే అట్టి లింగ స్వరూపుడైన పరమేశ్వరునితో పాటు యునికి గలిగినట్టి పరమేశ్వరి రూపము ధ్యానించుచుందురు.

లింగస్థా లింగినీ లింగరూపిణీ లింగసుందరీ
లింగగీతి మహాప్రీతి భగగీతి మహాసుఖా(140)

939) ఓం లింగస్థాయై నమః (914)

లింగస్థయైన రూపము ఈ నామము పునరుక్తి (914) శివశివా రూపములయ భేద తత్త్వము

నుపదేశించును లింగస్థయై పరమేశ్వరియుండును లింగము శివుని సంకేత చిహ్నము ఆ శివుని శక్తియునైన శివా, యందే యవి భిన్నముగా నిలిచియుండునది

940) ఓం లింగిన్యై నమః

లింగినియైన దేవి రూపము. సంకేత స్వరూపమేయైన పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణి ఇది జీవాత్మ పరమాత్మల పరబ్రహ్మైక్య సంయోగ స్థితిని సూచించును నిత్య సచ్చిదానంద స్వరూపులుగ నేకీభావము చెందియున్న పరమేశ్వర పరమేశ్వరీ యుగళ స్థితియందు స్వరూప దర్శనము అట్టి పరబ్రహ్మ స్వరూపిణి పరమేశ్వర మహిషి యేకరూపిణియై లింగినిగా కన్పట్టును

941) ఓం లింగ రూపిణ్యై నమః

లింగ రూపిణియైన దేవి లింగ రూప దృశ్య లింగరూపిణి జీవజాలమున నాయా లింగ రూపముల నెలకొన్న యహంతా శక్తి స్వరూపిణియై క్రీడించుచుండును అటులే, వుపాసనా క్రమమునకు విభిన్న లింగ స్వరూపిణిగా ధ్యానించనగును

942) ఓం లింగ సుందర్యై నమః

లింగ సుందరియైన దేవి లింగయన ఈశ్వర రూపము ఈశ్వరుని యిల్లాలు సుందరియని త్రిపుర సుందరి మహాత్రిపుర సుందరి 'నిమ్నా నిమ్నత రాశేష నిమ్నేష్వస్తి' సుందరీ స్వరూపిణియైన పరమేశ్వరి క్రీగంటి చూపుననే ముల్లోకముల వశము చేసికొని యున్నవర్తిలు మహా సత్త్వసంపన్న

943) ఓం లింగ గీత్యై నమః (912)

లింగగీతి రూపిణీ, పునరావృత్తి (912), సదాచార క్రమము, ఉపాసనా విధానములు సాంఖ్య యోగాదికము నిర్దేశించు గీతా పఠనముచే, బ్రహ్మతత్త్వము గ్రహించి మోక్షమందుటకు నర్హులుగా గలరు అట్టి విద్యాసుశాస్త్రేషు వివేకదీపే ష్వాద్యేషు వాక్యేషు కాత్వదన్యా' యని సక్రమ మార్గమును నిర్దేశించు పుస్తక రూపిణియైన దేవి

944) ఓం మహా ప్రీత్యై నమః

మహా ప్రీతిగల దేవి ప్రీతియనయాసక్తి. మహాసక్తియని లలితానామము మహత్‌యన బ్రహ్మము, బ్రహ్మమునందు ప్రీతిగల్గినది పరబ్రహ్మమునంద భేదభావముగలది బ్రహ్మమునందదృష్టమైన మనముగలది (2) శ్రీదేవి కామేశ్వరుని నామ రహస్యమును గ్రహించుటయే యుత్సవ రూపము అట్టి వుత్సవమందాసక్తి గలది. మహాకామేశునితో యవిభిన్నరూప వుపాసనా విధిని ప్రీతి చెందునట్టిదేవి (3) స్థూల సూక్ష్మ కారణ శరీర వాసనాక్షయమై సహస్రారాంతర్గత జ్యోత్స్నా మండల స్వరూపమందు సాక్షిగా మండల స్వరూపమందు సాక్షిగా వెలుగు చిత్కళారూపమే యంట అట్టి సంశయ విపర్యయ రహిత జ్ఞానమందు ప్రీతిగల్గియుండు పరమేశ్వరి

945) ఓం భగగీత్యై నమః

భగగీతి స్వరూపిణి భగయన సూర్యుడు సూర్యుడు శ్రీవిద్యా పంచదశాక్షరి మంత్రము నుద్ధరించి పరమేశ్వరుని సాక్షాత్కారము చేసికొనినవాడు దాననే సూర్యునికి గ్రహ మండలాధిపత్యమును, సకల లోకారాధ్యుడగు ప్రత్యక్ష దేవతగాను, మహత్తేజము సంప్రాప్తమైనది ఆ సూర్యునియందే 'బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరః సాయంకాలే స్వయం విష్ణుః, త్రిమూర్తిశ్చ దివాకరః' యని త్రిమూర్తుల శక్తులాపాదింపబడినవి అట్లే గాయత్రీ, సావిత్రీ సరస్వతీ స్వరూపములుగా నాయాదిత్య శక్తినే ద్విజులు వుపాసించుచుందురు అట్టి పరమ పవిత్రమైన శక్తి సంబంధ వుపాసనా క్రియయు, మంత్ర పాఠమునను జీవులు యిహమునందు సుఖముల నందుచు పరమునందు సాయుజ్యాది మోక్షప్రాప్తికి సోపానములైన యర్చనాదులచే దేవికి ప్రీతిగల్గింతురు అదియే భగగీతి స్వరూపము

946) ఓం మహాసుఖాయై నమః

మహా సుఖ స్వరూపిణియైన దేవి సుఖముయైన ఆనందస్థితి అంటు సచ్చిదానంద స్వరూపిణి అదియే మహాసుఖస్థితి శివశక్త్యైక్య స్థానము పరబ్రహ్మ స్థానమునందు మనసునైక్యము చేసి యవిచ్ఛిన్నయమృతధారల గ్రోలు సుఖము అపరిమితమైన యానందమును ప్రసాదించును. ఐహికమైన సుఖము వ్యక్తిగతము ప్రపంచ సంబంధమైనది అష్టవిధములైన గృహము, శయ్య, వస్త్రము, ఆభరణములు, స్త్రీ పుష్పగంధ తాంబూల సేవనాదులు ఐహిక సుఖములు తాత్కాలికములు మహాసుఖము పరమేశ్వరి యుపాసన చేతనే గల్గును

లింగనామ సదానందా భగనామసదారతిః* గతి
భగనామ సదానందా లింగనామద సదారతిః(141)

947) ఓం లింగనామ సదానందాయై నమః

లింగనామ శ్రవణమున సదానందమందు దేవి పరమేశ్వరి సదా తన పతియైన సదాశివుని వీరచరితలు వినుటయందాసక్తత చూపి, సదా శ్రవణ సుఖమును యనుభవించుచుండును ఆ శక్తియు తనదేయైనను పరమేశ్వరుని కృతమని పల్కిన నామెకెంతయో యానందము గల్గుచుండును అట్లే లింగ స్వరూపుడైన పరమేశ్వరుని యర్చన, నామ సంకీర్తనములు, సహస్ర నామపారాయణముల, నత్యంత ప్రీతినందుచు ఈశుని నామశ్రవణమున దేవి సదా ప్రీతిచెందుచుండును అట్టియ విభిన్నరూపియైన దేవి।పరమేశ్వరార్పణమస్తు–యన నానందించుచుండును

948) ఓం భగనామ సదారత్యై నమః

భగనామమందు సదా యాసక్తిగలది భగుడనగా సూర్యుడు సమగ్రమైశ్వర్య ధర్మ, యశ, శ్రీ, జ్ఞాన, వైరాగ్య స్వరూపములును, అణిమాది యష్టవిధములైన నైశ్వర్యములు, చంద్రుడను యర్థములుగలవు చంద్రాంశయు గలిగినట్టి రుద్ర/ అగ్ని రూపియైన పరమేశ్వరుని నామముల పఠన పాఠన, శ్రవణ, మననమున సదా కాలము గడుపుచుండును అట్టి పరమేశ్వరుని నిత్యయనుభూతినంది పరమేశ్వరి ఆనంద స్వరూపిణిగా నాసక్తి గల్గి వెలుగుచుండును రతియనగా నేకాగ్ర భావము గల్గియుండుట

949) ఓం భగనామ సదానందాయై నమః

భగనామమునందు సదా యానందించునది పై భావమునకు యనుబంధమైన నామమే పరమేశ్వరుని చరితలు వినుటయందు గల్గు బ్రహ్మానందానుభూతిని పరమేశ్వరి కాలాతీతముగా వ్యవహరించుచుండును ఆనందాంబుధి అచట నిత్య కామేశ కీర్తన పారాయణ శ్రావ్యముగును ప్రాణశక్తి సంచారమునకు సంస్తుతి 'రక్తాంబుధిస్థపోలోకలసదరుణ పరోజాధి రూఢాకూర్ధ్వ'యని 'దేవిం బాలార్క (భాసా) వర్ణాంభవతు సుఖకరీ ప్రాణశక్తి పరాను'యని సుఖకరమునైన ప్రాణశక్తి స్వరూపిణి.

950) ఓం లింగనామ సదారత్యై నమః

లింగ నామమందు సదారమించునదేవి పై లింగనామ సదానందాయన పదమునకు యనుబంధము, లింగమున పరమేశుడు ఆ పరమేశుని నామపఠనచే పరమేశ్వరి ప్రీతిచెందుచుండును సదా తన్నామ పఠన, శ్రవణ, మననములందాసక్తి గల్గిన పరమేశ్వరి కారణానంద విగ్రహ రూపియై వెలుగుచుండున

లింగమాలాకరా* భూషా భగమాలా విభూషణా కంఠ
భగలింగా మృతవృతా* భగలింగామృతాత్మికా (142) ప్రీతా

951 ఓం లింగమాలాకంఠభూషాయై నమః/లింగమాలాకరా భూషాయై నమః/ ఓం
లింగమాలా విభూషణాయ నమః (యను మూడు రూపములు గలవు)

లింగమాలా కంఠమునందు భూషణముగా ధరించియున్న పరమేశ్వరి లింగము పరమేశ్వరుని

చిహ్నము పృథివ్యాది శిలలను పరమేశ్వరుని ప్రతీకగా నర్చించుట గలదు అట్టి లింగరూప చిహ్నముల మాల, వరుసలు గుచ్చి కంఠమునందు యలంకరించు చుందురు అటులే పరమేశ్వరియు తత్ చిహ్నిత విశేష రత్నముల మాలలను కంఠము నందలంకారముగా ధరించి యున్నదని యర్థము

952 ఓం భగమాలా విభూషణాయై నమః

భగమాలా విభూషణములు గలిగిన దేవి భగమున నైశ్వర్యము ఐశ్వర్య ప్రదాతలైన జాతి రత్నములు మాలగా గలిగి చింతామణి సకల కోర్కెల నిచ్చునటువంటి విశేషరత్నము ప్రధాన మణిగా సమర్చి యున్నట్టి విశేష భూషణములు ధరించి యున్న దేవి నవరత్నములు ధరించిన నవ్వి శరీరమునకు విశేష తేజము గల్గించు సామర్థ్యము గలవియగును భూషణములు కంఠముననే గాక వివిధ యంగముల నాభరణములు మణి కిరీటము మొదలగు నవి సర్వాంగముల విభూషణములు గల్గిన దేవి సర్వాలంకార యుక్తగా వెలుగును

953 ఓం భగలింగామృత ప్రీతాయై నమః/భవలింగామృత ప్రీతాయై నమః

భగలింగామృతమునందు ప్రీతి గలది భగమున వీర్యము మోక్షము యని యర్థములు గలవు లింగమున పరమేశ్వరుని చిహ్నము మోక్షదాయక, వీర్యలింగ స్మరణ సేవనాదుల వలన గలుగు యమృత భావనల యందు ప్రీతి గలిగినట్టి పరమేశ్వరి స్వరములకు నధిదేవతలుగా నమృతాది శక్తి సముదాయముండును అట్టి వాగ్రూప స్వరోచ్చారణ యమృతము స్రవించుచుండును అంతట మోక్షప్రదాతయైన పరమేశ్వరుని కీర్తనామృతమున దేవి ప్రీతి గలిగియుండును

954) ఓం భగలింగాత్మికాయై నమః

భగలింగామృతాత్మికయైన దేవి పై నామ వివరమును బట్టి మోక్షప్రదాయకమైన లింగోపాసనచే గలుగు యమృత శక్తియే యాత్మగా గలిగిన పరమేశ్వరి స్వరూపిణి పరమేశ్వరుని మృత్యుంజయుడని 'ఓం జూంసః' యను మంత్రము యపమృత్యు నివారకమనియు, 'త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్' అని అందురు అట్టి పరమేశ్వర ప్రాప్త అమృతత్వమే యాత్మగా వెలుగు దేవి స్వరూపము. నెంచ సులభ మోక్షము లభించును

భగలింగార్చన ప్రీతా, భగలింగ స్వరూపిణీ
భవ లింగ స్వరూపా చ భగలింగ సుఖావహా(143)

955) ఓం భగలింగార్చన ప్రీతాయై నమః

భగలింగార్చనయందు ప్రీతి గలది భగలింగము యవిభక్త శివశివా రూపము విష్ణుమాయా స్వరూపిణియైన శివా, శివుని సంయోగముచే నేర్పడినది పానువట్టయుత లింగరూపము అట్టి యభేద శివశక్తి యర్చనాదులచే పరమేశ్వర ప్రీతి చెందుచుండును ఉపాసనా, విభిన్నాంగముగా పరమేశుని నమక, చమకార్చనాదులను, నుపాసనా కర్మయందిమిడి యున్నది. పరమశివుని అర్చించి స్థాపన చేసి యాపై శ్రీచక్రార్చనకు ఉపక్రమింతురు

956) ఓం భగలింగ స్వరూపిణ్యై నమః

భగలింగ స్వరూపిణియైన దేవి భగలింగమున నైశ్వర్య యుక్తము సూర్యకోటి సమ ప్రకాశము, చంద్రకోటి సుశీతలమునైన లక్షణములు గలిగిన పరమేశ్వరి దైవ రూపము ఏకా★ కారమునై నిర్మల ప్రకాశజ్యోత్స్నాయుత పరబ్రహ్మ స్వరూపము

957) ఓం భగలింగ స్వరూపాయై నమః

భగలింగ స్వరూపము గల దేవి పునరుక్తి వలన విశేష ప్రభావము స్వరూపిణి యన యామెయే ప్రకాశమూర్తి యని స్వరూపాయన నట్టి తుల్య విశేష ప్రకాశము గలదియని పరమేష్ఠి యొక్క యంశల వెలుగు సకల జీవసముదాయమందు యామె స్వరూపము చూడగలుగుట యావశ్యకము సృష్టి

యందలి సకల జీవజాలములు బ్రహ్మస్వరూపమే. చండాలుని, శునిని, మట్టిని, బంగారమును ఒకే దృష్టితో గాంచుట యన పంచభూత సమహితత్వ మనబడును

958) ఓం భగలింగ సుఖావహాయై నమః

భగలింగ ప్రాప్త సుఖావహ రూపిణియైన దేవి అంతయు తనకే కావలెనను కొనక సుఖ సంభారముల ప్రాప్తి కల్గి నంతవరకే యనుభవించి యాత్మ తృప్తి నందుట ప్రాణపోషణ కవసరమున్నంత వరకే జీవికి సుఖానుభవమావశ్యకము భౌతిక సుఖముల కంటే మనసును ఆ పరబ్రహ్మయందులగ్నము చేసి యఖండ సచ్చిదానంద సుఖమును అనుభవించుట శాశ్వతమని యెరుంగవలెను అట్టి శాశ్వత సుఖప్రదాది పరమేశ్వరి యని యెరింగి భగలింగ స్వరూపిణిగా ధ్యానించవలెను

స్వయంభూ కుసుమ ప్రీతా స్వయంభూ కుసుమార్చితా
స్వయంభూ కుసుమ ప్రాణా స్వయంభూ కుసుమార్జితా(144)

959 ఓం స్వయంభూ కుసుమప్రీతాయై నమః

స్వయంభూ పద నిర్వచనము ఈ పదము విశేషణము రాబోవు యొకటి నాలుగు నామముల యందును వర్తించును విశేష నిర్వచనము ప్రస్తుతము చేయ, నన్నింటికిని సమన్వయ పరచుకుని భావగ్రహణము చేయవలసి యున్నది. (అర్థతత్త్వోత్తర నామపూజా) 1 స్వయమేవ భవతి, నాఽపరో భావయతి। యేషాముపరిభవతి, యశ్చోపరిభవతి, సస్వయమేవ భవతి'' ఇతి స్వయంభూ' పరమేశ్వరి, స్వతంత్ర, పరతంత్ర యని నిర్వచనము తనకు తానుగా నుద్భవమైన పరతంత్రము గాని స్వేచ్ఛాశక్తి

1 స్వయంభూ యన చతుర్ముఖ బ్రహ్మ తనంత తానుగా వ్యక్తమగుచుండెడి యనంత రూపి పరమాత్మ అపౌరుషేయము కాలము, మన్మథుడు, స్తనములు, జిన చక్రవర్తి యని యర్థములు గలవు అనగా ప్రకృతి యందు స్వతస్సిద్ధముగా నుద్భవమందు వివిధ ఫలప్రసూన సముదాయము వీనితో బాటుగా స్వతః సిద్ధముగా మనోబ్జమందు వెలువడు స్వచ్ఛ నిర్మల భావయుక్త వాక్ ప్రసూన వీచికలును యననగును దేవి యందు మనసు లగ్నము చేసి వెలువరించు యుదాత్త భావనల సముదాయ ప్రసూనములే దేవి మానస పూజాస్తోత్రమునందు నన్ని యుపచారములు మనోకల్పితములే 'రత్నైః కల్పితమాసనం' యని భావయుక్త ఆసన, ఉద్వర్త నాదులు నన్నియు కల్పితములే లేదా దిగ్వ్యాప్త దేవి రూపమున కంత విశాల వస్త్ర సమర్పణ యెట్లు చేయనగును కాన మానసభావన, ఉపాంతుకంటె శ్రేష్ఠతర మందురు తమకు తాముగా నుద్భవమైన కుసుమముల నర్పించుటచే ప్రీతిచెందు పరమేశ్వరి నెంచనగును సూర్యోదయముననే విస్తరించి పరిమళించునవి కొన్ని, మధ్యాహ్నమునకుప్రఫుల్లములగునవి కొన్ని, రాత్రి సమయములందు నందమొప్పగా విప్పారునవి కొన్ని, కొన్ని దివసమంతయు పరిమళించునవి మరికొన్ని పర్యుషితమైనను దోషము లేనివి అట్టి కుసుమములు నాయా వేళల పూజ యందు వినియోగించిన యంబకు ప్రీతిగలుగుచుండును కొందరు భక్తులు క(తి)న్నప్ప కనులు పెరికి యర్పించుట, రావణాసురుడు శిరఃప్రసూనముల నర్పించుట, విష్ణువును సహస్రమునకు నొక్కటి తక్కువైన, తన నేత్రకమలములచే నర్చన ముగింప చేయతలపెట్టుట మున్నగునవి గమనించినచో శరీరమే స్వయంభూ రూపము, శిరస్సునందలి సహస్రదళ కమలము, భగవదర్పిత యోగ్యమని భావించినందుననే, నరబలి రుధిర పానము లోకయంగముగా పూజా విధియందు చేరి యుండవచ్చును రాజపుత్ర స్త్రీలును తమ భర్తలు యుద్ధమందు వీరమరణము పొందగానే, జాతవేదసరూపమైన యగ్నిగుండమునందు దూకి తమ ప్రాణముల నొసంగుట, సభర్తృక త్యాగమున పృథ్వీమాత ఋణము దీర్చుకొను భావన ప్రస్ఫుటమగుచున్నది గదా అటులే కొన్ని కథలయందు జనహితమునకై యున్నత వంశ సంజాతులు, యంగహీనత లేని సకలగుణయుత పురుష ప్రసూన శీర్షముల బలినొసంగుట గలదు పద్మపాదుని

కథ: కాపాలికుడు శంకరుని శిరమర్పింపనెంచగా శంకరుని ప్రియ శిష్యుని యందు నృసింహ రూప మావేశమై కాపాలికుని చంపి యాచార్యుల రక్షించెను సాత్విక పూజాప్రసూనములచే చేయనగును త్రికాల పూజలకు త్రికాల ప్రస్ఫుటమగు ప్రసూనముల సేకరించి యర్పించుట విధియై యున్నది. అటులే నాయా ఋతువులలో స్వయంభువులైన ప్రసూనములచే భగవదర్పణము చేసిన పరమేశ్వరి ప్రీతినందును

960 ఓం స్వయంభూ కుసుమార్చితాయై నమః

స్వయంభువులైన కుసుమములచే నర్చింపబడు పరమేశ్వరి అర్చనయందున నక్షతలు, మణి మాణిక్యములు, ముత్యములు ప్రసూనములను విధివిధానమర్పించి పూజ సేతురు పై వివరించిన సమయములు, సమయానుకూల యర్చన చేసినచో దేవి ప్రీతి చెందును

961 ఓం స్వయంభూ కుసుమ ప్రాణాయ నమః

స్వయం భూ కుసుమములు యందలి జీవంత సౌందర్యమే దేవి దత్తమైన ప్రాణ స్వరూపము. కుసుమములు సేకరించుటలో పూర్ణ వికసిత కుసుమములు, సర్వాంగ పూర్ణమైనవి (రెక్కలు రాలనివి, ధూళి తగులనివి), శుచి యైనవి, రేక నిర్మాణ లోపము గలవానిని త్యజించ వలెను చెట్టు పూలన్నియు కోయక కొన్నింటిని చెట్టునే వదల వలెనందురు ఆ కుసుమములు ప్రాణయుతములు కుసుమ సుకుమార గంధతత్వమే దేవి ప్రాణ స్వరూపము అననగును

962 ఓం స్వయం భూ కుసుమోద్ధితాయ నమః

స్వయం భూ కుసుమముల నుద్భవ శక్తి స్వరూపమై యున్న దేవి ఉద్ధిత యన పైకి పెరుగునట్టి శక్తి కొమ్మలకు రెమ్మలు, రెమ్మలకు యంకురము, నాపై మొగ్గగా నగుటయు నది ఋతు సమయముల ప్రసూనముగా మారుట మొదలగు పరివర్తన లన్నియును ప్రకృతి సహజసిద్ధమైన క్రియా స్వరూపములే. ఆ ప్రసూనములే కొంత కాలమునకు గింజలు, కాయలుగా మారి పండి రాలిపోవును కొన్ని వాడి భూమిపై పడును అట్టి యుద్భవ శక్తి దేవి విభూతియే అట్టి కుసుమావిర్భావ శక్తి సమయమును కల్పించి దేవి ప్రకృతి కందము కల్పించును

స్వయంభూ కుసుమ స్నాతా స్వయంభూ పుష్పతర్పితా
స్వయంభూ పుష్పఘటితా స్వయంభూ పుష్పధారిణీ (145)

963 ఓం స్వయం భూకుసుమస్నాతాయై నమః

స్వయం భూ కుసుమములచే స్నాతయైన పరమేశ్వరి. స్నానము జల కణములచే పూర్తియైన తర్వాత పట్టు వస్త్రాలంకరణ, సుగంధాదిలేపనములు, నాపై కుసుమములచే సర్వాంగ పూజ జరుపుట, కుసుమములచే నారాధింప బడుట, అట్టి కుసుమములచే పూజ లందుకొనుచున్న పరమేశ్వరి స్వరూపము భక్తులకు వాంఛితార్థము లిడుచుండును

964 ఓం స్వయం భూ పుష్పతర్పితాయ నమః

స్వయం భువులైన పుష్పములచే తర్పణ చేయబడు పరమేశ్వరి తర్పణ యనగా తృప్తి, తనివి, పితృల కుద్దేశించిన యుదక దానము తృప్తి పరచుట, యజ్ఞసమిధ మొదలగు యర్థములు గలవు పుష్పముల సమర్పణ చేసి దేవి తృప్తి నొందును కుసుమములచే యంగపూజ గాక, పూజావసానమున గూడా ఆపాం పుష్పమంత్ర పుష్పాదుల రూపమున దేవికి యర్చన చేసి తృప్తి పరచుచుందురు తృప్తియైన దేవి భక్తాభీష్టముల నెరవేర్చుచుండును

965 ఓం స్వయం భూ పుష్ప ఘటితాయై నమః

స్వయం భువులైన పుష్పములచే ఘటితమైన దేవి స్వరూపము ఘటితము యన నిర్మించబడినది, కూర్చబడినది దేవికి ప్రకృతి లన్ని పుష్పసముదాయముచే చక్కగా నలంకరణ చేయు విధానము

చేయుచున్న మధ్యమము ధ్వని యంత్రముల ద్వారా (క్యాపెట్) స్పృశించు స్తోత్ర నాదములు ఆ చెవి నుండి ఈ చెవి ద్వారా వెలికి పోవుచు సభమ ప్రక్రియను సూచించును పరమేశ్వరి యల్పసంతోషి, సహజముగా సమర్పించ ఫలం, పుష్పం, తోయం, పత్రి వలన ప్రీతి గలుగుచుండును

స్వయంభూపుష్ప యజ్ఞాశ్వా స్వయంభూ కుసుమమాలికా* కుసుమాత్మికా
స్వయంభూపుష్పనిరతా* స్వయంభూకుసుమప్రియా(147) నిచితా

971 ఓం స్వయం భూపుష్పయజ్ఞాంగాయై నమః/యాజ్ఞికాయై నమః

స్వయం భువులైన పుష్పములు యజ్ఞాంగములుగా గలిగిన దేవి పరమేశ్వరి రూపము యజ్ఞమనగా దేవతలనుద్దేశించి చేయు ద్రవ్య త్యాగము అశ్వమేధము, అగ్ని, సోమాది, శ్రౌతయాగము, వైశ్వదేవాది స్మార్తయజ్ఞము, వైదిక గీతోక్తమైన ద్రవ్య యజ్ఞ, తపోయజ్ఞాదులు, గృహస్థుమైన జీవికి పంచ యజ్ఞములు, విధిగా పేర్కొనబడినవి గేహి విష్ణుసముడు అయినపై చతురాశ్రమముల జీవులు నాధారపడి యుందురు పశుపక్ష్యాది, సేవన, దైవ, పితృపూజ, పంచభూతములకు బలి మున్నగు వానికి యానాటి పాకమున భాగములు నిర్దేశించుట జరుగును యజ్ఞాదులును సర్వభూత హితమును నెంచియే జరుపుచు నందు పరమేశ్వరి నుపాసన చేయుచుందురు అట్టి యజ్ఞములను, స్వయంభువులునైన పుష్పముల సమర్పణ మొదలగు క్రియలచే జరుగును

972 ఓం స్వయంభూ కుసుమాత్మికాయై నమః

స్వయంభువులైన కుసుమములే యాత్మ సమముగా నెంచు పరమేశ్వరి సహజ సిద్ధములైన కుసుమములు, పరిమళ సౌందర్య భరితములు నగుచు, యలంకారణ యందు అంబ సాన్నిహిత్యమున నదియు దేవి యంశలుగా తాదాత్మ్య స్థితి నందుచుండును ఆ పుష్పముల యాలంబనమునసే, యంతర్గత తోరము (దారము), క్షుద్రాశయ కీటకములు చేరుచుండును గదా కీటక పుర్గా దోషమునకు క్షమాపణ గూడ కలదు అట్టి స్వయంభువులైన కుసుమముల యాత్మయే పరమేశ్వరి

973 ఓం స్వయం భూపుష్ప రచితాయై నమః/నిరతాయై నమః

స్వయంభువులైన పుష్పముల చక్కగా నమర్చుకొను పరమేశ్వరి ప్రకృతి, పరమేశ్వరి స్వరూపము. ఓషధులు, పుష్పవృక్షములు, ఫలవృక్షములు, పరమేశ్వరి యనుగ్రహమునసే కాలానుగుణముగా పుష్పించుచుండును వాని నిర్మాణము ప్రకృతి శక్తి ప్రతిపాదితమే. ఉపరితలమును నందముగా తీర్చిదిద్దును అటులే సంపుల్ల పుష్పముల నెంచి పరమేశ్వరికి మాలా రూపమున నర్పించుటచే పరమేశ్వరి యెంతో సుందరముగా కన్పట్టును అలంకరణయు కళయే

974 ఓం స్వయం భూకుసుమప్రియాయై నమః

స్వయంభువులైన కుసుమముల ప్రీతి భావము నందెడు పరమేశ్వరి 'మాల్యాదీని సుగంధీని, మాలత్యాదీని వై ప్రభో', మయాఽహృతా, పుష్పాణి పూజార్థం ప్రతిగృహ్యతాం' యని సుగంధ భరితమైన మాలత్యాది పుష్పములచే కూర్చిన మాలలను సమర్పించి, పూజ చేతురు 'మల్లికా మాలతీ, జాజి, చంపక, అశోక, శతపత్రపూగ, క్రముక మంజరీ, పున్నాగ, కల్హార హారముఖ్య సర్వఋతు సంభవ కుసుమ మాలికాం సమర్పయామి' యని దాన ప్రీతి జెందునని తలంతురు అందు యర్చా విధానమును బట్టి శ్వేత, రక్త, నీల, చిత్రవర్ణ పుష్పముల పూజ నిర్దేశింతురు సత్వ,రజస్తమో గుణముల ప్రతీకలుగా శ్వేత, రక్త, నీల, చిత్ర వర్ణ పుష్పములు ప్రియములగును అట్టి కుసుమార్చనచే పరమేశ్వరి ప్రీతి నందును , శాంతికి శ్వేత వర్ణము, కామ్యమునకు రక్తవర్ణము, ప్రయోగాదులకు చిత్రవర్ణ నీలి పుష్పములు వినియోగింతురు

స్వయంభూ కుసుమాదానల లసోన్మత్త మానసా
స్వయంభూకుసుమానందలహరీ స్నిగ్ధదేహినీ(148)

975 ఓం స్వయంభూకుసుమాదాన లాలసోన్మత్తమానసాయై నమః

స్వయంభువులైన కుసుమముల కొనితెచ్చు కోర్కెచే నున్మత్తత చెందిన మనసుగల పరమేశ్వరి కుసుమార్చనకు కుసుమముల సేకరణయు ముఖ్యము గృహాంగణమందు కొంతమేరకే కుసుమ సంపాదన చేయనగును కాని ప్రకృతి వనముల, తటాకముల, వనారణ్యముల ననేక రూపములైన నధిక సంఖ్యాక కుసుమములు లభ్యమగును దేవి యర్చనకై యుద్దేశించి, యత్యుత్సాహముతో నుదయముననే శుచియై సుగంధ పరిమళ పుష్పముల సేకరించుట వలన జరుగు క్రియయు నుపాసనాంగమే 'కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః' యను విధిని కుసుమ సేకరణ, దానికి యనుకూలముగా మనసును ప్రేరేపించుట, కుసుమార్చన, దూరమునుండి యైనను చూచుట నానందమొందుట విభాగములు

976 ఓం స్వయంభూకుసుమానందలహరీ, స్నిగ్ధ దేహాయై నమః

స్వయంభువులైన కుసుమములచే నుత్పన్నమవు పరమానంద లహరీ యుక్తమౌ యౌవనదేహ యైన పరమేశ్వరి స్నిగ్ధయన స్నిగ్ధమైన, యౌవన ప్రకాశయుక్తమైన దేహము గలది పరమేశ్వరికి కుసుమముల మాలలను యలంకరించగా పరమానంద డోలికలలో పరమేశ్వరి యొక్క కోటి సూర్యప్రకాశ, శతకోటి చంద్ర సమశీతల ప్రకాశమున, నిత్యయౌవనియై విరాజిల్లు చుండును దేవికి కుసుమములన్న ప్రీతికరము మానసమందానందపేటికలు దొరలు చుండు మనోహరమూర్తి దాన శరీరమును నిగ్గుదేలి ప్రకాశవంతమై యొప్పారును మెరుగు శరీరయైన దేవి

స్వయంభూకుసుమాధార స్వయంభూకుసుమాకులా
స్వయంభూపుష్పనిలయా స్వయంభూ పుష్పవాసినీ(149)

977 ఓం స్వయంభూ కుసుమాధారాయై నమః

స్వయం భువులైన కుసుమములకు నాధారభూతురాలగు పరమేశ్వరి కుసుమోత్పాదనకు పరమేశ్వరి శక్తియే యాధారభూతము 'విస్పృష్టిస్పృష్టిరూపాచ, స్థితి రూపాచ పాలనే' యని పరమేశ్వరి యను గ్రహము యాధారముననే కుసుమోత్పాదన జరుగును చెట్లకు ప్రశాంత వాయువు, శుభ్ర జలములు యావశ్యకము పుష్పభరితమై యాపై కాయలు, పండ్లు తదుద్భవ బీజ రూపముల జరుగు సంసార చక్రమున కాధారభూతమై పరమేశ్వరి వెలుగుచుండును 'ఆధారభూతా జగతస్త్వమేకా' యని యంతయు నా పరమేశ్వరి కృపపైనే నాధారపడి యుండును

978 ఓం స్వయంభూ కుసుమాకులాయై నమః

స్వయంభువులైన కుసుమముల యెడ నారాటపడుచుండు పరమేశ్వరి అకులత యన కలత నొందునది చెదిరిన మనసు గలది ఇందు ప్రకృతి సముతుల్యత ప్రతిపాదించ బడినది పరమేశ్వరి జగత్తునందలి సర్వసృష్టివిధానము కొనసాగుచుండునట్లు చూచుట యందు వ్యగ్రయైన, కలతనొందిన మనసు గలదియని కుసుమములన పూవులే గాక సమస్త ప్రాణి జాలములు, నూతనోద్భవములైన విధి, విధాయకములన్నియు దేవికి కుసుమములే అట్టి విశాల దృక్పథముకలిగినట్టి పరమేశ్వరి సమతుల్యత పాటించుట యందు నాకులత చెందుచుండును

979 ఓం స్వయంభూ పుష్పనిలయాయై నమః

స్వయం భువులైన పుష్పములకు నిలయమునునైన దేవి స్వరూపము పుష్పములకు నిలయములైనవి పుష్ప వృక్ష భరితములైన పెరడు, తోట, వనములు, తటాకములు, అయా తలముల పరిరక్షణచే నధిక ప్రసూనయుతములై, పరిమళ సౌందర్య భావన పెంపొంది దేవీ తత్వము ప్రకాశమునగుచుండును చెట్లకు పూవులు అందమే వానికి సంతతి ప్రసూనములే గాన నట్టి పుష్ప నిలయములును పరమేశ్వరీ స్వరూపములే

980 ఓం స్వయంభూపుష్పవాసిన్యై నమః

స్వయంభువులైన పుష్పమాలచే పరిమళ భరితయైన పరమేశ్వరి సువాసినీ యలంకారములతో పసుపు, కుంకుమ, సింధూరం, పూలు, పండ్లు,గాజులు పరిమళ ద్రవ్యములను, సుగంధ భరితమైన పుష్పములచే నలంకరింపబడిన దేవి వానియొక్క పరిమళముచే సుగంధ భరిత వాతాయనమున పరబ్రహ్మ స్వరూపిణియై నిత్యానంద డోలిక తేలియాడుచుండు సుమనోహర రూపిణిగా వెలుగుచుండును

స్వయంభూకుసుమస్నిగ్ధా స్వయంభూ కుసుమాత్మికా
స్వయంభూపుష్పకరిణీ స్వయంభూ పుష్పమాలికా*(150) వాణికా/వాటికా

981 ఓం స్వయం భూకుసుమ స్నిగ్ధాయై నమః

స్వయంభువులైన కుసుమములచే నిగ్గుదేలిన పరమేశ్వరి స్వరూపము స్నిగ్ధత యన యౌవనము. ప్రకాశము, కారుణ్య, కటాక్ష దృష్టి, ఆనంద పరిపూర్ణత గలిగియుండుట ఉద్భవించిన ప్రసూనముల వలె యందము, పరిమళమును, మందహాసము, ప్రకృతి యొడిలో నూగులాడుచుండుట వంటి యున్నతాహ్లాద భావ సంపదయుక్తమైన మనోహర రూపము

982 ఓం స్వయం భూకుసుమోత్సుకాయై నమః

స్వయం భువులైన కుసుమముల యెడ నుత్సుకత చూపు పరమేశ్వరి స్వరూపము స్వయం భువులైన కుసుమముల కాధారభూతమగు పాదపములు తీర్చిదిద్దుట యందు, ప్రాతఃకాల శుచియై దేవి పూజ నిమిత్తమై కుసుమ సేకరణ యందుత్సాహము గలుగుటయు, కుసుమార్చన యందు శ్రద్ధ గలుగుటయు, సామూహికార్చనలను దూరమునుండియైనను, కుసుమాలంకృతయైన దేవిని చూచుటచే, నానందించుటయను భావనలు గలిగిన, నదేవిధి పరమేశ్వరియు భక్తుల నుపచారముల శ్రద్ధగా గొనుచు నౌత్సుక్యభావమున భక్తుల వాంఛల దీర్చుచుండును

983 ఓం స్వయంభూపుష్పకారిణ్యై నమః/ఓం స్వయంభూపుష్పరూపిణ్యై నమః

స్వయంభువులైన పుష్పముల సృష్టికర్త యైన దేవి సృష్టివిధానము అత్యంత రమణీయము ఆయావృక్ష స్వభావములను బట్టి నాయా రూప సమములైన పుష్పములు సృష్టికర్తయైన దేవి, నాయా వృక్షములనుద్భవింప జేయుచుండును కొన్ని చిన్న పాదపములు, కొన్ని తీవలు, కొన్నివృక్షములుగా కుసుమముల నందించును మఱిచెట్టుకు చిన్నవిత్తు, యటులే గుమ్మడి తీగకు పెద్దకాయలు,అటులే ప్రసూనముల సృష్టియును అంబ కృపచే జరుగుచుండును ఆ సృష్టియు యంబ విభూతియే యననగును

984 ఓం స్వయం భూపుష్పపాలికాయై నమః/ ఓం స్వయం భూపుష్పమాలికాయై నమః

పాలికాయన మొలకమ్ము అంకురారోహణ, సంస్కారయోగ్యమైన మృత్పాత్రా విశేషము వానిని పాలనచేయు స్త్రీ, పాలికలన చిన్న కుండీలును, దోహద క్రియకు నుపయుక్తములైనవి అట్టి పుష్పపాలికలు దేవీ స్వరూపములే ఆ కుసుమ సముదాయమును మాలికలుగా గుచ్చి దేవికి యర్పించిన దాన దేవి తృప్తి చెందును అట్టి పుష్పసముదాయము రూపమును దేవి యంశయేయని గ్రహించి వాని పోషణకై శ్రద్ధ వహించవలెను

స్వయంభూ కుసుమన్యాసా* స్వయంభూకుసుమప్రభా ధ్యానా
స్వయంభూ కుసుమజ్ఞాన స్వయంభూపుష్పభోగినీ*(151) పుష్పిణీ/భాగినీ

985 ఓం స్వయంభూకుసుమధ్యానాయై/స్వయం భూకుసుమసుమన్యాసాయై నమః

స్వయం భువులైన కుసుమముల ధ్యానము గలది స్వయం భువులైన కుసుమములు ప్రకృతి

యంగములు సుగంధోద్దీప్తములు, సౌందర్య సాధక రచితములు ఋతుకాల ప్రభావమును బట్టి క్రమమున వాని సృష్టి వినియోగము జరుగుచుండును అట్టి క్రమ పాలనమునందు పరమేశ్వరి నిత్యదింతా పరురాలు ఆమె పంచకృత్యములైన సృష్టి స్థితి లయ తిరోధాన యనుగ్రహముల క్రమమున కాలాతీతమవుయునికి గలిగి, నిరంతర ధ్యాన పరాయణ యగుచుండును

౯౮౬. ఓం స్వయంభూకుసుమ ప్రభాయై నమః

స్వయంభువులైన కుసుమముల ప్రభారూపమునై యున్న పరమేశ్వరి స్వయంభువులైన కుసుమము లుద్భవించుట తోడనే భగవద్దత్తమైన సౌకుమార్యము, సౌగంధము, సౌందర్య ప్రభాపుంజము, ఆకర్షణ భావవైచిత్ర్యము, నేర్పడుచుండును అగుణములైన వీనిని దేవి యుపచారమునకు సేకరించి తెచ్చుట భక్తుల కృత్యము ఆ పుష్పముల యందలి దైవీ చిత్తము యందు పాదముల కడచేరు సమాధి స్థితియే ఆ సమున్నత భావనలో వాని సౌందర్య భావన యినుమడించును, నూతన కాంతులు వెదజల్లును పిల్ల తెమ్మెరల నూగుచు తమ సౌకుమార్యాంగముల నందమొప్ప ప్రకాశింప జేయు చుండును

౯౮౭ ఓం స్వయంభూకుసుమజ్ఞానాయై నమః

స్వయం భువులైన కుసుమముల జ్ఞాన స్వరూపమునైన పరమేశ్వరి ఉపాసనా స్వరూపమున, నానాదేవతలను బట్టి సుమముల సేకరించ వలయును దేవతార్చనకు ప్రీతిపాత్రమవు కుసుమములు, నిషిద్ధ సుమములును గలవు వీనిని గురించిన జ్ఞానము పురాణ గ్రంథములందు గలదు కొన్ని ఉపాఖ్యాన రూపముగాను స్థిరీకరించ బడినవి బ్రహ్మకు సాక్ష్యము బలికిన కేతకిని లింగరూపుడైన శివుడు కోపగించి పూజార్హత తొలగించెను కదా వీని జ్ఞానము పుపాసనా ఖండముల లభ్యమగును

౯౮౮ ఓం స్వయంభూపుష్ప పుష్పిత్యై నమః / ఓం పుష్పభోగిన్యై నమః

స్వయంభువులైన పుష్పముల పుష్పిణీ శక్తియైన పరమేశ్వరి స్వయంభువులైన పుష్పములలో మొగ్గస్థితి నుండి పరాగయుత సంపూర్ణ రూపము నందుటకు పుష్పిణీ గతియందురు అట్టి కాలపరివర్తనము, మానవ కన్యలయందును రజోవతి దశయందురు ప్రథమ పుష్పిణికి ప్రత్యేకత గలదు దానిపై ఫలశాంతి ప్రకరణము జ్యోతిశ్శాస్త్రమున గలదు అటులే కుసుమముల పరిణామదశ ప్రాప్తించి పూజాయుక్తము లగుటకు ప్రభాయుతములగును అంబ అనుగ్రహమున గలుగునట్టి పరిణామస్థితి పుష్పపుష్పితి అంబయనుగ్రహముననే గలుగుచుండును

స్వయంభూ కుసుమోల్లాసా స్వయంభూ పుష్పవర్షిణీ
స్వయంభూ కుసుమానందా స్వయంభూపుష్పపుష్పితీ (152)

౯౮౯ ఓం స్వయంభూకుసుమానందాయ నమః / ఓం కుసుమోల్లాసాయై నమః

స్వయంభువులైన కుసుమముల యెడ నానంద స్వభావము గలది సృష్టియందు స్వయంభువులైన కుసుమములు దేవి ప్రకృతి స్వరూపిణి యవిభిన్నాంగములు వాని పెంపు జూచి వానియర్పణ భావము చూచి దేవికి ప్రీతి గలుగుచుండును ప్రకృతి స్వరూపిణియైన దేవి పాదముల చెంతకు చేరుదమనే వాని తపన భావన వానియెడ కరుణాకటాక్ష భావము పెంపొంద దేవి తన యంగముల చేర్చుకొని ఆనందించుచుండును

౯౯౦ ఓం స్వయం భూ పుష్పవర్షిణ్యై నమః

స్వయం భువులైన పుష్పముల వర్షించు శక్తిస్వరూపిణియై యున్నది.వర్షణము యనగా వాన గుప్పించుట, కురియుట, కృతి, క్రతువు యను అర్థములు గలవు మేఘములు విశ్వ సర్వ బీజసముదాయములు అవియు కాలక్రమమున గర్భము దాల్చి ప్రావృట్ కాలమున వర్షించును వాని

యందలి రేతోభావము భూమిపై బడి అంకురము,మొక్క,కొమ్మ, రెమ్మ, పూలు, పండ్లుగా పరిణతి చెందును. చక్కని వర్షముల భూమి పులకరిత్తి యధిక ఫలసాయము గలిగించుచుండును.కొమ్మలకు అనేక సంఖ్యల కుసుమములు ఉద్భవించి నిత్య పూజాయజ్ఞమున భాగస్థులగును అట్టి పుష్పవర్షణ శక్తి పుత్రోత్పాదక శక్తి పరమేశ్వరియే

స్వయంభూ కుసుమోత్సాహా స్వయంభూపుష్పరూపిణీ
స్వయంభూ కుసుమోన్మాదా స్వయంభూపుష్పసుందరీ(163)

991 ఓం స్వయం భూకుసుమోత్సాహై నమః/ఓం కుసుమానందాయై నమః

స్వయం భువులైన కుసుమముల యెడ నుత్సాహము ప్రీతియు గలిగిన పరమేశ్వరి ఉత్సాహమున వీరరసస్థాయి భావము శుభము, ప్రయత్నము,సూత్రము, కర్తవ్య కార్యములందు మిక్కిలి స్థిరమైన ప్రయత్నము పంచకృత్యముల క్రమము విధి విధానము సూర్యచంద్రాదుల గతులు తప్పక, క్రమముగా పరిభ్రమణము చేయుచుందురు ప్రకృతి మౌలిక పంచ భూతాత్మిక జన్యములు పరిభ్రమణ శీలురే అట్టి నిత్యకృత్యముల తమవంతు కర్తవ్యముగా పరిభ్రమణ మందు నుత్సాహము గలిగియుండుట ఆవశ్యకము అట్టి కుసుమోద్భవ, యర్చన, బీజవృద్ధి యందు క్రమము తప్పక వర్తించు శక్తి యా పరమేశ్వరీ దత్తమే

992 ఓం స్వయం భూపుష్పపుష్పిణ్యై నమః/ఓం స్వయం భూపుష్పరూపిణ్యై నమః

ఈ పదము పునరావృతము పక్క పదము గూడ నాగామి పదము (994), స్వయంభువులైన పుష్పముల పుష్పిణీ శక్తియా పరమేశ్వరియే ప్రకృతియందములన్నియును,నా పరమేశ్వరీ రూపములే ఈ భావన శాస్త్రవేత్త జగదీశ చంద్రబోసు చెట్లకు ప్రాణమున్నదని నిరూపించుటకు ముందే యాధ్యాత్మిక భావనా ప్రాధాన్యత గలదు ప్రకృతిని ప్రేమించుట, సర్వభూత హితత్వము, మన భారతీయ సాంప్రదాయములే కానివిశ్లేషణ జోలికి పోక యాచార రూపమున సాముదాయిక హితము నెంచుచు వారు నిర్ణయించిన సూత్రములు పరమేశ్వరీ ప్రీతికరములు

993 ఓం స్వయంభూకుసుమోత్సంగాయై నమః / ఓం కుసుమోత్సాహాయై నమః

స్వయంభువులైన కుసుమముల యుత్సంగము నందు ప్రీతి గలది ఉత్సంగము యన ఒడి, సంగ రహితము కలియక లేనిది యను యర్థములు గలవు ఉత్సంగము యన వొడి సాన్నిహిత్యము గలిగినదని యర్థము ప్రకృతి స్వరూపిణి యైన దేవి వొడిని పిల్ల తెమ్మెరలో ఊగులాడు కుసుమములు ప్రకృతికి యలంకార ప్రాయములు అట్టి కుసుమములు మాలగా కూర్చినచో దేవికి యలంకరించ యోగ్యము దేవియు కన్నుల పండువగా భక్త జనముల మనముల కాహ్లాదకరముగానుండును.

994 ఓం స్వయంభూపుష్పరూపిణ్యై నమః

స్వయం భువులైన పుష్పరూపమునైన పరమేశ్వరి స్వయం భువులైన పుష్పములన్నియు, పరమేశ్వరి స్వరూపములే. పరమేశ్వరి కృత్యములైన సృష్టిస్థితి వర్తన యందు సిద్ధ రూపములు వర్తమాన పరిమళ సౌందర్య కలికలు పరమేశ్వరీ స్వరూపమే ఈ పదము పునరావృతము పుష్పరూపిణియైన పరమేశ్వరి స్మరణము.

995 ఓం స్వయంభూకుసుమోన్మాదాయై నమః

స్వయంభువులైన కుసుమముల సౌందున నున్మాదియైన పరమేశ్వరి రూపము ఉన్మాదమనగా యనంగదశ, చిత్తవిభ్రమ విశేషము, కైపు మొదలగునవి, సంపుల్ల పుష్పపరిమళముల నాస్వాదించగా మనసున మత్తానంద స్థితి గలుగును పరబ్రహ్మైక్యమునందనుభవించు సత్‌చిత్ యానంద స్వరూప స్థితి యున్మాదముపై మందు సమాధిస్థితి పరిమళా స్వాదనచే గలుగు యున్మాదము మధ్య మజిలీ కుసుమముల పరిమళముచే పరమేశ్వరి చుట్టు వాతావరణము అట్టి మనోయాకర్షణ శక్తి

పరమేశ్వరి యందు ప్రసిద్ధమే ఆయున్నాద స్థితికి కుసుమములు దోహదకారులు.

౯౯౬ ఓం స్వయం భూపుష్పసుందర్యై నమః

స్వయంభువులైన పుష్పముల సౌందర్య రూపము పరమేశ్వరి పుష్ప సౌందర్యమే పరమేశ్వరి లేక పుష్పాలంకరణే సహజసిద్ధమైన సగుణ రూపము, కోటి సూర్యసంకాశ చంద్రకోటి ప్రభాస ప్రతీకా సౌందర్యాలంకరణే త్రిభువన మోహిని, త్రిపుర సుందరిగా భక్తుల యభీష్టములు దీర్చుచుండును పద్మప్రియే, పద్మిని, పద్మహస్తే, పద్మాలయే, పద్మదళాయతాక్షియని, సాముద్రిక సౌందర్య లక్షణము లుగా పేర్కొనబడినవి వనదేవతా స్వరూపమే పరమేశ్వరి

స్వయంభూ కుసుమారాధ్యా స్వయంభూ కుసుమోద్భవా
స్వయంభూ కుసుమవ్యగ్రా స్వయంభూ పుష్పపూజితా(164)

౯౯౭ ఓం స్వయం భూకుసుమారాధ్యాయై నమః

స్వయంభువులైన కుసుమములచే నారాధింపబడు పరమేశ్వరి దేవి చతుష్షష్టియుపచారములలో నాయా ఋతువుల నుత్పన్నమైన పుష్పఫల సముదాయమున ప్రీతి చెందుచుండును సర్వదేవమయమైన పరమేశ్వరి ఆద్యా, ఆరాధ్యా, త్రైలోక్య ములచే నారాధ్యయైన కుసుమములచే నర్చించ ప్రకృతిదేవి దత్తమైన పుష్పములు మరల నర్చన రూపమున పరమేశ్వరి కర్పించుటయే గదా ఆ పరమేశ్వరి 'ఆరాధితాస్తుతాసైవ ప్రసన్నా భవతి' సర్వలోకాధిపత్యము, జ్ఞానము దాని ఫలముగా పరము పొందనగును

౯౯౮ ఓం స్వయం భూకుసుమోద్భవాయై నమః

స్వయంభువులైన కుసుమముల నుద్భవ శక్తియైన పరమేశ్వరి ఉద్భవమనగా జననము, భగవద్విభూతి, ఉత్పత్తి, మతి యని యర్థము కుసుమములు ఉద్భవ మొందుట పరమేశ్వరి యొక్క సృష్టి విభూతి యని ఎంచవలెను అంతయును పరమేశ్వరి యిచ్ఛమేర జరుగుచుండును

౯౯౯ ఓం స్వయం భూ కుసుమవ్యగ్రాయై నమః

స్వయంభువులైన కుసుమముల వ్యగ్ర స్వభావము గల పరమేశ్వరి వ్యగ్రమనగా అగ్రములేనిది వ్యాకులత, వ్యాసక్తత, స్వయంభువులైన కుసుమములు సృష్టిస్థిత్యాదులు వ్యగ్రమనస్కురాలైన దేవి ఎక్కువ ఆసక్తత భావము గలిగియున్న పరమేశ్వరి రూపము

1000 ఓం స్వయంభూపుష్ప పూజితాయై నమః/ఓం పుష్పపూజితాయై నమః

స్వయంభువులైన పుష్పములచే పూజితమైన పరమేశ్వరి పూజిత పదమునకు మత పూజన చేయబడినది రూపాంతర రూపమాపాదించ బడినదని యని యర్థము. పుష్పాలంకరణచే సగుణరూప పరమేశ్వరి దీప్తాంగముల ప్రకాశించుచుండును పుష్పాలంకృతయైన దేవి సౌందర్యమును యభివర్ణింతురు స్వర్ణకుసుమముల దివ్య కుసుమముల మాలలచే నలంకృత యైన దేవి సౌందర్య మహిమాతి శయముల స్తుతింతురు స్తుతిపాఠము యుపాసనాంగముగా గల పరమేశ్వరి

ఇతి [illegible]

స్వయంభూ పూజక ప్రాజ్ఞా స్వయంభూ హోతృమాతృకా
స్వయంభూదాతృరక్షిత్వ స్వయంభూ భక్తభావికా*(166)రక్తతారికా

1001) ఓం స్వయంభూ పూజక ప్రాజ్ఞాయై నమః

స్వయం భువులచే నర్చించబడు ఖ్యాతి గలిగిన పరమేశ్వరి ప్రాజ్ఞయనగా బుద్ధి శుభాశుభ వివేక జ్ఞానము అపరోక్షానుభవము గల్గువరకు చేసెడు విచారణ, ఎరుకయని యర్థములు ఏయే సమయములేయే వేళల సద్యః ఫలదాయకములో యెరుగు యర్చా విధానము నిర్దేశింపబడియున్నది అట్టి వర్ణ ద్రవ్య పుష్పసంభారములచే పూజింపదగిన విధానమును యెరుకగలిగి చేసిన సద్యోప్రాప్తి

గల్గగలదు అట్టి యర్చనా ప్రాశ్తిత పరమేశ్వరీ యనుగ్రహమే అపరాధ శాంతమునకు 'యదక్షర పదభ్రష్టం ' యని లోపముల క్షమింపవేడుదురు

1002) ఓం స్వయంభూ హోతృమాతృకాయై నమః

స్వయం భువుయైన హోతృమాతృకా స్వరూపియైన దేవి హోత్రీయన యజమాన రూపములోనున్న శివమూర్తి స్వాహాయుక్త మంత్రపఠన పూర్వకముగ స్వయంభువులైన యజ్ఞసంభారముల నాహుతిజేయును, అట్టి మంత్రోచ్చారణయే వాగ్దేవి సరస్వతీ మాతృకా రూపము, నిత్యాగ్ని హోత్రముల, సమిధలు, వరుధాన్యము, మధుక్షీర స్వర్పతిలాదులు రూపమున నున్న స్వయంభువు పుత్పన్నమై యెవరిచేతను నంటకయున్న స్వచ్ఛమైనట్టి హోమ ద్రవ్యములు మంత్రపాఠ పూర్వకముగ హుతము చేయునట్టి యజ్ఞకర్త్రి మాతృకా స్వరూపిణి పరమేశ్వరియేనగును

1003) ఓం స్వయంభూదాతృరక్షిత్ర్యై నమః / రక్షిత్రవే నమః

స్వయంభువులైన యజ్ఞయాగాదికములు నిర్వర్తించి ప్రాణిపోషణకాహారదానము నొసగు ఋక్ నిర్వాహకులను రక్షించు పరమేశ్వరియైయున్నది యజ్ఞయాగాదుల నిర్వహణకు చతుర్విధ వేదవేత్తలు పారక్రియాసామగానాదుల నిర్వర్తించి పరబ్రహ్మ స్వరూపిణిని గొల్వగా వారి యజ్ఞముల, సంతతుల, సంరక్షించి బహు సంపదల గల్గించుచుండును ముఖ్యులైన ఇంద్ర, వరుణ, వాయు, యగ్ని దేవతల స్మరణచే రక్షణ చేకూరుచుండును

1004) ఓం స్వయంభూ భక్త భావితాయై నమః

స్వయం భువులైన భక్తులచే భావింపబడు పరమేశ్వరి స్వయంభూ భక్తియని యుదహరించుటలో పరమేశ్వరియందు భక్తిగల్గుట పూర్వజన్మ సుకృతము వలన లేక కర్మ పరిపక్వ దశకు చేరునపుడు సహజ సిద్ధముగా భక్తి భావము స్థిరపడును అంతకు ముందు భౌతిక లంపటముల కొట్టుమిట్టాడుచు, తన దిన వ్యాపృత్తమనే సంసారము, కుటుంబములో మునిగి తేలుచుండును సమయము రానిది భక్తిభావము గలుగదు పరమేశ్వరి భక్తిగలిగిన నవవిధ భక్తి మార్గములైన శ్రవణ మనన, నిధి ధ్యాస సంకీర్తనాదుల శ్రద్ధగలుగదు అట్టి స్వచ్ఛందమైన భక్తిగలవారిచే చింతింపబడుదేవి

స్వయంభూ కుసుమప్రీతా స్వయంభూ పూజక ప్రియా * గుప్తా
స్వయంభూ వందకాధారా స్వయంభూనింద కాంతకా(156)

1005) ఓం స్వయంభూ కుసుమ ప్రజ్ఞాయై నమః / కుసుమ ప్రీతాయై నమః

స్వయంభువులైన కుసుమముల వివేక జ్ఞానరూపము గల్గించు పరమేశ్వరి బదరికా రహస్యములని కొన్ని వృక్షమూలములు యేర్పరుపబడినవి కొన్ని ప్రత్యేక దినములలోనే తాకి సంగ్రహణము చేయవలెను ముందుగా వృక్షము నర్చించు విధిగూడగలదు అట్లే సుమసేకరణ గూడ యర్చావిహితమైన కుసుమములనే సేకరించి పూజించుచుండవలెను అట్టి సుమ పరిజ్ఞానము దేవి ప్రీతిని యెరుకగల్గి సంభావిత మంత్రోచ్చారణము చేయవలెను మంత్రసిద్ధికి పారము నిర్ణీత సంఖ్యలో (ఒక లక్ష) అందు పదవవంతు హోమము, అందు పదవ వంతు తర్పణ అందు పదవవంతు సంఖ్యకు పరిపడు బ్రాహ్మణులకు భోజనము నేర్పాటు చేసిననే ఫలము దక్కును కుసుమముల సంఖ్యగూడ నిర్దేశింపబడును (లక్షపత్రి) (లక్ష కుసుమాలు) అట్టి యుపాసనా పరిజ్ఞానము గురువుల నుండి యందదగును

1006) ఓం స్వయంభూ పూజక ప్రియాయై నమః

స్వయంభువులైన పూజకులకు ప్రియమును గల్గించు దేవి స్వయంభువులైన యన పరిపూర్ణ మనముల పరమేశ్వరియే గతియని యెంచి పూజాదికములు నిర్వర్తించు వారియెడ పరమేశ్వరి ప్రీతిగలిగి యుండును వారి యోగక్షేమముల బాధ్యత పరమేశ్వరి స్వీకరించుచుండును 'కర్మణ్యే

వాఞ్ఛిత కార్యస్తు మా ఫలేషు కదాచన యని ముందుగనే కోర్కెల తలచి, వానికి ఫలితము కోరిన నంతవరకే ప్రాప్తిగల్గును భగవదర్పణము చేయు నిత్యానంద విభూతి, పరమేశ్వరి కృప సారూప్య, సాయుజ్య, సాలోక్య మోక్షసిద్ధినందగలరు పరమేశ్వరియు నట్టి భక్తులయెడ ప్రీతిగలిగి యుండును

1007) ఓం స్వయంభూ వందకాధారాయై నమః

స్వయంభువులైన సంస్తుతి చేయు భక్తుల కాధార స్వరూపమైన పరమేశ్వరి స్వయంభువులైన వందకులయిన నమస్కారాది యుపాసనాక్రియల దేవిని సంస్తుతించు జనములకు గల్గు శక్తి దేవి కృపాశక్తియే 'యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి, తదా తదావతీర్యాహం కరిష్యామ్యరి సంక్షయం' యని దేవి కృపాశక్తియేదో యొక రూపమున నుద్భవించి భక్తులను సంరక్షించుచుండును మానవాకృతియే గావలెనని లేదు భ్రమరరూపమున నరుణాసుర సంహారము చేసినది మధుకైటభ, శుంభనిశుంభ, చండ ముండాసురులను దండించి భక్తపాలన చేసిన యాధార శక్తి.

1008) ఓం స్వయంభూనిందకాంతకాయై నమః

స్వయంభువులై నిందకుల నంతమొందించెడు పరమేశ్వరి శక్తి, నిందయన యహంతాశక్తి పెరిగి, తానే సర్వమనియు యితర దేవ మానవ జంతు ప్రాణికోటిని హింసించు నిందా స్వభావము గలవారు కాలానుగుణముగ నుద్భవించినపుడు వారి దుశ్చేష్టల నరికట్టియంతము చేయు శక్తి యా పరమేశ్వరియే 'జజ్వలుశ్చాగ్నయః శాంతాః శాంతా దిగ్జనితస్వనాః' యని నిత్య యజ్ఞక్రియలు జరుగుచు ప్రాణికోటి తృప్తిశాంతి భావమునంద, నది పరమేశ్వరికి ప్రీతి గాన కాలాను చోదితులయిన దుష్ట నిందకజనుల దండించు శక్తి పరమేశ్వరియైయున్నది

స్వయంభూ ప్రద సర్వస్వా స్వయంభూ ప్రద పుత్రిణీ
స్వయంభూ ప్రద సస్మేరా* స్వయంభూత శరీరిణీ (157) సర్వస్వా

1009) ఓం స్వయంభూప్రద సర్వస్వాయై నమః

స్వయం భువులైన సర్వ సంభారముల నొసగు సర్వ వస్తు సంపత్ సముదాయ శక్తి స్వరూపిణి, స్వయంభువు రూపములుగా ప్రాణికోటికి ధనధాన్యాది సంపత్తిని కల్పించుచు, సకల భువన పోషణ భారము నిర్వహించు సర్వసత్తాకయైన దేవి శిశువు జన్మించగనే మాతృస్తన్యము గల్గించు శక్తియా పరమేశ్వరియే అట్లేయన్ని జీవులకు నాహారము, సుఖభోగములు సంతరింపబడుచున్నవి 'విశ్వేశ్వరీత్వం పరిపాసి విశ్వం విశ్వాత్మికాధారయతీ' యని సర్వసాధన సంపత్తి పదార్థములు యామె కృపవలననే కర్మానుగుణముగ చేరుచుండును

1010) ఓం స్వయం భూప్రద రూపిణ్యై నమః /స్వయం భూప్రద పుత్రిణ్యై నమః

స్వయంభువులైన, సంపత్తి స్వరూపిణియైన దేవి వివిధ సంపదలలో 'పుత్రిణీ' యన సత్సంతానము ప్రసాదించు పరమేశ్వరియైయున్నది పుత్రుడు తన వంశమునే నుద్ధరించువాడుగాగా పుత్రిక పుట్టినిల్లు, మెట్టినిల్లు నేడు తరముల వరకు ముక్తిని ప్రసాదించు రూపముచైయున్నది కన్యాదానము 'బ్రహ్మలోక జిగీషయా' యని చేతురు బిడ్డలు లేనివారికి గొడ్రాలు యని, నాకే బిడ్డ గల్గిన కదలీ సంతానమనియందురు అట్టి సంపత్తికి పరమేశ్వరి యనుగ్రహమే కారణముగును ప్రత్యామ్నాయ సంతతి రూపముగ దేవాలయ తటాక నిర్మాణము జ్ఞానదానము, యనాథ శిశు పోషకాది సత్కర్మ రూపముల తన జన్మసార్థకము చేసికొనవచ్చును

1011) ఓం స్వయంభూప్రద సస్మేరాయై నమః / (వదసస్మేరాయై నమః)

స్వయంభువులైన సృష్టి సంపదల నిడుచు మందహాసయుక్తమైన దేవి దేవికి పంచకృత్యములైన సృష్టి స్థితి సంహార, తిరోధానయనుగ్రహములు నిత్యక్రీడలు కాలానుక్రమము నవి వర్తిల్లుచుండును సంపదలనిడుట, నాగ్రహించుటయు గల్గుచున్నను, తనదేయైనట్టి ప్రకృతి జంతుజాలముల యెడ

ప్రసన్నవదనముతో వీక్షించు పరమేశ్వరి 'ఈషత్ సహాసమమలం పరిపూర్ణ చంద్రబింబానుకారి కనకోత్తమ కాంతి కాంతం' పరమేశ్వరి కృపాకటాక్షములు భక్తులయెడ, శుభకరములు 'కరోతుసానః శుభహేతురీశ్వరీ శుభాని భద్రాణ్యభిహంతు చాపదః' ఆ ప్రసన్నమూర్తిని సదా స్మరించవలెను

1012) ఓం స్వయంభువర్ధ శరీరిణ్యై నమః / స్వయంభూత శరీరిణ్యై నమః

స్వయముగా క్రీడకైయర్ధ శరీరమున పరమేశ్వరుని యావిర్భూతము చేసిన పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూప స్థితి లింగ రూపమున నిర్ధారించబడినది పరమేశ్వరుడు పరమేశ్వరిగా దక్షవామభాగముల నాపరబ్రహ్మశక్తి ద్విధాభూతురాలాయెను. అద్విధా రూపములు నుండి సృష్టిస్థితి సంహార క్రియలకు బ్రహ్మ విష్ణు రుద్రాదులు, వారి శక్తి స్వరూపిణులు మహా సరస్వతి, మహాలక్ష్మి మహా గౌరి త్రిగుణ రూపముల సంభవమునైను పరమేశ్వరి క్రీడార్ధమై తానే దక్షభాగము కామేశ్వరునిగా, వామభాగము కామేశ్వరిగా నద్వైతభావన రూపమున గన్పట్టుచున్నది

సర్వలోకోద్భవ ప్రీతా సర్వకాలోద్భవాత్మికా
సర్వకాలోద్భవోద్భావా సర్వకాలోద్భవోద్భవా(168)

1013) ఓం సర్వకాలోద్భవ ప్రీతాయై నమః

సర్వకాలోద్భవ సంపత్తి నిడుచు ప్రీతయైన పరమేశ్వరి ప్రకృతియందు ప్రాతః మధ్యాహ్న, సాయం సమయ ప్రసూనాది సృష్టియట్లే నాయా ఋతువులననుసరించి నుద్భవమగు ఫల పుష్ప స్వరూపము వీని భ్రమణము సంవత్సర ప్రమాణముగా కొనసాగుచుండును అట్లే సూర్యచంద్రాదులు గతులు, స్వీయ కక్ష్య, ధ్రువ కక్ష్యలలో నియతి ప్రకారము కొనసాగును అయా సమయముల నుద్భవమౌ సంపదల నిడుచు నిత్యప్రీత స్వరూపిణిగా పరమేశ్వరి వెలుగుచుండును 'ప్రకృతిస్త్వంచ సర్వస్య గుణత్రయ విభావినీ భూతేషు సతతం' తన్వ్యాప్తి విధిని త్రైలోక్యహితమును వాంఛించుచు నిత్య ప్రీతయౌ పరమేశ్వరి

1014) ఓం సర్వకాలోద్భవాత్మికాయై నమః

సర్వ కాలముల నుద్భవమగు సంపత్తి స్వాత్మ రూపిణియైన పరమేశ్వరి. భూగర్భముననున్న రత్నాదులు, సముద్ర గర్భ సంపత్తి, భూమిపై వెలుగు వృక్షాదింతా రూపసంపద, యాకసమందలి జలవాయు సంపదయంతయు పరమేశ్వరి స్వరూపమే త్రిజగద్వ్యాప్తయై పరమేశ్వరి, సర్వ సృష్టికి నాత్మ స్వరూపయై ప్రభను వెల్గుచుండును 'స్త్రియః సమస్తా తవ దేవి భేదా' ఉద్భవదోహదములైన స్త్రీ రూపశక్తి యనేక రూపములుగా చెన్నొందును వానియందలి యాత్మశక్తి యా పరమేశ్వరియే యగును

1015) ఓం సర్వకాలోద్భవోద్భావాయై నమః

సర్వ కాలముల ప్రకృతియందుద్భవించు చేతనా సర్వస్వములును భావానుగుణముగనే జరుగుచుండును 'చిత్త రూపేణ యాకృత్స్నమేతత్ వ్యాప్యస్థితా జగత్' యని జగత్తు యందలి సర్వ చేతనలు, భావనల సముదాయము పరమేశ్వరి శక్తియే యగును అమె యిచ్ఛలేనిది నేమియు జరుగదు కాలరూపిణి, సర్వచేతనా నియంత్రిణి అమె నియంత భావముననే సకల చాలనము లేర్పడును అట్టి సృష్టి, స్థితి, లయ భావముల సంయుక్త స్వరూపయైన పరమేశ్వరి

1016) ఓం సర్వకాలోద్భవోద్భవాయై నమః

సర్వకాలాను గుణమును బట్టి యుద్భవించు సాముదాయిక శక్తి స్వరూపిణియైనట్టి పరమేశ్వరి సర్వకాలము, కాలచక్రభ్రమణము ననుసరించి మార్పులు చెందుచుండును కలా కాష్ఠాద్యారంభమై, దినము, నిశి, యహోరాత్రము, పక్షము, మాసము, ఋతువు, అయనము సాంవత్సర క్రమమున జరుగుచుండును ఈ కాలోద్భవముననుసరించి ప్రకృతియందు నాయాకాల సంపన్నములైన వస్తు సంభారములుత్పత్తియగుచుండును అట్టి సర్వకాలోద్భవమైన వేళల నుద్భవించు సర్వవస్తు

సంభారముల సర్వ క్రియాశక్తి పరమేశ్వరియై యున్నది కాటకములందునను శాకంభరిగా కృప చూపియుండెను

కుండపుష్పసదా*ప్రీతి: కుండ*పుష్ప సదా*రతి: సదా, గోళ, సదా
కుండగోళోద్భవ ప్రీతా కుండగోళోద్భవాత్మికా(159)

1017) ఓం కుండపుష్ప సదాప్రీత్యై నమః/సదాప్రీత్యై/కుండపుష్ప సదారత్యై నమః

కుండ పుష్పములందాసక్తి ప్రీతిగల్గినది. కుండమునకు దేవ జలాశయము, మానవ నిర్మిత తటాకమియను యర్థములు గలవు అట్టి జలాశయముల తామరలు కలువలు పుష్పించుచుండును శ్వేత, రక్త, నీల వర్ణ పుష్పముల సేకరించి యుంటను పూజించిన నంబ తృప్తిచెందుచుండును పూజకై రక్త పద్మములు విశేషముగా చెప్పబడినవి అట్టి పుష్ప పూజయందు యాసక్తిగలిగినదివి

1018) ఓం కుండగోళ పుష్ప సదా గత్యై నమః

కుండగోళ పుష్పముల సదాయాసక్తి గలిగిన దేవి కుండగోళ పుష్పముల సదా ప్రీతిచెందునది మనుస్మృతిపరము గాచింతించ 'కుండ'యన భర్తయుండగా జారుని వలన పుట్టినవాడు, గోళయన భర్త చనిపోయి విధవయైన తరువాత జారుని వలన గలిగిన సంతతియను రెంటియందును క్షేత్ర ప్రాధాన్యత గలిగిన సంతతియని యర్థము ఈ రెండు విధములైన కుండ, గోళక సంతతియందును ప్రీతిచెందునది కుంతికి గలిగిన పంచ పాండవులు భర్త పాండురాజు యుండగా గల్గిన సంతతి అంబికయంబాలికలకు భర్తయైన విచిత్రవీర్యుని మరణానంతరము, తల్లియానతిపై జారుడైన వ్యాసుని వలన గలిగిన సంతతి ఈ రెండు వర్గములపై భారతమంతయు నడచినది కృష్ణ పరమాత్మ సారథ్యమున చివరికి పరీక్షిత్తుయంశగా నిలిచినది పుష్పాది పరాగమున కీటకముల వలన వ్యాప్తిచెందును ఆ కీటకములు పరాగమును మోసుకొనిపోయి సజాతీయ పుష్పములతో పాటు విజాతీయ పుష్పము లందును, ఫలదీకరణమునకు తోడ్పడుచుండును అట్టి ఫలదీకరణ క్రియ పరమేశ్వరి సృష్టి విభాగము అపై సిష్టవ సంతతి గల్గుటకు తోడుపడి యున్నందున యంబ భక్తులైన వారును ప్రీతిపాత్రు లగుదురు (పై కుండగోళకులు గూడా సదాచార వర్తనమునకు, తండ్రి ఆస్తియందు భాగము గల్గియనుభవించుటకు దశవిధ పుత్ర పరంపరగా నర్హులైయున్నారు (ఈ పదము అదనముగానున్నది)

1019) ఓం కుండగోళోద్భవ ప్రీతాయై నమః

కుండగోళోద్భవ సంతతి యందునూ ప్రీతిగల్గినది ప్రకృతి స్త్రీకి మాతృత్వమును ప్రసూనములకు నుత్పత్తి క్రియాశక్తినిచ్చియున్నవి ఫలదీకరణానంతరము సద్రూప సంతానోత్పత్తివే ప్రకృతి ప్రీతి చెందును పురుషుడు బీజముని, స్త్రీ క్షేత్రముని యందురు క్షేత్రమున నుద్భవ శక్తిగలది క్షేత్రములు భూస్వాముందు లైనను వారిని కౌలుకుగొని పంటలు పండించుచుందురు గదా అట్టి ధాన్య విశేషము ప్రజోపయోగకరమైనందున నామోదనీయముగుచున్నది

1020) ఓం కుండగోళోద్భవాత్మికాయై నమః

కుండగోళోద్భవాత్మికయైన పరమేశ్వరి కుండగోళోద్భవములైన సృష్టియందును పరమేశ్వరి శక్తి నిహితమైయుండును అట్టి సృష్టి విధానము పరమేశ్వరి యిచ్చిన దేనంచి యాత్మస్వరూపముగా నెంచవలెను (1021 నుండి 1058 వరకు గల నామములు, 1007 నుండి 1089 తర్వాత పాఠముగానున్నవి)

స్వయంభవార్చ్వ శివా శక్తా* పావనీ లోకపావనీ ధాత్రీ
కీర్తిర్యశస్వినీ మేధా విమేధాసురసుందరీ(160)

1021) ఓం స్వయంభువే నమః

స్వయంభువుగా నేర్పడిన రూపము గలది స్వయం భువుయన తనంత తానుగా గలుగు చతుర్ముఖ బ్రహ్మ పరబ్రహ్మ స్వరూపము దేవియే. 'ఏషా ఆత్మశక్తిః ఏషా విశ్వమోహినీ, ఏకైవ విశ్వరూపిణీ తస్మాదుచ్యతే నైకా' 'అహం బ్రహ్మస్వరూపిణీ మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్ శూన్యమని 'స్తియస్సమస్తాః తవదేవి భేదా' యని, సర్వజీవ స్వరూపిణీ, సర్వ చైతన్య శక్తియై తన క్రీడార్థమై జగత్తుల సృష్టి స్థితి లయాదుల చేయుచుండు యనంత కాలస్వరూపిణి. హిమాచల కృతాన్వయయై దేవతలు ప్రార్థించగా సింహవాహినియై ప్రత్యక్షమైనది తానే కాళికి, కాళీ, చండీ, చాముండాది యనేక రూపముల బ్రాహ్మ్యాది యష్టవిభూతులను సృష్టించుచు తనలోనే లీనము చేసికొను సర్వసత్తాకయైన పరమేశ్వరి, కారణానంద విగ్రహగా మణిద్వీపమున వెలుగుచుండునట్లు యద్వైత తత్త్వప్రతిపాదినిగా కామేశ్వర కామేశ్వరీ రూపమున వెలుగుచుండును

1022) ఓం శివాయై నమః

శివశక్తి స్వరూపిణియైన దేవి 'శివంకరోతీతి శివా' 'సర్వ మంగళ మాంగల్యే శివే, సర్వార్థసాధికే, శరణ్యే' యనియు, 'కరోతు సానః శుభాని భద్రాణ్యభిహంతు చాపదః' యను తత్త్వం, 'సదా శివా సదానందా సంసారోచ్ఛేద కారిణీ, సా శివా పరమాదేవీ శివాఽభిన్నా శివంకరీ', 'పరమాత్మా శివః ప్రోక్తః శివా సైవ ప్రకీర్తితా' మరియు 'శివాముక్తి సమాఖ్యాతా యోగినాం మోక్షదాయినీ, శివార్థం యతతే దేవీ తతో లోకే శివా స్మృతః' 'పావక స్యోష్ణతేవేయం, భాస్కరస్యేవ దీధితిః చంద్రస్య చంద్రికేవేయం శివస్య సహజా శివే' యని త్రిగుణ తత్త్వము విశదీకరింపబడినది (ఉష్ణత, ప్రకాశత, శీతలతయనునవి) 'శివ కామేశ్వరాంక స్థయైన శక్తి శివా'' యథా శివస్తథా దేవీ, యథా దేవీ తథా శివః'

1023) ఓం శక్త్యై నమః

శక్తి స్వరూపిణియైన పరమేశ్వరి. శక్త్యాయనసమర్థత గల్గిన పరమేశ్వరి సరస్వతి, లక్ష్మి, పార్వతీ, పరాశక్తి స్వరూపిణులు నిర్గుణశక్తి నిరుపమ పరాక్రమము గల్గినది 'ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తియుతః ప్రభు మంత్రోత్సాహ శక్తియుతయైనదేవి 'యస్యాప్రభావమతులం భగవాన్ అనంతో బ్రహ్మా హరశ్చన నహివక్తు మలంబలంచ సాచండికాఽఖిల జగత్పరిపాలనాయ నాశాయ చాశుభభయస్య మతిం కరోతు'', 'సర్వాశ్రయాఖిల మిదం జగదంశ భూతం అవ్యాకృతాహి పరమా ప్రకృతి స్త్వమాద్యా' యని సనాతనియైన శక్తిస్వరూపిణి

1024) ఓం పాలిన్యై నమః / పావన్యై నమః

సకల భువన పాలినియైన దేవి. పవిత్ర. పవిత్రమైన స్వరూపము, నామము, జ్ఞానము గల్గిన పరమేశ్వరి, పరమేశ్వరి దర్శన మాత్రమున, భక్తకోటుల పాపములన్నియు నశించి పునీతులగుచుందురు. పరమేశ్వరి కృపాకటాక్ష లేశమున సకలభవబంధములు తొలగి మోక్ష సామ్రాజ్య సాధనకు సుకరమార్గమేర్పడును 'దుర్గేస్మృతా హరసి భీతిమశేషజంతోః' 'దుర్వృత్త వృత్తశమనంతవదేవి, శీలం రూపం తథైత దవిచింత్య మతుల్య మన్యై, వీర్యంచ హంతృ హృత దేవ పరాక్రమాణాం / వైరిష్వపి ప్రకటితైవ దయాత్వయేత్థం' వైరి భావమున స్మరించినను, వారి మనముల పవిత్రీకరించి పావనులుగా చేసికొన్నది 'అపరాధ శతం కృత్వా జగదంబేతి చోచ్చరేత్। యాంగతిం సమవాప్నోతి న తాం బ్రహ్మాదయస్సురాః' 'మహాలక్ష్మీర్మహాకాళీ సైవప్రోక్తా సరస్వతీ। ఈశ్వరీ పుణ్యపాపానాం సర్వలోక మహేశ్వరీ' 'సర్వాబాధావినిర్ముక్తో ధనధాన్య సుతాన్వితః మనుష్యో మత్ప్రసాదేన భవిష్యతి నసంశయః। పాపాని సర్వ జగతాం ప్రశమం నయాసుః ఉత్పాత పాకజనితాంశ్చ మహోపసర్గాన్' యని పరమేశ్వరి జగత్ పాలన కర్త్రి సర్వ మనముల పవిత్ర భావముల నింపుచు నంత్యమున మోక్షమును ప్రసాదించు కరుణాస్వరూపిణి యామెయే భిక్షామ్రుష్టిత సర్వసుఖ ప్రదాత పావనత్వంశినిగా సదా పూజించ

పలెను

**1025) ఓం లోకపాలిన్యై నమః**

లోక పాలినియైన దేవి త్రిలోకములయిన స్వర్గమర్త్య పాతాళములు లేక భూ, భువః సువర్లోకముల, భూమ్యంతరిక్ష దివములు మరొక గణనచే భూ, భువః, సువః, జనః, మహః, జనః, తపః, సత్యలోకములను సప్త పూర్వ్వ లోకములు అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల పాతాళములను సప్తాధో లోకముల, అన్నియు పంచతన్మాత్రాధిక్యత గల దైవశక్తి వ్యాప్తముల్, అన్ని లోకములను నియంత్రించు శక్తి పరమేశ్వరియై యున్నది 'లోకానాం జనానాం మాతృవత్ పాలక, పితృవత్ రక్షక, రాజవత్ స్వామియిత్యుచ్యతే'

**1026) ఓం కీర్త్యై నమః**

కీర్తిస్వరూపిణియైన దేవి కీర్తియనగా ఖ్యాతి యశస్సు 'తతోమాందేవతా స్వర్గే మర్త్యలోకేచ మానవాః స్తువంతో వ్యాహరిష్యంతి సతతం రక్తదంతికామ్' 'తతః శతేన నేత్రాణాం నిరీక్షిష్యామి యన్మునీన్ కీర్తయిష్యంతి మనుజాః శతాక్షీమితి మాంతతః' 'శాకంభరీతి విఖ్యాతంతదాయాస్యామ్యహంభువి' 'దుర్గాదేవీతి విఖ్యాతం తన్మేనామ భవిష్యతి' 'తదామాం మునయః సర్వే స్తోష్యంత్యానమ్రమూర్తయః' 'భీమాదేవీతి విఖ్యాతంతన్మేనామ భవిష్యతి' 'భ్రామరీతి చమాం లోకా స్తదాస్తోష్యంతి సర్వతః' యని యంట వివిధ రూపములు 'త్రైలోక్యస్యహితార్థాయ' యవతరించుచు కీర్తిగాంచినది. మాతృకానామ్ని

**1027) ఓం యశస్విన్యై నమః** (479) పదము

యశస్వినియైన పరమేశ్వరి ఈ పదము పునరావృతమైనది కీర్తియశస్సుకు సమానార్థములు, మేధాదేవి యను దేవతను యశస్వినియందురు సర్వసిద్ధిదా, వాగీశ్వరి, విశ్వధాత్రి, సిద్ధేశ్వరి, సిద్ధ విద్యా సిద్ధమాత యను పలు నామముల త్రైలోక్య ప్రఖ్యాతి గాంచినది ప్రకృతి, ఆద్య, సర్వ స్మార్తి హరగా కీర్తిగాంచినది మహిషాసురాది యనేక దానవుల వధించి శాంతి గల్గజేసిన దేవి

**1028) ఓం మేధాయై నమః** (248) పదము

మేధా స్వరూపిణియైన దేవి ఈ పదము పునరావృతమైనది శ్రీదేవి బుద్ధి స్వరూపురాలు మేధాయను పేరుగల దేవిగా కాశ్మీర మండలమున కధిష్ఠాత్రియైన దేవి 'యాదేవి సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా, జ్ఞానమస్తి సమస్తజంతోర్విషయ గోచరే' అజ్ఞానం, బుద్ధిదేవి ప్రదత్తముల్ (2)అనాది సిద్ధుడైన పరబ్రహ్మ స్వరూపుని స్మరణగల్గుటయే మేధాప్రాప్తి యనబడును (3) మేధాసిదేవి విది తాఖిల శాస్త్ర సారా జీవియందు గల ధారణాశక్తి యును నామియే' స్వాధిష్ఠాన చక్రాధి దేవత ఘన సిద్ధేశ్వరి మంత్ర విశేషమును, గర్భస్థ పిండము యొక్క నాల్గవ మాసస్థ భావస్థితిని బోధించును

**1029) ఓం విమేధాయై నమః**

విమేధా స్వరూపిణియైన దేవి, బుద్ధికగోచరమైన ప్రతిభా విశేషములు గల్గినట్టి పరమేశ్వరి 'యస్యా ప్రభావమతులంభగవాన్ అనంతో బ్రహ్మా హరశ్చనహివక్తుమలం బలంచ' అట్టి మేధస్సు కందని రూపము 'యస్యాస్స్వరూపం బ్రహ్మాదయోనజానంతి, తస్మాదుచ్యతే అజ్ఞేయా, యస్యా అంతోనలభ్యతే, తస్మాదుచ్యతే అనంతా, యస్యాలక్ష్యం, నోపలక్ష్యతే తస్మాదుచ్యతే అలక్ష్యా, యస్యా జననంనోప లక్ష్యతే, తస్మాదుచ్యతే అజా, ఏకైవ సర్వరూపిణీ అత ఏకోచ్యతే, అజ్ఞేయా అనంతా అలక్ష్యా నైకానైకేతి' అటులే యధర్వశీర్షమున 'మంత్రాణాం మాతృకాదేవి, శబ్దానాం జ్ఞానరూపిణీ / జ్ఞానానాం చిన్మయాతీతా, శూన్యానాం శూన్యసాక్షిణీ। యస్యాః పరంతరంనాస్తి సైషాదుర్గా ప్రకీర్తితా' 'శూన్యస్థితియే విమేధాస్థితి (3) దివాంధాః ప్రాణినః కేచిత్ రాత్రా వంధాస్తథాపరే। కేచిద్దివాతథా రాత్రౌ ప్రాణినస్తుల్య దృష్టయః జ్ఞానినోమనుజాః సత్యంకింతు తేనహికేవలమ్' 'లోభాత్ ప్రత్యుప కారాయ నన్వేతాన్ కిం నపశ్యసి। తథాపి మమతావర్తే మోహగర్తేనిపాతితాః' కావున యరిషడ్వర్గాది

గుణప్రభావితులైన వారు బుద్ధి హీనులగుదురు విమేధా స్థితియదియే అదియును 'మహామాయా హర్యైషా, తయా సంమోహ్యతే జగత్। జ్ఞానినామపిచేతాంసి భగవతీ హిసా। బలాదాకృష్యమోహాయ, మహామాయా ప్రయచ్ఛతి' దేవి యర్చా విశేషమున మేధావి మేధా రూపములయర్చన గల్గును 'ధర్మాయ నమః అధర్మాయ నమః, జ్ఞానాయ నమః అజ్ఞానాయ నమః, వైరాగ్యాయ నమః అవైరాగ్యాయ నమః ఐశ్వర్యాయ నమః అనైశ్వర్యాయ నమః' అట్టి సమస్త విషయముల కధిష్ఠాత్రియై మహామాయ వర్తిల్లుచుండును

1030) ఓం సురసుందర్యై నమః

సుర సుందరియైన దేవి శ్రీ మహా త్రిపుర సుందరి త్రిపుర సుందరి త్రిలోకాధిష్ఠాత్రియైన దేవి. సకల సురగణములకు మూలకారణము 'సింహ స్కంధా రూఢాం, త్రిభువన మఖిలం తేజసా పూరయంతీం। ధ్యాయేత్ దుర్గాం జయాఖ్యాం త్రిదశ పరివృతాం సేవితాం సిద్ధికామైః' 'దేవ్యా యయా తతమిదం జగదాత్మ శక్త్యా నిశ్శేష దేవగణ శక్తి సమూహ మూర్త్యా సర్వాశ్రయాఖిల మిదం జగదంశ భూతమవ్యాకృతాహి పరమా ప్రకృతిస్త్వమాద్యా' 'ఈషత్ సహా సమమలం పరిపూర్ణ చంద్రబింబానుకారి। కనకోత్తమ కాంతి కాంతం' జ్యోత్స్నాయై చేందు రూపిణ్యై సుఖాయై సతతం నమః–యని ఇట్టి జగత్ ప్రతిష్ఠయైన పరమేశ్వరి సురగణములకు దానవుల వలన బాధలు గలిగినపుడు యవతరించికొనుచున్నది

అశ్వనీ కృత్తికా పూష్యా* తేజస్వీ* చంద్రమండలా పుష్యా/పుష్పా, తేజస్యా సూక్ష్మాసూక్ష్మ ప్రదాసూక్ష్మాసూక్ష్మ* భయవినాశినీ(161) బలాకావ వరదా

1031) ఓం అశ్విన్యై నమః

అశ్విని రూపయైన దేవి అశ్వినియన అశ్విని కుమారులు దేవ వైద్యులు భచక్రమున గణించుటలో ప్రథమ నక్షత్రము పూర్ణచంద్రుడిగా నశ్విని నక్షత్ర పరిధి వ్యాప్తమగు నట్టి చంద్రమాసమును ఆశ్వయుజ మాసమందురు ఆశ్వయుజ ప్రతిపత్ నుండి శరత్ కాలము ప్రారంభమగును శరత్కాల పూజా రంభముచేసి, నవరాత్రములు దేవిని అర్చించ ప్రసిద్ధ కాలమగుటచే నాశ్వయుజ మాసము దేవికి అత్యంత ప్రీతికరము కావున పరమేశ్వరియే అశ్విని నక్షత్రరూపి అశ్విని వ్యాప్త పరిపూర్ణ చంద్రబింబ ప్రతీకగా వెలుగుచుండును శరత్ కాలమున మేఘాచ్ఛన్నత తొలగి స్వచ్ఛమైన జ్యోత్స్న పుడమిపై ప్రసారితమగు చుండును అట్టి శరత్ జ్యోత్స్నా స్వరూపిణియైన పరమేశ్వరి 2) అశ్విని దేవతలు సూర్యుని పుత్రులు వారు యాగవిధి యందు యగ్ని, వాయు, యింద్ర సమానులుగా నామెను యర్చించుచుందురు వీరు దేవభిషగులు చ్యవన మహర్షికి యౌవనము, నేత్రదానము చేసినట్టి ప్రసిద్ధులు. ప్రతిఫలముగా యజ్ఞ హవిర్భాగమునకు అర్హత కల్పింపబడినది 'శర్యాతించ సుకన్యాం చ చ్యవనం శక్ర మశ్వినౌ' 'యేతేషాం స్మరణా న్నృణాం నేత్రరోగః ప్రణశ్యతి' యని యభిమంత్రించిన జలము కంటి రోగము బాగొట్టును అట్టి విశేష ప్రధానము గల యశ్విని దేవతల యొక్క భిషగ్ శక్తియు పరమేశ్వరియే (వసంత నవరాత్రులు–చైత్ర మాసారంభమున)

1032 ఓం కృత్తికాయై నమః

కృత్తికా స్వరూపిణియైన దేవి శరదృతువుకు సంబంధించిన రెండు చాంద్రమాసములు ఆశ్వయుజము కార్తికములు కృత్తిక యన యారు నక్షత్రముల సముదాయము మేష వృషభ రాసులలో సంధి వ్యాప్తమై వెలుగుచుండును ఆ నక్షత్రమున పూర్ణ చంద్రునిగా వెలుగుటచే కార్తిక మాసమైనది ఆ రెండు మాసములు రవి, దక్షిణాయనము నందుండు కాలము జ్యోత్స్నా రూపయైన పరమేశ్వరిని యర్చించ విశిష్టమైన కాలమును, కాళీ ఉపాసనలో దక్షిణ కాళికగా నుదహరించబడు శక్తి స్వరూపిణి దక్షిణాయనము సూర్యప్రభావము తగ్గి, ఉత్తరాయణమున పెరుగుచుండును కృత్తిక యన మూడవ నక్షత్రము. అగ్నిదిక్కు, కత్తెర రాశి, కార్తి మంగళికత్తి రూపికయైన నక్షత్రము నక్షత్రముల లో వాస్తుని

భార్య యరుంధతి దక్క, మిగిలిన పత్నుల రూపున స్వాహాదేవి యగ్నిని కూడినది, వారు నిర్దోషులుగా నక్షత్ర రూపమున ప్రతిష్ఠులైరి కార్తికేయుని మాతలుగా ప్రసిద్ధి నందిరి స్కందమాతయని దేవికి నామము సప్తమాతృకలుగా పూజార్హులైన గణము 2) కృత్తికాదీపం నాడు కటిపతంగా మశకాశ్చ వృక్షా జలేస్థలే యేని వసంతి జీవా దృష్ట్వా ప్రదీపం నచ జన్మభాగ్యా భవంతి నిత్యం శ్వపచాహివిప్రా -అట్టి కృత్తికాదీప రూపిణి

1033 ఓం పుష్యాయై నమః/పుష్పాయై నమః

పుష్య స్వరూపిణియైన దేవి పుష్యతి ఇతి యనబడును పుష్య మాసము కలియుగము యను అర్థములు గలవు పొట్ల రూపముగల పుష్యమి నక్షత్రము దీనికి సురల గురువైన బృహస్పతి యధిష్ఠాత. పూర్ణ చంద్రుడిగా పుష్యమీ నక్షత్ర వ్యాప్త కాలము గురుమండల ప్రభాయుక్తమైన జ్యోత్స్న ప్రభావము గలది గురుమండల మధ్యగ ఋణి మూడు నక్షత్రములు విశేష ప్రఖ్యాతి గాంచినవి పుష్యమాసము-ఉత్తరాయణమునందు రవి ప్రవేశించిన కాలము ఈ పుష్యమాసము మకర సంక్రాంతి సమీపమున నారంభగును సూర్యమండల మధ్యగతయైన దేవి యర్చనము విశేష ఫలప్రదము పుష్యమీ నక్షత్రమున్ను సర్వశుభకార్యముల విశేష ఫలిత మిడు పుణ్యకాలము పుష్టి కలిగించునది యని యర్థము తుష్టి, పుష్టి రూపముల సర్వప్రాణుల యందు పరమేశ్వరి వెలుగుచుండును అట్టి త్రైలోక్య వీర్య సంపన్నయైన పరమేశ్వరిని చింతించ తత్ శుభఫలితము కలుగును

1034 ఓం తేజస్విన్యై నమః

తేజస్విని స్వరూపిణియైన దేవి- తేజోవతి (452) తైజసాత్మిక (259) యని లలితానామములు గలవు, స్వప్నావస్థ యందున్న తైజసుడనే సూక్ష్మదేహాభిమానియగు జీవుని యాత్మ రూపము తేజస్సు చైతన్యాత్మక ప్రకాశము అఖండ చైతన్యమే స్వరూపముగా గలది సూర్యచంద్రాగ్ని నక్షత్రముల ప్రభాసయుక్తమైనది 'ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గి సూర్యచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః' గార్గి యను వాచక్నవి వచక్నుని పుత్రిక బ్రహ్మము నెరిగిన యుత్తమురాలు గార్గి దుర్గయను యర్థమును గలదు దుర్గ జాత వేదస యగ్నిస్వరూపము త్రివిధావస్థల జ్ఞానస్వరూపము 2) శ్రీచక్రమందలి నవావరణముల తేజో కిరణముల మొత్తము 365గా వ్యాప్తమగును దీనివు వివరం

1 త్రిగుణాత్మక నాద ప్రకృతి 3 X 5 = 15 5 చతుర్దశాత్మక ఈ కారం 14 X 4 = 56

2 అష్టమూర్త్యాత్మక క కారం 8 X 1 = 8 6 అష్టమూర్త్యాత్మక హకారం 8 X 8 = 64

3 దశమూర్త్యాత్మక రేఫ 10 X 2 = 20 7 షోడశాత్మక స కారం 16 X 7=112

4 దశమూర్త్యాత్మక ఏకారం 10 X 6 = 60 8 పృథివ్యాత్మక ల కారం 10 X 3 = 30

మొత్తం = 365

కఏఈల హ్రీం, హసకహల హ్రీం, సకల హ్రీం, అను పంచదశీ కూటములయందు గల యక్షరములు వాని గణన విలువ క-1, ర-2, ఏ-6, ఈ-4, హ-8, స-7, ల-3గా నుండును ప్రకృతి 5 పంచ భూతాత్మకము 365 సంఖ్య సంవత్సరమునందలి యహోరాత్రముల సంఖ్య.

సహస్రనామముల శ్లోకసంఖ్య 182 1/2 X 2= 365 పాదములయను వివరణ గూఢార్థదీపిక యందు గలదు

1035) ఓం చంద్రమండలాయై నమః

చంద్ర మండల స్వరూపిణియైన దేవి ఆకాశమున చంద్రజ్యోత్స్న వ్యాప్తమగు తలము చంద్ర మండలము సాయంకాలానుష్ఠానముల చంద్రమండల మధ్యస్థగా దేవిని యారాధింతురు శ్రీచక్రము నందలి చంద్రమండలమును షోడశదళ పద్మస్థగా భావించి తత్తత్ కిరణములైన స్వరములు తదధిష్ఠాతృలైన, అమృత, మానద, పూషా, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశినీ, చంద్రికా, కాంతి, జ్యోత్స్న, శ్రీయై, ప్రీతి, అంగదా, పూర్ణ, పూర్ణామృతయను పదునారు కళల నిక్షేపింతురు అందు

పదునారవదైన పూర్ణామృత కళ తరగని సాదాఖ్యకళ, పరిపూర్ణ చంద్రజ్యోత్స్న స్వరూపిణిగా పరమేశ్వరి వెలుగుచుండును 2) పురుష శరీరమున మూడవ కూటాంతము ద్వాదశాంతం పరాకాశమని యందురు అదియే సుధాబిందువైన బిందు మండలము సూర్యచంద్రాగ్నుల సంధి స్థానము 'అ'కారసంజ్ఞగల పరమేశ్వరుడు, 'హ'కార సంజ్ఞ గల పరమేశ్వరీ మేళన స్థానము.సాక్షి బ్రహ్మాసోహం, హంస స్థానమును నదియే చిదాకారమైన చంద్రమండల సంజ్ఞ గలది ఆ స్థానమున పరమేశ్వరిని నిక్షిప్తపరిచి ధ్యానించగా చంద్రమండల మధ్యస్థా యందురు 'సహస్రారే పద్మే శశిరమహాసాం బిందుమపరం' 'ఇదివ శ్రీచక్రం పరఘుమితిత ద్విందవం'పరఘుం=అమృతబిందు స్థానం తేనె తుట్టియని యర్థము మధువు స్రవించు స్థానమైన పరమేశ్వరి నెలవు

1036 ఓం సూక్ష్మాయై నమః

సూక్ష్మస్వరూపిణియైన దేవి 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అందు అతి సూక్ష్మమైన యణురూపము స్థూలదృష్టికి గోచరము గాని పరిమాణము స్థూల సూక్ష్మకారణ శరీరములను మూడింటియందు, సూక్ష్మరూపమున గోచరించు ప్రాణస్వరూపము పరమేశ్వరి సూక్ష్మదేహము పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణ, శబ్దాది పంచభూత తత్వం, మనోబుద్ధి చిత్తాహంకార కూటమి స్వరూపము 'సూక్ష్మాత్ సూక్ష్మతరం నిత్యం' యని బుద్ధికి కారణమగు సూక్ష్మ ఆత్మస్వరూపము దేవి

1037 ఓం సూక్ష్మపదాయై నమః

సూక్ష్మపద స్వరూపిణి 'ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానాంచాఖిలేషుచా, యా భూతేషు సతతం వ్యాప్తై దేవ్యై' సూక్ష్మరూపమునన్ని ప్రాణులయందును, త్రైలోక్య వ్యాప్త స్వరూపిణియైన సూక్ష్మపద సంస్థిత పరమేశ్వరీ స్వరూపమే పరమేశ్వరి నెలవు యుపాసన యందునను సూక్ష్మబిందువుగా నెంచుదురు అట్టి సూక్ష్మబిందు నివాసినిగా, యమృతమయి యైన జ్యోత్స్నగా పరమేశ్వరి సర్వవ్యాప్తము. 'కలకాష్ఠాది కాలరూపిణీ'' చిత్తరూపేణ యాకృత్స్నమే తద్వ్యాప్త స్థితా జగత్' 'ఆధారభూతా జగతస్త్వమేకా, మహీస్వరూపేణ స్థితాసి' 'అపాం స్వరూపస్థితయా, త్వయై తదాప్యాయతే కృత్స్నమలంఘ్య వీర్యే' 'త్వం వైష్ణవీ శక్తిరనంత వీర్యా, విశ్వస్య బీజం పరమాఽసి మాయా' బీజమునందు సూక్ష్మమైన యంకుర రూపము మొదలుకొని త్రిలోకవ్యాప్తము పరమేశ్వరి సూక్ష్మపద వ్యాప్తరూపిణి, విశ్వరూపిణి యగుచున్నది

1038 ఓం సూక్ష్మసూక్ష్మాయై నమః

సూక్ష్మము కంటే సూక్ష్మమునైన స్వరూపము గలది దృక్ సాధ్యమగు వెంట్రుక రూపమును సహస్ర భాగములుగా విభజించ నేర్పడు పరిమాణము సూక్ష్మము దానికంటెను యతి సూక్ష్మరూపిణియైనది సూక్ష్మతరము, సూక్ష్మతమము యనబడు స్వరూపముల వివరించుటకు, సూక్ష్మాతిసూక్ష్మ స్వరూపముగలది యందురు అట్టి పరమేశ్వరిని యోగమున గాని గుమించలేము 'సూక్ష్మాదాకాశ దేరపి సూక్ష్మతరం। నిరతియం హ్యస్య సౌక్ష్మ్యం సర్వకారణత్వాత్, సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి' యని సూక్ష్మతర వివరణ

1038 ఎ) ఓం భయవినాశిన్యై నమః

భయమును పోగొట్టు పరమేశ్వరి స్వరూపిణి 'యాచస్మృతా తత్ క్షణమేవ హంతిన। సర్వాపదో భక్తి వినమ్ర మూర్తిభి' మరియు 'దారిద్ర్య దుఃఖ భయహారిణి, కాత్వదన్యా సర్వోప కార కరణాయ సదార్ద్ర చిత్తా' 'సర్వబాధా ప్రశమనం త్రైలోక్య స్యాఖిలేశ్వరి, ఏవమేవ త్వయా కార్యమస్మద్వైరి వినాశనం' 'దేవీ ప్రసీద పరిపాలయనోఽరి భీతే ర్నిత్యం యథాసుర వధాదధునైవ సద్యః। పాపాని సర్వజగతాం ప్రశమం నయాసు। ఉత్పాత పాక జనితాంశ్చ మహోపసర్గాన్' యని ప్రార్థించగా స్మరణ మాత్రముననే

'దుర్గే స్మృతా హరసి భీతిం అశేషజంతో' జంతు మహమ్మారి, క్రూరజన కారక సకల భయములను పోగొట్టి 'కరోతుసానః శుభహేతురీశ్వరీ, శుభాని భద్రాణ్యభిహంతుచాపదః' యని సదారక్షించు చుండును

**వరదా భయదా చైవ ముక్తిబంధ వినాశినీ**
**కామకా* కామదాక్షాంతా కామాఖ్యా కులసుందరీ (162) కాముకా**

**1039 ఓం వరదాయై నమః**

వరదయైన దేవి పునరావృత్తి గలిగిన నామము (140) 'వరదాహం సురగణా వరం యన్మనసేచ్ఛథ, త్వం వృణుధ్వం, ప్రయచ్ఛామి జగతాముపకారకం' యని దేవి పలికినది మునులును 'ప్రణతానాం ప్రసీద త్వం దేవి విశ్వార్తి హారిణి త్రైలోక్యవాసి నా మీడ్యే లోకానాం వరదాభవ' యని వేడిరి యజ్ఞము లందు యజమాన స్వరూపమున వరం-దక్షిణలను నొసంగునది 'వరం దక్షిణం దదాతి యజమాన రూపిణీశివా వరదః' 'స్తుతా సంపూజితా పుష్పైర్ధూప గంధాది భిస్తథా, దదాతి విత్తం పుత్రాంశ్చ మతిం ధర్మేగతిం శుభాం' యని సంపూజితా దేవి సర్వలోక ప్రభుత్వం సర్వసిద్ధి ప్రసాదమిడును

**1040 ఓం భయదాయై నమః**

వైరులకు భయమును గలిగించునది దేవి భక్తుల భయమును పోగొట్టునదిగా భయాపహాయను నామము గలిగియున్నది కాని మూఢచిత్తులు గర్విష్ఠులైన యసుర జనములకు భయమును గల్గ జేయు పరమేశ్వరీ రూపము 'రక్తాంబరా, రక్తవర్ణా, రక్తసర్వాంగ భూషణా, రక్తాయుధా, రక్తనేత్రా, రక్తకేశాతి భీషణా రక్తతీక్ష్ణనఖా, రక్తద(ర)శనా రక్తదంష్ట్రికా' యను వికృతరూపము 'దీర్ఘాలంబవతీ స్థూలౌ, తావతీవ మనోహరౌ'' కర్కశా వతి కాంతౌ' యని విభిన్న రూపభావన గలదు 'స్ఫురద్దశన దంష్ట్రాభా భీమ రూపాపి భూమిపః రూప సౌభాగ్య కాంతీనాం సాప్రతిష్ఠామహాశ్రియా' 'సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యే విచరంతితే యానిచాత్యర్థ ఘోరాణి తై రక్షాస్మాం స్తథా భువమ్' ఇట్టి భయం కరమైన రూపము భక్త సంరక్షణార్థమే దేవి వహించును 'దృష్ట్వైవ కిం నభవతీ ప్రకరోతి భస్మ, సర్వాసురానరిషు యత్ప్రహిణోషి శస్త్రం। లోకాన్ ప్రయాంతురిపవోఽపి హి శస్త్రపూతా, ఇత్థం మతిర్భవతి తేష్వపి, తేఽతి సాధ్వీ' భస్మం చేయ వలెనను ఉగ్రరూపిణియైనను యతి సాధ్వియైనది 'భీషాఽస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ'

**1041 ఓం ముక్తిబంధ వినాశిన్యై నమః**

ముక్తి నిరోధక బంధముల వినాశనము చేయును అంబకు ముక్తిదా, ముక్తినిలయా, ముక్తి రూపిణీ యనునామములుగలవు కాని ముక్తియంత సులభము కాదు భువమునందు పత్నీ పుత్ర బంధుసేవక, ధనగృహాది బంధములు యైహిక సుఖ కారకములు ఈషణాత్రయము (దారాపుత్ర ధనేషణా) స్వీయ కర్మ భోగమున, శరీరమున గలుగు వికారాది బంధములు, అవిద్యాది యనేక బంధములు గలవు. 'జ్ఞానినామపి చేతాంసి దేవి భగవతీ హిసా బలాదా కృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి' ముక్తి యన పునర్జన్మ లేకుండుట నిత్యసచ్చిదానందాంబుధి తేలుచు పరబ్రహ్మైక్య స్వరూప స్థితి నందుటను సమాధి స్థితి ఈ మోక్షమునకు భక్తి జ్ఞాన వైరాగ్యములను మూడు విధములు విముక్తత నెంది మనగును బిందు స్థితయైన పరమేశ్వరిపై నిలిపి భవబంధ నిరోధక స్థితి నందవలెను ఆ బంధ వినాశము పరమేశ్వరీ కృప వలననే గలుగును

**1042 ఓం కామకాయై నమః/కామికాయై నమః**

కాముకియైన పరమేశ్వరి పరమేశ్వరికి గల నామములు కామరూపిణీ, కామకలారూపా యని గలవు కాముక యన యాసక్తి గలిగియుండును కోరికలు గలిగియుండుట యును, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి స్వరూపిణీ, సకల ప్రాణులయందు నిహితము, మనుగడ కావశ్యకమైన యాహార

నిద్రాభయమైథునాది కార్యజ్ఞానమును గలిగించుచు, కాముక భావమున సర్వవ్యాప్తయైన పరమేశ్వరి 2) సదాశివ రూపుడైన కామేశ్వరుని పర్యంకమునందు సచ్చిదానంద భావమున నిత్యము తీలియాడు యాసక్తి భావమును గలిగినది. మానవ శరీరమందు భ్రూ మధ్యమున గల బిందువునందు శివశివాయుతమైన యుద్దీప్త శక్తి కాముకలకు ప్రతీక పరమేశ్వర సంగినియైన యభిన్న రూపమును తెలుపును

1043 ఓం కామదాయై నమః

కామద యైన పరమేశ్వరి కామద యను కోర్కెలనొసగునది వాంఛితార్థ ప్రదాయినియును. ఐహికాముష్మికాది సుఖములలోనేది కోరనది యిచ్చును. 'పుత్రమిత్రధనం ధాన్యం హస్తి అశ్వాల ఖాని గోరథం' మున్నగునవి కాని వానినే బంధములుగా చేయుట మహామాయాకృత్యం తన సన్నిధికి, ఈ భ్రమలు కలిగింపజేసి, దూరముగా నుంచుచుండును సురథుడ విభ్రంశ రాజ్యమడుగగా నిచ్చినది కాని సమాధి వైశ్యుడు దేవిని జ్ఞానము కోరగా మోక్షకారకమైనట్టి జ్ఞానము నిచ్చినది అట్టి మోక్షసద్గతి, ధర్మార్థ లౌకిక వాంఛల ప్రదాతగా పరమేశ్వరి కృప గాంచును అటులే నిర్గుణ, నిర్వికార, సచ్చిదానంద పరబ్రహ్మ ప్రాప్తియును మోక్షపదము నందిచ్చును 'కారుణ్య కందళిత కాంతి భరం కటాక్షం' 'సంపత్కరాణి సకలేంద్రియ నందనాని సామ్రాజ్య దాన నిరతాని సరోరుహాక్షి' యని కామద రూపము.

1044 ఓం క్షాంతాయై నమః

క్షాంతి స్వరూపిణియైన దేవి 'యాదేవి సర్వభూతేషు క్షాంతిరూపేణ సంస్థితా' సర్వజీవుల యందు క్షమా రూపమున నెలకొన్న దేవి రూపము ఈ నామము పునరావృత్తి (276) గలది విభిన్నంబు యర్థములు ఓర్పు, తితిక్ష, సామర్థ్యము, తండ్రి, జన్మనిడిన వాడు ఇందుసకల జీవుల యందు ప్రేమ, క్షమారూపమున సంస్థితయగు దేవి 'పిత్యంచ హం తృప్తతదేవ పరాక్రమాణాం, వైరిష్వపి ప్రకటితైవ దయాత్వయేద్దమ్' 'శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే సర్వస్యార్తి హరే' యని దేవిని భక్తులు, వైరి జనమును భేదముండదు. అందరియెడ సమానభావము గలిగి, వారి క్షేమము గూడ తాను వహించు చుండును అట్టి క్షమాస్వరూపి యైన దేవిని శంకరులు 'కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతాన భవతి' యని కీర్తించిరి 'చిత్తే కృపాసమర నిష్ఠురతాచ దృష్టా, త్వయ్యేవ దేవి, వరదే భువనత్రయేపి' యని దండ, దయామూర్తియైన పరమేశ్వరి సకల ప్రాణుల యెడ క్షమామూర్తిగనే వెలగుచుండును

1045. ఓం కామాఖ్యాయై నమః

కామాఖ్య రూపిణియైన దేవి ఈ నామము పునరావృతమైనది (29) కామాఖ్య పీఠమునందు నరకుని స్థలమైన ప్రాగ్జ్యోతిష పురముగలదు (గౌహతి అస్సాం రాజధాని సమీపము) లలితా నామములలో లేదు కాని కాళీ పురాణమున దీని ప్రాశస్త్యము గలదు వసిష్ఠుల వారు వారాహ రూపియైన విష్ణువు ప్రేరణచే నటు చేరి దేవిని పూజించి నట్లు గలదు మ్లేచ్ఛులు వ్యాపించగా వసిష్ఠులు శివుని ప్రార్థించగా, వారిని వెడల గొట్టి శివగణములు వశిష్ఠాశ్రమమును గూడా ధ్వంసము చేసిరి దాన కోపించి కాళీ రూపియైన కామాఖ్య పూజ వామాచారమున, మద్యమాంస విక్రయాదుల జరుగునని శపించెను నరకుడు సుబుద్ధియైనంత వరకు దేవి సర్వకామ్యముల నిడెను ఆపై నిందకుడు గాగా నద్భుతమాయెను కృష్ణ పరమాత్మ వానిని సంహరించెను విశేష శక్తి పీఠమైన కామరూపదేశ స్థితయైన పరమేశ్వరి కామాఖ్యగా ప్రసిద్ధి గాంచినది

1046 ఓం కులసుందర్యై నమః

కుల సుందరియైన దేవి కులమనగా వంశము పైతృక, విద్యావంశములు సాంప్రదాయం, పాతివ్రత్యాది గుణశీల సదాచారములు గల పరమేశ్వరి కులము యన సుషుమ్న మార్గము దాని

కుండా ప్రాణములు పయనించి శ్రీమహాత్రిపుర సంస్థిత బిందు రూపమున చేరుటకు ప్రయత్నించును ఊర్ధ్వ యధోముఖముల హంసస్సోహం భావమున పయనించు ప్రాణకళ కులమనబడును ఇందుబ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథి ఛేదాత్మకమైన నిత్యబిందు నివాస స్థానము కులమందురిది 'మూలాధారాది కం చక్ర షట్కంకులం కుః' యన పృథ్వీ తత్వం 'యత్రలీయ తే తత్ కులం మూలాధారాది షట్చక్రాధారమైన కుండలినీ స్వరూప పరాశక్తి హంస స్వరూపిణి కులాంగన మనోవాక్కాయ కర్మల పరమశివుని మనోనుకూలయై వర్తించు దేవి కులసుందరి

సుఖదా దుఃఖదా మోక్ష మోక్షదార్థ ప్రకాశినీ
దుష్టాదుష్టమతిశ్చైవ సర్వకార్య వినాశినీ(183)

1047 ఓం సుఖదాయై నమః

సుఖము నిడు పరమేశ్వరీ స్వరూపము ఐహికాముష్మికాది సమస్త సుఖములను కైవల్యమైన సచ్చిదానందమును ప్రసాదించు పరమేశ్వరి విషయ సుఖములు యైహికములు, పరమ సుఖము లాముష్మికములు పుత్ర పౌత్ర ధనం ధాన్యం హస్తి, అశ్వా, అజా, అవిగోరథాదులు వీని వలన గలుగు నైహికమైన సుఖముల నిడును అటులే భక్తిజ్ఞాన వైరాగ్యములను మార్గముల పరమేశ్వరిని ధ్యానించ మరల జన్మలేనట్టి నిత్య, నిర్మల, నిరామయ, పరబ్రహ్మైక్య సంధానము నందుగల పరిపూర్ణ చంద్రజ్యోత్స్నా రూపి యమృత పానము చేయు బిందు సంధాన స్థితియు నామె యనుగ్రహముననే గలుగుచుండును వైరి గణములనణచి ప్రశాంత మనముల గలిగించును సుఖమన మానసిక సంస్థితి 'మహాలక్ష్మి మహాకాళీ చైవ ప్రోక్తా సరస్వతీ। ఈశ్వరీ పుణ్యపాపానాం సర్వలోక మహేశ్వరీ' 'కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై నమో నమః' సకల శుభ కళ్యాణ ప్రాప్తికి పరమేశ్వరీ వుపాసనయే సాధన మార్గము

1048 ఓం దుఃఖదాయై నమః

దుఃఖమును ప్రసాదించునది సమస్త ఐహిక యింద్రియ గత సుఖములన్నియు క్షణికములే వాని సాధనచే దుఃఖ ప్రాప్తి గలుగును పరమేశ్వరీ, మహామాయచే యిదముల వానిచే నాకర్షింప బడునట్లు చేయగా నదియె దుఃఖ ప్రాప్తి కారణము 'మమర్తగ ర్త్వాతి మహాంధకారే, నిభ్రామయత్యేత దతీవ విశ్వమ్' 'విధేరజ్ఞానేన ద్రవిణ విరహేణా లసతయా విధేయాశక్యత్వాత్తవ చరణ యోర్యా చ్యుతిరభూత్। తదేతత్ క్షంతవ్యం' యని యపరాధ స్తోత్రం గదిసి ప్రసీద పరమాభవతి భవాయః సద్యో వినాశయసి కోపవతి కులాని' యని 'క్షిప్రవృతి కుపితాంతకదర్శనేన' అందువలన అంబను ప్రసన్నము చేసి కొనగా దుఃఖ హంత్రి గానగును మరచినచో దుఃఖదాయిని అగును

1049 ఓం మోక్షాయై నమః

మోక్ష స్వరూపిణి యైన దేవి మోక్షమునకు అవసానము, ముక్తి,విడుదల, మరణము యను యర్థములు గలవు మోక్షమన కైవల్యము, తురీయాతీత స్థితి 'తద్విష్ణోః పరమం పదం' మనోవృత్తుల సంపూర్ణముగా నశింప జేయుట వేద విహిత కర్మలు చేయుచు వైరాగ్య మందుండుటచే చంద్రలోక ప్రాప్తి జ్ఞానయుత నిష్క్రియా చరణచే యోగులు సూర్యమండలము భేదింతురనుట విదితమే అద్వైత భావనచే కర్మజ్ఞాన వైరాగ్య రహిత పరబ్రహ్మ స్థితబిందు లయమందుటచే బ్రహ్మలోక ప్రాప్తి' లేక కైవల్యము, అదే మోక్షము నంద గలరని యభిప్రాయము అట్టి యైహిక విముక్తి నందుచు మోక్షమార్గమున పయనించు మతి గలుగుట పరమేశ్వరి కృపాలబ్ధమే యగును.

1050 ఓం మోక్షదాయై నమః

మోక్షదాయి యైన పరమేశ్వరి మోక్షస్థితి యందు నిష్కామ కర్మల జ్ఞాన సముపార్జనచే పరమేశ్వరి యుపాసన చేయు వారలకు యనతి కాలములో సాలోక్య, సామీప్య సారూప్య సాయుజ్యములను

నాలుగు పదములు లభించుచుండును ఆరాధితా దేవలోకావాసము, దేవతా సమీప స్థితి,ఆరాధిత దేవతారూపము దేవతా రూపమున తాదాత్మ్యత నొందుట చివరి సాయుజ్య స్థితియే కైవల్యము పరమేశ్వరి యనుజ్ఞ వలననే, నీ పదములు గలుగును గాన మోక్షదాయి యగును 2) స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయ నాశనమే కైవల్యము 'ఆత్మబుద్ధ్యా ప్రతీకేనా, మాతృబుద్ధ్యాప్యహంధియా। కర్మణాపి భజన్మర్త్యః కైవల్య పదమశ్నుతే' ఆత్మబుద్ధి, దైవ కర్మల కైవల్య ప్రాప్తి గలుగును

1051 ఓం అర్థప్రకాశిన్యై నమః

అర్థముల ప్రకాశింప జేయునది చతుర్విధ పురుషార్థములే యర్థములు అవి ధర్మ, అర్థ, కామ, మోక్షములన బడును 1 తానభిలషించు తాత్కాలిక సుఖములకై యనుకూల గ్రహణ, ప్రతికూల విసర్జన, కామసంజ్ఞ గలది 2) ఆయుపాయ సాధనలకై యనుష్ఠించుట యర్థసంజ్ఞ గలదు 3) ఇష్టప్రాప్తికి, యనిష్ట నివృత్తికి వలయు సాధనల గ్రహించునది ధర్మసంజ్ఞ 4) పునర్జన్మ రహిత శాశ్వత సుఖము గలిగింప జేయునది మోక్ష సంజ్ఞ కాని యా నాలుగు సంజ్ఞల యర్థములు యాపత్కలమెట్లన ధర్మ విధానముగ నర్థసముపార్జన జేసి, కామ్యకర్మల దేవి యుపాసనాదులకై యార్జితధన మందు కొంతభాగము వెచ్చించుచు, దైవ సంబంధ కర్మలు,ప్రాణి హిత కారకములైన కామ్యకర్మల జేయుచు మోక్షము నందవలయునని యర్థము కాని తనకు హితమైన యధర్మ మార్గముల నర్థము నార్జించుచు స్త్రీ భోగాది కామముల వానివి వెచ్చించుట, మోక్షమున దేహత్యాగమనే యర్థమునెంతురు 'ఆరోగ్యార్థమర్చయేత్ సూర్యం ధర్మమోక్షాయ మాధవం। శివం ధర్మార్థమోక్షాయ చతుర్వర్గాయ చండికాం' యని చతుర్విధ ఫలపురుషార్థములకు చండికార్చన తెలిపిరి

1052 ఓం దుష్టాదుష్టమత్యై నమః

దుష్ట అదుష్టమతిరూపిణియైన దేవి ఇందు దుష్టమతి, అదుష్టమతి స్వరూపమును నైన పరమేశ్వరి. దుష్టయన కల్లరి, గడుసు, టుంటరి, దుడుకు, పాప, నీచ, దుర్బల, దోషయుక్త మనమను భావముగలదు అదే బుద్ధి విశేషము 'యాదేవి సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా' యనియు, 'చితిరూపేణ యాకృత్స్నమేతత్ వ్యాప్యస్థితా జగత్' యని సర్వవ్యాపియైన మతిరూపిణి సంకల్ప వికల్ప కారణమైన మతియే దుష్ట, యదుష్టరూపము మనన శక్తిధర్మమును పొందినపుడు, మానసము, బ్రహ్మకళగా నెంతురు తుష్టి, పుష్టి నామములు, మనసుయొక్క నిశ్చలతత్వము, ధారణశక్తి సూచితమగును శివసంజ్ఞచే నొప్పు పరదేవత వేదజ్ఞాన ఖనిగా సర్వదేవ యజ్ఞాది కర్మలచే పూజింపబడును దుష్టయన యాసురిక్రియాకాండ ప్రధానమైనది. అదుష్ట, సురక్రియ, జ్ఞానకాండం ప్రధానమైన మతికి ప్రతీకగా వెలుగును ' మహర్ణ సరస్వతీ ప్రచేతయతి కేతునా। ధియో విశ్వావిరాజతి' యని దుష్టయదుష్టమతులు మనభావనలోనివే ఆ మతిస్వరూపిణి పరమేశ్వరియే

1053. ఓం సర్వకార్యవినాశిన్యై నమః

సర్వకార్యముల వినాశకర్త్రి యైనది సర్వార్థ సాధకి, సకల వాంఛాప్రదాయినిగా అంబను గొలుచు నపుడు విభేదించి సర్వకార్య వినాశినిగా యెట్లు స్తుతించిరి పైన తెలిపిన సంకల్ప వికల్పాత్మకమైన మృత్యుత్పన్నములు అహంతా భావయుక్త కార్యములు యనగా తాను తన వారు యను స్వార్థబుద్ధితో కూడుకొనియున్న క్రియలు దేవికి సమ్మతములు గావు ఆత్మసమర్పణ చేసి యంతయు దేవి దత్త ప్రసాదమేయని తృప్తి భావన గలిగి వరించ వలెను అట్టిస్వార్థ పూరిత కార్యములు,సత్ఫలితముల నిడవు త్రైలోక్య స్వ హితార్థాయ చేయు యజ్ఞయాగాది స్వరూపిణియైన దేవి, యాసురి ప్రవృత్తి గలిగి యహంభావ యుక్తములైన కార్యముల నశింప జేయుచు వైరాగ్య భావన పెంపొందించి మోక్షమును గల్గింప పసుష్మరాలుగదా

శంక్రాధారా శక్రరహితా శంక్ర సింధునివాసినీ
శంక్రాలయా శక్రభోగా శంక్రపూజా సదారతిః(164)

1054) ఓం శుక్ర ధారాయై నమః / శుక్రాధారాయై నమః

శుక్రాధారా రూపిణియైన పరమేశ్వరి శుక్ర విశేషణము గల నామములు మొత్తం ముప్పదియారు వరుసగా గలవు అందు శుక్ర పదము ప్రస్తుత విశేషార్థము క్రమముగా నన్వయము చేసికొనవలసియుండును శుక్రపద విశేషణము గల పదముల కన్వయము శుక్రము- శుక్లము, శుక్రయన వొంటికన్ను (శుక్రాచార్యుడు), వేగుచుక్క (రిక్క), వాలుచుక్క, అగ్ని జ్యేష్ఠమాసము, వీర్యము శుక్లము శుక్లమనగా సంవత్సరము, తెలుపు, శుక్లపక్షము, తదధి దేవత, యోగం, పరిశుద్ధము, దేవయాన మార్గము రజతము, శుభకర్మ, వీర్యము, వెన్నయను యర్థము గలదు. / ఇచట శుక్రాధార రూపమయిన పరమేశ్వరి యజ్ఞమున కావశ్యకమైన సంభారములలో సమిధలు, ఆజ్యము, క్షీరధారలును, అవి గో సంతతి వలన లభ్యమగుచుండును దేవపరమైన యజ్ఞయాగాదుల కావశ్యకమవు క్షీరాజ్యాదిధారా పరంపరలు యా పరమేశ్వరి కృపాలబ్ధములే, అట్టి సంతతి సంపత్ స్వరూపిణి సంపత్ ప్రదాతగా దేవిని గుర్తించవలెను

1055) ఓం శుక్ర రూపాయై నమః

శుక్ర రూపమైన దేవి శుక్రమన శుక్లవర్ణము, శ్వేత వర్ణము, సత్త్వ గుణమునకు ప్రతీక. స్థితికారుడైన విష్ణువు ప్రవృత్తిగుణము శుక్రమున యగ్ని స్వరూపమునునై యున్నది అగ్నియే పరిణతిజెందిన తేజస్సు రూపము సృష్టి కార్యమున కావశ్యకమగుచు నుండును అట్టి శుక్రరూపిణిగా పరమేశ్వరి యంశ వ్యాప్తమవుచుండును మేఘములు ఘనీభవించి భూతలమునకు వర్షించు క్రియలో, యంతర్నిహితమైన నోషధీ బీజములచే పుడమి ఫలవంతమగుచుండును అట్టి వర్ష జల రూపము శుక్రరూపమే 'ఆపోవా ఇదగ్ం సర్వం భూతాన్యాప ' జలరూపము, రసరూపము సర్వవ్యాప్తముని యుదహరించియుండిరి అట్టి సర్వవ్యాప్త శుక్రరూపియైన పరమేశ్వరిని జగదుత్పత్తి కారణశక్తిగా శుక్రరూపిణిగానెంచనగును

1056) ఓం శుక్ర సింధు నివాసిన్యై నమః

శుక్ర సింధువునందు నివాసినియైన దేవి సప్త సముద్రములని పురాణములు పేర్కొనబడియున్నవి సుధా, ఇక్షురస, క్షీర, దధి, ఘృత, లవణ, స్వాదు జలపూర్ణములు శుక్రము యన ప్రవహించు స్వభావము గల సప్త ద్రవపదార్థములు మణిద్వీపము చుట్టును నీ శుక్రాంబువులు నిహితమైయున్నవి అటులే విష్ణువు పాలకడలి యందుండునని యందురు శుక్ర సింధువులందు నివాసముండునట్టి పరమేశ్వరిగా నెంచనగును ఆధునికులు అరేబియా సముద్రం, హిందూ మహాసముద్రం, పసిఫిక్ సముద్రము, ఆర్కిటిక్ సముద్రం, అట్లాంటిక్ సముద్రం, నల్ల సముద్రముగా పేర్కొనిరి

1057) ఓం శుక్రాలయాయై నమః

శుక్రమున కాలయమైన రూపము ఆలయము యనయాధారము, కూడి యుండుట గృహము లయ పర్యంతమునుండు స్థితి జగదుత్పత్తి స్థితికారణమైన శుక్ర స్వరూపమై, ప్రాణికాధారమై వెలుగుచుండును శుక్రము వలన శిశువు పరిణతిజెంది, పెరిగి క్రమక్రమముగా గృహస్థుయై సంతతి గల్గి యాపై లయమై పోవునంతవరకు దేహరూపమున వర్తిల్లుచు విశ్వమందైక్యమునగుచుండును విశ్వకరణముల పునః సంయోగము రేతస్సురూపమున మరల భూమిని జన్మించుచుండును కావున ఆలయాంతము వర్తిల్లు పరమేశ్వరుని కృపారూపముగా నెంచనగును. శుక్రగ్రహము రతికారకము సౌమ్యరూపియైన నొద్దికగల సత్సంతానుగ్రహము కల్గించును వికటించిన విశృంఖలత్వమునకు కారకమై కట్టుకున్న భర్తనైనను చంపు వికృత భావములను గూడ గల్గించుచుండును

1058) ఓం శుక్రభోగాయై నమః

శుక్ర భోగ స్వరూపిణియైన దేవి భోగమునగా శరీరము, పాము, మానము, రాశి, యనుభవకాలము, రాజ్యము, భోజనము, భోగము, సుఖ దుఃఖాదుల యనుభవము. భోగమునగా శరీరము శుక్ర

కోటిత మిశ్రితమైన రూపుదాల్చి, శక్తి నిహితమైయున్నంత వరకు వర్తిల్లి మరల నిత్యకాల సముదాయము నందు లయమగు పరిణతులు గల ఆణవిక పదార్థము విధియందుము ఆ విధిననుసరించి జీవపరిణతి జెంది సుఖ దుఃఖాదుల ననుభవించి జ్ఞానియై తరించును భోగియై మరల రూపుజెందు చుండును అట్టి యనుభవైక వేద్యమయినట్టి కాల స్వరూపమే పరమేశ్వరి

శుక్రపూజ్యా శుక్రహోమసంతుష్టా శుక్రవత్సలా
శుక్రమూర్తిః శుక్రదేహా శుక్రపూజకపుత్రిణీ (166)

1059) ఓం శుక్ర పూజా సదారత్యై నమః

శుక్ర పూజయందు సదాయాసక్తి గల్గినట్టి పరమేశ్వరి జగదాత్మశక్తి 'హేతుస్సమస్త జగతాం త్రిగుణాభిభూతైః' 'ఆధార భూతా జగతస్త్వమేకా మహీస్వరూపేణయతః స్థితాऽసి' 'అపాం స్వరూప స్థితయా త్వయైతదాప్యాయతే కృత్స్నమలంఘ్యవీర్యే' 'త్వం వైష్ణవీశక్తి రనంత వీర్యా, విశ్వస్య బీజం పరమా సిమయా' యని పరమేశ్వరీ స్వరూపయైన యాదిశక్తి, ఉపాసనా స్మరణాదుల యందు, సర్వకాలములనాసక్తి గలిగియున్నట్టి స్థితి విశ్వస్వరూపియును, శుక్ర స్వరూపియైన పరమేశ్వరి విభూతియే ప్రకృతియనియెంచి, తత్ ధ్యాన సమాధియందు రతుడై, సదా పరమేశ్వరిని ధ్యానించు చుండవలెను శ్రవణ, మనన కీర్తనాదులైన, నవవిధ భక్తిక్రియల నెరుకగనుచుండవలెను

1060) ఓం శుక్ర పూజ్యాయై నమః

శుక్రముచే పూజింపబడునది దేవి పూజాంగములలో మంత్ర పాఠములలో దశాంగ సంఖ్యలో హోమము చేయవలెను అందు శుక్రరూపమైన ఆజ్యము చరువులు నుపయోగింతురు తేనెగూడ నుపయోగింతురు ఆహుతులచే దేవి పూజింపబడును అపై జలతర్పణము జలముగూడ ప్రాణాధారకముగా శుక్రరూపియైన పరమేశ్వరి మంత్రయుతముగా పూజింపబడును

1061) ఓం శుక్రహోమ సంతుష్టాయై నమః

శుక్రహోమముచే సంతుష్టురాలగుదేవి హోమ సామగ్రియందు శుక్రరూపమైన ఆజ్యముచే హోమము మంత్రపఠనము చేయుచు చేతురు అది పఠనావృత్తి సంఖ్యకు పదవవంత సంఖ్యగా చేయవలెను దాన పరమేశ్వరి సంతుష్టురాలగును హోమాహుతులచే స్వాహారూపమున దేవతలకు నిహితమైన యాహారము సిద్ధమగును పరమేశ్వరి స్వాహారూపిణిగా వెలుగును

1062) ఓం శుక్రవత్సలాయై నమః

శుక్రమందు ప్రీతిభావము గలిగియుండు పరమేశ్వరి యజ్ఞము ప్రాణపోషకమైన నిత్య క్రియ యజ్ఞమునకుపయోగపడు సంభారములన్నియు దేవీదత్తములే వినియోగమున నిత్యప్రాణ ప్రీతికరములు విశ్వధాత్రియైన పరమేశ్వరికి దాన ప్రీతిగలుగును ఉదయముననే జలముల సేకరించుట, సేకరించిన సమిధలు, ఆజ్యము, హోమమున వినియోగము జరుగుటచే యజ్ఞయాగాది క్రియల ప్రీతిభావము వెలుగును

1063) ఓం శుక్రమూర్త్యై నమః

శుక్రమూర్తియైన పరమేశ్వరి శుక్ర పదార్థమంతయు దేవి ప్రదత్తమే గోవును మాతగా పూజింతురు పంచగవ్యధారకమైన గోమాత ప్రకృతి స్వరూపిణి. అటులే ఓషధీ సంపదలిడు భూమాతను విభూతిగా గొలుతురు. అటులే జలరూపమైన పరమేశ్వరిని నది మాతగా గొలుతురు అగ్నిని త్రిధామ వ్యాప్త రూపిగా శుక్రాహుతుల దేవతలకు చేర్చెడి హవ్యవాహునిగా నెంతురు వాయువు నగ్నికి తోడుగా సంవహనకర్తగా దివివ్యాప్తమై వెలుగును విశ్వమూర్తిగా పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణియై, నిరాధార యాకాశతలమున నిశ్చలగతిని ప్రతిష్ఠింతురు ఇట్లు యనేక రూపముల వ్యాప్తమైన దేవి, వీర్యప్రసాదముననే క్రియ వెలుగుచుండును కావున శుక్రమూర్తియందురు

1064) ఓం శుక్రదేహాయై నమః

శుక్రరూపమైన దేహము గల్గినది శుక్లము శుక్రము, తేజస్సు వేగు చుక్కయైన శుక్ర నక్షత్రము శుభ్ర నిర్మల ప్రకాశము గలది అంబతేజముగూడ సూర్యకోటి సమప్రభయు చంద్రకోటి సుశీతల జ్యోత్స్నాసమము శుక్రతేజమును, యమిత ప్రభయు గలిగియున్నది దానిని గమనించి జీవజాలము వేకువనే పనులకుపక్రమింతురు పాంధులు పయనమగుదురు అట్టి శుక్ల రూప దివ్య తేజము, రూపమున పరమేశ్వరిని యెంచదగును సగుణ రూపము, మనమున కల్పించుకొనునది కాని నిర్గుణా రూపము వ్యాప్త మహత్తేజము

1065) ఓం శుక్ర పూజిత పుత్రిణ్యై నమః

శుక్ర పూజనముచే సంతతి ప్రసాదియైన పరమేశ్వరి రూపము వీర్య రూపమున విహిత కార్యములు చేయువారికి పుత్రసంతతి గల యిల్లాలుగా పరమేశ్వరి వెలుగుచుండును సృష్టి విధానము కొనసాగలందులకు దారాగ్రహణము, దాన వీర్య సేచనమున పుత్రవతి రూపియైన సాధ్వి, అవిచ్ఛిన్న దైవ యజ్ఞాదిక్రియల సహచరిగా వర్తిల్లుచుండును అట్టి సపుత్రసాధ్వి తోడులేనిది యజ్ఞాది దేవ పూజాక్రియల కనర్హత గలుగదు అట్టి దైవ కార్య దోహదకారియైన శుక్ర పూజిత పుత్రిణీ రూపియైయున్న దేవి

శుక్రస్థా శుక్రిణీ శుక్ర సంస్పృహా శుక్రసుందరీ
శుక్రస్నాతా శుక్రకరీ శుక్రసేవ్యాఽతిశుక్రిణీ (168)

1066) ఓం శుక్రస్థాయై నమః

శుక్ర సంస్థయైన పరమేశ్వరి శుక్రమందుండు రూపము వీర్యము బలయుతమైనపుడే సృష్టి సుధ్ధమగును పరమేశ్వరి పంచకృత్యములలో వీర్యస్థాపనమున శిశువు వృద్ధిచెంది, స్వవీర్య వృద్ధిగలిగి, పునః 'ఆత్మావైపుత్ర నామాఽసి' యన పుత్ర రూపమున స్థిరపడి యూపై కాలక్రమమున లయ మందును ఈ క్రియలన్నియు పరమేశ్వరీ కృపమూలమున జరుగును శుక్రమందుగల తేజోబలరూపములు అన్నియు పరమేశ్వరి విభూతులే

1067) ఓం శుక్రిణ్యై నమః

శుక్రిణీ రూపిణియైన పరమేశ్వరి జ్యోతిష్మత్, దీప్తం తేజోవీర్య రూపములును అంబ ప్రసాదములేయని వివరింపబడినవి అయితే శుక్ర రూపిణియైన పరమేశ్వరిని శుక్రిణియనుట పురుషుడియె తేజోవీర్యములు యంబ కృపవలననే వృద్ధిచెందుచుండును

1068) ఓం శుక్ర సంస్పృహాయై నమః

శుక్ర సంస్పృహ గలిగినట్టి పరమేశ్వరి స్పృహయన కోరిక వీర్యతేజములు ప్రతి ప్రాణికి యవసరము వాని వలన శరీర సౌష్ఠవము గలిగి దైవకార్యముల నియమమును దప్పక నెరవేర్పగలుగును అట్టి బల వీర్యములు త్రైలోక్యహితము కొరకును పంచ యజ్ఞ నిర్వహణము, స్వకులాభివృద్ధికి తోడుపడుచుండును కావున సమాహిత దృష్టినెంచి సైవానియెడల విహితమైన కోరిక గలిగియుండుట ఉపాసనచే పరమేశ్వరీ కృపాదత్తమైన సంతతిని గలిగి సన్మార్గమున నడుచుట యావశ్యకము

1069) ఓం శుక్రసుందర్యై నమః

శుక్ర సుందరియైన దేవి శుక్రమన తేజము స్వచ్ఛము అమలినమైన రూపము 'కల్యాణవృష్టిభి రివా మృత పూరితాభిః' 'కారుణ కందళిత కాంతిభరం కటాక్షం' అట్టి తేజోమయ మూర్తిని భువనమోహిని, భువన సుందరి, సర్వదేవమయమైన తేజోరూపిణియని యనేక రూపముల ననేక నామములను గొలుతురు అట్టి త్రైలోక్య మోహన సుందరి తేజోయుత స్వరూపమే శుక్ర సుందరియని గ్రహించదగును

**1070) ఓం శుక్ర స్నాతాయై నమః**

శుక్ర స్నాతయైన దేవి స్నాతయన మునుకవేసిన రూపము స్నానమున దేహమందలి మలినములు తొలగి తేజోయుతమునగును స్నానములలో ననేక విధి విధానములు గలవు సూర్యకిరణ స్నానము, చంద్ర కిరణ స్నానము, జల, భస్మ, తైల, క్షీర, మధు ఆజ్యాది ద్రవ్యముల పైపూతయు నాపై జలములచే స్నానము పూరించబడును పంచామృత స్నానములలో పయ, దధి, ఘృత, మధు, శర్కరా స్నానాదికములు క్రమముగా సాగును 'ఆపోవా ఇదగ్ం సర్వం, విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవః ఆపో, అన్నమాపోఽ మృతమాప స్సమ్రాడాపో విరాడాపః ఛందాగ్ం స్యాపో, జ్యోతీగ్ంష్యాప, యజూగ్ంష్యాప స్సర్వదేవతా ఆపో భూర్భువస్సువరోం' అని ఆపోవ్యాపకత నెంచుదుము అయితే శుక్రమసి జ్యోతిరసి స్వాహా, జ్యోతి స్సూర్య ఏర్పే, సూర్యజ్యోతి స్స్వాహా యని తేజోస్నాతయైన పరమేశ్వరీ రూపధ్యానము

**1071) ఓం శుక్రకర్త్ర్యై నమః**

శుక్ర కర్త్రి స్వరూపమే ఓషధీ, ఫల సముదాయములు తాపన సేచనాది క్రియల పరిణతి పొంది సత్వస్వరూపముగ మారి, దేహమందలి వివిధ భాగములకును శక్తిగలుగజేయుచుండును దాన దేహ చాలనాది క్రియలు సాగును అట్టి అన్నరసము శుక్ర రూపము లేక వీర్యముగా పరిణతి జెందుచుండును అట్టి వీర్య క్రియాదులు యారోగ్య శరీరమున క్రమపద్ధతిన సంభవమగుచుండును అట్టి యారోగ్యము వుపాసనాది నియమ వర్తనల వలన సాధ్యమగును పరమేశ్వరికి యర్పించి ప్రసాదముగా గైకొనగానది దేహ వీర్య సముత్పాదకమునై సుఖమయ జీవితము గల్గును అట్టి శుక్ర కర్త్రియైన పరమేశ్వరి

**1072) ఓం శుక్రసేవ్యాయై (స్వాహా) నమః**

శుక్రముచే సేవింపబడు పరమేశ్వరి 'త్వం వైష్ణవీ శక్తిరనంత వీర్యా' సృష్టిస్థితి కారణమునై, వీర్యముననే జగచ్చాలనము జరుగుచున్నది పంచ కృత్యాపరాయణా నిఖిలచేతనా క్రియా శక్తియా పరమేశ్వరియందే యున్నది యజ్ఞయాగాది క్రియలు నిత్య సాధనోపకరణములుగా యనంత వీర్యశక్తి ప్రభవించును జగత్ చాలనమున కాధారమునైయున్నది అందులకే గైకొను ఆహారము, చేయు క్రియల ఫలమును దేవతార్పణముగా చేతురు

**1073) ఓం అతిశుక్రిణ్యై నమః**

అతి శుక్రిణీ రూపిణియైన దేవి అనంత వీర్య సంపద గలిగిన దేవి రూపము ఇంద్రియాణామధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషుచ, యాభూతేషు సతతం తస్యై వ్యాప్తి దేవ దానవ రణాంతమున గెలిచిన దేవతలు తామే కారణమని విర్రవీగుచుండగా పరాశక్తి యక్షుని రూపమున నావిర్భవించినది వారంత బలవంతులైనచో నొక గడ్డిపోచను వారి శక్తులతో వశ్యము చేసికొమ్మని పలికినది అగ్నిదేవుడు తన దాహక శక్తిచే నేమియు చేయలేకపోయెను వాయువు తన వహన శక్తిచే యణుమాత్రమును కదల్పలేకపోయెను ఆపై యింద్రుడు ప్రయత్నించ చేరునప్పటికి యక్షుడదృశ్యమాయెను శచీపతి పరమేశ్వరిని గూర్చి ప్రార్థింప నామె ప్రత్యక్షమై హితవు బోధచేసినది దేవియథర్వ శీర్షమునందు 'అహం రుద్రేభిర్వసుభిశ్చరామి, అహమాదిత్యైరుత విశ్వదేవైః అహం మిత్రావరుణావుభౌ బిభర్మి అహమింద్రాగ్నీ అశ్వినావుభౌ, అహం సోమం త్వష్టారం పూషణం భగందధామి అహం విష్ణుమురుక్రమం బ్రహ్మాణముత ప్రజాపతిందధామి' యని, యన్ని శక్తులకును మూలకారణమైన పరమేశ్వరి అతిశుక్రిణీ అనంతవీర్య.

మహాశుక్రా శుక్రభవా శుక్రవృష్టి విధాయినీ
శుక్రాభిధేయా శుక్రార్హా శుక్రవందక* వందితా(167)    నందక

1074) ఓం మహా శుక్రాయై నమః

మహా శుక్ర స్వరూపిణి పైపదమునందలి యభిప్రాయమునకు మహత్- విశేషణ రూపము 'అహమానందా నానందా, అహం విజ్ఞానా విజ్ఞానా, అహం బ్రహ్మా బ్రహ్మాణీ వేదితవ్యా, అహంపంచ భూతాన్య పంచ భూతాని, అహమఖిలం జగత్' యని సకల చరాచర సృష్టి సకల భువన పాలనయాదేవి యొక్క నిత్యకృత్యములు వాని చాలనమున కావశ్యకమవు యనంత వీర్యము సమానముగా పంచగల నిధి స్వరూపిణి దేహమందలి సమాన వాయువు యన్నరస రూపమైన వీర్యమును దేహమునందలి యన్ని విభాగములకు పంచిపెట్టును అది విరాట్ రూపమున దేవి పరమేశ్వరి కృత్యము అట్టి మహదైశ్వర్య సంపన్నయైన పరమేశ్వరి నెరుకగనవలెను

1075) ఓం శుక్రభవాయై నమః

శుక్రభవ రూపిణి, యశస్విని యను దేవత సర్వధాతు సారముగు శుక్ల ధాతువునందలి యభిమానియైన దేవత సర్వ శరీరమున వ్యాపించి యుండు 'ఓజస్సు' యను ధాతువున కధిష్ఠాత్రియై వెలుగు చుండును గావున శుక్ర భవయనబడును సర్వ బీజగతమై సర్వ బీజ రూపమునై యుండును శుక్లము వలన ననేక రూపుల సృష్టి జరుగుచు దానినే నియతి జీవితకాలము వ్యవహరింతురు కావున శుక్రము వలన పుట్టుక, ఉనికి గలుగుచు వెలుగు నీ సంసారమునకు కారణభూతురాలైనట్టి పరమేశ్వరి శుక్రభవయగును

1076) ఓం శుక్రవృష్టి విధాయిన్యై నమః

శుక్ర వృష్టి విధి నిర్వహించు పరమేశ్వరి కాలక్రమణమున సంహార సృష్టి స్థితి లయాదుల క్రియా పరిణామ స్వరూపము భ్రమణ రూపముననే జరుగుచుండును పాంచభౌతికమైన దేహము శుక్ర శోణిత సంగమమున నేర్పడి జీవి స్వశక్తుడై రూపుగాంచి పునః తన రూపమును ప్రతిష్ఠించుచు లయము జెందుచునపుడు, మరల నాయాయంశలలో విలీనమవుచుండును ఇట్లు జలవాయు గతమైన యంశలు పునఃయంతరిక్షమునకు గొని పోబడి మేఘములుగా పరిణతిజెంది, ఋతు కాలమున మరల భూమిపైకి వర్ష రూపమున చేరుచుండును ఆ వృష్టి వలన భూమి యంతయు తృప్తిపై యందలి ఓషధీ సముదాయమునకు వీర్య సంపద గల్గియుద్భవించుచుండును అట్టి భ్రమణ విధాయకమైన శుక్ర వృష్టి విధానముయను కృత్యము నిర్వహించుచుండును

1077) ఓం శుక్రాభిధేయాయై నమః

శుక్రాభిధేయయైన దేవి అభిధేయమున పేరు, శబ్దముచే నెరుక గల్గునది విశ్వశుక్ర సంస్థ, విశ్వరూపి. 'ఆధారభూతా జగతస్త్వమేకా మహీస్వరూపేణయతః స్థితాసి, అపాం స్వరూప స్థితయా, త్వయైత దాప్యాయతే కృత్స్న మలంఘ్యవీర్యే' యనియును 'త్వం వైష్ణవీ శక్తిరనంత వీర్యా, విశ్వస్య బీజం పరమాసి మాయా' యని పరమేశ్వరి వీర్యమే యనంత సృష్టి స్వరూపమని ఆమె సర్వాధార, సర్వ బీజ స్వరూప, సర్వ శుక్రాధికా యని పిలువబడుచున్నది

1078) ఓం శుక్రార్హాయై నమః

శుక్రార్హయైన దేవి అర్హయను పదమున పూజింపదగినది విష్ణువు, శివుడు, ఇంద్రుడు, గతి, నడక యోగ్యత్వం అర్హయాయన జినుడు, క్షపణకుడు, సిద్ధుడుయని, బౌద్ధ జైన మతాధిపతులు 'యచ్చకించిత్ (జగత్ సర్వం) క్వచిత్ వస్తు సద సద్వాఖిలాత్మికే, తస్య సర్వస్య యాశక్తిః సాత్వం కింస్తూయసే తథా విష్ణుః శరీర గ్రహణ మహమీశాన ఏవచ, కారితాస్తే యతోఽతస్త్వాం కస్తోతుం, శక్తిమాన్ భవేత్' సకల దేవ వీర్యరూపిణియైన పరమేశ్వరి ఆద్యా, సనాతని, సకలదేవారాధ్యగా వెలుగును

1079) ఓం శుక్ర వందక వందితాయై నమః

శుక్రవందక వందితయైన పరమేశ్వరి వందకయన నమస్కరించువాడు, బదనికయని యర్థములు గలవు. అట్టివారిచే నమస్కరింపబడు దేవి రూపము ఇందు బదనికయన మహావృక్షముల వ్రేళ్ల

భూతలమందు వృద్ధిచెందు రావి, మర్రి మొదలగు వృక్షముల వ్రేళ్ళు అటులే అల్లము, కందమూలములు మొదలగునవియును వీర్యవంతములు అట్టివానిని శ్రద్ధతో సేకరించి గృహమందుంచినను యుపయోగకరము బదనికలలో వీర్యవృద్ధి, విషహరణమునకు పయోగపడునవియు గలవు అట్టి రూపమునుండి జీవదోహదకారులైన పరమేశ్వరీ రూప ప్రకృతి దేయములననుభవించుటచే వందితయైనది

శుక్రానందకరీ శుక్రసదానంద విధాయినీ* దాతిదాయక
శుక్రోత్సాహా* సదా శుక్రపూర్ణా శుక్రమనోరమా(168) త్సవా

1080) ఓం శుక్రానంద కర్త్ర్యై నమః

శుక్రానందకారియైన దేవి శుక్రానందకరి భగవతి శుక్ర సంపన్నగా నారోగ్యము ప్రసాదించును ఆరోగ్యమున్న దేహమువలన నానందము సుఖము గల్గుచుండును. సుఖ సౌఖ్య ప్రదాతగా పరమేశ్వరి స్వతఃసిద్ధ రూపి, 'కరోతునః శుభహేతురీశ్వరీ, శుభాని భద్రాణ్యభి హంతు చాపదః' అట్టి పుష్టి కలిగించి పరమేశ్వరి జగదానందకారిణి, సచ్చిదానంద రూపిణి, పరబ్రహ్మ స్వరూపిణిగా జగత్తునకు సుఖ సంతోషముల ప్రసాదించు కారణాత్మకయై వెలుగుచుండును

1081) ఓం శుక్ర సదానంద విధాయిన్యై నమః / ప్రదానంద విధాయిన్యై నమః

శుక్రప్రాప్తమైన నిత్యానంద విధి, ప్రసాదన రూపమైయున్న పరమేశ్వరి పై పదమునకు సదా ఉను బంధము, నిత్యత్వము నాపాదించబడియున్న స్థితి, పరమేశ్వరియను గ్రహమునచే సాధ్యమగుచు సంపాద్యమగుచు జీవి పాప పుణ్యముల ననుసరించి వానికి ప్రాప్తమవు సుఖానందములు పరమేశ్వరి విధి ఇచ్చమేర, సంప్రాప్తమగుచునుండును అట్టి విధానకర్త నియంత పరమేశ్వరియే

1082) ఓం శుక్రోత్సవాయై నమః / ఓం శుక్రోత్సాహాయై నమః

శుక్ర సంబంధమైన తేజస్సు, వీర్యము, ఆనందము, ఉత్సాహము గల్గిన రూపము శుక్ర సంబంధి యుత్సాహము వీరరస స్థాయీ భావం, శుభమునను యుద్ధములు ఉత్సవమునకు సంబరము, పరువము, కోర్కె వీడేరుట యానందము మొదలైనవి జీవులకు జవసత్వములు గల్గించు శక్తిరూపిణి. తత్ప్రతిఫలముగా దేవి పరమైన పండుగలు, పర్వములు, జపతప వ్రతాదుల నతిభక్తితో నిర్వర్తించుటయే నాయారూపిణియైన పరమేశ్వరి వసంత శరన్నవరాత్రులుగా, నుత్తర దక్షిణాయన వ్యాప్త వుపాసనా విధి రూపిణియైన పరమేశ్వరి

1083) ఓం సదా శుక్రపూర్ణాయై నమః

నిత్యత పూర్ణతగల్గిన శుక్ర నిధియైన పరమేశ్వరి నిత్యత, పూర్ణ స్థితి వెలుగు వీర్య సంపత్తి గల్గియుండునది ఉపనిషత్తుల స్తుతియందు 'పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే' యని యెంత తీసినను తరగని యనంత పూర్ణవీర్య యుతయైన దేవి స్వరూపము అయనంత పూర్ణ వీర్య యుతయైన పరమేశ్వరి శుభముల గల్గించును

1084) ఓం శుక్ర మనోరమాయై నమః

శుక్ర సుందరమైన దేవి, శుక్ర సౌందర్య రూపిణియైన దేవి 'సౌమ్యా సౌమ్య తరాశేష సౌమ్యేభ్య స్త్వతిసుందరీ' యని నిండు యౌవన స్ఫురమౌ మనోహరమైన పరమేశ్వరియే 'చంద్రాభాం చంద్ర పీఠానాం, సూర్యాభాం త్రియ మీశ్వరీం చంద్ర సూర్యాగ్ని సర్వాభాం శ్రీ మహాలక్ష్మీ ముపాస్మహే' యని తేజోయుతము సౌమ్యమైన పూర్ణచంద్రముఖి

శుక్రపూజా సర్వస్యా* శుక్రనిందకనాశినీపూజక సర్వస్వా
శుక్రాత్మికా శుక్రసంపచ్ఛుక్రాకర్షణ కారిణీ(169)

1085) ఓం శుక్రపూజక సర్వస్వాయై నమః

శుక్రపూజకుల సర్వస్వమైన దేవి వీర్య గుణ పూజకుల యందలి శక్తి, చేతనా సర్వస్వము తానేయైన పరమేశ్వరి అయోధ్య జన్మి, సుదర్శనుడను రాకుమారుడు యంబ భక్తుడై మునియాశ్రమమున పెరిగి, శశికళయను కాశీరాకుమారిని పెండ్లియాడి, యెదిరించిన వైరి గణసమూహముల నెదుర్కొనగా నంబయే ప్రత్యక్షమై దునుమాడినది అట్టి వీరజనుల దుర్గాది రూపములనుపాసించి వీర్యవంతులై సంగ్రామ విజయ మందకపోయినను వీరమరణమంది, సూర్యమండలము భేదించుకొని పరబ్రహ్మ సాయుజ్యమునందిరి వారి సర్వస్వరూపమే దేవి

1086) ఓం శుక్రనిందక నాశిన్యై నమః

శుక్రనింద కులనాశనము చేయు దేవి మహిషాసుర, శుంభ, నిశుంభ రక్తబీజాదులు బ్రహ్మ వలన వరముల బొంది వీర్య సంపన్నులై దేవికి ప్రీతికరములైన యజ్ఞయాగాదుల ధ్వంసముజేయుచు, దేవతల పారద్రోలి వారి యధికారములను తామే చేత చిక్కించుకొని వీర్యము చెడుపనులకే, ప్రాణి హింసకే యుపయోగించుటచే నిందనీయులై యంబచే నాశనముగావింపబడిరి శుక్రము ప్రాణి హితమునకే గాని ప్రాణి హింసకు గాదు అట్లు వ్యవహరించిన దుష్టుల దండించుటకును యంబ వెనుకాడదు చండముండాసుర, రక్తబీజాదులు రణయజ్ఞమున బలిపశువులుగా నంబచే చంపబడి వీరమరణము చెందినందున యంబ సాయుజ్యమునందుచు వారు పూజనీయులైరి వారు శత్రు భావమునైనను యంబను తలచిరి

1087) ఓం శుక్రాత్మికాయై నమః

శుక్రాత్మికయైన దేవి తేజోవీర్య బలసంపన్నత గలిగి వెలుగుటకు నోషధీవృక్ష జాతుల గాలి, నీరు, వీర్య యజ్ఞ నిరతులై ప్రాణిపోషణజేయు జనముల శక్తి, పరమేశ్వరియే యైనది అనంత వీర్యయుతమైన వైష్ణవీ రూపమున, కాటకములను అడుకొన్న శాకంబరీ రూపమునను జనులను పోషించుచు శుక్రాత్మికయైనది

1088) ఓం శుక్రసంపత్యై నమః

శుక్రసంపత్తి రూపమైన దేవి తేజోబల వీర్యముల నొసగు సంపత్తి స్వరూపమైన దేవి త్రిగుణాత్మికగా వెలుగుచు, త్రైలోక్యవ్యాప్త వీర్య, రస సంపత్తి కారకములునైన పదార్థముల సృష్టిచేయుచు, సకల చరాచర జగత్తునకు నాధార భూతమైనది. ప్రతి ప్రాణికి నావశ్యకమగు జ్ఞానము నొసంగుచు నన్నింటికి తగు బలమునొసగుచు సకల ప్రాణిచేతనకు నాధారభూతమై వెలుగు దేవి శుక్ర సంపత్తి స్వరూపిణియేగదా

1089) ఓం శుక్రాకర్షణ కారిణ్యై నమః

శుక్రాకర్షణ కారిణియైనదేవి 'త్వం స్వాహా త్వం స్వధా త్వం హివషట్కార స్వరాత్మికా'' సుధాత్వమక్షరే నిత్యే త్రిధామాత్రాత్మికాస్థితా' స్వాహా దేవతలకు స్వధా పితృగణములకు, వషట్కార స్వరాదులచే భూతలమున, 'వౌషట్' అక్షర సుధా స్వరూపియై నిత్యము వెలుగుదేవి అయా క్రియల నేర్పడు సత్త్వమును, ఆకర్షించి సర్వప్రాణి పోషణ చేయుచుండును 'ఏషాసా వైష్ణవీ మాయా, మహాకాళీ దురత్యయా ఆరాధితా వశీకుర్యాత్, పూజాకర్తుశ్చరాచరమ్' యని సర్వ సత్త్వ ప్రధానమై, సర్వదేవ తేజోమయమునైన యాకర్షణ శక్తిరూపిణి

రక్తాశయా రక్తభోగా రక్తపూజా సదారతిః

రక్తపూజ్యా రక్తహోమా రక్తస్థా రక్తవత్సలా(170)

1090 ఓం రక్తాశయాయై నమః

రక్తాశయముగా గలిగిన దేవి ముప్పదియారు నామముల రక్తపదవిశేషములుగా వరుస క్రమమున గలవు ముప్పదియారు తత్త్వముల ప్రతీకగా వీనిని తెల్పనగును పంచజ్ఞాన కర్మేంద్రియములు,

పాంచ భౌతిక, పంచ ప్రాణ, దశ విధ వాయువులు, మనోబుద్ధి, చిత్తాహంకార, జీవ బ్రహ్మ స్వరూపము
లుగా కొన్నింటి యందుగణన గలదు అవి యన్నియు రక్త, యనురక్త, వాసనాయుత, దేహ ప్రధాన
ప్రాణ సంచారయానకములుగా ప్రసిద్ధిచెందిన ధాతుమయములు సత్వ,రజస్తమోగుణములలో
రజోగుణ ప్రాధాన్యత గలిగి పంచసృష్టి స్థితికారకముగును
రక్త యను పదము ఎరుపు, కెంపు, లేపు వర్ణములు క్రీడాసక్త, యనురక్త, రుధిర, తామ్ర, సింధూర,
బిందు జాలాదులను యర్థములు గలవు రక్తి కలిగినరక్తా,ఆసక్తి స్వభావము ఆశయమున
యాశ్రయము అభిప్రాయము స్థానము, ఆధారము, మానసము, సరస్సు, దేహమందలి
అమాశయము, పిత్తాశయము మొదలగు యర్థములుగలవు దేహస్థితమైన సప్తధాతువులు వస,
రక్త, మాంస, మేధ, అస్థి, మజ్జ, శుక్రములు వీనియందురక్తము దేహమందు ప్రసరించుచు సర్వదేహ
వ్యాప్తమై యున్నరసమున బలము కలిగించు ప్రధానమైన ధాతువు రక్తస్వచ్ఛత కలిగిన మలి యమలిన
మనము ప్రశాంత చిత్తము దేవి నిలయము అట్టి రక్తము నిలయముగా పరమేశ్వరి సకల
ప్రాణులయందును నెలకొని యున్నది.

1091 ఓం రక్తభోగాయై నమః

రక్తభోగము రూపిణియైన దేవి భోగమనగా శరీరము, మానము, భూమ్యాది, యనుభవయుక్తమైన
వస్తు విశేషము, రాజ్యము, సుఖసాధన విషయములు, సుఖదుఃఖాది యనుభవములు యను
పెక్కు యర్థములు గలవు కొన్ని పూజాసనా క్రియలలో రక్తము దేవికి నివేదించబడును, వీర, శాక్తేయ,
శైవ సాంప్రదాయములు జంతుబలులు చేసెడి వారు. కొందరు యాత్మరక్తమునే యర్చనకు శ్రేష్ఠమని
స్వీయ రక్తమునే పూజింతురు ప్రత్యామ్నాయముగా నింబ ఫలములు కుంకుమ ద్రవ్యమునే,
బలులుగా వినియోగింతురు పట్టణములు శిథిలమైనపుడు, రాజపుత్ర స్త్రీలు యగ్నికి
దేహమర్పింతురు ఈ భావనా ఫలితమే రావణాసురుడు, కొందరు రాజపుత్రులును స్వీయ శిరముల
దేవికి బలి ఇచ్చినట్లు గాథలు గలవు అట్టి స్వీయ రక్తభోగమున ఆ దేవి ప్రీతి చెందునని భావన 2)
శరీరమందలి ప్రాణియు, రక్తధాతువు ప్రవర్తితమై యున్న రసమునే గ్రోలుచు సంసార వ్యాప్తి నందుట
ప్రత్యక్షమే. అటులే పితృకార్యములు నిర్వహించని జనుల రక్తమును పితరులు త్రాగుచుందురని
యందురు. గానవిధిగా పితరుల తృప్తి పరచుచుందురు 3) చంద్రుని యందలి సుధను దేవతలు,
పితరులు కృష్ణపక్షమున నాహారముగా స్వీకరించుటచే క్రమముగా క్షీణించి, అమావాస్య యేర్పడు,
యందు పితరార్చన విశేష ప్రీతిప్రదమైనది అట్లే పక్షములలో శుక్లపక్షము, ఉత్తరాయణము, దేవతలకు,
కృష్ణ పక్షము దక్షిణాయనము పితృకార్యములకు శ్రేయము అట్టి రక్తరూపయనుభవసారమైన
పరమేశ్వరికీ నామము విస్తృతమైనది

1092 ఓం రక్తపూజాసదారత్యై నమః

రక్తపూజ యందు ఆసక్తి గలిగినది రక్తయన అనురక్తి భక్తగణములచే చేయబడు
అర్చనాదికములయందు సదా,రతిభావము, అనురక్తి కలిగిన పరమేశ్వరి పూజయందు ఉపచారములు
పంచ, షోడశ, అష్టాదశ, చతుష్షష్టిరూపములుగా పెంగుచుండును పరిచర్యలు సమర్పింప బడును
దేవి పూజయందు రక్తవర్ణ యూపాదితములైన పద్మములు కలువలు సింధూరము, కుంకుమ,
రక్తకంచుక వస్త్రములు, ఇంద్రూపరక్తవస్త్రాంచిత యావరణ పరివారములను భావించుచు దేవీ పూజ
సంపన్నము చేతురు యంత్రలేఖనమున 'గోరోజనాలక్తక కుంకుమేన, సింధూర కర్పూర
మధుత్రయేణ' వినియోగము రక్తాంబరా, రక్తవర్ణా, రక్త సర్వాంగ భూషణా, రక్తాయుధ రక్తనేత్రా,
రక్తకేశాతి భీషణా, రక్తతీక్ష్ణ , నఖా రక్తరసన (దశనా) రక్తదంతికా, యను నామములు ఉచ్చరించ
బడును అట్టి రక్తవర్ణ, రజోగుణ ప్రాధాన్యత కల యర్చన యందు నిత్యము ప్రీతి కలిగిన దేవి
పరమేశ్వరి

1093 ఓం రక్తపూజ్యాయై నమః

రక్తముచే పూజింప బడునది రక్తమున యను రక్తత మనోంకిత భావము దేవి యందుమనసు కేంద్రీకరించి దేవి సన్నిధానాసక్తమునమునసెంది చేయు యుపచారయుక్తమైనట్టి యర్చనా విధానము మనో భావనను బట్టి పూజాద్రవ్య సేకరణ దేవి మానసిక పూజయందు యనురక్తమనము నెంది దేవి వుపచారాదుల కల్పింతురు సగుణ పూజ కును, రక్తవర్ణ పూజోపకరణముల యందు దేవికి మక్కువ గనుక, శాక్తేయ పూజ యందు రక్తపద్మాదికములు, సింధూరాది ద్రవ్యముల వినియోగము చేసిన నత్యంత ప్రసన్నత దేవికి కలుగును

1094 ఓం రక్తహోమాయై నమః

రక్తహోమ రూపిణియైన దేవి హోమమున దేవయజ్ఞము దేవతలనుద్దేశించి మంత్ర పూర్వకముగా హవిస్సును అగ్నియందు వ్రేల్చుట హోమమున కుపయుక్త ద్రవ్యములు ఆజ్యము, అగ్ని, నీరు, హవిష్యాన్నం,వాయు యానమున నుద్దేశించిన దేవతలకు చేరుచుండును అగ్నికి హవ్యవాహన, కవ్యవాహనుడని పేరు అన్నె దేహమునకు పోషణ కారకమయి యన్నరసమే రక్తరూపముగా పరిణతి చెంది సకల దేహవ్యాప్తముగు చుండును కావున హోమాహుతులు రక్తధాతువు పూర్వరూపములుగా నంగీకరించ వలెను అట్టి నిత్యహోమ క్రియలచే ప్రాణి స్వరూపమైన దేవి తృప్తిపందుచుండును. రక్తమున యనురక్తి భక్తి శ్రద్ధలతో చేయు దేవీ పరములైన యజ్ఞయాగాదికములు. చండీ యజ్ఞము, దేవీ సప్తశతి పఠన, హోమక్రియాదులు, త్రైలోక్య ప్రాణి హితమును చేకూర్చును కావున దేవి సంబంధిత ప్రాణిపోషక క్రియల ననుదినము నిర్వర్తించి కర్తలును దేవీ కృపకు పాత్రులగుదురు దాన సకలలోక వశ్యాది సిద్ధిప్రాప్తి కలుగును 2) హోమమున జంతురక్తము మనుష, స్వీయ దేహ రక్తములును ఉపయోగింతురు అచట మంత్ర పూర్వకముగా బలి జంతువును ప్రజాపతి యంశగా ప్రతిష్ఠించి విరాడ్రూపమున చేర్తురు

1095 ఓం రక్తస్థాయై నమః

రక్తస్థయైన దేవి రక్తధాతువు దేహమునకు పుష్టి, తుష్టి కలిగించుచుండును. ఆ ధాతు పుష్టివ్యాపకము ననే శుభ్రమనములు గలుగుట, ప్రాణి హిత చర్యలు చేపట్టుట జరుగును రక్తస్వభావముచేతనే మానసిక వికారాదులు సంభవము శాంత వీర్యాది రసములు రక్తస్థ వాతపిత్త కఫాదిక్యముల కారణముననే సంభవమగును అవి తీసికొను యాహారమును బట్టి, నియమాదివ్యవస్థను బట్టి స్వభావమును రూపొందించును. అందుచే వంశము లేదా కొన్ని స్వభావములు రక్తములోనే ఇమిడ్చికొని యున్నట్లు యభివర్ణింతురు అట్టి రక్తస్థయైన శక్తి పరమేశ్వరి రూపమే యగును

1096 ఓం రక్తవాత్సల్యాయై నమః

రక్తవాత్సల్యత గలిగిన దేవి స్వరూపము వత్సల యనుపదమున కర్థము వాత్సల్య రసము. భక్తవత్సలుడైన విష్ణువు బిడ్డయందలి ప్రేమగల గోవు యని అర్థము. తల్లి తన రక్తము పంచుకొని పుట్టిన బిడ్డ యందు వాత్సల్య భావముతో, అవసరమైతే తన ప్రాణముల నొడ్డి బిడ్డను రక్షించుకొను భావము అటులే పరమేశ్వరి కూడా తనదైన సృష్టియందు అమిత వాత్సల్యత కలది ఈ ప్రేమవాసనామయమైన వత్సలతగా అనేక రూపములైనను బిడ్డ కేవలము తన తల్లినే గుర్తుపట్టి అనుసరింప బడుట వత్సలతకు నిదర్శనము దేవి కూడా తన భక్తులైన జీవుల యెడ వరముల నిడుచు ప్రసాద భావము వాత్సల్యత చూపించును అనురక్త స్వభావమున ప్రేమ నిడుట వత్సలత

రక్తపూర్ణా రక్తదేహా రక్తపూజిత పుత్రిణీ
రక్తాభ్యా రక్తినీ రక్తసంస్పృహా రక్తసుందరీ(171)

**1097 ఓం రక్తవర్ణాయై నమః/రక్తపూర్ణాయై నమః**

రక్తవర్ణము కలిగిన పూర్ణరూపి ఎరుపువర్ణము, రజోగుణ ప్రాధాన్యత కలది. దేవి వుపాసన యందురక్తవర్ణ వస్తు సంభారములచే యధిక ప్రీతితో వినియోగించిన సద్యం ఫలితములు పరమేశ్వరి కలిగించును త్రిభువన ప్రాణి సంచారము దేవి ప్రకృతి సిద్ధ స్వరూపములే 'సర్వభూత హితే సదా త్రైలోక్య స్వహితార్థాయ' యను విశాల భావన, జాతి రక్తమునందు జీర్ణించుకొని యుండునది కారణము లేకయే ప్రాణి హింస చేయ నొల్లదు మొదట జాగృత పరిచి తప్పుకొననిచో దాడికి, యాత్మ సంరక్షణ నిమిత్తమై పాల్పడుదురు కాని ప్రేమభావన వుపాసన వలన కలుగును 'దుర్గే స్మృతాహరసి భీతిమశేషజంతో:, స్వస్థై స్మృతా మతిమతీవశుభాంసి' యని అంబ కృపవల్లనే సుఖమయ జీవితము లభించగలదు

**1098 ఓం రక్తదేహాయై నమః**

రక్తవర్ణ దేహము గలది, 'హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం' అని స్వర్ణకాంతి గల దేహము కలిగినట్లు వర్ణింతురు రక్తయను రక్తసుందర దేహకాంతి కలిగిన పరమేశ్వరి రూపమును ఉపాసించు భావములు వ్యక్తము అట్టి యనురక్త దేహము కలిగిన పరమేశ్వరి స్వరూపము ధ్యానించుట సదా మోక్షదాయకము

**1099 ఓం రక్తపూజక పుత్రిణ్యై నమః**

రక్తపూజక పుత్రవతి రూపము అనురక్తితో వంశ పారంపర్యముగా పరమేశ్వరిని గొలుచునింట, పుత్రవతియైన స్త్రీరూపిణిగా సహధర్మచారిణిగా అంబ యొక్క యంశ ప్రతిష్ఠితమై యుండును ఆమెయే గృహిణి విహిత పంచ విధ యజ్ఞప్రాణిపోషక క్రియల నామేలేక నిర్వర్తింప సమర్థులు కానేరరు. అట్టి పరమేశ్వరి స్వరూపిణి క్రియాసక్తయైన గృహిణి పుత్రవతిగా వంశము, అనంత కాలము సాగుటకు దోహదకారి యగుచు పంచ దేవీ కృత్యముల తనవంతు బాధ్యత నిర్వహించును

**1100 (ఎ) ఓం రక్తాఖ్యాయై నమః**

రక్తాఖ్య యైన దేవి ఆఖ్యా యన ప్రసిద్ధి చెందుట ఆ పేరునే పిలువ బడుట రక్తాయన రక్తిమలము, రక్తులువగ వారోపిత భావమును గ్రాహ్యముగుచుండును అటులే రక్తాయన యొక్కువ ప్రీతి అనురక్తి కలిగిన రూపము, ప్రస్ఫుటము, దేవి భక్తుల యందనురక్తి కలిగినదిగా ప్రసిద్ధి చెందినది 'కరోతుసా నః శుభహేతు రీశ్వరీ' యని శాకంభరీ, భ్రమరియని ప్రసిద్ధి గాంచి నది దేవ పితృగణాది పోషకమైనదైన స్వాహా స్వధారూపములనువిఖ్యాత యైన పరమేశ్వరి

**1100 (బి) ఓం రక్తద్యుత్యై నమః**

రక్తద్యుతి కలిగిన దేవి ద్యుతి యన కాంతి,ప్రకాశము అనురాగముతో కూడిన ప్రసన్నతా భావము ప్రేమాను రక్తిచే 'కారుణ్య కందలిత కాంతిభర కటాక్షదృక్కులు ప్రసరించు పరమేశ్వరి స్వర్గే మర్త్య లోకేచ మానవా స్తువంతో వ్యాహరిష్యంతి సతతం రక్తదంతికాం' దాడిమీ కుసుమ ప్రభ కలిగిన దంతముల కాంతి ప్రసరించుచున్నట్టి రూపము. అటులే రక్తవర్ణ పూజోపకరణములచే, దేవి దేహ శరీర వర్ణము రక్తమయముగా మారి, భక్తాదనురక్తత ప్రస్ఫుటముచేయును

**1100(సి) రక్తిన్యై నమః**

రక్తిని యైన దేవి రూపము రక్తి యన యనురాగము కలది దేవగణముల, భక్తగణముల సంరక్షణ భావము వహించి స్మరణ మాత్రముననే వహిత వాంఛాఫల సిద్ధులను ప్రసాదించుచు భగవతీ రూపము లైన భోగముల ప్రసాదించుచు ఇచ్ఛానురక్తిత పాలించునది సకల ప్రాణులయందు చేతనా స్వరూపిణి యైనదే విష్ణుమాయా జాతి, లజ్జా, శ్రద్ధా, లక్ష్మీ, దయా,తుష్ట్యాది రూపముల విలసిల్లుచు వ్యాప్తి

చెంది యుండునది అట్టి విశేషానురక్తస్వరూపురాలైన పరమేశ్వరి సర్వార్థ సిద్ధిదాయగును

1101 ఓం రక్తసంస్పృహాయై నమః/రక్తస్పృహాదేవ్యై నమః

అనురక్తి సంస్పృహ కలిగినట్టి పరమేశ్వరీ రూపము స్పృహ యన ఇచ్ఛా, కోరిక, ప్రీతి రక్తమన యనురక్త జనము, భావన వీనియందు ప్రీతి కలిగినది దేవి సృష్టించిన ఈ జగత్తునందు జీవి ఏకాకిగా వచ్చును ఏకాకిగాను వెడలిపోవును ఇక్కడనున్న సమయమున తల్లి, తండ్రి, తాత, దార, తనయులు,మనుమలు యను వాసనా బంధములేర్పడి వారి కొరకై పడరాని పాట్లు బడుట ఈ వాసనాసంస్పృహయే, యాదేవి సర్వభూతేషు జాతి రూపేణ సంస్థితా' యాదేవి స్మృతి రూపేణ సంస్థితా' యని స్వజాతి స్పృహ కలిగించి, విస్మృతి గలిగించి సంసార బంధమున చిక్కుకొను నట్లు చేయును స్మృతి కలిగి దేవి భావన స్పృహ కలిగిననే గాని మోక్షము కలుగనేరదు

1102 ఓం రక్తసుందర్యై నమః

అనురక్తి సుందరియైన పరమేశ్వరి 'సౌమ్యా సౌమ్యతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సుందరీ' యని శ్రీ మహాత్రిపురసుందరీ యనిముగింపు మొదట 'శ్రీమాతా మహారాజ్ఞీ' యని లలితా సహస్రనామము భువనసుందరి యంతలే సర్వప్రాణుల స్త్రీ స్వరూపము స్త్రీ మూలముగనే సామ్రాజ్యము, నేల చక్రవర్తులును, పోరాటములు సలిపి నాశనమయినట్లు చరిత్రలుగలవు 'రూపైరనేకై బహుధాత్మ మూర్తి కృత్వాంబికే తత్ప్రకరోతినాన్యా' 'సమ్మోహితం దేవి సమస్తమేతత్ త్వంవై ప్రసన్నాభువిముక్తి హేతుః' అని ప్రసన్నభావము గలుగునట్లు చేయవలెను అపుడు ముక్తి హేతువగును

**రక్తాభిదేహా రక్తార్హా రక్త వందక వందితా**
**మహారక్తా రక్తభవా రక్తవృష్టి ధాయినీ(172)**

1103 ఓం రక్తాభిదేయహాయై నమః/రక్తాభిదేహాయై నమః

అనురక్తి, యనుకంపారూపమే అంబ అని పేరుబడినది అభిదాయన గుర్తింపు, కీర్తి, యశస్సు కలిగియుండుట, 'తే సమ్మతా జనపదేషు ధనాని తేషాం తేషాం యశాంసి, నచసీదతి, ధర్మవర్గః ధన్యాస్తయేవ నిభృతాత్మజ, భృత్యదారా యేషాం సదాఽభ్యుదయదా భవతీ ప్రసన్నా' గృహము దారాసుత భృత్యగణయుత ధన యశములు, ధర్మమార్గ ప్రవృత్తమతి యనుగ్రహించుచు పరస్పర ప్రీతి యతిశయిల్లునట్లు చేసెడి స్వరూప స్వభావము ఆమె అనుగ్రహమునినే. అట్టి అనురక్త భావనయే ఆమె యని 'దేవి ప్రసీద పరమాభవతీ భవాయ సద్యోవినాశయసి కోపవతీ కులానిచ' యని కులపాలినీ, వర్ధినీ, అంగనా రూపిగా దేవి పరస్పర ప్రేమానురాగములు ప్రదర్శించుచుండును

1104 ఓం రక్తార్హాయై నమః

రక్తార్హయైన దేవి అర్హయన విష్ణువు శివుడు, ఇంద్రుడు, గతి, నడక, యోగ్యత్వము, పూజనీయత యగును త్రిమూర్తియుత దేవతా గణములు స్తుతించిరి 'దేవ్యాయయా తత మిదం జగదాత్మ శక్త్యా, నిశ్శేషదేవగణశక్తి సమూహ మూర్త్యా తామంబికా మఖిల దేవమహర్షి పూజ్యాం భక్త్యానతాస్మ విదధాతు శుభానిసానః' సర్వదేవమయి దేవతాశక్తియుతమైన పరమేశ్వరి, మూలప్రకృతి జగత్కారక శక్తిగాక మరెవరు పూజార్హులు 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యనియు వివేక జ్ఞానము కలిగించు గురుపరంపరలో మాతాపిత గురు దైవముల గణనలో నాద్యగా ప్రసిద్ధి చెందినది భువన సృష్టికర్త,సర్వప్రాణి చేతనయైన యామె పూజార్హత గలదేవి

1105 ఓం రక్తకందర వర్ధితాయై నమః/ఓం రక్తవందక వందితాయై నమః

కందరమన అంకుశము, మొలక, గుహాకారము, పర్వత నితంబ స్థానము యను అర్థములు. వందకు తన నమస్కరించువాడు, బధనిక యని అర్థము కాని ఇచట అనురాగము, ప్రేమభావన, హృదిస్థము, దేహమునందు గుప్తముగా నుండి వ్యవహరించునది దేహమందున్న గుహరూపమైన

స్థానము 'గుడాకేశ' యని బ్రహ్మాండ గోళవ్యాప్త శివరూపము అర్జునుడు నిద్రను గెలిచినవాడు, నిత్యజాగృత మూర్తియై హృదియందు వెలుగు జీవి ఆ హృదియందలి అనురక్త భావనవే వర్ధిల్లినటువంటి పరమశివా రూపము, అట్టి హృదయస్థిత, వర్ధిత యనురాగమూర్తియైన పరమేశ్వరీ స్వరూపము.

1106 ఓం మహారక్తాయై నమః

మహామురక్తయైన పరమేశ్వరి రూపము 'నైరస్యపి ప్రకటితైవ దయాత్వయేద్ధం' నిత్యవరద రూపిణియైనదేవి 'పృథివ్యాం పుత్రాస్తే జనని బహవః సంతి సరళాః పరం తేషాం మధ్యే విరళ తరళోஉహం తవ సుతః కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి' యని దుర్మార్గుడైనను పుత్రుని యెడల ప్రేమ వాత్సల్యత చూపు మాతృస్వరూపిణి 'ఆరాధితా సైకుర్యాత్ పూజాకర్తృత్వరా పరమ్'' సర్వస్య బుద్ధిరూపేణ జనస్యహృది సంస్థితే। స్వర్గాపవర్గదే దేవి నారాయణి నమోస్తుతే' 'యాచస్మృతా తత్ క్షణమేవ హంతి నః సర్వాపద' స్మరణ మంత్రమున భక్తులపై అనుగ్రహము చూపించు మహానురక్తి గల పరమేశ్వరి

1107 ఓం రక్తాభవాయై నమః

రక్తభవ రూపిణియైన దేవి 'భవ' యన్న శివుడు, సంసారము, సత్త, ఉనికి, జన్మసంవృద్ధి, శ్రేయము, క్షేమము యను భావన అంతయు శివరూపమను భావన గలిగి ప్రకృతి వ్యాప్త సమస్త జీవుల యెడ కరుణభావమున వర్తిల్లుట, భవ రూపిణి పరమేశ్వరి సకల భూత గణముల యందు యనుకూల, అనురక్తభావన గలిగియుండుట, అనురక్త భావన, పరస్పర ప్రేమయందే ఉనికి గలది సృష్టి, లేనిచో అంతర్యుద్ధము, జాతి నాశనము కలుగును స్వార్థభావము పెంపొంద అనురక్త భావన నశించును. ప్రకృతియే ప్రాణిపోషక ఆహారమునుచు, ప్రాణి ఉనికికి కారణమగుచున్నది ఎంత సంపద గలిగినను సత్యమిదు రక్తము లేనిచో ప్రాణి ఉనికి వుండదు అనురక్త భావన, సుందర ప్రకృతి దేవి మయమని ఎంచి సచ్చిదానంద రూపమున కాలము గడుపుట యావశ్యకము

1108 ఓం రక్తసృష్టివిధాయిన్యై నమః

రక్తసృష్టివిధి విధానము నిర్ణయించు పరమేశ్వరి పరస్పర అనురక్తత కలిగిన ప్రాణుల సృష్టిచేయువిధానము నిర్ణయించు పరమేశ్వరియై యున్నది ప్రకృతి యందలి వృక్ష బీజమునుండి యదే వృక్షము, పక్షి అండముల నుండి తద్రూప శాబకములును నటులే మానవులకు తద్రూప సంతతి, నాలుగు విధములైన అండజ, స్వేదజ, జరాయుజ ఉద్భిజ,రూపముల నాయా రూప సృష్టి పరమేశ్వరి విధాయకమై యున్నది అయితే కాల నిర్ణయమును నిర్దేశింప బడి యున్నది మానవ సృష్టి జ్యోతిష శాస్త్రరీత్యా కొన్ని అంశలు పశుపక్ష్యాదుల సృష్టికి కొన్ని కాలాంశములు, అనుకూల ఋతువులను నిర్ణయించబడి యున్నవి ఆయాసమయములలో పంటలు పండుటచే వ్యవసాయ పంచాంగమును, శిశు జన్మ సమయమును బట్టి భవిష్యత్తు నిర్ణయము తత్సంబంధములే

రక్తస్నాతా రక్తప్రీతా రక్తసేవ్యాஉతి రక్తినీ
రక్తానందకరీ రక్తసదానంద విధాయినీ(173)

1109 ఓం రక్తస్నాతాయైనమః

రక్తస్నాత స్వరూపిణియైనదేవి స్నాత యనగా మునుకవేసినటువంటి రూపము పరిపూర్ణానురాగము గలుగు స్థితి స్నాతక అన వేదాధ్యయనము ముగించి గృహస్థు అగుటచే పరిపూర్ణ జ్ఞానము కలిగిన వాడని అర్థము. అటులే రక్తస్నాత అనగా పరిపూర్ణ ప్రేమానురాగములు కలిగి, అజ్ఞాన భావము తొలగిన జ్ఞానము రూపము, సిద్ధమైన పరమేశ్వరీ రూపము

1110 ఓం రక్తసిక్తాయై నమః /ఓం రక్తప్రీతాయై నమః

సిక్ యన వస్త్రము తడిపెడువాడు సేచన చేయువాడు రక్తసిక్త అనురాగయుత భక్తి, రక్తసేచన

చేయ ప్లావితమైన రూపము రక్తప్రీతాయన రక్తము త్రాగిన రూపము రక్తము జవసత్వముల గలుగజేయునది యుద్ధమునందు విరామ సమయముల అంబ మదిరాపానము చేయుచుండును 'గర్జ గర్జ క్షణం మూఢయావత్ మధుపిబామ్యహం' అని దానిచే కలిగిన సత్తువముచే 'ఏవముక్త్వా సమారూఢ తం మహాసురం "పాదేనా క్రమ్య కంఠేచ శూలేనైనమ తాడయత్' యుద్ధభూమి అందు రక్త స్నానములు గనుక రక్తవర్ణ ప్రీతి కలిగిన దేవి రుధిరార్ద్రమయి యైన దేవి సవర్ణ రూపిగా కన బడును

1111 ఓం రక్తసేవ్యాయై నమః

రక్తముచే సేవింపబడునది రక్తపోషక పదార్థములైన ఆహారము మానవునికి ఆధారము ఆహారము జీర్ణమై తత్తేజము సర్వదేహాంగములకు రక్తరూపమున కొనిపోబడుచు రక్తసేవ్యమగును ఆ రుధిరమే శాక్తేయ పూజలయందు, జంతు బలి రూపమున, నరబలి రూపమున నిచ్చుచుందురు కాని సాత్విక పూజా విధానమున నారికేళము, పిష్ట పశువును, మొదలగునవి బలినిడి దేవికి ప్రీతిని కలిగింతురు అట్టి కుంకుమాక్త ఫలములచే సేవింపబడు పరమేశ్వరీ స్వరూపము అయా కులాచారములను బట్టి ఆర్చారూపయాచారాదులను బట్టి తేడా యున్నను, సర్వమును పరమేశ్వరికే అర్పించి తద్రూపముగా నెంచవలెను

1112 ఓం అనురక్తాయై నమః

అనురక్తి కలిగిన పరమేశ్వరి 'ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి, తదా తదావతీర్యాహం, కరిష్యామ్యరి సంక్షయం' అని, 'దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః, స్వస్థైస్స్మృతా మతి మతీవ శుభాం దదాసి' అని పరమేశ్వరి భక్తపరాధీన 'హైరిష్యపి ప్రకటనైవ, దయార్ద్ర యద్ధం లక్ష్యపక్షత్ త్రిపుర సుందరీ తావకీనం కారుణ్యకందళిత కాంతిభరమ్ కటాక్షం, కందర్ప భావ సుభగా భువి భక్తిభాజః సంమోహయంతి తరుణీ భువన త్రయేపి' 'వరదాహం సురగణావరం యన్మపి చ్ఛదా' అని త్రైలోక్య హితార్థం వెలుగు భక్తుల ఎడ అనురక్తిని అగు దేవి 'కరోతుసానః శుభహేతు రీశ్వరీ శుభాని భద్రాణ్యభిహంతుచాపదః 2. నిత్యయద్వైత రూపమున సదాశివ పర్యంకోత్సుకమై శివా శివరూపమున పరస్పర అనురాగమూర్తియై యున్నది

1113 ఓం రక్తానంద కర్త్ర్యై నమః

రక్తసంబంధి ఆనందము కలిగించునది 'ఆనందస్థితి పరబ్రహ్మానంద ప్రాప్తి అనునది జీవ పరమేశ్వర శక్తి సమైక్యత వలననే కలుగును రక్తసంవ్యాప్త పరమేశ్వర రక్తసరూప కణజాలముల సంబంధముచే తనవారి పట్ల,తన జాతి పట్ల అనురక్తి కలుగుచుండును వారి సన్నిధిని అలౌకిక ఆనందము, తృప్తి కలుగుచుండును తల్లీబిడ్డల సంపేమమున, స్తన్యమిచ్చు మాతృమూర్తి మహానందాంబుధి డోలలో నూగుచుండును మరి విశ్వమాత యైన పరమేశ్వరీ త్రైలోక్య సృష్టిపోషణ నిరతగా సర్వప్రాణి హితమును వాంఛించును సర్వప్రాణి సుఖహేతువుగా పరమేశ్వరీ అనేక రూపములైన ప్రకృతి రూపిణియై ఆనందించు చుండును జీవి అనుబంధం , నాలుగు సంవత్సరముల తల్లి పుణ్య ప్రభావమున, అపై నాలుగు సంవత్సరములు, తండ్రి ప్రభావమున, అపై నాలుగు సంవత్సరములు, గురుసన్నిధి వెలుపలి ప్రపంచమునందు తన స్వీయ శక్తిని సంపాదించు కొనుచు అపై స్వీయ జన్మస్థిత లగ్నమును బట్టి జాతకము వర్తిల్లును కావున చిన్నతనముననే పూర్వ పరిమళించునందురు.

1114 ఓం రక్తసదానంద విధాయిన్యై నమః

అనురక్త నిత్యానంద విధివర్తిత అగు దేవి అనురక్తి కలిగిన దేవి భక్తులకు వారి పూజ, భక్తి భావమును అనుసరించి ఫలితము ఇచ్చుచుండును ఐహిక సుఖముల వాంఛించ నవ్వి ప్రసాదించి భ్రమ మాయల ముంచెత్తును. వాని వలన గలుగునది క్షణికమైన ఆనందమే సదానందము శాశ్వతా

నందము, నిత్యానందము, సచ్చిదానందము అను మోక్షకారకానంద స్థితి, దేవి ప్రభావముననే కలుగుచుండును, సురథుడు సమాధి అను యిద్దరు తపసు చేయుచు ఫలితముగా సురథుడు విభ్రంశ రాజ్యమును కోర నాతని సంతతికి కూడా రాజ్యప్రాప్తి కలిగెను కాని సమాధి పరమేశ్వర భక్తి జ్ఞానము వేడుకొనగా ఆమె అనుగ్రహించి, ఆ పునరావృత్తి కారకమైన జ్ఞానమును ప్రసాదించి, సాయుజ్య మందించెను మహిషాసుర, చండముండాసురుల బలగములన్ని నశించిన తరువాత తామింక భీతిని పారిపోయి యేల బ్రతుకవలెనని వీరోచితముగా పోరాడి ప్రాణముల వదిలిరి వైరి భావమున నైనను అంబ స్మరణచేసి వీరోచిత మరణమంది దేవి పార్షదులుగా పూజలందు కొనుచుండిరి దాన యసురులన్న దేవికి ద్వేషము లేదు 'రాక్షసి' నామము కూడా కలదు రక్షో గణ నియుక్తత చేసి రాక్షసిగాని క్రూరస్వభావిగాదు మోక్షప్రదాయిని

రక్తారక్తా రక్తపూర్ణా రక్తసేవ్యక్షణీ రవహా
రక్తసేవక సర్వస్వా రక్తనిందక నాశినీ(174)

1115 ఎ) ఓం రక్తాయై నమః

అనురక్తి స్వరూపిణియైన దేవి 'ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీమ్। చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ' అటులే 'ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమ మాలినీం। సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ' అని హిరణ్య వర్ణ రూపిణి ఆర్ద్రభావము కలిగి భక్తుల యెడ అనురాగము, ప్రేమపూర్వక స్వభావము కలిగియుండిన దేవి (ఈ పదము అదనము )

1115 ఓం రక్తాసవాయై నమః/రక్తాశయాయై నమః

రక్తాసవ రూపిణి, రక్తని లయ ఆ సవము కల్ల ఫల పుష్పాదులచే చేసిన మద్యము పుట్టించువాడు అని అర్థములుగలవు రక్తధాతువు ప్రేమ అనురక్తి కలిగించును. అట్టి ప్రేమ రూపమదిర అను బంధ భావన భక్తునికి దేవికి గల పరస్పర భక్తి ప్రేమ రసావేశములే 'ప్రేమ ప్రవాహప్రణోహితాని దేవి' అని 'అనంగమదనా, అనంగ మదనాతురాది నామములలో అనంగ అన దేహ సంబంధము లేనట్టి మానసికమైన ప్రేమభావనయే' ప్రముఖము ఉదహరించబడినది అట్టి అనంగ, దేహరహిత స్థితి సమాధి యందే ప్రాప్తమగును ఆ తరుణమున చంద్రజ్యోత్స్న అమృత స్రావియైన పరమేశ్వరిని దర్శించ కలిగిన అవిచ్ఛిన్న నిరంతర అమృతాసవము గ్రోలు అదృష్టము ప్రాప్తించును

1116 ఓం రక్తపూర్ణాయై నమః/ఓం రక్తారక్తవర్ణాయై నమః

రక్తపూర్ణత కలిగిన దేవి దేవి పరిపూర్ణ బ్రహ్మ స్వరూపిణి 'ఏతావ దేవ జనని స్పృహణీయ మాస్తే। త్వద్వంద నేషు సలిలస్థగితే చ నేత్రే। సాన్నిధ్య ముద్యదరుణాయుత సోదరస్య త్వద్విగ్రహస్య సదయాసుధయా ప్లుతస్య' అని వాత్సల్యపూర్ణయైన దేవి కరుణారస పరిపూర్ణ 'సర్వదేవమయీ మీశాం మహాలక్ష్మీ మిమాం నృపః పూజయేత్ సర్వలోకానాం సదేవానాం ప్రభుర్భవేత్' దేవతలు అభయ వరద హస్తముల చూపించుచు ప్రసాదింతురని, కాని పరమేశ్వరి వారడుగక ముందే వారి వాంఛల నధికముగా ప్రసాదించునని వక్కాణించిరి కావున ప్రాప్తివిధి మేర భక్తుల గాంచి ఫలము, పూర్ణమనమున ప్రసాదించుచుండును

1117 ఓం రక్తసేవ్యక్షణీరవహాయై నమః

అనుపగ రూపము గలది రక్తసేవ్య పదము (1111) ముందుగా వచ్చినది అనురక్తపూజ చేయు క్షణముల రమించు రూపము క్షణి యన ఉత్సవము, పండుగ, మనోలగ్నత, శుభమూహూర్తము, పరాధీనత, మొదలగు అర్థములు రెప్పపాటులో నాలుగవ వంతు కాలము సూచించును అట్టి అల్పకాల సేవయైనను రమించు స్వభావముగల మనసు కలది, 'కలాకాష్ఠాది రూపిణా పరిణామ

ప్రదాయినీ "విశ్వాస్యపరతా శక్తి నారాయణి నమోస్తుతే' అని క్షణిక యుపాసన యైనను అనంత ఫలదాయిని అయిన పరమేశ్వరి

1118 ఓం మనోరమాయై నమః

మనోరమ రూపిణి మనో రమ అన మనసునందు రమించు రూపము సుందర మనోహరమైన రూపము 'భవకాలే నృణాం సైవ లక్ష్మీ వృద్ధి ప్రదాగృహే' అనియు 'పత్నీం మనోరమాందేహి, మనోవృత్తానుసారిణీమ్। తారిణీమ్ దుర్గసంసార సాగరస్య కులోద్భవామ్' అని 'స్త్రియస్సమస్తా సకలా జగత్సు' అని అనుకూలవతియైన పత్ని పరమేశ్వరి అంశయే గృహసుఖకారిణి ఆమెయే, మాతా, మంత్రిణి, రంభా, దాసి, పుత్రవతి, సుతాది రూపము మనోహర రూపధారిణి అగును

1119 ఓం రక్తపూజక సర్వస్వాయై నమః/రక్తసేవక సర్వస్వాయై/రక్తసేవక సేవ్యాయై నమః

అనురక్తిని పూజించు భక్తగణముల సర్వస్వము ఆమెయే అయివున్నది ప్రకృతి దత్తమైన ఫలపుష్పాదులే ఆమెకు నివేదన నిడ ఆమెయే పూజించువారల, సేవించు భక్తగణముల సర్వస్వమై సదా కాపాడుచుండును 'సర్వబాధా ప్రశమనం, త్రైలోక్యస్యాఖిలేశ్వరి ఏవమేవ త్వయా కార్య మస్మద్వైరి వినాశనం' 'రోగాన శేషానపహంసి, తుష్టా, రుష్టాతు కామాన్ సకలాన భీష్టాన్ త్వామా శ్రితానాం నవిపన్నరాణాం, త్వామాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాంతి' అని సర్వస్వం ఆమెయే అని ఉపాసించిన సత్ఫలితములు, మోక్షము అందగలరు

1120. ఓం రక్తనిందక నాశిన్యై నమః

రక్తనిందకుల నాశనము చేయు దేవి రక్తము అనురక్తిని చేయు యజ్ఞయాగాదులు, ఉపాసనా కర్మలు, పూజా విధానములు, వీనిని హేళన చేయువారు,నిందించువారు గలిగినచో వారిని నాశనము చేయు పరమేశ్వరియై ఉన్నది. ప్రేమ అనురక్తి భావము వృద్ధిగా కలిగిన సకల సంపదల ప్రసాదించును. నిందకుల నాశనము చేయును 'చండికా అఖిల జగత్ పరిపాలనాయ, నాశాయచా శుభ భయస్య మతింకరోతు' దుష్టనింద భావనల నాశనముచేయును 'ప్రాణాన్ముమోచ మహిషస్తదతీవ చిత్రం కైర్జీవ్యతే కుపితాంతక దర్శనేన' ప్రకృతి కోపించినపుడు జలప్రళయములు, అగ్నిదాహాదికములు, మహమ్మారి మున్నగు ప్రకృతి వైపరీత్యములు, సంభవించి ప్రాణనష్టము జరుగుచుండును. 'ఏకస్యయేవ జగతి స్థిరసిద్ధిరాస్తే' అని బ్రహ్మాదులు, ప్రళయాభిభూతులైన పట్టికి పరమేశ్వరి నిత్యా వెలుగును

రక్తాత్మికా రక్తరూపా రక్తాకర్షణ కారిణీ
రక్తోత్సాహ రక్తవ్యగ్రా రక్తపాన పరాయణా(175)

1121. ఓం రక్తాత్మికాయై నమః

రక్తాత్మిక యైన పరమేశ్వరి. అనురక్తిస్వరూపమే దేవి స్వరూపము. ప్రేమభావమయే దేవి ప్రసన్నభావము ఆత్మయందు లీనమైన భావము ఆత్మిక. అట్టి ప్రేమభావన స్వరూపురాలు పరమేశ్వరియై యున్నది 'రక్తాంబరా, రక్తవర్ణా, రక్తసర్వాంగ భూషణా। రక్తయుధా, రక్తనేత్రా, రక్తకేశాతి భీషణా। రక్త తీక్ష్ణనఖారక్తదశనా, రక్తదంతికా' అని సర్వమును రక్తాత్మికయైన మూర్తి

1122 ఓం రక్తరూపిణ్యై నమః

రక్తరూపిణియైన పరమేశ్వరి రక్తమున అనురక్తిబంధము 'కనకోత్తమ కాంతిస్సా సుకాంతి కనకాంబరా। దేవీ కనక వర్ణాభా కనకోత్తమా భూషణా' అని స్వర్ణవర్ణ స్వరూపిణి 'ఇందిరా కమలా లక్ష్మీ, సాశ్రీ రుక్మాంబుజాసనా' ఆమె స్వర్ణరూపి కనకరూపియైన పరమేశ్వరి అనుగ్రహము చూపుచుండును 'సంతోధనా సదైవ సన్నిధికారిణీ స్వాహాయాం జగతాం మాతా సర్వపాప ప్రదాహినీ' అని పేరు పలుకగానే ఆసక్తితో అనుగ్రహించు పరాత్పరి

**1123 ఓం రక్తకర్షణ కారిణ్యై నమః**

రక్తాకర్షణ కారిణియైన దేవి పశుపక్ష్యాదుల యందు పరస్పర ఆకర్షణ అనురాగమునకు కారణము. మహామాయా ప్రభావమే పమ్మోహనముల రుచి ఏర్పడుచుండును తప్పు, కారము తినుబండారముల రుచి కలిగించును షడ్రుచి, మూలకమైన ఆకర్షణ శక్తి ఆమెయే స్త్రీ పురుషులాకర్షితులగుటకు అటులే ఇరువురును అత్యంత మిత్రులగుటకు వారి మనోభావనలనేకీకరించు శక్తి ఆమెయే అగును. 'చోదయిత్రీ సూనృతానాం, చేతంతీ సుమతీనాం, యజ్ఞం దధే సరస్వతీ' అని మంచి మాటలచే నాకర్షితురాలగు శక్తి ఆమె విభావన వలననే కలుగుచున్నది

**1124 ఓం రక్తోత్సాహాయై నమః**

రక్తోత్సాహము కలిగిన దేవి ఉత్సాహమన వీరరస స్థాయి భావము, శుభము, ప్రయత్నము, కర్తవ్య కార్యములందు స్థిరమైన ప్రయత్నము ఒడి, లలి, హాలి, హెచ్చరికలాంటి అర్థములు గలవు. శుక్రోత్సాహ అని (1049) మరొక నామము, రక్తోత్సాహ అని రక్తము వలన సంభవించు తేజస్సుచే గల్గు ముత్సాహము ఇట్లు అనురక్తి, ఆసక్తి ప్రేమభావనలచే కలుగు అనుకూలమైన క్రియా ఫలితము క్షత్రియ గణములు ప్రాణములను లెక్కచేయక ప్రజాపాలన తత్పరులై శత్రుసైన్యముల నుండి ప్రజల ధనమాన ప్రాణములను రక్షించుచుందురు. అటులే దేవియు భక్తజన, సాధుగణ బాధలనుండి విముక్తి నిడు పరమేశ్వరి క్షణ స్మరణ మాత్రమున సన్నిధికి చేరి సర్వదుఃఖ ప్రశమన చేసి రక్షించుచుండును అట్లే రణోత్సాహియైన పరమేశ్వరి రణరంగమున మహిషాసురాదులను గూల్చి దేవతలను రక్షించినది

**1125. ఓం రక్తాఢ్యాయైనమః/రక్తవ్యగ్రాయై నమః**

ఆఢ్యయన యుక్త. సంపన్నుడు, ధనికుడు, వ్యగ్ర అన వ్యగ్రములేనిది. వ్యాకుల వ్యాసక్త పరమేశ్వరిని మించిన యనుకంపా స్వభావులైన దేవతల గానము, ఇతర దేవతా గణములు కొన్ని పరిమిత శక్తుల మేరకే వరముల నిత్తురు కాని పరమేశ్వరి ప్రేమమూర్తి, అనురాగ సంపన్న అగ్రము అన ఎదురులేని శక్తి. భక్తుల రక్షించుట, దారి తప్పిన వారిని దండించి సన్మార్గమున పెట్టుట వంటి క్రియలు చేయుట యందామె యాధిక్యత స్పష్టము

**1126 ఓం రక్తపానాపరాయణాయై నమః**

రక్తపానము చేయుటలో ఆసక్తి గలది. పరాయణ యన యాసక్తి కలిగి యుండుట ఉత్తమాశయము, రక్తసంవర్ధకమైన మదిర పానమున నిత్యోన్మత్తురాలగు పరమేశ్వరి శ్రీకామేశ్వర పర్యంకోత్సుకయై భక్తులందించు, అమృత వర్షమునందలి అమృతరూపము మదిర గ్రోలుచు నిత్యసచ్చిదానంద మనోహర మూర్తిగా వెలుగుచుండును చిత్తమందలి బిందువంతర్గతమైన అమృతాది కళల నిరంతర స్రావిత సుధల గ్రోలుచు తృప్తయైనా క్రమించు పరమేశ్వరి 'గర్జగర్జక్షణం మూఢ యావత్ మధుపిబామ్యహం' యుద్ధములందును మధురసముల పవమాన స్తోత్రములను దేవతలర్పించుట విశదమే దాని నింద్ర వరుణ యశ్విన్యాది దేవతలు అమృతత్వము లంది శత్రువుల నోడించి సంపద కలిగింతురు.

**శోణితానంద జననీ కల్లోల స్నిగ్ధరూపిణీ**
**సాధకాంతర్గతా దేవీ పావనీ పాపనాశనీ(176)**

**1127 ఓం శోణితానంద జనన్యై నమః**

శోణితానంద కారణభూతురాలైన జనని, శోణితమన రక్తము, కుంకుమయు నెరుపువర్ణము వీని సంగతి నానందించు జనని మాత, పై ముప్పది ఆరునామములలో రక్తపదము విశేషముగా గల నామములు గలవు, ముగింపుగా నీ నామము శోణితము అన రక్తము అనురక్తి వలన గలుగు ఆనందమునకు కారణభూతురాలైన పరమేశ్వరి అర్చన చేసి దేవతల కంటెను పూజ్యుడై సర్వలోక ప్రభువు అగును సర్వసౌభాగ్యదాయిని సుఖకర్త్రి అగుచు తన భక్తుల అష్టవిధ యైశ్వర్యముల

తుల తూగు చుండగా గలుగుసుఖానుభూతికి పరమేశ్వరియే కారణము 'సతీత్వం సర్వదాభక్త్యా చండికే దురితాపహే, రూపం దేహి జయందేహి, యశోదేహి, ద్విషోజహి దేహిమే సౌభాగ్య మారోగ్యం దేహిమే పరమం సుఖం' అని 'విద్యావంతం యశస్వంతం లక్ష్మీవంతం జనం కురు" దేహి భక్తజనోద్ధామ దత్తానందోదయేంబికే పత్నీం మనోరమాందేహి మనోవృత్తానుసారిణీం। తారిణీం దుర్గసంసార సాగరస్య కులోద్భవామ్' అని యర్గళం అట్టిసచ్చిదానంద సందోహ పరమామృత స్వరూపిణి, సకల భువన సుఖకర్త్రిగా సుందర సమదృష్టితో గాంచుచుండును

**1128 ఓం కల్లోల స్నిగ్ధరూపిణ్యై నమః**

కల్లోల స్నిగ్ధరూపిణియైన పరమేశ్వరి స్నిగ్ధయున పను పయసు చెలికాడు నిద్దము, నునుపు, స్నిగ్ధత కలది చిక్కనైనది స్నేహముకలది కల్లోల అన పెద్దయల, సంతోషము, శత్రువు అని అర్థము. అంబ నివాసస్థానము పద్మావనాంతస్థము, లక్ష్మీదేవి పుట్టుక కల్లోల సముద్రము అంబ స్వరూపము ఆనంద కల్లోల తరంగిణి చిరునగవు మోముపై చెలిగాడు స్నిగ్ధతరల మూర్తి సర్వశృంగార వేషాఢ్యం సర్వా భరణ భూషితాం కళ్యాణ గుణసంపన్నాం, సర్వమంగళికా దేవి,సర్వమంగళ విగ్రహా, జయా కాహళి కాం భేరీం శంఖ దుందుభి మర్దళాం (శబ్దఘోష) నిత్యానందమయీం నిత్యనిర్మలానంద దాయినీ, నిర్వాజ కరుణామూర్తి, నిత్యషోడశాన్వితా, మహాలక్ష్మి, మహాదేవి మహాత్రిపురసుందరీ, జగదాహ్లాద జననీం, జగత్సంహార కారిణీం, జగదుత్పవ నోద్యుక్తాం, జగద్రంజన కారిణీం, అట్టి మనోహర ఆనంద రూపిణి

**1129 ఓం సాధకాంతర్గతాదేవ్యై నమః**

సాధకాంతర్గతయైన దేవి పరమేశ్వరి రూపము సాధక జనముల అంతర్గతము అన హృదయుందుండు పరమేశ్వరీ రూపము భక్తచిత్త, భక్తనిధి, భక్తమానస హంసికా, భక్తహార్దతమో విధ్వంసినీ, భక్తగమ్య, భక్త ప్రియద, భక్తహిత, కల్పలతా -అను నామముల సాధకుల హృది యందుండును నాద స్వరూపిణి అగు వాగధీశ్వరీ దేవి సాధకుల మానసములందు సంతతము నిరంతర (ఎడతెగని) ధారా స్వరూపముగా ప్రవహించు స్వభావము గలది సాధకుల అంతరంగము అయిన హృదయము, మనోబ్జము అందు కొలువు ఉండునది పరమేశ్వరి

**1130 ఓం దేవ్యై నమః**

పై నామము విభజించి, సాధకాంతార్గతయై నమః దేవ్యై నమః రూపము 'పేర్కొనుగును దివ్య రూపిణి, దివి యన తేజోమండలము అందు చరించువారు దివ్యులు , దేవతలు, దేవి, ద్వీపతాధిప, దివ్యరూపమున మనోకమలముల పర్తిల్లు పరమేశ్వరి రూపమునై యున్నది

**1131 ఓం పావిన్యై నమః/పాయిన్యై నమః**

పావన రూపమైన పరమేశ్వరి పరమమైన దంతయు పావనాకృతి బ్రహ్మాండ మండలి సకల పావన సంపద ఆకృతి వహించి పరమేశ్వరి పావని అగును, దర్శన మాత్రమున సనేక జన్మసంభవ పాపకోటులను నాశనము చేసి పవిత్రీకరింప గల శక్తి గలది పావని పరమేశ్వరి జ్ఞానము క్షేత్రజ్ఞాని శుద్ధి చేయును అట్టి పవిత్ర స్వరూపనాము జ్ఞానములు గలది పాపకర్మ క్షయము చేసి, శుద్ధమనస్కుల జేసి మోక్షమార్గమును ప్రసాదించునది దేవి జ్ఞానమునకు సూక్ష్మత కలిగించి సర్వమేవమయము చేసి తన సాయుజ్యాది సన్నిధిని ప్రసాదించు దేవి పరమేశ్వరి 'సర్వభూతా యదాదేవి స్వర్గ ముక్తి ప్రదాయినీ। త్వం స్తుతా స్తుతయే కావా భవంతు పరమోక్తయ'

**1132 ఓం పాపనాశిన్యై నమః**

పాపము నశింప జేయునది 'అపరాధ పరంపరాపరం నహిమాతా సముపేక్షతే సుతం' అపరాధ పరంపరలను క్షమించు పరమేశ్వరి 'అపరాధ సహస్రాణి క్రియంతే ఆహర్నిశం మయా దాసోయమితి

మాం మత్వాక్షమస్వ పరమేశ్వరి' యని నివేదన యగును 'ప్రీతిర్మే క్రియతే సాస్మిన్ సకృత్సుచరితే శ్రుతే। శ్రుతం హరతి పాపాని తథారోగ్యం ప్రయచ్ఛతి' 'సకలదురిత ధ్వంసిని కాత్యాయన్యా' యని పరమేశ్వరి 'బ్రహ్మణీత్యాది' నామ మహాపాతకములను నివారించి మోక్షమును ప్రసాదింపగల 'ఏకైక శక్తి స్వరూపిణి'

**1133 ఓం సాధకానంద సుఖకర్త్ర్యై నమః**

సాధకులకు సుఖమును కలిగించు పరమేశ్వరి 'కరోతు సా నః శుభహేతు రీశ్వరీ' 'శుభాని భద్రాణ్యభిహంతు చాపద' 'సర్వమంగళమాంగల్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యంబకే దేవి' యనియు, 'ప్రణతానాం ప్రసీదత్వం దేవి విశ్వార్తి హారిణి। త్రైలోక్య వాసినామీడ్యే లోకానాం వరదాభవ' ఇట్లనేకములైన రీతులలో నాద బిందు స్వరూపిణియైన పరమేశ్వరిని గొలువ నిరంతర యమృత ధారల మనసు నాప్లావితము జేసి సాధకులకు సుఖమును గలిగించు చుండును 'దుర్గేదేవి నమస్తుభ్యం సర్వ కర్మార్థ సాధికే। మమ సిద్ధిమ సిద్ధిం వా స్వప్నే సర్వం దర్శయ' యని స్వప్న దర్శనము నకు ప్రార్థింతురు

**సాధనానాం హృదిసంస్థాత్రీ సాధకానందకారిణీ**
**సాధకానంద*జననీ సాధక ప్రియ కారిణీ(177) నాంచ**

**1134 ఓం సాధకారి వినాశిన్యై నమః**

సాధక జనశత్రువుల నాశనము జేయునది 'సర్వబాధా ప్రశమనం త్రైలోక్య స్యాఖిలేశ్వరి, ఏవమేవత్వయా కార్యమస్మద్వైరి వినాశనం' 'త్వామాశ్రితానాం నవిపన్నరాణాం, త్వామాశ్రితా హ్యాశ్రయ తాం ప్రయాంతి' 'దేవి ప్రసీద పరిపాలయనో౽రిభీతేర్నిత్యం యథా సురవధాదధునైవసద్యః। పాపాని సర్వజగతాం ప్రశమం ప్రయంతు' 'ఉత్పాతపాక జనితాంశ్చ మహోపసర్గాన్' 'ఇత్థం యదాయదా బాధా దానవోత్థా భవిష్యతి। తదా తదా౽వతీర్యాహం, కరిష్యామ్యరి సంక్షయం' యని దేవి దేవతలకు నభయమిచ్చినది

**1135 ఓం సాధకానాం హృదిస్థాత్ర్యై నమః**

సాధకుల హృదయందు స్థిరముగా వెలుగు పరమేశ్వరి 'సర్వస్య బుద్ధి రూపేణ జనస్యహృది సంస్థితే। స్వర్గాపవర్గదే దేవి, సర్వభూతాయదా దేవిస్వర్గముక్తి ప్రదాయినీ' యని పరమేశ్వరి. సాధకుల యొక్క హృత్కమలముల నివాసమేర్పరచుకొని వారికి సకల ఐశ్వర్య, సుఖ సంతోషముల గలిగించుచుండును 'శ్రద్ధ సతాం కులజన ప్రభవస్య లజ్జా, తాంత్వాం నతాః స్మపరిపాలయదేవి విశ్వం' అని కులవృద్ధి హేతువగు పరమేశ్వరి సాధకుని యింట అనేక రూపముల వెలుగొందుచు సుఖ సంతోషముల నిడుచుండును కావున మనసు నందు దేవిని స్థిరముగా నుంచుకొనవలెను

**1136 ఓం సాధకానందకారిణ్యై నమః**

సాధక జనులకు ఆనందము కలుగజేయు పరమేశ్వరియై యున్నది సాధకుడు బహిరంగ పూజా పుపచారాదుల భగవతికి యనుదినము సేవచేయు మనము గలవాడు ప్రపంచ సృష్టియంతయు భగవతి యంశమే యని సర్వభూత హితమును గోరుచూ మెలగువాడు అన్ని జీవుల యందు దైవమూర్తి ప్రత్యక్షమై యున్నట్లు భావింప గలిగిన వాడు, భావించి వర్తించు వాడును అద్వైత సాధన చే నిహమున వైరాగ్యము పొంది శబ్ద సృష్టి లయ నాద బిందు స్వరూప పరబ్రహ్మ స్వరూపిణిని, యమృత ప్రాప్తిని యనుభవింపగలవాడు నగుచు యధర్వశీర్షమున 'ఏవం ఏకాక్షరం బ్రహ్మయతయః శుద్ధ చేతసః। ధ్యాయంతి పరమానందయా జ్ఞానంబురాశయః। వాఙ్మయా బ్రహ్మసూస్తస్మాత్ షష్ఠం వక్త్రసమన్వితమ్, సూర్యో౽వామ శ్రోత బిందు సంయుక్త ష్టాత్తృతీయకః। నారాయణేన సంమిశ్రో వాయుశ్చాధారయుక్ తతః విచ్చేన వార్ణకో౽ర్ణః స్యాన్మ పరమాదానంద దాయకః' అని 'ఐం హ్రీం

క్లీం చాముండాయై విచ్చే' యని నవార్ణవ మంత్రము సాధింప నానందమున మునుగుచుందురు 'అహమానందానానందే' 'అహం విజ్ఞానా విజ్ఞానే అహం బ్రహ్మాబ్రహ్మణీ వేదితవ్యే' యని పరమేశ్వరి ఆనంద సాగరమున ముంచినను, దుఃఖ సాగరమున తేల్చిన నామెయే

1137 ఓం సాధకానాం (చ) జనన్యై నమః

సాధకానంద జననియైన దేవి సాధకులకు ధ్యేయమైన రూపమువైన మాతృమూర్తి మంత్రాణాం మాతృకాదేవి, శబ్దానాం జ్ఞానరూపిణీ జ్ఞానానాం చిన్మయా తీతా శూన్యానాం చ శూన్యసాక్షిణీ యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా। తాం దుర్గాం దుర్గమాదేవీం దురాచార విఘాతినీమ్। నమామి భవభీతోఽహం సంసారార్ణవ తారిణీమ్' అని విశ్వరూపిణిని మనమున నిలిపి సాధకునకు కొరత యేమియు గనక సమునోచిత్తుడై మోక్షమందగలడు

1138 ఓం సాధక ప్రియకారిణ్యై నమః

సాధకులకు ప్రియమును చేకూర్చునది 'త్వయైత ద్ధార్యతే విశ్వం, సైవ విశ్వం ప్రసూయతే సా యా ప్రీతావ విజ్ఞానం శుద్ధబుద్ధిం ప్రయచ్ఛతి' 'భవకాలే నృణాం సైవ లక్ష్మీః వృద్ధిప్రదాగృహే సైవాభావే తథా లక్ష్మీర్వినాశాయ జాయతే। స్తుతా సంపూజితా పుష్పైః ధూపగంధాది భస్తదా। దదాతి విత్తం పుత్రాంశ్చ మతిం ధర్మే గతిం శుభామ్' 'కరోతుసాను శుభహేతురీశ్వరీ శుభాని భద్రాణ్యభి హంతు చాపదః' 'సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే' ఇట్లనేక సంస్తుతుల జేయు 'శ్రీమన్మంద కటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేంద్ర గంగాధరాం। త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియాం' అని మహాలక్ష్మి స్వరూపిణిగా గొలుతురు

సాధక ప్రచురానంద సంపత్తి సుఖదాయినీ

సాధక* సాధక ప్రాణా సాధకాసక్త మానసా(178) కాంద

1139 ఓం సాధక ప్రచురానంద సంపత్త్యై నమః

సాధకుల ప్రచురానంద సంపద స్వరూపిణియైనది. నక్రోధో నచ మాత్సర్యం నలోభో నాశుభామతిః భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్ సదా' 'ఆనందః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతా ఋషయస్తే త్రయః పుత్రాః స్వయం శ్రీదేవి దేవతా' ఆనంద, కర్దమ, చిక్లీతులు యను ముగ్గురు ఆనంద ఆశ్రయము, యనుభవములకు ప్రతీకలుగా పరమేశ్వరి భావన కలిగిన యమితానంద సంపత్తి ప్రతీకలుగా నిలుతురు

1140 ఓం సుఖదాయిన్యై నమః

సుఖమిడు పరమేశ్వరి రూపిణి పై పదమునందలి భావన కనుబంధమే 'వైనతేయ సోమం పిబ, సోమం పిబతు వృత్రహా, సోమం ధనస్య సోమినో, మహ్యం దదాతు సోమినీ' అట్టి యానందామృత పానము తత్ పాన మత్తతచే గలుగు ప్రచురధనము, యాపై యనుభవయోగ్యమైన పరబ్రహ్మ స్వరూపిణి భావమందైక్యము నందుటకన్న మరి వేరేమి గావలెను 'ఏవం పమ్మోహితం దేవి సమస్తమేతత్ త్వం వై ప్రసన్నా భువి ముక్తి హేతుః' యని భవ సుఖకారి యాచు విశ్వనిరతిశయ నిర్మల జ్ఞాన మోక్షానంద ప్రదాత్రిగా పరమేశ్వరి సుఖముల చేకూర్చును

1041 ఓం సాధకాయై నమః/ఓం శారదాయై నమః

శారదా యను పదమునకు ఏడాకుల యరటి, దుర్గ, సరస్వతీ దేవి, సంవత్సరము శరత్కాల పూర్ణిమ యను యర్థములు గలవు ఏడాకుల అరటి సప్త పర్వముల తర్వాత గెలవేసి (ఫలదీకరణ చెంది) ఆపై లయమగును సప్తమమౌ బిందు రూపము షట్చక్రభేదనా నంతర సంభవం. అదియే సాధకుని యంతిమ స్థానం అచట ప్రశాంత శరత్కాల పూర్ణచంద్ర సంభవమైన జ్యోత్స్న ప్రసరించుచుండును అదియే శారదాస్థానము దుర్గానుభూతి పరమేశ్వరి లీన భావము ఆత్మస్థితి సాధించ గలిగినవాడే

సాధకుడు ఆత్మశక్తి కలుగజేసి తన కృపా దృష్టిచే సాధకుని హృదియందు స్థిరమై సచ్చిదానంద ప్రసాదించు పరమేశ్వరి

1142 ఓం సాధక ప్రాణాయై నమః

సాధకుని ప్రాణస్వరూపమై యున్నది. 'దేహం వాచమజన యంత్రం దేవాస్త్రాం విశ్వరూపా హేతవోదు 'సానోమంద్రేషు మూర్జం దుఘానాథేనుర్వాగ స్మానుపసుష్టుతైతు' వాగ్రూపిణియైన దేవి యొక్క రూపమే పరమేశ్వరి ప్రతి జీవియందు హంస స్వరూపిణిగా చైతన్యకారిణిగా ముఖ్య స్వరూపిణిగా వెలుగుచుండును 'ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్' క్షేత్రజ్ఞ రూపమున ప్రాణ క్రియ నిర్వర్తించు చుండును ద్వాదశాంతమున పరాకాశమున సూర్యచంద్రాగ్నుల సమ్మేళన స్థానమ లీనమై మెరుపుతీగ వలె సుషుమ్న ద్వారా సహస్ర విద్యుత్కాంతి, కోటిచంద్ర, సుశీతల తామరతూడు వంటి వ్యాప్తనాడీమార్గముల మూలాధారము వరకు వ్యాప్తి చెందునది ఉపప్రాణము పదిగా వెలుగుచు ప్రాణ, అపానవ్యాన ఉదానసమానములు అనుబంధ దేవదత్త కూర్మ కృ ధనుంజయ నాగములను పేర ముఖ్యప్రాణముల కనుబంధములుగా వర్తిల్లుచుండును. హ రూపమున దినమునకు 21,600 మార్లు పైనుండి క్రిందికి పయనించుచు,సాధకుని పై పరుచుచుండును ఆ ప్రాణశక్తియే పరమేశ్వరి హృదిస్థయై వెలుగును

సాధకోత్తమ సర్వస్వా సాధకా భక్తరక్షకా
సాధకానంద సంతోషా సాధకారి వినాశినీ(170)

1143 ఓం సాధకాస్తవరాన పాయై నమః

సాధకులకు నాసక్తమునను గలిగించునది 'జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హిసా, బలా స్మమోహాయ మహామాయా ప్రయచ్ఛతి' 'సైషా ప్రసన్నా వరదానృణాం భవతి ముక్తయేసా పరమాముక్తేర్హేతుభూతా సనాతనీ సంసారబంధ హేతుశ్చ సైవ సర్వేశ్వరేశ్వరీ' అటులే 'చిత్తే కృపాప నిష్ఠుర తాచ దృష్ట్వా త్వయేవ దేవి వరదే భువన త్రయేపి' యని సాధకుల మనముల నాకర్షించు కృపయును, నిష్ఠురతను గూడా చూపించు పరమేశ్వరి స్వరూపిణి. అందులకు భక్తుల ప్రార్థించ 'చిత్తం భవదధీనం' యని చేతనాక్రియా భావముల పరమేశ్వరికి యంకితమిడుచుందురు

1144 ఓం సాధకోత్తమ సర్వస్వాయై నమః

సాధకోత్తముల సర్వస్వరూపమామెయే అయియున్నది దేవి కుచపతనము చేసి 'త్రైత్రార్థ లా విజయః సర్వకామికు యం యం చింత యతే కామతం తం ప్రాప్నోతి నిశ్చితమ్ పరమైశ్వర్య మతు ప్రాప్యతే భూతలే పుమాన్' 'మానోన్నతి ర్భవేత్, రాజ్ఞి స్త్రీణో వృద్ధికరం పరం యశసావర్ధతే నిత్య కీర్తిమండిత భూతలే' యని సర్వోన్నతి దేవి ప్రసాదమున లభించగలదని విశేషము 'సైవ కలాభవ త్రైలోక్య స్య వ రాజితః' 'నశ్యంతి వ్యాధయస్సర్వే, అభిచారాణి సర్వాణి, మంత్రయంత్రాణి' శమ యాంతి దుష్ట ప్రభావము తొలగించి యున్నతి కలిగించు పరమేశ్వరి

1145 ఓం సాధకాయై నమః/సాధికాయై నమః

సాధక సర్వస్వమై యున్నది 'ఏతత్త్వాపి శస్త్రేషు సంగ్రామే' భృశదారుణే। సర్వాబాధాసు ఘో సు వేదనాభ్యర్థితోఽపి మమప్రభావాత్ సింహాద్యా, దస్యవో, వైరిణస్తథా దూరదేవ పలాయంతే స్మ స్మరితం మమ' బ్రాహ్మణాచక్రిత తృప్తు ప్రయచ్ఛంతి శుభామ్ మతిమ్' అని శుభమతిని కలి ఆపదలు తొలగించునని, పరమేశ్వరి సాధక సంజీవని, సాధక ప్రాణరూపిణి, సాధక ప్రియ యని దశవిధ మహానామముల, దశమహావిద్యా ప్రధాన యుతమై జనులను కాచుచుండును.

1146 ఓం భక్తవత్సలాయై నమః/భక్తరక్షాయై నమః

భక్తవత్సలమూర్తి పై సాధకాపదము. పూర్వపదముగా ననుసంధించ వచ్చును (సా

భక్తవత్సలాయను రూపముగను భక్తులయెడ వాత్సల్యభావము గలది సాధక జనముల యెడ ప్రేమానురాగములు గలిగినది రక్తపాయనియొక పాఠము గలదు, రక్తపాయన అలగ ఢాకినీ దేవతయని యర్థము ఇక్కడ భక్తులను పరిరక్షించు డాకినీ దేవతగా భావించనగును లేక రక్తపదము నకు యనురక్తి, భక్తుల యనురక్తియను యాసవమున సదాగ్రోలు పరమేశ్వరి రూపిణియై యున్నది. భక్తవత్సల స్వరూపిణిగా సర్వసేయోకర్త అలగను దేహములోని చెడు రక్తము పీల్చి స్వచ్ఛత చేకూర్చుట కుపయోగింతురు

1147 ఓం సాధకానంద సంతోషాయై నమః

సాధకానందమున సంతసము చెందు మాతృస్వరూపిణియైన దేవి సాధక జనము నిత్యపూజనలో సకలైశ్వర్య సంతోషానందములను నందుచుండు, దేవియు సంతసించుచుండును పిల్లల ఆనందమే తల్లికి సంతోషదాయకము కాన సాధకులు భక్తులు దేవి యుపచారముల పరవశింప నదేదేవికి ఆనందము సాధనలో పరబ్రహ్మైక్య సాధనచేసి బిందుమండల మధ్యగత దేవిని దర్శించువారలకు యమృతానంద నిత్యానుభవమైన బ్రహ్మైక్య రూపయను భూమిని కలిగించునది ఆ పరమేశ్వరి ఆనందమే రూపముగా గలది

1148 ఓం సాధకాధి వినాశిన్యై నమః/ఓం సాధకారి వినాశిన్యై నమః

సాధక జనశత్రుగణముల వినాశముచేయు పరమేశ్వరి సాధకుల మనములందు పరమేశ్వరి నెలకొన్నచో 'రోగానశేషాన్ అపహంసి దుష్టాన్, రుష్టాతు కామాన్ సకలానభీష్టాన్। త్వామాశ్రితానాం నవిపన్నరాణాం త్వామాశ్రితాహ్యాశ్రయతాం ప్రయాంతి। దేవి ప్రసీద పరిపాలయనోఽరి భీతేర్నిత్యం యథాసురవధాదధునైవ సద్యః। పాపాని సర్వజగతాం ప్రశమం నయాశు ఉత్పాతపాక జనితాంశ్చ మహోపసర్గాన్' యని వైరి గణముల నిరోధించి రోగముల దూరము చేయు పరమేశ్వరీ రూపమై యున్నది

ఆత్మవిద్యా బ్రహ్మవిద్యా పరబ్రహ్మ కుటుంబినీ
త్రికూటస్థా పంచకూటా సర్వకూటా శరీరిణీ (180)

1148 ఓం ఆత్మవిద్యాయై నమః

ఆత్మవిద్యా స్వరూపిణియైన దేవి ఆత్మవిద్య, అద్వైత విద్య, అందు 'ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం, సర్వం యదయమాత్మా ఆత్మైవేదం సర్వం, విజ్ఞానమానందం బ్రహ్మ' మున్నగు వాక్యముల సారాంశమే యాత్మ విద్య, జీవబ్రహ్మైక్యత యభిన్నత నెరింగిన మహనీయులే యాత్మ విజ్ఞానము, నెరిగిన వారు ఉపాసనా విధములలో ఉత్తరతాపిని యుపనిషత్తులు బ్రహ్మోపనిషత్యాది జ్ఞానమున నాత్మ విద్యా స్వరూపము గ్రహించవగును. అట్టి ఆత్మవిద్యా స్వరూపమే పంచదశీ,షోడశీ, దశమహావిద్యాది రూపిణియైన పరమేశ్వరీ తత్త్వమును బోధించు చుండును 'ఆత్మవిద్యా తపోమూలం తత్ బ్రహ్మోపనిషత్పదం। ఆత్మనాస్వయం ప్రకాశ చిదానంద రూపస్య విద్యా శ్రవణ మననాదుల ఆత్మజ్ఞానసాధకం, ప్రవృత్తి నివృత్త్యా వృత్త్యాత్మక విద్యారూపః'

1149 ఓం బ్రహ్మవిద్యాయై నమః

బ్రహ్మవిద్యా స్వరూపిణియైన దేవి. నాదబిందు కళాతీత పరబ్రహ్మైక్య స్థానము. శివవామాలింగిత పద్మవనాంతస్థము. యత్ర న సూర్యస్తపతి, యత్ర నా వాయుర్వాతి యత్ర న చంద్రమాభాతి, యత్ర

న నక్షత్రాణి భాంతి, యత్ర నాగ్నిర్దహతి,   యత్ర న మృత్యుః ప్రవిశతి, యత్ర న దుఃఖాని ప్రవిశంతి- సదానందం పరమానందం శాంతం శాశ్వతం సదాశివం, బ్రహ్మాదివందిత యోగిధ్యేయం పరంపరం యత్రగత్వా నవివర్తంతే యోగినః- బృహత్ జాబాలి. బ్రహ్మవిద్యా, జ్ఞాని. అట్టి పరబ్రహ్మ స్థానమున లయమందనేర్చును. అది బ్రహ్మవిద్యా రూపిణియైన పరమేశ్వరి కృపాకటాక్ష వీక్షణచే గాని లభ్యము గాదు. ఆత్మవిద్యా, బ్రహ్మవిద్యా బోధ ప్రసాదితయైన పరమేశ్వరి- విద్యాను శాస్త్రము వెతకదేని ప్వ్యద్యేయు కాశ్యదన్యా- అని అందురు. ఆ ఆత్మవిద్యా తపోమూలం తత్ బ్రహ్మోపనిషద్ పదం ఆత్మ నః స్వయం ప్రకాశ చిదానంద రూపస్య విద్యా. శ్రవణ మననాదుల ఆత్మజ్ఞాన సాధనం ప్రవృత్తి నివృత్త్యాత్మక విద్యా తపః

1151 ఓం పరబ్రహ్మ స్వరూపిణ్యై నమః/ఓం పరబ్రహ్మకుటుంబిన్యై నమః

పరబ్రహ్మ స్వరూపిణి/కుటుంబిని యైన పరమేశ్వరి. ఆమె నెలవు మణిద్వీప మధ్యమున కారణానంద విగ్రహయై కామేశ్వర కామేశ్వరి యుగళ మూర్తిగా సచ్చిదానంద భావమున కాలస్వరూపిణియై వెలుగును అచటి అనేక తాపహీన సూర్యులు, శీతాన్నియుత చంద్రులు, భువనములు, జలి వాసములు గలిగి పరమేశ్వరీ ధ్యానమగ్నులైన భక్తకుటుంబములు పరివేష్ఠించి యుండును అట్టి సనాతన పరబ్రహ్మణి విరాట్ స్వరూపిణి, త్రైలోక్య వ్యాపినిగా పంచభూతాత్మగా వెలుగుచుండును

1152 ఓం త్రికూటస్థాయై నమః

త్రికూటస్థయైన పరమేశ్వరి త్రికూటములు యనబడు త్రయి సంఖ్యాపాదిత, సత్వరజస్తమోగుణములు, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి యుతములు సూర్యచంద్రాగ్నిత్రయము, గంగా యమునా సరస్వతీ ప్రతీకలైన సుషుమ్నా ఇడాపింగళాది త్రయము వీటన్నింటికి కేంద్రస్థానమైన భ్రుకుటి యంతర్గత బిందు రూపమున పరమేశ్వరి వెలుగుచుండును. లంకలో త్రికూట పర్వతమొకటి గలదందురు. కాని త్రికూట యననై మూడు తత్వముల కూటమియైన తేజో బిందు స్థానము ఆ బిందు స్థానమున పరిఢవిల్లు దేవి త్రికూటస్థా యని పిలువబడుచు భక్తులను కాచుచుండును

1153 ఓం పంచకూటాయై నమః

పంచకూట నివాసినియైన దేవి పంచ భూతాత్మిక, పంచభూత వ్యాప్తయైన పంచతత్వముల కూటమి రూపము పృథివి, అప, తేజ, వాయురాకాశ వాని జ్ఞానాత్మక తత్వములైన గంధ,రస, రూప, స్పర్శ, శబ్దాది తత్వములు అటులే దేహమున వానిని గ్రహించు నాసికా (అఘ్రాణ), జిహ్వా, చక్షు, చర్మ,శ్రవణేంద్రియములు వాని అంగములైన దేహమునందు పంచకూటములుగా ప్రసిద్ధి పెందిన పంచకోశములు అట్టి పంచకూటాత్మకమైన దేహము సాధన చేసి సర్వము తేజోమయ బిందురూపస్ఫుర పరమేశ్వరీ యంత్రంగానే ఎంచవలెను

1154 ఓం సర్వకూట శరీరిణ్యై నమః

సర్వకూట శరీరిణి యైన దేవి త్రికూట పంచకూట మయమైన ఈ దేహమునందే న్యాసవిధానమును అనుసరించి, వర్ణములు, రాశి, నక్షత్రములు, గ్రహసముదాయము అన్నియు దేహస్థితి యందే న్యాసము చేతురు. ఆపై మంత్రాక్షరముచే దేహమునందు న్యాసము చేయుదురు షట్చక్ర సాధనచేసి ప్రాణవాయువు నిలిపి యోగ మార్గమున పరమేశ్వరి సాన్నిధ్యము చేరి, ఈ శరీరము దేవి మయముగా ఎంచి శోధన చేసి సర్వకూట సాన్నిహిత్యమున, పరబ్రహ్మైక్యము నందుచు, బ్రహ్మ సాక్షాత్కారము నందగలుగుదురు. అట్టి కటాక్ష దృష్ట్యా పరమేశ్వరి సాధకుల సర్వాభీష్టములు నెరవేర్చు చుండును 'సాక్షీ సర్వజగత్ హేతు, నియంతేతిచ భణ్యతే క్రియా కారక రూపాధీర క్రియాకార కాత్మనా। వ్యాప్తైవ జయతే కుంభ, ఆకాశేన యథాతథా కూటస్థత్వేన, సాక్షిత్వాన్నిత్యా జన్మాదివర్జనాత్।' కూటస్థ దృష్ట స్తన్మేహ దృష్ట్యానస్య తత్త్రయం

సర్వవర్ణ మయీ వర్ణజపమాలా విధాయినీ

1155. ఓం సర్వవర్ణమయ్యై నమః

సర్వవర్ణమయమైన పరమేశ్వరి పంచాశదక్షర స్వరూపిణిగా పరమేశ్వరికి పంచాశత్ వర్ణాధి దేవతలంత తమ తమ శక్తుల కేంద్రీకరించి యుందురు ఆ యేబది వర్ణముల మిళిత సాముదాయకముచే మంత్రము యేర్పడుచున్నది ఆయా మంత్రాధిదేవత, ఋషి, న్యాసాదికములు పంచాశత్ వర్ణమయము గానే యుండును దేహమందు ప్రతిదేవతకు వర్ణన్యాసమును వేరుగా సుపాస్యదేవతల క్రమమును బట్టి వర్ణదేవతా విన్యాసము చేయుచుందురు. వర్ణవిన్యాసము దేవతాపూజ యందు ముఖ్యము. అటులే సర్వవర్ణమయమైన దేహమునందు షట్చక్రమందు గూడ వర్ణన్యాస విధానము గలదు వర్ణములపై బీజం కీలకం మంత్రము మాలామంత్రము (దండకమునకు ఛందస్సు గలదు ఆధారముగా మంత్రపురశ్చరణ జరుగుచుండును నియమిత లక్ష వేయి జప సంఖ్యలో పదవవంతు తర్పణ, దాన పదవవంతు హోమము దాన పదవవంతు బ్రాహ్మణాన్నదానము అపుడే మంత్రసిద్ధి గలుగును కావున పరమేశ్వరి సర్వవర్ణమయీ యనబడును

1156 ఓం వర్ణజపమాలా విధాయిన్యై నమః

వర్ణమాల, జపసంఖ్య, మాలాధారణ విధానము నిర్దేశింప బడును అంటె పరమేశ్వరి మంత్ర నిర్మాణము విధానమునందు మంత్రాక్షరముల సంఖ్య నిర్దేశింపబడును. అటులే జపమునకు సంఖ్య విధింపబడి యుండును అట్లు తర్పణ,హోమ, యన్న దానాదుల సంఖ్య నియతిగల ఉపాస్య దేవత విధానము సాధనయందు పంచభూతాత్మక విధిగా, సంస్థలో, ప్రాణప్రతిష్ఠ తర్వాత మూలమంత్రము నియతి సంఖ్యలో జపము నాపై కవచము, హృదయము, సహస్రనామ స్తోత్ర పారాయణము యను పంచాంగములు వెలుగును అర్చన లోనియిదంగములు ఉపాస్య దేవతలకు వేరువేరుగానుండును అవి గురుముఖతః గ్రహించి దేవతాప్రసన్నత మంత్రసిద్ధినంది సుఖసంతోషములతో జనులు యిహమందు నిశ్చింత గలవారై, పరమైనమోక్ష సామ్రాజ్యమును, అంబయొక్క సాలోక్య, సామీప్య, సారూప్య సాయుజ్యములను నాలుగు మెట్లు తేలికగా దాటుచు అంబయొక్క కృపా పాత్రుల గుదురు శ్రీకాళికా సహస్రనామ స్తోత్రము సంపూర్ణముగా చదివిన వారలకు విద్యాజ్ఞానప్రాప్తి కలిగి అంతమున మోక్షము అంబ అష్టవిధ మూర్తులైన కాళి ప్రసాదింపగలదని నిశ్చయము

ఇతి శ్రీకాళికానామ్నాం సహస్రం శివభాషితం

- మంగళం మహత్ -

ఆదిశంకర కృత శ్రీకాళికా సహస్రనామస్తోత్ర నామవ్యాఖ్య సహిత గ్రంథము

నల్లకుంట శృంగేరి పీఠస్థ శారదాంబ పాదపద్మములకు, మోతీనగర్ శృంగేరి పీఠస్థ శారదాంబ పాదపద్మములకు సమర్పితము (స్వర్గగతస్థయైన [illegible] యాత్మశాంతిని పరమేశ్వరి కలిగించు గాక)

ఆది శంకరుల అద్వైతతత్త్వము, రౌరవాది కృత్య ఖండన, పరబ్రహ్మ జ్ఞానము కలిగించు ఉపనిషత్ పాదముల గలిగియు, రుచియై ఈ గ్రంథమందలి సారము క్రమపఠనము చేసిన వారలు, బోధించిన వారలు నిత్య క్రియలలో ఉపయోగించుకొను వారలందరికీ పుణ్యఫలము నిశ్చయముగా గలుగును. గ్రంథ ముద్రణలో తోడ్పడిన, కర్తా, ప్రేరక, అనుమోదకులకందరకూ కృతజ్ఞతలు. మాన్యులు రామారి రంగదాసుగారు, న్యూ నల్లకుంట వేయి రూపాయలు, రావినూతల పూర్ణ చంద్రరావుగారు అయిదువందల రూపాయలు మరియే పేర్కొనని అభిమాన గ్రాహకులకు కృతజ్ఞతలు. వివిధ ప్రతిశోధ ముద్రణా కలాపములలో తోడ్పడిన వారికి, ఇతర మిత్రులకు అంబ కరుణాపూరిత కటాక్షములు గల్గి వారి తప్పితములు నెరవేర్పుగాక సర్వేజనాః సుఖినో భవంతు

## శ్రీకాళీ క్షమాపరాధన స్తోత్రమ్

ప్రాగ్దేహస్థో యదాహంతవచరణ యుగాన్నాశ్రితో నార్చితోఽహం
తేనాద్యా కీర్తి వర్గై ర్జఠర జదహనై ర్బాధ్యమానో బలిష్ఠైః
క్షిప్త్వా జన్మాన్తరాన్నః పునరిహ భవితా క్వాశ్రయః క్వాపిసేవా
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే (1)

బాల్యే బాలాభిలాషై ర్జడిత జడమతిర్బాలలీలా ప్రసక్తో
నత్వాం జానామి మాతః కలి కలుష హరాం భోగ మోక్షప్రదాత్రీమ్
నాచారోనైవ పూజా నచయజనైక ధానస్మృతిర్నైవసేవ
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే (2)

ప్రాప్తోహం యౌవనంచే ద్విషధర సదృశైరింద్రియైర్దష్టగాత్రో
నష్టః ప్రజ్ఞః పరస్త్రీ పరధన హరణే సర్వదాసాభిలాషః
త్వత్పాదాం భోజ యుగ్మం క్షణమపి మనసా నస్మృతోఽహం కదాపి
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే (3)

ప్రౌఢోభిక్షాభిలాషీ సుతదుహితృకళత్రార్థ మన్నాదిచేష్టైః
క్షుణ్ణప్రాప్త్యై కుత్రయామీ త్యనుదినమనిశం చింతయా మగ్న దేహః
నోతే ధ్యానాంత చాస్థా నచ భజన విధిన్నామ సంకీర్తనం వా
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే (4)

వృద్ధత్వే బుద్ధి హీనః కృశవివశ తను శ్వాసకాసాతిసారైః
కర్ణః హీనోఽక్షి హీనః ప్రగలిత దశనః క్షుత్పిపాసాభిభూతః
పశ్చాత్తాపేన దగ్ధో మరణ మనుదిన ధ్యేయమాత్రాన్న చాన్యత్
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే(5)

కృత్వాస్నానం దినాదౌ క్వచిదపి సలిలంనో కృతంనైవ పుష్పం
తే నైవేద్యాదికం క్వచిదపి నకృతం నాపి భావేన భక్తిః
న న్యాసో నైవపూజాం నచ గుణకథనం నాపి చార్చకృతాతే
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే(6)

జానామిత్వాం నచాహం భవభయ హరణీం సర్వం సిద్ధి ప్రదాత్రీ
న్నిత్యానందో దయాఢ్యాంత్రితయ గుణమయీ న్నిత్యబుద్ధోదయాఢ్యామ్
మిధ్యా కర్మాభిలాషై రనుదినమభితః పీడితో దుఃఖ సంఘైః
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే(7)

కాలాభ్రాం శ్యామలాంగీం లలిత చికురా ఖండ ముండాభిరామా
త్రాసత్రాణేష్టదాత్రీం కుణపగణ శిరోమాలినీం దీర్ఘనేత్రామ్
సంసారస్యైక సారాంభ వజన దహరాంభావితో భావనాభిః
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే(8)

బ్రహ్మావిష్ణుస్తథేశ పరిణమితి సదాత్వత్పదాం భోజ యుక్తం
భాగ్యాభావాన్నచాహంభవ జనని భవత్పాదయుగ్మం భజామి
నిత్యంలోభప్రలోభైః కృతవిశమతిః కాముకస్త్వాం ప్రయాచే
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాళే(9)

రాగద్వేష్టైః ప్రమత్తః కలుషయుతః తనుః కామనాభోగలుబ్ధః
కార్యాకార్యా విచారీ కులమతి రహితః కౌలసంఘై ర్విహీనః
క్వధ్యానంత క్వచార్చా క్వమనుజపః నన్నైవ కించిత్ కృతోహం
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాలే(10)
రోగీ దుఃఖీ దరిద్రః పరవశ కృపణః పాంశులః పాపచేతా
నిద్రాలస్య ప్రసక్తాస్సు జఠర భరణే వ్యాకులః కల్పితాత్మా
కిన్నపూజా విధానం త్వయి క్వచనుమతిః క్వాఘురా క్వచాస్థా
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాలే(11)
మిథ్యా వ్యామోహ రాగై పరివృత మనసః క్లేశ సంఘాన్వితస్య
క్షున్నిద్రోఘాన్వితస్యస్మరణ విరహితః పాపకర్మ ప్రవృత్తే
దారిద్ర్యస్యక్వధర్మ క్వచ జనని రుచిః క్వస్థితి స్సాధుసంఘైః
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాలే(12)
మాతాస్తాతస్యదేహ జనని జఠరగః సంస్థితస్త్వద్వశోహం
త్వం హర్తాకారయిత్రీ కరగుణమయీ కర్మహేతు స్వరూపా
త్వంబుద్ధిశ్చిత్త సంస్థాప్య హమతి భవతీ పర్వమేతత్ క్షమస్వ
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాలే(13)
త్వం భూమి స్త్వం జలం చ త్వమసి హుతవహస్త్వం జగద్వాయురూపా
త్వంచాకాశమ్మనశ్చ ప్రకృతిరసిమహత్ పూర్వికాపూర్వపూర్వా
ఆత్మాత్వం చాసి మాతః పరమసి భవతీత్వత్పరన్నైవకించిత్
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాలే(14)
త్వం కాళీ త్వంచ తారా త్వమసి గిరిసుతా సుందరీ భైరవీత్వం
త్వం దుర్గా ఛిన్నమస్తాత్వమసి చ భువనా త్వం హి లక్ష్మీః శివా త్వం
ధూమా మాతంగినీః త్వమసి చ బగలా మంగలాది స్త నామ్నా
క్షంతవ్యోమేఽపరాధ ప్రకటిత వదనే కామరూపే కరాలే(15)
స్తోత్రేణానేనా దేవీం పరిణమతి జనోయః సదా భక్తియుక్తో
దుష్కృత్యాద్దుర్గ సంఘం పరితరతి శతం విఘ్నతాం నాశమేతిః
నాధి వ్యాధిః కదాచిద్భవతి యది పునః స్సర్వదా సాపరాధః
సర్వంత త్కామరూపే త్రిభువన జననీం క్షామయే పుత్ర బుద్ధ్యా
జ్ఞాతా వక్తాకవీశో భవతి ధనపతిర్దానశీలో దయాత్మా
నింపాపీనీః కలంకీ కులపతి కుశలస్సత్యవాగ్ ధార్మికశ్చ
నిత్యానందో దయాఢ్యః పశుగణ విముఖస్సత్ప్రధాచారుశీలః
సంసారాబ్ధిం సుఖేన ప్రతరతి గిరిజా పాదయుగ్మావలంబాత్

శ్రీకాళీ క్షమాపరాధ స్తోత్రం సమాప్తం

దేవీ భాగవతములో-మనోరమ కుమారివికి పఠించిన కవచము.

అగ్రతస్తే అంబికాపాతు పార్వతీ పాతు పృష్ఠతః
వారాహీ విషమమార్గే, దుర్గా దుర్గేషు క్షత్రిత
కాళికా కలహేఘోరే పాతుత్వాం పరమేశ్వరీ
మండలే తత్ర మాతంగీ తథాసౌమ్యా స్వయంవరే
భవానీ భూపమధ్యేతు పాతుత్వాం భవమోచనీ
గిరిజాగిరి దుర్గేషు చాముండా చత్వరేషు చ
కామగా కాననేష్వేవం రక్షతుత్వాం సనాతనీ
వివాహే వైష్ణవీ శక్తి రవతాత్త్వాం రఘూద్వహా
భైరవీ చరణే సౌమ్య శత్రూణాం వై సమాగమే
సర్వదా సర్వదేశేషు పాతుత్వాం భువనేశ్వరీ
మహామాయా జగద్ధాత్రీ సచ్చిదానంద రూపిణీ
ఇందు దేవియొక్క వివిధ విభూతులలో కాళికాదేవి యొకటి

దేవీ హుంకారమున ముప్పదిరెండు శక్తులు ఉద్భవించినవి.
కాళీతారిణీ బాలాత్రిపురా భైరవీ రమా
బగళాచైవ మాతంగీ తథా త్రిపురసుందరీ
కామాక్షీ తులజాదేవీ జంభినీ మోహినీ తథా
ఛిన్నమస్తా గుహ్యకాళీ దశసాహస్రా బాహుకా



స్వర్గగతస్థయైన హైమవతికి ఆత్మశాంతిని పరమేశ్వరుం కలిగించుగాక